

శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు

వ్యాఖ్యాత

శ్రీ

భవభూతి

# ఉత్తరరామచరిత నాటకమ్

రసాస్వాదినీవ్యాఖ్య (తెలుఁగు)




వ్యాఖ్యాత

శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు.

యం. ఏ. (డబుల్,) యల్. టి.

అభిజ్ఞానశాకుంతల రసాస్వాదినీకర్త,

రిటైర్డ్ - కళాశాల దేశచరిత్రగిర్వాణసాహిత్యాచార్యులు, నెల్లూరు.






ప్రకాశకులు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాద్, హైదరాబాదు - 4.

# ప్రఖ్యాపనము

## ప్రథమ ముద్రణము

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారిచే 1964 జూన్ తే 16ది కీ. శే. మహామాత్య పండితనెహ్రూ స్మారక చిహ్నములలో ఒకటిగా సంకల్పింపఁబడిన యీ భవభూతి యుత్తరరామచరితనాటకము ఆంధ్రవ్యాఖ్య తోడిది ఇదె ప్రకటింపఁబడినది. ముద్రణము వ్యాఖ్యాత్రవేక్షితము. అందు తోడుగా ప్రూఫులు దిద్దుటకు ఆయుష్మంతులు శ్రీమంతులు ఆయనతమ్ముఁడు విద్వాన్, యన్. భక్తవత్సలమయ్యంగారు, యం. ఏ., బి. ఓ. యల్., మదరాసు వివేకానందకాలేజి తెలుఁగుభాషాధ్యక్షుఁడును, నెల్లూరు మందాకినీ పత్రికాధ్యక్షుఁడు మరుపూరు కోదండ రామరెడ్డిగారును సాయపడిరి. వివిధ భిన్నాకారపరిమాణాక్షరములతో క్లేశమోర్చి ముద్రింపవలసిన దీనిని మద్రాసు ఫ్రీడమ్ ప్రెస్ ప్రొప్రయిటరు యం. బాలసుందరంగారు చక్కఁగా ముద్రించి అందముగా తయారుచేసిరి. అందఱికి దీనిచే కృతజ్ఞత నివేదింపఁబడుచున్నది.

1965 నవంబరు 15.

అంతుపట్టని మనస్తత్త్వాలకు
ఆటపట్టులే ఈ లోకం

# ప్రఖ్యాపనము

## ద్వితీయముద్రణము

రసాస్వాదినీసహితముగా 1965 లో ప్రచురించిన భవభూతి యుత్తరరామచరిత ప్రతులు ఇంతలో ఐపోయినవి. ఆ గొప్పగ్రంథము లేకున్న ఎట్లు? కావున ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాదమివారిచే తత్కార్యదర్శి శ్రీదేవులపల్లి రామానుజరావుగారి సహజోత్సాహపూరిత పర్యవేక్షణమున వెంటనే ఈరెండవ ముద్రణము సమకూర్పఁబడినది. ఇది తొలిదానికి అవృత్తి మాత్రమే. ఈతూఱి ముద్రణము 'వేదముప్రింటర్స్'కు అప్పగింపఁబడినది. తదధ్యక్షులు వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రూపులు సయితము తమ యొక్క చేతిమీదుగా దిద్ది నిశ్శల్యముగా సర్వాంగసుందరముగా గ్రంథమును తీర్చినారు. ఆంధ్రసాహితీప్రియులు వారికెంతయు కృతజ్ఞులగుదురు.

1970 ఫిబ్రవరి 20

# విషయసూచిక





# ఉపోద్ఘాతవిషయసూచిక

విషయము ... పుట





# ఉత్తరరామచరితము

## (సరసాస్వాదిని)

## ఉపోద్ఘాతము

### ౧–వ్యాఖ్యాప్రస్తావము

అభిజ్ఞాన శాకుంతలమునకు నేను రచించిన రసాస్వాదినీవ్యాఖ్య ప్రకటితము (1-12-1957) కాఁగానే, నామిత్రులు పలువురు ఉత్తరరామచరితమునకును అట్టి రసాస్వాదిని యొకటి రచించిన బాగుగానుండు నని ఆపనికి నాకు ఉత్సాహము గొల్పిరి. దానికిని నేను మాసాహిత్యగురువు కవిసహృదయచక్రవర్తి శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారివద్ద నేర్చుకొన్నదానిని యథామతి ఒక గ్రంథమున పొందుపఱుపఁ గోరిన వాఁడనై అంతకు పూర్వమే అందులకు కడంగియున్నవాఁడను, ఆ నాచిరకాంక్షితమును మిత్రులయాదరముం బొందువాఁడనై ఎట్లో నెఱవేర్చితిని.

ఉత్తరరామచరితముం బోలిన యతిప్రసిద్ధనాటకమునకు ఎన్నియేని వ్యాఖ్యలు గీర్వాణమునను ఆంగ్లమునను కలవు. అందెందును చెప్పని క్రొత్తదానిని నేను ఏమి చెప్పఁగలను? ఐనను ఆంధ్రమున ఇప్పటికి లేనిదానిని సంపాదించుటయు, శ్రీ శాస్త్రుం వారి బోధనము విలక్షణ మగుటవలన అందేమేని ఎందేని విశేషమున్న దానిని ఇందు సమకూర్చుటయు కలుగునని తలంతును. సాధుపాఠనిర్ణయమునకు సముచితార్థ వివేకమునకును శ్రీ శాస్త్రులవారి యాంధ్రానువాదము నాకు మార్గదర్శకము, విస్మృతస్మారకము, శ్రీ శాస్త్రులవారి గీర్వాణనాటకాంధ్రానువాదములు తెలుఁగున రసవత్తమ నాటకము లగుటయ కాక, ఒక తెఱంగున ఆయానాటకములకు రసికులకు దారి తప్పని వ్యాఖ్యలును అగు నని నిజమతము. ఇందేమేని గుణమున్న దాన వారికీర్తి ఆరాధింపఁబడును గాక. దోషములున్న అవెల్ల నావే అగును. వానికి పెద్దల దిద్దుపాటులు కలిగిన కరము కృతజ్ఞుఁడ నయ్యెదను.

నేను ఈవ్యాఖ్యను విజయ విజయదశమి — తే 17-10-1953 ది, వ్రాయ నారంభించితిని. అది మొదలుకొని ఏకప్రయత్నమునఁ గాక, అప్పుడు ఇంచుక అప్పుడు ఇంచుకగా వ్రాయుచుంటిని. నడుమ ఎన్నితూర్లో నెలలకాలము అందులకై కలము కాఁకయు గడచును, మరల వ్రాఁత సాఁగును. వారములు వ్రాఁత నిలిచిపోయి యుండును; మరల నడచుచుండును. అట్లే దినములును. ఇట్లు ఎట్లో సాఁగి తే 29-12-1959 ది అది ముగింపుఁగన్నది. అధ్యవసాయము కొఱఁతవడినట్లు తోఁచు నీగమన మేల దీనికి అన్న. అది నాకు అందలి ప్రీత్యుత్సాహములు చాలమిఁ గాదు; మఱి దీనికి ముద్రణ ప్రకాశముని ఎట్లగునా యను నైరాశ్యము తోఁచుచున్నందున. అట్లే అవ్రాఁత ముగిసి ప్రకాశమార్గము అగపడక. ఇప్పటికి నాలుగైదేండ్లు కావచ్చినది. అట్లు మూలమన్నదాని ప్రస్తావము నావలన విన్న శ్రీమంతులు ఆయుష్మంతులు రెడ్డికొరలు మరుపూరు కోదండరామరెడ్డియు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డియు ఆంధ్రప్రదేశసాహిత్యాకాడమి మిత్రులును అధ్యక్షులును, ఆ యకాడమీ కార్యనిర్వాహకులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును, ఆ యకాడమీ ఇటీవల కీర్తిశేషుఁడైన నెహ్రూ మహామంత్రికై సాహిత్యమున మంచి స్మారకములం గూర్ప మార్గము లెంచుచుండ, అందొకటిగా ఈనా యుత్తరరామచరిత రసాస్వాదినిని ముద్రించి ప్రకటించుటను గీర్వాణాంధ్రోభయ సాహిత్యసేవగా గ్రహించి నాకు తెలిపినారు. నేనును కరము సంతసించి, కృతజ్ఞత చిత్తము నిండ, ఆనా రసాస్వాదినిని ముద్రణ ప్రకటనలకై ఆ యకాడమిచేత నుంచినాఁడను.

నెహ్రూమహామాత్యుఁడు పండితుఁడన్న బిరుదు అవియుతముగా నిజనామముతో ఘటితమైయుండువాఁడు, ప్రజారాజ్యమైన మన భారతదేశమున భారతాభినవ పెరిక్లిస్ అనఁదగినట్లు స్వరాజ్యస్థాపనదినము మొదలుకొని తాను ఈలోకమును వీడువఱకు ఎన్ని తూర్లైనను మహామాత్యుఁడుగా ప్రజలచే ప్రీతితో ఎన్నిక గని పదునైదేండ్లు ధర్మవీరుఁడుగా భారతమును ఏలుచుండి, ఈయనకు వెనుక ఇఁక ఇట్టివారు ఎవరు కలుగుదురా అని నిరాశ గొల్పుచుండినవాఁడు. సాటిలేని ప్రజారాధకుఁడు. అట్టి యాయన జ్ఞాపకమునకై శ్రీరాముని ప్రజారాధన వ్రతకథయగు ఈ యుత్తరచరితముం బ్రకటించుట ఎంతయు సదృశమగును. ''యుక్తః ప్రజానా మనురఞ్జనే స్యాః'' - ''ప్రజల రంజింపఁ దివురు మెప్పాటనైన'' అను నిజ కులగురు వసిష్ఠోపదేశమును చిత్తమునఁ గొని, తాను ఎట్టి దుఃఖములనైనను ఓర్చుకొని, ''త త్పూజితం హి తాతేన మాం చ ప్రాణాంశ్చ ముఞ్చతా'' ''అకరణి నను నసుల విడ నీకొని

మాయయ్య దానినే కద నెఱపెఁ" అను తన నాయన యనుష్ఠానమును తలఁచుకొని' "లోకో న మృష్యతి" "లోకో విరజ్యతే" "లోకము ఒప్పలే" దని "లోకమునకు ఎదురులేదు" అని లోకైకప్రాభవమును పాటించి, "ఇక్ష్వాకువంశోభిమతః ప్రజానాం' "లోకులకు మాననీయ మిక్ష్వాకుకులము." అన్నట్లు తనకైన ప్రజాభిమానమును గౌరవించి, "ఇదం విశ్వం పాల్యం విధివ దభియుక్తేన మనసా." "పూనికతోడ విశ్వమును బ్రోచుట కార్యము శాస్త్రసమ్మతిఁ" అని విధులు దాఁటక ప్రజలఁ బాలించి "ప్రజాపుణ్యై ర్జీవతి" "బ్రదికియున్నవాఁడు ప్రజల పుణ్యమునను" అన్నట్లు అన్నాళ్ళు ప్రజల పుణ్యాలచే జీవించిన రాముని చరితము, పండిత నెహ్రూచరితముం బోనిది, ఉత్తరరామచరితము. దానిని ఆయనకు "సావెనీరు" "స్మారకము"గా ప్రకటించుట మణిదీపమును ఎత్తుట యగును।

## ౨-కవియూరు - పేరు

ఏప్రాఁత సంస్కృతకవింగూర్చియు పుట్టువు పూర్వోత్తరములు తెలిసికొను మార్గములే మనకు లేకయున్నవి. కవి యేమో తన్నుంగూర్చి యావివరములు చెప్పనే చెప్పఁడు. మ తెవరును సమకాలికులు గాని సమీపకాలికులు గాని అట్టి చరిత్ర వ్రాయు నాచారము మన దేశాన లేదు. ఆఙ్గ్లకవులంగూర్చి సులువుగా వివరములు కూర్పఁబడి యున్నవి. అట్లే ఇతరపాశ్చాత్య కవులం గూర్చియు. ఇల్లు ఊరు దాని పరిసరములు విద్యాభ్యాసము దేశాటనము బనవారు కానివారు. ఇత్యాది వివరము లన్నియును చెప్పి, ఆయాకవిమీఁద వీని యన్నింటి మహిమ యే మగును అను వింత విచారము చేయఁ బడియుండును. మఱి మన కవులంగూర్చి మనకు ఏమియు తెలియదు. తెలియనందు వలన ఏవేవో పుక్కిటిపురాణములు వాడుకకు వచ్చియుండును. కవి గొప్పవాఁ డగు కొలఁదియు ఇవి యెక్కువ. వీనిని మథించి సత్యమెఱుఁగుట అలవికాని పని యగును. కాళిదాసు చాల ప్రాఁతవాఁడు, కవులకు గురువు. ఆతనింగూర్చిన కథలు విడఁదీయ రాకయే యుండును. నాటకములలో కాఁబోలు, ప్రస్తావనలలో తన పేరుమాత్రమైనను చెప్పవలసినందున చెప్పినాఁడు. భోజప్రబంధకారుఁడు బల్లాలసేనుఁడు తనకు వేయేండ్ల క్రిందనుండి తన కాలమువఱకు నున్న ప్రసిద్ధకవులను పండితులను, తాను స్వయము గొప్ప కవియు పండితుఁడునై, కవిపండితబంధువగు ధారాభోజుని యాస్థానమున చేర్చి ఎంతయో చమత్కారముగా వారి తారతమ్యములు తెలుపు సరసగోష్ఠులు తన ప్రతిభచే కల్పించినాఁడు. అందలి సంవిధానము లన్నియు నిజములే యని చరిత్రమార్గము లెఱుఁగని వట్టి పండితుల పలువుర యభిప్రాయము। ఇట్టి దశలో తా నెంత గొప్ప కవి

యైనను భవభూతింగూర్చి మనము ఏమి యెఱుంగఁగలము? అతఁడు రచించినవియు నాటకములే అయినందున, ఆప్రస్తావనలలో ఆచారపాఠముగా అతని పేరు పఠితమై యుండును. ప్రస్తావనలోని కవి సొంత విషయములు కూడ, అవి అతఁ డట్లు ఏల సూత్రధారనటులచే ప్రరోచనకై చెప్పించినాఁడో అని విమర్శించి నిశ్చయము తేల్చు కొనవలసియుండును. ఏమేమో ఊహలు చేయవలసియుండును.

భవభూతి తన నాటకప్రస్తావనలలో తన్నుంగూర్చి కొంత వివరము, ఇతర కవులు పలువురు తమ్ముంగూర్చి చెప్పికొన్నదానికంటెను ఎక్కువగానే, చెప్పుకొనియున్నాఁడు. ఉత్తరచరితములోనికన్న మహావీరచరిత మాలతీమాధవములందు కొంత ఎక్కువ గలదు. దక్షిణాపథమందు విదర్భదేశమున పద్మపురమునందు ఉదుంబరులను ఒకతెగ బ్రాహ్మణులు కలరఁట. వారు "పంక్తిపావనులు" "చరణగురువులు" "పంచాగ్నులు." "ధృతవ్రతులు" "సోమపీథులు." భవభూతి ఆతెగవాఁడు కాశ్యపగోత్రుఁడు, కృష్ణ యజుఃశాఖాధ్యాయి. తన పూర్వుఁడు ఐదవతరమువాఁడు పేరే మహాకవి అని కల వాఁడు, వాజపేయయాజియు. తన పితామహుఁడు భట్టగోపాలుఁడు. నాయన నీల కంఠుఁడు. అమ్మ జాతుకర్ణి-అనఁగా అగోత్రముది. తన పేరు భవభూతి. భట్ట శ్రీకంఠుఁడు అను పదము తనకు లాంఛనము. కంఠమున శ్రీ (=సరస్వతి) కల వాఁడు అని తనకు గుఱుతు-బిరుదు కాఁబోలు. ఇందు పే రేది, బిరు దేది అని సందే హము కలుగఁగా తన్నిర్ణయమునకు పండితులు ప్రయత్నించినారు.

"తపస్వీ కాం గ తోఽవస్థా మితి స్మేరాననా వివ
గిరిజాయాః స్తనౌ వన్దే భవభూతి సితాననౌ."

అని యొకరును,

"సామ్బా పునాతు భవభూతి పవిత్ర మూర్తిః"

అని యొకరును ఇవి భవభూతి రచితము లనుచు ఉదాహరించి, దానికి మెచ్చి, ఈ కవికి పోషకుఁడు కాన్యకుబ్జరాజు యశోవర్మ ఇతనికి బిరుదుగా ఆపే రిడెనని యైతిహ్యము పలుకుదురు. ఆ శ్లోకములయందలిది అట్టి బిరుదు పెట్టఁదగినంత గొప్ప కవనకల్పన కాదు. వానికి నమ్మఁదగిన యాకరము అగపడదు. మఱియొకరు ఈశ్వరుఁడే భిక్షు రూపమున వచ్చి ఈయనకు "భూతి" (=బూది) ఇచ్చెననియు నితడు భవభూతి యాయెననియు చెప్పినారు, దీనికిని ప్రమాణము ఉదాహృతము గాదు. "కుప్పయ్య" "పిచ్చయ్య" అని కారణవిశేషములచే అనిష్టనివారకముగా శిశువులకు నామకరణము చేయునట్లు ఈయనకు "భూతి" "బూది"-"బూదిదయ్య" అని పేఁడినా రన్న యూహ

చేయరైరి: ఈ కారణములు ఊహించుటచే ఇది బిరుదు, దానిని సంపాదించుకొను వయసు వచ్చినప్పుడు ఒనంగఁబడినది, పేరేమో "శ్రీ కంఠుఁడే" యగు నను నభి ప్రాయము తేలుచున్నది. ఐనను ప్రసిద్ధ్యర్థక "నామ" తో కూడిన "హిమాలయో నామ" "శ్యామో నామ" "ప్రస్రవణో నామ" "శ్రమణా నామ" "చిత్రకుఞ్జో నామ" అని వట్టి పేరులం జెప్పు ఈ కవి వ్యవహారమువంటిది గానే యున్నది ఈ "భవ భూతి ర్నామ" అని తన్నుఁ జెప్పుకొనుటయు. మాలతిలో "భవభూతినామా" అనియు కేవలము పేరు అను నర్థముగల ప్రయోగమును గలదు. "శ్రీ కణ్ఠ పదలాఞ్ఛనః" అన్నచోట "పద" అనియు "లాఞ్ఛనః" అనియు చేర్చుటచే "శ్రీకణ్ఠ" అన్నదే బిరుదు కాఁబోలు అని తోఁచుచున్నది. పేరగునేని ఈ "పద" "లాఞ్ఛన" యోగము ఉండదు. మఱియు ఈ కవిని పూర్వులు ఎక్కడ ప్రస్తావించినను "భవభూతి" అనియే - "భవభూతిరేఖయా" అనియు, "భవభూతేః సమ్బన్ధాత్" అనియు, "భవ భూత్యాది సేవితః" అనియు పేర్కొనియున్నారు. "శ్రీకంఠుఁ" డని ఇతనికి ఎక్కడను నామగ్రహణము అగపడలేదు. మఱి యితని నాయన, "నీలకంఠుఁడే" యన్న దానికి జవాబుగా తాత "భట్టగోపాలుఁడే" అనఁదగును. "శ్రీకణ్ఠపదలాఞ్ఛనః" అనఁగా పేరు "శ్రీకంఠపదుఁడు" అనియు ఒకరు అన్నారు. అదియుం గాక తల్లి దండ్రులు పెట్టిన పేరు మఱఁగిపోయి బిరుదనామమే వ్యవహారమున నిలుచువారునుం గలరు. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు "భట్ట శ్రీకంఠుఁడను పేరివాఁడు, భవభూతి యని వ్యవహృతుఁడు" అన్నారు. "భట్టగోపాల" "మహాకవు"లు ఎడమగు తరములవారు, నాయన "నీలకంఠము" ప్రక్క నుండి "శ్రీకంఠ" మునే పేరుగా ఆకర్షించును.

ఈతని యూరైన పద్మపురమును గాని ఈతని నాటకము లాడిన తిరునాళ్ళ దేవుని కాలప్రియనాథుని గాని ఇక్కడిది ఇక్కడివాఁడు అని నిర్ణయించు ప్రయత్న ములును నెగ్గలేదు. మాలతిలో మాలతియూరు "పద్మావతి" అని చెప్పి అక్కడి నదులను నదీసంగమములను కొండలను అడవులను సువర్ణబిందుక్షేత్రమును కంటితో చూచినట్లు తోఁచు వర్ణనలు గావించియున్నందున భవభూతి కాపురమున్న పద్మపురము ఈ పద్మావతియే యగునా అని ఆశంకించినారు పూనికతో అ యా పేరులను గ్రంథ మున ఉదాహరింపఁ బూనుకొన్న యుపక్రమమున పద్మావతికి పద్మపురమని సంకో చించుట సంభావ్యము గాదు. మఱియు మాలతిలోని యావర్ణనకన్నను కంటికి ప్రత్యక్షము చేయంజాలు వీరచరితోత్తరరామచరితలలోని పంచవటీ జనస్థానాదుల తోడి దండకవర్ణనయు గోదావరివర్ణనయు, అది "సరసనీర" యని నోట చవు

జ్ఞాపించు కొనుటయు, అంతియకాక ఆ గిరిభూములు ఈ దక్షిణారణ్య భూధర ములను "మాల్యాకసురభి వనగిరి భూమయః.........స్మారయన్తి......దక్షిణారణ్య భూధరాః." (మాల. IX - 3) అన్నట్లు స్మరింపఁజేయు నన్న మాటయు భవ భూతిని గోదావరీతీరమువానిం జేయునేమొ! అట్లే అన్నారు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు భవభూతి యాంధ్రుఁ డగునేమో అని—"విదర్భదేశ మనఁగా ఇప్పటి బిరారు (Berars) దేశమనియు, ఇప్పటికిని నాగపూరుసీమలో చాందా (లేక చంద్ర పురము) అను నగరము సమీపమున ఉదుంబరులు నివసించిననాఁటి ప్రాంతమున మహారాష్ట్రులు (దేశస్థులు) తైలింగులు నగు తైత్తిరీయ బ్రాహ్మణు లున్నారనియు భండారకార పండితులు మాలతీమాధవపీఠికయందు వ్రాసియున్నారు. అవ్వాఁతం బట్టి చూడఁగా, భవభూతి మహారాష్ట్రుఁడో ఆంధ్రుఁడో. అందును వెలనాటియో తెలగాణ్యుఁడో యని సందేహము కలుగుచున్నది."

ఉత్తరచరితయందలి "హన్త! మాత జీవామి" "అమ్మా! బ్రదికితిని!" అను మొదలగు కొన్ని వాచోయుక్తులంబట్టి తద్వ్యాఖ్యాత ఘనశ్యాముఁడు అవి కవియొక్క ద్రావిడత్వమును ప్రకటించును అన్నాఁడు. అది యుండనిండు.

ఏది ప్రకృతమో దానిని అట్లు కంటియెదుట నిలుపు వర్ణన కవిప్రతిభను సూచించును. దాన మఱి యితర భ్రమల వారించుకొనఁదగును. ఇఁకను నాఁటి పద్మావతి నేఁటి తన్నదీసంగమ నికటమందలి "నర్వారు" పట్టణమనియు, అట్లు కాదు అది నేఁటి పదంపూరు పట్టణ మగుననియు అనవాలుపట్టు ప్రయత్నము. మనసు కెక్కనిది, అదెందులకు? ఇంతకును అంతు తెలియని భవభూతి వాస పద్మపురము అది కాదు గదా. ఇఁక కాలప్రియనాథుఁడు ఉజ్జయినీ మహాకాలుఁడు కాళిదాసు మేఘాదులలో పేర్కొన్నవాఁడు ఎట్లగును? అంత ప్రసిద్ధనామమును వదలి ఆ దేవుని ఈ పేర నేల వ్యవహరించును? రాజశేఖరుని కావ్యమీమాంసలో "అనియతత్వాద్దిశాం అని శ్చితో దిగ్విభాగ ఇత్యేకే," అని దానికి సమర్థనముగా "యో గాదిపురస్య దక్షిణః స కాలప్రియస్య ఉత్తర," అని "గాధిపురము"తో సమభివ్యాహరించి "కాలప్రియము" ఒక యూరిపే రని తెలిపినాఁడు. ఇందు గాధిపురము, కాన్యకుబ్జమునకు, భవభూతికి ఆశ్రయమగు యశోవర్మకు రాజధానియైనదానికి, నామాంతరము. కావున ఈ కాల ప్రియ మను నగరము దానికి ఇటో అటో ఉండిన దని యూహింపఁదగును. శ్రీరంగ నాథుఁడు వేంకటనాథుఁడు అని యా యా స్థలముల దేవుని పేర్కొన్నట్లు కాలప్రియ మందలి దేవుని కాలప్రియనాథుఁడని పేర్కొనియుండఁదగును. కొందఱు విద్వాం

నులు ఇపుడు "కాల్పి" అనఁబడు పట్టణము నాఁటి "కాలప్రియము" కాఁబోలు అని యూహింపఁజాతురు. మఱి యందు "కాలప్రియనాథుఁడు" "యాత్ర" తిరునాళ్ళ జరిపించుకొను దేవుఁడు ఉన్నాఁడా? ఉన్నాఁడని నేఁటి చరిత్రవిద్వాంసులు కనిపట్టి నిశ్చయించినారు. కాలప్రియనాథుంగూర్చిన సందియములును వితర్కములును దూరీకృతములగునట్లు యమునదరిని కాలప్రియనగరమును కాలప్రియనాథ దేవళమును కనిపట్టినారు. అదియే నేఁటి కాల్పి యని రూఢిచేసినారు. శ్రీ డాక్టరు వేంకటరమణయ్య యం. ఏ. గారు తమ లే (వే) ములవాడ చాళుక్యుల చరిత్రమున ఆ లేములవాడ భీమేశ్వరాలయమున దొరకిన శాసనమును ఉదాహరించినారు. అందు ఎనిమిదవ శ్లోకము :—

> ప్రత్యుద్గతాం ఘూర్జరరాజసేనాం నిర్జిత్య రాజా స్వయ మేక ఎవ
> కాలప్రియే రాజకదమ్బకస్య స్తమ్భే స్వశౌర్యం విలిలేఖ తైలే.

అట్లే క్యాంబేశాసనములందును గల దని గొప్ప చరిత్రవిద్వాంసుఁడు విష్ణు మిరాషి ఇట్లు ఉదాహరించినాఁడు—

> య న్మాద్యద్ద్విపదన్తఘాతవిషమం కాలప్రియప్రాఙ్గణం
> తీర్ణా య త్తురగై రగాధయమునా సిన్ధుప్రతిస్పర్ధినీ
> యే నేదం హి మహోదయారినగరం నిర్మూల మున్మూలితం
> నా మ్నా ద్యాపి జనైః కుశస్థల మితిఖ్యాతిం పరాం నీయతే.

ఆచార్య అల్టేకరు తన రచించిన రాష్ట్రకూటుల చరిత్రమున ఆ కాలప్రియమున-కాల్పిలో-కాలప్రియనాథాలయము నేఁడును ప్రకాశించుచున్నదని వ్రాసియున్నాఁడు. "కాల్పి" "కాలప్రియము" భవభూతికి ఆశ్రయమైన యశోవర్మకు రాజధానియగు కాన్యకుబ్జమునకు - గాధిపురమునకు సమీపమున ఉండుటయు, అందలి కాలప్రియ నాథాలయమున "యా(జా)త్ర" జరుగుటయు, ఆ మహాజనసమావేశావసరమున భవభూతి తన నాటకములం ప్రయోగింపించుటయు సమంజసముగానే ఉన్నది. రత్నావళ్యాదులు శ్రీహర్షమహారాజాదరమున ప్రయుక్తములని వాని ప్రస్తావనలం గలదు. మఱి యీ మాలత్యుత్తరచరితములు అట్లు తన రాజునాదరమునం గాక, ఆ యాత్రలో ప్రజాదరమునం బ్రయుక్తములని ఊహింపఁదగియున్నది. భవభూతి తనకు పరమహంస శ్రేష్ఠుఁడును యథార్థనాముఁడును అగు జ్ఞాననిధి గురువు అని చెప్పుకొన్నాఁడు. "యథార్థనామా భగవాన్ యస్య జ్ఞాననిధి ర్గురుః" అని, వీరచరితమునను, "యేనామ కేచిత్" అను తన దీమసపుఁబలుకులకు శేషముగా ఆ గుక్కలోనే "గచ్ఛైః సతాం వ

నను కో గుణః ప్రఖ్యాపితో భవేత్?" అని మాలతియందును నటులచే బలికించి నాఁడు. "సజ్జనులు పండితులు అట్టి తనకు ఏ గుణము కొఱత యని యను కొందురు?" అని. భవభూతిమాటచేమాత్రము కాక, అంత గొప్ప యతీశ్వరుఁడగు ఈ జ్ఞాననిధి ఇతరవిధముగాను మనకు దొరకునేని అప్పుడు దానిబట్టి కొంత ఊహింపఁదగియుండును. అట్లు ఆయనయు దొరకఁడాయెను.

### ౩ – కవి కాలము

భవభూతి యేకాలమువాఁడు? దానికి సూటిగా రాజతరంగిణియందు కాశ్మీర నాథుఁడగు లలితాదిత్యుని ప్రస్తావమున—

'కవి ర్వాక్పతిరాజ శ్రీభవభూత్యాది సేవితః
జితో యయౌ యశోవర్మా తద్గుణస్తుతి వన్దితామ్.'
'సోఽభూత్సన్ధి ర్యశోవర్మ లలితాదిత్యయోరితి
విలేఖాలేఖ నిర్దేశాదసర్ఘుత్వం విదన్పృథోః.'

అని కలదు. లలితాదిత్యుని రాజ్యకాలము క్రీ. శ. 693 మొదలుకొని 729 వఱకు, యశోవర్మరాజ్యకాలము క్రీ.శ. 725 మొదలుకొని 752 వఱకు. లలితాదిత్యుఁడు యశోవర్మను ఓడించి తనకు సామంతుం జేసికొన్నందున ఆతని యాస్థానమందున్న వాక్పతిరాజును భవభూతియు లలితుని యాస్థానిం జేరవలయుటయ కాక, యశోవర్మ తాను స్వయము కవి అ తన జేతకు స్తుతులు పాడవలయు వంది యైపోయెను. వాక్పతి రాజు యశోవర్మ కీర్తిని ప్రతిష్ఠింప గౌడవధను ప్రాకృతకావ్యమును, కడుదీర్ఘమైన దానిని తొడంగి ఇంచుకయే వ్రాసి అగౌడునివధ ప్రస్తావము రాకముందే నిలిపివేయుట చూడఁగా, ఇంతలో యశోవర్మ లలితాదిత్యునికి లొంగిపోయినాఁ డని ఊహింపఁ దగును. ఆగౌడవహమున (ఛాయ.)

'భవభూతి జలధి నిర్గత కావ్యామృత రసకణా ఇవ స్ఫురన్తి
యస్య విశేషా అద్యాపి వికటేషు కథా నివేశేషు'

అని భవభూతి ఉదాహృతుఁ డగుటయు, మువ్వురును పై లలితాదిత్య జయ శ్లోకమున పేర్కొనఁబడుటయు, వా రందఱు సమకాలికను భవభూతి వాక్పతికి గురువో, ఇంచుక పెద్దవాఁడై ఆతని యనుకారముం బొందు పూజాపాత్రమో ఐయ్యుం డఁదగుననుటను సూచించును. కావున ఆతని విభవకాలము ఎనిమిదవశతాబ్ది పూర్వార్ధమో ప్రథమపాదమో అని నిర్ణయింపఁదగును. ఈ నిర్ణయమునకు మఱియు కొన్ని

అనుకూల సందర్భములు పరికింపఁదగును. భట్టబాణుఁడు హర్ష చరిత్రకారుఁడు హర్షుని (క్రీ. శ. 606-647) కాలమువాఁడు. ఆ చరిత్రపీఠికయందు పలువురు మహాకవులను కాళిదాస ప్రవరసేన సుబంధు ప్రభృతులను పేర్కొను నెడ భవభూతి పేరు చెప్పలేదు. వారికి ఇంచుమించుగా ఒక శతాబ్ది యంతర మున్నది కదా. ఎట్లు పేర్కొనఁగలఁడు? అట్లే ఎనిమిదవశతాబ్దియంతమున నుండిన వామనుఁడు తన కావ్యాలంకార సూత్రవృత్తియందు భవభూతి గ్రంథమునుండి ఉదాహరణము గ్రహించియున్నాఁడు. కావున పట్టుకొంనం బట్టుకొన్నట్లు ఈరెండుకాలపరిమాణములను కలుపఁగా భవభూతి యెనిమిదవశతాబ్ది కడభాగమునకు ముందును ఏడవశతాబ్ది తొలిభాగమునకు తరువాతను అనఁగా ఏడవ యెనిమిదవ శతాబ్దుల యంతారంభములు కలియుకాలమున (675-725) వెలసినాఁడని నిర్ణయింపఁదగియున్నది.

## ౪-క వి వై దు ష్యా ది క ము

భవభూతి తాను పదవాక్యప్రమాణతత్త్వజ్ఞుఁడ నని చెప్పుకొన్నాఁడు గదా. దానికి కొంత విస్తరముగా—

> యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
> జ్ఞానం తత్కథనేన కిం? న హి తతః కశ్చిద్గుణో నాటకే.

అని యిట్టి వేదవేదాంతయోగసాంఖ్యజ్ఞానము తనకు సమగ్రముగా కలదని చెప్పి, నాటకరచనాకుతూహలికి తనకు దాన నేమి ప్రయోజనము అన్నాఁడు. ఆ జ్ఞాన మెల్ల తాను తన గురువు జ్ఞాననిధిపరమహంసవలన సంపాదించుకొన్న దని సూచించి నాఁ డనుకొనఁదగును. మఱి ఉంబేకాచార్యులన్న పేరుతో భవభూతి కుమారిలభట్టు శిష్యుఁడుగా నుండెననియు. పూర్వమీమాంసాగ్రంథములకు వ్యాఖ్యలు వ్రాసెననియు, వానిలో అటనట ఉంబేకుఁడే భవభూతి యను నవిప్రతిపన్నమగు ఉదాహరణమును సూచనయు కలవనియు శంకరపాండురంగ పండితులంబోని సువిచారదక్షులు త్రవ్వి కనిపట్టినారు. అట్లే ఇప్పటికి ఐదాఱువందల యేండ్లకు పూర్వము వ్రాయఁబడిన దగు నను గుర్తులతో ఆయనకు దొరకిన చేతివ్రాత మాలతిపుస్తకములో కొన్ని యంకముల కడపట ఇట్టి గద్యము కలదఁట - "శ్రీకుమారిలస్వామి ప్రసాద ప్రాప్త వాగ్వైభవ శ్రీమదుమ్బేకాచార్య విరచితే మాలతీమాధవే షష్ఠోఽఙ్కః." అని. ఉంబేకాచార్యుఁడు కుమారిల శ్లోకవార్తికమునకు వ్యాఖ్య వ్రాసె నన్న సూచన లున్నవి. మఱియొక గ్రంథమునకు "భావనావివేకము" అనుదానికిని వ్యాఖ్య వ్రాయుచు అందు కుమారిలుఁడు తనకు గురువు అని భవభూతి - ఉంబేకుఁడు కంఠరవముచే చెప్పియున్నాఁడు. తన శ్లోకవార్తిక

వ్యాఖ్యారంభమున "యే నామ కేచి దిహ" అను తన దీమసపు శ్లోకమును వ్రాసికొని యున్నాఁడఁట. కావున ఉంబేకుఁడే భవభూతి. భట్టకుమారిలుఁడు ప్రమాణాంతరములచే ఏడవశతాబ్దివాఁడు; దాని యారంభమధ్యకాలములవాఁడు. భవభూతి తాను ఉంబేకనామమున కుమారిలశిష్యుఁ డనని చెప్పుకొని యున్నాఁ డని ఉక్తపూర్వము. ఆతొలికాలమున-

> "భవభూతి నిబన్ధ నోదధా తిమిభీమప్రతివాదికే గురోః
> సకటాక్ష నిరీక్షణప్లవః పతితం మా మయ ముద్ధరిష్యతి."
>
> "యత్ప్రసాదా దయం లోకో ధర్మమార్గస్థితః సుఖీ
> భవభూతి సురేశాఖ్యం విశ్వరూపం ప్రణమ్య తమ్."

అని శ్రుతిస్మృతివ్యాఖ్యాదికములలో భవభూతిపేరు తగిలియున్నది. ముందు మీమాంసకుఁడుగా కుమారిల శిష్యుఁడుగా నుండి తరువాత జ్ఞాననిధి శిష్యుఁడై వేదాంతి యాయెనా లేక సంగతి దానికి విపరీతమా యన్న, కాదు. పూర్వమే నిజ మని తోఁచు చున్నది. ఈచిత్సుఖిలోని వాక్యముం గనఁదగును— "స్వకపోలకల్పిత మాలతీ మాధవాది వాక్యేషు ప్రామాణ్యాభావాత్ అతివ్యాప్తిః, న హి పురా ఆప్త ఏవ సన్ నాటకాదిప్రబన్ధవిరచనమాత్రేణ అనాప్తో భవతి భవభూతిః." అని. మీమాంసకతయే ముం దనియు, తరువాత వేదాంతిత యనియు, తన నాటకరచనకు దానితో విరోధము లేదని యాతని మతమనియు ఊహింపఁదగును. "మహాకవి" యను తన ముత్తాత నాయనలం దొట్టిన వంశపరంపరచేత భవభూతి అతివిద్వాంసుఁడును మహాకవియుంగాఁ జూపట్టుచున్నాఁడు. తన విద్వత్తను తాను ఆ "ఉంబేక కథల" చేతనే కాక, పదవాక్య ప్రమాణత త్త్వజ్ఞతచేతను, "యద్వేదాధ్యయన" మిత్యాదికముచేతను, జ్ఞాననిధి ప్రస్తావముచేతను, వీని నన్నింటిని మొత్తము చేసినట్లు "వశ్యవా"క్కనియు, "యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యే వానువర్తత" అనియు చెప్పుకొనుటచేతను, నట సూత్రధారులను ద్వారము చేసికొని విరూఢముగా చెప్పినాఁడు. కామందకితోడి మాలతీ మాధవమునను మాల్యవంతునితోడి మహావీరచరితమునను లోకారాధన నిర్వాహముతోడి యుత్తరచరితమునను తన నీతిశాస్త్ర విశారదత్వమును సప్రయోగముగా స్థాపించి నాఁడు. తక్కిన తన విద్యలమహిమ నెల్లను తన యోగసాంఖ్య విద్యాప్రాగల్భ్యమును, శ్రౌతవిద్యయందలి తనయక్కఱను, కాపాలికా ద్యాగమ జ్ఞానమును, ధర్మశాస్త్రమర్మ పరిజ్ఞానమును, ఇంకను ఇతరవిద్యారహస్యములను, తన వైదుష్యసారమును, ఉఁట యనఁదగినదానిని, "దేవయాన" "వైరాజా నామ తే లోకాః" అని, "అసుర్యా నామ తే లోకాః" అని, "వివర్తములకు విద్యచే బ్రహ్మలో లయము" అని యీ

మొదలగు ప్రతీకములను సైతము రుచిచూపి, తన నాటకములయందు లెస్సగాఁ బ్రకటించినాఁడు.

## ౫-కవి నాటక ప్రీతి

ఎందుకట్టె యని పూర్వమీమాంసను వదలి, పచ్చికట్టె యని వేదాంతమును త్యజించి, కదపటకిసలయపుష్పములతో మంజులమగు లతవంటిదని భక్తిచేత చిత్తము కరఁగఁగా, ఆయన్నింటికిని నాటకము రసవత్త్వదర్శన రంగమని ఈ నాటకములు రచించినాఁడు. మాలతిలో నాంది శ్లోకములయందలి భక్తిపారవశ్యము! మఱియు "అయంచ మధుమతీ సిన్ధుసమ్భేదపావనో భగవాన్ భవానీపతిః అపౌరుషేయప్రతిష్ఠః సువర్ణబిన్దు రితి ఆఖ్యాయతే. (ప్రణమ్య) జయ దేవ భువనభావన...." ఇత్యాది స్తోత్రముతోడివి ఇవి ఎట్టి చిత్తసంస్కారపు సూక్తులు! మఱి యీ రామనాటకముల మాట చెప్పవలయునా?

> "ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం
> యత్పావనం రఘుపతేః ప్రణినాయ వృత్తమ్
> భక్తస్య తత్ర సమరంస్త మమాపి వాణీ
> తాః సుప్రసన్నమనసః కృతినో భజన్తామ్."

అని ఆ వృత్తమున తాను ఆనందించి ఆ యానందపరీవాహముగా, "ఏకం స్వాదు న భుఞ్జీయాత్" న్యాయమున దానిని ధన్యులకు ఇతరులకును చూఱలియ్యఁ గోరి ఈ నాటకరచనకుఁ గడంగినాఁ డనుట.

> "న తజ్ జ్ఞానం న త చ్ఛిల్పం న సా విద్యా న సా కలా
> న త త్కర్మ న వా యోగో నాటకే య న్న దృశ్యతే."

అన్నాఁడు, భరతముని. కావ్యమాత్రమునకును బ్రమేయముకానిది లేదు అని ఈ యభియుక్తోక్తి,

> "న త చ్ఛబ్దం న త ద్వాక్యం, న సా విద్యా, న సా కలా
> జాయతే య న్న కావ్యాఙ్గ మహో భారో గురుః కవేః!"

అని,

> "య ద్వేదాధ్యయనం త థోపనిషదాం సాఙ్ఖ్యస్య యోగస్య చ
> జ్ఞానం తత్కథనేన కిం? న హి తతః కశ్చి ద్గుణో నాటకే,

యత్ప్రౌఢత్వ ముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం
తచ్చే దస్తి తత స్తదేవ గమకం పాణ్డిత్యవైదగ్ధ్యయోః."

అని యావిద్యకు ఆ ప్రతిభకు వినియోగము కావ్యము, విశేషముగా నాటకము, రచించుట అని భవభూతిమతము. అదియే అనర్ఘరాఘవకర్తయగు మురారిమతమును. అట్లే చెప్పినాఁడు గదా తన ప్రస్తావనలో—

"చేతఃశుక్తికయా నిపీయ శతశః శాస్త్రామృతాని క్రమాద్
వాసై రత్నరమూర్తిభిః సుకవినా ముక్తాఫలై ర్గుమ్ఫితాః
ఉన్మీల త్కమనీయ నాయక గుణగ్రామోపసంవర్ణన
ప్రౌఢాలంకృతయో లుఠన్తి సుదృశాం కణ్ఠేషు హారస్రజః."

అని, అట్టిదే భారవి మాఘ హర్షాదుల మతమును కానోపును. ఇందఱిలోను ఆ దివ్యనాటకముల రచనచే భవభూతి మిక్కిలి తేజరిల్లినాఁడు. మఱి యితరులు అతనికి సాటికారు.

## ౬-కవికి నాటకప్రయోగప్రీతి

నాటకములు వ్రాయుటయందు మాత్రమే ప్రీతికలవాఁడు కాఁడు భవభూతి; వ్రాసినవానిని ఆడించి చూచుటయందును మిక్కిలి ప్రీతిగలవాఁడు. "భవభూతి ర్నామ కవిః నిసర్గసౌహృదేన భరతేషు వర్తమానః స్వాం కృతిం ఏవంగుణభూయసీం అస్మాకం హస్తే సమర్పితవాన్." తనకుఁగల స్వాభావిక స్నేహముచేత తన మాలతిని ఆ నటులచేత ఉంచినాఁడఁట. ఆ ప్రస్తావనలో నటులు ఎవరు ఏయేవేషములు వేసికొందురో అది సైతము చెప్పఁబడినది. వీరచరితసూత్రియు "భవభూతి ర్నామకవిః మిత్రధేయ మస్మాకమ్. ఇతి భవన్తో విదాంకుర్వన్తు" అన్నాఁడు. ఈ యుత్తర చరితమందును వాల్మీకి రచించిన యుత్తరరామచరితనాటకముంగూర్చిన యీ మాటలు—

"తస్యైవ కోఽ ప్యేకదేశః సన్దర్భాన్తరేణ రసవాన్ అభినేయార్థం కృతః. తం చ స్వహస్తలిఖితం మునిర్భగవాన్ వ్యసృజత్ భగవతో భరతస్య మునేః తౌర్యత్రికసూత్రధారస్య...మహతీ పున స్తస్మిన్ భగవతో వాల్మీకేరాస్థా, యతః కేషాంచిద న్తేవాసినాం హస్తేన తత్పుస్తకం భరతాశ్రమంప్రతిప్రేషితమ్. తేషా మనుయాత్రిక శ్చాపపాణిః ప్రమాదోచ్ఛేదనార్థ మస్మద్భ్రాతా ప్రేషితః".

అనునవి పరికింపఁదగును. ఇవి తన యుత్తరచరితముం గూర్చియు పలికినవి కావా అని అనుకొనవచ్చును.

ఆ నాటకాంతమున—

"తా మేతాం పరిభావయ న్త్వభినయై ర్విన్యస్తరూపాం బుధాః
శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీ మిమామ్."

అని యీ నాటకమును చక్కఁగా ఆడించి చూచి బుధులు ఆనందింతురు గాక అని తన సొంత యనుభవమునే చెప్పుచున్నాఁడా అనునట్లు వ్రాసినాఁడు. మాలతిలో సూత్రధారుఁడు కామందకి ఐపోవును. నటుఁడు అవలోకిత యైపోవును అనుటచే ప్రేక్షకులయెదుట తెప్పపాటులో, తెరదింపి యెత్తులోపల అట్లు మార్పు చెందఁగల యట్లు వారు వేసములు ఎట్లు తీర్చుకొన్నారో అన్న కుతూహలముతో కూడ, పురుషులు స్త్రీ పాత్రలు ధరించుచుండిరనియు, "అప్సరోభిః ప్రయోజయిష్యతి" అనుటచే ముఖ్యములగు మేలి స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించుట కలదు అనియు నాఁటి నాటకప్రయోగతత్త్వమును నయితము ఊహింపఁజేసినాఁడు. ఆకాశభాషితముల సమకూర్చి ఎక్కువ పాత్రధారణ మను క్లేశమును మాన్పుట. ఒక్క శ్లోకమునే ఇరువురు ఒండొరులంగూర్చి పలుకుట. మింటినుండి పాత్రముల యవతరణము, మింటికి పాత్రముల యుద్భ్రమణము మొదలగునవి. రంగాన తద్రూపణము చాల కష్టమైనను, ప్రేక్షకులకు సత్యతాబుద్ధితో అద్భుతానందము కూర్చు నను నాటక ప్రయోగ రహస్యములం గూడ ఆవిష్కరించినాఁడు. దీని ప్రయోగముంగూర్చి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు, ఆ నాటకము పాఠము చెప్పుచుండఁగా, భవభూతి వలెనే, తత్ప్రయోగముం జూడ ఉవ్విళులూరుచున్నవారు నిజానుభవమును ఇట్లు అనతిచ్చినారు.

"ఈ లోకోత్తరనాటకము శ్రవ్యప్రబంధముగా రంజించును గాని దృశ్యముగా రంజింపదని పాశ్చాత్య సంస్కృత పండితులును నూతనమతప్రియులగు నస్మదీయులే కతిపయులును పలికిరి. కాని, ఇది దృశ్యముగా నత్యంతరంజకమగు నని ఆబాల్యము నా తలంపుగా నుండెను. మదరాసు క్రిస్టియన్‌కాలేజిలో ప్రధాన సంస్కృతోపాధ్యాయుఁడ నై నంతట, బి. ఏ. పరీక్షకు ఉ. రా. చ. పఠనీయము కాఁగా, నా శిష్యులకుం బై మతభేదమును, నామతమును తెలిపి, తదీయస్థాపనార్థము వారిచేత ఈ నాటకమును మదరాసు పౌరసౌధములో ఆడించి, ఇది రంగమందు అత్యంతరంజకం బనియు, అతిశాకుంతల మనియు, క్రిక్కిఱిసిన వేగురు రసికవిద్వజ్జనములకు ప్రత్యక్షము గావించినాఁడను. ఆ ప్రయోగము జరిగి ఇప్పటికి 34 సంవత్సరము లయినను, (1886) అశంబూక దివ్యపురుషుని రామసుత్యాది పద్యంబులు ఇప్పటికిని నావీనులలో

అనురణనముం గావించుచునే యున్నవి. సీతాది సకల పాత్రములును వారి వారి చర్యలును కన్నులయెదుర ఇప్పటికిని మెలఁగుచున్నవి. అనంతరము ఎన్ని నాటకములు చూచినను ఈ విధముగా డెందమును బందిగొన్నట్టిది మఱి లేదు." (ఈ ప్రయోగము 1886 లో. అనంతనారాయణ - కుంభఘోణమున తరువాత వకీలైనవాఁడు శంబూకుఁడు; నారాయణ - తరువాత జిల్లాకలెక్టరైనవాఁడు సౌధాతకి : టి. యస్. నారాయణశాస్త్రి - తరువాత ప్రసిద్ధ హైకోర్టువకీలు ; రాముఁడును, జనకుఁడును - అని ఇవి కొన్ని పాత్రగ్రాహులపేర్లు )

## ౭ - కవి ప్రసిద్ధి

కాళిదాసును మెచ్చుకొందురు గాని ఏ కవులును అనుకరింపఁ గోరరు. ఏలన అతని ప్రతిభ అతని మార్గమును ఎవరికిని అందుకొన నలవిపడునది గాదు. (మేఘము మాట యటుండనిండు. అదియొక క్రొత్త నమూనా, బహ్వనుకృతమైనది. ఆ యనుకరణ మెల్ల వట్టి వెక్కిరింతగా తోఁచునదే ఐనది.) భవభూతికి అలంకారశాస్త్రములలో ఉదాహృతియు, తక్కిన కావ్యములలో ప్రశస్తియు అతని రచనలకు ఇతర కవుల యనుకృతియు, కవిప్రసిద్ధికి కొలత, ఎక్కువగానే కలదు. అదెల్ల అతని ప్రశంసయే యగును. సరస్వతీ కంఠాభరణమున, శృంగార ప్రకాశికయందు, దశరూపకమున, ఔచిత్యవిచారచర్చయందు, కావ్యానుశాసనమున, కావ్యాలంకార సూత్రవృత్తియందు, కావ్యప్రకాశమున, సాహిత్యదర్పణమందు ఇంకను ఇతరములందును తత్తదాచార్యులు ప్రమాణముగా ఈతని శ్లోకములను ఉదాహరణములకు కైకొనినారు. మఱియు భల్లాలసేనుఁడు భోజప్రబంధమున కాళిదాసునోట —

> " సుకవి ద్వితయం జానే, నిఖిలేఽపి మహీతలే
> భవభూతిః శుక శ్చైవ వాల్మీకి స్తు తృతీయకః ".

అనియు,

మరలను అతని నోటనే —

> అహో మే సౌభాగ్యమ్ ! మమ చ భవభూతే శ్చ భణితిః
> తులాయా మారోప్య, ప్రతిఫలతి తస్యాం లఘిమని,
> గిరాం దేవీ సద్యః శ్రుతికలిత కహ్లారకలికా
> మధూళీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ.

అని, వాల్మీకి శుకులకు భవభూతి చేరుపువాఁ డనియు, అది యాతని యంతస్తు

అనియు, అతని ఫణితి అతిమధురమ యైనను అందు తన (=కాళిదాస) ఫణితికన్న మాధుర్యము ఒక్క చుక్క తక్కువ యనియు, వారింగూర్చిన తన యంచనను ఇట్లు చమత్కారముగా కాళిదాసునోట చెప్పించినాఁడు. ఆ "రాత్రి రేవ వ్యరంసీత్" (చూ. I. ౨౦) కథయు ఈలెక్కలోనిది అగును. యశోవర్మయాస్థాని కవి వాక్పతి రాజు తన ప్రాకృతకావ్యమున గౌడవహమున చెప్పినాఁడు - (ఛాయ)

భవభూతి జలధి నిర్గత - ఇత్యాది చూ.పే. 8- దాని చక్కని గంభీరమగు సన్నివేశములలో ఇప్పటికిని విశేషములు, భవభూతి (రచనల) సముద్రమునుండి వెలువడిన కావ్యామృతంపు రసకణములంటోనివి, ప్రకాశించుచున్నవి. రాజశేఖరుఁడు తాను భవభూతి యవతార మఁట! బాలరామాయణమున ఇట్లు చెప్పినాఁడు.

> బభూవ వల్మీకభవః పురా కవిః తతః ప్రపేదే భువి భర్తృమేణ్ఠతామ్,
> స్థితః పున ర్యో భవభూతి రేఖయా స వర్తతే సంప్రతి రాజశేఖరః.

జగతిలో తొలుత వాల్మీకి కవి యాయెను. తరువాత ఆయనయే (మరల అవతరించి) భర్తృమేంఠుఁ డాయెను. మరల అనంతరము భవభూతిగా విలసిల్లెను. అతఁడే ఇపుడు రాజశేఖరుఁడుగా ఉన్నాఁడు. భర్తృమేంఠుఁడు అనఁగా కాళిదాసు. మరల తన కావ్యమీమాంసలో.

> మాన్యో జగత్యాం భవభూతి రార్యః సారస్వతే వర్త్మని సార్థవాహః,
> వాచం పతాకా మివ యస్య దృష్ట్వా జనః కవీనా మనుపృష్ఠ మేతి.

అని ఉదయసుందరి చంపువునుండి ఉదాహరించినాఁడు. 'ఆర్యభవభూతి ఈ జగతిలో చాల మాన్యుఁడు. వాఙ్మయపు దారిలో బాటసారుల తుటుమునకు నాయకుఁడు. అతని వాక్కును జెండావలె కనుపెట్టి జనులు కవులవెంట నడుతురు."

గోవర్ధనాచార్యుఁడు ఆర్యాసప్తశతిలో —

> భవభూతేః సమ్బన్ధాద్ భూధరభూ రేవ భారతీ భాతి
> ఏతత్కృత కారుణ్యే కి మన్యథా రోదితి గ్రావా?

(చూ. I ౨౧. అపి గ్రావా రోది త్యపి దళతి వజ్రస్య హృదయమ్.) అని ఆ యార్తికి రాయియు కరఁగి యేడ్చినదనుటచే ఆ యేడ్పు మాధుర్యమునకు భారతి ఇట్లు భవభూతి (భవునిభూతి అనియు) సంబంధముచేత కొండపుట్టువు (పార్వతి) ఆయెనా యేమి (లేక కొండపుట్టువే భారతియాయెనా యేమి) అని తోఁచుచున్నది అన్నాఁడు. "కరు

ణము" మధురతమము కాఁదగునన్నాఁడు ధ్వనికారుఁడు. ఆర్తికి, జాలికి రాయియు వజ్రమును కరఁగుటయు చీలుటయు అట్లు ఉల్లాపములు చేయుటయు, ఇది మిక్కిలి ప్రశంసాతిశయము కాఁగా, కొందఱు అట్లు గొనక భవభూతి వాక్కు గ్రావాకర్కశమును వజ్రకఠినమును అని గ్రహించుటకు ఏమందుము? పాట మాధురికి మ్రోడును చిగుర్చుటయు, రాయియు కరఁగుటయు తార్కాణగా లోకోక్తుల వాడుకగలదు. అట్లే, నీలకంఠదీక్షితుఁడు వాణిని ఇపుడు అందఱు రుచి చూచువారే అన్నాఁడు. ఇట్లు—

> ప్రాచేతసేన యా సీతా పాలితా భవభూతినా
> సర్వత శ్చర్వ్యతే వాణీ సైవాద్య కవిమానిభిః.

వాల్మీకిచే తేఁబడినది: భవభూతిచే ప్రోదిసేయఁబడినది: ఆ వాణియే - రామాయణమే. దానిని ఇపుడు కవికానివాఁడెల్ల తాను కవి అనుకొని ఎక్కడ చూచినను ఆస్వాదించుచున్నాఁడు. అనఁగా వారితో పోల్చిన ఇపుడు కవులు వట్టి మాటకు మాత్రమే కవులు అనుట. కవికానివాఁడెల్ల తాను కవి అనుకొని వాణిని రుచిచూచువాఁడే. ఇది జల్హణుఁడు సూక్తిముక్తావళిలో ఉదాహరించినది, ఎవరిసూక్తియో.

> భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా
> మురారి పదచిన్తాయా మిద మాధీయతే మనః.

"ఇంక చాలునులే అనునంతవఱకు భవభూతిని చదివి, అవతల నుంచి, బా(వా)ణుని ఇఁక మిగలకుండ సర్వము ముగించి, ఇపుడు మనసున మురారిమాటలను తలపోసికొనుచున్నాను - మురారిని చదువుచున్నాను - అనుట. (ఇహలోకైశ్వర్యమును సరకుపేయక మనసు మోక్షముమీఁద విడి మురారిచరణముల ధ్యానించుచున్నాను - అనుటయు ఇట చమత్కారము.) మఱియొకఁడు —

> భవభూతి కవే ర్వాచః స్వద న్తే రసరఞ్జితాః
> సుమనోభ్యః సుధాస్యన్ది బన్ధ మాధుర్య బన్ధురాః.

భవభూతి వాక్కులు రసముతో రక్తి ఎక్కినవై అమృతముకాఱునట్టి కూర్పుమాధుర్యముతో సొబగారుచున్నవై విద్వాంసులకు ఇంపుగొల్పును.

క్షేమేంద్రుఁడు తన సువృత్తతిలకమున—

> భవభూతేః శిఖరిణీ నిరర్గల తరఙ్గిణీ
> రుచిరా ఘనసన్దర్భే యా మయూరీవ నృత్యతి.

భవభూతి రచించిన శిఖరిణి (వృత్తము) అతని గొప్ప గ్రంథమున, వానకారునదివి

బోలి, అందముగా అద్దులేక అలలు పొరలుచు నెమలివలె ఆడును. (ఈయుత్తర రామచరితలోని 250 శ్లోకాలలో 30 శిఖరిణులు.) ధనపాలుఁడు తన తిలకమంజరి పీఠికలో

> స్పష్టభావరసా చిత్రైః పదన్యాసైః ప్రవర్తితా
> నాటకేషు నటస్త్రీవ భారతీ భవభూతినా.

"భవభూతి నాటకములందు, నర్తకింబోలె, భారతిని భావములు రసములు స్పష్టముగా తెలియునట్లును, పలు తెఱంగులైన ఆశ్చర్యము గొల్పు వృత్తముల చరణములతోను. (నర్తకియు అనేకవిధములుగా అడుగులు వేయునుగదా.) ఆడించినాఁడు." ఇదియు జల్హణుని సూక్తిముక్తావళిలోనిదే—

> రత్నావళీపూర్వక మన్య దాస్తాం అసీమభోగస్య వచోమయస్య
> పయోధర స్యేవ హిమాద్రిజాయాః పరం విభూషా భవభూతిరేఖా.

పార్వతి పాలిండ్లకు రతనాలపేరులు మొదలగునవి ఎన్ని (నగలు) ఉన్నను. (ఆలింగన ముల నంటుకొన్న) భవుని బూది చాఱయే ఎట్లు మేలి యలంకారమో. అట్లే అంతు లేని భోగముగల వాఙ్మయమునకు "రత్నావళి" మొదలగునది ఇతరము ఉండనీ, భవభూతి ఒక్కఁడంతి (యు) మేలి భూషణము.

## ూ - క వి ర చ న లు

భవభూతి రచనలు ఈమూఁడు నాటకములే మనకు దక్కినవి. - మాలతీమాధవము, మహావీరచరితము. ఉత్తరరామచరితము. భవభూతి మాఱుపేరు ఉంబేకాచార్యులు అనునది ప్రకాశమయిన తర్వాత శ్రుతిస్మృతిమీమాంసాదిశాస్త్రములకు అతఁడు వ్రాసిన వ్యాఖ్యలు మొదలగునవియు నామమాత్రములుగాను గ్రంథములుగాను ఉపలబ్ధము లగుచు, ఆమార్గమున ఇంకను కనిపట్టఁ గుతూహలము కలిగించుచున్నవి. అతఁడే ఆమీమాంసకుఁడే ఈనాటకములు వ్రాయుటయు, వానిని ఆడించి చూడ నానగొనుట యునా! - అని ఆశ్చర్యమును కలిగించుచున్నవి. అంతియ కాక "యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం" అను శ్లోకమును మీమాంసటీక తలమీఁదను ఉదాహరించినాఁ డని విన్నప్పుడు, తన యౌద్ధత్యమును ప్రరోచనాంగముగా సూత్రధారునినోటిమాటున దాఁచుకొనువాఁడు గామి తెలియఁగా ఎవరెవరితో కజ్జాపెట్టుకొని చివ్వకు రేఁపు ఏయే వ్రాఁతలు ఇంకను వ్రాసియుండునో అవి తోఁపకపోదు. ఐనను విద్వత్సంకలితగ్రంథము లలో శార్ఙ్గధరసంహిత, రసికజీవనము, సూక్తిముక్తావళి మొదలగువానిలో ఒక

కొన్నియే దొరకినవి. అవి చాటువులో గ్రంథాంగములో తెలియరాదు. వానిలో ఇవి మూఁడు —

> నిరవద్యాని పద్యాని యద్యనాథస్య, కా క్షతిః?
> భిక్షుణా కక్షనిక్షిప్తః కి మిక్షు ర్నీరసో భవేత్?
> అళిపటలై రనుయాతాం సహృదయ హృదయజ్వరం విలుమ్పన్తీం
> మృగమద పరిమళ లహరీం సమీర, కిం పామరేషు రే కిరసి?
> కిం చన్ద్రమాః ప్రత్యుపకారలిప్సయా కరోతి గోభిః కుముదావబోధనమ్?
> స్వభావ ఏవోన్నతచేతసా మయం. పరోపకారవ్యసనం హి జీవితమ్.

ఇఁక నాటకత్రయముంగూర్చి- వాని రచన క్రమ మే మగును అను విచారమును టీకాకారు లందఱును కావించియున్నారు. మొట్టమొదట వీరచరితము, తరువాత మాలతి. కడపట ఉత్తరచరితము-అని కొందఱు. అందు ఖానేపండితు డొకఁడు. ఇట్లు-మహావీరచరిత ప్రస్తావనలో కవి తన్నుంగూర్చి తక్కినవానిలోకంటె ఎక్కువగా చెప్పుకొనియున్నాఁడు, "యే నామ కేచి దిహ" వంటి దూషణ లేమియు లేదు. అట్లు తన్నుగూర్చి ఎక్కువగా చెప్పికొనుటయు ఇతరుల దూషణలకు దిగకుండుటయు తొలి ప్రయత్నమున సాధారణముగా నుండును. అందు రచనయు చేయి తీరనటు లున్నది. పూర్వరామచరిత మగుటచే ఇది ఉత్తరమున కేమో ముందేరచితమై యుండవలయును గదా. తన రామభక్తి రామాయణ ప్రీతులను కూడ అందు చెప్పియున్నాఁడు. మఱి మాలతి రచనమెఱుఁగు ఇందు లేదు. కావున ఇది దానికిని ముందటిది కాఁదగును. మఱి యిది మైదవ యంకమున తటాలున ఒక్కెడ నిలిచిపోయినదే, తరువాత భవభూతిరచన యగపడలేదే, మఱి యెవరెవరో పూరించినారే యన్న దానికి ఇట్లు సమాధానము చెప్పినాఁడు. కవి తొలుత ఐదంకములే వ్రాసినాఁడు. దానిని ఆడించినాఁడు. జనులు మెచ్చుకొనలేదు. అంతట విసివి దానిని అటు నిలిపి ఉంచినాఁడు. తరువాత మాలతి వ్రాసినాఁడు. వీరచరితమును మెచ్చుకొననందులకై అందు జనుల "యే నామ కేచిత్" ఇత్యాదిగా దూషించినాఁడు. తరువాత ఉత్తరచరితమును వ్రాసినాఁడు. తన్ను మెచ్చుకొననందులకై అందును కొంత జనదూషణ కావించినాఁడు. "అతి దుర్జన ఇతి వక్తవ్యం" అన్నాఁడు. ఇంతలో ఆయువు తీఱిన దేమో, ఆవీరచరితమును ముగింప లేక అట్లే ఉంచిపోయినాఁడు, మాలతి యుత్తరచరితలు రామణీయకమున అన్యోన్యము స్పర్ధించునట్లున్నవఁట. అది ముందు అందునా, అంతకంటె ఇది ముందు అవి యందునా అని యాందోళనపడినాఁడు. అతిదీర్ఘసమాసభూయిష్ఠ ప్రాకృత భాషితముఖ లవంగికాములవి ఉండుటచే ఇంకను కవికి నాటకపక్కి లెస్సగా కుదురలే

దని మాలతిని ముందుది చేసి ఉత్తరచరితమును కడపటిది చేసినాఁడు.—మఱి కొఱ నాటకమును ఐదంకాలదానిని ఆడించినాఁ డనుటకు ఏమియు సాక్ష్యములేదు. అందును అంకమైనను ముగియక- "దౌరాత్మ్య దరిభి ర్నిజార్జవకుచౌ" (V - ౪౬) ఇత్యాది శ్లోకము భవభూతిది కడపటిది అని చెప్పుకొందురు-అట్లు మొండిగా నిలిచిపోవుట కేమి కారణము? అట్టిదానిని ఆడించు టెట్లు? ఇట్టి పని "యే నామ కేచి దిహ"ను చెప్పిన వానియెడను "వశ్యవాచః కవే ర్వాక్యం" అని చెప్పిన వానియెడను ఊహింపరాక యున్నది. ఇదే వరుస బండారకారపండితునిమతమునను. రేపండితునిది తొలిది వీరము, తరువాత ప్రస్తావనలోనే పొరపాట్లుకలది, కథయల్లికలోను పొందిక చాలనిది ఉత్తర రామచరితము. అన్ని విధాల బాగుగా నుండునది మాలతి కడపటిది అని. కాళేపండితుఁడు - తొలిది మాలతి యనియు రెండవది వీర మనియు, అన్నివిధాల శ్లాఘ్యమైనది ఉత్తరచరితము కడపటిది అనియు. భవభూతి నాటకరచననేర్పును ప్రతిభయు మాలతిలో చక్కఁగా లోకమునకు క్రొత్తగా ప్రకటమైనది. దాని కథ కొంత క్రొత్తది. తరువాత తన రామభక్తియు రామాయణపూజయు తన్ను అటు త్రిప్పినవి. తన నాటక శిల్పము వీరచరితమున ఇంకను మెఱుఁగెక్కినది. ఉత్తరచరితమున సర్వాతిశాయిగా పరిణతమైనది. మాలతిలో ఎంత గుణాతిశయ మున్నను, మొత్తాన అ దేదియో ఒక విధమగు మోటుతనముచే ఆక్రాంతమైయున్నట్లు తోఁచును. ఆట అతిదీర్ఘమును. కావున అది కవికి తొలిప్రయత్నము కానోపును. వీరచరితమున అంతకన్నను నాటక శిల్పపు మెఱుఁగులు అభ్యస్తత యగపడుచున్నవి. ఉత్తరచరితమున ఆశిల్పనైపుణి పరాకాష్ఠ పరిదృశ్యమాన మగుచున్నది—అని. కవిసహృదయచక్రవర్తి శ్రీవేదము వేంకటరాయశాస్త్రిలవారి మతమునను ఇదియే వరుస, మాలతీవీరచరితోత్తరములు అని. "ఈకవికి రూపకోచిత పాత్ర్యరచనాపక్కిక మాలతిలో కుదురుపడలేదు. అది వీరచరితములో కుదురుకొన్నది. ఇందులకు మాలతీ తృతీయ సప్తమాంకములలో లవంగికా మదయంతికలు కావించిన ద్రాఘిష్ఠోపన్యాసములే చాలిన నిదర్శనములు. ఇట్టి నిడుద పాత్ర్యములు కడమ రెంటను లేవు. ఇది గాక మాలతిలో కవి తన పెద్దలయుత్కర్షను తన విద్యావిశేషములను విస్తరించి చెప్పినాఁడు. మాలతీమాధవప్రకరణసౌభాగ్యమును గూడ వక్కాణించినాఁడు. కావున మాలతీ మాధవమే యాతని తొలి నాటకము. మఱియా కొఱంత పలుకు లేల యన, అవి యుద్ధతోక్తులే గాని, కొఱంత పలుకులు గావు, అని సర్వజ్ఞసింగమనాయనివారి వాక్కు. "పరాపవాదా త్స్వోత్కర్షోపాధి రుద్ధత ఉచ్యతే. యథా మాలతీమాధవే 'యే నామ.' అత్ర 'జానన్తి తే కిమపి' ఇతి పరాపవాదాత్,

'మమ తు కోఽపి సమానధర్మా' ఇత్యాత్మోత్కర్ష కథనాచ్చ భవభూతే రుద్ధతత్వమ్.'' ఇట్లు గాదందు రేని, ఈయన మాలతికిముందు కొన్ని చిల్లరకవనము లేమేని చేసియుండి వానిని లోకులు మెచ్చనందులకై యీవాక్యముం బల్కియుండవచ్చును. మాలతిచేతఁ గూడ స్ఫుటముగా ఎల్లరను మెప్పింపలేక, శృంగారమున తనకు ప్రజ్ఞ చాల దని యరసికొన్నవాఁడై, ఆరసమును మానుకొని, చాలమిఁ గ్రమ్మకొనుటకై వీరాద్భుతప్రియ త్వోపన్యాస పూర్వకముగా వీరచరితముం దొడంగినాఁడు. "తేనేదం" ఇత్యాది.

లోకులు వీరచరితముంగూడ ఎక్కువగా మెచ్చుకొనలేదు. ఆన్యూనతను "యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" అని ఉ.రా.చ.లో సూచించినాఁడు; అయినను ఆదినుండి తన సారమందు తనకుం గల విశ్వాసము క్రమక్రమముగా ద్రఢిష్ఠ మైనందున ఉ.రా.చ తుదిని—

"తా మేతాం పరిభావయ న్త్వభినయై ర్విన్యస్తరూపాం బుధాః
శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీ మిమాం."

అని తన వాక్కునే సూచించినాఁడు. (ఉ.రా.చ. ఉపోద్ఘాతము, శ్రీ శాస్త్రిలవారిది) ఆంగ్లమునను ఇట్లు సెలవిచ్చియున్నారు. Malati opens with the author's diffidence as to its favourable acceptance by contemporary scholars, which an author feels in publishing his first grand work— "యే నామ కేచి దిహ ..." It cannot be placed after ఉత్తరరామ as Anandaram desires to do, because it does not possess the finish of the latter. Not even after Vira because the latter does not express diffidence but, on the other hand, expresses confidence and assigns the reason for taking up వీర and అద్భుత—

"వశ్యవాచః కవేః ర్వాక్యం సా చ రామాశ్రయా కథా
లబ్ధశ్చ వాక్యనిష్పన్నని ష్పేషనికషో జనః."

.........I think that Malati met with splendid success and భవభూతి shook off in వీర and ఉత్తర his diffidence and contempt of ill natured critics. But changing his subject by love of variety from శృంగార, he exercised his powers in the higher regions of Vira & Karuna, in the latter of which none has approached him as yet. Even Vira

lacks the finish and grandeur of ఉత్తర Besidss, it dramatisœs the earlier part of Rama's life whereas the other deals wlth the later of it. Bhava has alredy passed from the diffidence expressed in Malati to confidence in Vira calling himself a 'వశ్యవాక్.' Now he passes from this confidence expressed in Vira to a bold assertion of his consummate powers in ఉత్తరరామ. --

"పాప్మభ్య శ్చ పునాతు..."

శబ్దబ్రహ్మవిదః కవేః పరిణత ప్రజ్ఞస్య వాణీ మిమాం."

He thus passes through Malati, Vira & Uttara with diffidence, confidence and assertion. Hence I conclude that మాలతి, వీర and ఉత్తర are chronologically in the order mentoned here. '

[మహావీరచరితమున పంచమాంకమున "దౌరాత్మ్యా ద్దరిభిః" ఇత్యాది 46 వ శ్లోకమువఱకు భవభూతిరచితము ఉపలబ్ధమైనది. దాని తరువాతి గ్రంథము దొరకలేదు. ఆశ్లోకముమొదలుకొని పంచమాంక శేషమునకు షష్ఠసప్తమాంకములకును రెండు పాఠము లగపడుచున్నవి. ఒకటి సుబ్రహ్మణ్యకవి రచిత మని చెప్పఁబడుచున్నది. తదితరము భవభూతిదే అని కొందఱు అందురు కాని నిజముగా అదియు శైలింబట్టి ఆతనిది కాదనియే అభిజ్ఞుల మతము. అది వినాయకుఁడను కవిది అన్నారు కొందఱు. ఎవరిదో. భవభూతిగ్రంథము నష్టము. మఱి అది యేమైనదో విశ్వసనీయముగా తెలియ లేదు. సాహిత్యదర్పణమున ప్రథమపరిచ్ఛేదాదియందు రవంత అవిమృష్టవిధేయాంశ దోష మున్నను, ధ్వనిపుష్టి కలిమి ఉత్తమకావ్య మగును అని ఉదాహరింపఁబడినదియు అంతకు పూర్వమే ధ్వనికారానందవర్ధనునిచేతను ఉదాహరింపఁబడినదియు నగు నీ శ్లోకము —

"న్యక్కారో హ్యయ మేవ మే; య దరయ!; స్తత్రా ప్యసౌ తాపసః!

సోఽ ప్యత్రైవ! నిహన్తి రాక్షసకులం! జీవ త్యహో రావణః!

ధిక్ ధిక్ శక్రజితం! ప్రబోధితవతా కిం కుమ్భకర్ణేన వా?

స్వర్గ గ్రామటికా విలుణ్ఠన వృథోచ్ఛూనైః కి మేభి ర్భుజైః?"

అనునది నష్టవీరచరితమందలి భవభూతివాక్యము కాఁగునా? అని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు ఆశంకించినారు. ఏలన దాని యాశయము రామనాటకము..అది పుస్తే

రియో చెప్పఁబడలేదు. శ్లోకముభక్కి భవభూతివాక్యం దలంపించుచున్నదఁట. మఱి రుజువు లేక గ్రహించు టెట్లు?]

౯ - కవి కవన మహిమ

భవభూతి యెంతెంత చదివిన పండితుఁడో కొంత ఉక్తపూర్వము. నాటకములు రచించుట ఆచదువున కంతటికిని దిగిన యూఁటను ఆరూపమున పట్టి పదిలము సేయుట యగు నని తాఁ దలంచెననియు ఉక్తపూర్వమే. (చూ. పుట. 12) మూఁడు నాటకము లందును ఇతివృత్తమును కవి కడునేర్పుతో అల్లుట కనిపట్టఁదగును. నళియ మన్నను హరిశ్చంద్రీయ మన్నను రామాయణ మన్నను, ఆయాకథను ఉన్నదియున్నట్లుగా, అంశములను అవరుసనే పూసలు గ్రుచ్చినట్లు చెప్పికొనుచుం బోవుట అదేమి రచన? అట్లుగాక ఉన్న కథాంశములను ఇతివృత్తము కుటిలము జటిలము పంచసంధినిబద్ధము అగునట్లు రసవంతముగా అల్లి చమత్కరించుట ప్రతిభాకార్యము. "కవినా ప్రబన్ధ ముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతన్త్రేణ భవితవ్యమ్....న హి కవే రితివృత్తమాత్ర నిర్వహణేన కిఞ్చిత్ ప్రయోజనమ్, ఇతిహాసా దేవ తత్సిద్ధేః. రసాదివ్యఞ్జకత్వే ప్రబన్ధస్య చేద మన్య న్ముఖ్యం నిబన్ధనం, యత్ సన్ధీనాం ముఖప్రతిముఖగర్భావమర్శ నిర్వహణాఖ్యానాం తదఙ్గానాం చ ...ఘటనం రసాభివ్యక్త్యపేక్షయా..." అని ధ్వని కారుని ఎచ్చరిక. అట్టి యితివృత్తకౌటిల్యము మూఁడు నాటకములందును చమత్కారము గొల్పుచున్నది శృంగార రసప్రధాన మగు మాలతిలో అరసమునఁ గల సకలసూక్ష్మ ములును మర్మములును కడునేర్పుతో ఆవిష్కరించినాఁడు. అట్లే వీరాద్భుతములను, అవి తనకు ప్రియము లనుచు, వానికి సాటిలేని యాలంబన మగు మహావీరుని రాముం గొని, ఎంతయో చమత్కరించినాఁడు. రామాయణము యుగాలుగా భారత మహాజన ప్రియమగుటచే ఈతని యీయొరవడిని పట్టుకొని లెక్కలేని ప్రసిద్ధరామనాటకములు —

"యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః?"

అనియు,

"స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోషః? స తు గుణగణానా మవగుణః"

అనియు మొదలగు సమాధానములతో పుట్టినవి. అవేవియు. ఎంతశ్లాఘ గన్నను, దీనికి సాటి కాకయేపోయినవి. భాసుఁడును కాళిదాసును నాటకకవులకు అందుకొనరానున్న ను

భవభూతివంటి ప్రతిభాశాలులను ఆకర్షించి తమ్ము మించవలయునన్న యుత్సాహము కలిగించు లక్ష్యభూతులు. కరుణ విప్రలంభములు మధురతమములని ధ్వని లోచన కారాదులు పొగడిరే, వానియందు వారిని మించవలయు నని భవభూతి యుత్తరరామ చరితమును గూర్చి దివ్యముగాఁ బ్రతిష్ఠించి అందు వారిని మించినట్లు "ఉత్తరే రామ చరితే భవభూతి ర్విశిష్యతే" అను పొగడ్తను రసికులవలన ఒడిచికొన్నాఁడు. అవ కాశము సులువు గాని శృంగారమాలతిలోను అది సులువగు వీరచరితోత్తరచరితలం దును ఎక్కువగానే సందుపొంది నదులు నదీసంగమములు కొండలు అరణ్యములు. శ్మశానము సయితము, అద్భుత భయానక బీభత్సములు దోఁప.—హిమాలయమున నైతము అచ్చరలకు అలంకారము సులువగు ధాతుమత్తను, విద్యాధరులకు అనంగ లేఖలకు భూర్జపత్రాలను, వనేచరులకు సురతాలకు ఓషధిప్రదీపములను, కిన్న రాంగనలకు నున్నని జిల్లుమను చల్లని మంచుగడ్డలమీఁద శ్రోణీభారమంథరగతులను, గిరిరాజునకు చమరీవాలముల వీచోపులను, సప్తర్షులు పూజకు కోసికొన్న పద్మాల మిగుళ్ళుగల కొలఁకులను, భవిష్య త్కుమారసంభవ దేశమునకు ఉచితము లని కాఁబోలు, కూర్చుటవంటి—కాళిదాసుని చికిలి నగిష్టీ లేకుండ, రామాయణభారతములం గన్నట్టు మహాగిరులు వనములు నదులు నదీసంగమములంటోలె బ్రహ్మసృష్టియద్భుత మహిమ చిత్తముల హత్తునట్లు, తన కల్పనలు తనవే, తన మార్గము తనదే అన్నట్లు వర్ణించినాఁడు. అట్లే శ్రీ వేదము శాస్త్రులవారును ఆనతిచ్చినారు. "His.........love of the beautiful in Nature is intense and of the grandeur of wild scenery is even romantic, his imagination high, study and understanding of Nature perfect." అని. మాలతిలో—

"అహో సంప్రతి ఇత స్తతః ప్రవర్తమాన కౌణపనికరస్య మహతీ శ్మశాన వాటస్య రౌద్రతా!"

అవి వల్లకాటిని అందలి పీనుఁగులతిండులను ప్రస్తావించి అక్కడి రాత్రిచీకటులు భూతముల సమ్మర్దము వాని పీనుఁగులతిండి, అందులో అలుపులు జగడాలు, పిశాచ ముల యాండ్రు మగలు కూడిన బోనపుబంతి, ఎమ్ముల రాసుల త్రోసికొని పారు నేఱు, అక్కడి కరాళిగుడి, అందలి పూజల గడిబిడి, నరబలియార్పటి-వీని నన్నింటిని, మనసున వెక్కస మగుచునే, సంతస మగునట్లు వినుపెట్టినాఁడు. అట్లేబృహద్ద్రోణీ శైల కాంతారమును సింధునదీ తటప్రపాతమును మధుమతీ సింధు సంభేదమును, అభయంకరారణ్యములో మాలతీవిరహిత మాధవ పర్యటనమును సాటిలేనట్లు చెప్పి

నాఁడు. వీరచరితమునను గోదావరీతీరపు టడవులను ప్రస్రవణగిరిని జనస్థానపంచవట్యాది దండకభాగములను అందు సీతావిరహిత రాముని యుల్లాటమును, హనుమత్ సుగ్రీవవాలి ప్రభృతులగు కోఁతిదొరలను సంపాతిజటాయు గృధ్రరాట్టులను మాల్యవచ్ఛూర్పణఖాది రాక్షసులను నిజరూపములం జూపినాఁడు. అట్లే ఉత్తరచరితమున అంతకన్న ఎక్కువగా భయంకర దండక నానాభాగములు గోదావరీ నదీసంగమములు ప్రస్రవణము క్రౌంచావతము వెదురుపొదల చీకటులు అజగరములు కుంభీనసములు తొండలు ఏనుఁగులు భల్లూకములు మృగములు నెమిళ్ళు-వీని నన్నింటిని భయంకరములనే రసవంతముగా సమకూర్చినాఁడు. అలంకారగ్రంథములందు శృంగారమందలి సాత్త్వీక వ్యభిచారి భావ రహస్యములకును, భయానక బీభత్సములకును ఉదాహరణములు వీనినుండి, విశేషముగా మాలతినుండి, కైకొనంబడినవే.

నాటకమున రసమునకు ప్రకరణమునకు వక్తకు తగినట్లు పదగుంభనము రీతి వృత్తమును మాఱుచుండవలయును. ఈకవి కావించిన అట్టి మార్పుకూర్పులు వ్యాఖ్యలో ఆయాయెడల సూచితములు. ఆతని కాలము —

"ఓజః సమాసభూయస్త్వ మేత ద్గద్యస్య జీవితం
పద్యే ప్యదాక్షిణాత్యానా మిద మేకం పరాయణమ్."

అని దండి చెప్పిన కాలమునకు తరువాతిది. విపంచీ స్వర సుభగమగు వైదర్భీరీతి కాళిదాసుది. అందే అతనికే సమయము వచ్చినపుడు- "వచ్చిపడినది మామీఁద చెంచు దొంగలతుటు మొకటిః" అన్న వక్త్రినోటనే పాద మొక్కటే సమాసముగా మాళ. V .)

తూణీర పట్ట పరిణద్ధ భుజాన్తరాళ మాకర్ణలమ్బి ఘనబర్హి కలాప ధారి
కోదణ్డపాణి నినదత్ ప్రతిరోధకానాం ఆపాతదుష్ప్రసహ మావిరభూ దనీకమ్.

అని యిట్లు దొరలినది! ఇంకను భవభూతి ఎంత విద్వాంసుఁడుః అతనివాక్కు లలితమగుచునే పటువుగా నుండును. "అందందు కటువును" అని కొంద ఱందురు గాని అట్టిది యెంతమాత్రమును గాదు అన్నారు శ్రీవేదము వేంకటరాయశాస్త్రులవారును—

"How can the encounter of మాధవ with అఘోర, the tiger wading in the blood of its victim meet with appropriate description without the use of compounds ?" అని. వీరమున పరశురామాభియోగమును ఉత్తరమున చంద్రలవులసంవాదమును అట్టివే. వీరచరితమున ఆజనక దశరథులను,

వసిష్ఠవిశ్వామిత్రులను శతానందజామదగ్న్యులను వేఱువేఱురకాల వారగుచునే తమకు మఱి సాటిలేనివారిని ఒక్కట చేర్చిన అపరశురామాభియోగగోష్ఠిని, నడుమ సీతా రాములను కలదానిని, వారికిఁ దగిన యామిన్నందిన యంతస్తున ఎట్లు నడిపినాఁడు! దానిని మురారిప్రభృతులు అందఱును అనుకరింపఁ జూచినవారే, ఒక్కరును అందు కొన్నవారు లేరు. ఉత్తరచరితమునను రామసీతలను, పృథ్వీభాగీరథులను, అరుంధతీ లోపాముద్రలను, వననదీదేవతలను, జనక(వసిష్ఠ)వాల్మీకులను దివ్యపురుషుఁడైన శంబూకుని కూర్చి, అతిరసవంతముగ, చూచువారికిని వినువారికిని చదువువారికిని కన్నులు అశ్రువుల తడియని నిముసము లేకుండునట్లు, అంతకంతెను ఎత్తున నడిపినాఁడు.

మఱియు, అట్లే "అః దురాత్మన్ న త్వయం న భవసి" అనియు "అః! రే రే పాప" అనియు కత్తులు దూసికొని "అసి ర్గాత్రం గాత్రం సపదిలవశ స్తే వికిరతు!" అని యొండొరులపై కవిసిన మాధవాఘోరఘంటులజగడమును:

"ద్రాగ్దృష్టోఽపి హర త్యయం మమ మనః సౌన్దర్యసారశ్రియా,
హా న్తవ్య స్తు తథాపి నామ! ధి గహో వీరవ్రతక్రూరతాం!"

అనియు —

"ప్రాదుర్భూయ స్థిత ఇవ జగత్పుణ్య నిర్మాణ రాశిః!"

అనియు తలపోసికొనుచునే పైకొన్న జామదగ్న్యుని గూర్చి శ్రీరాముఁడు సీతతో ప్రశాంతధీరముగా—

"తపసి వితతకీర్తే ర్దర్ప కణ్డూల దోష్ణః
పరిచరణసమర్థో రాఘవః క్షత్రియోఽహమ్."

అని 'నేను ఆయనకు అన్నివిధాల కోరిక తీర్పఁగల సమర్థుఁడను, బ్రాహ్మణ తాపసుఁ డుగా కోరునేని శుశ్రూషయు, వీరుఁడుగా పొగరుదురదగొన్న బాహువులవాఁడుగా దురదతీర్పు కోరునేని ఎదుర్కొని ద్వంద్వమును, ఈఁగలవాఁడనని, జామదగ్న్ని, వసిష్ఠవిశ్వామిత్రులును శతానంద జనకదశరథులును నయాన భయాన ఎన్ని చెప్పినను వినక తాఁకఁగా; జనకుఁడు —

"అయం వినేతా దృప్తానా మేకవీరో జగత్పతిః
వయం వసిష్ఠగారేయాః సర్వే ప్రతిభు వోఽత్ర వః."

అని యందఱిని ఊరకుండుఁడు, చూడుఁడు, మేము పూఁట, రాముఁడు ఆ దృప్తుని

వినయించును అని చెప్పఁగా అస్లే ఆతని దర్పామయమును తుదముట్ట మాన్పి సాదు బాపనిం జేసిన అపరశురామ రఘురాముల జగడమును; అస్లే ఒండొరులఁ జూచుకొన్న మాత్రకే పరిరంభణాభిలాష మొలకెత్తుచున్నను—

"వీరాణాం సమయో హి దారుణరసః స్నేహక్రమం బాధతే"

అనుచునే ఒండొరులఁ బైకొని విజృంభించి శ్రీరామవాక్యమునను ఆయనదర్శనము నను పగ తీఱి భ్రాతృస్నేహమునం బడిన ఆ లవచంద్రకేతుల జగడమును; మూఁడును ముత్తెఱంగులవి ముత్తెఱంగులుగా అద్భుతవీరములు దోఁప నడపినాఁడు.

భవభూతి సొంతముగా అద్భుతకల్పనలను చేయును. రామాయణమున విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు జృంభకాస్త్రములు అనుగ్రహించినట్లు చెప్పఁబడినది. అందు వాని మహిమలు సూచింపఁబడినవి కాని వాని స్వరూపము చెప్పఁబడలేదు. భవభూతి తన ప్రతిభచే "జృంభక" శబ్దార్థమును - ఆవులించునది వికసించునది మొదలగుదానిని - మనసున ఉంచుకొని వానికి రూపకల్పనను మహావీరమునను ఉత్తరచరిత లోను తాను ఎట్లు చేసినాఁడు! మహావీరమున I - ౪౩, ౪౪.

తేజోభి ర్దిశదిశ విశ్వతః ప్రసృప్తై రాదిత్యద్యుతి మపవిధ్య విస్ఫురద్భిః
పర్యాయ త్వరిత గృహీత విప్రముక్తః సామర్థ్యం రచయతి నాయనో మయూఖః.

ఉత్తరచరిత V - ౧౩ (వ్యతికర ఇవ,) ౧౪ (పాతాళోదర.) శ్రీవేదము వేంకటరాయ శాస్త్రులవారి యుపోద్ఘాతమునుండి యీయుద్ధారము చిత్తగింపఁదగును. "భవభూతి ప్రతిభోజ్జ్వలుఁడు గావున వలపినపుడు అపూర్వోపమానములం గల్పించుకొనును. ఉదా—

బాష్పామ్భసా మృగదృశో విమలః కపోలః
ప్రక్షాళ్యతే, సపది రాజత ఏవ యస్మిన్
గణ్డూష పేయ మివ కా న్త్యమృతం పిపాసు
రిన్దు ర్నిశీత మయూఖమృణాళ దణ్డః. మాలతి. VIII - ౫.

ప్రకిరతి శకృత్పిణ్డకా నామ్రమాత్రాన్ ఉ.రా.చ. IV - ౨౩.

దళయతి పరిశుష్య త్రోఢ తాళీ విపాణ్డు
స్తిమిరనికర ముద్య న్నైన్దవః ప్రాక్పరీశః మాలతి VIII - ౧.

ఈతాటియాకే పిమ్మట అల్లసాని పెద్దనగారి దంతపుదువ్వెన యైనది.

"అభినవ కరిద న్తచ్ఛేద కా న్తః కపోలః."

మాలతీవిరహవర్ణన.

శ్రీవేదము వేంకటరాయశాస్త్రులవారి యాయాంగ్లసూక్తులను అవధరింపఁదగును.

"......Bhavabhuti never forces the figures of Rhetoric into his composition for embellishment but they grow up naturally with the sentiment. He is eloquent without effort, concise without falling into obscurity or ambiguity, precise, decided, bold and authoritative. ...............He nowhere uses words for mere show of learning but always has the right word in the right place. His sound always varies and harmonises with the sense and sentiment. (చూ. ఏత ద్వైశస వజ్ర ఘోరపతనమ్ IV - ౨౧) His language is chaste, diction abundant, sympathy with his characters very sincere, insight into human nature profound, insight into human feelings unrivalled ..... Long compounds nowhere disfigure Bhava's verse, but they grace it where proper.........His selection, invention and combination of situations and incidents is wise and happy. He is only second to కాళిదాస as a poet.

భవభూతి నిజముగా గొప్ప రామభక్తుఁడు. (చూ. ప్రాచేతసో మునివృషా-పు.॥) రఘుపతిభక్తియు ప్రాచేతసభక్తియు సమానముగాఁ గలవాఁడు. అతనికి రామాయణము కంఠపాఠము. అట్లు పేరు చెప్పకున్నను. తన తీరుచే కాళిదాసునకు శిష్యుఁడు, గురువును అదిగో అందు మించు టెట్లు ఇదిగో ఇందు మించు టెట్లు అని హితస్పర్ధ లేపిన యుత్సాహము హృదయము నిండి పొరలినవాఁడు. మహావీరమున విశ్వామిత్రు నిచే ఆత్మగతమున—

"ఆస్థేయాని చ తాని తాని జగతాం క్షేమాయ రామాత్మనో
దైత్యారేశ్చరితా; న్యథ ఖలు వ్యగ్రాః ప్రమోదామహే."

అని పలికించినట్లు లక్ష్మీనారాయణులే ఐన సీతారాముల చరితాద్భుతములను హార్దానందముతో ఇట్లు రచించుట పురుషార్థ మను నుత్సాహము వహించినాఁడు.

"యత్ స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్య వా
విరుద్ధం త త్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్.

సా. ద. ३०४

అని యాచార్యులు ఔచిత్యావశ్యతకు శాస్త్రము ఉపదేశించిన, వారికి ఉదాహరణకల్పన కాఁగలయట్లు కైకేయి వృత్తమును వాలివృత్తమును మార్చినాఁడు. తక్కినదియు

ఆనందముగా తన ప్రతిభ ప్రవహింపించిన వగన అల్లినాఁడు. ఈమార్పులు రససాధు నిర్వాహమునకై కేవలము ఈనాటకము మట్టుకే. ఈమార్పు చేయుట రామాయణమున తప్పులు పట్టుటయు దానిని దిద్దుటయు గాదు. కావుననే ఉత్తరచరితమున చిత్రదర్శనాదులలో వాల్మీకివాక్కునే అనుసరించినాఁడు. మఱి యాయుత్తరచరితమునను ఉత్తరకాండ కథ కంటె ఇతివృత్తమునం దోఁచు మార్పులు తద్రస సాధు నిర్వాహమునకు. అంతే. అవియు రామాయణమున తప్పులు పట్టుటయు వానిని దిద్దుటయుం గాదు. ఇది దేవళములో తన యిష్టదైవతమునకు ఈదినము పూలంగిసేవ, ఈదినము ముత్యాలంగిసేవ. ఈదినము రత్నంగిసేవ యన్నట్లు కథను యథాభిమతముగా తీర్చి యానందించుట, "అస్తివా కుత శ్చి దేవంభూతం మహాద్భుతం విచిత్రరమణీయోజ్జ్వలం ప్రకరణమ్" "కలదా ఎందైనను ఇట్టి మహాద్భుతమును విచిత్రరమణీయోజ్జ్వలమును ఐన ప్రకరణము" (మాలతి-X) అని గూఢముగా తన రచించిన మాలతీమాధవప్రకరణమునకు అబ్బురపడినట్లు. "అహో సంవిధానకమ్" అని యీయుత్తరచరితమందును అబ్బురపడి "ఇది పరిణతప్రజ్ఞుని వాణి" యని సంతోషముతో పరామర్శించుకొని తనిసినాఁడు. కాళిదాసు సయితము తన మేఘసందేశమును "శ్రోత్రపేయమ్" అని యనఁడా:

"సందేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయమ్."

మేఘ I - 13

.........అతితృష్ణయా శ్రోతవ్య ఇత్యర్థః.
పేయగ్రహణాత్ సందేశస్య అమృతసామ్యం గమ్యతే."

సంజీవని.

## ౧౦ - ఉత్తరరామచరిత నాటక కథ

ఉత్తరకాండలోని సీతావివాసకథ అందఱు ఎఱింగినదే; సీత భూమిలో అడఁగుటతో ముగియునది. మఱి యీయుత్తరరామచరితకథ, సీతారామ పునఃసంయోగముతో ముగియునది. ఎట్లనఁగా—

ప్రస్తావనలో దేవతానమస్కారానంతరము భవభూతి రచితోత్తరరామచరితము ఇదె ప్రయోగింపఁబడనున్నది—అన్నారు. శ్రీరాములవారికి పట్టాభిషేక మయినది. ఆయుత్సవములు ఎన్నియో నెలలు జరుగుచుండినవి, సీత గర్భము దాల్చి అది నిండఁబోవుచుండెను. ఇంతలో రాములవారి బావ ఋశ్యశృంగముని ఒక గొప్ప ద్వాదశవార్షిక

సత్రము అరంభించెను. ఇక్కడియుత్సవములు పాతవడుచున్నవి. ఆయజ్ఞము క్రొత్త యుత్సవము, దానికి తప్పక పోవలసినది అని కౌసల్యాదిరాజమాతలు వసిష్ఠారుంధతులు తమకు తోడును పెద్దలునుగా అక్కడికి పోయిరి. (అది కొన్నాళ్ళైనది.) తరువాత సుగ్రీవవిభీషణాదులు సెలవుపుచ్చుకొనిరి. అందఱికన్నను కడపట జనకమహారాజు కూడ కూఁతును అల్లుని వీడ్కొని చనెను. నాయన తన్ను విడిచిపోయినందులకు సీత ఖిన్నయై యుండఁగా ఆమెను ఓదార్ప శ్రీరాముఁడు కచ్చేరినుండి వాసగృహమునకు పోయెను. అట్లు ఓదార్చుచుండఁగా ఋశ్యశృంగాశ్రమమునుండి గురుజనము పంపిన సందేశముం జెప్ప అష్టావక్రముని వచ్చెను. సీతకు వీరప్రసవమును దీవించి. ఆమెకు వేవిళ్ళు ఏమి యున్నను తీర్పవలసిన దనియు అన్నివిధాల ప్రజారాధన మగునట్లు రాజ్యము పాలింపవలసినదనియు రామునికి సందేశించినారు. (ఇఁకమీఁదనా వేవిళ్ళు తీర్చుట యని యనుకొనఁగూడదు. ఇన్నాళ్లను అది జరుగుచునే యున్నదని తలంపఁ దగును. ఇప్పుడు సందేశమునను చెప్పఁదగిన మాటగా వారు ఎచ్చరించినారు. అట్లే ఇన్నాళ్లను రాముఁడు ప్రజారాధనపరుఁడుగా నుండలేదని గాదు. ఎప్పుడును ఆవంక పెద్దలు ఎచ్చరించుచుండఁదగు నని ఇపుడు ఈ సందేశము. ఇట్లు సందేశహారులు ఇక్కడికి అక్కడికి తిరుగుచునే యుందురని అనుకొనఁదగును.) ఆమె యేమడిగినను దానిని సంపాదింపను తాను సిద్ధముగా నున్నాననియు, ప్రజారాధనకు దేనినైనను ఒడ్డుదును, సీతనైనను - అని రాముడు జవా బిడెను. అంత అష్టావక్రుఁడు విశ్రమింపఁబోఁగా లక్ష్మణుఁడు వచ్చి, సీతవినోదమునకై తామువ్రాయించినపూర్వరామచరితపుజిత్తరువులుతయారైనవి చూడరండు అనును. అంతట మువ్వురును వానిం జూడఁ బరిక్రమింతురు. వానిం జూచుచుండఁగా బృంభకాస్త్రదాన చిత్రము రాఁగా సీతచే దానికి మ్రొక్కించి ఆయస్త్రములు సీత సంతానమునకు చెందును గాక అని రాముఁడు ఆశీర్వదించును. గంగావతరణచిత్రము రాఁగా అట్లే గంగను చూడఁగానే రాముఁడు 'అమ్మా నీవు కోడలిని సీతను మంచి చూపు చూచుచుండవమ్మా' అని ప్రార్థించును. ఆచిత్తరువులం జూడఁగా సీతకు మరల ఆదండకవనవీథులలో విహరింపను గంగలో స్నానముచేయను కోరిక కలుగును, ఇపుడే దోహదసందేశము విన్నవాఁడు గదా, అపుడే లక్ష్మణుని పోయి సీతను అక్కడికి పిలుచుకొనిపోవుటకు తగిన రథమును ఆయితముచేయింపుమని పంపును. సీతయు అలసి అక్కడ కిటికియొద్ద కూరుచున్న రామునియొడిలోనే నిద్రించును. రాముఁడు ఆ సంతోషమున ఉండును. ఇంతలో నగరజనపదవృత్తాంతముల గనిపట్ట రాముఁడు

పంపిన వేగు, దుర్ముఖుఁడు వచ్చి, రాముఁడు ఒత్తి యడుగఁగా, చెవిలో సీతపై జనులు ఇట్లిట్లు ఆడికలు పలుకుచున్నా రనును. దానికి పిడుగుపడ్డట్లు బాధపడి, రాముఁడు అక్షణముననే ప్రజల మెప్పుకై సీతను అడవికి వివాసము పంపవలసిన దని తీర్మానించుకొని, దానిని సీత వేఁకటి కోరిక తీర్పువ్యాజమున తత్క్షణము నెర వేర్ప వలసినది - ఎదురాడఁగూడదు అని లక్ష్మణునికి దుర్ముఖుని చెవిలో చెప్పి పంపును. ఇట్లు చేయవలసివచ్చినందులకు తాను ఎన్నివిధాలనో దుఃఖించి, తాను ఇఁక నందుండిన ఆమెతో పోవలసివచ్చు నని, ఆమెను తన మీఁదినుండి తొలఁగించి దింపి, ఇంతలో లవ ణాసురుఁడు పెట్టు బాధలు ఓర్వలేని శరణార్థుల యఱపు వినరాఁగా, వానిపైకి శత్రుఘ్నుం బంపుటకు అందుండి పోవుచు, అట్లు ఒంటరిగా సీతను అడవిపాలు చేయవలసివచ్చినందు లకై మిక్కిలి దుఃఖించి, తన వసము గాదని ఇఁక నీకూఁతునకు నీవే దిక్కు అని భూదేవిం బ్రార్థించి అప్పగించి తాను లోపలికి పోవును. ఇంతలో లక్ష్మణుఁడు తేరు తెచ్చినాఁడని మాట యందును. సీత మేల్కొన్నట్టిది దానిని ఎక్కం బోవును.

[తానును సీతయు అట్లు అన్యోన్య విస్రంభముగలిగి యుండిరే, ప్రజారాధనకై సీతనైన విడుచుటకును తనకు వ్యథ లేదనఁగా సీత అది మెచ్చి "అందువలననే ఆర్యపుత్రుఁడు రఘువంశధురంధరుఁడు" అని ఇప్పుడే యభినందించియుండెనే, మఱి ఇపుడు రాముఁడు ఈ సడిమాటను సీతకు స్వయముగా చెప్పి సులువుగానే ఇయ్యకొనఁ గల యామెను ఇయ్యకొల్పి అడవిపాలు చేసియుండరాదా, అంతట అట (సాగక) చాలవఱకు ప్రతిబద్ధమై పోయియుండునే — అని యడుగఁదగును. ఈ చోద్యమునకు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు ఇట్లు సమాధాన మానతిచ్చినారు, (చూ. ఉ. రా చ. ఉపో. పు. 40) "అట్లు వ్యాజమునం బంపుట - ఆయపవాదమును చాకలివాడలోని చాకి పీనపుఁగూఁతను మొగమునం బలికి బందిగా అపరమవినీతను పతిదేవతను జగ న్మంగళమూర్తిని త్రైలోక్యనాథునిరాణిని బలాత్కారమునఁ బంపించు ఘోరతను తప్పించుకొనుటకు అని యెఱుంగఁదగును" అని.]

లక్ష్మణుఁడు సీతను అడవిలో గంగయొద్దున వాల్మీకితపోవనసమీపమున విడిచిపోయెను. తన్నేల ఇట్లు అడవిలో త్రోసెనో సీతకు తెలియదు. తనకు ప్రసవ వేదనలు పొడమినవి. ఓర్వరాకున్నవి. ఘాతుకమృగములు చుట్టుకొన్నవి, తన్ను కఱచి తినునోఏమో! అపుడు ఆదశను ఓర్చుకొనలేక చావుకు తెగి ఆమె గంగలోపడినది. [అంతట గంగాపృథ్వులు సీతను కాపాడి కాన్పుచేసి పాతాళమున ఉంచుకొని యుండిరి.]

కొన్ని యేండ్లకు భాగీరథి అమర బిడ్డల నిరువురిని తల్లిపాలువిడిచిన పాపలను వాల్మీకికి ఇచ్చి వారి పేరులు కుశలవులనియు వారికి జన్మతోనే జృంభకములు సిద్ధించి యున్నవనియును - ఇంకను ఏమేమో - చెప్పి ఒప్పగించి పోయినది. వాల్మీకియు హర్షించి దాది పనులుమొదలు వారికి అన్నియు తానే చేయుచు పెంచి చౌడమును ఉపనయనమును కాలమున చేసి, అన్ని విద్యలను వేదములను నేర్పెను.

ఇట్లుండ నొకనాఁడు వాల్మీకి మాధ్యాహ్నికమునకై తమసకు పోయెను. అపుడు ఆయనకన్నుల యెదుటనే బోయ యొకఁడు కలయికలోనున్న క్రౌంచములలో మగదానిని చంపెను. అంతట జాలిగొని వానిమీఁదికోపమున మహర్షి తిట్టిన తిట్టు ఒక యనుష్టుపు ఛందస్సున కుదురుకొనెను. దానిని తలపోసికొనుచు ఆశ్చర్యపడుచున్న ఆయనకు బ్రహ్మ ప్రత్యక్షమై "నీకు వాగ్బ్రహ్మ ప్రబుద్ధమైనది. బళి! రామచరితమును చెప్పుము. నీప్రతిభకు అగోచర ముండదు. ఆదికవి వగుదువు." అని మెచ్చి యను గ్రహించి మాయమయ్యెను. వాల్మీకియు రామాయణము రచించి కుశలవులకు నేర్పు చుండెను.

సీత అడవిపాలై పండ్రెండేండ్లయినది. ఋశ్యశృంగులసత్రము ముగిసి పోయినది. అరుంధతి కౌసల్యలు సీతలేని యయోధ్యకు రాము రాము అనిరి. అంతట వసిష్ఠుఁడు. 'సరి, మనము వాల్మీకి యాశ్రమమునకుం బోవుదము' అన్నాఁడు. అంద ఱును అక్కడికి చేరినారు.

శ్రీరాముఁడు బంగారు సీతాప్రతిమ చేయించుకొని అదిపత్నిగా అశ్వమేధము దొడంగి యజ్ఞాశ్వమును లక్ష్మణకుమారుని చంద్రకేతువును సేనతోకూడ దానికి రక్ష కుఁడుగా నియమించి వదలెను, ఇంతలో ఒక బ్రాహ్మణుఁడు మృతపుత్త్రుని ఎత్తుకొని రాముని హజారమునకు వచ్చి రొమ్ముబాదుకొనఁజొచ్చెను. అందులకు రాముఁడు తన యపచారమే ఏమేనియుండునా అని ఆరసికొనుచుండఁగా అశరీరవాక్కు "శూద్రుఁ డొకఁడు శంబూకుడనువాఁడు ఎందో తపస్సుచేయుచున్నాఁడు. వాని తలఁ గొట్టిన ఈబాలుఁడు బ్రదుకును" అని వినిపించెను. అంతట పుష్పకమెక్కి రాముడు అతని వెదక వెడలెను—[అని యీవాల్మీక్యాశ్రమాయోధ్యావృత్తాంత మంతయు అక్కడినుండి అగస్త్యాశ్రమమునకు బయలుదేఱి దారిలో పంచవటికి చేరిన తాపసి ఆత్రేయి అచటి వన దేవతకు వాసంతికి చెప్పినది.]

శ్రీరాముఁడు శంబూకుం జేరి తనకు చేయి అడకున్నను, ఎట్లో వాని తలఁ గొట్టెను. వాఁడు ఒక దివ్యపురుషుఁడై రామస్తోత్రము చేయుచు అన్ని యామడల యయోధ్య నుండి దండకకు వచ్చి తన కట్లు దర్శనమొసంగుట నిజముగా తన తపః ఫలము అని ధన్యవాదము బలుకును. ఏమీ! ఇది దండకయా! అని రాముఁడు అంతట కలయఁజూచి అక్కడి ప్రదేశములను ఆనవాలుపట్టుచు, అచట మున్ను తనతో కూడ నుండెనుగదా సీత అని తలఁచుకొని, మిక్కిలి దుఃఖింపఁదొడంగెను. ఎట్లో సమాళించు కొని శంబూకునికి వైరాజములకుం బోవ అనుజ్ఞ యిచ్చెను. వాఁడును అగస్త్యదర్శనము చేసికొని పోయెద నని చని ఆయనను దర్శించి రాముని రాకను కూడ చెప్పి మరలివచ్చి. లోపాముద్రాగస్త్యుల యాహ్వానమును రామునికి నివేదించి, దారి చూపి, తాఁబోవును. రాముఁడు ఇట నొంటరిగా ఏడ్చుచున్నవాఁడు "వారింగాంచి మరల వత్తును. ఇక్కడ అన్నిటిని తనివితీఱ చూచుటకు" అని పంచవటిని అప్పటికి వీడ్కొని అట్లు అగస్త్యా శ్రమమునకు పోయెను.

శ్రీరాముఁడు అచట లోపాముద్రాగస్త్యుల దర్శించి వారి యాశీస్సులం బొందెను. "సీతావియోగదుఃఖమున ఇట్లు చిక్కిపోయియున్నాఁడే! దారిలో సీతా సహవాస సాక్షి ప్రదేశములం జూడక మానఁడు; అప్పుడు ఆ దుఃఖాన ఏమి యపా యము చెందునో!" అని దిగులుపడి లోపాముద్ర గోదావరికి మురళనదిచే చెప్పి పంపినది - 'అమ్మా, రాముని కనుపెట్టియుండి ఆయనకు మూర్ఛవచ్చునపుడెల్ల నీచల్లగాలులఁ దేర్పవమ్మా' అని.

అపుడు భాగీరథికదా సీతకు కాన్పుచేసినది. అప్పటినుండి సీత భాగీరథియింట నున్నది. ఇపు డామెయు రామునిఁగూర్చి యిట్లే దిగులుపడి సీతనే తమసను తోడు పెట్టి, వారికి వనదేవతలకు సైతం మగపడకుండునట్లు తిరస్కరిణి అనుగ్రహించి, ఏదియో గృహాచారము అనుష్ఠించుటకు అని నెపముచెప్పి, సీతస్పర్శ రామునికి మూర్ఛలు తీర్చుగాక అని ఎంచుకొని గోదావరికడకు తోడ్కొనివచ్చినది. సీత గోదావరినుండి వచ్చి సూర్యపూజకై పూలుకోసికొనుచుండును.

అపుడే రాముఁడును అగస్త్యుని వీడ్కొని మరలుచు పంచవటిలో పుష్పక మును దిగెను. ఆయన రాజధర్మానుష్ఠానవశమున గదా అటు వచ్చుట యని సీత అనుకొనెను. ఆయనం జూచినది. గుర్తు తెలియక చిక్కి పాలియున్నాఁడు. సీత చూచి దిగులుపడి మూర్ఛిల్లి తమస తేర్పఁగా ఆశ్వసిల్లినది.

రామునికి అక్కడి చెట్లు మృగములు సైతము ప్రాతబంధువులు. అవి పూర్వము తాను సీతం గూడియున్న చోట్లు. వానిం జూడఁగానే రామునికి హా సీత అని మూర్ఛ వచ్చినది.

అంతట తమస చెప్పఁగా, ఏమైన కానీ అని సీత తాను రాము దెందానం దాఁకినది. రాముఁడు ఆహ్లాదముతో ఉచ్ఛ్వసిల్లినాఁడు. తన్ను సీత తాఁకినట్లున్నదే అని ఊహించి తలపోసికొన్నాఁడు. సీతయు తనకు అదియే ఎంతో అని ఓసరిల్లినది. 'హా ప్రాణేశ్వరీ' అన్నాఁడు. సీతకు కనికరము తోఁచుచున్నది. రాముఁడు మఱి యామె అగపడలేదే అనుకొన్నాఁడు. అది విని సీత తనకు బ్రదుకు ప్రియమే అనుకొన్నది. ఇంతలో వాసంతి సీత పెంచిన గున్నయేనుఁగును పెంటితో మదుఁగున విహరించుచున్నదానిని మత్త గజ మొకటి పైకొన్నదే ఎట్లబ్బా అని యఱచినది. రాముఁడు విని దానిని దండింప లేచినాఁడు. వాసంతి చూచి కలసికొని జటాయుశిఖరమునకు దక్షిణమున సీతరేవుకు గున్నకడకు దారి చూపును. సీతయు వాసంతిని చూచి అనుగమించును. ఇంతలో ఏనుఁగుల జగడాన సీతగున్న గెలిచినది. అది కాంతకు ఉపచారములు చేయుచుండినది. సంతోషించి వానికి రాముఁడు ఆశీర్వాదము పలుకును. సీతయు. ఈ యేనుఁగు గున్నం గాంచి, ఇప్పటికి వా రెట్లున్నారో అని సీత తన బిడ్డలం దలఁచుకొనును. 'ఆర్యపుత్త్రుఁడు వారిని ముద్దుగొనఁడాయెనే!' అనుచునే వారి స్మరణకు ఆయన సన్నిధికి తనకు చన్నులుచేపి తాను క్షణము సంసారిణి నైతి ననుకొనును. ఇంకను అక్కడ సీత పెంచిన నెమలిని కడిమిని అరఁటివనమును లేళ్ళ కదుపును చూచి రాముఁడు ఓపక మిక్కిలి యేడ్చుచు నొక్కట గూర్చుండును. వాసంతి దానిం జూచుచు సీతను తలఁచు కొనును. సీత తన చూపును రామునందు నాటివేసినది. వాసంతి రాముని అడుగును. "సీతను ఏమేమో ఇచ్చకము లాడియాడి ఇట్లు అడవిపాలు చేసితివే, లోకులు ఒప్పరే దని, దీన నీకు అయశమే కదా కలిగినది. నీవెంత కఠోరుఁడవు" అని. 'సీత ఏమై యుండునో చెప్పఁగలవా' అనును. 'ఏ మగును! ఆమెను ఏ రాక్షసుఁడో ఏ పులియో నమలివేసియుండును! అంతే.' అని మఱియు వావిచ్చి యేడ్చును. వాసంతి 'గతమునకు తాల్మి వహింపు' మనును. 'సీత పోయి పండ్రెండేండ్లయినది. రాముఁడును పోయినాఁ డన్న మాట కలుగదాయెనే, నాది ఎంత తాల్మి!' అనును. ఆ మాటలకు సీత మూర్ఛ యగును. రాముని శోకమును వినోదింప వాసంతి అక్కడి తీఁగెయిల్లు చూపి దాని వృత్తాంతమును స్మరింపఁజేయును. రాముఁడు సీతను తలఁచుకొని మరల మూర్ఛిల్లును.

దానిం జూచి సీతయు మూర్ఛిల్లి తమస తేర్పఁగా తేఱును. ఆమెను తమస రాముని మరల తాఁకి తేర్పు మనును. తాఁకినది. మఱి యిప్పటి సాత్త్వికోదయముచేత సీత చేయి చెమర్చి వణఁకి వసము తప్పినది. రాముఁడు ఉచ్ఛ్వసిల్లి తాఁకుడు ఆప్యాయముగా అంటియే యుండఁగా, సీత చేతిని పట్టుకొని వాసంతితో ఇదిగో సీత దొరకినది అన్నాఁడు. వాసంతి కేమో అచట వట్టి బయలే. ఆమెకు సీత అగపడదు. ఆమె అది రాముని ఉన్మాదోక్తి అనును. కాదనుచు తనకు జాఱిపోవుచున్న సీత చేతిని రాముఁడు వాసంతిచేత నిడంబోవును. అసందున సీత చేతిని లాఁగివైచుకొనును. 'అయ్యో సీతా, నన్ను విడనాడకే' అనును రాముఁడు. తనకు నిజముగా ఉన్మాదమే అని వాసంతి యనుకొనును. సంగతి మార్చుటకై వాసంతి 'వీఁడుగో ఉక్కుతేరున రావణుఁడు. జటాయువుం జంపి సీతను కొనిపోవుచున్నాఁ'డని యఱచును. సీత అప్పుడు అట్లు తన్ను నిజముగా కొనిపోవుచున్నట్లే భ్రమించి 'ఆర్యపుత్త్రా కావుము' అని అఱచును. రాముఁడు 'నిలు నిలురా' అని లేచును. అంతట అంతయు భ్రమ యని కనుగొనును. రాముఁడు వాసంతితో తా నిఁక అయోధ్యకు మరలి బంగరు సీతనైన చూచుచు వినోదించు కొందును అనును. అది విని, ఊరడిల్లి, సీత తనకు పరిత్యాగశల్యము తివిచివైవబడినది అనును. రాముఁడు విమానమునం గదలును. సీతయు. వాసంతీతమసలు వారికి దేవతలు పెద్దలు పునఃసంయోగముం గూర్తురుగాక అని ఆశంస పలుకుదురు. రామునికి దాని వాల్మీకి యాశ్రమము మీఁదుగా.

వసిష్ఠారుంధతీకౌసల్యాదులు వాల్మీకియాశ్రమము చెంతకు చేరినారుఁగదా. అక్కడికే జనకమహారాజు సీత దుర్దైవచేష్ట విన్నది మొదలు ఓర్వరాని దుఃఖము పాలై, చంద్రద్వీపమున ఇన్నాళ్ళును తపస్సులచేతను నియమములచేతను దేహమును ఎండించుకొనుచున్నవాఁడు తన పురాణమిత్త్రుని వాల్మీకిం జూడ వచ్చును. చంద్రకేతువును యజ్ఞాశ్వమువెంట అప్పటికి ఆచెంతకే చేరును. ఆశ్రమాన అతిథిసంతర్పణపనులు జరుగుచున్నవి. బడిబాలురకు ఆఁటవిడుపు. వసిష్ఠుఁడు కౌసల్యను ముందుగా పోయి జనకుని చూడుమని చెప్పి పంపును. అట్లే అరుంధతి తోడుగా కౌసల్యపోయి చూచును. జనకుఁడు రామునిపై చాల కోపము చూపును. అరుంధతి సముదాయించును. అపుడు అచటికి లవుఁడు తోడి వటుమిత్త్రులతో ఆడుకొనుచు వచ్చి చూపుమారాన అగపడఁగానే కౌసల్యాజనకులు వానిం బిలిపింతురు. వచ్చినవానిం జూచి వానియందు సీతారాముల పోలికలు తలపోసికొందురు. అబ్బాయిని అడిగిన వాఁ డేమియు సరిగా చెప్పలేక పోవును. అరుంధతి తాను నిజ మెఱిఁగినను అది సమయము గాదు అని చెప్పదు.

లవుఁడు తాను వాల్మీకివాఁడననియు, తనకు కుశుఁడని అన్న యున్నాఁ డనియు అతఁడు వాల్మీకి రచించిన యుత్తరరామచరిత నాటకమును అప్సరసలచే ఆఁడింపు మని ఆయన భరతమునికి పంపఁగా ఆకొనిపోవువారికి దారితోడుగా విల్లుఁదాల్చి పోయినాఁడనియు అనును. జనకాదులును వారి సంగతిని తెలిసికొనుటకు వాల్మీకికడకు పోవ నిష్క్రమింతురు. లవుఁడు అది మేధ్యాశ్వ మని గ్రహించి, దాని రక్షకుల వీరఘోషణాక్షరములకు 'రగిలి' దానిం బట్టును. రక్షులు కత్తులు ఝళిపింపఁ జూచి వటువులు పరారి యగుదురు. లవుఁడు విల్లెక్కువెట్టి నిలుచును.

ఒంటరి లవునికిని వేలసేనకును యుద్ధము. లవుని ధాకకు సేన తాళలేకపోఁగా, కొందఱు పోయి సాయమునకు చంద్రకేతుం దెత్తురు. సుమంత్రసారథిక రథమున చంద్రకేతువు వచ్చి సేనను నుఱుమాడుచున్న యాయేకవీరుని బాలుని జూచి ఆశ్చర్యపడును. లవుఁడును జృంభకమున సేనను మ్రాన్పఱిచి, తన్ను చీరిన చంద్రకేతు నెదుర్కొనును. ఆయిరువురికి ఒండొరులపై ప్రేమ కలుగునే కాని యుద్ధోత్సాహము డిందును. వారి మాటల యుత్తరోత్తరాలలో లవుఁడు రాముని నయితము తూలనాడఁగా చంద్రకేతునికి కోపము రేఁగి, లవునికిని రేఁగఁగా, ఇరువురు ఒండొరులపై దివ్యాస్త్రములు ప్రయోగించుకొనుచుందురు.

ఇంతలో రాముఁడు వారిని పోరు మానుఁడనుచు వారి నడుమనే దిగును. చంద్రకేతువు రామునికి నమస్కరించి లవుఁడు తన చెలికాఁడని అతనిఁ దన్నుంబోలెనే ప్రేమింపు మని చూపును. లవుఁడు ఆయన శ్రీరాముఁ డని ఎఱిఁగి, ఆ ప్రశాంత గంభీరాకారము తన్ను వంప, ఆయనకు ప్రణమిల్లును. రాముఁడు నిర్వ్యాజస్నేహముతో ఆతని కౌఁగిలించుకొనును. ఆతనికి జృంభకాస్త్రము స్వతఃప్రకాశమనఁగా ఆ వాల్మీకిశిష్యునికి అది యేపుణ్యఫలమో అని యనుకొనును. రాముని మాటచే లవుఁడు అస్త్రమును ఉపసంహరించును. రాముఁడు చంద్రకేతుని సేనం దేర్పఁ బంపి వేయును. ఇంతలో కుశుఁడును లవుని వెదకికొనుచు అక్కడికి వచ్చును. అతని గొంతు విన్నందులకే రామునికి దేహము పులకరించును. అన్నతో లవుఁడు చంద్రకేతు స్నేహముచే తమకు రాముఁడు ధర్మముచే నాయన యని చెప్పి, ఆయనకు ఇతఁడు నాకు అమదయన్న యని ఆతనిఁ జూపును. కుశుఁడును రాముని యనుభావము తన్ను వంపఁగా నాయనా అని ఆయనకు నమస్కరించును. రాముఁడు ఆతనిం గౌఁగిలించుకొని తన కొడుకులనే తాఁకినట్లు మనసున మేరలేని యానందము

పొందును. వారు ఎండకు ఒక మద్దిసీడలో కూర్చుందురు. రాముఁడు వారిలో సామ్రాజ్యలక్షణములు, తన పోలిక, సీత పోలిక, వారు వాల్మీకి యాశ్రమము చెంత నుండుట, వారిం జూడఁగా తన యాత్మ యట్లు సుఖించుట, చిత్రదర్శన మప్పటి తన జృంభకాలమాట ఫలించియుండఁగూడదా అనుకొనుట, అపుడు సీత కడుపున అమర లున్నారని తాను తడవి కనిపట్టి యుండుట, ఇదంతయు తలపోసికొని వీరు సీత కొడుకు లగుదురా అనుకొనుచు రాముఁడు ఏడ్చును. కుశుఁడు లవునితో సీతా వియోగమున ఆయనకు ఏడుపు రాకుండునా అనును. అట్లు పరాయి అయినట్లు సీత యని వాఁడు పేరు చెప్పుటచే, వారు సీతవారు కారు అని తోఁచెను. వారిని తాము వల్లెవేసిన రామాయణమును చెప్పుమని, వారు తమ పూర్వపు చిత్రకూట వనవిహారాది ప్రకరణముఁ జెప్పఁగా విని రాముఁడు అ స్మృతిచే దుఃఖాన స్తంభితుఁడగును. ఇంతలో జనకకౌసల్యాదులు బాలుర జగడమునుమాన్ప వేడి దారిలో పడుచు లేచుచు వచ్చుచు ఉన్నారన్న మాట వినఁబడును. ఆ బాలురం గూడియే రాముఁడు వారిం గలసికొని తేర్పఁ బోవును.

తరువాత వాల్మీకి అ తన యాటను ఆడింపను భాగిరథీతీరమున స్థాన మేర్పఱచి విజతపోబలముచే అచటికి రావించిన సకల స్థావర జంగమ భూతములయు అయోధ్యా పౌరజానపదులయు రామాదులయు నెదుర ప్రయోగింపించును. ఆదిలోనే ఆ వాల్మీకి భారతి అంతయు నిజము, నమ్మదగినది అని ఎచ్చరింపఁబడును. అందులో కథ సీత భయవేదనలతో గంగలో పడుట, అందుకాన్పు, కుశలవ జననము, అంపు భాగిరథీ పృథ్వులు పనివడుట, జృంభకావిర్భావము, సీత శిశు స్తన్యత్యాగము వఱకు భాగిరథికడ నుండుట. తరువాత 'నీయిచ్చ' అని పృథ్వి అనుటయు చూపఁబడును. దాన ఆ కుశ లవులే తనకొడుకులు అని రాముఁడు నిశ్చయించుకొనును. అయ్యో! మఱి సీత భూమిలో లయమొందెనా యని రాముఁడు మూర్ఛిల్లును. అప్పుడు భాగిరథిలో నీళ్ళు చిలికినట్లు కాఁగా, ఆందుండి లేచి భాగిరథీపృథ్వులు సీతనుతెచ్చి అరుంధతికి అప్ప గించి, తాము చిత్రప్రదర్శనమునను వివాసనమునను తమ రాజా రాముఁడు చేసిన యా యుత్తరువు మేరకు సీతను కాచి తమ యప్పు తీర్చుకొన్నామనిచెప్పి అంతర్ధాన మగుదురు. అరుంధతి మాటలచే ఆ కూడియున్న త్రిలోకవాసులు సీతశుద్ధిని అంగీక రించి ఆమెకు నమస్కరింతురు. వాల్మీకియు కుశలవులను తల్లిదండ్రులకు అప్ప గించును. అప్పుడే మధురనుండి లవణాసురుం జంపి మధుర నేలుచున్న శత్రుఘ్నుఁడును వచ్చి రాముం కలసికొనును. అట్లు అందఱును ఇఁక రాముఁడు తన సీతంగూడియే యజ్ఞదీక్షితుఁడు కాఁదగునని అక్కడ ఒక్కట సంతోషసముద్రమున ఓలలాడుదురు.

## ౧౧ - ఉత్తరకాండము - ఉత్తరరామచరితము

ఉత్తరకాండకథ యెఱిఁగినవారికి భవభూతి ఇందు కావించిన మార్పులు చెప్పకయ తెలియఁగలవు. అందు జననిందవలని సీతావివాసనమునకు అనంతరము శత్రుఘ్నుఁడు లవణునిమీఁదికి పోవును. దారిలో వాల్మీకియాశ్రమమున మజిలీచేసినదినము ఆట సీతకు కాన్పు ఐనది, తరువాత పంద్రెండేండ్లు అతఁడు మధురలో రాజుగా నుండి, అంతట రాముం జూడవచ్చును. తరువాత కొన్ని నెలలకు, చచ్చిన బ్రాహ్మణ బాలుని బ్రదికింప రాముఁడు శంబూకుని చంపుట. తరువాత అగస్త్యులవారిని దర్శించి నగరమునకు మరలి అశ్వమేధమున కుపక్రమించుట. గుఱ్ఱముతో లక్ష్మణుఁడు పోయి ఎల్లరవలన కట్నములు గొనివచ్చుట. యజ్ఞము. అపుడు కుశలవులు వచ్చి యజ్ఞవాటమున రామాయణముం బాడుదురు. వారు తన కొడుకులని రాముఁడు శంకించును. వాల్మీకి వచ్చి అవునని చెప్పి, సీతను పతివ్రతను అంగీకరింపుమనును. ఆమె లోకానకు తన శుద్ధిని రుజువుచే తెలిపిన అట్లే అంగీకరింతును అనును. సీత పరమమనస్విని ఒట్టులువెట్టి అట్లు రుజువుచూపి తాను మఱి రాముం గూడక భూమిలో అడంగి పోవును.

1. భాగిరథీతీర వనభూముల చూడఁగోరిన దోహదము తీర్చు నెపముననే రెంటను ఆడికకైన నివాసము. ఐనను సీతకు ఆకోరిక కలుగుటకు భవభూతి ఆచిత్రదర్శనమును అతిమనోహరముగా కూర్చినాఁడు. శుభసంయోగాంతముగా ముగింపనెంచిన తన నాటకాన అందు ప్రస్తావవశాన వచ్చిన జృంభకదానమును భాగీరథి ప్రార్థనయు తరువాత కొమాళ్ళప్రత్యభిజ్ఞానమునకును దిక్కులేని సీతయపేక్షణమునకుమ ఉపయోగించినాఁడు, మఱియు చిత్రదర్శనమున పూర్వవియోగప్రతిమలఁ జూచి ఆ స్మరణచే చిత్తాన ఇరువురును వియోగదుఃఖమానతను దుర్నిమిత్తముంబోలె అనుభవించుటం జెప్పినాఁడు.

2. భవభూతినాటకాన ముఖ్యమైన మార్పు సీతాపునఃసంయోగము. కవి దానికి తగినట్లు కథను మార్చి పంద్రెండేండ్లకు తర్వాత ఒక్క దినముననే బ్రాహ్మణబాలమృతిని శంబూకవధను అగస్త్యదర్శనమును రాముని పంచవటి మజిలీని అందు 'అహోసంవిధానమ్!' అని తాను అబ్బురపడిన ఆతమసా సీతావాసంతీరాముల కరుణోత్తర సమాగమమును ప్రాఁతక్రొత్తల నిపుణముగా పెనచి యల్లినాఁడు. వాల్మీకాశ్రమమున ఆసమయముననే ఆవసిష్ఠారుంధతీ కౌసల్యాజనకుల సమాగమమును

వారియేద్పులును ఆశలును భవభూతియద్భుత నవీనసృష్టియే. యజ్ఞాశ్వము, బాలుర పోరు, ఆదారిలోనే రాముఁడు ఆదినమే కొమాళ్ళం గలసికొని వారిని ఆనవాలు పట్టఁబోయి పట్టఁజాలక తికమకపడుట, వాల్మీకియాట. జనులు సీతశుద్ధిని మహిమను ప్రత్యక్షముగా చూచి తృప్తిపడుట. కుశలవులతోడి సీత పెద్దలయెదుట మరల రాముం గూడుట.

౧౨ - పునఃసంయోగము భవభూత్యుపజ్ఞకమా?

ఈ పునఃసంయోగము కేవలము భవభూతికల్పితమా? పాద్మపురాణపాతాళఖండమున వివాసమునకు పదునాల్గేండ్లయనంతరము యజ్ఞాశ్వమును భరతునికొడుకు పుష్కలుఁడు రక్షకుఁడుగా అనుసరించును. లవుఁడు తొలుత పరాక్రమించినను తరువాత పుష్కలునికి పట్టువడును. అనంతరము కుశుఁడు వచ్చి లవుని విడిపించి సేనను ఓడించి నాయకుల బందిగొనును. అంతట సీత చెప్పి అందఱిని విడిపించును. యజ్ఞము యథావిధిగా ముగియును. రాముఁడు వాల్మీకివలన ఆబాలుర తన కొడుకులని ఎఱింగి, సీతను పిలిపించి, వాల్మీకిశత్రుఘ్నప్రభృతులసాక్ష్యములచే ప్రజలను పౌరజానపదులను నిజశుద్ధిని నమ్మించిన సీతను రాముఁడు అంగీకరించును. అట్లే జైమినిభారతమునను ఉత్తరరామచరితము సీతాపునఃసంయోగాంతముగా చెప్పఁబడియున్నది. యజాశ్వముతో రక్షకుఁడుగా శత్రుఘ్నుఁడు పంపఁబడును. లవుఁడు గుఱ్ఱమును బట్టఁగా వానిని ఓర్చి తన రథమున నిడుకొని శత్రుఘ్నుఁడు పోవుచుండఁగా, ఆ వృత్తము విని కుశుఁడు వచ్చి, తాఁకి, శత్రుఘ్ను నోడించి, లవుం గలసికొనును. తరువాత రాముఁడు లక్ష్మణుని, అతఁడును పడఁగా, భరతునిఁ, బంపి, అతఁడును పడఁగా, తాను స్వయముగా వచ్చి బాలురతో పోరి మూర్ఛపాలగును. అంతవఱకు ఎక్కడికో పోయియున్న వాల్మీకి వచ్చి వృత్త మెఱిఁగి, రామలక్ష్మణభరతులఁ దేర్చి, రామునికి కుశలవులం దెలిపి సీతతోఁగూడ అప్పగించును. తరువాత యజ్ఞము. తరువాత చిరకాలము రాముఁడు సీతాసుతులం గూడి కుటుంబసౌఖ్యము లనుభవించుచు వేలయేండ్లు రామరాజ్యప్రసిద్ధి లోకాన మాయక ఆచంద్రతారకముగా నిలుచునట్లు రాజ్యమేలును.

ఈ కథల పౌర్వాపర్యమును నిశ్చయించుట చాలఁగష్టము. పాద్మము ఏభాగమును ఎప్పుడు ఎవరు వ్రాసి చొనిపిరో అను సందేహములకు ఆస్పదము. అందు శాకుంతలము కాళిదాసశాకుంతలమునందలి దుర్వాసఃశాపము, ఉంగరము, అది జాఱిపడిపోవుట,

రాజుమఱపు; శకుంతల పురోహితువెంట బోవుట; ఆమెను మేనక మింట గొనిపోవుట, ఉంగరము జాలరికి చేపకడుపులో దొరకుట, జాలరి, నాగరకోద్యోగులు, ఉంగరము రాజుచేతికి వచ్చుట, జ్ఞప్తివలన పశ్చాత్తాపదుఃఖము. అంతట దుష్యంతుఁడు ఇంద్రునికి సాయమునకుపోవుట, మరలుచో హేమకూటమున మారీచాశ్రమమున భరతశకుంతలలం గలపికొనుట - అని ఆమహాకవికి, మెప్పుగూర్చిన సకలసంవిధానముతో సంకలితమై యున్నది.

ఇందు దొంగ యెవరు దొర యెవరు, పురాణమా కాళిదాసా? పెక్కు కారణ ముల నుపన్యసించి వివేకులు విమర్శకులు పురాణమే దొంగ, దొర కాళిదాసే యని తీర్మానించిరి, ఈయుత్తరచరితవిషయముననుఅట్లే తలంపఁదగును. ఎవరో పురాణ భాషా శ్లోకములు అల్లి, ఈ కీర్తివంతములగు నాటకముల కథలలో ఇంచుక ఏదేని మార్పుచూపి వానిని పురాణమున ఎక్కించియుండఁబోలును, ఆ మార్పుచేత పురాణ మన్న పేరు రాఁబట్టి, తదుక్తమే మూలము, అలంతిమార్పులతో నాటకకవియే దానిని తాను స్వీకరించినాఁడు అను వాడుక లోకమున వ్యాపించునుగాక యని. జైమినిభారతో క్తము ఒకవేళ విశ్వసనీయ మగునేమో. అదియు అర్షమన్న పేరు పేరుననే కలిగి యున్నది. అందు చాలగ్రంథము నష్టమై ఆభారతము ఇంచుకే దొరకియున్నదని పెద్దల మాట. అందు కథలను ప్రక్షేపించుటయే కలుగునేని, భారతనష్టము సకలముం బూరింపఁ బనివడరా?

ఐనను ఉత్తరరామకథను శుభసంయోగాంతముగా భవభూతికి ముందే దిఙ్నాగ మహాకవి కుందమాలయను నాటకముగా రచించియున్నాఁడు. కుందమాలనుండి యుదాహరణములు ప్రాచీనాలంకారగ్రంథములలో నున్నవి, కాని ఆనాటకము ఎక్కడ నేమైనదో దొరకకయే పోయినది. దొరకియున్న ఉత్తరరామచరితంగూర్చి తమవ్యాఖ్యా గ్రంథములలో పీఠికలలో ఎంతెంతో శ్రమకోర్చి విచారణలు చేసినవారు అంగ్లమున కాళె, ఈశ్వరచంద్రవిద్యాసాగర బెల్వాల్కర రే ప్రభృతిపండితులును, రామచంద్ర వీరరాఘవ తాతార్యాది గీర్వాణవ్యాఖ్యాతలును, తెనుఁగున అనువాదము వ్రాసి సన్న యక్షరములలో అరువదియునేడుపుటలది అనఁగా సాధారణాక్షరముల అతిశత పత్రవ్యాపి కాఁగలదియు అందును ఇతరులకు వాక్యములుగా పెరుగఁగల దానిని ఒక్క మాటలో ఇమిడ్చిన కూర్పుప్రౌఢి గలదియు నగు ఉపోద్ఘాతము రచించిన కవిసహృ దయప్రకాండులు వేదము వేంకటరాయశాస్త్రులవారును కుందమాలోత్తరచరితల సామ్యభేదతారతమ్యాది పరీక్షల నెంతేని చేసియుందురు.

శారదాతనయ భావప్రకాశమున-

కున్దమాలాత్ర సుశ్లిష్టా సన్ధిపఞ్చకసంయుతా

అన్న మెప్పును, భోజదేవ శృంగారప్రకాశికలో—

ద్యూతే పణః, ప్రణయకేలిషు కణ్ఠపాశః
క్రీడాపరిశ్రమహరం వ్యజనం రతాన్తే,
శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః,
ప్రాప్తం మయా విధివశా దిద ముత్తరీయమ్.

అను రసవదుదాహృతియు, సాహిత్యదర్పణమున ప్రస్తావనాభేదమగు ప్రయోగాతిశయమునకు "యథా కున్దమాలాయాం—

(నేపథ్యే)

ఇత ఇతోఽవతర త్వార్యే,

సూత్ర - అయే కోను ఖ ల్వయ మార్యాసమాహ్వానేన సహాయ మివ మే సమ్పాదయతి; (విలోక్య) కష్టం భోః! కష్టం భోః! అతికరుణం వర్తతే!

లఙ్కేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి
రామేణ లోక పరివాద భయాకులేన
నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణోఽయమ్.

ఇతి నిష్క్రాన్తః."

అని దాని యుదాహరణ ప్రస్తావమును కలవు. ఇట్లు అచార్యులప్రశంసం గన్న కుందమాల క్రీస్తు 1923వ సంవత్సరమున మానవల్లి రామకృష్ణ కవిగారిచే ఎట్లో కనిపట్టఁబడి ప్రకాశముచేయఁబడినది. మఱి ఆ టీకాకారు లందఱు తమ టీకల నంతకు పూర్వమే వ్రాసిరి. 1923 కు తర్వాత వానిని పునర్ముద్రణము చేయించినపుడును ఎవరేని దీనిప్రస్తావమును దూర్పరైరి. దానిం జూడఁగా అట్టి యుత్తరరామచరితనాటకములు ఇంకను ఏవేని యుండెనా అని ఆకథ రసవత్తచే తోఁచుచుండును. కుందమాల అతిప్రౌఢగంభీరసందర్భమే. దానికాలము సూటిగా నిర్ణయించుటకు వలయు విషయములు ప్రమాణములు చాలినంత దొరకలేదు గాని అర్షలలితములగు అందలి సంస్కృతప్రాకృతములం బట్టి అది క్రీస్తు నాలుగవ యైదవ

శతాబ్దులది గాఁబోలునని యూహించుచున్నారు. ఎట్లును భవభూతికి ముందటిదే అను టకు సందియము లేదు. దానింజూడ అందు ప్రతివాక్యమును, మాటయు అక్షరముం గూడ మార్పనో చేర్పనో తీర్పనో పనివడి భవభూతి తన యుత్తరరామచరితమును నిర్మించినాఁడని తోఁపకమానదు. కావున దాని యితివృత్తమును, దానికిని ఉ. రా. చ. కును తోఁచు పోలికలను భేదములను యథామతి ఇటఁ గూర్చుచున్నాఁడను.

## ౧౩ - కుందమాల - ఇతివృత్తము

I. పాపము! లంకేశ్వరు నింట చాల కాలము ఉండిన దని సీతపై లోకులు ఆడికలు పలుకఁగా, తన కులమునకు కళంకము వచ్చు నని భయాకులుఁడై రాముఁడు కఠోరగర్భనే ఆమెను 'పల్లెలలో సయితము ఉంపఁగూడదు. అడవికికొనిపోయి విడిచి రమ్ము' అని లక్ష్మణునికి ఉత్తరువు చేసినాఁడు ఆ యపరాహ్ణవేళ లక్ష్మణుఁడు సీతను సుమంత్రసారథిక మగు తేరిలో ఎక్కించుకొని గంగాతీరపుఁ జొరరాని కాఱడవులకుం గొనిపోయినాఁడు 'ఇఁక తేరు ఇందు సాగదు, దిగవమ్మా.' అన్నాఁడు. గుఱ్ఱాలు గంగలోనుండి వినఁబడుచున్న హంసనాదములు ఆకర్షింపఁగా దవుడు సేయుచున్నవి. ఆ తేరి వేగమునకు క్రక్కదలిపోయిన దేహముతో అందు సమాళించుకొని నిలువనే లేకున్న సీత ఎట్లు దిగఁగలదు? ఆపవయ్యా తేరిని అని గట్టిగా చెప్పినాఁడు, లక్ష్మణుఁడు. ఎట్టకేలకు ప్రగ్గములు లాగి తేరు ఆపినాఁడు సుమంత్రుఁడు. సీత దిగినది; తానును దిగి లక్ష్మణుఁడు ముందు నడువ, ఇంకెంత దూర మున్నది భాగీరథి అనుచు స్వజనము తో డున్నది అని దిగులు లేక సీత వెంటరా భాగీరథిని దటిసినాఁడు. చల్లని గంగగాలి ఎదుర్కొని సీతకు మర్యాద సేయుచున్నది. అమ్మ చేతి నిమురుటకుం బోలె ఆగాలికే సీతకు అలుపు తీఱినది. ఐనను అందు స్నానము చేయవలయునని ఆమెకు ఆసగా ఉన్నది. లక్ష్మణునివెంటనే గట్టు దిగినది. అంతట ఇఁకను దాఁపఁగూడదు, ఆలస్యము చేయఁగూడదు అని లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞం దెలిపెను. "అయ్యో, నాయనా, మహారాజ, కోసలపతీ దశరథా, నీవు నాకు నిజముగా ఇన్నాళ్ళును గాదు. ఇపుడు లేక పోయినావయ్యా!" అనుచు మూర్ఛిల్లి, ఎట్లో తెప్పిరిల్లి. 'నన్ను ఏదోషము చెప్పి ఇట్లు అడవిపాలు చేసినాఁడు ఆయన? నా కేమియు చెప్పలేదా?' అని అడిగినది. "చెప్పి నాఁడు — సీతా నీవు అన్నివిధాల సాధ్వివే, నీమీఁద నామనసులో ఏమియు దోషశంక లేదు. మఱి జనవాదభీతిచేత ఇట్లు కావించితిని.' అని అన్నాఁడు" అనెను. 'అయ్యో, నాఁడు అందఱి యెదుట నిప్పులో పడి కమలక లేచితినే! ఇంకను జనవాదమా! చీ చీ ఆడుపుట్టుక!' అని యనుకొన్నది సీత. లక్ష్మణుఁడు రాముఁ డన్నాఁ డని మరల చెప్పి

నాఁడు —'సీతా, నీవే నాగృహదేవతవు. కలలో నీవే నా ప్రక్కన నా కౌఁగిలింతలో. యజ్ఞమునకు నీప్రతికృతినే పత్నిగా ఉంచుకొందును' అని. సీత ఇంచుక ఊఱడిల్లినది. లక్ష్మణుఁడు 'నీవు ఏమి చెప్పు మనెదవు?' అని అడిగినాఁడు. "అత్తగారలతో చెప్పు- 'ఇట్లు దిక్కుమాలి పులులనడుమ అడవిలో నున్న నన్ను ఒకనాఁడును మఱవక మీరు హృదయమున అనుగ్రహింపవలసినది' అని. ఆయనతోను చెప్పు - 'నన్ను తలఁచు కొని దుఃఖపడుచు వర్ణాశ్రమపాలనకు అభిఘాతము సేయకు. నీ దేహమును ధర్మమును ఏమరవలదు' అని. ఇంకను చెప్పుము - 'అడవికి తఱిమిన తఱిమితివి. ఇన్నాళ్లు కూడి మాడి యున్నందులకు మనసున నైన నన్ను మఱవకుండుము. అదియే నాకనుగ్రహ మగును." అని. ఇట్లు సందేశము చెప్పి తాను ఇట్లు ఇఁక ఇంట లేకపోయినందున రాముని శరీర విషయమున లక్ష్మణుని పరాకు లేకుండ చూచుకొమ్మని ఎచ్చరించెను. అంతట లక్ష్మణుఁడు తన చేతిమీఁదుగా ఇట్లు సీతను అడవిలో ఉంచి పోవలసివచ్చి నదే, ఇందులకా నేను బ్రతికియుండుట? అన్న నాకు, అయ్యో ఎట్టి పని పెట్టినాఁడు: అని యేడ్చి, ఈ చుట్టు ఉన్నలేళ్లు అంచలు నెమళ్లు సయితము సీతం గాంచి దుఃఖించు చున్నవి; ఇవి మేలు మనుష్యులకన్నను అని తలంచుకొనుచు ఏమియు తోఁపక నిలంబడెను. అంతట సీత 'వత్సా. ప్రొద్దు క్రుంకుచున్నది. ఇంకను నీ వెందులకు ఈయడవిలో నిలంబించుట? మరలి పొమ్ము.' అని ఆతనికి హితము చెప్పెను. లక్ష్మ ణుఁడును కడసారిగా సీతకు మ్రొక్కి, 'గర్భమును కావవమ్మా: ఏసాహసమునకుం బోకు' అని విన్నవించి, అటనుండి తరలుచు లోకపాలురకును, భాగీరథికిని, చుట్టు పట్టుల తపస్సుచేసికొనుచుండు మునులకును వనదేవతలకును సీతను కాపాడు డని మొఱయిడి, ఘాతుకమృగములకు ఈచోటికి రాకుఁ డని ముదలయిడి, లేళ్ళను ఆమెకు చెలులు కండని బతిమాలి వెడలిపోయెను. అంతట ఆ కాఱడవిలో చీకటిపడుచున్నది. సీతకు ఏమిసేయను ఎటు పోవను తోఁపలేదు. ఆఁగని దుఃఖము పొంగి పనవి పనవి మూర్ఛిల్లినది. మునిబాలు రెవరో వాల్మీకిశిష్యులు సాయంసంధ్యావందనమునకు భాగీ రథికి వచ్చినవారు ఈ యొంటరి స్త్రీ పరిదేవితమును విని పోయి వాల్మీకికిం జెప్పినారు. ఆయన యెకాయెకిని వెదకికొనుచు వచ్చి, చీకటిలో ఏమియు అగపడకపోఁగా, 'ఎవ రమ్మా, ఇక్కడ ఏడ్చుచుండినది! నిన్నుం గావ తపోధనుఁడను ఇదె వచ్చినాఁడను. ఇది రాముని రాజ్యమే. నీ కెట్లు ఈ యాపద, చెప్పు' అని గొంతెత్తి అన్నాఁడు ఆమె 'ఆయనవలననే గలిగిన ఆపదే' అని యనఁగా, 'ఏమీ! అట్లుగా!' అని ఆయన మరలి పోఁబోఁగా 'స్వామీ, నన్ను గావకున్నంబోయె. నాకడుపున నున్న ఈ రఘుసంతతి

నైన కావుము.' అన్నది. 'ఏమి, నీవు దశరథుని కోడలివా? జనకుని కూఁతురవా? సీతవా?' అని యడిగి. 'అవును' అనఁగా, ధ్యానమున వృత్త మెఱిఁగి. 'అమ్మాయీ, ఊరక జనాపవాదమునకు భయపడి రాముఁడు నిన్ను ఇట్లు విడిచిపెట్టినాఁడు. మనసున నీమీఁది కూరిమి వీడినవాఁడు కాఁడు. రా, నీవు, నాతో. ఆశ్రమమునకు పోవుదము. నేను మీనాయనకు మామకు బాల్యమిత్రమను, వాల్మీకిని. రా. నీవు వీరప్రసవ వగుదువు. మరల భర్తనుం గూడెదవులే. పోదము రా.' అని యూఱట పలికెను. అంతట సీత 'నీవు మా నాయనవే' అని తేఁకువ గల్గి ఆయనవెంటం బోవుచు, భాగీరథికిమ్రొక్కి—డి 'దేవి, నేను సుఖప్రసవ నగుదు నేని, అపుడు నీకు ప్రతిదినము అందముగా కట్టి కుందమాలను సమర్పించుచుండెదను.' అని ప్రార్థించుకొని ఆశ్రమముం జేరెను. వాల్మీకి సీతను బుజ్జగించుచు 'అమ్మాయీ, ఇక్ష్వాకువుల కందఱికి పుంసవనాదులు నా చేతనే నెఱవేఱెడివి. కావున నీ గర్భముంగూర్చి నీకు ఏచింతయు వలదు. ఇచ్చోటి వృద్ధలు నీయత్తగారలు, మునికన్యలు నీతోఁబుట్టువులును నెచ్చెలులును. సుఖముగా నుండుము.' అనెను.

II. తరువాత సీతకు రామశ్యాములు ఇరువురు కొడుకులు పుట్టినారు. వారికి కుశుఁ డని లవుఁ డని వాల్మీకిభగవంతుఁడు నామకరణము చేసినాఁడు. వారు ఎదిగి జింకలతో పరువెత్తి, సింహకిశోరములను లాగి ఆడుకొనునంత వయసువారై అచటి తాపసుల కెల్ల ముద్దును గూర్పఁజొచ్చినారు. అంతమట్టుకు సీత పుణ్యముచేసినది! వారు ఇపుడు వాల్మీకులవారు రచించిన రామాయణమును చదువుచున్నారు. అప్పుడు మహారాజు రాముఁడు నైమిశమున యజ్ఞమునకు సంభారము లెల్ల కూర్చి, తపోధనుల కెల్ల 'శిష్యులతో కూడ రం'డని ఆహ్వానము పంపినాఁడు. వాల్మీకితపోవనమునకును రామమాత వచ్చి పిలిచిపోయినాఁ డఁట.

సీతకు తపోవనవాసము అలవాటుపడినది. అటు మునికన్నెల స్నేహము, ఇటు బిడ్డల వినోదము. అన్నిటికిపైన వాల్మీకిభగవంతుల యాదరము. వీనితో కాలము గడచుచున్నది. కాని రామ వియోగము, ఎడఁబాసితినే అన్న దుఃఖమునకన్నను తఱిమి నాఁడే అన్న సిగ్గునే ఎక్కువగా కలిగించును. తానేమో ఆతలఁపులు మనసునకు తెచ్చుకొని అట డిల్లపోకూడ దనుకొనును. తన చెలులలో నెవతె నైనను అటు పంపి అచటి సంగతులు ఎఱుంగవలయు నని ఎంచుకొనును. దానికిని తెగుఁ సేయలే కుండును. రాను రాను పిల్లలు పెద్దవారైనారే, వారితో తనకు ప్రొద్దుపోవుటలేదు. ఎట్లు గడపుదునా అని యనుకొనుచుండును. ఇంతలో నైమిశమున రాముఁడు

యజ్ఞము తొడంగనున్నాఁడు. రావలసినది అన్న యాపిలుపు వాల్మీకిభగవంతులకు వచ్చి నది. ఇపుడు రాముఁడు మఱేవతె నైనను చెట్టవట్టు నన్న దిగులు తనకు లేదు. ఒక వేళ తనకును నైమిశమునకు పోవుట కలుగునా. కుశలవులకు నాయనదర్శన మగునా- అని యిట్టిదనరాని సంతోషము మొలకెత్తఁజొచ్చినది. ఇంతలో వాల్మీకిభగవంతుని తొందరపెట్టుచు మరల పిలుపు వచ్చినది. 'అన్నియు సిద్ధమైనను ఆయన రానంతవఱకు రాముఁడు దీక్షలో ప్రవేశింపఁడఁట,' అని. కావున వాల్మీకిభగవంతుఁడు శిష్యులుమొద లగు తన సకలజనముతో నైమిశమున గోమతీతీరమున తనకు ఏర్పఱిచిన యాశ్రమ పదమున విడిసినాఁడు. సీతయు కుశలవులును గూడ వచ్చినారు. సీత తాను భాగీరథికి దూర మైనను, వ్రతము మానఁగూడ దని భాగీరథిపేరు చెప్పి గోమతిలో స్నాన సంధ్యలు తీర్చుకొని కుందమాల కట్టి భాగీరథి నుద్దేశించి గోమతిలో సమర్పించినది. అతిథుల పూజకై పూవులు కోసి తెత్తునని వనములో తిరుగాడుచున్నది.

III. లక్ష్మణుఁడు తోఁడుగా రాముఁడు తన విడిదలనుండి, వాల్మీకిభగవంతుని రాక విని ఆయనను దర్శింప తరలినాఁడు. మందరమహీధరధైర్యుఁ డైనను సీతవిప్ర వాసమును తన సంతతి నాశమును తలంచుకొని అంతట అలముకొనుచున్న దుఃఖపుఁ బరాపున పెడదారిం బడుచు లక్ష్మణునిచే సరిదారిం జేరుచు నడచుచున్నాఁడు. దారిలో గోమతిగాలికి తటాలున ఆప్యాయము జెందును. అది ఆ దిక్కున విడువఁబడిన సీత మీఁదిగాలి కాఁబోలు అనుకొనును. ఆ తీరాన అడుగుజాడలు అప్పడె పూలు తునిమిన, చిగుళ్ళు గిల్లిన చెట్లు. ఇసుకదిన్నెలపై దేవతపూజగుఱుతులు చూచి మనుష్యవాసములు చెంతనే యుండవలయునని అనుకొనును. వారు అట గోమతిలో ఒక రేవున దిగు దురు. ఆయేటి నడుమ కుందమాల తేలియాడుచు రాఁగా దానిని గొని లక్ష్మణుఁడు రామునిచేతికి ఇచ్చును. అది కట్టియున్న తీఱు రామునికి సీతనేర్పును జ్ఞప్తిసేయును. అది పరికించి దానిని అటవైచి అది యెందుండి వచ్చియుండునా అని వెదకికొనుచు ఏటికి ఎదురు నడిచి దూరాన కననైన పొగలేఖను, విననైన సామనాదమును బట్టి వాల్మీకియాశ్రమము చెంతకువచ్చితి మని యనుకొందురు. అంతట ఇసుకలో కనఁబడిన అడుగుజాడ క్రొత్తది రామునికి సీతదే అని తోఁపగా, వారు దానివెంట నడుచుచు గట్టెక్కి, అంతట అది యగపడక పోఁగా, చెంతనున్న తీవల గుబురు నీడలో రవంత విశ్రమించి అంతట భగవంతుని దర్శనమునకు పోవుద మనుకొని అట కూరు చుందురు.

సీతయు ఆచెంతనే ఉన్నది కదా. సీతకు రాముని గొంతు వినఁబడినది. అటు ఆయనను చూచినది. మేనఁ బులకలు మనసున సంతోషము దుఃఖము భయము అను

రాగము అభిమానము బహుమానము సిగ్గు ఇంకను ఏవేవో భావములు ఒక్కుమ్మడి ముంచుకొనివచ్చినవి. రామునికిని ఆయేకాంతమున ఆయడవి, గట్టుచెట్ల నీడలు కమ్మిన యాయేటియిసుకదిన్నెలు, తేటనీటి యాయేటి జాలునుం జూడఁగా, సీతతోడి మునుపటి దండకారణ్యవాసము స్మారితమై, అప్పటి విహారములు చిత్తము కలంపఁగా సీతను తలంచుకొని హాజానకీ వనవాససహాయిని అని, కనులు నీరు నిండి పొరల తాను ఏడ్చెను. సీతకు ఆయనకన్నీటిని కొంగున తుడుతునా అని ఆలోచన కలిగినది కాని, ఇంతలో ఎవరు వచ్చి చూతురో అని జంకి, ఈకంటితోనే కుశలవులం గాంతును అని ఆశ్రమమునకు పోయెను. ఇంతలో ఇట్లు సలక్ష్మణుఁడు రాముఁడు తన యాశ్రమమునకై వచ్చినాఁ డని ఎవరో చెప్పఁగా విని వాల్మీకిభగవంతుఁడు ఒక ఋషిని అతనికి ఎదురు పంపెను. అతఁడు వచ్చి ఇట పీఠిం గాంచి, ఆగాలిమాంద్యము, ఆయెండ చలువ, ఆనీడపటుపుం బట్టి ఈతఁడే హరియవతారము, రాముఁ డగును అని గుఱుతుపట్టి చెంతకు పోయి వాల్మీకులవారు అనుష్ఠానము లన్నియు తీర్చుకొని కనుపెట్టుకొని యున్నా రని విన్నవింపఁగా, ఓహో మధ్యాహ్నము దాఁటుచున్నదే అనుచు రాముఁడు తమ్మునితో అతనివెంటఁ బోయెను

IV. వాల్మీకిభగవంతుఁడు గోమత్యాశ్రమము చేరి వారముదినాలైనది. ఇంకను రామునికి యజ్ఞదీక్షానుమతి కాలేదు. మహారాజు చెంతకు వచ్చియున్నందున ఆశ్రమదీర్ఘికకు స్నానమునకు తామరలకు వచ్చు స్త్రీలు పరాయి మగవారి కంట పడుదురే యెట్లు అనఁగా, అట్లు పడనీకుండ వారికి వాల్మీకి తన ప్రభావముచే తిరస్కరిణిని అనుగ్రహించినాఁడు. కావున సీత ఈదినాలలో రాముని కంట పడకుండుటకై పగటిని ఎక్కువగా ఆదీర్ఘికచెంత గడపుచున్నది. కుశలవు లన్ననో బాల్యముచేతను మునిజనుల మాలిమిచేతను అమ్మపేరే ఎఱుఁగరఁట. ఇఁక ఏండ్లుగా మాసిపోయిన రామసంబంధము మాట చెప్పవలయునా? రామాయణసంగీతకమునకు వాల్మీకి అచ్చరలం గూడ పిలిపించెను. వారిలో తిలోత్తమ యొకతె. ఆయచ్చరకు తాను మునికన్నెల కన్నను సాహసికురాలైనందున, అట కరుణమూర్తియగు సీతం గాంచుచుండఁగా, ఆస్నేహముచేత తాను సీతవేసము పూని ఆమెయెడ రాముఁ డెట్లున్నాఁడో ఎఱుంగవలయు నను కుతూహలము గలిగినది. అట్లు కావించెద నని నాఁటి యుదయము సీతచెలులు మునికన్నెలు విన నోట చెప్పినది. అప్పుడు చెట్లచాటున నున్న రామమిత్రము హాసితుఁడు (కౌశికుఁడు) వినెను. అదిమొదలు దానిని రామునితో చెప్పవలయు నని తా

నతని వెదకఁజొచ్చెను. రాముఁ డగపడలేదు. రాముఁడు తపోవనమునకు వచ్చినమాట మునికన్నెలు ఎఱుఁగరు. ఇంకను అతఁడు వచ్చు టెక్కడిది అని అనుకొను చున్నారు. ఆఋషి రాముని వాల్మీకిదర్శనమునకు కొనివచ్చెనుగదా ఆమధ్యాహ్నము అటు తర్వాత వాల్మీకిభగవంతుఁడు తన శిష్యుఁడగు రామబాలమిత్రుని కణ్వుఁ డను వానిని రామునికి నైమిశరామణీయకముం జూపు మని ఆనతిచ్చెను. రామునికి చిత్తము చింతాపరాధీన మైనను నైమిశముమీఁది బహుమానముతో నిండి పోయినది. అక్కడ ఎటు చూచిన అతనికి గొప్ప యజ్ఞములు చేసిన గుఱుతులు, పూర్వరాజర్షుల యాశ్రమములు, నిత్య షడృతు సౌభాగ్యము, హోమధూమములు, సామగానములు! ఇంతలో వాల్మీకిభగవంతుని యగ్నిహోత్రవేళ ఐనది. అందు పొగ రాశి లేచినది రాముని కన్నులు మునుపే సీతావిరహ బాష్పధారలచే అయాసితములు. మఱి యిపు డీపొగచే చెప్పవలయునా? కణ్వుఁడు రాముని చెంగటి డిగ్గియలో దిగి ఆచన్నీటితో కన్నులు కడిగికొని మంట మాన్పుకొని ఇంచుక సేదదేఱు మని విడిచి తాను ఆభగవంతుని యగ్నిహోత్రమును సేవింపఁ బోవుదు నని పోయెను. రాముఁడు కమలాకరమున దిగినాఁడు. ఆతేటనీటి నడుమ అతనికి సీతప్రతికృతి అగపడినది. ఏమీ, సీతకూడ ఇటనే యున్నదే అని సంభ్రమహర్షాశ్చర్యములు చెందెను. సీత అట అంచదోయిం జూచు పరాకున తటాలున వచ్చిన రాముని చూడదాయెను. కావున అప్పుడే అవతలికి తొలఁగినది. నీటిలో నీడ తొలఁగుట రామునికి అగపడుచున్నదే కాని ఎటు చూచినను దాని ప్రకృతి సీత అగపడదాయెను. అదే వాల్మీకి తిరస్కరిణీ యనుగ్రహమహిమ. నీడ సయితము అగపడకుండ మహర్షి ఆదేశించియున్న నేను ఇంకను అనుగృహీత నగుదును కదా అని సీత యనుకొన్నది. వ్రేలు ముంగురుల తోడి సీత పాలిన మోము! సీత ఇన్నాళ్ళకు అగపడినది. అంతలో ఎటకో పోవు చున్నది అని ఆమెను పట్టుకొన రాముఁడు చేతులు సాచెను. ఆమె దొరకునా? అంతలో మరల నీటిలో ఆనీడనే చూతునులే అని ఆటుచూడఁగా అట ఆ నీడయు లేకపోయినది. అంతట రాముఁడు దుఃఖభరమున మూర్ఛిల్లినాఁడు దానిం గాంచి, తన్ను సమాశించు కొనలేక, సీత, దేవతల మన్నింపు మనుచునే ఆ మూర్ఛితుని కౌఁగిలించుకొన్నది. ఆ యరిది తాఁకుడునకు రామునికి మూర్ఛ తొలఁగినది. సీతయు అపసరిల్లినది. అంతట రాముఁడు విలపించుచు "బిగ్గ కౌఁగిలింపవే, నన్ను, వైదేహీ. ఒక తూఱి నాకు అగ పడవే! మానవే నామీఁద కోపము: నన్ను మన్నింపవే!" అనుచు; "మరల నీ కొంగు మీఁదనే నీ చేయిమే తలాపిగా పండువెన్నెలరేయిని ఎప్పుడు పుత్తునే" అనుచు

వాపోవుచు మరల మూర్ఛలో మునిఁగెను, సీత కొంగుతో చల్లఁగా విసరినది,రాముఁడు మూసికొన్న కనులతోనే చేయి సాచి కొంగును పట్టుకొని, సీతకొంగుగాలి తప్ప మఱెవరిది నాకు ఊఱటకూర్చును అనుచు, దానితోడనే కన్నులు తుడుచుకొనుటకై దానిని లాగెను. సీత పట్టు విడిచినది. ఆపైట రాముని చేతిమీఁద పడినది. మఱి దీనిని ధరించిన జనము అగపడలేదే! అనుచు రాముఁడు దానిం బరికించి 'ఇది చిత్రకూట వనదేవత మాయావతి మునుపు సీతకు ఇచ్చినది. మానదుమ ఎన్నివిధాలనో నలిగినది.' అని తలపోసికొనుచు దానిని బహూమానించువాఁడై దానితో తన్ను కప్పుకొని తన యుత్తరీయమును ఇఁక నిదేల యని తీసివైచెను. దానిని నేలమీఁద పడనీకయే సీత చేతఁ గొన్నది. అది రామునికి అగపడకపోయినది. సీత తాను గంధపు వాసనయేనియు లేని దానిని కప్పుకొనుచు రాముని సత్యసంధత తలఁచుకొనుచు, ప్రియుని యక్కునం జేరినట్లు పులకలు దాల్చినది. ఆయుత్తరీయముల యగపాటు మాయమగుటలు ఆ సిద్ధాశ్రమప్రభావము కాఁబోలు అని రాముఁడు తలంచుకొని, మఱి సీతను ఎదురుగా కన్నులఁ జూచు టెట్లో గదా యనుచు మునుపటి చిత్రకూటమందలి తమ రహఃక్రీడల స్మరింపఁజొచ్చెను. అప్పటికి ప్రొద్దు క్రుంకుచున్నది. సీత వెడలి పోవలయును. ఆ స్థితిలో రాముని ఒంటరిగా విడిచి పోవు టెట్లు అని సీత తలపోయుచుండఁగా అప్పుడే రామవయస్యుఁడు కౌశికుఁడు రాముని వెదకికొనుచు అటకు వచ్చినాఁడు. ఇఁకను తాను పోవచ్చుననుకొని సీత వెడలిపోయినది. కౌశికుఁడును తాను వినియున్న తపోవన రహస్యమును, తిలోత్తమ సీతవేసము బూని రాముని పరీక్షింపఁ దలఁచిన మాటను అతనికి తెలియఁ జెప్పినాఁడు. 'ఓహో అట్టులా! సీతయే యని మోసపోయితినే' అని తలంచుకొని, సూర్యుఁడు క్రుంకుచుండుటం గాంచి, తాను అతనితోఁగూడ అందుండి వెడలిపోయెను.

V. రాముఁడు నైమిశమున తన క్రొత్తభవనమును యజ్ఞమునకైన విడిదలను లక్ష్మీనివాస మనుదానిని, సామంతరాజుల తియ్యని పాటలతో శబ్దించుచున్నదానిని జేరి అందు తపోధను లందఱు రావలసిన సమయము దగ్గఱఁగా, కౌశికుఁడు తన వెంటరా, తాను ఆస్థానమున సింహాసనమునం దాసీనుఁ డాయెను. మనసున నిన్నటి యాశ్చర్యములనే తలపోసికొనుచుండెను. 'నీటినీడలో ఆసీత మొగ మగపడుట, అంతకు మునుపు ఆమెకూర్పునేర్పుతోడి యా కుందమాలయు ఆమెయడుగుల జాడయు అగపడుట! ఇదెల్ల ఒకవేళ ఆదేవగణిక తిలోత్తమ నాటక మాడునుగాక. మఱి దానిచేతి పైటచెరగుగాలి రాముని చిత్తమును అట్లు తాక నేర్చునా? సీతను త్యజించిన తర్వాత

ఇన్నాళ్ళును విరాళచే నాకు మనసే లేకపోయినందున సుఖముగాని దుఃఖముగాని లేక యుండెను. ఇపు డన్ననో ఆ సీత మొదలయినది అగపడినదిమొదలు నా మనసు సుఖదుఃఖములం గొని మరల పుట్టినట్లైనది' అని, యనుకొనుచు చింతలోఁ మ్రుంగెను. కౌశికుఁడు అడిగెను 'ఇదేమి రాజ్యచింతయా సీతచింతయా' అని. 'సీతచింతయే. నేను. బయటికి కర్కశుఁడనుగా అగపడినను నాకు మనసున సుకుమారానురాగ భావములు దాఁగియే యున్నవి' అని యన్నాఁడు. అని కౌశికుని అన్నివాకిళ్ళలోను వేత్రపాణుల జాగరూకులుగా నిలిపి రమ్మనెను. అందులకు పోయినవాఁడు అంతలో ఆశ్చర్యముతో మరలి "అట వాకిట నిలబడియున్న యిరువురు తాపసకుమారులను స్నిగ్ధశ్యామలులను, అందమున కందర్పకుమారులవలె నున్నవారిని, ఒడ్డు పొడుగు గలిగి కడుధీరులుగను కడులలితులుగను రామునికళలే అనదగియున్నవారిని గాంచితిని. వా రేమి చెప్పుచున్నా రనఁగా-తాము వాల్మీకిశిష్యు లఁట. వీణాకళలో ప్రవీణు లఁట. అం దొక క్రొత్త ఆగమ మును ఇప్పటి కెవరు విననిదానిని తాము పాడ నేర్చియున్నా రఁట. అది తాము వీణతో కలిపి పాడు నపుడు రాజు దానిని విని ప్రసన్నహృదయుఁడై ఏమి సేయునో అది యెఱుంగవలసిన దని మాకు వాల్మీకిభగవంతుల యాదేశము.- అని యనుచున్నారు." అనెను. అంతట రాముఁడు 'ఆరే! ఎంత గర్వముగా పలికినారు!' అనుకొని, వారినికాచు కొనఁ జేసినందులకు విసుకుచెందుదురేమో, త్వరగా ప్రవేశపెట్టుము అనెను. కౌశికుఁ డును "వారికి విసుకు లేదు. మన కంచుకులు వారిని గాంచి దశరథమహారా జుండఁగా ఆయాస్థానమున రామలక్ష్మణు లుండిరే అట్లే యున్నారు వీరు అని తలపోసికొని కన్నులు బాష్పపూర్ణములు కాఁగా, వారిని ఏమేమో అడుగుచున్నారు" అనెను. రామునికి "ఏమీ మాపోలికయా!" యని కుతూహలము పెరిఁగెను. కౌశికుఁడును వారిని వెంటఁగొని వచ్చుచున్నాఁడు. కుమారులతో అమ్మ మీగర్వము విడిచి రాజును నమస్కరించి కుశల మడుగు మని చెప్పిన దఁట. 'కుశలముమాట సరే. వంగి నమస్కరించుట యెట్లు. మనకు మెడ వంగదే.' అని వా రనుకొనుచున్నారు. సమీపించుచున్నారు. రామునికి కారణము తెలియకయే. వారు అగపడఁగానే. అదెందుచేతనో కన్నులు బాష్పముతో నిండిపోయినవి. మూర్ఛ పైకొన్నది. మరల కన్నీళ్ళు కాఱి చిత్తము తేఱి కుదుటఁ పడినది. ఆబాలురతేజు అతనికి గంభీరోదారముగా నున్నది; వేషము ప్రశాంత మనోహరముగా నున్నది; గమనము వినయోదాత్తముగా నున్నది బాలురు వినయపరవశులై రాముఁడు వారు బాపనబాలు రన్న భ్రాంతిచే వల దనుచున్నను, అతనికి నమస్కరించినారు. లేచి కుశల మడిగినారు. రాముఁడును ఆపుకొనలేక వారిని కౌఁగిలించుకొని,

సొంతబిడ్డలను కౌఁగిలించుకొన్న సౌఖ్యము చెందినాఁడు. వారు తన ప్రక్కన అర్ధాసన
మున రాజాసన మని కూర్చుండ జంకఁగా, వారిని ఎత్తుకొని వల దనుచున్నను తన
యొడిలో కూర్చుండఁబెట్టుకొన్నాఁడు. సీతను అడవిపాలు చేసి పది యేండ్లయినవి
కదా, ఆమెకాన్పు శుభముగా జరిగియున్న అబిడ్డలు ఇప్పటికి ఈపాటివా రయి
యుందురు. ప్రవాసి తన బిడ్డను ఏయేయవస్థలో ఉన్నదానింగా భావించుకొనుచుండునో
ఆయా యవస్థలో నున్నదానింగా దానిని కంటితో చూడఁగని కనికరముచేతను జాలి
చేతను కరంగిపోవును అనుచు వారిపై చూపు నిలిపి కౌఁగిలించుకొని రాముఁడు
ఏడువఁజొచ్చెను. ఇంతలో కౌశికుఁడు త త్తరముతో 'అయ్యో, పాము! పాము! వదలు
ఆతాపస బాలురను! దింపు సింహాసనమునుండి!' అని యఱచి, 'ఎవరేని రఘువంశీ
యుఁడుకానివాఁడు ఈసింహాసన మెక్కిన వాని తల నూఱు వ్రక్క లగును అని
పెద్దలు చెప్పఁగా వినియున్నాఁడను' అనెను. రాముఁడు 'నాయనలారా, మీకు తలలో
ఏమియు వికారము లేదు గదా' అని వారిని బుజ్జగించెను. కౌశికుఁడు ఆశ్చర్యపడెను.
'ఇట్టి దేహములు తపోరక్షితము లగును, వానికి సేగి యుండదు.' అని రాముఁడు
సమాధానము పలికి వారితో మాటలు పెట్టుకొనెను. వారు తాము క్షత్త్రియబ్రహ్మచారు
లము, సూర్యవంశ్యులము, అన్నదమ్ములము, అమడలము, కుశుఁడు లవుఁడు అని
పెద్ద పిన్న వరుసన మాపేరులు అని ఉదాత్త రమ్య సముదాచారముగా పలికినారు.
మఱియు ఉపనయనోపదేశముచేత తమ నాయన వాల్మీకిభగవంతుఁ డనియు, తమ జన
కుని పేరు 'నిరనుక్రోశుఁ'డనియు తమ యమ్మ తమ్ము అవినయమునకు కసరునపుడు
అట్లుననియు, ఆయనను తా మింతవఱకు ఎన్నఁడును చూడలేదనియు, తమ అమ్మకు
దేవి యనియు వధువు అనియు పేర్లనియు చెప్పిరి. ఇట్లు ఆబాలురకును తనకును అన్ని
విధాల ఆకారాదికమును కుటుంబవృత్తాంతమును సరిపోవుచున్నదే అని రాముఁడు
చింతాశోకాధీనుఁ డాయెను. ఇంతలో వాల్మీకిదూత 'ఏరీ ఆయిక్ష్వాకుకుల కుమారులు,
ప్రొద్దెక్కుచున్నదే, మధ్యసవనములోపల రామునికి ఆమునివరుఁడు రచించిన కథను
వినిపింపవలసియుండెనే, అని కేకవేసెను. అది విని కుమారులు తాము పోయెదము
అనిరి. రాముఁడు కౌశికునితో లక్ష్మణుని, తక్కిన బంధుమిత్రుల నందఱిని ఆకథాగోష్ఠికి
పిలుచుకొని రాఁ బంపి, వారు కూడునంతలో, తాను ఆకుమారులతో రవంత పాద
విహార మనుభవించి, మరల అందఱు పౌరజానపదులు సయితము చేరునప్పటికి, ఆ
బాలురతో ఆస్థానమండపముఁజొచ్చెను.

VI. అందఱు అట కూర్చుండఁగానే రాముఁడు కుమారులను ఇఁక ఆరంభింపుఁడు అనెను. వారు దశరథచరితము ఆరంభింపఁగానే అది తమ కథయే యగుటకు హర్ష మొందెను. కథ సంక్షేపముగానే నడచినది. లక్ష్మణుఁడు సీతను గర్భిణిని ఘాతుకమృగ సంకుల నిర్జనారణ్యమున విడిచిపోవువఱకు పాడఁబడి, ఇంతే అని ముగింపఁబడినది. తరువాత సీత ప్రాణాలు విడిచిన దేమో, ఆయప్రియము చెప్ప జంకి కవి కథ అంతట ముగించివేసినాఁడన్నారు. సీతకథగోష్ఠి జరుగుచుండఁగా రామలక్ష్మణులు మిక్కిలి విషాదము చెందుటం గాంచి, మీరేనా రామాయణ కథానాయకులు అని కుశుఁడు లక్ష్మణు నడిగెను. 'అవును' అన్నాఁడు. మఱి సీతనుగూర్చి గాని సీతగర్భముంగూర్చి గాని తరువాత మీకేమియు తెలియదా అని మరల అడిగినారు. 'ఇపుడు మీపాటవలన తెలిసినదే,' అని బదులిడి, అంతట రాముఁడు వారి నడిగెను—'ఇదేమి మీరు నేర్చిన దాని అవధియా కవనపు టవధియా?' అని. వారు 'మాకు తెలియదు' అనిరి. అంతట 'కణ్వుని అడుగుదము, ఆయనను పిలుచుకొనిరా.' అని రాముఁడు లక్ష్మణు నంపెను. ఆయన వచ్చి కూర్చుండి, 'ఏమి, రామాయణము వినం గోరికయా? కుశ లవులు ఎంతవఱకు చెప్పినారు?' అని యడిగి ఎఱింగి అటుపై వినుఁ డని పాడం దొడంగెను. సీతను వాల్మీకిభగవంతుఁడు తన తపోవనమునకుఁ గొంపోయె ననియు, సీత యిరువురు అమడలం గనె ననియు, వారికి కుశలవు లని పేరిడె ననియు, అంతట 'ఏమీ, వీరె సీతకొడుకులు! హాకుశ హాలవ' అని రాముఁడును లక్ష్మణుఁడును, 'ఏమీ, ఈయనయా మానాయన!' అని కుశలవులును ఒండొరుల కౌఁగిలించుకొని అందఱును మూర్ఛిల్లిరి. 'అయ్యో. ఒక్కుమ్మడి నావలన అందఱును ఇట్లైరే!' అని కణ్వుఁడు పోయి తెలుపఁగా, వాల్మీకి 'రావే, వత్సా, త్వరగా మూర్ఛకు ప్రతిక్రియ చేయకున్న ప్రాణాలు పోవును.' అనుచు సీతతోడ అటకు వచ్చెను. వచ్చి 'చూడవమ్మా నీ కథ ప్రళయవాతము నీ రివందఱిని ఎట్లు పడఁగొట్టినదో!' అనెను. తాను అగపడుటకు అనుజ్ఞ లేదే ఎట్లు అని సీత జంకుపడఁగా, 'నే నుండఁగా మఱెవ్వరు అనుజ్ఞ సేయుట కును ప్రతిషేధించుటకును? ఇదే నేను వాల్మీకిని అనుమతించుచున్నాను. నిశ్శంకముగాఁ దఱియుము భర్తను.' అని వాల్మీకిభగవంతుఁడు సావష్టంభవాక్కు పలికెను. అంతట సీత సమీపించి చూచి 'అయ్యో అందఱు ఇట్లున్నారే!' అని కుశలవులను నీళ్ళు చల్లి తేర్చినది. రామలక్ష్మణులను వాల్మీకిభగవంతుఁడు సాంతముగా తేర్చెను. రాముఁడు తేఱి 'మఱి కణ్వయ్యా. వైదేహి బ్రతికియున్నదా?' అని అడిగెను. దానికి భగవంతుని వాక్కు వినఁబడెను - 'ఇదిగో, ఎదురుగానే ఉన్నది' అని. చూచి రాముఁడు 'ఏమీ.

భగవంతులవారు దయచేసినారే!' అని సిగ్గుపడఁగా. ఎందులకు సిగ్గు? భార్యమీఁద కదా నీదయ యంతయు!' అని భగవంతుఁడు చెప్పెను. కుశలవులు రామునిపాదములం ద్రెళ్ళి 'రక్షింపు బాబూ' అని యేడువసాగిరి. వారిని రామలక్ష్మణులు 'ఎందుల కంత విత్తరపోయినారు!' అని బుజ్జగింపఁగా, వాల్మీకి 'ఓరీ, నాయనను చూచి దుండగీం డ్రయినారే! తుడుచుకొనుఁడు కన్నీళ్ళను' అని కసరెను. వారు నివ్వెఱపోయి అట్లే తుడుచుకొని రాముని చూచుచు నిలుచున్నారు. 'ఎవరురా ఆయన, అట్లు చూచుచున్నారే' అన్నది సీత. తాను రామునివంక మొగమునైన వికసింపనీలేదు. వాల్మీకి కోపముతో రాముని అడిగినాఁడు. 'రాజ, జన్మపరిపూతను, సర్వథాపుణ్యచారిత్రను సీతాదేవిని జనాపవాదము విన్నమాత్రకు నిరాకరింపఁ దగునా?' అని. 'అయ్యో. ఆర్యపుత్రుని ఇట్లు అధిక్షేపించుచున్నాఁడే, నాకోసము.' అని సీత చెవులు మూసికొన్నది. 'తపోవన గతుల సయితము దండించు రాజుల హృదయము వట్టి యెండు ఇసుకదిబ్బ. అందు నూగింజయు మొలకెత్తదు.' అని వాల్మీకి సీతను ఆత్మపరిశోధనము చేసికొమ్మనెను. సీత లోకపాలురను దేవతలను గంధర్వసిద్ధవిద్యాధరులను ప్రభావముచే సర్వలోక రహస్యములను ఎఱుంగ వలంతు లయిన వాల్మీకి వసిష్ఠప్రముఖ మహర్షులను, కుల పితామహుని సూర్యుని పిలిచి తన చారిత్రముంగూర్చి ఇట్లు ఒట్టు వెట్టెద నన్నది. అంతట లోక మెల్ల విశ్రబ్ధస్తిమితమై దత్తైకావధాన మయినది. 'నేను గన సురాసుర భువనైక ధనుర్ధరుఁడ వగు రాఘవకులనందనుని నిన్ను మాని మఱి యెవనినేని పతి వ్రతావిరుద్ధభావముతో చూచికాని పలుకరించికాని తలంచికాని యుందునేని భగవతి యీభూదేవి దివ్యరూపముతో వచ్చి నాచిత్తశుద్ధిని లోకమునకు చాటునుగాక.' అని యొట్టువెట్టినది. అంతట ఉన్నటులుండి ఒక తుములనాదము రోదసి నిండినది; కొండలు కదలాడఁజొచ్చినవి; సముద్రములు చిలుకఁబడినట్లు కలఁగి పొంగినవి. అంతట నాగ లోకమునుండి ఒక వెలుతురు పొడిచినది. పాతాళవాతములు చల్లని తామరనెత్తావిని చల్లినవి. వసుధాదేవి ఆవిర్భవించినది. సీతయెదుట నిలిచినది. పలికినది - 'ఒపే వత్సా. మునుపు మహావరాహము, నేఁడు నీపాతివ్రత్యప్రభావము నాకు ఈ యభ్యుద్ధృతి కావించినవి.' అని. సీత అంజలిచేసి 'భగవతి, ఆనాపాతివ్రత్యమునే ఈ లోకమునకు చాటవమ్మా.' అని ప్రార్థించినది. భూదేవియు ఎల్లవారిని సంబోధించి 'ఓహో, సీత దశరథరాముని విడిచి వేఱు పురుషుని ఎప్పుడుగాని మనసుచేతనైనను తలఁచినది కాదు.' అని ప్రఖ్యాపించినది. పూలవాన దేవదుందుభిమ్రోఁత సీతపై మింట కట్టని మేలు కట్టు 'చారిత్రగుణోన్నత సీత' అని ఆకాశవాణి. ఇవన్నియు కలిగినవి. అంధ్రజును

కేలు మోడ్చి సీతారాములు మరల మిథునముగా కూడుదురుగాక అని కోరిరి. వాల్మీకి భగవంతుఁడును అట్లే ఆదేశించెను. లక్ష్మణుఁడు సీతపాదములకు మ్రొక్కినాఁడు. రాముఁడు చెట్టపట్టుకొని 'దేవి వైదేహీ, ప్రజయు ధర్మమును దారపరిగ్రహమునకు రెండు ఫలములుగదా. ప్రజ కలిగినది. ఇఁక ధర్మమును అనఁగా యజ్ఞమును తొడంగుదము.' అన్నాఁడు. భూదేవి ఆశీర్వాదము పలికి అంతర్ధానమైనది.

అంతట రాముఁడు లక్ష్మణుని అభిషేకింపఁగోరెను. 'నన్ను కాదు. క్రొత్తగా కలసికొన్న కుమారుని కుశుని యువరాజుం జేయుము. అదే నాకు గౌరవము' అనెను లక్ష్మణుఁడు. అంతట రాముఁడు లక్ష్మణుని ఒప్పరికింపఁ జాలక కుశుని రాజుగా దేవతల కెల్లను సమ్మతముగా వాల్మీకిచే అభిషేకింపించెను. తరువాత కుశుని యనుమతితో లవుని యువరాజుగా తన చేతితో సొంతముగా తానే అభిషేకించెను. ఎల్లవారును సంహృష్టాంతరంగులైరి.

## ౧౪ - దిఙ్నాగ భవభూతి రూపకసామ్య పరిశీలన

శ్రీరామచరితమును ఆదికవి వాల్మీకి చెప్పినదానిని తమ తమ ప్రీతికొలఁది మరల తాము చెప్పను ఎందఱు కవులు——వ్యాస కాళిదాస భోజదేవ భట్టిప్రముఖులు - తమకపడినారు! అట్లే విశేషముగా దానిని నాటకముగా రచింప నేదియో సాకు చెప్పుచు ఎంచఱు - భవభూతి రాజశేఖర మురారి జయదేవ ప్రభృతులు - ఉవ్విళులూరినారు! ఐనను వారు పూర్వచరితమునే పెల్లుగాఁ గొనిరి కాని ఉత్తరచరితమును విరళముగానే గ్రహించిరి. వారిలో భవభూతి పూర్వచరితమును 'మహావీరచరితము' చేయుటయు కాక, ఉత్తరచరితమును 'ఉత్తరరామచరితము' చేసినాఁడు. చేసి, 'కావ్యేషు నాటకేష్వేవ వయం వా వయ మేవ వా' 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అను నాణకము బడి అతిశాసుంతల మగు దానివలన తా నిట్లు అతికాళిదాసతకైన కీర్తిని గడించినాఁడు. అందుల కారణము చెప్పికొన్నాఁడు - పావన రఘుపతి చరితమందు తనకు భక్తి అని. 'ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం, యత్ పావనం రఘుపతేః ప్రణినాయవృత్తమ్, భక్తస్య తత్ర సమరంస్త మ మాపి వాణీ, తాం సుప్రసన్న మనసః కృతినో భజన్తామ్.' కాళిదాసు రఘువున వాల్మీకి సెప్పిన కథను ఉన్నది యున్నట్లు చెప్పినను. భవభూతి నిజ రామమహిమానుభవ పరీవాహముగా కథను, పూర్వమునను ఉత్తరమునను, నాటకోచితముగా ఇంచించుక మార్చి కూర్చినాఁడు. సీతాహరణానంతరము అనతికాలముననే జటాయువువలన ఆ వార్త విన్నందున వీర

చరితమున రాముఁడు కరుణమూర్తియ కాక, 'ఏషమూర్త ఇవ క్రోధః శోకాగ్ని రివ జఙ్గమః. కృపాప్రి ద్ధిభక్తి హ్యల్లేఖ లజ్జాసంవేగపీం తనుమ్.' అని వేఱు మూర్తి యాయెను. అట్లే 'అస్తోక వీర మురుసాహస మద్భుతం చ' అని తన మహావీర చరితమును తొలుతనే కవి ఆ తెఱంగున నిర్దేశించెను. రామాయణ మన్ననో ఆదికవి వాణి కరుణరస ప్రధానమని ధ్వనికారుఁ డానందవర్ధనుఁడు పలికినాఁడు—'ప్రబన్ధే చ అఙ్గీ రస ఏక ఏవ నిబధ్యమానః, అర్థవిశేషలాభం ఛాయాతిశయం చ పుష్ణాతి. కస్మి న్నితి చేత్, యథా రామాయణే....రామాయణే హి కరుణో రసః స్వయమాదికవినా సూత్రితః, శోకః శ్లోకత్వ మాగత ఇ త్యేవంవాదినా. నిర్వ్యూఢశ్చ స ఏవ సీతా త్యన్త వియోగపర్యన్త మేవ స్వప్రబన్ధ ముపరచయతా.' అని. అతఁడే 'శృఙ్గార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః, తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతి తిష్ఠతి.' అనియు, 'శృఙ్గారే విప్రలమ్భాఖ్యే కరుణే చ ప్రకర్షవత్, మాధుర్య మార్ద్రతాం యాతి యత స్తత్రాధికం మనః.' అనియు రసముల గుట్టు చెప్పినాఁడు. ఇవి కల వని తాపసవత్సరాజమున తాను పట్టరాని సంతసముతో మునిఁగితేలినాఁడు ఈ రెంటిని సమకూర్చి స్వప్నమున భాసుఁడును, శాకుంత లోత్తరార్థమున కాళి దాసును నవకమాలిని రసమును పాలించినారు. రామాయణమున ఉత్తరచరితము, జైమిని రచించినట్లు, సీతా పునఃసమాగమ సంస్కృతమగు నేని ఆ మార్గమున సాటి లేని వస్తువగుననియు, కుందమాలాకారుఁడు ఆదారిం బట్టినవాఁడు దానిని అట్లట్లు వ్రాసినవాఁడే ఎంతో కీర్తి పొందఁగా భవభూతి దానిని అంతకన్నను నిపుణముగా రచించి సీతారామసేవ చేసి తనభక్తిని, వేదవేదాంగ పండితుఁడును పదవాక్యప్రమాణ పారావార పారీణుఁడునయ్యు, ఆ యన్నింటికి ఒరగల్లగునని నాటక రచనయందు తా వహించిన యాసక్తిని పూరించుకొన్నాడు. కుందమాలను లెస్సగా పరికించి, దానిని ఆమూలాగ్రము తాను ధరించి దాని మార్గములు సన్నివేశములు అన్నియు తాను ఆక ళించుకొని, అట్టి మార్గములనే అంతకన్నను చక్కఁ వఱిచిన వానియందును అట్టిసన్ని వేశములనే అంతకన్నను చక్కఁ వఱిచిన వానియందును తాను కథ నడుపుచు, మఱియు జైమిని భారతమున చెప్పిన సంగతిని, కుశలవులు అశ్వమేధాశ్వమును బట్టి రామ తద్భ్రాతలతో పోరుటనుకూడ అవలంబించి దానిని నయితము అంతకన్నను మెఱుఁ గుగా రసవంతముగా మార్చి ఈ యుత్తర చరితమును గ్రథించినాఁడు. వాల్మీకి రామా యణమును రఘువున కాళిదాసు అనుసరించినది ప్రసిద్ధమేకదా. దానిని కుందమాలా కారుడు తన నాటకమునకు ఎట్లెట్లు కత్తిరించి నవరించుకొన్నాఁడో అదియు, ఆ రామా

యణ కుందమాలలను భవభూతి తన నాటకమునకు ఎట్లెట్లు కత్తిరించి సవరించి కొన్నాఁడో అదియు తెల్లమగుటకు, రామాయణము ప్రసిద్ధము కావున దానిని అటు ఉంచి, కుందమాల కథను ఉత్తరరామ చరితకథను పోలిచిం బరికింపదగును, దాన వాని పోలికలు పొడకట్టుటయె కాక, కుందమాలను ఉత్తరచరిత ఎట్లు మించినదో విశదమగును.

కుందమాలలో తొలియంకమున వస్తువు సీతను రామాజ్ఞచే లక్ష్మణుఁడు కొనిపోయి వాల్మీకి యాశ్రమముచెంత గంగయొద్దున విడిచిపోవుటయు అంత ఆమె యేడ్పువిని ఆమెను ఓదార్చి వాల్మీకి తన యాశ్రమమునకు కొనిపోవుటయు. ఇందు సీతాలక్ష్మణుల శోకములు. ఉత్తరచరితలో చిత్రదర్శనమును, దాన సీత గంగాతీర తపోవనముల మరలంజూడ నాసగొనుటయు, ఇంతలో చారుఁడువచ్చి సీతమీఁద నేమో జననిందయని రామునిచెవిలో చెప్పుటయు, అంత ఆ నిముసముననే లోకారాధనకై రాముఁడు పరిశుద్ధనైనను సీతను అడవిపాలు చేయ నిశ్చయించుకొని, అందులకై లక్ష్మణునికి ముదలయంపి, తాను ఉత్పత్తి పరిపూత విశుద్ధచారిత్ర నిప్పునకు నిప్పు అని నమ్మియు తన సీతను ఇట్లు చేయవలసివచ్చెనదే అని యేడ్చుటయు, ఈ రెంటను ఏ సంవిధానము కరుణోత్తరము? రెండును కరుణోత్తరములు, 'అదియే, కాదు కాదు, అంతకంటెను ఇదియే'అని పెనంగఁదగినవి. ఐనను భవభూతి నిర్వాహము రసవత్తరముగానున్నది. లెస్సగా అరసిన నిజముగా రామశోకమే పెద్దది. సంభోగము ఇంచుక చూపి దానినుండి విప్రలంభమును దించుటచే ఇట ఉత్తరరామ చరిత కరుణము సద్యఃపరభాగము నొంది మెఱుఁగెక్కినది. మఱియు కుందమాలలో అప్పుడే సీతతో రామ సందేశమును జనాపవాదమునకై తన వివాసనమనియు, కలలలో తన్నే కౌఁగిలించుకొనుచుందుననియు, యజ్ఞములందు తత్ప్రతికృతిని సహధర్మచారిణిగా నుంచుకొందుననియు చెప్పించుటచే ఆ దుఃఖమునకు ఎంతయో ఊఱట కూర్పఁబడినది. సీతయు రాముని లోకారాధన వ్రతమున సహభాగినికదా. కుందమాలలో ఇట సీత ప్రాధాన్యము, ఉత్తరచరితమున రాముని ప్రాధన్యము.

రెండు నాటకములందును మొదటి యంకమునకును రెండవదానికిని నడుమ దీర్ఘ వ్యవధానము పది పన్నెండేండ్లు.

కుందమాల రెండవయంకమున సీత వాల్మీకియాశ్రమమున కుశలవులఁ గని పెంచుకొనుచు పది పన్నెండేండ్లుగా మునికన్యలతో కలసిమెలసి ఆశ్రమధర్మమున

ఉన్నను, ఒంటిపాటుల రామవియోగమున మనసున నే భావములతోనున్నదో అది చెప్పఁబడినది. అట్టి దానను అంతటిదానను ఇట్టి యీ గతికి వచ్చితినే అని దుఃఖమును సిగ్గు మ్రింగుచున్నదఁట. కుశలవుల కేని నాయనదర్శన మగునా అని ఆమె దైన్యము. ఇంతలో రామాశ్వమేధమునకు వాల్మీకులవారికి పిలుపు. అది విని సీత కుశలవులను ఆ యజ్ఞమునకు పోవువారితో అచటికి పంపఁగోరును. ఉత్తరచరిత రెండవ యంకమున రాముఁడు సీతావియోగ దుఃఖమున కుములుచున్న పన్నెండేండ్లకు అశ్వమేధము తొడంగి ఇంతలో బ్రాహ్మణ శిశు సంజీవనముకోసము శంబూకుని వధించుటకై అతఁడు తపస్సుచేయుచున్న దండకాజనస్థానమునకు తనకుతెలియకుండనే పుష్పకముచే చేర్పఁబడును. సీతా సహవాససాక్షులగు ఆ పంచవటిని ఆ చుట్టుపట్టులను చూచి ఇట్లు ఇపుడు సీత లేకపోయినదే అని సీతకు తాఁ గావించిన కీడును తలఁచుకొని మిక్కిలి దుఃఖించును. అతికరుణము. ఇంతలో అగస్త్యులవారు పిలువనంపఁగా తాను వారిని దర్శింపఁబోవును. కుందమాల సీతనుచూపి పన్నెండేండ్ల సీతదుఃఖమును చెప్పఁగా, ఉత్తరచరిత రాముని చూపి పన్నెండేండ్ల రామదుఃఖమును - స్వప్నవాసవదత్త తాపసవత్సరాజ విక్రమోర్వశీయ శాకుంతలములు నాయకదుఃఖమునే ప్రధానముగా చెప్పినట్లు—చెప్పినది.

కుందమాల మూఁడవయంకమున నైమిశము. అందు సలక్ష్మణుఁడు రాముఁడు 'ఏమైపోయినదో కదా సీతః' అని పరిదేవించుచు వాల్మీకి యాశ్రమమును దటియుచో గోమతిలో సీతకూర్పు నేర్పును జ్ఞప్తిసేయు కుందమాలను—భాసుని స్వప్న వాసవదత్తమందలి వాసవదత్త మాలగ్రుచ్చు నేర్పును విరహి వత్సేశునికి జ్ఞప్తిసేయు పద్మావతి పెండ్లిమాలం బోనిదానిని—చూచి, అటుపై గట్టుమీఁద రేఖాకమలతిలకితమును సీత యడుగుజాడం బోని యడుగుజాడను గాంచి, ఆసతో అనుసరించి, అంతట అది యగపడకపోఁగా మార్గశ్రమకై రవంత చెట్లనీడలో కూర్చుండును. ఆ తేటనీటి యేటిజాలుతోడి యీ యందమైన యడవి సన్నివేశము మునుపటి తన సీతసావాసముతోడి దండక సన్నివేశమును స్మృతికి ఎలయింపఁగా, అయ్యో జానకీ, వనవాససహాయినీ అని అతివిక్లబుఁడై గొంతెత్తి యేడువఁజొచ్చును. దానిని అటనే చెట్లచాటున ఉన్న సీత విని చూచి పొంగినశోకముతో రాముని కన్నీటిని తాను తుడుతునా అని అటుపోఁబోయి, ఇంతలో ఎవరేని చూతురేమో అని జంకి, కుశలవుల సంభావించెదనని వెడలును. ఇంతలో వాల్మీకి శిష్యుఁడు వెదకికొనుచు ఎదురువచ్చి ప్రభువును రాముని వాల్మీకి దర్శనమునకు పిలుచుకొనిపోవును. ఇట్లు ఇట ఒకసారి సీతకు రాముఁడు అగపడినాఁడు. అతని పరిదేవనము సీతకు వినఁబడినది. 'న ఖలు

న జనః శోచనీయః, య ఏవం వల్లభేన శోచ్యతే.' అని సీత తన ధన్యతను పలికినది.

కుందమాల నాలవయంకమున శ్రీరాముఁడు నైమిశ రామణీయకమును తిల కించుచు విహరించుచుండి, తన యేడ్చి వాచిన కన్నులు అచటికి వీచిన హోమధూమ రాశికి మఱింత మందఁగా వానివి చన్నీటితో కడిగికొనుటకు అచటి యాశ్రమంపు డిగ్గి యలో దిగును. ఆ డిగ్గియచెంత ఆ పనికి ఈ పనికి అక్కడపడి నడయాడు స్త్రీలు మగవారికంట పడనీకుండ తిరస్కరణమును వాల్మీకి నిజతపఃప్రభావమున అను గ్రహించి యున్నందున రామునికి తా నగపడకుండుటకై ఆ దినాలలో సీత అక్కడ ఒడ్డున కాలము పుచ్చుచున్నట్టిది అప్పుడు నీటిచేరువ నుండఁగా తా నగపడకయే నీటిలో ఆమెనీడ రామునికి అగపడును. ఇంతలో ఆమె అపసరిల్లగా—స్వప్ననాటక మున కలలోనుండి తటాలున మేల్కాన్న వత్సేశునికి ఆ విభ్రమనకలో వాసవదత్త అగపడి మాయమైనట్లు—అది అటు మాయమగును. అంతట రాముని మూర్ఛ. సీత వచ్చి కౌఁగిలించుకొని తేర్చుట. తేఱి, రాముఁడు 'నేను మరల వెన్నెలరేయినీప్రక్కన ఎప్పుడు పుత్తునే, ప్రేయసీ!' అని తలపోసికొని మరల మూర్ఛిల్లుట. సీత తనచెలి చిత్రకూట వనదేవత మాయావతి మునుపు ఒసంగిన తన పైటచెరఁగుతో వీచుట. రాముఁడు ఆ తాఁకుడునకు ఆ కొంగుపట్టుకొని కన్నీటిందుడుచుకొన లాగఁగా అది పట్టువడి చేతికివచ్చి రామునిచే ఆనవాలు పట్టఁబడుట—దానితో రాముఁడు సబహు మానముగా, ప్రియాలింగనమువలె, ఆప్యాయముగా తన్ను కప్పుకొని తన యుత్త రీయమును పాఱవేయుట, అది సీతచేతఁబడి బయలిలో మాయమగుట, దానితో సీత తన్ను కప్పుకొని ప్రియాలింగనసౌఖ్యమునొంది, ప్రొద్దుక్రుంకఁబోవఁగా తాను ఆశ్రమ మునకు మరలుట. ఆసలు ఈరికలెత్తి రాముఁడు ప్రకృతు లగపడక అట్లు ప్రతికృతు లగపడుట ఆ సిద్ధాశ్రమ మహిమ కాఁబోలు నసుకొనుచున్నంతలో తన వయస్యుఁడు వచ్చుట. ఇదెల్ల అప్సరస తిలోత్తమ కావించిన తమాషామోసము అని తా నెఱుంగుదు ననుట. అయ్యో దప్పికి ఎండమావులను దోసిలించితినే అని రాముఁడు ఆసడింది సాయంకాలమునకు ఆశ్రమముచేరుట. ఇందు మరల నొకమాఱు సీతకు రామసమాగ మము చెప్పఁబడినది. అంకమున రామునికంటె సీతయే ప్రధానీకృతయా అని తోఁచును. కాదా ఉభయుల సమప్రాధాన్యము. ఇందు తిరస్కరిణీమహిమచే సీత రామునిఁ గాంచుట, తాను అతనికి అగపడకుండుట, సీత కౌఁగిలించుకొని ఆ స్పర్శసుఖముచే రాముని మూర్ఛతేర్చుట, చిత్రకూట వనదేవత మాయావతి, 'అహో అత్యాగయోగ్యాః

ప్రాంశాః ! నిత్యప్రసన్నాహమ్' అని సీత పలుకుట — ఇవి పఠికింపఁదగును. ఇందెల్ల ఇటు సీతయు అటు రాముఁడు ఒంటరులు. ఇదెల్ల కరము రసవంతముగానే ఉన్నను ఉత్తరచరితంబట్టి ఇనుముప్రాయమే అని తోఁచి అది భవభూతిప్రతిభయను పరుసము సోకి ఎంతటి సువర్ణ మాయెనో అరయఁదగును.

ఉత్తరచరిత మూఁడవయంకమున ఈ కుందమాల రెండంకములందు దోఁచు నదియు ఒక్కట సమాహరింపఁబడినది. అదెట్లో ఉత్తరచరిత తృతీయాంక వస్తువున విశదమగును. సీతకు ఎన్నండో చిత్రకూటమున ఒకసఖి వనదేవత మాయావతి ఆయుత్త రీయము విచ్చియుండెను అని మాయావతిప్రస్తావమాత్రము కుందమాలలో. భవభూతి సృజించిన జనస్థాన వనదేవత వాసంతి ఉత్తరచరితలో ప్రధానపాత్రమై రాముని కరుణ వృత్తమును ఆహా యెట్లెట్లు నడపినది! అందు సీతకు వాల్మీకిమహిమచే తిరస్కారణము, ధాన ధీరముగా తెగించిన సీతచే యాలింగనము ఉత్తరీయవీజనము మొదలగునది. ఇందు సీతకు భాగీరథిమహిమచే తిరస్కరణము దాన ధీరముగా తెగించిన సీతకరస్పర్శ మొద లగునది. వానిచే ఆరసోత్తరప్రపంచము. అందు సీతారాములు ఒంటరులైన ఇందు ఆమెకు తమసయు ఆయనకు వాసంతియు తోడై రసము వెల్లిగొల్పను కలుషాపాటిం పను, రసంపు జాలుకు మడవవేయను తీయను మిక్కిలి ఉపకరించిరి. మఱియు ఈ సంవిధానమునకు కుందమాలయందలియజ్ఞముకోసము క్రొత్తగా వారు ఇటునటు విడిసిన నైమిశమునకన్నను వారిపూర్వవిహారసాక్షులతోడి సాక్షాజ్జనస్థానపంచవటి యెట్టి మేలిచోటు! మహాకవి తన కల్పనకు తానే తనిపి అబ్బురపడి ఆహా ఎట్లు కుదిరినది! సీతారాములతోఁగూడి తాను ఎట్టి బ్రహ్మానందమును అనుభవింపఁ గంటిని! 'విన్దేమ దేవతాం వాచ మమృతా మాత్మనః కలామ్' అను తన యాశంస ఎట్లు ఫలించినది! అని "అహో సంవిధానకమ్!" అనియు "ఏకో రసః కరుణ ఏవ" అనియు తన్మయతతో చెప్పికొన్నాఁడు. అంకమున రామప్రాధాన్యమునే ప్రోదిచేసినాఁడు. (సోచ్ఛ్వాసమ్) 'ఉత్ఖాత మిదానీం మే పరిత్యాగశల్యం ఆర్యపుత్రేణ' అని ఈ సంవిధాన ప్రయోజనమును సీతచే చెప్పించినాఁడు. మఱియు పృథ్వీ భాగీరథులచే తల్లి యత్తలచేతం బోలె సీతకు కాన్పు చేయించి సీతను భాగీరథమ్మయింటను కుశలవులను వాల్మీకినాయనవద్దను ఉంచి, కుందమాలలోని కన్నమ మనోహరమగు 'ఇతివృత్త కౌటిల్యమును' గూర్చి నాఁడు.

కుందమాల యయిదవయంకమున రాముఁడు తన నైమిశ లక్ష్మీనివాసభవనమున ఋషులు కిటకిట కిందికియుండ యజ్ఞమునకైన తపోధనుల సమాగమము తా నెదురు

చూచుచుండఁగా కుశలవులు తాపసకుమారులు వాల్మీకిశిష్యులుగా ప్రవేశించి రాము నెదుటికి కొనిరాఁబడుదురు. అంతట వారిని రాముడు ఆనవాలుపట్టుటకై యల్లిక. కంచుకి ప్రభృతులు వారిం గాంచి, కన్నుల నీరు తేలు, మహారాజాదినాల రామ లక్ష్మణుల బాలభావమును స్మరించుచున్నా మందురు. రామునికిని వారినిచూచిన మాత్రకు కన్నుల నీరు తేలును. మనసు అట్టుమ్రొగ్గును. అందరి పాద్వసప్రహర్ష శోకామ క్రోశముల కూడలికి రాముడు మూర్ఛిల్లి అంతలో తెప్పఱిల్లి, ఆ దేహబంధము ఆ వేషము ఆ నడక చూచి వారు కులీనులు గావలయునని శంకించును. వారు తన్ను నమస్కరించి కుశలమడుగఁగా వారిని ఆలింగనముచేసికొనక ఉండలేకపోవును. చేసి కొని తనయ పరిష్వంగసౌఖ్యమును స్మరించుకొనును. తన యొడిలో కూర్చుండ బెట్టు కొనును. వారివయసు సీత నిర్వాసకాలమునకు సరిపోవుచున్నదని యనుకొనును. మన సున తనంతట అనుకంపార్ద్రవత చెందును. సింహాసన స్పర్శమున రాఘవేతరులకుం బోలె వారికి తల పగులమిని ఎంచుకొనును. వారు క్షత్రియబ్రహ్మచారు లని, సూర్య వంశమువా రని, అమడ లని, వారికి వాల్మీకి ఉపనయన గురువే కాని కన్న నాయన కాఁడని వారి కన్ననాయనను అమ్మ నిరనుక్రోశుఁడని పేర్కొను నని, ఆయనను తాము చూచి యెఱుంగ మని, తమ యమ్మ పేరు తాపసులు దేవి యని, వాల్మీకి వధు వని యందు రనియు వారివలన ఎఱింగి, అది సర్వము తన కుటుంబవృత్తాంతముతో సంవదించు చున్న దని చిత్తమున ఉఱ్ఱూతలూగును. ఇంతలో వాల్మీకిదూత వారిని 'ఏరీ వారు, మధ్యాహ్నము కావచ్చినదే, సవనకాలము దాటకముందే రామునికి ఆ దేవునికథ పాడి వినిపింపవలసియుండెనే?' అని పిలుచును. ఇది యిందలి యభిజ్ఞానక్రమము.

ఆఱవయంకమున వారి రామాయణగానము, సీతా వివాసనమువఱకు, తరువాతి చరితము వారికి ఒప్పగింపను రాదు. ఆ తరువాతిచరితమును రాముని మునివయస్యుఁడు కణ్వుఁడు పాడఁగా అందు సీత వాల్మీకిరక్షితయై అమడలం గనఁగా వారికి ఆయన కుశలవులని పేరిడెనని వినఁగానే కుశలవులు నాయనను రాముని, రామలక్ష్మణులు కొడుకులను కుశలవులను ఆలింగనముచేసికొని, నలువురును ఒక్కట మూర్ఛిల్లుదురు. అంతట వాల్మీకి సీతను వెంటఁగొని అచటికివచ్చి వారిం దేర్చును. తేర్చి రాముని చూచి సీతశుద్ధిని అన్నివిధాల ఎఱింగియు, వట్టి జనవాదమాత్రకు అట్లేల తఱిమితివని కోపముచేసి, సరే, అమ్మా ఈ యందఱియెదుట నీ యాత్మశుద్ధిని మఱొకమాఱు ఋజువుచేయవమ్మా' అనును. అంతట సీత నేనేగనుక పతివ్రత నగుదునేని మా యమ్మ భూతధాత్రి ఈ యందఱికి దివ్యరూపాన కన్నుల-కగుపడి నా శుద్ధిని చాటును

గాక అనుటయు, అంత కొండలు ఊఁగ సముద్రములు పొంగ పెనుమ్రోఁతతో విశ్వం భరాదేవి దివ్యరూపముతో ఆవిర్భవించి సీతశుద్ధిని మఱిసందేహము లేకుండునట్లుగా వారి ఎల్లరను ఒప్పింపఁగా రాముఁడు సీతను మరల అంగీకరించి తనతో యజ్ఞదీక్షకు పూన్చును. అంతట వసుంధర అంతర్ధానమగును. రాముఁడును వాల్మీకిచే కుశుని రాజ్యమున అభిషేకింపించి, తానే సొంతముగా లవుని యౌవరాజ్యమున అభిషేకించును.

ఉత్తరచరిమున భవభూతియు నాలవయంకమునుండి కుశలవాభిజ్ఞానమునకు అల్లిక తొడంగును. ఐదవయంకమున కొంత సాగును. ఆఱవయంకమున ఎక్కువగా ప్రవర్తిల్లి, అది యేడవయంకమున నెఱవేఱును. ఆ కరుణనాటకమున జనకుని కౌసల్యారుంధతులను వసిష్ఠులవారిని సీతాశోకమునకై అట్లు వలసవచ్చిన వారింగా వాల్మీకి యాశ్రమముకడఁ గూర్చుట భవభూతి ప్రతిభోన్మేష రసవత్సృష్టి. వారికే ఆ సీతారాముల పోలికలచే లవుఁడు దౌహిత్రుఁడు పౌత్రుఁడు దేవునికిని అమ్మవారికిని కొడుకు అని దాఁగుడుమూఁతగా తోఁచి వారి చిత్తమున భావములు రేపును. అది అభిజ్ఞానారంభము. 'కంచుకిప్రభృతులు వారియెడ రామలక్ష్మణుల పోలికలనుబట్టి తేటిన కన్నీళ్ళతో వారితో ఏమేమో మాటలాడుచున్నారు' అను కుందమాల యలంతి వాక్యమునకు ఇది అద్భుతవిస్తరము, ఒక పూర్తి యంకము. ఐదవయంకమున సుమంత్రుఁడు విలుఁదాల్చిన లవుం గాంచి కౌశిక మఖరక్షక బాలరాముని స్మరించును. అతని జృంభకప్రయోగముం గాంచియు, ఆకారమును నిపుణముగా పరికించియు ఒక వేళ ఇతఁడు సీతకొడుకగునా అని శంకించును. చంద్రకేతువును 'నవ ఇవ రఘు వంశ స్యాప్రసిద్ధః ప్రరోహః' అనియు, 'పురాణో వా జన్మాన్తర నిబిడబద్ధః పరిచయః' అనియు, 'నిజో వా సమ్బన్ధో విధివశా త్కో ప్యవిదితః' అనియు వితర్కించుచు లవ దర్శనమున తన్మయతా చిత్తప్రసన్నతామోద పరిరంభణేచ్ఛలను పొందును. వీర రసము నాయకనిష్ఠమైనను శృంగారమునకు అంగికి విరోధము కాదుగదా. మఱి అది యిట ఇట్లు కుమారనిష్ఠమైనదే ఇఁక చెప్పవలయునా? అనంతర వృత్తమునకు ఇది కరము శ్లాఘ్యమగు పరభాగముం గూర్చును. కౌసల్యా జనకుల యేడ్పునకైన నాలవ యంకమునకును రాముని యేడ్పునకైన యాఱవ యంకమునకు నడుమ ఈ కుమారవిక్రమము లోభనీయమైన విచ్ఛేదమై మనసునకు ఎంతయో చమత్కారము కలిగించుచున్నది.

ఆఱవయంకమున లవ రామ సమాగమము. తరువాత వారితో కుశసమాగమమును. సప్తలోకైక వీరుఁడును సకలరాక్షస నిరాముఁడు నగు రాముని కొమారులయందు

కుందమాలలో పరాక్రమసూచనకు అవకాశము లేనేలేదు. ఇందందుల కెంతేని అవకాశము కల్పింపఁబడినది. రాముఁడు లవుని యాకార గాంభీర్యమును కనిపట్టును. లవుఁడు పుణ్యప్రభావ దర్శన మహాపురుషుఁడుగా చూడఁగానే తోఁచిన రామునిఁగాంచి, తమంతనే తన వైరగర్వము అడఁగి, వినమ్రుఁడై పోవును. రాముఁడు నిమిత్త మెఱుంగకయే ఏ గూఢహేతువుననో లవునియెడ స్నేహమునొందును. లవుఁ డభివాదనము చేయును. రాముఁడు తా నాతని కౌఁగిలించుకొని తన్నాతని చిక్కఁగా కౌఁగిలించుకొమ్మని, ఆ తాఁకునకు ఆనందమొందును. అశ్వరక్షాసేనపై అతఁడుచూపిన వీరము నభినందించును. జృంభకాస్త్రములు ఆతనికి స్వయంప్రకాశములు అనఁగా అది యే పుణ్యమహిమనో అనుకొనును. ఇంతలో లవునికి బాసటగా కుశుఁడు ధనువు నాస్ఫాలించుచు వచ్చును. ఆ పౌరుషాతిశయమును రాముఁ డభినందించును, కుశుఁడు రాముని రూప ప్రసాదానుభావములకు పరవశుఁడగుచు అభివాదనముసేయును. రాముఁడు ఆతని చీరి కౌఁగిలించుకొని అమృతపు మడుఁగున మునిఁగి తేలును. తాను ఆ బాలుర సకలభావములు, వినయము, స్థితము, ఆసనము మొదలగునవి సామ్రాజ్య సూచకము లని అనుకొనును. వారియందు రఘుకుల కుమారుల పోలికలను కనిపట్టును. వారి యందు తన పోలికమాత్రమే కాదు, సీత పోలికయు ఉన్నదని తలంచును. అది సీతను విడిచిన వాల్మీకి తపోవన ప్రాంతమనియు, వారికి జృంభకములు స్వయంప్రకాశము లగుట నాడు చిత్రదర్శనమున తన దీవెనప్రభావము కాఁబోలు ననియు, దేవేరి గర్భము రెండుగానుండుటను తాను గనియుంటిననియు తన మనసునకు తెచ్చుకొనును. అన్నిటికి పైన వారి సమాగమమున తనయాత్మలోని సుఖాతిశయమును తలంచుకొనును. వారిచేత రామాయణమును అటనట పఠింపించి విని సీతకైన తన దుఃఖమున ఊక పుటమునంటోలె ఉడుకును. ఇంతలో వసిష్ఠారుంధతీ జనక కౌసల్యలు అచటికి పదుచు లేచుచు వచ్చుచున్నారని విని వారిని సంభావింపఁబోవును.

ఏడవయంకమున భవభూతి నిర్వహించిన నిర్వహణము అంతర్నాటికా పూర్వకము కరము సుశ్లిష్టముగా కుందమాల నిర్వహణమునకన్నను ఎన్నియో మడుంగులు సొంపుగానున్నది. ఇందు అనావశ్యకమును కుదిరికలేనిదియు నగు కుశలవుల యభిషేకము లేదు. వివాసనము మొదలు నాఁటివఱకు జరిగిన సీత చరితము, వాల్మీకి ఆర్షనేత్రముతో చూచి యెఱింగి రచించినది రామాదులయు జంగమ-స్థావర సకలప్రాణులయు ఎదుట నాటక మాడఁబడినది. అంతటి కుందమాలలో చెప్పిన పృథ్వి యావిర్భావము తెఱంగునకన్న నాణెముగా సీతను వెంటఁగొన్న పృథ్వీభాగీరథుల

యావిర్భావము చెప్పఁబడినది. వారు ఆ చిత్రదర్శన వివాసన సమయములందు రాముఁడు తమ్ము కోరినపనిని సీతాపర్యవేక్షణమును అట్లే చేసితిమని ప్రభువునకు రామునకు నివేదించి, తమ మెచ్చిన శీలశాలినిని పతిదేవతను సీతను అరుంధతికి అప్పగించి అంతర్ధానమగుదురు, అరుంధతియు ఎదుట దీని నంతయు పరికించుచున్న లోకమునకు సీత పుణ్యచారిత్రమును చాటి ఒప్పించి సీతను రామునితో యజమాన పత్నిగా కూర్చును. ఆమె మాటమీఁదనే వాల్మీకియు కుశలవులం దెచ్చి సీతారాములకు అప్పగించును.

కుందమాలలో చెప్పిన కుశలవుల యభిషేకములం జూడఁగా సీతా వివాసమునకు పూర్వము రాముఁడు చిరము రాజ్యమేలెననియు అంతట ఈ సీతా గర్భధారణ వివాసన విరహ దుఃఖములు కలిగినవనియు, ఆ కాలమున రాజ్యనిర్వేదము కలిగిపోయిన దనియు, అంతట ఈ సమాగమము సిద్ధింపఁగా కొడుకులును తన్ను కలసికొనఁగా వారిని అభిషేకించి తాను విరతుఁడాయెననియు తోఁచును. అట్లే ఉత్తరకాండలో సీతా గర్భధారణ వివాసనములకు ముందు (42 సర్గ - 26 శ్లో) 'దశవర్ష సహస్రాణి గతాని సుమహాత్మనోః ప్రాప్తయోర్వివిధాన్ భోగా నతీతః శిశిరాగమః' అని ఒక పదివేల యేండ్లు చెప్పఁబడినది. దీనింబట్టి లంకనుండి మరలిన తరువాత పదివేలయేండ్లకు సీతకు గర్భమును, ప్రజలలో సీతంగూర్చిన యా పరగృహవాసదూషణమును పొసఁగినవని యేర్పడును. దాన నాటకమున వస్త్వనౌచితి తోఁచును. అట్లు పదివేలయేండ్ల యెడము చెప్పక, రామాభిషేకమునకు తరువాత యథోచిత వ్యవధానము మాత్రము గ్రహించి గర్భమును సడిని చెప్పిన రసవంతముగానుండును, ఇటీవలనే అన్ని పాట్లు పడి భయంకర వియోగదుఃఖముల ననుభవించి ఇల్లుసేరి రవంత హాయిగన్న సీతకు మరల నింతలో ఈ దుఃఖమా, అదియును నావలననే యగునా అని రామునియు అట్లే సీతయు కరుణము ప్రశంసనీయమును మానసముల కరఁగించునదియు అగును. కాళిదాసు ఈ మార్గ మవలంబించినాఁడు. భవభూతియు అలంతి మార్పులతో ఈ మార్గమే పట్టినాఁడు. ఇందు పునఃసంయోగానంతరము—భూప్రవేశానంతరమేని— పదివేలయేండ్లు ఏలి తరువాత సుతవిన్యస్తరాజ్యుఁడై విరమించుట లెస్సయగును. అందులకు అవకాశము కలుగునట్లుగా పునఃసంయోగ ఫలప్రాప్తితో నాటకము ముగియుట శ్లాఘ్యమగును. వాల్మీకి 99 స - 9 శ్లో. లో మరల చెప్పిన 'దశవర్ష సహస్రాణి వాజిమేధా నథా కరోత్' అను మాటయు, తరువాత 107 స - 17 శ్లో. న చెప్పినట్లు తన నిర్యాణమునకు అనతివ్యవహితముగా 'కోసలేషు కుశం వీర ముత్తరేషు తథా

యతిపవిత్ర నిర్వాహమును వాల్మీకి వాక్యమునకుంబోలె తనవాక్యమునకును చెందునట్లుగా భవభూతి దృఢవిశ్వాసముతో 'పాప్మభ్యశ్చ పునాతు వర్ధయతు చ శ్రేయాంసి సేయం కథా మాఙ్గల్యా చ మనోహరా చ జగతాం మాతేవ గఙ్గేవ చ, తా మేతాం పరిభావయ న్త్వభినయై ర్విన్యస్తరూపాం బుధాః శబ్దబ్రహ్మ విదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీ మిమాం,' అని చెప్పుకొని తనిసినారు.

మఱియు కుందమాలకును ఉత్తరచరితకును ఎన్నియో భావముల సాదృశ్యమును ఎన్నియోమాటల చమత్కారమున సాదృశ్యమును, ఒక్కవస్తువునే మహాకవులు అన్లినపుడు కాకతాళీయముగా నైనను కలుగతగినవి, తారతమ్యగణనకు తగినవి, కలవు, వానిని పరికింపఁదగును. ఇవిగో కొన్ని.

1. కుందమాలలో ఇది లక్ష్మణవాక్యము—'సమాదిష్టోఽహ మార్యేణ, అథవా స్వామినా:' ఉ.రా.చ.లో మొట్టమొదట లక్ష్మణునికి రాముని యాదేశము 'ఏష తే మాతనో రాజా రామః సమాజ్ఞాపయతి.'

2. ఇదియు - 'త న్న శక్నోమి సీతామాత్రస్యకృతే శరచ్చన్ద్ర నిర్మలస్య ఇక్ష్వాకుకులస్య కలఙ్క ముత్పాదయితుమ్.' ఉ.రా.చ,లోను - 'యత్సావిత్రై ర్దీపితం భూమిపాలై, ర్లోకశ్రేష్ఠై స్సాధు శుద్ధం చరిత్రమ్, మత్సమ్బన్ధాత్ కశ్మలా కింవదన్తీ, స్యా చ్చే దస్మిన్ హన్త ధి ఙ్మా మధన్యమ్.'

3. ఇదియు - 'అహ మపి స్వజన విస్రమ్భ నిర్విశేషాం దేవీ హృదయ, గృహహారిణీ మివ పర్యటామిం. వన ముపనయామి.' ఉత్తరచరిత్రలో - రామవాక్యములు ప్రియాం....సౌహృదా దపృథగాశయా మిమాం, ఛద్మనా పరిదదామి మృత్యవే. సౌనికో గృహశకున్తికా మివ.' 'విస్రమ్భా దురసి నిపత్య జాతనిద్రాం....క్రవ్యాద్భ్యో బలి మివ నిర్ఘృణః క్షిపామి."

4. ఇదియు - 'ఆదాయ పఙ్కజవనా న్మకరన్దగన్ధాన్, కర్ష న్నితాన్త మధురాన్ కలహంస నాదాన్, శీత స్తరఙ్గకణికా వికిర న్నుపైతి, గఙ్గానిల స్తవ నిభాజన కాఙ్క్ష యేవ.' మఱియు (I - 5) 'జాతశ్రమాం కమలగన్ధ కృతాధివాసైః, కాలే త్వ మ ప్యను గృహాణ తరఙ్గవాతైః, దేవీ యదా చ సవనాయ విగాహతే త్వాం, భాగీరథి. ప్రశమయ శ్రమ మప్యుద్వేగమ్.' ఉ.రా.చ.లో గోదావరికి లోపాముద్ర సందేశము - (III-2) 'వీచీ వాతైః శీకర క్షోద శీతైః, ఆకర్షద్భిః పద్మకిఞ్జల్క గన్ధాన్. మోహే మోహే రామ భద్రస్య జీవం, స్వైరం స్వైరం ప్రేషితై స్తర్పయేతి.'

5. కుందమాలలో సీతవాక్యము - (I) 'హా తాత ఆర్య కోసలాధిప, అద్యోపరతో౽పి' అని దశరథుం దలఁచుకొని యేడ్చుట. ఉ.రా.చ.లో - (II)-వాసంతివాక్యము- 'హా కష్టం!....జీవ స్త్రీషు వృద్ధాసు రాజ్ఞీషు కథ మిదం జాతమ్?' మరల కౌసల్యా వాక్యము-(IV)-సర్వదా మహారాజో భణతి 'ఏషా రఘుకుల మహ త్తరాణాం వధూః; అస్మాకం పునః జనకసమ్బన్ధేన దుహితైవ' అనియు, కంచుకి వాక్యము (IV. 16) 'వధూచతుష్కే౽పి యథా హి శాన్తా, ప్రియా తనూ జాస్య త దైవ సీతా.' అని కుంద మాలలో సీత తలఁచుకొన్న దశరథనాయన కూరిమిని ప్రతియోగి మర్యాదగా ఇందు కౌసల్య ఇట్లు చెప్పినది.

6. కుందమాలలో లక్ష్మణవాక్యము - I - 13 - 'కిన్తు లోకో నిరఙ్కుశః.' ఉ.రా.చ.లో రామవాక్యము - III - 'లోకో న మృష్యతీతి.'

7. కుందమాలలో సీతవాక్యము - I 'సర్వథా అలం మహిళాత్వేన.' ఉ.రా.చ. లో సూత్రధార వాక్యము- 'యథాస్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః,'

8. కుందమాలలో సీతవాక్యము - II - 'కథం తస్య హృదయం సీతాయాః పరకీయమ్?' ఉ త్తరచరితమున సీత వాక్యము - III - 'అహ మేతస్య హృదయం జానామి, మ మా ప్యేష ఇతి.'

9. కుందమాలలో సీతవాక్యము - III - కోనుఖ ల్వేష సజల జలధర స్తనిత గమ్భీరేణ స్వరవిశేషేణ అత్యన్త దుఃఖభాజన మపి మే శరీరం రోమాఞ్చయతి! సువ్య క్తం సో౽త్ర నిరనుక్రోశః సంప్రా ప్తః: ఉ త్తరచరిత. అహో జలభరిత మేఘ స్తనిత గమ్భీర మాంసలః కుతో ను ఏష భారతీ నిర్ఘోషః, భ్రియమాణ కర్ణ వివరాం మా మపి మన్దభాగ్యాం ఝటి త్యుత్సుకయతి! ..మయా పునః స్వరసంయోగేన ప్రత్యభిజ్ఞాత మార్యపు త్త్ర ఏవ వ్యాహర తీతి.

10. కుందమాలలో సీతావాక్యము :- 'అహో దృష్ట ఇతి పరితోషః, చిరప్రవాస ఇతి మన్యుః, పరిక్షామ ఇత్యుద్వేగః, నిరనుక్రోశ ఇత్యభిమానః చిరపరిచిత ఇత్యను రాగః, దర్శనీయ ఇత్యుత్కణ్ఠా, స్వామీతి బహుమానః. కుశలవయో స్తాత ఇతి కుటుమ్బినీ సద్భావః, అపరాధం ప్రవేశితాస్మీతి లజ్జా. న జానామి ఆర్యపుత్ర దర్శనేన కీదృశీ మవస్థా మనుభవామీతి!' ఉ త్తరచరిత - III - సీతవాక్యము 'భగవతి తమసే, తథానిష్కారణ పరిత్యాగినో౽పి ఏత స్యైవంవిధేన దర్శనేన కీదృశో మే హృద యానుబన్ధ ఇతి న జానామి' తమసా. 'జానామి వత్సే, జానామి - III - (13) తటస్థం నైరాశ్యా దపి చ కలుషం విప్రియవశాద్ వియోగే దీర్ఘే౽స్మిఞ్ఝటితిఘట నో త్తమ్భిత

మివ, ప్రసన్నం సౌజన్యా ద్దయితకరుణై ర్గాఢ కరుణమ్ ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణ ఇవ.'

11. కుందమాలలో రామవాక్యము III - నిస్సమ్పాత వివిక్త మిద మరణ్యం తటరుహ తరుచ్ఛాయా సమాకీర్ణ రమణీయ సైకతాం ప్రసన్న సలిలవాహినీం సముద్రగామినీం చ అవలోకయన్ సంస్మృత్య దణ్డకావనవాస మేవం వైక్లబ్య మనుప్రాప్తోఽస్మి, ఇత్యాది. ఇది సాదృశ్యముచే నైమిశమున దండకారణ్య స్మరణము. ఉత్తర చరితముననో దండకారణ్యమే - III - (8) యత్ర ద్రుమా అపి మృగా అపి బన్ధవో మే యాని ప్రియాసహచర శ్చిర మధ్యవాత్సమ్। ఏతాని తాని బహునిర్ఝర కన్దరాణి గోదావరీ పరిసరస్య గిరే స్తటాని" ఇత్యాది.

12. కుందమాలలో రామవాక్యము, III - 13. పూర్వం వనప్రవాసః పశ్చా ల్లఙ్కా తతః ప్రవాసోఽయం!। ఆసాద్య మా మధన్యం దుఃఖా ద్దుఃఖం గతా దేవీ." ఉ రా.చ.లో పృథ్వీవాక్యము VII - 4. 'ఏక శ్చిరం రాక్షసమధ్యవాసస్ త్యాగో ద్వితీయశ్చ సుదుస్సహోఽస్యాః।'

13. కుందమాలలో సీతావాక్యము. III 'ఆర్యపుత్ర, నిర్వాసితాయాః అసదృశమ్' ఉత్తరచరితలో III 'అసదృశం ఖలు ఏత ద్వచనం అస్య వృత్తాన్తస్య.

14. కుందమాలలో III 14. వాల్మీకి శిష్యవాక్యము.

'మన్దం వాతి సమీరణో న పరుషా భాసా నిదాఘార్చిషో,
న త్రస్యన్తి చర న్త్యశఙ్క మధునా మృగ్యోఽపి సింహైః సహ
మధ్యాహ్నేఽపి న యాతి గుల్మనికటం ఛాయా తద ధ్యాసితా
వ్యక్తం సోఽయ ముపాగతో వన మిదం రామాభిధానో హరిః.'

ఉత్తరచరితలో III - 17 వాసంతి వాక్యము:—

దదతు తరవః పుష్పై రర్ఘ్యం ఫలైశ్చ మధుశ్చ్యుతః
స్ఫుటిత కమలామోదప్రాయాః ప్రవాన్తు వనానిలాః
కల మవిరళం రజ్యత్కణ్ఠాః క్వణన్తు శకున్తయః
పున రిద మయం దేవో రామః స్వయం వన మాగతః.

15. కుందమాలలో రామవాక్యము—III - 21. అవిదిత మనుసృత్య చిత్రకూటే సుతను సుమాపచయాయ నిర్గతాం త్వాం, కుసుమ మపచితం వికీర్య భూమౌ స్మరపి రపేన మయా ధృతం పటాన్తమ్. ఉ.రా.చ.లో వాసంతి వాక్యము-III-30-

" అస్మిన్నేవ లతాగృహే త్వ మభవ స్తన్మార్గదత్తేక్షణః,
సా హంసైః కృతకౌతుకా చిర మభూ ద్గోదావరీసైకతే,
ఆయాన్త్యా పరిదుర్మనాయిత మివ త్వాం వీక్ష్య బద్ధ స్తయా,
కాతర్యా దరవిన్ద కుట్మలనిభో ముగ్ధః ప్రణామాఞ్జలిః."

16. కుందమాలలో రామవాక్యము III - (15 - 16) దేహి మే దర్శనం ప్రియే ....కింను విష్కరుణా మయిః ప్రసీద మే. సీతవాక్యము. III - 'ఆర్యపుత్ర, విపరీతః ఖలు ఉపాలమ్భః' ఉత్తర చరితలో రామవాక్యము. 'హా! నను అకరుణే వైదేహి. క్వాసి? ప్రసీద - న మా మేవంవిధం పరిత్యక్తు మర్హసి' సీతవాక్యము - 'ఆర్యపుత్ర, విపరీత మివ ఏతత్.'

17. కుందమాలలో - IV కుశః - యుజ్యతే కుశలప్రశ్నః ప్రణామస్తు కథమ్? ఉత్తరలో IV - లవః - '(స్వగతమ్) అజ్ఞాత నామక్రమాభిజనాన్ పూజ్యా నపి నః స్వతః కథ మభివాదయిష్యే?'

18. కుందమాలలో IV - 9 - 'రామః - న చైత దభిజానామి, నాకూత మపి కిఞ్చన, తథా ప్యాపాతమాత్రేణ చక్షు రుద్బాష్పతాం గతమ్. ఉత్తరచరితలో - VI - రామః - తత్కి మేకపద ఏవ దుఃఖవిశ్రామం దదా, త్యుపస్నేహయతి చ కుతోఽపి నిమిత్తా దన్తరాత్మానమ్.

19. కుందమాలలో IV - 10 - రామః - అథవా కి మ త్రాశ్చర్యమ్? ఆపాత మాత్రేణ కయాపి యుక్త్యా సమ్బన్ధినః సంనమయన్తి చేతః। విమృశ్య కిం దోషగుణా నభిజ్ఞః, శ్చన్ద్రోదయే శ్చ్యోతతి చన్ద్రకాన్తః' ఉత్తర చరితలో VI (5) రామః - అథవా స్నేహశ్చ నిమిత్త సవ్యపేక్షశ్చ ఇతి విప్రతిషిద్ధ మేతత్. తథాహి - వ్యతిషజతి పదార్థా నాన్తరః కోఽపిహేతుః। న ఖలు బహి రుపాధీన్ ప్రీతయః సంశ్రయన్తే। వికసతి హి పతఙ్గ స్యోదయే పుణ్డరీకమ్। ద్రవతి చ హిమరశ్మా వుద్గతే చన్ద్రకాన్తః। VI (9) ....ధ్వని నైవ దత్తపులకం కరోతి మామ్,

20. కుందమాలలో - IV - కుశలవుల యాకారముంగూర్చి-రామః-(నిర్వర్ణ్య) గమ్భీరోదారః సన్నివేశః। ఉ.రా.చ.లో - లవుం గూర్చి - రామః - దిష్ట్యా అతిగమ్భీ రాకృతి రయమ్।

21. కుందమాలలో - V - 'రామః - అహో హృదయగ్రాహీ స్పర్శః।'ఉ.రా.చ. లో V - 'రామః - అనేకవార మపరిశ్లథం పరిష్వజస్వ. పరిణత కఠోర పుష్కర గర్భచ్ఛద పీనమసృణ సుకుమారః। నన్దయతి చన్ద్ర చన్దన నిష్యన్ద జడ స్తవ స్పర్శః.'

22. కుందమాలలో - V - రామః - అనభిజ్ఞోఽహం తనయ పరిష్వఙ్గ సౌఖ్యస్య, యద్యపి తాం తులా మారోహే - ఉ.రా.చ.లో - VI - (15) రామః - త త్కిమపత్య మయం దారకః? అఙ్గా దఙ్గా త్స్రుత ఇవ నిజో దేహజః స్నేహసారః...... గాత్రం శ్లేషే య దమృతరస స్రోతసా పిఞ్చ తీవ.

23. కుందమాలలో - V - 'రామః - స్థానే ఖలు పరిక్రామ న్తి తపోవన పరాఙ్ముఖా గృహమేధినః'. దీని విపరీతమునకు ఉ.రా.చ.లో - I 'రామః - ఏతే హి హృదయమర్మభిదః సంసారభావాః, యేభ్యో బీభత్సమానాః పరిత్యజ్య సర్వాన్ కామాన్ అరణ్యే విశ్రామ్య న్తి మనీషిణః.'

24. కుందమాలలో - రామః - పశ్య. ఏతయోః సీతాగర్భస్య చ తుల్యః కాలాతి పాతః; ఏతావపి క్షత్త్రియౌ సూర్యాన్వయౌ. అజాతప్రోషితౌ చ; నిర్వికారౌ రాజా సనారోహణే; పితరి చానయో ర్దారుణత్వసూచనో 'నిరనుక్రోశ' శబ్దః, మాతుశ్చ మాహాత్మ్యవిభావనో 'దేవీశబ్దః.' సర్వథాహ మనేన సాదృశ్యబాహుల్యేన పర్యా కులోఽస్మి మన్దభాగ్యః-ఉ.రా.చ.లో VI - 23-రామః, అహో ప్రశ్రయయోగేఽపి గతి స్థిత్యాసనాదయః, సామ్రాజ్యశంసినో భావాః కుశస్య చ లవస్య చ; వపు రవిహిత సిద్ధా ఏవ లక్ష్మీవిలాసాః భూయిష్ఠాశ్చ రఘుకుల కుమారచ్ఛాయాం అనయోః పశ్యామి ...న కేవలం మత్సంవాది న్యాకృతిః. అపి జనకసుతాయా స్తచ్చ తచ్చానురూపం స్ఫుట మిహ శిశుయుగ్మే నైపుణో న్నేయ మ స్తి....త దేతత్ ప్రాచేతసాధ్యుషిత మరణ్యం యత్ర కిల దేవీ పరిత్యక్తా, ఇయఞ్చ అనయో రాకృతి ర్వయసోః. యదపి స్వతః ప్రకాశా న్యస్త్రాణీతి,...అపిఖలు త చ్చిత్రదర్శన ప్రస్తావే అస్త్రాణ్యనుజ్ఞాన ముద్భూతంస్యాత్? అయం చ సప్లవమాన మాత్మానం సుఖాతిశయో హృదయస్య మే విస్రమ్భయతే భూయిష్ఠ ఞ్చ మయా ద్వివాప్రతిపన్నో దేవ్యా గర్భభార ఆసీత్.

25. కుందమాలలో VI - రామః-(ఆత్మగతమ్) నియతం మధ్యమామ్బా నిన్దతే. (ప్రకాశమ్) త ముద్దేశ ముల్లఙ్ఘ్య సీతాపహరణాత్ ప్రభృతి గీయతాం. ఉ.రా.చ.లో I-చి త్రదర్శనమున-లక్ష్మణః-ఏషా మన్థరా! రామః (అను త్తర మన్యతో గత్వా)దేవి. వైదేహి. ఇఙ్గుదీపాదపః సోఽయం శృఙ్గిబేరపురే పురా!...లక్ష్మణః - (విహస్య స్వగతమ్) అయే మధ్యమామ్బావృ త్త మ న్తరిత మార్యేణ!! ఇత్యాది ఉదాహరణ ముల పరిశీలన భవభూతి దిఙ్నాగుల తాదతమ్యమునకు స్ఫోరకములు.

## ౧౫ - భవభూతి కథ - కాళిదాసు

ఇట్లు ఉత్తరరామకథ నాటకముగా వ్రాసిన కుందమాలో త్తర చరితలం బట్టిన యథరోత్తరములు ప్రస్తావింపఁబడినవి. అంతియ కాక, ఉత్తరరామాయణ కథను కాళిదాసు రఘువంశమున చతుర్దశపంచదశ సర్గలలో తక్కిన రామాయణమును వ్రాసినంతకన్నను మిక్కిలి ఎక్కువగా ఎవరికిని అందుకొనరాని మనోహరభంగిగా, కాళిదాసు కాళిదాసే అనునట్లుగా విపంచీస్వరసుభగముగా పాడియున్నాఁడు. అందు ప్రతిశ్లోకముకూడ. ఉ. రా. చ. యందు అనుకరింపఁబడినదా, మించ నుద్యమింపఁ బడినదా అను సంవాద సాధువాద సందేహము కలుగుచునే యుండునన్నం జాలదా, భవభూతికి కవికులగురు కాళిదాసునెడ గల ప్రియహితస్పర్ధ కొలుచుటకు? ఆ రఘు వంశముతోడనే కాక, కుమారసంభవాదితోడను అంతర్గతమగు అట్టి పోటి యగ పడుచునే యుండును. అట్టి సంవాదాదికము ఇట రసాస్వాదినిలో సందు దొరకిన యెడల నెల్ల ఉపస్థితికొలఁది ఉదాహృతమై యున్నది. మనకు ప్రకృతము ఉ. రా. చ. ఐనను, మాలతిలో భవభూతి కాళిదాసు మేఘవిక్రమోర్వశీయములను ఎట్లు పోలఁ జూచెనో శాకుంతలమును ఎట్లు మననము చేసెనో అనుటయు వారి తారతమ్యమును తోఁచును. వానిలో కాళిదాసును తా మించలేనివాఁడే యని మనసుకు వచ్చును. ఉ. రా. చ. న ఎట్లో ఇంచుక మించినాఁడా అని స్ఫురించును. శాకుంతలమున శకుంతల నిరా కరణ ఉంగరము జ్ఞప్తి అనుశయదుఃఖము బాలుని ఆనవాలు పట్టుట, పునఃసంయో గము ఇదెల్ల కలదుకదా। ఐనను ఉ.రా.చ. యందు ఆ యతిశయమెల్ల సీతారాముల యతిలోక మహిమ గాని కవిశక్తి సంపాదితము గాదు, కావున గురువు గురువే, శిష్యుఁడు శిష్యుఁడే, అనియు తోఁచును. మరల, అట్లుగాదు, ఆ యతిశాయి స్త్రీ పుంయుగళమును భక్తిచే అట్లు మక్కువతో 'తత్ర సమరంస్త మమాపి వాణీ' అని గ్రహింపగల్గుట తనకు 'విశిష్యతే' అని అతిశయాధాయకమే యగునుకదా.

## ౧౬ - ఉత్తరచరితమున కాలగమనము

మహాకవి షేక్సుపియరు నాటకాల విమర్శలలో నాటకకథా కాలగమనమును పరిశీలించి నిర్ణయించుట కలదు. అట్లే శాకుంతలాది నాటకములందును. కథ ఆదిన మారంభమైనది, మొదటియంకము కథకును రెండవయంకము కథకును ఇంత యంతరమున్నది. మూఁడవ యంకముకథ ఇన్నాళ్ళకు - అని యిట్లు కథాంతమువఱకు పాత్రముల భాషితములం గల సూచనల చాల మెలఁకువతో కనిపట్టుదురు. అట్లే ఈ

యుత్తరచరితయందును చేయఁదగును. నాట్యశాస్త్రమున మాత్రము ఏ యంకము
నను కథ ఒక పూటకంటె మించక దిన నిర్వర్తనీయ ధర్మములకు ఆటంకము
అతిక్రమము లేకుండ నుండవలసిన దని యాచార్యుల నియమము. 'ఆవశ్యక కార్య
ములకు భంగము కలుగకూడదు. కథ అనేక దినములు పట్టునదిగా నుండఁగూడదు.'
అట్లే—

"ఏకాహాచరితైకార్థ మిత్థ మాసన్ననాయకమ్
'ఏక దివసప్రవృత్తైక ప్రయోజన సంబద్ధం' "

అని ధనంజయ ధనికులు దశరూపకావలోకములందును:

"అవశ్యకానాం కార్యాణా మవిరోధా ద్వినిర్మితః
నానేకదిన నిర్వర్త్య కథయా సమ్ప్రయోజితః
'అవశ్యకం సన్ధ్యావన్దనాది' "

అనియు, మఱియు—

"అఙ్కేష్వదర్శనీయా యా వక్తవ్యైవ చ సమ్మతా
యా చ స్యా ద్వర్షపర్యన్తం కథా దినద్వయాదిజా
అన్యా చ విస్తరాత్ సూచ్యా సార్థోపక్షేపకై ర్బుధైః
అఙ్కే ష్వదర్శనీయా కథా యుద్ధాదికథా."
వర్షా దూర్ధ్వం తు య ద్వస్తు త త్స్యా ద్వర్షాదధోభవమ్"

"ఉక్తం హి మునినా—
'అఙ్కచ్ఛేదే కార్యం మాసకృతం వర్ష సఞ్చితం వాపి
త త్సర్వం కర్తవ్యం; వర్షా దూర్ధ్వం న తు కదాచిత్.'

ఇతి. ఏవం చ చతుర్దశవర్ష వ్యాపి న్యపి వనవాసే, యే యే విరాధవధాదయః
కథాంశా, స్తే తే వర్ష వర్షావయవ దినయుగ్మాదీనాం ఏకతమేన సూచనీయా
న విరుద్ధాః.

దినావసానే కార్యం య ద్దినే నైవోపపద్యతే
అర్థోపక్షేపకై ర్వాచ్య మఙ్కచ్ఛేదం విధాయ తత్.

అనియు, అనఁగా—

"ఆవశ్యకకార్యములకు విరోధము కలుగని యట్లుగా నిర్మితము, అనేక దిన
ములు పట్టిన కథతోఁ గూడినట్టిది కాదు."

"ఆవశ్యకకార్యము లనఁగా సంధ్యావందనాదులు."

"ఏ కథ అంకములందుఁ జూపఁగూడదో, అయినను అవశ్యము చెప్పవలసి నదిగా సమ్మతమో, ఏది రెండుదినములు మొదలుగా సంవత్సరము పర్యంతము జరిగినదో, ఏది అతి విస్తీర్ణమో అట్టిదాని నెల్ల బుద్ధిమంతులు అర్థోపక్షేపకములచే సూచింపవలయును.

అంకములందుఁ జూపరానిది యుద్ధాదికథ. వత్సరముకంటె ఎక్కువకాల మున జరిగిన వస్తు వేదో దానిని వత్సరముకంటె తక్కువకాలములో జరిగినట్లు చేయవలయును.

చెప్పెనుగదా ముని—'మాసకృతము గాని, వర్షమితము గాని, అట్టి దెల్ల అంకచ్ఛేదమందు చేయవలసినది, సంవత్సరమునకు మించినదానిని మాత్రము ఎప్పు డును చేయఁగూడదు' అని. ఈ విధముగా పదునాలుగు సంవత్సరములు వ్యాపించిన రామవనవాసమందు విరాధవధాదులు కథాభాగములు ఏవేవి కలవో, వానిని వర్షము వర్షావయవము దినయుగ్మము ఇత్యాదులలో నొకదానిచేత సూచించుట విరుద్ధము గాదు.

'ఏక దిన నిర్వ ర్తనీయమయినను ఏది సమగ్ర దిన నిర్వ ర్త్యమో దానిని కూడ అంకచ్ఛేదము గావించి అర్థోపక్షేపకములచేత వచింపవలసినది' అని విశ్వనాథకవి సాహిత్యదర్పణమునను, నాటకములందు కాలముంగూర్చి పాటింపవలసిన నియమ ములను వివరించినారు.

చిత్రదర్శనమున చిత్రములు కేవలము వాల్మీకిరామాయణోక్త కథాసరణికి మిక్కిలి సరిపోవుచున్నను, ఉత్తరరామచరితమున కథను మహాకవి తన యిచ్ఛమెయి రసానుగుణముగా అల్లినాఁడు. ఉత్తరకాండ చదివినపుడు సుగ్రీవాది వానరులును విభీషణాది రాక్షసులును జనకాది బంధువులును రెండు నెలలు ఆ పట్టాభిషేకోత్సవమున కథలు వినుచు ఆటలు చూచుచు పాటల కానందించుచు సీతారాముల యాతిథ్యమును అనుభవించినా రని చెప్పఁబడియున్నది.

"ఏవం తేషాం యయౌ మాసో ద్వితీయః శిశిరః సుఖః." 39 - అ

ఆ మాటనే చెప్పకున్న ఆ కథల దోరణియు దైర్ఘ్యమును వారు ఇంకను చాలకాలమే ఉండినారో ఏమో అని తోపించును. ఉత్తరచరితకథంబట్టి ఆ పండుగ తొమ్మిదినెలలకన్న నెక్కువకాలము జరిగినదని తలంపఁదగును. ఏలన సీత గర్భము ధరించి కాన్పు ప్రొద్దులును దగ్గఱినవి. ఏదినము సీత వివాసితయో, ఆ దినమే ఆమె భరబాధాభయములు ఓర్వలేక ఏమియుం దోఁపక గంగలో దూకినది. అప్పుడే కుశ

లపులం గన్నది. కావున ఆదినము రాముఁడు కార్యాసనమునుండి జనకనాయన ఊరికి బోయినందులకై దుర్మనాయమానయగు సీతను ఓదార్ప ఆమెవాసగృహమునకుం బోయి ఆయోదార్పుమాటలు మాటలాడుచుండఁగా ప్రథమాంకము ఆరంభమగును. సాధారణముగా రాజు కార్యాసనమునుండి లేచుట మధ్యాహ్నసమయమునకు. రాము నితో సీత అష్టావక్రసందేశము విని, చిత్రరుపులం గాంచి యలసి ఆయన యురమున (ఒడిలో) తద్బాహూపధానముగా నిదురింపఁగా ఆమె దేహమును ఆయన ఆప్యాయముగా నిమురుచు తమ దాంపత్యభద్రముం దలపోసికొనుచుండఁగా దుర్ముఖుఁడు వచ్చి సడి మాటలు చెవిం జెప్పినాఁడు. అందులకు కరము దుఃఖించి మూర్ఛిల్లి వంశకీర్తికై ఆమెను వివాసముచేయ నిశ్చయించుకొని, లక్ష్మణునికి ముదలయంపి, ఆమెను అట విడిచి తాను లవణుని దండింప శత్రుఘ్నుం బంప లోపలికి బోవును. రాముఁడు అంతకుముందును ప్రజారంజనము సేయుచు సీతాదోహదములం దీర్చుచున్నవాఁడే. నేఁటి అరుంధతి వసిష్ఠుల సందేశము ఆమార్గమున నిపుడు ఆయనకు ఉత్తేజన మాత్రమగును. తమస మురళల విష్కంభమున ఆదినము కుశలవుల ద్వాదశాబ్దపూర్తి యని తెలియును. రెండవ యంకపు జనస్థానవర్ణనలో మాలతీ వీరచరితములలో 'పర్యాంభో విగమాగమవ్యతికర శ్రీవాహినో వాసరాః' అని నిర్దేశించిన కాలమునం జెప్పిన శ్లోకములు 'ఇహ సమద శకున్తాక్రాన్త వానీర II - ౧౧, 'దధతి కుహరభాజా మత్ర భల్లూక యూనాం II-12 ఉండుటచే అది ఆషాఢ శుక్లపక్షమో కృష్ణపక్షారంభమో కానోపునని ఊహింపఁదగును. పన్నెండేండ్లకు పూర్వము ఆదినముననే కదా అపరాహ్ణమున సీత వివాసితయై యుండ వలెను.

వాల్మీకి రామాయణమున శ్రీరామపట్టాభిషేకము పుష్యనక్షత్రముతో కూడిన చైత్ర శుద్ధ సప్తమినాఁడు. దానికి పదునాలుగేండ్లకు మునుపు ఆదినమే రాముఁడు పట్టాభిషేకము భంగమై వనవాసమునకుం దరలెను. కావున వాల్మీకి యుత్తర కాండ కథకును భవభూతి యుత్తర చరిత వస్తువునకును ఏమియు సంబంధము లేదని ఊహింపఁదగును. తక్కిన కథ యంతయుంగూడ వేఱు క్రొత్త కల్పనయే, పునః సంయోగమునకుం దగిన మార్గాన అత్యంత రసవంతముగా నడచినది.

కుశలవులు స్తన్యత్యాగానంతరము వాల్మీకికి అప్పగింపఁబడిరి. కావున వారు వాల్మీకి యాశ్రమమున ఆయన లాలనమువను అవేక్షణమువను శిక్షణమునను ఇంచు మించుగా తొమ్మిదేండ్లు పెరిఁగియుందురు. రెండవ యంకము కథ ఆ కుశలవుల పుట్టినదినమున జరుగునదే. శంబూకుని తలఁగొట్టను రాముఁడు వచ్చిన దినమే.

అతనిని వైరాజ్యములకుం బోవ ననుమతించి తాను లోపాముద్రాగస్త్య దర్శనము చేసి కొని జనస్థానమునకు మరలి అట వాసంతింగూడి సీతను దలంచుకొని మాటి మాటికి మూర్ఛిల్లి అందు కన్నులకు అగపడని సీత తాకుడువలన అట్లట్లు ఉచ్ఛ్వసిల్లి ఆమెకు పరిత్యాగశల్యమును తుదముట్ట పెఱికివైచి, ఇంటికి తరలి, దారిలో లవ చంద్రకేతుల పోరుమాన్పి, కుశలవులం గలసికొని, వారు తనవారగుదురా అని యెన్నెన్ని వగలనో ఊహలుసేయుచు తికమకపడి అరుంధతీ వసిష్ఠ కౌసల్యా జనకులం గలసికొని తన వృత్తమునకు వారి యెదుట కడు విలక్షుఁడై అంతట వాల్మీకి తన తపోబలమున సకల భూతగ్రామమును అయోధ్య పౌర జానపదులను ఒక్కటం గూర్చి ఉత్తర చరిత విజ మును సీత పవిత్రతను ఆట యాడించి చూపినంతట సీత మహిమను అరుంధతి చెప్పి కసరి యొప్పించిన పౌరజానపదుల సమ్మతి పూజలతో ఆమెం గూడి కొమాళ్ళం గలసికొని అయోధ్యకు అశ్వమేధమునకు సజ్జుఁడగుటకు వలయు మనోమోదమును సకల కల్యాణమును పొందును.

ఇట్లొక్కనాఁడే, కుశలవుల ద్వాదశాబ్ద పూర్తి శుభదినమున ఇదెల్ల రాముఁడు సాధించుటకు పుష్పక విమాన మనోవేగ యానమును, ఎక్కడికి ఎంతలో నైనను చేరను చేర్పను గల భాగీరథి మహిమయు వాల్మీకి తపః ప్రభావానుగ్రహములును అరుంధతీ వసిష్ఠ పృథ్వుల దివ్యానుగ్రహమును కారణములు.

ఆత్రేయి వాల్మీకాశ్రమము వీడి తరలు నప్పటికి కౌసల్యారుంధతీ వసిష్ఠులకు ఋశ్యశృంగాశ్రమమున యజ్ఞము ముగిసి అంపకములై, వారు వాల్మీకి యాశ్రమము నకు వచ్చుచున్నారు. జనకుంగూర్చి ఆమె యెఱుఁగునో యెఱుఁగదో ఆమెచే ఆయన ప్రస్తావము చేయఁబడలేదు. బ్రాహ్మణబాల మృతియు, వాని సంజీవనమునకై రాముఁడు పుష్పకమున శంబూకుని వెదకఁజొచ్చుటయుం గూడ ఆమె యెఱుంగును. ఎట్లనఁగా అయోధ్యనుండి కాలరులు రాణులును అరుంధతీ వసిష్ఠులును ఎందున్న నచ్చటికి అయోధ్య వార్తలుకొని చనుచుందురు కాఁబోలు. అట్లు ఆమె తరలునప్పటికే ఆ సంగతి వాల్మీకి యాశ్రమమునకు తెలిసె కాఁబోలు అని ఆ ఘట్టపు వ్యాఖ్యలో ఊహ చేయఁబడినది. అట్లుగాక వాల్మీకికి తపోబల మున్నను తద్వ్యయము కానీక రామచరితము ఎప్పటి కప్పుడు కన్నులకు చెవులకు ఉల్లమునకు అందునట్లు 'అవ్యాహత జ్యోతిరార్షం తే ప్రాతిభం చక్షుః' అని (వృత్తం ప్రకాశం యదివా రహః త చ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి - బాల - II - ౩౪.) బ్రహ్మయొక్క అనుగ్రహ విశేషము ఉండెనుగదా. కావున ఆయన ఇదెల్ల మనస్సున కాంచి వివి అటం బ్రస్తావించుచుండినదానివి ఆత్రేయి విని యెఱింగియుండఁ బోలునేమో.

ఈ యుత్తర చరితకథ గమనమున కాలము దివ్యవ్యతికరమున తక్కిన నాటక కాల కథగమనమున కన్నను విలక్షణముగాఁ జూపట్టుచున్నది. రాముఁడు మూఁడవ యంకము కడపట అగస్త్యులవారు 'ప్రజవినా పుష్పకేణ స్వదేశ ముపగమ్య అశ్వమేధాయ సజ్జో భవిష్యసి' అని పుష్పకవేగమును ఇనుమడించినందున అంతలో లవ చంద్రకేతు యుద్ధభూమిని దగ్గఱియుండును. కావున ఇట జనస్థానమున రెండవ మూఁడవ యంకముల కథయు జరుగుచుండఁ అట వాల్మీకి యాశ్రమముచెంత నాల్గవ యైదవ యంకముల కథ జరుగుచుండఁబోలును. ఆత్రేయి జనస్థానమునుండి అగస్త్యాశ్రమమునకు తరలినపుడు అక్కడ మట్ట మధ్యాహ్న మాయెను. "కఠోరీభూతస్తు దివసః' 'ఘర్మ స్రంసిత బన్ధనైః' 'కూజత్ క్లాన్త కపోత' అనునవి తద్గమకములు. రాముఁడు ఒకవేళ ఆదినమే దండకకు రాలేదు కాఁబోలు. మఱుదినము వచ్చియుండును. ఏల యిట్లూహింపఁ దగు ననఁగా, ఆయన పుష్పక దివ్యత్వమును ఆశ్రయించి శంబూకుఁ డున్నచోటికిం బోవుమా అనక, అందు తా నెక్కి తానే శంబూకుని వెదకి కనిపట్టఁగోరి 'సర్వా దిశో విదిశ శ్చ శూద్రతాప సాన్వేషణాయ జగత్పతి శ్చరితు మారబ్ధవాన్' 'ఎల్ల దిక్కులను ఎల్ల విదిక్కులను శూద్రతాపసుని కనిపట్టుటకై చరింపఁ దొడంగినాఁడు" అని చెప్పఁబడినది. (చూ. పు-105, 130 లో చేప్పిన దానిని ఏతదనుగుణముగా మార్పఁదగును.) ఈ దిక్కునకు ఇట జనస్థానమునకు మఱునాఁడు పూర్వాహ్ణమున వచ్చియుండఁ బోలును. 'శ్వానప్రదీప్తాగ్నయః' అన్న దావాగ్నులును, 'ప్రదరోదర విలసత్ స్వల్పాంబువులు' అన్న నీటి యెద్దడియు, 'ప్రతిసూర్యకతృష' 'అజగరస్వేదము' ఇవెల్ల ఆషాఢగ్రీష్మసులభముల కాని తప్పక మధ్యాహ్నకాలగమకములు గావు. చూ.—

> తం చే ద్వాయౌ సరతి సరళస్కన్ధ సంఘట్ట జన్మా
> బాధే తోల్కా క్షపిత చమరీ వాలభారో దవాగ్నిః. మేఘ I. 57.
> 'ముఞ్చతో బాష్ప ముష్ణం' మేఘ I. 12
> ఉష్ణం బాష్పం-ఊష్మాణం-వేఁడి యావిరి-(సంజీవని.)
> త్వా మాసార ప్రశమిత వనోపప్లవం-మేఘ I. 17.
> 'వనోపప్లవః దావాగ్నిః' సంజీవని.
> 'దగ్ధారణ్యే ష్వధిక సురభిం'—I. 21.
> గన్ధ స్యే దాపనయన—I. 27

వేణీభూత ప్రతను సలిలా—I. 30.

నిరవగ్రహో దహతి దారుణో విశస్వాన్—మాలతి IV. - 12.

మఱి పూర్వాహ్ణమున ఏల ఊహింపవలయు ననఁగా - VI వ అంకమున రాముఁడు కుశలవులం గలిసికొని ఏమేమో తలపోసికొనుచు దుఃఖించునపుడు. మద్ధ్యాహ్నము. లవుఁడు అనెనుగదా - 'తాత, లలాటన్తపో ఘర్మదీధితిః. త దత్ర సాలచ్ఛాయే ముహూర్త మాసనపరిగ్రహం కరోతు తాతః. 'నాయనా, చండాంశుండు నడిమింటికి వచ్చి ఫాలదేశముం గాల్చుచున్నాఁడు. కావున ఇట ఈమద్దిక్రింద నాయన ఇంచుకసేపు కూరుచుండును గాక' అని.

మూఁడవయంకమున సీత గోదావరిచెంత సూర్యపూజకు పూలు కోసికొనుటకు వచ్చెనే భాగీరథితో కూడ. అప్పుడు ఆమె తాను పాతాళమువనే భాగీరథి మహిమచే గోదావరికి వచ్చి, అందు మడుఁగున పైకి లేచి వచ్చినది. ఆచోట వ్యాఖ్యానమున (చూ. పుట 138) అట్లు కాదని, అవనిపృష్ఠముననే వచ్చినది. అని వ్రాయుట పొరపాటు. 'మడుగునుండి' అని చెప్పఁబడినదిగదా. స్నానమునకు పోయి వచ్చుట యన రేవునుండి' అనఁదగును. ఏడవయంకమున సీత వచ్చిన తెఱఁగు ఇట్లు చెప్పఁబడినది. చూ VII-౧౬-'మస్థా దివ క్షుభ్యతి గాఙ్గ మమ్భో.' ఇత్యాది. ఇటను గోదావరినుండి అట్లె కానోపును. రాముఁడు జనస్థానమునుండి తరలఁ, సీతయు మరల అట్లే పోయి భాగీరథిం గలిసికొన్నది. మఱికొంతసేపటికే అంతర్నాటిక కాఁగావే జాహ్నవీ సీతా పృథ్వుల ఆయావిర్భావము.

ఆ యుదయమున, పూర్వాహ్ణమున వసిష్ఠారుంధతీకౌసల్యాదులు వాల్మీకియాశ్రమముం జేరిరి. అప్పుడే వాల్మీకి వసిష్ఠునికి కల్యాణిని మధుపర్కమున పెట్టినది. వారికి ఒక్క చోట వసతి చూపఁబడినది. వసిష్ఠుఁడు వాల్మీకితోడనే ప్రొద్దుపుచ్చుచుండెను. తరువాత కొంతసేపటికి చంద్రద్వీపమునుండి వచ్చిన జనకుఁడు వాల్మీకియాశ్రమము చేరెను. ఆయనకు పెరుగుతేనెలతో మధుపర్కము ఒసంగఁబడినది. ఆయన వసిష్ఠవాల్మీకులను ఉపాసించి వచ్చి, తన పై ఖానసతకు తగినట్లు, ఒకచెట్టుక్రింద కూర్చుండెను. అచటికి అరుంధతి కౌసల్యను ఆయనం జూడ తోడ్కొనివచ్చెను. ఆయన అవనితల లోల శిరస్సుగా అరుంధతికి మ్రొక్కఁగా, ఆమె ఆశీర్వదించినది—"అయన్త్వాం పునాతు, దేవః పరోరజాః, య ఏష తపతి." 'ఈ తపించుచున్న దేవుఁడు పరోరజసుఁడు నిన్ను పవిత్రుం జేయుఁగాక,' అని, అనఁగా ఈ యెండకాయుచున్న సూర్యుఁడు అన్నమాట. అప్పుడు ఆయన లలాటంతపుఁడుగాఁడు. తరువాత వారు

లవుం జూచుట, అతఁడు అశ్వమును దూడఁబోవుట-సైనికుల దృప్తవాక్య—అతఁడు వారిని మఱుమాడుట-అనంతరము చంద్రకేతు నెదుర్కొనుట-వారి దివ్యాస్త్రయుద్ధము-శ్రీరాముఁడు దానిని వారించి, లవకుశులం గలసికొనుట—అప్పటికి సూర్యుఁడు లలాటంతపుఁ డగుట. జనకకౌసల్యా లవ సమాగమ మైన తర్వాత, వా రందఱు వాల్మీకి తయారుచేయించిన ఆ విందు ఆరగించి యుందురు, తరువాత వారికి లవ చంద్రకేతుల పోరు చెవిం బడినది. దానిని మాన్పను వారు పడుచు లేచుచు వచ్చుచుండిరి. అప్పటికి కుశలవరామసమాగమము జరుగుచుండినది. ఆ శిశువులే రామునికి వారి కథకు దారి చూపుదురు.

ఇంచుమించుగా ఏకకాలమున మూఁడవయంకపు తమసా సీతావాసంతీరాముల సమాగమము జనస్థానమున జరుగుచుండఁగా వాల్మీకియాశ్రమమున కౌసల్యాజనకాదుల సమాగమము జరుగుట. ఇట్లు రెండంకాల కథల యౌగపద్యము మఱి యే నాటకమునను ఉండఁబోదు. ఈ సంవిధానము భవభూతిచేతనే ఇందే సంపాదితము.

మఱి రాముఁడు అంత ప్రొద్దుననే రెండవ యంకమున శంబూకుం గొట్టి వచ్చినవాఁడు, మట్టమధ్యాహ్నసమయమున కుశలవులతో అట్లున్నవాఁడు ఆయనంతరము ఆనాఁడే గంగతీరమున ఆయప్సరసల యాటం జూచి, తరువాత అరుంధతి వాల్మీకులు తనకుం గూర్చిన సీతను కుశలవులను ఇంకను తనవారినందఱిని కూడి అయోధ్యకు తరలుట కథావస్తువు. వసిష్ఠాదులకు వాల్మీకి వడ్డింపించిన సంతర్పణ యైనది. మఱి రామునికో? రాముఁడు అగస్త్యాశ్రమమునకు పోయి మరలినాఁడు. అచట మధుపర్కమో మఱి యేదియో లోపాముద్రమ్మచేత పొందియుండునా? ఊహింపఁదగునేమో.

మఱియు కొన్ని కాలసూచనలు కలవు గాని వాని వినియోగమును ఆలోచించి నిర్ణయింపవలసి యున్నది.

(క) 'ఆయల్లు డిప్పుడు పన్నెండేండ్ల యజ్ఞము తొడంగినాఁడు.' ఈ యజ్ఞారంభము సీతావివాసమునకు ముందే. కొన్ని నెలలైనను-ఒక్కనెల యైనను-ఐయుండఁదగును. కాకున్న అష్టావక్రసందేశమునకు అక్కఱ యుండదు. నిన్న మొన్న ఊరికి పోయినవారు ఇంతలో అంత ప్రధానసందేశముం బంపుదురా? తామే సమక్షమున చెప్పి పోరా? ఇది మాటిమాటికి ఎచ్చరింపఁదగిన విషయ మయినను, కొంత కాలయాపన సమంజస మగును.

ఆ యజ్ఞము ఫలానా నెలలో తొడంగవలసినది అను నియమ ముందునా? సందేశము తెచ్చిన అష్టావక్రుని రాముఁడు మా బావగారు నిర్విఘ్నముగా సోమపానము గావించినారా అని యడుగును. సత్రారంభానంతరము ఎన్నాళ్ళకు సోమపానము చేయవలయును? ఇపుడు కుశలవుల యబ్దపూర్తి దినమును కనిపట్టి, దానినుండి వెనుకకు లెక్కవేసి సీతావివాహదినము ఊహింపఁబడినది. అవి తెలిసిన అటునుండియు ఈ నిర్ణయమును అరసి సరిచూడఁదగియుండును.

(b) 'దేవ్యా శూన్యస్య జగతః ద్వాదశః పరివత్సరః'—ద్వాదశాబ్ద పూర్తియైనను, ఆ దినము త్రయోదశాబ్దము పెట్టినను, సీత పోయి ఇంతకాలమైనది యని యేడ్చునపుడు ఆ పన్నెండే మనసునకు వచ్చుట న్యాయ్యము.

(c) 'భో భోః సైనికాః, ఏష ఖలు కుమారచన్ద్రకేతు రాజ్ఞాపయతి ...' గుఱ్ఱమును సేనయు ఏవేళకు అచటికి చేరియుందురు? 'రాజపుత్ర శ్చన్ద్రకేతు రరివిమర్దనః సౌమ్య పూర్వారణ్య దర్శనకుతూహ లాక్షిప్తహృదయః....' పగటి యేవేళలో ఇట్లు అడవిం జూచు కుతూహలము వహింపఁదగును? ఇట్లిట్లు ఈ విచార మింకను సాగింపఁదగియుండును.

I.ఒక ఆషాఢ శుద్ధ పూర్వాహ్ణము. I-II కి నడుమ ఎడము పన్నెండేండ్లు. II-విష్క. ఒక ఆషాఢ శుద్ధ పూర్వాహ్ణము. II దాని మఱునటి పూర్వాహ్ణము. III-నాఁడే, ఇంక కొంతసేపటికి. IV-V-మూఁడవదాని సమకాలముననే. VI-నాఁడే, మధ్యాహ్నము. VII-నాఁడే-అపరాహ్ణము.

## ౧౭ - ఉత్తరచరితమున దేవతలయు అతిమానుషములయు అనుప్రవేశము

ప్రస్తావనలోనే ఆ కాలపు - అయోధ్యావాసులైన నటసూత్రధారులు, రాముని యింట తమ కులవృత్తి నడుపువారు, సీతాపవాదము రాముని చెవింబడిన మిక్కిలి కష్టము కలుగుననియు, దానిని తొలఁగింప నెల్ల విధముల ఋషులును దేవతలును మేలుసేయుదురు అనియు ఒండొరు లనుకొని యిట్టి యతిమానుష వ్యతికరములు ఇందు పెల్లుగా నమకూడఁగల వని సూచించినారు—

1. యజ్ఞములయందలి యదృష్టఫలమునవిశ్వాసము. నాటకమున తదానుషంగిక ప్రయోజనము. ఋశ్యశృంగుఁడు ద్వాదశ వార్షిక సత్రము తొడంగి నిర్వహించినాఁడు. శ్రీరాముఁడు అశ్వమేధముం దొడంగినాఁడు. అది రాముని పెద్దల నందఱిని సీతపై నడి పుట్టినపుడు ఆమె వివాసమును అడ్డనీక దూరాన ఉంచినది. వివాసము జరిగి

బోయినది. ఇది సీతకు బంగరు ప్రతికృతిని చేయించి వివాసిత సీతయందలి రాముని యనురాగముం బ్రకటించి ఆమెను పునః సంయోగోత్సుకం జేసినది. చూ-

సీతాం హిత్వా దశముఖరిపు ర్నోపయేమే య దన్యాం
తస్యా ఏవ ప్రతికృతిసఖో యత్క్రతూ నాజహార
వృత్తాన్తేన శ్రవణ విషయప్రాపిణా తేన భర్తుః
సా దుర్వారం కథమపి పరిత్యాగదుఃఖం విషేహే. రఘు.XIV-౮౭.

2. నాటకారంభముననే సీతకు రామునిచే తన గొప్ప దృఢవిశ్వాసము చిత్త పరిపాకము ఆమె చిత్తమునుం గూడ అనుగుణముగా సంస్కరించుటకు చెప్పఁ బడినది.

'ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి' I - 3 అని.
మరలను రాముఁడు ఆ తన విశ్వాసమును చిత్తవృత్తిని ప్రకటించినాఁడు.

'సాక్షాత్కృత ధర్మాణో మహర్షయః. తేషాం అమృతసారాణి పరోర జాంసి ప్రజ్ఞానాని న క్వచి ద్వ్యాహన్యన్తే. ఇతి అనభిశఙ్కనీయాని.' అని VII-౧.

అరుంధతియు శాంతయు గొప్ప మునిపత్నులు

"ఇదం భగవ త్యారున్ధత్యా దేవ్యా శాన్తయా చ భూయోభూయః సన్దిష్టమ్ 'యః కశ్చి ద్గర్భదోహ దోస్యాః, సోఽచిరాత్ సంపాదయితవ్యః.' "

అని, సీతకు ఇన్నాళ్ళను ఆమె దోహదములం దీర్చుచునే యున్నను ఇప్పుడు కాన్పు ప్రొద్దులు సయితము దగ్గఱుచుండఁగా ఇట్లు సందేశించుట-

'ఏతేన చిత్రదర్శనేన ప్రత్యుత్పన్నదోహదాయాః అస్తి మే విజ్ఞాప్యమ్... జానే పునరపి ప్రసన్నగమ్భీరాసు వనరాజిషు విహరిష్యామి, పవిత్ర సౌమ్య శిశిరావగాహాం భగవతీం భాగీరథీ మవగాహిష్యే.'

అనుదానిని వ్యాజముచేసికొని సమయము రాఁగలదనియు అపుడు ఆమెను గంగాతీరా రణ్యమున విడిచిపెట్టు మనియు అని గూఢము. దానివెంబడిని రామునికి నిత్యప్రజాను రంజన పరాయణునికే యీ జ్ఞాపిక, వసిష్ఠసందేశము—

'యుక్తః ప్రజానా మనురఞ్జనే స్యాః
తస్మా ద్యశో యత్ పరమం ధనం వః.'

అట్లు సీతను త్యజించియేనియు ప్రజల రంజింపఁ దివురుమనుటకే. ఇట్టి దోహదము పూర్వానుభవరసముచే సీతకుతప్ప మఱి యెవతెకును కలుగదు. అట్లు సర్వథా పవిత్ర

శీల యని తాను నమ్మియు ప్రజాప్రీత్యర్థము శ్రీరాముఁడుగాక అన్యుఁడు ఈ తెంపుతో వివాసము చేయఁడు. ఇట్లు అరుంధతీవసిష్ఠులు నిన్నమొన్న రాజ్యపట్టాభిషేకమయిన సీతారాముల విషయమున తమ మనంబుల యభిప్రాయము గొనుట, లంకాతీరమున సీత తన పాతివ్రత్యపవిత్రతను అద్భుతముగా రుజువుచేసి యున్నను, ఇచటి ప్రజలకు ఆవిషయమున అతిశంకలు కలుగక పోవు. వానిని సయితము తీర్చినం గాని సీతారాములకు నిత్యక్షేమము శ్రేయము కలుగవు. మఱి యిట్లు ఇంత చేసినంగాని అవి తీఱవు. ఇఁక వారికి మనము అవి కూర్పవలదా అను నత్యంత వాత్సల్యముచేత. రాముఁడు కాక అన్యుఁడు అట్లు తెగువతో సీతావివాసము చేయఁడు. సీత కాక అన్య దానిని అట్లు ఓర్పుతో అనుభవింపదు, వసిష్ఠారుంధతీ వాల్మీకి భాగీరథ్యాదులు ఈ లక్ష్మీనారాయణుల యెడఁ గాక మఱెవరికిని అట్లు పునఃసంయోజనమును సంపాదింప పనివడరు. ఇదెల్ల ఈ నాటకమున గూఢము.

3. రాముఁడు సీతాప్రసూతికి జృంభకాస్త్రముల ననుగ్రహించుట, చిత్రగత భాగీరథిని 'తల్లీ, నీవు కోడలు సీతయందు అరుంధతియుం బోలె శివమును అనుధ్యానింతుఁవుగాక' అని ప్రార్థించుటయు, వివాసిత సీతను మఱి దిక్కులేనిదానిని కావుమని వసుంధరకు అప్పగించుటయు—ఇవి అలవోకగా పలికిన పలుకులం బోలి సమయాన సత్యములై నెఱవేఱి యితివృత్తమును శుభాంతమునకు చేర్చినవి.

4. వనదేవత వాసంతియు నదీదేవతలు మురళా తమసలును (భగవతి గోదావరియు) మూర్తులుగొని సంభాషించి కథను నడపినారు.

5. వాల్మీకికి మాత్నఛంద ఆవిర్భావము బ్రహ్మసాక్షాత్కారము రామకథాసాక్షాత్కారము నై తొలికావ్యము రామాయణము రచితమైనది.

6. ప్రాణముపోయి బాధలు తీఱును గాక యని తనలో-నీటిలో-దూకిన సీతకు భాగీరథియు, అల్లైలమెతో పృథ్వియు నిరపాయముగా అతిసుఖముగాప్రసవము గావించి పాతాళమున తమ యింట పన్నెండేండ్లు ఓమినారు.

7. భాగీరథి శిశువులను స్తన్యత్యాగానంతరము సంస్కారార్థము వాల్మీకికి అప్పగించినది.

8. శ్రీరాముఁడు ఇంకను నేఁటి 'ఏర్‌క్రాఫ్టు' శిల్పవీరులు అందుకొనలేకయే యున్న మహిమ గల పుష్పకమున యాతాయాతములు గావించినాఁడు.

9. అశరీరవాక్కువ శంబూకవధచే చచ్చిన బాపనబాలుఁడు బ్రతికి లేచు నవి విని అట్లు ఆతనివి వధించి ఆ బాలుం బ్రదికించినాఁడు.

10. హతశంబూకుఁడు దివ్యపురుషుఁడై శ్రీరామునికి పరిచర్యచేసి దేవయాన మున వైరాజములకుం దరలినాఁడు.

11. అదృశ్య తమస తోడున అదృశ్య సీత వాసంతీరాముల యెదుట చరిం చుచు శ్రీరాముని మూర్ఛలఁ దేర్చుచు తాను ఏడ్చును సంతోషమును అనుభవించి పునఃసంయోగమునకు ఉత్సుకురాలై నది.

12. భాగీరథి ఎప్పుడో (?) అరుంధతికి సీత కాన్పును కుశలవులు వాల్మీకి కడ పెరుఁగుచుండుటను ఎఱింగించి సంతోషపెట్టినది.

13. లవుఁడు జృంభకములతో సేనను మ్రాన్పఱచి యుంచి తేర్చును. లవ చంద్రకేతులు అస్త్రయుద్ధమును చేయుదురు. దానిని విద్యాధరులు మింట విమానముల నుండి చూతురు.

14. సురదుందుభులు మ్రోగును. దివ్యపుష్పములు వర్షించును.

15. వాల్మీకి తన ప్రభావమున భాగీరథీ తీరాభోగమున బ్రహ్మ క్షత్త్రి పౌర జానపద సమేతమయిన ప్రజలను లక్ష్మణాదులను పిలిచి సకలమైన దేవాసుర తిర్యగు రగ నాయక సంయుక్తముగా జంగమము స్థావరము నగు భూతగ్రామమును ఒక్కెడ సమకూర్చును.

16. వారి యెదుట అచ్చరలచే సీత గంగలో దూకుట కాన్పగుట మొదలగు ఉత్తరరామకథను నాటక మాడించును.

17. మథనమువం బోలె కలఁగిన గంగనుండి లేచిన పృథ్వీ భాగీరథులచే సీత అరుంధతికి అప్పగింపఁబడి ఆమెచే శ్రీరామునితో కూర్పఁబడును. పృథ్వియు భాగీరథియు తాము రాముని మాటను జరిపి ఋణము తీర్చుకొంటిమని ఆయనతో పలికి పోవుదురు...

18. శ్రీరాముఁడు సీతా లవకుశులతోను, తన సకల బంధుజనముతోను కూడి వాల్మీకి అనుగ్రహము బడసి అశ్వమేధమునకు పజ్జఁ దగుటకు పుష్పకమునం దరలఁ గలుగును. ఇట్టిదెల్ల ఆ త్రేతాయుగకథ అట్లు తద్దేశకాలానురూపముగా మహాకవిచే సమకూర్పఁబడినది...

## ౧౮ - కారుణ్యం భవభూతి రేవ తనుతే!

ఉత్తరచరితము కవియుత్తమ నాటకము, లోకోత్తమనాటకమును. తొలి యంకమున సకలనాటకమునకు పునాది చక్కఁగా అమర్పఁబడినది. తొలి శ్లోకమే 'కిత్త్వనుష్ఠాన నిత్యత్వమ్' ఇత్యాది నాటకమున కెల్ల కీలకము. దాననే రాముని రాజ ధర్మానుష్ఠాన నిత్యత్వమును ఆతనియు అస్వాతంత్ర్యమును ఇంచుక సూచిత మగుచున్నది. అట్లే అదే 'కష్టం! జనః కులధనై రనురఞ్జనీయః' అనుటలోను సూచితము. అది 'యదివా జానకీ మపి' అను నిత్యాదియందును. అంతట చిత్రదర్శనముననే ఆరంభమైనది సీతకు అదేమో భయమును ఏడుపును. రాముఁడును ధీరోదాత్తుఁడే 'అయంతే బాష్పౌఘః' I-౨౨. అను నంతగా ఏడువఁజొచ్చును - సీత గర్భిణి ఎప్పుడు ఎట్లుండి ఎటువచ్చునో అని భాగీరథిని జూడఁగానే రాముఁడు తచ్ఛివానుధ్యానపరతను ప్రార్థించుట. 'జీవయన్నివ' 'ఇయంగేహే లక్ష్మీః' 'అద్వైతం సుఖదుఃఖయోః' అని సీతను కవ్వుచు తాఁకుచు నిమురుచు చాల సంయోగ సంతోషముగా నుండుట ఇదెల్ల 'అహహ! తీవ్రసంవేగో వాగ్వజ్రః!' అని మూర్ఛిల్లుటకును నివాసనిశ్చయమునకును దాన తన కిఁక ఈ లోకమును జీర్ణారణ్యము చేసికొనుటకును ఎట్టి పరభాగముఁ గూర్చును! రాముని యేడ్పు ఆరంభమైనది. ఆ నివిత్తమున తొలి యుప్పెన లేచి అణఁగినది. ఇఁక నది రాముని చిత్తమున కుములుచునే ఉన్నది. పండ్రెండేండ్ల యనంతరము దండకారణ్యముల భాగములు చూడఁగా పొక్కుకట్టినపుండు పెలవేసి ఓర్వరాని నొప్పియెత్తినట్లుగా, ఆ దుఃఖము పొంగి క్రొత్తవడినది. పంచవటిలో ప్రత్యక్ష వాసంతి యెదురను తిరస్కృత సీత యెదురను, అందఱిని అట్లు గాంచుచున్న తమస యెదురను ఆ యేడ్పు ఎన్నితెఱంగుల పెనుకరడములుగా పొరలినది! అట్లే సీతకును ఆ కరడమునకు ప్రతికరడము పొరలుచుండినది గదా. సీతపై అట్లు మిక్కిలి కూర్మిగల వాసంతికి రాముని యసహాయతను అధైర్యమును అట్లు గాంచిన వాసంతికి అది యెట్టి యేడుపు! ఇన్ని విధాల వీరి యేడ్పులం గాంచుచున్న తమసది అది యెట్టి యేడ్పు! ఇవన్నియు ఎంతెంత యేడ్పులు, ఎట్టెట్టి యేడ్పులు! 'ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదా ద్భిన్నః పృథక్పృథ గివాశ్రయతే వివర్తాన్!' రామశోకముం గాంచుచు, కూడనే ఏడ్చుచున్న సీతకు 'తటస్థం నైరాశ్యాత్' (III-8) మొదలుకొని 'దయితకరుణై ర్గాఢకరుణం ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయం' అనువఱకు క్రమముగా భావము పరిణతించెొంది, రాముఁడు తన బంగరు సీతబొమ్మనే చూచి యూరడిల్లుచున్నాఁడని వినఁగానే నిజపరిత్యాగశల్యము పీడిపోయినది, తమసా వాసం

తులకు ఇంతటి యీ యేడ్పును ఇఁక నోర్వ శక్యముగానిదానిని పెద్దలు కూడి యత్నించి తీర్చిన బాగుగా నుండునే, అట్లు తీర్తురా అని తోఁచినది.

తరువాత వాల్మీకి యాశ్రమమున అట్లు కలసికొన్న యరుంధతీ కౌసల్యా జనకులది, ఒకరింగాంచి యొకరికి వృద్ధులకు సీతారామ స్మరణచేతను, లవదర్శనము చేతను అదెంత యేడ్పు! తరువాత దశరథ సారథియగు ముసలి సుమంత్రుఁడు రాముని బాలచరితము చూచి యెఱింగినవాఁడు ఆ యింటి సొంతగానివలె సీతా వివాసము నకు నేడ్చుచున్నవాఁడు నేఁడు చంద్రకేతు సారథిగా వచ్చినవాఁడు లవుం గాంచి రాముని పోలికలు తలంచుకొని 'అయ్యో! సీత పోయినదే ఇఁక నిదెట్టి తలంపు నాకు' అని తలపోసికొనుటయు, లవునివలన దెబ్బ తగులనీక చంద్రకేతువును కాపాడి నాయన లకు అప్పగింపఁగలనా అని దిగులుపడినదియు అదెట్టి యేడ్పు! అంతట దారిలో రాముఁడు కుశలవులం గలసికొనఁగా, వారిం గాంచి లాలింపవలయు నని చిత్తము కరఁగి లాలించుచు, వారి రూపాన సీతపోలికను తలఁచుకొనఁగా అతనికి అదెంత ఆకసము దాఁకిన యేడ్పు పోఁటు! అటు తర్వాత వాల్మీకియాటలో సీతకు క్రవ్యాద దర్శన గంగాపతన గర్భమోచన రామస్మరణలచే అదెంత దుఃఖము! ఆ యాటం గాంచిన రామునికి మూర్ఛపర్యంత మయినది యేడ్పు! దాని నంతయు చూడలేక లక్ష్మణునికిని, అంతట సీత లోకాంతరమునకు పోనే పోయినదే యని రామునికి దుఃఖపరమావధి! అందుండి ఒక్కుమ్మడి సంయోగానంద హ్రదమున మునుకయు తేలుటయు ఈఁదులాడుటయు! కావుననే 'కారుణ్యం భవభూతి రేవ తనుతే!' 'భవభూతేః సమ్బన్ధాత్ భూధరభూ రేవ భారతీ భాతి! ఏతత్కృత 'కారుణ్యే కి మన్యథా రోదితి గ్రావా!' అను సాధువాదములు.

## ౨౦ - సీతకు పునఃసంయోగోత్సుకత కలిగించుట ఆవశ్యకము

బెల్వాల్కరు పండితుఁడు-'బిల్వాళికారుఁడు'-భవభూతి రాముని మరల అట్లు పంచవటికి సీతాసంయోగ విస్రంభాతిప్రసంగ సాక్షి యైనచోటికి తెచ్చుట మిక్కిలియు ప్రతిభపని, అది అతని యదృష్టము అని మెచ్చుకొన్నాఁడు. అది యట్లేకదా. ఐనను కుందమాలాకారుఁడు రాముని నైమిశముం జేర్చి అందు దండకపోలిక చెప్పి ఎంతయో కథను చమత్కారముగా అల్లఁగా, దాన ప్రతిబుద్ధుఁడై భవభూతి యతనిని ఇట్లు సాక్షాద్దండకనే చేర్చినాఁడు. అట్లు చేర్చు తలంపు ఆ నైమిశదండకలపోలిక స్మరణ

మునం గలిగినదే, అదృశ్య సీత అందును ఉన్నది. ఇందును ఉన్నది. కావున తక్కిన కల్పన కవికి ఎక్కువ మెఱుగుతో లేదును. స్వప్ననాటకమున వాసవదత్త కాలిపోయినదన్న ప్రవాదవ్యాప్తికథలో వాసవదత్త యౌగంధరునికి షరీకు. తాను పద్మావతి యవేక్షణమున నెలకొని ఉదయనుని యాపెండ్లిని దానను తనకైన యాతని రతి సడలకుండుటను అట్లట్లు కనుగొను నవకాశములు గలిగి పునఃసంయోగమునకు ఒడంబఱుప వలసిన యక్కఱలేక సమయమునకు తాను సిద్ధముగానే యున్నది. చూ. స్వప్న - IV.

> రాజా—కా గతిః? శ్రూయతాం—
>
> పద్మావతీ బహుమతా మమ యద్యపి రూపశీల మాధుర్యైః
>
> వాసవదత్తాబద్ధం న తు తావ న్మే మనో హరతి.

వాసవ—(ఆత్మగతమ్.) భవతు, దత్తం వేతనం తస్య పరిఖేదస్య. అహో! అజ్ఞాతవాసో ఽపి అత్ర బహుగుణః సమ్పద్యతే.

అని వాసవదత్త యూఱడిల్లి కనుపెట్టుకొని యున్నది. శాకుంతలముననో ఆ నిరాకరణము శకుంతలరతికి పెద్దపెట్టు. అది దుష్యంతుఁడు దిగులుపడునంతటిది. కావుననే శకుంతలను మారీచాశ్రమమునం గాంచఁగానే ఆయనుశయదగ్ధుఁడు ఆమె పాదాల వ్రాలి క్షమ వేడినాఁడు. మేనక చెలి సానుమతి దుష్యంతు నగరుకు పోయి రాజు ననుశయ దుఃఖమును కనులార పొంచిచూచి 'సర్వథా వయస్య ప్రమార్జితం త్వయా ప్రత్యాదేశదుఃఖం శకుస్తలాయాః' అని పొగత్తను పలికి శకుంతలం దేర్ప మరలినది. అదిమొదలు తాను తేఱి శకుంతలయు 'యథా సానుమత్యా ఆఖ్యాతం తథా సమ్పాద్యతే" అని పునఃసంయోగమును ఎదురుచూచుచుండినది. ఇందు.

> రామ—నను అకరుణే వైదేహి, క్వాసి? ప్రసీద, న మాం ఏవంవిధం పరిత్యక్తుమర్హసి.
>
> సీత—అజ్జ ఉత్త, విపరీదం విఅ ఏదం" (III)

అను విపరీత భాషితములం బలుకునంత విరహోన్మత్తుఁడై, రాముఁడు ఇంటికి పోయి నా బంగారు సీతబొమ్మనైనను చూచుకొందును అని పలికి సీతచేత 'ఉత్ఖాత మిదానీం మే పరిత్యాగశల్య మార్యపుత్రేణ' అని పలికించి ఆమెను పునఃసంయోగోత్సుకను చేసినాఁడు. భాస కాళిదాసులను మించినట్లు తన నాయికానాయక(=మానవ) హృదయ పరిణామ తత్త్వ జ్ఞానములం బ్రకటించినాఁడు. అట్లే జనక - కౌసల్యల కోపతాప

పరిహరణ సందర్భమునను ప్రకటించినాఁడు. ఈ యన్నింటికంటెను అతిశయముగ ఆ కుశలవ ప్రత్యభిజ్ఞాన ప్రకారమును సమకూర్చి అందు కాళిదాసును దిఙ్నాగుని అందుకొనుటయే కాక అతిక్రమించినాఁడా యని కొందఱు ఆ నైపుణిం బ్రశంసించి నారు. ఆ ప్రకార మెల్ల పై పోలిక పరిశీలనమున పరిశీలితము.

ఇదెల్ల లెస్సగానే యున్నను, దీనిని చక్కఁగాఁ జూడ, నీయభిజ్ఞాన నిర్వహణ మున నిజముగా కాళిదాసుని మించుట తోఁపదు. అట్లే కుందమాల నైనను అంతగా మించుట తోఁపదు.

## ౨౦ - కుమార ప్రత్యభిజ్ఞానాదికము—షేక్స్పియరు మహాకవి

ఈ కుమార ప్రత్యభిజ్ఞానము శాకుంతలమున కలదు. కుందమాలయందును కలదు. ఉత్తర చరితమునను కలదు. మఱి ఆంగ్ల మహాకవి షేక్స్పియరు ప్రతిభకు గోచరముగాని లోకమును మానవుఁడును సంవిధానమును సుఖమును దుఃఖమును మఱేదియును లేదు. అతనిసృష్టి నిజముగా బ్రహ్మసృష్టిని మించినది. త్రిలోకీ విశాలమును వివిధమును, అతఁడు రవి గానని యెన్నింటినో కాంచిన మహాకవి, కాళిదాస భవభూతులకన్న ఎన్నియో నూర్ల యేండ్లు చిన్నవాఁడు. ఇప్పటికి నాలుగు వందల యేండ్ల నాఁటివాఁడు. డెరయసు హిస్టాస్పసు, అలీసాందరు, జూలీసు సీజరు అగస్టసు, చార్లమేను, ప్రభృతుల పారసీక యవన హూణాది సామ్రాజ్యముల విన్న వాఁడు కన్నవాఁడు. 'రినేసెన్సు' 'రెఫర్మేషను' ప్రభృతి మహా సంస్కారముల గాలులు సోఁకినవాఁడు. అట్లే ఆయాదేశాల మహాకవుల నానా రూపకాల సంప్రదాయ ముల యనంతరుఁడు తత్సకల పూర్వసంప్రదాయ వాసనావాసితుఁడు, అయినను పుట్టు స్వతంత్రుఁడు. తానును "నాటకేషు వయ మేవ" అను దీమసమునకు అనూనార్హుఁడు. మఱి యిట్టి కుమారుల యజాత నిర్వాసమును కాలాంతర ప్రత్యభిజ్ఞానమును గల సంవిధానము ఆనాటకాల మహావిశ్వమున కలదా యని చూఁడగా, ఒకట రెంట నొక కొంత కనఁబడినది. సంవాదమునకును తారతమ్య గణనకును ఇదే వాని నన్నింటిని, పునరుక్తి యగునని గణింపక, ఒక్కట నుదాహరించెదను.

శాకుంతలమున రాజు 'ఇద ముపనతం' అని తనకడకు వచ్చినదానిని, ఆ రూపాద్భుతమును తన వంశ ప్రతిష్ఠను దాల్చినదానిని శకుంతలను నిరాకరించితినే, ఆమె యింక దొరకనట్లు ఆకాశమున కలసిపోయెనే, నా ధర్మపత్నియు పోయినది, నా వంశమును ఉత్పన్నమైనది ! అయ్యో ! అని యనుశయమున మాటిమాటి యేడ్చి యేడ్చి

మూర్ఛిల్లినాఁడు. అది యాతని దుఃఖపరాకాష్ఠ. అంతట మాతలి మెడవిఱిచిన విదూష
కుని యార్తధ్వనికి మేలుకొని, ఆ మాతలి తెచ్చిన యింద్రుని పిలుపునకు అతని రథ
ముననే స్వర్గమునకు పోయి దుర్జయసంహారము గావించి యింద్రసత్కారముఁ బడసి
మఱునాఁడు మరలుచో మాతలి హేమకూట మార్గముం బట్టఁగా, ఆ మార్గవశమున
తగిలిన మారీచాశ్రమముచెంత దిగి ఆ మహర్షి దర్శనము చేసికొని పోఁగోరినాఁడు.
(1) అప్పటికే అతనికి ఒకమాఱు ఉత్తరాత్మ సబాహ్యాంతఃకరణముగా ఆకస్మికముగా
ప్రసాదము గన్నది. ఇది గొప్ప శుభశకునము. (2) అంతట ఆ ప్రజాపతి యాశ్ర
మముం బ్రవేశించుచో రాజునకు మఱియు అమృతహ్రదమువున మునిఁగినట్లు నిర్వృతి
గలిగినది. (3) మాతలి రాజును అశోక (=శోకముతీర్చు) వృక్షమునీడలో నుండు
మని తాను ప్రజాపతిదర్శనమునకు తగిన సమయము కనుఁగొనిరాఁ బోవును.
(4) రాజునకు బాహుస్పందనశుభనిమిత్తము దోఁచును. అయినను తనకు ఒక్కటే కోరిక
యైన శకుంతలసమాగమము తానే మును, సిరి రా మోకాలొడ్డినట్లు, అవధీరణ
చేసినది ఇఁక మఱలదు అని యనుకొనును. (5) దానికి 'మా ఖలు, మా ఖలు చాపలం
కురు' అని 'అట్లు అనుకొనకు, నిరాశ చెందకు' అన్నట్లు ఉపశ్రుతి వినఁబడును. (6)
అంతట మునిబాలుఁడు మహాసత్త్వుఁడు సింహశిశువుతో ఆడుకొనుచున్నవాఁడు
అగపడును. (7) అతనియందు రాజునకు ఔరసపుత్రునియందువలె మనసు తగులు
కొనును. (8) పరికింపఁగా అతఁడు రాజునకు మహాతేజోబీజముగాఁ దోఁచును. (9)
అతఁడు బొమ్మ యిమ్మని చేయి చాపఁగా అందు రాజునకు జాలగ్రథితాంగుళిత యను
చక్రవర్తిలక్షణము అగపడును. (10) అతనిని ముద్దాడను లాలింపను అతని మనసువ
అనుకలుగును. (11) ఆ బాలుని తాను మహర్షిపుత్ర అని పిలువఁగా తాపసి అతఁడు
మహర్షిపుత్రుఁడు కాఁడు అనును. (12) ఆ తాపసికోరికచే ఆ సింహకిశోరము వాని
పట్టునుండి విడిపింప ఆ బాలుని తాఁకఁగా, తనకు ఆదేమో చెప్పనలవికాని స్పర్శ
సుఖము కలుగును. (13) ఆ తాపసి ఆ బాలునిం గూడిన రాజును జూచి, యిరువురి
మొగములం బరికించి, బాలుఁడు ఆ రాజుపోలికగా నుండుటం గనిపట్టి రాజుతో ఇతఁడు
అంతయు నీపోలికగా నున్నాఁడు అనును. (14) రాజు మఱి యాతని కులమే మని
యడుగఁగా ఆమె అతఁడు పూరువంశజుఁడు అనును. రాజు బాలుఁడు తన పోలిక
యని ఆమె భ్రమయుటకు ఆ యేకవంశత కారణము కాఁబోలు అని యనుకొనును.
పౌరవుల ముదిమిలో వానప్రస్థులై ధర్మదారతో అడవికి పోవుట కలదే. అట్టి యెవ
రేని యిందు వచ్చియుందురా అని యనుకొని అంతలో ఆచోట మానవులకు ప్రవేశ

ముతో ప్రవేశింపరానిదే, అ దెట్లు సంభవించును అని సందేహపడి తాపసిని అడుగును- ఈ చోటు మానవులకు సొంతముగా చేరరానిదే అని. (15) ఈ బాలుని యమ్మ అప్సరః సంబంధముగలది, వీనిని ఇటఁ గన్నది అని ఆమె యనును. దాన రాజునకు మఱియు ఆశ వృద్ధియగును. (16) అంతట ఆమె యేరాజర్షిపత్ని అని యడుగును. దానికి తాపసి ఆధర్మదార పరిత్యాగిపేరు ఎవరు తలంతురు అని యనును. అదియు రాజునకు తన సొంత కథయే. (17) ఐనను ఆమె యెవరిభార్యయో, పరభార్య పేరడుగకూడదు గదా అని రాజు అనుకొనునంతలో మఱియొక తాపసి ఆటనెమిలిం గొనివచ్చి అబ్బాయి ఇదిగో 'సఉంతలావణ్ణం పేక్ఖ' —శకుంత లావణ్యం, శకుంతలా వర్ణం..అను రెండర్థములు తోఁచునట్లు ఎచ్చరింపఁగా, వాఁడు రెండవయర్థముం గొని 'ఏదీ మాయమ్మ?' అనును. అట్లు రాజునకు బాలునియమ్మపేరు శకుంతల అని తెలియును. తనకు ఇఁక సందేహము అంతయు తీఱినను, ఒకవేళ లోకాన పేరుల పోలికలు ఉండవా అని కొంత శంకించును. (18) ఇంతలో అబ్బాయిచేతి తాయెత్తు ఎక్కడనో పడిపోయినదే అని తాపసి యనఁగా, రాజు వెదకుచు ఇదిగో అని నేలం బడియున్నదానిని ఎత్తఁబోయి, తాపసి ఎత్తకు అని వారించునంతలో, ఎత్తును. ఎత్తి, ఏల నన్ను వారించితిరి అని రాజడుగఁగా తాపసి 'అది యొక ఓషధి. అబ్బాయి తాను గాని, అతని తల్లిదండ్రులు గాని దానిని ఎత్తవలసినదే కాని, ఇతరులు ఎత్తిన, మేము ఎన్నితూర్లో చూచియున్నాము, అది పామై కఱచును అని యన్నది. ఇది సందేహమును పూర్తిగా తీర్చినది. (19) అంత హర్షాతిరేకముతో బాలుని కౌఁగిలించుకొనఁగా, బాలుఁడు 'విడు నన్ను. అమ్మకడకు పోయెదను. మా నాయన దుష్యంతుఁడు. నీ వెవడవు?' అని యనఁగా, ఆ వివాదము ప్రత్యయముద్రను మఱియు గట్టిగా వేసినది. ఇట్లది పంచోష్మవిపెట్టి ప్రత్యభిజ్ఞాన విశేషిక. శాకుంతలేయుఁడు చాల పసిబాలుఁడు, అతనికి హార్దభావములు కలుగుటకును ప్రకటమగుటకును వయసు చాలదు. ఐనను దుండగీఁడే. తాను 'అపరిచిత స్యాపి అస్యన్య అప్రతిలోమః సంవృత్తః' అని తాపసి యన్నట్లు దుష్యంతుఁడు తాఁకినను ఎత్తుకొన్నను కౌఁగిలించినను అతనికడ అంత వినమ్రముగా మండుట అది యొక 'ఇద మిత్థ'మని తోఁపని భావంపు శేష్యయే. దానిని (20) ఇరువదియవ మెట్టుగాఁ గొనఁదగును.

కుందమాలలో (1) శ్రీరాముని యంతఃపురపరిచారకులు కంచుకి ప్రభృతులు ముదిబాలురుగా నున్న కుశలవులం గని వారు శ్రీరాముని బాలభావమును తలఁపించుచున్నారని యనుకొనుచున్నారని రాముఁడు విని యాశ్చర్యపడును. (2) తరువాత

కుశలవదర్శనమాత్రమున శ్రీరామునికి పరవశత గొల్పు నాశ్చర్యముచే, తనకు తెలియకయే 'తథా ప్యాపాతమాత్రేణ చక్షు రుద్బాష్పతాం గతం' అని కన్నుల నీరు తేఱినది. (3) వారి యాకారము వేషము నడక వినయగంభీర ప్రశాంతమనోహరముగా ఉన్నదని యనుకొనును. (4) వారిని నెట్టన కౌఁగిలించుకొని ఆ స్పర్శకు హృదయమున సంతసిల్లును. (5) వారిని సింహాసనమున తన యొడిలో కూర్చుండఁబెట్టుకొనును. (6) సీత వివాసనమై పండ్రెండేండ్లు అయినది. వీరి వయసును అంతగానే ఉన్నది అని యనుకొనును. (7) దూరదేశమున ఉన్న నాయన తన పరోక్షమున పుట్టి యెదుగు బిడ్డలంగూర్చి ఏమేమి తలపోసికొని మనసున కరంగునో, వీరిం గాంచఁగా తనకును ఇప్పుడు అట్లు మనసు కరంగుచున్నది అని యనుకొనును. (8) ఆ బాలురు సింహాసనస్పర్శమున రాఘవేతరులవలె తల పగులక యుండుటను పరికించి శంకించియు, అది యొకవేళ వాల్మీకి సంస్కారమహిమ కాఁబోలు నని తలంచును. (9) వారు సూర్యవంశజులనియు క్షత్త్రియ బ్రహ్మచారులనియు విని: తన వంశమువారుగనే యున్నారే అని రాముఁడు ఆశ్చర్యపడును. వారు అమడలనియు, లవకుశనాములనియు, లవుఁడు తమ్ముఁడు కుశుఁడు అన్న యనియు ఎఱుంగును. (10a) మఱియు వారిని గన్న నాయనను (=జనకుని) వారి యమ్మ వారిమీఁద కోపము వచ్చినపుడు నిరనుక్రోశుని (=క్రూరుని) బిడ్డలారా యని మందలించు ననియు (b) ఆయనను వా రెన్నఁడును చూడలేదు. అమ్మ యొంటిజడవ్రతముంబట్టి ఆయన బ్రదికియున్నాఁ డని మాత్రము ఎఱుంగుదురనియు, తెలిసికొనును. (c) అమ్మపేరు తపోవనమున అందఱు దేవి యని యందురనియు, వాల్మీకిమాత్రము వధువు అని యనునియును ఎఱుంగును. నిరనుక్రోశవ్యవహారము తన్నుంగూర్చినది కాఁదగుననియు, ఆ దేవీవధూవ్యవహారము సీతంగూర్చినది కాఁదగుననియు తలపోసికొనుచు, (11) అన్నివిధాలను ఈ యన్నిసందర్భములు తన కుటుంబవృత్తాంతమునకు సరిపోవుచున్న వనుచు మిక్కిలి పర్యాకులుఁడగును. (12) తరువాత వాల్మీకి రచించిన రామాయణ గానము వినుచు—

> 'పరిపూర్ణే తతః కాలే ద్వ్యా రి శేన్దుదివాకరా
> సీ తాపి జనయామాస సా యమౌ తనయౌ శుభౌ
> జాతావస్థోచితం కర్మ విదధానో యథాక్రమమ్
> స చకార తయో ర్నామ మునిః కుశలవా వితి.'

అని విని అన్నిసందేహములకు నిర్ణయముఁ గాంచును. తరువాత వాల్మీకివలన సీతాపునఃసంయోగముం గాంచును.

ఉత్తరరామచరితలో (1) ఛాయాంకమున (=తృతీయాంకమున) అది యెట్లో తనకు ఊహింప నలవిపడకున్నను అన్ని తూర్లు సీతస్పర్శసుఖముచే మూర్ఛలు తొలఁగిన రాముని చిత్తమున వాగారంభము పొందని ఎన్ని భావములు ప్రత్యాశాజనకములు పుట్టియుండవు! (2) పుష్పకము దిగి లవుం గాంచఁగా, చంద్రకేతువు అతనిని తన్నుఁ జూచుకంటెను మిక్కిలి శివతరములగు చూపులం జూడుమని సిఫారసు చేయును. (3) రాముఁడును లవుని యాకారముంగాంచి అది యతిగంభీరము, లోకములు గావఁగల పరాక్రమముగలది, సామర్థ్యముల రాశి, గుణముల ప్రోవు, పున్నెముల మూర్తి అని యబ్బురపడి. (4) అది ఒక్కుమ్మడి తనకు దుఃఖమును తొలఁగించి అంతరాత్మను తన కెఱుంగరాని కారణమున స్నేహపరవశము చేయుచున్నది యని యనుకొనును. (5) అతనిని అతిప్రీతితో గాఢముగా కౌఁగిలించుకొని, అతని వినయమును వారించుచు, జిల్లుమను ఆ స్పర్శకు ఆనందించును. (6) అతని వీరాయితమును క్షత్త్రాలంకారమని ప్రశంసించును. (7) అతనికి జృంభకాస్త్రములు సంప్రదాయము లేక స్వతః ప్రకాశము లగుట ఎటులో గదా అని వితర్కించుకొని తొలుత పుణ్యపరిపాక మహిమ కాఁబోలు అని యనుకొనును. (8)ఇంతలో కుశుని గొంతు విన్నమాత్రకే మేనఁ బులకలు దాల్చును. (9) అతని పౌరుషాతిరేకమునకు ఆశ్చర్యపడును. (10) అతనిం గౌఁగిలించుకొని అతఁడు ఎవరి బిడ్డయో తెలియదు గాని. తనకు ఆయాలింగనము ఔరసాలింగనమువలె జిల్లుమని ఆప్యాయనముగా నున్నది అని యనుకొనును (11) అతనికిని లవునికిని (a) వినయముతో కూడుకొనియే (b) గతిస్థిత్యాసనములు సమ్రాట్టులకుం దగిననిగా నున్నవనియు· (c) మేన అసాధారణ నీలకాంతితో (d) సహజ సౌందర్యము (e) సింహ ప్రసన్న స్తిమిత వీక్షితము, (f) మంగళ మృదంగధ్వనిం బోలు గొంతుఁ వినిపిల్లుచున్నవనియు, (12) వారియందు తన పోలిక మాత్రమే కాక (13) సీతపోలికయు ఎక్కువగా అంతటను ఉన్నదని పరికించును. (14) ఆవనము సీతను త్యజించిన వాల్మీకి కాపురపువనము (15) జృంభకాస్త్రములు స్వతఃప్రకాశములు అను విషయమునను ఆ చిత్రదర్శనప్రస్తావమున ఆ దినము తాను పలికిన అభ్యనుజ్ఞ నెఱవేఱియుండు నని స్మరించును. (16) తన హృదయము ఇట్లని చెప్పరాకుండ ఆనందమున తేలియాడుచు తన్ను నమ్మించుచున్న ట్లున్నదని ఎంచుకొనును. (17) మఱియు సీతగర్భమును తాను అప్పుడు తడవిచూచి అది లోపల కవలు గలిగియున్నదని తలంచియుంటను సయితము మనసునకు తెచ్చుకొనును. ఇట్లిట్లు అన్నిసందర్భములను తలపోసికొని కుశలవులు తన బిడ్డలే అని తలంచుకొని,

ఐనను సమ్యఙ్నిర్ణయమును గోరియుండఁగా, అది యంతర్నాటికానంతరము అరుం ధతి మాటచే వాల్మీకి వారినే తెచ్చి—వీరుగో కుశలవులు అని రామునికి అప్పగించి నప్పుడు కలిగినది.

షేక్స్పియరున 'వింటర్స్ టేలు' నాటకమందు లియాంటిసురాజు వ్యభిచార భ్రమచే తనకు మిక్కిలియుం గూర్చిన భార్యను కఠోరగర్భను హెర్మియానును, ఆ గర్భము మఱెవనిచేతనో ఆహితమని శంకించి పోనాడి, చెఱసాలలో వైచి, ఆమెకు గారా బగు తమ తొలికాన్పు కొడుకును ఆమెనుండి చీల్చి ఆమెకంటఁ బడనీక దాఁచియుంచి, ఆ చెఱసాలలో ఆమె కన్న యాఁడుబిసుఁగును తన దేశమునకు బయట కాకులకు వేయుఁ డని యుత్తరువుచేసి, అందులకై మానుసులం దఱిమి, ఇంతలో అపోలో దేవుని వాక్కు ఆయనసోదెకావి ద్వారమున వెడలినది—'హెర్మియాను పరమసాధ్వి, లియాంటిసు విష్కారణాసూయువు, కడు దుర్మార్గుఁడు, ఆ పుట్టినబిడ్డ ధర్మ్యప్రజ, అది మరల దొరకకపోవునేని రాజునకు సంతతి విచ్ఛిన్నమై పోవును.' అని వినం బడఁగా లియాంటిసు మొండికట్టెయై తన దురాగ్రహము వీడక 'ఆ వాక్కు వట్టి యసత్యము, రాణి వ్యభిచారదోష విమర్శ నిర్ణయము సాఁగవలసినదే' అని దీమస మునఁ బలుకునప్పటికి తన యాకొడుకు అమ్మబెంగచే తటాలున చనిపోయినాఁ డని వార్త వినవచ్చినది. అది వినఁగానే అమ్మ హెర్మియాను మూర్ఛిల్లి చచ్చినట్లు పడినది; అందుండి రాజుమాటచే అపనీతయై ఉపచారములం దెలివి పొందక మృతి చెందినట్టులైనది. ఈ యాకస్మికపుఁ దార్కాణలచే అపోలో దేవుఁడు కరము కుపి తుఁడై ఈ చావులతో తన్ను దండించినాఁ డని లియాంటిసు పశ్చాత్తప్తుఁడై అను శయ దుఃఖమున నిత్యమును ఆ రాణి కొడుకులవి యని చూపిన గోరీలపై అశ్రులు రాల్చుచు ఆ యనుశయమునను ఆ సంతతి విచ్ఛేదమునను పదునై దేండ్లు కుములు చుండెను.

కాకులకు వేయఁబడిన ఆ విసుఁగు దేశాంతరమున గొల్లలకు దొరకి పెరిఁగి మెఱపు తీఁగెవంటి తన యందముచే ఆ దేశపు రాజకుమారు వలపునకు పాత్రమై, తన యింటికి అభిసరించినవానిం గూడి యెట్లెట్లో సందర్భముల వశమున మరల లియాం టిసు రాజ్యమున అతని యెదుటఁ దోఁచినది. ఆ బాల సౌభాగ్యము మఱి యిలలో సాటిలేనిది, స్త్రీలను సయితము వలపించునటు లుండ, మఱి పురుషులమాట చెప్ప వలయునా? లియాంటిసు ఆ యమ్మాయిం గని (Paragon-Goddess) 'ఒక దేవత' అని యన్నాఁడు. అట్లు ఆ యమ్మాయిపై ఎగదిగ చూపు నిలి

పిన యాతనితో మిత్ర మొక దొరసాని, హెర్మియానునకు కడుం గూర్చినది, ఆమెను ఆ చావుమూర్ఛనుండి తేర్చి కాచి దాఁచియుంచినట్టిది.

Paulina—......Sir, my liege your eye hath too much youth in't : not a month 'fore your queen died, she was more worth such gazes than what you look on now." అని యనఁగా.

Leontes.—......I thought of her even in these looks I made." అని యనెను. అనఁగా ఆ యమ్మాయి మరల బాల్యముగన్న హెర్మియానే అని యనవలపినట్లు, ఆమెయందు హెర్మియాను పోలిక నాకన్నుల బందిగొన్న ట్లాయెను అన్నమాట. మఱియు—

"the majesty of the creature in resemblance of the mother the affection of nobleness which nature shows above her breeding and many other evidences proclaim her with all certainty to be the king's daughter."

అని అమ్మపోలికలోని యా యమ్మాయి దొరసానితనము, తాను పెరిఁగిన గొల్లయింటికి మించిన యా యాభిజాత్యము, ఇంకను ఎన్నియో లక్షణములును సందర్భములును తోఁచియు ఆ గొల్లలవాక్కు సాక్ష్యము వినంబడియు, నమ్మింప ఆ యమ్మాయి ఆ రాజుచే నష్టలబ్ధయైన తన కూఁతురు అని పరిగ్రహింపఁబడెను.

పరమసాధ్వియు పతివ్రతయు నగు హెర్మియానును నిష్కారణముగా నిజ పరమ మిత్రునిమీఁదనే యసూయ పెంచుకొని వానితో వ్యభిచరించినదని భ్రమసి దండింపఁగోరి, యింతలో ఆమె నిజమైన నిష్కలంక శీలముగలది యన్న దేవుని వాక్కును సోదెకానివలన వినియు అవధీరణచేసి, అంతట ఆ క్షణమున తన కొడుకు ఆకస్మికముగా చనిపోవుటచేతను, ఆ చావువార్తకు ఆ భార్యయు మూర్ఛిల్లి మడియుట చేతను దేవుని కోపమును దాన తనకైన యా దండనను ఊహించుకొని ఆ వాక్కున నమ్మకము తిరిగి తిరముకాఁగా తన చిత్తమును నిస్సందేహ నిర్మలము చేసికొని యనుశయమున కుందుచుండి దైవసాహాయ్యమునను ఆమెను ఎట్లో పునర్జీవితయైన దానిని మరల కలసికొని కృతార్థుఁడైన కథ యీ లియాంటిసుది. ఉత్పత్తి పరిపూత, నిప్పునకు నిప్పు అని తాను ఎఱింగియు నమ్మియు, అజ్ఞానముచే దోషాశంక చేసిన ప్రజల యనురంజనమునకై కఠోరగర్భనే ఆమెను వివాసనము చేసి, అంత ఆపరమ సాధ్వి చారిత్రదేవత సీత ఏ రాక్షసునినోట పడినదో ఏ పులివాత పడినదో యని యేడ్చి

మాడి, దేవతల సాయమున ఆమె శీలము నిష్కళంకమని పౌరజానపద సకల ప్రజల కంటియెదుట ఋజువు పొందఁగా ఆమె మరల ప్రజాపూజ నందఁగా పునఃస్వీకృత యైన కథ శ్రీరామునిది. వీని తారతమ్యము రసికు లెఱుంగుదురు గాక.

అట్లే షేక్స్పియరు సింబలీను నాటకమున సింబలీనురాజుకొమారులు నిసుఁగులు తొట్లనుండియే తనచే వృథావమానితుఁడై యడవులకు వలసపోయిన వజీరుచే అపహరింపఁబడి, వీరులుగా పెరిఁగి యిరువదియేండ్ల యనంతరము పరరాజు దండెత్తి కలిగించిన దేశ మహావిప్లవమున యుద్ధమున, తమ పెంచిన నాయన యగు నా వజీరును మాఱురూపుననున్నవానిం గూడి ఆ సింబలీనుకు బాసటగా పోరి జయముగూర్చి సింబలీనునాయనను అతని దేశమును కాపాడి అయన యెదుటఁ దోఁచిన బాలవీరులగు గైడీరియసు—ఆర్విరేగసుల ప్రత్యభిజ్ఞాన ప్రస్తావమున అటు నాయన చిత్తమునఁ గాని యిటు కుమారుల చిత్తమునఁ గాని హార్దములగు నిట్టి వాత్సల్యగౌరవభావముల యుద్భూతి చెప్పఁబడలేదు. అం దొక కుమారునికి నాయన కుమారుఁ డని యెఱుఁగక మరణదండన సయితము విధించెను. అది తరువాత ఆ ముసలి వజీరుమాటచే ప్రతిషిద్ధమగుట యుండనీ, వీరు నీ కొడుకులు అని యప్పగింపఁ బడఁగా, పుట్టుమచ్చలు రుమాలు దుప్పటి మొదలగు బాహ్యపు ఋజువులచే స్వీకరింపఁబడిరి. కాని హార్దభావావిర్భూతి బిడ్డలంగూర్చి నాయనకుఁ గాని, నాయనంగూర్చి బిడ్డలకుగాని అంతగా ఏమియు చెప్పఁబడలేదు. అటం జెప్పఁబడినది యింతే. అందు ఏమి యిమిడియున్నదో!

Cymbeline—I lost my children. If these be they, I know not how to wish a pair of worthier sons.

మఱి యందే నాయన మాఱుమనువుదైన సవతితల్లి తనకు తొలిభర్తచేపుట్టిన కొడుకునకు తల్లిలేని తన్ను (ఇమొజనును) కట్టవలయు నన్న కుట్రను గ్రహించి, దానిని తాను ఒల్లక తప్పించుకొనుటకును, తన శీలమును శంకించి తన్నుం జంప రహస్యముగా నాజ్ఞ యిడిన తన కాంతుని చిత్తము నరయుటకును ఉపాయము వేసి, ఆ సవతితల్లి వలలోఁబడిన నాయనకు బ్రిటనురాజగు సింబలీనునకు తెలియక యింటిని దేశమును వదలి పరారియై అల్లాడి, కాలాన రణవిప్లవమునను దేశక్షోభమునను పేద బ్రిటనుబాలుని వేసాన శత్రురోమనునాయకుని సేవకుఁడుగా గొలుచుచుండి, పరాజితుఁడై బందియైన యాతనిచేత జయికి నాయనకు ప్రీతిపురఃసరముగా 'వీఁడు మీ బ్రిటను, గుణశాలి వినీతుఁడు మంచి సేవకుఁడు అని సమర్పితయై, ఇమొజెను అతనిచేత తన కూఁతురుగా ప్రత్యభిజ్ఞాత యగు నాయనకూఁతులసమాగమము, ఇంచుక వేఱు తెఱంగుది యైనను

భావంపుటలలచే ఇంచుక శాకుంతలోత్తరచరితలయందలి నాయన బిడ్డల సమాగమ మును ప్రత్యభిజ్ఞానమును పోలునటు లున్నది.

Cymbeline—...I have surely seen him
His favour is familiar to me. Boy,
Thou hast looked thyself into my grace,
And art mine own. I know not why, nor wherefore,
To say 'live boy' : ne'er thank thy master, live :
And ask of Cymbeline what boon thou wilt,
Fitting my bounty and thy state, I will give it.

... ... ... ...

What wouldst thou, boy?
I love thee more and more : think more and more
What is best to ask.

... ... ... ...

Thou art my good youth, my page;
I will be thy master: walk with me, speak freely.

... ... ... ...

Iachimo—That paragon, thy daughter,—
......I faint.

Cymbeline—My daughter! What of her? Renew thy strength:
..................Strive man, and speak.
..........................I stand on fire;
Come to the matter......
Nay, nay, to the purpose.

Posthumous—
I am posthumous
That killed thy daughter:......the temple
Of virtue was she; yea, and she herself
......O Imogen!
My queen, my life, my wife! O Imogen.
Imogen, Imogen!

Imogen—Peace my lord, hear, hear—

Posthumus—shall's have a play of this? Thou
scornful page

There lie thy part.
[striking her ; she falls]

Pisanio.—O gentlemen, help!
Mine and your mistress! O, my Lord
Posthumous!
You never killed Imogen till now. Help help!
Mine honoured lady!

Cymbeline.—Does the world go round?

... ... ... ... ... ...

Pisanio.—Wake, my mistress!

Cymbeline—If this be so, the gods do mean
to strike me
To death with mortal joy.

Pisanio—How fares my mistress?

Imogen—O, get thee from my sight;
Thou gavest me poison......

Cymbeline—The tune of Imogen!

Pisanio—Lady,
The gods throw stones of sulphur on me, If
That box I gave you was not thought by me
A precious thing : I had it from the queen—

Cymbeline—New matter still?

Imogen—It poisoned me

... ... ... ... ...

Cymbeline—What is this Cornelius?

Cornelius—.........I did compound for her
A certain stuff which, being taken would cease
The present power of life, but in short time,
All offices of nature should again
Do their due functions. Have you ta'en of it?

Imogen—Most like I did, for I was dead.

... ... ... ...

... ... ... ...

Cymbeline—How now, my flesh, my child!
What? makest thou me a dullard in this act?

Will you not speak to me?
Imogen—(kneeling) Your blessing, Sir.

... ... ... ...

Cymbeline—My tears that fall
Prove holy water on thee! Imogen."

... ... ... ...

... ... ... ...

Pisanio—...
......What became of him
I further know not
Guiderius—Let me end the story:
I slew him there.
Cymbeline—Marry, the gods forfend!
I would not thy good deeds should from my lips
Pluck a hard sentence: prithee valiant youth,
Deny't again.

... ... ... ...

... ... ... ...

Belarius—............
........These gentle princes
For such and so they are—these twenty years
Have I trained up.......

... ... ... ...

Here are your sons again: and I must lose
Two of the sweetest companions in the world
The benediction of these covering heavens
Fall on their heads like dew! for they are worthy
To inlay heaven with stars.
Cymbeline—Thou weepest and speakest.
The service that you three have done is more
Unlike than this thou tell'st. I lost my children
If these be they, I know not how to wish
A pair of worthier sons.

... ... ... ...

Cymbeline—O, what! am I
A mother to the birth of three! Ne'er mother
Rejoiced deliverance more. Blest pray you be,
Thou after this strange starting from your orbs,
You may reign in them now! O Imogen,

Thou hast lost by this a kingdom.
Imogen—No my Lord,
I have got two worlds by it. O my gentle brothers,
Have we thus met? O never say hereafter
But I am truest speaker; you ca.led me brother,
When I was but your sister: I you brothers
When ye were so indeed.

... ... ... ...

Cybeline—......See
Posthumous anchors upon Imogen.
And she, like harmless lightning, throws her eye
On him, her brothers, me her master, hitting
Each object with a joy; the counter change
Is severally in all. Lets quit this ground
And smoke the temple with our sacrifices.

## ౨౧ - భవభూతి మతాచార శీలాదికము

భవభూతి గొప్ప వైదికకుటుంబమున పుట్టి సంస్కారములం గని తాను చెప్పిన బింబగ్రాహి పళపళని మణివలె తాను అతిప్రదీప్త ప్రజ్ఞా (చూ. ii వి. ౪) మేధాశాలియై, ఒక్క సంతలో ఒక్క వినికిలో అంతయు జొట్టి ధరింపఁగలిగి శాస్త్రములనే కాక రామాయణ శాకుంతల రఘువంశాదులను కూడ మనసువిండను జిహ్వాగ్రమునను ఉంచుకొన్నవాఁడగును. మహావిద్వాంసుఁడు, మీమాంసకుఁడు, వేదాంతి, జ్ఞాని, భక్త్యావేశముగలవాఁడు, రామభక్తుఁడు మహాకవి యైనాఁడు. రాజాశ్రయము గని ఆస్థానములో మెలఁగినవాఁ డనుటను చరిత్రలయందు యశోవర్మాదుల పేరులతో కూడ ఇతనిపేరును ఉండుటంబట్టి ఊహించినను తన వ్రాఁతలలో తా నెందును దానిని ఊహకు అందింపఁడు. వాదప్రతివాదములలో ఎవరికిని వెనకరాక, ఎవరిని లక్ష్యపెట్టక మిన్నందుకొని యున్నవాఁడుగాఁ దోఁచును. తన సారమున తనకు నిశ్చల విశ్వాసము గలవాఁడు.

"యతః ప్రజ్ఞాన మభిసంభవతి తద్ధి ఆచరితవ్యం బ్రాహ్మణేన; తరతి యే నాపమృత్యుం పాప్మానమ్.

పరిష దియ మృషీణా, మత్ర వీరో యుధాజిత్,
సహనృపతి రమాత్యై, ర్లోమపాద శ్చ వృద్ధః
అయ మవిరత యజ్ఞో బ్రహ్మవాదీ పురాణః
ప్రభు రపి జనకానా మద్రుహో యాచకా స్తే—వీరచరిత-III-౫.

అని 'బ్రాహ్మణుఁడు ఏప్రజ్ఞానముచేత పరమాత్మానుభవమునకు హానికలిగించు పాపములను తరించునో ఆ ప్రజ్ఞానము కలిగించు ఊర్జస్వలాంతర్జ్యోతిర్దర్శనమును సాధింపవలసినది. అట్లే క్షత్త్రియుఁడు జనకుల ప్రభువు పురాణ బ్రహ్మవాది అవిరత యజ్ఞుఁడుగా ఉన్నాఁడే అట్లుండవలసినది యని' వసిష్ఠవాక్యాన పరశురాముం గూర్చి అతఁడు నిరాక్షేపణముగా 'ఏవ మేతత్'=అవును, అది యట్లే అని అంగీకరించునట్లు ఉపన్యసింపించి తన నమ్మిన మతలక్ష్యమును ప్రఖ్యాపించినాఁడు. అట్టిది తన నిత్యానుష్ఠానమున కలవాడుకాఁబోలు.

భవభూతి యంతటివాఁడు తాను నమ్మనియు అనుష్ఠింపనియు మతమును వసిష్ఠునిచే పరశురామునికి ఉపదేశింపించి యుండునా, దానిని తాను ఒకపాటి అనుష్ఠానమునకు తెచ్చుకొనకుండునా? వీరచరితమున అడవికి తరలిన రామునివెంట అయోధ్య నుండి యా బ్రాహ్మణులు, సాకేతులు, మైథిలులు, తరలుటం జెప్పినాఁడు: అందందును భవభూతికి లక్ష్యభూతులు, తదనుష్ఠానమునకు ఒరవడి కాఁబోలు.

స్కన్ధారోపిత యజ్ఞపాత్ర నిచయాః స్వైర్వాజపేయార్జితై
శ్ఛత్త్రై ర్వారయితుం తవార్కకిరణాం స్తే తే మహాబ్రాహ్మణాః
సాకేతాః సహ మైథిలై రనుపతత్పత్నీగృహీతాగ్నయః
ప్రాక్ప్రస్థాపిత హోమధేనవ ఇమే ధావన్తి వృద్ధా అపి.

ఉరోభస్మలాంఛిత కుశలవులం జెప్పిన తాను మంచి భస్మధారి. మాలతిలో భూతేశు నెగకంటి కాంతులు పర్విన జటలను, తాండవనృత్యమున మద్దెలమ్రోఁతకు వచ్చిన కుమారునెమిలికి బెదరి వాసుకి వినాయకుని తొండమున దూఱఁగా అతఁడు చీత్కరించుకొన్న చీత్కారములను, శంభుని బ్రహ్మకపాలకందరమున తొనకాడి యుబికిన జూటుమీఁది యేటి యలలను, జాబిల్లి వంకనుండి జాఱిపడుచున్న సుధాధారలకు కొనలలో 'శాత్ శాత్' అని శబ్దించుచున్న పురారి మూఁడవకంటిని అపూర్వముగా భావించి భక్తి పారవశ్యమున పూజించినవాఁడును, అట్లే మరల వట్టి చైతన్యజ్యోతిని నమస్కరించినవాఁడును అంతటి రామభక్తుఁడగుట: అందులకేమి? భర్తృహరి—

మహేశ్వరే వా జగతా మధీశ్వరే, జనార్దనే వా జగదన్తరాత్మని
న వస్తుభేద ప్రతిపత్తి రస్తి మే; తథాపి భక్తి స్తరుణేన్దుశేఖరే.

అని యన్నాడు. అట్లే కృష్ణకర్ణామృతకవి—

శైవా వయం, న ఖలు తత్ర విచారణీయం,
పఞ్చాక్షరీ జపపరా నితరాం; తథాపి.

చేతో మదీయ మతసీ కుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్.'

అని యన్నాఁడు. మఱియు 'జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ' అని పార్వతీ పరమేశ్వరులం గొలిచి, కుమారసంభవముం జెప్పి, నాటకత్రయరంగద్వారము లను ఈశ్వరునే స్తుతించి, రఘువున క్షీరాబ్ధినాథ స్తవ పూర్వముగా ఆఱుసర్గలలో రామా యణముం బాడినాఁడే కాళిదాసుః అట్లే భవభూతి 'భక్తస్య తత్ర' అని వాల్మీకి తద్రామాయణములందు భక్తి కలిగి తన వాణిని అట్లు ప్రవర్తిల్ల చేయఁదగును. మఱియు, అట్టి మతాభినివేశము కల్గియు దాంపత్య సౌఖ్యమునకు ఉవ్విళులూరువాఁడు, అనుభవించిన వాఁడును కాబోలు. అందు భార్య ప్రియగృహలక్ష్మియని యెంచుకొన్నవాఁడు. మఱియు,

ప్రేయో మిత్రం బన్ధుతా వా సమగ్రా
సర్వే కామాః శేవధి ర్జీవితం వా
స్త్రీణాం భర్తా; ధర్మదారా శ్చ పుంసాం;
ఇ త్యన్యోన్యం వత్సయో ర్జాత మస్తు. మాలతి Vi-18.

అని అట్లే ఆ దాంపత్యమున భార్యాభర్తలు ఒండొరులకు ఇట్లు కూర్చువారని చెప్పుటచే తనకు అది యనుభవసిద్ధమని సూచించినాఁడు. మఱియు 'ఇయం గేహే లక్ష్మీః.' ఇత్యాదియు అంతకన్నను 'అద్వైతం సుఖదుఃఖయోః' ఇత్యాదియు (I. ౩౧. ౩౨) నిజానుభవోద్గారములే యగునేమో. మఱియు అపత్యము దంపతుల యంత రాత్మల హర్షపు ముడి యని యెఱింగి లాలించి మూర్కొని ముద్దుగొని త దాలింగన ముల తనిసినవాఁడగును. మైత్రికి మాధవమకరందులను లోకమునకు గుఱిగాఁ జెప్పి, అట్టిదియు తనకు అనుభవమున కలదే అని సూచించినాఁడేమో,

ఆ జన్మనః సహనివాసితయా మ ఖైవ
మాతుః పయోధరపయోఽపి సమం నిపీయ
త్వం పుణ్డరీకముఖ, బన్ధుతయా నిర స్త
మేకో నివాపసలిలం పిబసీ త్యయు క్తమ్. మాలతి iX-40.

అని చేతనం గోలుపోయిన యట్టి మిత్రుని మాధవుని పరలోకమునకు అను గమించుటకు ఏటిలో దూఁక సమకట్టినాఁడు మకరందుఁడు, అట్టిది ఆ మైత్రిః మహా వీరమునను సుగ్రీవవాక్యాన మైత్రీధర్మమును,

ప్రాణై రపి హితా వృత్తి రద్రోహో వ్యాజవర్జనమ్
ఆత్మ నీవ ప్రియాధాన మేత న్మైత్రీ మహావ్రతమ్. V-59.

అని నిర్వచించుట కలదు గాని ఆ భాగము భవభూతి వాక్కుగాదు. ఇఁకను ఉత్తరచరితమున జనక దశరథ మైత్రియు, కౌసల్యా జనక మైత్రియు, మహాకవియే చెప్పినట్లు.

"కన్యాయాః కిల పూజయన్తి పితరో జామాతు రాప్తం జనం
సమ్బన్ధే విపరీత మేవ త దభూ దారాధనం తే మయి"

అన్నట్లు లోక విపరీతమై,

"స సమ్బన్ధీ శ్లాఘ్యః, ప్రియసుహృ దసౌ, తచ్చ హృదయం
స చానన్దః సాక్షా, దపి చ నిఖిలం జీవితఫలమ్,
శరీరం, జీవో వా, యదధిక మతో౽న్య త్ప్రియతరం;
మహారాజః శ్రీమా న్కి మివ మమ నాసీద్ దశరథః."

అట్లు పరిఢవిల్లినది. కౌసల్యాదశరథులకు ఇంటిగుట్టు చాడీలు ఒకరిమీఁద నొకరు చెప్పుకొనుటకు జనకుఁడు పాత్రము. అటుపై వారి యొండొరుల యలుకకుఁ గాని దానిం దీర్చుటకుఁ గాని తానే కర్త. ఈ జనక దశరథమైత్రి ప్రకారము కేవలము కవికల్పన. ఆ దినాలలో దశరథుఁడు చక్రవర్తి, జనకుఁడు రాజర్షి, సూర్యశిష్య యాజ్ఞవల్క్యమునివలన పరబ్రహ్మ వివరము విన్నవాఁడు, జ్ఞాని.

ఆదిత్యశిష్యః కిల యాజ్ఞవల్క్యో
యస్మై ముని ర్బ్రహ్మ పరం వివవ్రే.

అని యీ యిరువురి వేర్వేఱు ఘనతను చిత్తగించి ఇట్లు ఈ విపరీతత సదృశ మగునని అల్లినాఁడు. ఒకవేళ స్వానుభవమున భవభూతి ఒకపాటి యట్టి సంబంధమును గని విని యుండునా? మఱియు వాసంతి వనదేవత ఆత్రేయికిఁ గావించిన యతిథిసపర్య 'యథేచ్ఛం భోగ్యం' II అనునదియు, ప్రియప్రాయా వృత్తిః ఇత్యాదిగా ఆత్రేయి ఉపన్యసించిన 'రహస్యం సాధూనా మనుపధి విశుద్ధం విజయతే' అను సాధువృత్త రహస్యమును, 'అకిఞ్చి దపి కుర్వాణః సౌఖ్యై ర్దుఃఖా న్యపోహతి' అను ప్రియజన ద్రవ్యవిశేషతయు వట్టి నాటకపాత్రభాషితములు గాక భవభూతికి నిజవృత్తమునను నిజబంధుమిత్రుల వృత్తమునను అనుభవపూర్వకముగా నెఱిఁగినవియు నిజానుభవమున సిద్ధముగా కలవియు నగు ననుకొందును.

శిష్యులు గురువుల కడ విద్య నేర్చుకొనుట, అందు మట్టిమద్ద బుద్ధిగాండ్రు మేధావులు ఉండుట, వారికి గురువు ఏపాటి చేయగలఁడు ఏపాటి చేయలేఁడు అను ఇవి పరిశీలించి భవభూతి తెలిపినాఁడు. అగస్త్యాశ్రమమునను వాల్మీకియాశ్రమమునను పెద్ద బడులు, అన్ని విద్యలు గఱపునవి. ఉద్గీథముంగూడ నేర్పునవి, యుండెనని భావించినాఁడు. దీన గ్రంథాలలో పేర్కొన్న కులపత్యాశ్రమములను తన నాటకమునకు ఆకర్షించుటయో, తనకాలమున పేరిభట్టు పెద్దిభట్టు అనునట్టి సకలశాస్త్రపారంగతులగు ఒజ్జలు. వారిని ఆశ్రయించి పలువురు విద్యలు నేర్చుకొనుట, తానును అట్లు నేర్చుకొన్న 'ఒక్కసంతగ్రాహి' యని సూచించుటో నిర్ణయింపఁజాలము. తరగతులలో కొంటె బాలురు సామబాలురును ఉండుట, ఒజ్జల పరోక్షమున ఆ కొంటెలు వారి మీసాలను గడ్డాలను భోజనాదులను వేషభాషలను ఎగతాళిచేయుట, సాదులు అట్టివారిని కసరి నోరుమూయుఁ డనుట- ఇదియు సూచితము. శిష్టానధ్యయనము బాలురకును ఒజ్జలకుంగూడ దేశకాలనియంత్రణ పడలించి సంతసము కూర్చునదే. బాలురుకూడి షికారులు తిరుగుదురు. ఆ బడులలో స్త్రీలును ఆత్రేయింటోలినవారు, మునికన్నెలు మునిపత్నులు పురుషులతో కలసియు కలయకయు విద్య నేర్చుకొనుటయు ఊహింపఁదగును. తెలివిగలిగి తరగతిలో అగ్రస్థానమున నుండువారు మొద్దులను ఎగతాళి చేయుట, 'ఆ పాఠము మనకు ఐనదేరా, నీకు రాదా, మొద్దుగా' అని చులకన పలుకు పలుకుట - అట్టిదియు కలదు. వాల్మీకి శిష్యుఁడు లవుఁడు ఋషి యొసంగిన సంస్కారముచేత కరము సమ్మతమైన దానిని పలుకుచున్నాఁడు అవి గురువువలని శిష్య సంస్కారమును లోకులు పెద్దగుమెచ్చుకొనుట, ఆ బడి మంచిది, అంతకంటె ఈ బడి మంచిది అని తారతమ్యము గణనకు వచ్చుట - ఇదియు కలిగియుండెను.

ఈ నాటకాల నన్నిటిని చూడఁగా భవభూతి ఎప్పుడును గబ్బిగా నుండువాఁడ కాని హాస్యములకు దిగువాఁడు కాడు అని తోఁచును. నాటకాలలో మహావీరచరితమున కూర్చిన యావీరగోష్ఠులలోఁగాని ఉత్తరరామచరితమున కూర్చిన యాకరుణ గోష్ఠులలోఁ గాని వసిష్ఠ విశ్వామిత్ర శతానంద పరశురామ జనక దశరథ సీతా రామ లక్ష్మణులయు మాల్యవ చ్ఛూర్పణఖా జటాయు సంపాతి సుగ్రీవ వాలి శబరులయు గగనోన్నత సంఘటనలలోను, సీతారామలక్ష్మణ తమసా మురళ వాసంత్యరుంధతీకౌసల్యా జనకసుమంత్ర చంద్రకేతు లవకుశవాల్మీకుల యా గగనాతిగోన్నత సంఘటనలలోను హాస్యమునకు అవకాశము అతివిరళమే, సున్నప్రాయమే, ఇఁకమ మాలతీమాధవుల శృంగార సంఘటనలలోను, హాస్యమునకు విదూషకపాత్రమునకు అవకాశము

కల్పింపఁదగినచోటను కవికి అపొంతఁ బోవఁ దోఁపలేదు. ఇదెల్ల భవభూతి సొంత తత్త్వమును, స్వభావమును సంస్కారమును వ్యాఖ్యానించుట యగును చిత్రవర్ణన మపుడు సీత లక్ష్మణునితో "వత్స, ఇయ మపరా కా" "వత్స, ఈ యింకొకతె ఎవరు?" అని లక్ష్మణుఁడు సిగ్గుపడి నవ్వునట్లు అడుగుటయు (I) తమస సీతను "అయి వత్సే ఏవ మాత్మా స్తూయతే." "ఓసి బాలా ఇది నిన్నే పొగడుకొనుట." అని నవ్వుచు కవుంగిలించుకొనుటయు (III) "అగతం అనధ్యాయకారణం సవిశేషభూతం అద్య జీర్ణకూర్చానామ్." 'నేఁడు నరపమీసగడ్డాలగాళ్ళకి సవిశేషమైన యనధ్యాయకారణం వచ్చింది." [దీనికి భాండాయనుఁడు పెద్దగా నవ్వును.] 'భో భాణ్డాయన కింనామధేయ ఏష మహతః స్థవిరసార్థస్య ధురంధ రో౽ద్య చీరధారకః అతిథి రాగతః.?' (ఒయ్యోవు భాండాయనా, ఈ పెద్దమునళ్ళబిడారుకు నాయ కుడుగా ఇప్పుడు వచ్చాడే నారమడిఘారి, అతని పేరేమోయి?) అనియు, "హుం వసిష్ఠః మయా పున ర్జ్ఞాతమ్ వ్యాఘ్రో వా వృకో వా ఏష ఇతి." "ఊ! వసిష్ఠుఁడా? నే ననుకొన్నాను పులో తోడేలో అని." అనియు ఎగతాళిగా మాటలాడుటయు, 'యేన పరాపతితే నైవ సా వరాకీ కపిలా కల్యాణీ మడమడాయితా' 'ఆయనగారు వచ్చి రాకముందే పాపం! ఆ కల్యాణిని కపిలని మడమడ నవిలి గుటకాయస్వాహాచేశాడే!' ఇదియు ఎగతాళిధోరణియే యగుటయు (IV-వి.) లవుఁడు జనకునితోడనే (ఆయన జనకుఁ డని యెఱుఁగక) "ఊర్మిళాయాః పుత్త్రః, మైథిలస్య రాజర్షేః దౌహిత్రః" అనుటయు, విజముగా నవ్వు పుట్టించు సంవిధానము. దానికి అరుంధతికి నవ్వు వచ్చి నది. అన్నది 'ఆవిష్కృతం కథాప్రావీణ్యం వత్సేన' కుమారుఁడు కథాప్రావీణ్య మును వెలిఁబుచ్చినాఁడు'అని. ఇదియు, ఇంకను వటువు గుఱ్ఱమును విను పెద్దలకు నవ్వు వచ్చునట్లు బుచ్చిమాటలతో చెప్పుటయు, 'వికిరతి శకృత్పిణ్డకా నామ్రమాత్రాణ' 'మామిడికాయలంతలేపి లద్దెలు వేయును' అనుటయు, లవుఁడు వటువులతో 'నను మూర్ఖాః పఠిత మేవ హి యుష్మాభి రపి తత్కాణ్డమ్' 'ఓరి మూర్ఖులారా చదివితిరే మఱి ఆకాండములో' అనుటయు—ఇదంతయు ఇంచుక మందునకు కలికమునకు పనికివచ్చుపాటి హాస్యము. ఈ హాస్యముతీఱుంబట్టి కవిచిత్తమున మంచిహాస్యము మెండుగానే యున్నదని తోఁచును గాని ఆవిష్కరించు నవకాశము గాని యుద్యమము గాని లేదనిపించును. పుట్టువైదికుఁడు గొప్పపండితుఁడు మహాప్రతిభగల కవి తాను పురుషకారమునకన్న దైవమునే ప్రమాణీకరించును. ఇందులకు మూఁడు నాటకముల యందును బహుళముగా దృష్టాంతములు గలవు.

సుహృ దివ ప్రకటయ్య సుఖప్రదః
ప్రథమ మేకరసా మనుకూలతాం
పున రకాణ్డ వివర్తన దారుణో
విధి రహో విశినష్టి మనోరుజమ్.—ఉ. రా. చ. IV-13. మాల IV. 7
కోనామ పాకాభిముఖస్య జన్తు ర్
ద్వారాణి దైవస్య పిధాతు మీష్టే.—ఉత్తర. VII-4, మాలతి X 13.

రామునిచేతను సీతచేతను పృథ్వీచేతను భాగీరథిచేతను దైవమహిమ చెప్పించిన కవికి అది సొంతాన ప్రమాణము కాకుండునా? మఱియు "స్నేహము నిమిత్తసాపేక్షము గాదు.' అని

'వ్యతిషజతి పదార్థా నాన్తరః కోఽపి హేతుః
న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయన్తే.'

అని శ్రీరామునంతటివానిచేత పలికించినాఁడు. అట్లే మంచిజ్ఞాని వివేకి లోకానుభవశాలి వయోవృద్ధుఁడును సుమంత్రుఁడు చెప్పుచున్నాఁడు.

"భూయసా జీవధర్మ ఏషః, యద్రసమయీ కస్యచిత్ క్వచిత్ ప్రీతిః; యత్ర లౌకికానాం వ్యవహారః తారా మైత్రకం చక్షూరాగ ఇతి. త మప్రతిసంఖ్యేయం నిబన్ధనం ప్రమాణ మాహున్తి.

శ్లో॥ అహేతుః పక్షపాతో య స్తస్య నాస్తి ప్రతిక్రియా
స హి స్నేహాత్మక స్తన్తు ర న్తర్మర్మాణి సీవ్యతి."-ఉ.రా.చ. V.౧౭. అని.

దాంపత్యము పూర్వజన్మమునుండి ఈ జన్మకును ఇందుండి ఉత్తరజన్మకును అనువర్తించు నని మన శాస్త్రములు. "జాయావర్జం చ సర్వస్య యామ్యః పన్థా విభిద్యతే." అని 'జాయావర్జం' అనుట కనఁదగును. కావున దానికి వలయు అనురాగాద్యుత్థానమునకు ఇట్టిది కారణముగా ఊహించుట. 'Marriages are made in Heaven' అను సూక్తియందలి తాత్పర్యము ఇదియ కాఁబోలు. భవభూతియందు దాని నమ్మకము చూపట్టెడిని. మఱియు జ్యోతి యావిర్భవించిన బ్రాహ్మణులవాక్కు తప్పక నమ్మవలసినది. దానికి ఎట్లును తప్పుదల యుండదని మాటిమాటికి జ్ఞాపకము చేసినాఁడు. అదియు భవభూతి నమ్మకము కాకుండునా?

"ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి.—I. 3.
ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం
యే వ్యాహారా స్తేషు మా సంశయో భూత్

భద్రా హ్యేషాం వాచి లక్ష్మీ ర్నిషక్తా
నైతే వాచం విప్లుతాం వ్యాహరన్తి.—IV. ౧౮.

అట్లె మరల "భో భోః భగవాన్ భూతార్థవాదీ ప్రాచేతసః సస్థావరజఙ్గమం జగ దాజ్ఞాపయతి — య దిద మస్మాభి రార్షేణ చక్షుషా సముద్వీక్ష్య పావనం కరుణాద్భుత రసం కిఞ్చి దుపనిబద్ధమ్ తత్ర కార్యగౌరవాత్ అవధాతవ్య మితి."— ఏత దుక్తం భవతి—"సాక్షాత్కృతధర్మాణ ఋషయః. తేషా మమృతసారాణి పరోరజాంసి ప్రజ్ఞానాని, న క్వచి ద్వ్యాహన్యన్త ఇతి నాభిశఙ్కనీయాని." ఇతి.

వీనికి వక్తలు రాముఁడు అరుంధతి వాల్మీకి, ఇఁక నా మాటలకు ఎదు రుండునా? అందు ఆరామభక్తునికిని గాఢమగు నమ్మకము లేకుండునా? ఈ నాటకమున అన్నదమ్ములయు నాయనకొడుకులయు, ఒండొరుల నెఱుంగనివారి ప్రత్యభిజ్ఞాన నిర్మాణమంతయు ముఖ్యముగా ఈ పునాదిమీఁదనే కట్టఁబడినది. మాలతిలో మాధ వునికి మాలతియెడ చక్షుఃప్రీతి మనఃసంగాదులు కూడ ఈ పునాదిమీఁదనే లేపఁ బడినవి. మఱియు "ఉపశ్రుతి" యని ఒక ప్రమాణము గలదుగదా, 'తమ భాషణ మప్పుడు దబ్బాటునఁ గలిగెడి శుభాశుభసూచకమగు అన్యసంభాషణ శ్రవణము' అని నిర్వచింపఁబడినది, అందును కవికి గాఢవిశ్వాసము. ఏలన దానిని శ్రీరాముని యెడనే నిబంధించినాఁడు. చూ. I. ౩౯.

" రామః—కి మస్యా న ప్రేయో? యది పున రసహ్యస్తు విరహః.
ప్రతీహారీ—దేవ, ఉపస్థితః.
రామః—అయే! కః?
ప్రతీహారీ—ఆసన్నపరిచారకో దేవస్య దుర్ముఖః."

సీతా విరహము ఉపస్థితము (=వచ్చినది) అని రామునికి ఉపశ్రుతి. అది అట్లే అప్పుడే వచ్చినదిగదా.

అత్యుత్తమ ప్రకృతులయందు ఈ దైవప్రామాణ్యవిశ్వాసము మిక్కిలి కలదు. తనకును మానరానిదే యగుగాక. ఐనను పురుషకారమున ప్రత్యయము లేనివాఁడు గాఁడు. ఒకపాటి యంతస్తు జనులయందు లోకవ్యవహారమున ఆ నమ్మకమును కల దనుచు అందు జయసిద్ధికి తగిన నీతిని కామందకీయసారమున నిట్లు కూర్చినాఁడు.

బహిః సర్వాకార ప్రగుణ రమణీయం వ్యవహరన్
పరాభ్యూహస్థానా న్యపి తనుతరాణి స్థగయతి,

జనం విద్వానేకః సకల మతిసన్ధాయ కపటై

స్తటస్థః స్వానర్థా న్ఘటయతి చ మౌనం చ భజతి. మాలతి I-17.

పుట్టు వైదికుఁడు, మంచి ఆచారానుష్ఠాన సంపన్నుఁడు, గొప్ప పండితుఁడు, మహాప్రతిభగల కవి, తాను నాటక రచనకైన చాపలముం గని, ఆదని యీయాట యది యేల యని భరతులతో స్నేహముగా మెలఁగుచుండి, వారు కావించు నొద్దికలు సయితము చూచుచు సలహాలు చెప్పుచుండి దేవుని తిరునాళ్ళలో నాటకాలు ఆడించి, మెచ్చనివారిని 'పోండురా, మీ రే మెఱుఁగుదురు!' అనుచు, మెచ్చుకొనువారు ఉందురు అను విశ్వాసముతో మెలఁగుచు, దానిని ఒక మానరాని వినోదముగా ఉంచుకొని యుండెను.

ఆ కాలమున భవభూతి తన నాటకములను తాటియాకులలోనే వ్రాసియుంచి యుండునా? కాదు. అప్పటికి "మసిభాజనము పత్రము" వాడుకలో నుండును. వానిని అడఁగోరిన భరతులకు తన ప్రతినే యిచ్చి, ఎవరిపాఠ్యమును వారు వ్రాసికొని వల్లెవేయు నట్లుచేసియుండును. ముద్రణయంత్రము సులభమగు నీకాలమునంగూడ కొందఱు కవుల నాటకములు అముద్రితదశలో అట్లు వినియోగింపఁబడుచుండును ఇఁక భవభూతి కాలపుమాట చెప్పవలయునా? "యే నామకేచిది"త్యాదింబట్టి భవభూతికి శత్రువులును అసూయువులును మెండుగా నుందురు. వారు తద్రచనలను అపహరింపనుం బూనుకొనుచుందురేమో, భవభూతి మహావీరచరితమును అతనిచేతనున్నదానిని అతని ప్రయాణముల నెపుడో ఎవరో ఒడిచి పెఱుకుకొని రనియు, వారితో జగడమాడి పెనఁగులాడి మరల దానిని ఒడిచికొనవలసివచ్చె ననియు, ఆసందర్భమున ఆ కడపటిభాగము ధ్వంసితమై నష్టమాయె ననియు, అది మఱల నేకారణముననో పూరణము పొందలేదనియు నొకయైతిహ్యము కలదని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు చెప్పియుండిరి. అందుల యాకరమును నిజమును ఎట్టిదో. ఆ కాలమున తన రచనలకు అట్టి భయమును ప్రమాదమును ఉండెననుట — వాల్మీకి రసవత్తర ప్రయోగార్థ సందర్భముం గూర్చిన (చూ. IV - పు-57-8.)

"నాయం కథాప్రవిభా గోఽస్మాభి రన్యేన వా శ్రుతపూర్వః. కిం న ప్రణీతః కవినా? ప్రణీతో, న ప్రకాశితః. తస్యైవ కోఽప్యేకదేశః సన్దర్భాన్తరేణ రసవా నభినేయార్థః కృతః. తఞ్చ స్వహస్తలిఖితం ముని ర్భగవాన్ వ్యసృజ ద్భరతస్య మునే స్తౌర్యత్రిక సూత్రధారస్య. కి మర్థమ్? భగవాం స్తమప్సరోభిః ప్రయోజయిష్యతీతి. మహతీ పున రస్మిన్ భగవతో వాల్మీకేరాస్థా. కేషాఞ్చి దన్తేవాసినాం హస్తేన తత్పుస్త

కం భరతాశ్రమమ్ ప్రేషితమ్. తేషాం అనుయాత్రిక శ్చాపపాణిః ప్రమాదాపనోదార్థ మస్మద్భాత్రా ఆర్యః కుశోనామ ప్రేషితః - (శిష్యులచేత నిచ్చి ఆ పుస్తకమును భరతాశ్రమమునకుం బంపినాఁడో, వారికి తోడుగా ప్రమాదోచ్ఛేదనమునకై ధనుష్పాణిని నాభ్రాతను ఆర్యుని కుశుని పంపినాఁడు."—అను ప్రమాదోచ్ఛేదన ప్రస్తావమున పరామర్శింపఁబడుచున్నది యని కొంద అందురు.

## ౨౨ - భవభూతింగూర్చి క్షేమేంద్రుఁడు

భవభూతి గ్రంథములనుండి సాహిత్య మీమాంసకులు అలంకార శాస్త్రాచార్యులు మిక్కిలిగా ఉదాహరణములం గైకొనియున్నారు. ఆ యన్నింటిని ఇటఁ గూర్చుట, ఉత్తరరామ చరితలోని వానిని మాత్రమైనను ఉదాహరించుట, గ్రంథాతి విస్తారక మగును. ఈ క్షేమేంద్రుని యౌచిత్య విచారచర్చలో ఉత్తరరామ చరిత నుండి కైకొని విమర్శకు విషయీకరింపఁబడిన వీనిని మాత్రము కానే మొదలగు టీకల కర్తలు అందఱు ఉదాహరించిన వానిని ఇందు నేనును ఉదాహరింతును.

1. ప్రబంధౌచిత్యము క్రింద—యథా వా భవభూతేః.

(నేపథ్యే) యో యం మశ్వః పతాకేయ మథ వా వీరఘోషణా
సప్తలోకైక వీరస్య దశకణ్ఠ కులద్విషః.

లవః—(సగర్వ మివ) అహో సన్తాపనా న్యక్షరాణి! భో భోః కి మక్షత్రియా పృథివీ య దేవ ముద్ఘుష్యతే? (విహస్య) ఆః కిం నామ స్ఫురన్తి శస్త్రాణి! (ధను రారోపయన్.)

జ్యాజిహ్వయా వలయితోత్కటకోటి దంష్ట్ర
ముద్గారి ఘోర ఘన ఘర్ఘర ఘోష మేతత్
గ్రాస ప్రసక్త హసద న్తకవక్త్ర యన్త్ర
జృమ్భావిడమ్బి వికటోదర మస్తు చాపమ్."

అత్రార్థే రామాయణ కథాతిక్రమేణ నూత నోత్ప్రేక్షిత రామతనయస్య సహజ విక్ర మానుసారిణీ శౌర్యోత్కర్షభూమిః పరప్రతాప స్పర్శాసహిష్ణుతా ప్రబన్ధస్య రస బన్ధురా మౌచిత్యచ్ఛాయాం ప్రయచ్ఛతి.

2. వీరరసౌచిత్యము క్రింద-"న తు యథా భవభూతేః.

వృద్ధా స్తే, న విచారణీయచరితా, స్తిష్ఠన్తు, హుం వర్తతాం!
సున్దస్త్రీ దమనేఽ, ప్యఖణ్డయశసో లోకే మహాన్తో హి తే!

యాని త్రీణ్యకుతోభయా న్యపి పదా న్యాసన్ ఖరాయోధనే!
యద్వా కౌశల మిన్ద్రసూనుదమనే తత్రా ప్యభిజ్ఞో జనః!

అత్ర అప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపోత్కర్షాసహిష్ణో ర్వీరరసోద్దీపనాయ సకల ప్రబన్ధ జీవిత సర్వస్వ భూతస్య ప్రధాననాయకగతస్య వీర రసస్య తాటకాదమన-ఖరరణాపసరణ-అన్యరణ సంసక్త వాలివ్యాపాద నాది జనవిహితాపవాద ప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశః కృత ఇ త్యనుచిత మేతత్.

3. దేశౌచిత్యము క్రింద — యథా భట్టభవభూతేః —

పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం
విపర్యాసం యాతో ఘనవిరళ భావః క్షితిరుహామ్
బహో ర్దృష్టం కాలా దపర మివ మన్యే వన మిదం
నివేశః శైలానాం త దిద మితి బుద్ధిం ద్రఢయతి.

అత్ర బహుభి ర్వర్షసహస్రై రతిక్రాన్తైః శమ్బూకవధ ప్రసఙ్గేన దణ్డకారణ్యం రామః పూర్వపరిచితం పునః ప్రవిష్టః సమన్తా దవలో కైవ్యవం బ్రూతే— పురా యత్ర నదీనాం ప్రవాహః. తత్రేదానీం తటమ్. వృక్షాణాం ఘనవిరళత్వే విపర్యయ, శ్చిరాద్దృష్టం వనమిద మపూర్వ మివ మన్యే, పర్వతసన్నివేశ స్తు తదే వైత దితి బుద్ధిం స్థిరీకరోతి, ఇత్యుక్తే చిరకాల విపర్యయ పరివృత్త సంస్థాన కానన వర్ణనయా హృదయ సంవాది దేశస్వభావః పరమ మౌచిత్య ముద్ద్యోతయతి.”

అయినను ఇట “బహుభి ర్వర్ష సహస్రై రతిక్రాన్తైః” అన్నాఁడు క్షేమేంద్రుఁడు. దానిచే తాను రామాయణోత్తరకాండ కథలో అపపాఠమగు నవి కొందఱు గ్రహించినదానిని. లంకనుండి మరలిన తరువాత పెక్కువేల యేండ్లకు సీతకు గర్భమును వివాసమును అను ఇత్యాదిని మనసున ఉంచుకొని ఈ వ్రాఁత వ్రాసెనని తోఁచును. మఱి భవభూతి రచించిన కథలో పట్టాభిషేకానంతరము అవ్యవహితముగానే సీతకు గర్భము వివాసము మొదలగునవి చెప్పఁబడినవి. అంతకు మునుపు ఒక సంవత్సరములోపలి కాలముననే రాముఁడు పంచవటిని వదలి సీతను వెదకుచు ఋశ్యమూకమునకును కిష్కింధకును ప్రస్రవణమునకును వచ్చుట. కావున ఇపుడు రాముఁడు మరల దండకను చూచుట పదుమూఁడేండ్లకంటెను వ్యవహిత మగు కాలమున గాదు. కావుననే గున్నయేనుఁగు కిఖి కదంబము — ఇపుడు ఇంతటి వాయెనని సీతారాములు అనుకొనుట. ఈ “పురాయత్రస్రోతః” ఇత్యాదిచేతను భవభూతి అప్పటి దండకను, పదుమూఁడేండ్ల మార్పులుగలదానిని చెప్పుటయే. మఱి క్షేమేంద్రుఁడు

తాను పేరుగన్న కవి, పండితుఁడు ఇట్లు ఔచిత్యానౌచిత్యములు విచారించు నాచార్యుఁడు ఉత్తర చరిత కథాగ్రహణమున ఇట్లు ఇంత పొరపడినాఁడే! ఐనను ఆ పదుమూఁడేండ్లకు సయితము తాను ఇటఁ జెప్పిన దేశౌచిత్యము కొంత పొసఁగక పోదు.

## ౨౩ - ఉత్తరచరితమున అంగిరస మేమి?

ఏ ప్రబంధమునను నానారసములు విబంధింపఁ దగినను, దేనినేని ఒక్కదానిని అంగిచేసి తక్కినవానిని అంగములుచేయుట ఆప్రబంధమునకు ఉత్కర్షాధాయక మని ధ్వనికారుఁడు తెలియఁజెప్పినాఁడు. "ప్రసిద్ధేఽపి ప్రబన్ధానాం నానారసనిబన్ధనే ఏకో రసోఽఙ్గీ కర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా." అని. ఇఁకను నాటకమున అంగిగా ఉండఁదగిన రసముంగూర్చి ఆచార్యులెల్లరు ధనిక ధనంజయ విద్యానాథ విశ్వనాథులు దశరూపక తట్టీకా ప్రతాపరుద్రీయ సాహిత్యదర్పణములందు అనుశాసించినారు.

> 'ఏకో రసోఽఙ్గీ కర్తవ్యో వీరః శృఙ్గార ఏవ వా
> అఙ్గమన్యే రసాః సర్వే కుర్యా న్నిర్వహణే ద్భుతమ్.'—దశ రూ.
> శృఙ్గారవీరయో రన్యతరస్య ప్రాధాన్యమ్
> అన్యేషాం రసానా మఙ్గత్వే నానుప్రవేశః.'—ప్రతాపరుద్రీయమ్.
> ఏక ఏవ భవే దఙ్గీ శృఙ్గారో వీర ఏవ వా
> అఙ్గమన్యే రసాః సర్వే కార్యో నిర్వహణే ద్భుతః.—సా. ద.

ఇందు ఐకకంఠ్యము స్పష్టముగా దీపించుచున్నది. కావున ఆ యొక్క రసము అంగి ఉత్తరచరితమున ఒక మతమున ధర్మవీరము అనియు; మఱియొక మతమున కరుణ విప్రలంభము, అనఁగా ఒక శృంగారభేదము అనియు తలంపఁబడుచున్నది.

ఐనను పైపైమాటలకు బేలుపోవువారు ఇందు 'రామస్య కరుణో రసః' 'రామస్య కరుణోర్మయః' కరుణస్యమూర్తిః' 'ఏకో రసః కరుణ ఏవ' అని సీతారాములంగూర్చి భవభూతిచే ప్రయుక్తమైయున్నందునను, శోకస్థాయికము కరుణ మనియొక రసము ఉన్నందునను. ఇందు అంగిరసము కరుణ మని భ్రమించినారు. అది కేవలము భ్రమయు ఇంచుకయు ఎఱుకచాలమియు అగును. సీతారామ పునఃసంయోగ శుభాంతమగు ఈ నాటకమున కరుణ మగునా అంగిరసము? రసము ఆనందరూప మగునది నాయకునియందుఁ గాని నటునియందుఁ గాని యుండదు. మఱి యది సామాజికునందును సహృదయునియందును పుట్టును అని యాచార్యుల సిద్ధాంతము. కావున ఇక్కడ కరుణరస మన్నయెడల నంతయు విరహాశ్రు తోత్కటవైక్లబ్యమే యర్థము,

> రసభావా తదాభాసా భావస్య ప్రశమోదయౌ
> సన్ధిః శబలతా చేతి సర్వేఽపి రసనా ద్రసాః.

అని యీ యన్నింటికిని ఉపచారముచే సామాన్యముగా రస మన్న పేరు గలదు. రసము ఇదియే గాని అదియే గాని అని 'ఏవ' 'ఏవ' యని రెండు ఏవకారములతో నియమము విబద్ధమైయున్నది. ఇఁక నిందు భ్రాంతి గాని 'కరుణము' రసము అనుట వట్టి ప్రల్లదము.

"శాకుంతల వైఖానస శ్రీనివాసాచార్య టీకలో - అత్రసమయాన్తరేషు నత్సు గ్రీష్మర్తూపాదానం ప్రకృత - నాటకస్య శృఙ్గారాఙ్గికత్వాత్ ........ బీభత్సభయానకయోః ప్రతినాయకాశ్రితత్వేన వర్ణనీయత్వాత్. హాస్యరౌద్రకరుణాద్భుతానాం మహాప్రబన్ధరసత్వే చమత్కారాభావాత్.'—కరుణము అంగిగా నాటకమునకు పనికిరాదన్న మాట." - శ్రీ వే. వేఁ. శాస్త్రుల యుపోద్ఘాతము.

## ౨౪ - ధర్మవీరము

ప్రజానురంజనధర్మముం బ్రతిష్ఠింప ఉత్సాహము గాని రాముఁడు ప్రజాపవాదమునకు ఖిన్నుఁడై సీతను త్యజించి పునఃశుద్ధి నిర్ణయము కాఁగా అపవాదము ప్రమృష్టము కాఁగా, ఆరంజనమును నెఱవేర్చుట. ఆసీతాత్యాగమునకు తాను ఏడువఁడు గదా చిత్తాననే కుములును గాని నాటకము నెల్ల ఏతదనుగుణముగా సమన్వయము చేయ వచ్చును.

> "స్నేహం దయాం తథా సౌఖ్యం యదివా జానకీ మపి
> ఆరాధనాయ లోకస్య ముఞ్చతో నాస్తి మే వ్యథా."

అనుటయు,

> 'కష్టం! జనః కులధనై రనురఞ్జనీయః'

అనుటయు మొదలుకొని

> 'ఇక్ష్వాకువంశోఽభిమతః ప్రజానాం
> జాతం చ దైవా ద్వచనీయబీజమ్'

అని సీతను అడవికి తఱిమి,

> 'అనిర్భిన్నో గభీరత్వాత్ ......రామస్య కరుణో రసః'

అని తాను ఏడ్పును గాంభీర్యమున గ్రుంగి,

'అయి కఠోర యశః కిల తే ప్రియం!
కి మయశో నను ఘోర మతః పరం?'

అని మిథ్యాయశమునకు ప్రియపడినాఁ డని సీతచెలిచే తిట్టునుం బడి

'ఇదం విశ్వం పాల్యం విధివ దభియుక్తేన మనసా' అని తన విధ్యనుష్ఠానమునకు మెచ్చుకోలు గని.

'న కిల భవతాం స్థానం దేవ్యా గృహేఽభి మతమ్
తృణ మివ వనే శూన్యే త్యక్తా న చా ప్యనుశోచితా.'

అని లోకులకు చెప్పుకొని, తాను ఇపుడు పట్టలేక రవంత యేడ్చినందులకు వారి మన్నింపు వేడి, కడపటికి ఋషులు దేవతలు గూడి సీతశుద్ధిని ప్రత్యక్షముగా చెప్పి నిర్ణయింపఁగా—

అరుంధతి—"భోభోః పౌరజానపదాః. ఇయ మధునా భగవతీభ్యాం వసున్ధరా జాహ్నవీభ్యాం ఏవం ప్రశస్యమానా మమ అరున్ధత్యాః సమర్పితా. సీతాదేవీ పరిగృహ్యతా మితి. కథ మివ భవన్తో మన్యన్తే?" అని అందఱిని అదల్చి ఎచ్చరింపఁగా అందఱును సీతకు రాణికి నమస్కరింపఁగా తాను యజ్ఞపత్నిగా అంగీకరించినాఁడు రాముఁడు. ఇట్లు ఆ ధర్మసిద్ధి, రాముని యా ధర్మ వీరత్వము. ఈ వీరమునకు కరుణవిప్రలంభము అంగము. ఆ ప్రేమభరమువలనియు నిజ సీతానిర్దోషజ్ఞానము వలనియు దుర్భరదుఃఖము మనసుననే కుమిలి ఉడికించుచుండును.

ఇట్లు ఏడ్పును లోన ఇముడ్చుకొన్నను. తదతిశయముచే ధర్మవీరము అంతర్హితమై పోయినది అని ఎవరేని ఆంధ్రధ్వనికారాదులవంటివారు విరసులు అనుట అదెట్టిది! రాముఁడు మానవరాముఁడా అయసరాముఁడా?

## ౨౫ - కరుణ విప్రలంభము

ఐనను అట్లు ధర్మవీర మనుటకన్నను ఈ నాటకమున రసము కరుణవిప్రలంభ మనుట మిక్కిలియు సహృదయ హృదయసంవాది.

ఆలంకారి కాచార్యులందఱును విప్రలంభము అయోగ మాన ప్రవాస కరుణ భేదములచే నాలుగు తెఱంగు లగును అనుచు అందు కరుణము అనఁగా కరుణ విప్రలంభము ఆ నాల్గవ తెఱంగుది యని ఏకకంఠముగాఁ బలికినారు. కొందఱు కరుణ విప్రలంభమును రతియు వైక్లబ్యమును అని సమకోటికమగు రెండు స్థాయులు

గల ఒక రసాంతరముగనే, వ్యాఖ్యానించినారు, హృదయము భావముల కూడలి గదా. అట్టిదియు ఏల యుండరాదు. తగిన సంవిధానమున అవి. ధ్వనిలోచన కారులు ఆ భేదమును గ్రహింపక ప్రవాస విప్రలంభమను మూఁడవదే చాలును అను కొన్నారు. రసగంగాధరకారుఁడును ఆ యభిప్రాయమునే కొనుచును, "అత్ర కేచిత్తు రసాన్తర మేవ కరుణవిప్రలంభాఖ్య మిచ్ఛన్తి." అని పాక్షికముగా కరుణవిప్ర లంభమును గ్రహించినాఁడు. ఐనను అతిసంఖ్యాకులు దానివి విప్రలంభ భేదము లలో నాల్గవది గానే గ్రహించినారు. వీరిలో సాహిత్య దర్పణకారుఁడు మొన గాఁడుగాఁ జూపట్టుచున్నందున అతని యుపపాదనమును ఇందు పొందుపఱిచెదను.

"......................"

ఉత్తమ ప్రకృతిప్రాయో రసః శృఙ్గార ఇష్యతే

......................

స్థాయీ భావో రతిః............

విప్రల మ్భోఽథ సమ్భోగ ఇ త్యేష ద్వివిధో మతః,

సచ పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మక శ్చతుర్ధా స్యాత్

..............................

అథ కరుణ (విప్రలంభః)—

యూనో రేకతరస్మిన్ గతవతి లోకా న్తరం, పునర్లభ్యే

విమనాయతే య దైక స్తదా భ వేత్ కరుణ విప్రలమ్భాఖ్యః.

యథా-కాదమ్బర్యాం పుణ్డరీక మహాశ్వేతావృత్తా న్తే, పున రలభ్యే, శరీరా న్తరేణ వా లభ్యే తు కరుణాఖ్య ఏవ రసః, కి ఞ్చాత్ర ఆకాశ సరస్వతీభాష ణాన న్తర మేవ శృఙ్గారః. సఙ్గమ ప్రత్యాశయా రతే రుద్భవాత్. ప్రథమం తు "కరుణ ఏవ" ఇత్యభి యు క్తా మన్య న్తే. "య చ్చాత్ర సఙ్గమ ప్రత్యాశాన న్తర మపి భవతో విప్రలమ్భ శృఙ్గా రస్య ప్రవాసాఖ్యో భేద ఏవ" ఇతి కేచి దాహుః, త దన్యే 'మరణరూప విశేష సమ్భ వాత్ తత్ భిన్న మేవ ఇతి మన్య న్తే.

....................

ఇష్టనాశా దనిష్టా ప్తేః కరుణాఖ్యో రసో భ వేత్

....................

శోకస్థాయితయా భిన్నో విప్రలమ్భా దయం రసః

విప్రల మ్భే రతిః స్థాయీ పునఃసమ్భోగ హేతుకః."

"విప్రలంభము సంభోగము అని శృంగారము ఇరు దెఱంగులగును. ఎందు రతి ప్రకృష్టమై అభీష్టమును బొందక యున్నదో అది విప్రలంభము. అభీష్టమును అనఁగా నాయకునిఁ గాని నాయికనుఁ గాని. ఇది పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మకమై నలువగ లగును............ఇఁక కరుణ విప్రలంభము. యౌవనవంతు లగు నిరువురు స్త్రీ పురుషులయందు ఒకరు లోకాంతరమునకుం బోయి వెండియు దొరకువారై యుండ రెండవవారు దుఃఖపడుట కరుణ విప్రలంభ మగును. ఉదా—కాదంబరియందు పుండరీక మహాశ్వేతా వృత్తాంతమున. మరల దొరకని పక్షమునఁ గాని శరీరాంతరముచేత దొరకెడు పక్షమునఁ గాని కరుణమను పేరి రసమే అగును. మఱియు 'ఇట ఆకాశవాణి పలికిన యనంతరమే శృంగారము: ఏలన సంగమ ప్రత్యాశచే రతి జనించుటవలన, ప్రథమమందో కరుణమే' అని పెద్దలు తలంతురు. మఱి 'సంగమ ప్రత్యాశానంతరము సయితము కలిగెడు విప్రలంభము శృంగారముయొక్క ప్రవాసాఖ్యభేద మిది' యని కొందఱు చెప్పుట ఏది కలదో దానిని ఇతరులు మరణ మనెడి విశేష మొకటి సంభవించుటంబట్టి దానికన్న (ప్రవాసమునకన్న) వేఱే అని తలంతురు..................ఇష్ట నాశము వలనను అనిష్టాప్తి వలనను కరుణ మనెడు రసము కలుగును.................................దీనికి (కరుణమునకు) కరుణ విప్రలంభమునుండి భేదమును చెప్పుచున్నాఁడు. శోకస్థాయిక మగుటవలన ఈ రసము (కరుణ) విప్రలంభమున కన్న భిన్నము. విప్రలంభమందు పునఃసంభోగ హేతుకము రతి స్థాయి." [ఆంధ్రసాహిత్యదర్పణము.]

వట్టి ప్రవాస విప్రలంభమున మరల ఎప్పుడు కలసికొందుమో అను పునఃసంభోగసమీహచే ఏడ్పు విడువక యుండును. మరణముయొక్కయు లోకాంతరముయొక్కయు ప్రస్తావముగల కరుణవిప్రలంభమున తదతిశయము కలిగియుండును. ఈ యుత్తరచరితమున సీతకు వివాసము విధింపఁబడినది కదా. ఆ వియోగమున రాముని చిత్తమున దుఃఖము పొరలినది. అది పంద్రెండేండ్లును చిత్తాన కుములుచునేయున్నది. మఱి సీతమరణము ఇందు నిశ్చితము గాదు. 'క్రవ్యాద్భి రఙ్గలతికా నియతం విలుప్తా" అను మొదలగున దెల్ల రాముని యుత్కటమగు నేడ్పుతెఱంగే గాని ఎఱుకతెఱంగు గాదు. అంతర్నాటికలో ప్రకాశమైనట్లు సీత పాతాళమున, అనఁగా లోకాంతరమున. భాగీరథియింట పృథివి యమ్మచేతను అవేక్షిత యగుచు ఉండినది. రాముఁడు రాజధర్మానుష్ఠానముగా యజ్ఞము తొడంగి అందు సహధర్మచారిణిగా సీతప్రతికృతినే బంగారమున చేయించి యుంచుకొన్నాఁడు. తద్రాజధర్మవశముననే శంబూకుని చంప

వచ్చి పంచవటిలో అడుగుపెట్టినాఁడు. అది సీతాపూర్వసహవాససాక్షి. దాని దర్శనమున దుఃఖము క్రొత్తవడినట్లు మూర్ఛలపాలుచేసినది. అందు సీత స్పర్శలవలననే. ఎక్కడివో ఇవి యని యెఱుంగలేకున్నను భావించుకొని, యుల్లాసము పొంది, అంత కుశలవులం గలసికొని వారియందు సీతపోలికలు గని మనసున ఆకస్మికనిర్వృతి చెంది అంతలో రామాయణ బాలాయోధ్యాకాండలయందలి సీతారామప్రణయప్రస్తావము విని యేడ్చుచుండి, అంతర్నాటిక చూచి దాని యనంతరము కుశలవులతోడి సీతను విరహవాదకుద్దను మెఱుఁగుపెట్టినట్లయిన యామెను మరల కలసికొన్నాఁడు. ఈ యల్లికలో రామునికి, ఋషులవాక్కులందు మిక్కిలియు నమ్మకముగల చిత్తసంస్కారముగల వానికి, సీతాత్యంతికనాశభావమునకు అవకాశము లేదు. పునఃసంగసమీహ కలిగియే యుండును. అట్టి యనురాగాలంబనమందు, ఎవరు ఎన్ని చెప్పినను తనకును ఏమేమి కీడు తోఁచినను, తాను సొంతముగా ఆపీనుఁగు కాలుటనో పూడుటనో కంటితో చూడనంతవఱకు బ్రదికియుండకుండునా, దొరకకయే పోవునా యన్న ప్రత్యాశ కలిగియే యుండును. దింపుడు కళ్ళములను పీనుఁగులను ప్రాణము గన్న కథలు వినఁబడవా? మహాశ్వేత పుండరీకుని పీనుఁగును చూచి శాఁకి పైబడి యేడ్చినది; ఆమెకు ప్రత్యాశ లేదు. ఆ యేడ్పు కరుణము. ఇక్కడ రాముని యేడుపో కరుణవిప్రలంభము. ఆ కరుణానంతరము ఈ సంభోగము ఆనందసముద్రము. సీతయును 'తటస్థం నైరాశ్యాత్' మొదలుకొని ఆ ప్రవాసవిప్రలంభమున రామునికైన రతి యేయేతెఱఁగుల నుండినదియు తలపోసికొని, తనకు పరిత్యాగశల్యమును సర్వథా రాముఁడు ఊడఁదీసినాఁ డనుచు పునఃసంయోగము ఎప్పుడగునా ఎట్లగునా అని యువ్విళులూరుచుండి ఇపుడు కలుగఁగా ఆనందమున మునిఁగినది. ఇట్లు సాహిత్యదర్పణమున చెప్పిన కరుణవిప్రలంభలక్షణము ఇందు సరిపడియున్నది.

"ఉత్తరచరితమున కరుణ విప్రలంభమ యని భోజదేవుఁడు సరస్వతీకంఠాభరణముననే కాక శృంగార ప్రకాశికలో కరుణ విప్రలంభ ప్రస్తావములలో దానినుండి పెక్కు ఉదాహరణములు గ్రహించినాఁడు. ఇవిగో ఇప్పటికి ప్రకటితములైన మూఁడు ప్రకాశములలో దొరకినవి—శృంగారప్రకాశిక సర్వము బ్రకాశితమగునేని ఇంకను ఎన్ని దొరకునో.

1. ప్రవాసానన్తరాత్ కరుణానన్తరో రాగవర్ధనః.—స యథా.—'ఆలిమ్పన్నమృతమయై రివ......

2. కరుణే [విప్రలంభే] విసంవాదనం విరుద్ధం యథా,—'దళతి హృదయం గాఢోద్వేగాత్.'

3. తత్రైవ [కరుణవిప్రలంభే] కాలయాపనం వ్యావిద్ధం యథా.—'దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః.

4. తత్రైవ [కరుణ విప్రలంభే]ప్రత్యాదానం ప్రతిబద్ధం యథా.—'అ భేదం రక్షోభిః కనక.........'

5. యదా తు కరోతే రభూతప్రాదుర్భావనాద్యర్థవాచినః కరుణ ఇతి రూపం తదా స్త్రీపుంసవిషయ అయోజితకామసూత్రః పునఃసమాగమఫలోఽనురాగ ఏవ కరుణ శబ్దేన ఉచ్యతే. తద్యథా.—దుఃఖాతిరేకా దభూతా న్కరోతి ప్రాదుర్భావయతీతి కరుణః —యథా—

'మాత ర్మాత ర్దశతి హృదయం...... '

6. కరో త్యభ్యఞ్జయతి బహిర న్తశ్చవ్యాప్నోతి విస్రంభోత్పత్త్యా స్త్రీ పుంసయో రన్యతర స్యాయం హృదయ మితి కరుణః. యథా 'విలులిత మతిపూరై ర్బాష్ప మానన్దశోక....'

7. సోఽయం [కరుణః] విప్రలమ్భాదిషు ఉపసర్జనీకృత ప్రత్యయార్థః ప్రకృ త్యర్థోపవర్ణితః. అథోపసర్జనీకృతప్రకృత్యర్థః ప్రత్యయార్థో వర్ణ్యతే. తత్ర భావః కర్మ.........హేతుకర్తా......హేతుకర్తా యథా.—

"చిరా ద్వేగారమ్భీ విసృత ఇవ తీవ్రో విషరసః........"

8. అధికరణం యథా,—"యస్యాం తే దివసా స్త్వయానహ తథా సీతాః పునః స్వే గృహే."

9. అథప్రత్యయోత్ప త్తి కాలాః. కే పున స్తే? భూతో భవిష్యద్ వ ర్తమానోఽ వ్య క్త ఇతి........తేషు లిడాదివాచ్యో భూతో యథా.—

'ఏత త్పున ర్వన మహో కథ మద్య దృష్టం........'

10. భూతానద్యతనో యథా...'కరకమల వితీర్ణైరమ్బునీవారశష్పైః......'

11. లడాదివాచ్యో భూతాసన్నో భూతసామీప్యో యథా.—'వినా సీతాదేవ్యా కిమివ హి న దుఃఖం రఘుపతేః...'

భవభూతి భాసుని స్వప్నవాసవద త్తచేతను కాళిదాసుని యు త్తర శాకుంతలము చేతను ప్రతిబుద్ధుఁడై, కరుణవిప్రలంభమునకై ఉవ్విళులూరి, వారిని మించఁగోరి,

యౌగంధరాయణాది కల్పిత దాహప్రవాదప్రభవమగు నాయుదయనుని కరుణకథ కన్నను దుర్వాసః శాపప్రభవమగు నా దుష్యంతుని కథకన్నను ధర్మమునకు కట్టువడి, ప్రజానురంజనకై సీతను కఠోరగర్భను, నమ్మకమున తనయురమునందే నిదురగూరి యున్న ప్రేయసిని, నిప్పునకు నిప్పు, తీర్థమునకు తీర్థము అయిన తననమ్మిన పవిత్ర చారిత్రను, అడవులకు తఱిమి, ఏడువనేని మొగములేని యాకపుటంపు దుఃఖ పుటమునం గుమిలిన రామునికథను, కుందమాలయం దట్లట్లు ఉన్నదానిని అందుకొని ఇట్లు సవరించి "అహో సంవిధానకము" అని తానే ఆత్మలో అలరినాఁడు.

రసములలో అధరోత్తరములు కలవు. అందు శృంగారము సుకుమారతమము; కమనీయతం బట్టి ప్రధానభూతము, సకలజనమనోభిరామమును. అట్లే ఈ యాలోకలోచనోద్ధారములం గనుఁడు.—

"విశేషతస్తు శృఙ్గారే, సుకుమారతరో హ్యసౌ." ఆలోక

'సర్వేభ్యోఽపి రసేభ్యః సౌకుమార్యాతిశయయోగిని కవి రవధానవాన్ ప్రయత్నవాన్ భవేత్. తత్రహి ప్రమాద్యత స్తస్య సహృదయమధ్యే క్షిప్రమేవ అవజ్ఞానవిషయతా భవతి. శృఙ్గారరసో హి సంసారిణాం నియమేన అనుభవవిషయత్వాత్ సర్వరసేభ్యః కమనీయతయా ప్రధానభూతః'... —ఆలోక...కించ. శృఙ్గారస్య సకలజన మనోభిరామత్వాత్ —...ఆలోక.

రసములలో శృంగారమును; శృంగారమున విప్రలంభమును, విప్రలంభమున ఆ కరుణాత్మకమును— అని యుత్తరోత్తర ప్రకర్ష సంప్రదాయమువలననే కాక కవి సహృదయాభ్యుపగతి చేతను సిద్ధము. అట్లే స్వప్నవాసవదత్తమున చిరమైనను కాముఁడు ప్రసుప్తుఁడ కాని మృతుఁడు గాఁడు.—

"చిరప్రసుప్తః కామో మే వీణయా ప్రతిబోధితః." కుందమాలలో కుందమాలయే ప్రత్యాశకును పునః సమాగమమునకును ప్రథమ సంపాదక సామగ్రి. ఇట్టి దెల్ల ఉత్తర చరితమున మూర్ఛిత రామ ప్రత్యుజ్జీవన సీతా కరస్పర్శ ప్రభృతికి దిక్ప్రదర్శకము.

మఱియు వినాశ మరణముల వలని నిరవధి నైరాశ్య ప్రభవ ముక్తకంఠ దుఃఖమున కన్నను ప్రత్యాశ దాగుడుమూఁతలాడు నీ సావధి గ్రస్త ముక్తకంఠ దుఃఖము సుభగసుకుమారతరము. ఆంగ్ల విమర్శక రసికుఁడగు హడ్సను భట్టుని యీ సూక్తులను ఆరయఁదగును.

Pathos in the truest sense is very much more often felt than adequately expressed. The attempt to express it too often defeats itself..............The death of little Nell, and of Paul Dombey, favourites as they are with the world at large, have in them just the air of vigilant scrutiny of the associations which rend the heart most, that, to my mind at least, robs them of what I mean by pathos in its truest sense,—that artless cry of the dumb yet not despairiug heart which words so seldom render articulate and so often utterly disguise..........................................................................
I do not mean, of course, that the cry of a dumb heart which is absolutely despairing can never be adequately given without something to attenuate the misery of the cry, but only that when the passion is not thus attenuated it rises above the level of what we call 'pathos', and reaches that of tragedy. In all cases of true pathos' though trouble pervades the scene, it does not overwhelm; it is held in check by subduing feelings of a more grateful and hopeful description, which soften the pain and make the heart tremble with some undertone of unexpected sweetness, even in the very keenest vibration of its grief. Indeed so true is this, that I believe some of the most pathetic passages in our literature are those in which the subdued thankfulness or hope predominates over the pain instead of the pain over the hope........................

..........................................................................................

In all cases of the higher pathos there must be something that battles against the pain, as well as some higher cry of the pain in the heart. Without the former, the latter would be a situation, not of pathos, but of despair. Wherever there is true pathos there is the surging of a buoyant wave in the heart breaking the force of the wave which overwhelms it with dejection and not unfrequently even prevailing over it..........................................................

..........................................................................................

ఉత్తర చరితమున కరుణాంగితకైన యీ పెనఁగులాట హూణ సంసర్గము వలన అలవడిన ట్రాజెడీ పక్షపాతమువలనం గాఁబోలు। లక్ష్యకారులలో సాఫొక్లీసు ప్రభృతులం దొడంగియు లక్షణకారులలో అరిస్టాటిలు ప్రభృతులం దొడంగియు, షేక్స్పియరను పెదబత్తుఁడుం, బనివడ, నేఁటివఱకుం గల కవి

సహృదయ సువర్ణకారులు కూర్చిన ట్రాజెడిమాలకు హౌణ సరస్వతి మెడలో రాజిల్లు దానికి బ్రాడ్లి ప్రభృతి నేఁటి లాక్షణికులు తుడిచి తుడిచి సానతీర్చి తీర్చి మెఱుఁగు ఎక్కించి ఆధునికులను ప్రలోభింతురేని వీరును క్రొత్తగా ట్రాజెడీలను అట్లట్లు రచింతురు గాక. వేఱు సంప్రదాయమునకుం జెందినవైన యా ప్రాచీనోత్తర చరితాదులయందు హిందూ చిత్త సంస్కారమునకు దూరమైన ట్రాజెడీభావమును వెదకుట సమంజసము గాదు. మఱియు ఒథెల్లో హామ్లెటు మాక్బెతు సీజరు మొదలగు వాని యందు, ట్రాజెడీలయందే వీరరసముగాక కరుణరసము అంగియని నిశ్చయింపను రాదు. మాలతీ శాకుంతల నాగానంద మృచ్ఛకట్యాదులయందు కట్టకడపట మాత్రమే అటు మంగళము వంకకుం బొరలిన కథను ఇటు అమంగళము వంకకుం బొరలించి యున్న అవి మంచి ట్రాజెడిలే అయ్యెడిని. మఱి పొరలింపమికి కారణము ఏతద్రస వత్తాతిశయమందలి సంప్రదాయాగతాభినివేశమే కాక, హిందువుల యాస్తికత తెలుంగు, చిత్తవృత్తి తీఱు, నమ్మకముల విధము, ఆచారముల భంగి ఇట్టివెల్ల కారణము. ధర్మమునకు జయము, సుఖమయపరిణతి, అభ్యుదయము చెప్పవలయు ననియు, అధర్మమునకు అపజయము దుఃఖమయపరిణతి, పతనము, భంగపాటును కూర్పవలయుననియు, ధర్మానుష్ఠానమున జయప్రత్యాశ ఎన్నఁటికిని అడంపఁగూడ దనియు ఆచార్య మహత్తరుల యాశయము కాఁబోలును. గొప్పవాఁడును అలంతి పొరచే క్లేశమును దుఃఖమును నాశమును పొందుట లోకమున కలిగియున్నను, లోక స్వభావమునకు అది నిదర్శనమైనను దాని యాట "లోకచరితమును అద్దములో చూపుట" యైనను, అందును ఉపదేశ మున్నను, నాటకమువలని పరమార్థోపదేశము నకు క్షోభకారియగు దానిని గ్రహింపక సంప్రదాయరక్షకులు శాంతికారియగు తద్విపరీతమును, అధికారి సత్ఫలముం బొందుటను, గ్రహించినారు. అట్లుండ పునః సంయోజనము చెప్పియేయున్న యుత్తర చరితమున కేవల కరుణమును తరువాత సంభోగమును కలిపినా రనుట అననురూపములను అదుకు పెట్టుటయగును. కాఁగా శ్రీ శాస్త్రులవారు సంప్రదాయరక్షకముగా 'ఏక ఏవ' కారికకు సహృదయులను విమార్గ ములకుం బొరలనీని తెనుంగును, "శృంగారమే గాని..." అని కూర్చినారు. రూపకములలో కరుణాంగియైనది అప్రసిద్ధము నామమాత్రశేషము 'అంక' మనునది కలదు. మఱి నాటకమున ప్రసిద్ధమున, అన్యరస ప్రధానముగా ప్రసిద్ధమున, ఏడుపును అన్నింటికిం బెద్దచేయ నాసఁగొననేల? ఇంతయు ప్రసక్తానుప్రసక్తాను సరణము." (ఆంధ్ర సాహిత్యదర్పణోపోద్ఘాతమునుండి).

## ౨౬ - ఆంధ్ర ధ్వన్యాలోకమున ఉత్తరచరితము

ఆంధ్ర ధ్వన్యాలోకమున "విప్రలంభము సాపేక్షత నాధారమొనర్చుకొని యుండును. కరుణమునకు నిరపేక్షత్వమే ప్రాణము. కావున నిరపేక్షత్వ సాపేక్షత్వ ముల ద్వారమున పరస్పరవిరుద్ధములగు వీరెంటిని కలిపి కరుణవిప్రలంభశృంగారమని ఒక అపభ్రంశభేదమును కల్పించుటయు అత్యంతదుష్టము" అని యుపపత్తిని ఉపన్య సించి "ఉత్తరరామచరితమున విప్రలంభశృంగారము గాదనియు కరుణమే అనియు అనుభవదృఢీకృతమగు సిద్ధాంతము" అని చెప్పఁబడినది. మఱియు 'ఉత్తరరామచరిత మున కథాంశమునఁ దెచ్చిన మార్పులన్నియు శ్రీ రామాయణ ప్రసిద్ధములగు కరుణ రసము నుద్బోధించి విజృంభింపఁ జేయఁగల్గినవే...'ఉత్తరరామచరితమున వీర విప్రలంభములు అయుక్తములు.' 'ఉత్తరరామచరితమున కరుణవిప్రలంభశృంగార' మను శశశృంగమును గాని ధర్మవీరమును గాని ప్రధానముగానొనర్చువారికి ఈదురవస్థ తప్పదు. ఏదనఁగా శ్రీరాముని ధీరలలితనాయకునిగా చేసినవారగుట. కరుణమును, విప్రలంభమును. నిరపేక్షత్వసాపేక్షత్వములవలన విరుద్ధములను నాట్యలోచనమునను ధ్వన్యాలోకలోచనమునను ఇంకను చాల చోటుల నీ గ్రంథమందును విస్తరించి నిరూ పించెను. కావున అట్టిరస ముండుననుట గాని, దాని నితఁ డంగీకరించెననుట కాని పూర్తిగా ప్రమాణవిరుద్ధములు, ఉత్తరరామచరితమున గూడ నీపై నిరూపించినట్లే రసనిరూపణమును గ్రహింపవలెను. అపుడే అట నది సమంజసమగును; అనుభవ ప్రమాణములకు అవిరుద్ధమును కాగలదు. కావున నట కరుణవిప్రలంభ శృంగారము నంగీకరించువారు ఆలంకారిక తంత్రమున నరియగు ప్రవేశములేనివారని గ్రహింప వలెను.' 'ఉత్తరరామచరితము ఎట్లు చూచినను బాగులేనందుననే అందు ఏదియు, విషయముగాని—పద్యముగాని—ధ్వన్యాలోకమునఁగాని తద్వ్యాఖ్యయగు లోచన మునఁగాని ఉదాహరణముగాఁ గైకొనఁబడలేదు.' అని ఇత్యాదిగా అభిప్రాయము ప్రక టింపఁబడినది. దీనికెల్ల సమాధానము చెప్ప నాకుఁ దరమా?

ఐనను, ధ్వన్యాలోకమున ఆనందవర్ధనుఁడు

> "ప్రసిద్ధేఽపి ప్రబన్ధానాం నానారసనిబన్ధనే
> ఏకో రసోఽఙ్గీ కర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా."—21.

అని ప్రబంధచ్ఛాయకు ఒక్క రసమును అంగిగా చేయవలయును అని లెస్సగా చెప్పి నాఁడు. అట్లే 'యః ప్రబన్ధానాం ఛాయాతిశయ మిచ్ఛతి తేన తేషాం రసానాం అన్య తమః కశ్చి ద్వివక్షితో రసో ఽఙ్గిత్వేన వినివేశయితవ్య ఇ త్యయం యుక్తతరో

మార్గః' 'ఎవఁడు ప్రబంధములకు ఛాయాతిశయమును—ఎక్కువ యందమును—కోరునో అతఁడు అరసములలో తనచెప్పనిచ్చవచ్చిన యొక్కదానిని అంగిగా నెలకొల్పుటయనునది మిక్కిలి యుక్తమగు మార్గము.' అని తద్వ్యాఖ్యాత్తి. మఱి ప్రబంధాత్మయగు అలక్ష్యక్రమ వ్యంగ్యధ్వనికి ప్రకాశనప్రకారమును ప్రతిపాదించుచో ధ్వన్యాలోకమున.

> ఉద్దీపన ప్రశమనే యథావసర మన్తరా
> రస స్యారబ్ధవిశ్రాన్తే రనుసన్ధాన మఙ్గినః.—III - 13.

అని విశ్రాంతితొడంగిన యంగిరసమునకు అనుసంధానావశ్యకత చెప్పఁబడినది. వృత్తియందును 'పునరారబ్ధవిశ్రాన్తే రస స్యాఙ్గి నోఽనుసన్ధిశ్చ, యథా తాపసవత్సరాజే.' అని వివరింపఁబడినది. ఇట అనుసంధిసేయఁబడిన రస మేది? కరుణము అంగముగాఁగల శృంగారమా? శృంగారము అంగముగాఁగల కరుణమా? లోచనము..."తాపసవత్సరాజే హి వాసవదత్తావిషయో జీవితసర్వస్వాభిమానాత్మా ప్రేమబన్ధః (ఇది రతికి పర్యాయము. శృంగారరససంబంధమైన మాట) తద్విభావాద్యౌచిత్యాత్ కరుణవిప్రలమ్భాది భూమికాం గృహ్ణాన సమస్తేతివృత్తవ్యాపీ. రాజ్యప్రత్యాయివృత్యా హి సచివనీతిమహిమోపనతయా తదఙ్గభూత పద్మావతీలాభానుగతయా అనుప్రాణ్యమానరూపా పరమా మభిలషణీయతమతాం ప్రాప్తా వాసవదత్తాధిగతి రేవ తత్ర ఫలమ్. నిర్వహణే హి 'ప్రాప్తా దేవీ...' ఇత్యేవం దేవీలాభప్రాధాన్యం నిర్వాహితమ్." అని వివరము ప్రపంచితమైనది. ఇందు తేలినవిషయము ఆ నాటకమునకు శృంగారమే అంగిరసమగుట కాదా? 'పఞ్చమేఽపి సమాగమప్రత్యాశయా కరుణే నివృత్తే; విప్రలమ్భోఽఙ్కురితే' అనుటచేత అది యంగమనియు, ఈ 'అఙ్కురితే' అనుటచే అంగి శృంగారము (విప్రలంభము) పునరనుసంధానము చేయఁబడినదనియు స్పష్టముగాదా? కావున ధ్వనిలోచనముల మతమున 'తాపసము'న కరుణము అంగముగాఁగల శృంగారము అంగిరసము అని చెప్పఁబడినది.

ఇంకను తాపసవత్సరాజమున ఈ వివరము గ్రహింపఁదగును. పెక్కు గ్రంథపాతములతోను అనిశ్చిత పాఠములతోను ఐనను అది యిపుడు ఉపలభ్యమగుచున్నదిగదా. 'ప్రథమే తావ దఙ్కే స్ఫుటం స ఏవ ఉపనిబద్ధః—'తద్వక్త్రేన్దువిలోకనేన దివసో నీతః, ప్రదోష స్తథా తద్గో ష్ఠ్యైవ' ఇత్యాదినా 'బద్ధోత్కణ్ఠ మిదం మనః. కి మథవా ప్రేమా సమాప్తోత్సవః' అని శ్లోక ప్రతీకములు లోచనమున

ఉదాహరింపఁబడినవి. నిజముగా ఈ ప్రథమాంకమున మిక్కిలి రసవంతమగు సంభోగ శృంగారము చెప్పఁబడినది. కరుణముగాదు. దానికి ఇంకను సమయము రాలేదు. ఏత దనంతరము రాజు తాను పోయి వాసవదత్తను కలసికొనును. 'ఆమె యింకను రాలేదని రాకను గుఱించి మనసు తహతహ లాడుచున్నది' అని యాంధ్ర ధ్వన్యాలోకమున ఆంధ్ర వ్యాఖ్య. అది సరిగాదు. ఇట ఆమెరాక కాదు. తనకై కను పెట్టుకొని యున్న దనుచు ఆమెకడకు రాజు పోవుటయే. 'కిం అథవా ప్రేమా సమాప్తోత్సవః.' '=అట్లన నేల? ప్రేమకు ఉత్సవము (ఒకప్పటికి) సమాప్త మగునా'? మఱి ఆ మఱునాఁడే వాసవదత్త కాలిపోయిన ప్రవాద పుట్టి, ఈ ప్రేమకు ఉత్సవము సమాప్తమై శోకము పైకొనఁగలదుగాన, రాజు ఎఱుఁగనిదియు సామాజికు లకు తోఁచునదియు నగు సారస్యము 'dramatic irony' అనునదియు ఇటఁగలదు. 'Dramatic irony is the contrast between two aspects of the same thing, whether such contrast is perceived at the time or becomes apparent later. In critical discussion the term is most commonly used to express the effect produced when there is a marked and significant difference in the meaning of what is being done or said on the stage for the characters themselves on the one hand and for the spectators on the other." నాగానందమున గరుత్మంతుని ఈ భాషిత మందును అట్టిది కలదు.

"గరుడః—(నాయకం కలయన్)

నాగానాం రక్షితా భాతి గురు రేష యథా మమ
తథా సర్పాశ నానాం వ్యక్త మద్యాపనేష్యతి.
తద్యావదేనం గృహీత్వా మలయపర్వత మారుహ్య యథేష్ట మహారయామి."

"నాగరక్షకుండు నాప్రోల నీరీతి వఱలుచుంట నధికవశ్యవృత్తి
సందియంబు లేదు, చయ్యన నీ వేళ సర్పభోజనేచ్ఛ సమయునాకు."
వీనిని కొనిపోయి మలయపర్వత శిఖరముమీఁద యథేష్టముగా అహారించెదను."

అని (శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిుల యనువాదము.) అనఁగా తనకు దండియైన పాముల తిండికైన యాకలి తీరునని గరుడుని భావము. మఱి నాఁడే ఆ నాయకుఁడు గురువై గరుడునికి —

"నిత్యం ప్రాణాభిఘాతా త్ప్రతివిరమ"

అని యిత్యాది యుపదేశింపఁగా: అతఁడును.

'సర్వప్రాణివధా దేవ విరతోఽద్య ప్రభృత్యహమ్'

అని 'యిఁక నీ జన్మ ముందువఱకు నేను ప్రాణి (పాముల)వధమును మాను కొన్నాఁడను.' అని మానుకొన్నాఁడు.

'చేయకు హింస............' అని.

'వదలితి వదలితివి ప్రాణివధము మహాత్మా.' అని.

అట్లు రాజు వాసవదత్తను కలపికొన్నతర్వాత ఆ యంకమంతయు అతి రస వంతమగు సంభోగ శృంగారము.

"ప్రత్యఙ్గేషు న వైవ సప్రృతి శరల్లక్ష్మీ రియం దృశ్యతే" ఇత్యాదియు.

"పున రపి గతా కిం త్వం ముగ్ధే త దేవ వధూవ్రతమ్" ఇత్యాదియు.

"............ప్రసీద.

పర్యుత్సుకే మయి కురు ప్రణయం పురేవ' ఇత్యాదియు తర్వాత వైతాళి కుఁడు నేపథ్యమునుండి సూర్యాస్తమయ మగుచున్న దని,

"ప్రాయః సన్ధ్యాతపాగ్నౌ విశతి దినపతౌ దహ్యతే వాసరశ్రీః" అని వాసరశ్రీ 'కాల్చి వేయఁబడు చున్నది' అను మాటలుగా, ఇందును కొంత యొక్క తెలుంగు 'dramatic irony' ఉన్నట్లుగా సూచింపఁబడినది. అంత అంకాంతనిష్క్రమణ మున 'త దేహి, వాసగృహం ప్రవిశావః' అని రాజు వాసవదత్తను పిలుచుకొని పడుక టింటఁ బ్రవేశించును. ఇంత సంభోగశృంగారము ఐనంతట. రెండవయంకమున వాసవదత్త కాలిపోయిన దను వార్త. (యౌగంధరాయణుఁడును ఆమంటలోనే ఆమె తోడనే కాలిపోయినాఁడని వార్త.) రాజు నేడ్పు. విదూషకరుమణ్వదాదులు దానిని ఎంత చెప్పియు ఏమి చెప్పియు తీర్పలేకపోవుట. అంతట రాజు 'నేనును పోయి వారిం గలపికొందును.' అని యురవడిగా అటు కదంగుట. రుమణ్వంతుఁడు 'అట్లేని ప్రయాగ తపోవనమునకుం బోవుట యుక్తము' అని యనుట. రాజు ఆ మాట లెస్స యనుచు,

> సఖ్యం గతా యమునయా సహ యత్ర గఙ్గా
> య త్రాప్నువన్తి మునయః స్వసమీహితాని
> పాపీయసాం భవతి యత్ర పరా విశుద్ధి
> స్తం మా మితో నయత మిష్టఫలం ప్రయాగమ్.

అని అటు బయలుదేఱుటయు, ఆప్రయాగలో సిద్ధుఁ డొకఁడు, యౌగంధరాయణాదుల పీతిపన్నాగములోనివాఁడే, రాజును భౌతికతాపసవేషమును, కారణవశమున తరువాత

మానుకొన్నను దోసము కానిదానిని కైకొమ్మనియు, దేవికి సాటియైన మఱియొక కన్య కను పాణిగ్రహణముచేసినట్లయిన, తరువాత దేవీపునఃసమాగమము కలుఁగుననియు ఆదేశింపఁగా ఆమాటను నమ్మి అట్లు తాపసవేసముపూని, అట్లట్లు దఱిసి తనపై మాన్ప రాని గాటంపు మరులుగొన్న మాగధిని పద్మావతిని పరిణయమై, ఎన్నాళ్ళకును ఆపునః ప్రాప్తి లేకపోఁగా నడుమ నొకతూరి (IV) 'విదగ్ధసుహృజ్జన సమాశ్వాసన వినోద మాత్ర మే వైతత్. అన్యథా అస్తి క్వచిత్ కేనచిదుపాయేన పరలోకగతః ప్రాప్యతే' అని విసుకున తలపోసికొన్నను.

"త్వత్సంప్రాప్తి విలోభితేన మనసా ప్రాణా మయా ధారితాః"

అని కడపట తాను చెప్పఁదగినట్లుగా ప్రాణములు నిలుపుకొని కనుపెట్టుకొని యున్న ట్లుగానుండి, యౌగంధరాయణాదులు అట్లట్లు పన్నకముచే పునఃసంయోగముం గూర్పఁగా వాసవదత్తను మరలఁగూడిన కథ. ఇందును, మంత్రుల రహస్యపుఁ బన్నాగమునఁ జేరినదైనను, దాహానంతరము అచిరముననే సిద్ధాదేశమును అందు రాజు నమ్మకముంచుటయు, ప్రాణత్యాగపుఁ దెగువను ఉజ్జగించుటయు, 'త్వత్సంప్రాప్తి విలోభితేన మనసా ప్రాణా మయా ధారితాః' అన్నట్లు ప్రత్యాశకలిగియుండుటయుం గూడ గ్రహింపఁదగును. కాఁబట్టి అంగియై యిటున్న సంభోగశృంగారమునకును అటున్న విప్రలంభపునఃసంయోగ సంభోగశృంగారములకును నడుమ శృంగారసందంశమున తగులుకొనియున్న యీ కరుణమును ఆత్యంతికనాశమువలని యాకరుణరసముగాఁ గొనక, ఆలంబనమును వేఱుగాక ఒక్కటియే యైయుండఁగా, ప్రత్యాశయు రతియు అట్లు దాఁగుడుమూఁతలాడుదానిని విప్రలంభభేదముగానే, కరుణవిప్రలంభనామముతో ఆచార్యమహత్తరులు స్వీకరించుట ధ్వనిలోచనములకు ఎడపిపోవుటకాక క్రొత్తమెలఁకువలతో అనుసరించుటయే యగును. ఇట ఆంధ్రధ్వన్యాలోకమున తాపసమునందలి విభావాద్యౌచిత్య సమన్వయముయొక్క నిగమనమున "ఇచట నీ త్రివిధమగు నౌచిత్యము ననుసరించి 'కరుణము విప్రలంభము సంభోగశృంగారము' అను త్రివిధములను వాసవదత్తాప్రేమ ధరించినదని గ్రహింపవలయును" అనుచో కరుణతోఁ దొడంగి కరుణము విప్రలంభము సంభోగము (కడపటిది) అనువరుస చెప్పఁబడినది. మఱి వరుసలో ఒక గొప్పసంభోగము తొలియంకముది ఆరంభమున నుండవలసినది జాఱిపోయినది. "కరుణవిప్రలంభాది భూమికాం" అనులోచనపంక్తిలో క్రమము- వరుస- వివక్షితముగాదు. 'ఆది' శబ్దమును కలుపుకొని ఊరక సామాన్యముగాఁ జెప్పఁబడినది.

ఆంధ్రమున క్రమవివక్ష తోఁచునెడ ఆ తొలిసంభోగము తప్పిపోయినది. అది యా శృంగార సందంశమునకు ఒకతట్టు పట్టు గదా.

స్వప్నవాసవదత్తమునను ఇట్లేయగును. అట్లే ఉత్తరరామచరితమునను. ఈ నాటకములెల్ల నాటకలక్షణము వ్రాసి దశరూపక సాహిత్యదర్పణ ప్రతాపరుద్రీయ రసార్ణవసుధాకరాది యనుశాసనములు అనుగ్రహించిన యాచార్యుల చిత్తమున సుప్రతిష్ఠితములే. వారు కేవల కరుణమునకును విప్రలంభమునకును భేదమెఱుంగలేనివారుకారు. వారు ధ్వన్యాలోకలోచనముల శాస్త్రమును శిరముల నవతంసించుకొనువారే. అదిమాత్రమే కాక నాటకాన అంగివిశ్చయమునకై ఇంకను మన మెఱుఁగని సంప్రదాయము వారికి ఎట్టెట్టిది అందియుండెనో: అట్టి పీ రందఱు ప్రబంధమున సర్వవ్యాపిగా అంగిగా ఒక్కరసము ఉండఁదగును అను సామాన్యశాస్త్రమునకును నాటకమున అనుష్ఠానార్థము విశేషనియమము నిబంధించువారై, తమకు దిగిన సంప్రదాయముంబట్టి,

'ఏక ఏవ భవే దఙ్గీ శృఙ్గారో వీర ఏవ వా'

అని ఏకకంఠముగా అనుశాసించినారు. కరుణమును ఈమహాత్ములు తాపసవత్సరాజోత్తరరామచరితాదులయందు అంగిగా గృహీతమైయున్నది. అదియు అంగి కాఁదగును, అని దానిని ఇందుఁ జేర్పరైరి. అని యెదురుగానే ఉండెనే, అది వారి మతమగునేని చేర్పరా? ఇఁకను ఆ శృంగారమున విప్రలంభమునకు ధ్వనికారుఁడు 'విప్రలంభ స్యాపి అభిలా షేర్ష్యా విరహ ప్రవాస విప్రలమ్భాదయః' అని 'ఆది' అని చేర్చి కొన్ని భేదములు పేర్కొన్నాఁడు. లోచనమునను అభిలాష - ఈర్ష్యా - విరహ - ప్రవాస అను విప్రలంభములను అనువాదముచేసి రవంత వివరించి, 'ఆది శబ్దగ్రహణాత్ శాపాదికృతః' అని యిది చేర్పఁబడినది. తరువాతి యాచార్యు లెల్లరు మరణము లోకాంతరగమనము కలిగి మరల సంయోగముగలుగు చోట్ల, అది యొక యసాధారణ సంవిధానము గదా యని, యా విప్రలంభమున 'కరుణము' అను నొక భేదమును ఎక్కువగా కల్పించినారు. రసగంగాధరకారుఁడు చెనకరాని ప్రతిభగలవాఁడు. దాటరానిమాటలు గల వాఁడు "యదా తు సత్యపి మృతత్వజ్ఞానే దేవతా ప్రసాదినా పునరుజ్జీవనజ్ఞానం కథఞ్చిత్ స్యాత్, త దాలమ్బనస్య ఆత్యన్తిక వినాశాభావాత్ చిరప్రవాస ఇవ విప్రలమ్భ ఏవ; న స కరుణః." అని దానిని 'దీర్ఘ' ప్రవాస విప్రలంభ మనఁదగు ననుచునే, 'కేచిత్తు రసాన్తర మేవ అత్ర కరుణవిప్రలమ్భాఖ్య మిచ్ఛన్తి.' అని పాక్షికముగా కరుణవిప్రలంభమునకును తన యంగీకారమును

తెలిపినాఁడు. వట్టి చావే యైన కరుణమే యగును గదా. అం దెవ్వరికిని విప్రతిపత్తి లేదు. అట్టి సందర్భముల 'పునర్లభ్య' మగుట ఒక విశేషమే. అది దేవతా ప్రసాదమున గానీ; మఱి యేకారణమునం గానీ, అట్టి పునర్లభ్యములు కాఁదగిన సందర్భము లేవేవో ఎట్టెట్టివో. పీనుఁగును కంటితో చూచి కాల్చియో పూడ్చియో ముగించువఱకు ప్రేమచే మరల నొకవేళ ఎట్లేని సమాగమము కలుగునేమో అని ఆశాపాశబద్ధమగు మానవచిత్తమున అంత యేర్పునను ప్రత్యాశ. ఏవేవో తాను కల్పించుకొను కారణములచే, ఇంతయో అంతయో లీనముగా ఉండనేయుండును. కాన దానికోసము శాస్త్రమును సడలించి అట్టిదాని నెల్ల కలుపుకొనుటకు ఆచార్యులు అసంఖ్యాకులు విప్రలంభమున ఈ కరుణభేదమును, కరుణ విప్రలంభమును, ఒక తెఱంగు దానినిగా పేర్కొన్నారు. దానికి లక్షణము చెప్పినారు.

"యూనో రేకతరస్మిన్ గతవతి లోకాన్తరం పునర్లభ్యే
విమనాయతే యదైక స్తదా భవే త్కరుణ విప్రలమ్భాఖ్యః."

'యచ్చాత్ర సఙ్గమ ప్రత్యాశానన్తరం భవతో విప్రలమ్భస్య ప్రవాసాఖ్యో భేద ఏవ ఇతి కేచి దాహుః. త దన్యే మరణరూప విశేషసమ్భవాత్, తద్భిన్న మేవ ఇతి మన్యన్తే.' అని సాహిత్య దర్పణము. ఇట్లీతఁడే కాక విప్రలంభ భేదములలో కరుణమును చేర్చుకొనుటకు సమాధానోపన్యాసము రసతరంగిణీ సరస్వతీకంఠాభరణ శృంగారప్రకాశికా రసార్ణవసుదాకరాదులయందు చక్కఁగా తేట తెల్లముగా విలంధింపఁబడి యున్నది. ఇ దెల్ల ధ్వనిలోచనములకు ఒక తెఱఁగు విస్తరణమును వైశద్యసాధనము నగును గాని విరోధము ఉల్లంఘనము కాఁజాలదు. ఇది సాధుత మెఱుఁగు లీను నేనుఁగుదంతము: కాఁగా ఆ 'అపభ్రంశము', 'దుష్టము', 'శశశృంగము' అను మొదలగు వ్రాఁతల కేమనఁదగును?

కరుణవిప్రలంభమును విప్రలంభ భేదముగాఁగొని ముని చెప్పిన రససంఖ్యను దాఁటనివారును, రసాంతరముగాగొని ఆ సంఖ్యను దాఁటిన దిట్టలును, రసతరంగిణీ వాగ్భటాలంకార రుద్రటాలంకార సరస్వతీ కంఠాభరణ శృంగార ప్రకాశికా దశరూపక రసగంగాధర సాహిత్యదర్పణ శృంగార తిలకాది కర్తలగు నాచార్యులందఱును ఒక్కొ గొంతుగా అట్లు చెప్పినవారలు అలంకారిక తంత్రమందు సరియగు ప్రవేశము లేనివారేనా? ఇఁక వారిని ముందుంచుకొని వారి మాటున నున్నవారు, వారిని వెనుక అండగా నుంచుకొని ముందుకు చూఁకినవారు మాత్రము?

'ఉత్తరరామచరితము అదేమి నాటకము అబ్బే! అది ఆనందవర్ధనాభినవ గుప్త స్వీకృతము గాలేదే!' అనుటయు ఒకమాటయా? రసికప్రకాండులు సాహిత్య మర్మజ్ఞులు "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే." అని భల్లాలసేనుని భోజచరిత్రో దాహరణముల మర్యాదగా, 'కావ్యేషు నాటకే ష్వేవ వయం వా వయ మేవవా' అను తన పూర్వార్ధమునకే ఉత్తరార్ధముగా కాళిదాసునోటనే పలికించినారే! ఆ యుత్తర చరిత మందాకిని మహిమ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారి యాంధ్రోత్తర చరితోపోద్ఘాతమున కానందగును. మఱియు.

'సన్తి సిద్ధరసప్రఖ్యా యే చ రామాయణాదయః
కథాశ్రయా న తై ర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ

తేషు కథాశ్రయేషు తావత్ స్వేచ్ఛైవ న యోజ్యా, య దుక్తమ్ - 'కథా మార్గే నాతిక్రమః' ఇతి. స్వేచ్ఛాపి యది యోజ్యా, త ద్రసవిరోధినీ న యోజ్యా.'—ధ్వన్యాలోకము.

"రామాయణాదులు సిద్ధముగా నున్న రసముతో—మిక్కిలి రసవంతములై—ప్రసిద్ధముగా నున్నవే. రసమునకు విరోధము కలిగించునట్లు తన యిచ్ఛమెయి వాని కథలవిషయముల జోలికి పోఁగూడదు. ఆ కథామార్గమును అతిక్రమింపఁగూడ దని చెప్పఁబడియున్నది గదా. 'ఒకవేళ కవికి తన యిచ్ఛను గూర్చ కోరిక కలదేని, దానిచే వానిరసమునకు విరోధము కలుగనీఁగూడదు.' అని. లోచనమున దీనికి రవంత వివరము చెప్పుచో దృష్టాంతముగా—'యథా రామస్య ధీరలలితతాయోజనేన నాటికా నాయకత్వాది కుర్యా దితి త్వత్యన్తాసమఞ్జసమ్'. 'రామునికి-కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్-ఇత్యాది ప్రశ్నలకు జవాబైనవానికి ధీరలలితత్వముఁ గూర్చి నాటికకు అతని నాయకునిగా చేయుట అత్యంతము అసంమజసము అగునుగదా-' అని చెప్పఁబడినది. మఱి అందువలన ఉత్తరరామచరితమున కరుణవిప్రలంభాంగిత చెప్పినట్లయిన యా రామునికి ధీరలలితతయు నాటికానాయకతయు ఘటిల్లునా? అహో! ఉత్తరచరితరామునికంటెను ధీరోదాత్తుఁడు ఇలలో కలుగునా? మఱియు రామాయణమున కరుణరసనాయకుఁడై గొప్పవాఁడుగా విరాజిల్లినట్లు ఉత్తరచరితమునను కరుణరస నాయకుఁడై విరాజిల్లునఁట రాముఁడు! ఏటిది యిది కరుణరస నాయకుఁడై విరాజిల్లుట? కూలినాలిపేదవాని కరుణరసనాయకత. కవి శక్తిగలఁడేని. విరాజిల్లదా? మఱి ధర్మవీర కరుణవిప్రలంభములకు నాయకుఁడగునేని, ఉదాత్తుఁడును, గొప్పవాఁడును. కాఁడా? ఇవి ధ్వనిశాస్త్రమర్మములు! బళి!

ఇంకను విస్తర మెందులకు?

[ఆంధ్రధ్వన్యాలోకప్రస్తావమునకై ఇట కొంత పునరుక్తిదోషము పుట్టినది. అది క్షంతవ్యము.]

౨౭ - అడిక వేగువలన వినఁగానే, సీత పరిశుద్ధిని ఎఱింగి
నమ్మిన రాముఁడు దానిని ఎవరుపలికిరో వారిని దండింపక
నిరపరాధను సీతను త్యజింపఁదగునా?

ఈ మార్గాన 1964 సెప్టెంబరు భారతిలో ఎవరో, ఉత్తరచరిత భవభూతి రచితము అదేమి నాటక మని ఆక్షేపణచేసినారు "అట్లు 'ఏషతే మాతవో రాజా రామః సమాజ్ఞాపయతి'అని మఱిమాట ఆడనీకుండ, త్యజించుట. సీత భార్య. తనకు లోకువ, 'ఉపపన్నా హి దారేషు ప్రభుతా సర్వతోముఖీ' అని తా నామె నేమేని చేయఁదగుదు అను స్వాతంత్ర్యమును రాజాధికారమును దుర్వినియోగము సేయుట గాదా? స్త్రీని సీతను అట్లు దానిసగా చూడఁదగునా? నింద పలికినవా రెవరో వారిం బిలిచి అడుగంట విచారించి, అగ్నిశుద్ధిసాక్షులను విభీషణ సుగ్రీవ హనుమదాదులను పిలిపించి వారిచే ఆ సాక్ష్యము చెప్పించి. నిందకులను సీతాశుద్ధివిషయమున నమ్మించియుంతపలదా? అంతట నాటకవస్తువే ప్రతిబద్ధమై యుండునే." అని యనుట, మేఘసందేశవిషయమున ఉన్మత్తునికి యక్షునికి కాంతను దాపవీకుంత సందేశము పంపి కాపాతవలయునను తెలివి యెక్కడిది అనుటంటోఽది. అట్లనుకానింగూర్చి 'అహో మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః' అని మల్లినాథసూరి హేళనము పలికినట్లు ఇటనుం బలుకఁదగును.

ఈయాక్షేపణ కేవలము లఘుహృదయోత్థము. మఱియు యుగధర్మములను వాని స్మృతులను మాఱుచుండునుగదా. అదియు పరికింపఁదగును.

మఱి రామునికి సీతయు ఆమె చారిత్రమును అత్యంతప్రియము, అత్యుక్తి పరిపూతతాదిచే గౌరవాస్పదము. వానిం గావనే మునుపు లోకారాధనము కోసమే ముఖముగలుగ ధహించిన జాగ్రత్తతో తాను తగనివైనను అనోక్తులు పలికి లంకా సముద్రతీరమున ఆమెను ఆ యగ్నిదివ్యమునకు పాల్పఱిచెను. (చూ. I. 2) అట్టి సందియము అట్టి నింద అట్టి రుజువుల తుదముట్ట తొలఁగదగునుగాని మార్గాంతరముల తొలఁగునది గాదు.

> 'సీత త్త్యజన రపి దైవదుర్విపాకాద్
> అలర్క్యం విష మివ పర్వతః ప్రసృష్టమ్.'

అని మరల లేచి ఇట్లు వ్యాపించినది.

'ఇక్ష్వాకువంశో౽భిమతః ప్రజానాం
జాతం చ దైవా ద్వచనీయ బీజమ్
య చ్చాద్భుతం కర్మ విశుద్ధికాలే
ప్రత్యేతు క స్త ద్వ్యతిదూరవ ర్తీ.'

అని యీదూరాన ప్రజ దానిని నమ్మదాయెను, ఇది కేవలము దైవికము. శ్రీరాముఁడు తాను మరల సీతతో 'అపవాదమును మొగమునం బలికి బందిగా అపరమవినీతను పతి దేవతను జగన్మంగళమూర్తిని బలాత్కారమునఁ బంపించు ఘోరతను తప్పించు కొఱకు' అమెను వ్యాజమున అడవులకుం బంపినాఁడు. వసిష్ఠారుంధతులు కులగురువులు లోకక్షేమదీక్షితులు ఇట్టి నింద కలుగుననియు, దానిని ఎట్లెట్లో దివ్యమార్గమున మఱి లేవనీక తొలఁగింపవలయుననియు, వారు ఎఱింగి పూనినారు. అందుకే వారు దోహదము తీర్పు మనియు ప్రజారాధనము చేయుమనియు ఒక్క గుక్కలోనే రామునికి సందేశము పంపినారు. రాముఁడు కాక అన్యుఁడు ఈ వివాసనపుఁదెగువం బూన లేఁడు. అదియు వా రెఱుంగుదురు. సీత మహాపతివ్రత, పాతివ్రత్యము అనిర్వచనీయమును అపరిమేయము నగు మహిమ గలది. ఆ సాధ్వీం గాఁచును; పతిం గాఁచును. లోకమును గాఁచును.

'ఈదృశానాం విపాకో౽పి జాయతే పరమాద్భుతః
య త్రోపకరణీభావ మాయా త్యేవంవిధో జనః.'

అని యన్నాఁడుగదా.

'శిశు ర్వా శిష్యా వా య దసి మమ త త్తిష్ఠతు తథా
విశుద్ధే రుత్కర్ష స్త్వయి తు మమ భ క్తిం జనయతి.'

అని యరుంధతియు

'అవయో రపి యత్సఙ్గాత్ పవిత్రత్వం ప్రకృష్యతే.'

అని పృథ్వీభాగీరథులును పలికినారు, పామరజనులవలన మరల నిందయు. రాముని వలన వివాసమును మహర్షులయు దేవతలయు పూనుదలవలన అట్లు అది తీఱి పునః సంయోగమును జగన్మంగళమును కలుగుట—ఇట్లు నాటకవస్తువు సర్వథా నిరవద్యముగా సుశ్లిష్టమ యైనది. ఈ ప్రకరణమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారి యాంధ్రోత్తరచరితోపోద్ఘాతమునుండి యీ యుద్ధారము గనఁదగును. "సీతావివాసము ధర్మమా, అధర్మమా?—ప్రజారంజనార్థము శ్రీరాముఁడు సీతను దూరీకరించెను. తద్రంజనమే తద్వ్రతము. వివాసనోపదేష్టలును తత్ప్రేరకులును అరుంతీ వసిష్ఠులు.

సీతంగూర్చి సడి వచ్చినంత తన్నివారణముకై సీతావివాసముకన్నను ఉపాయాంత రము లేదు. ఎల్లవారిం గూర్చి సీతాశుద్ధిం దెలుపరాదా యనిన. అది యా పెద్దలు లేక విరవమానముగా నెట్లు జరుగును? వారు జన్నమును అకాలమున వీడి ఎట్లు వత్తురు? వారికి సమయమై వారు వచ్చి ఆ యుపాయమునే ప్రయోగించునంతకు వివాసము తప్ప దాయెను. ఈలోపల వియుక్తి శుభోదర్కమే యని ఆశీర్వాదవాక్యములచే సీతారాము లకు తెలిపినారు. (అరుంధతియు) వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడును 'వీరప్రసవవు గమ్ము'. 'మఱి పుత్రపూర్ణమైన యొడిలోడి నిన్ను ఆయుష్మతిని చూడఁగలము.' అని. రాముఁడు సీతాశుద్ధి నెఱుంగనివాఁడు కాఁడు. పౌరులు సీతను ఇంట నుండనీయనందు లకు వారు నింద్యులని తమన స్థూలదృష్టిచేఁ బలుకుఁగాక. సూక్ష్మమతి శ్రీరాముల వారు పౌరులను నిందించుట తగవు గాదని పలికినారు. భాగీరథియు రాముని మతమే వహించినది. వాసంతి వివాస మకార్య మన్నది. సీతా పితృత్వకారణంబున జనకుఁడు రామునిపై అలిగియు అరుంధతి హెచ్చరించిన ప్రజాపాలనకారణమునకు సమాధాన మొందినాఁడు. అట్లే గర్భప్రీతికారణమున పృథ్వీదేవి రామునిపై కిరు నలిగియు. భాగీరథీబోధనచే సమాధానపడినది. ఈమెయు భాగీరథియును సీతావిశుద్ధిని స్తుతించుట చేత పౌరజానపదులు సమాధానపడి సపుత్రసీతారామసమ్మేళనము నంగీకరించిరి. ఆ శుద్ధివిస్థాపించి పౌరుల నమాధానపఱచుట సీతాశుద్ధికిని రామునియశమునకును అత్యంతా వశ్యక మని పెద్ద లెల్లరుం దలఁచి, అట్లే సంవిధానముం గూర్చిరి. ఇట్లు సీతావివాస నము సాధువేగాని అ సాధువు గాదు." అని.

ఇట్టి లఘుహృదయులనే ఉద్దేశించినాఁడు కాళేపండితుఁడు తన యుపోద్ఘాతమున.
"Shallow critics, with their gratuitous sympathy with Sita for her cruel abandonment in the forest are inclined to find fault with Rama for his undue solicitude for the contentment and happiness of his overnice subjects. అని. 'Judged by the ideal standard of duty, Rama deserves our approbation of his wonderful self-sacrificing nature rather than condemnation for the seemingly cruel deed.' అని ఆయన కూర్చిన సమాధానము బిల్వల్కార పండితుఁడును చెప్పినాఁడు—
"In abandoning his wife on the basis of the rumour Rama is obeying a higher call of what he owed to his subjects as a king..........Even Ram as first speech in the play,

'కి న్త్వమస్థాన విక్లవత్వం స్వాతన్త్ర్య మపకర్షతి' to console his wife for a thing which had happened and which is inevitable points to his scrupulous appreciation of duty, rule, and law above any personal sentiment or pleasure.

## ౨౭ - ఉత్తరచరితపై రే పండితుని యాక్షేపణలు, సమాధానము

శారదారంజన్ రే పండితుఁడు. ఉత్తర చరితకు గీర్వాణవ్యాఖ్యయు ఆంగ్ల టీకయు రచించినవాఁడు. భవభూతిని సమకాలికులు మెచ్చరైరి అని యెంచి అట్లు మెచ్చక పోవుటకు కారణము ఏమగును అని విమర్శించుచు ఈ యుత్తరకథ నాటక మున అల్లికలో కొన్ని పొరపాట్లు ఉన్నవి, (ఇట్లే కదమను కాఁబోలు) అని ఇట్లు సూచించినాఁడు.

1. ఉత్తర చరితయందలి భాష చాల బిరుసుగాను, పెక్కెడల చెవికి అమధురముగాను, కటువుగాను అరుంతుదముగా సయితమును ఉన్నది. గోవర్ధ నాచార్యులు దీనిని భూధరభువు—కొంతరాతిబండ—అన్నాఁడు.

2. ప్రస్తావనలో "ఏ షోహం కార్యవశా దాయోధ్యక స్తదానీ న్తనః సంవృత్తః" ఇత్యాదివి చేర్పంగూడదు. దానిని విష్కంభము అనవలసినది. వీరికి భావ మారిష వ్యవహారము తగదు.

3. అరుంధతీ వసిష్ఠ కౌసల్యాదులు నాఁడే కదా ఋశ్యశృంగాశ్రమమునకు పోవుట. ఇంతలో అష్టావక్ర సందేశ మెందులకు? ఆ వేకువ వారు పోయినారు కాఁబోలు. ఆ మధ్యాహ్నమునకు అష్టావక్రుఁడు వచ్చి సందేశము చెప్పినాఁడు కాఁబోలు. ఆ దినమే దోహద సంపాదనాదేశము; ప్రజానురంజనోపదేశము. ఇఁక రవంత సేపటికి కాన్పుకాఁగల సీతను ఆ తెల్లవాఱుప్రొద్దున అత్తలు విడిచి అటు పోవుట; మధ్యాహ్నము మగఁడు విడిచి ఇటు తఱుముట; ఆ సాయంకాలమే సీతకు కాన్పు అగుట! ఏమి ఈ సంవిధానము?

4. లవణోచ్ఛేదనమునకు పోయిన శత్రుఘ్నుఁడు రాకయే యుండఁగా, లవ ణుఁడు నిర్జితుడుకాకయే యుండఁగా రాముఁడు విజసామ్రాజ్య సూచకమగు నశ్వమేధ మును ఎట్లు తొడంగుట?

ఇంకను ఇట్టిట్లు.

రే మతమున ఉత్తర చరితము మహావీరచరితానంతరముది, భవభూతి రెండవ నాటకము. ఈ నాటకాలనుగూర్చి యీ పండితుఁడు ఏమి చెప్పినను అది ప్రల్లదమై తలనొప్పివి చీదరను పుట్టించు నతి సంకుచిత హృదయత అసహృదయత తోఁచు చుండును. వానికి సమాధానము ప్రయత్నించుట కర్తవ్యముగాదు. విశ్వస్తుతి పాత్ర మగు నుత్తర చరిత భాషమ 'బొంతరాతిబండ' యమ వానితో నేమి మాటలు? భవ భూతికారుణ్యము రాతివి సైతము ఏడిపించును అను గోవర్ధనకృత భవభూతి ప్రశంసకు ఇట్లు అర్థము చేసికొన్నాఁడే! వానివి ఏమనవచ్చును? ఇఁకను ఆ ప్రస్తా వనను గూర్చినది అదేమి యాక్షేపణ? అది ఎవరికి తోఁచును? ఉన్నతీరున ఆ ప్రస్తా వన ఏల యుండరాదు? మఱియు సీతకు గర్భము రావణుని యశోకవనమువనే వచ్చి యుండవలెను, లేకున్న ఇంతలో కాన్పుప్రొద్దులు ఎట్లు వచ్చును? ఆ యుదయమే అరుంధతీ కౌసల్యాదులు ఋష్యశృంగాశ్రమమునకు పోవుట, మధ్యాహ్నమునకు అష్టావక్రసందేశము! ఇంతలో సందేశ మేల? తాము సమక్షమున చెప్పి పోయి యుండరాదా? ఆ సాయంకాలమునకు సీతా వివాసము, ఆ రాత్రి తొలిజామున కాన్పు.

ఇది యాక్షేపణల పరంపర. మఱి రామాయణోత్తరకాండ చదువఁగా రామ పట్టాభిషేకమునకైన యుత్సవములు కొన్నినెలలు సాఁగినట్లు తోఁచును. అందందు వాల్మీకి అఁగి ఇప్పటికి నెలకు ఎక్కువ యైనది. ఇప్పటికి రెండు నెలలు ఐనవి అని జ్ఞాపకము చేయుచున్నను కాండలో అప్పటికి సగము ముగియవచ్చుచున్న పఠితలకు ఇంకను చాల దీర్ఘకాలమయినట్లు తోఁచుచుండును.—

> "ఏవం తేషాం నివసతాం మాసః సాగ్రో యయౌ తథా
> ముహూర్త మివ తే సర్వే రాజభక్త్యా చ మేనిరే.
> రామోపి రేమే తైః సార్ధం వానరైః కామరూపిభిః
> ..........................
> ఏవం తేషాం యయౌ మాసో ద్వితీయః శిశిరః సుఖం
> ..........................
> రామస్య ప్రీతి కరణైః కాల స్తేషాం సుఖం యయౌ."

ఇట్టి కథనముం గన్నపుడు రెండు నెలలన్నది, ఆయుత్సవములు తొమ్మిదియు పదియు నెలలు నయితము జరిగియుండవచ్చుననుట అసంభావ్యము గాదు. కాఁగా సీత

చూలు ముదురుటకు ఎంత కాలము వలయునో అంతయు నిట కవి హృదయ మని గ్రహింపఁదగును. "రామస్య అయం అభిషేకసమయః" - 'ఇది రాముని పట్టాభిషేక సమయము.' "య దారాధనాయ ఇయతో దివసాః" - 'వారిని సంతోషపెట్టుటకు ఇన్నిదినములు' 'సంప్రతిహి' 'మఱి యిప్పు డన్ననో.' ఇవి యటనున్న కాలనిర్దేశ వాచకములు. 'సమయము' అది ఎంత కావలయునో అంత కాఁదగును. 'ఇన్నిదినములు'—'ఇన్ని' కథావస్తువు సరివడుటకు ఎన్ని కావలయునో అన్ని కాఁదగును. ఇఁకను 'ఇప్పుఁడు' అను నర్థముగల 'సంప్రతి' దినవాచకముగాదు. దానిని సమితము ఇతివృత్తమును చక్కఁబెట్టుకొనుటకు ఎంత కాలము వలయునో తదనుగుణముగా అర్థము చేసికొనఁదగును. 'కృతయుగములో అట్లుండినది. మఱి యిప్పుడో' అనఁగా దానికి కలియుగము అర్థము చెప్పఁదగును. 'పదునేనవశతాబ్దిలో అట్లుండినది. మఱియిప్పుడో' అను వాక్యమున 'ఇప్పుడు' నకు ఇరువదియవ శతాబ్ది యర్థముగాఁ గొనఁదగును. 'నిన్న అట్లుండినది. మఱి యిప్పుడో' అనువాక్యమున ఇప్పుడునకు నేఁడు అని యర్థమగును, భవభూతి మాటలు 'పట్టాభిషేక సమయః' 'ఇయతో దివసాః' 'సంప్రతి హి' అనునవి. వాన దానిదానికి మనకు కావలసినకాలమును సరిపెట్టుకొన వచ్చును. కావున రే పండితుని కాలముంగూర్చిన యాక్షేపణలను కడకొత్తవచ్చును. అంతటి కవియెడ ఇంతటి ఔదార్యముచాలని ఆ పాండిత్య నైశిత్యము ఎంతటది!

ఇఁక లవణాసురుం గూర్చి, ఏమి ఆ గ్రుడ్డి యాక్షేపణ? ఈ నాటకమున "ఆః కథమ్! అద్యాపి రాక్షసత్రాసః.' త ద్యావ దస్య దురాత్మనః కుమ్భీనసీపుత్త్రస్య ఉన్మూలనాయ శత్రుఘ్నం ప్రేషయామి." అని చెప్పి రాముఁడు విష్క్రమించును. మఱి శత్రుఘ్ననికి ఏమేమి చెప్పి పంపెనో? ఉత్తరకాండలో శత్రుఘ్ననికి ఇక్కడనే తన చేతులతో, రావణయుద్ధమరణములకు ముందే తన్ను చేరిన విభీషణుని లంకా రాజ్యమున అభిషేకించినట్లు. మధురకు అభిషేకించి దానిని రాజుగా పాలింపుమని ఆదేశము. అట్లే అక్కడ వానిం జంపి, రాజధానిని చక్కఁబెట్టి పరిపాలించుచుండి పండ్రెండేండ్లయినంతట తన కొడుకులకు దానిని చూచుకొండని ఒప్పగించి, తాను అన్నను చూడఁగోరి రామునిసన్నిధికి వచ్చినాఁడు. కాఁగా ఇందు "ఉత్ఖాతలవణః మధురేశ్వరః ప్రాప్తః" అనుభాషితమందలి 'మధురేశ్వర' విశేషణమున ఇదంతయు ఇమిడ్చినాఁడు, కవి.

కాఁగా ఇట్లు ఇట్టి యలంతుల రేబోంట్లు తన జోలికి రాఁదగినవాఁడా ఆ సాక్షాత్కృత శబ్దబ్రహ్మ భవభూతి?

## ౨౯ - ఉత్తరచరితమందలి పాత్రల శీలాది పరిశీలనము

ఉత్తరచరితయందలి పాత్ర లందఱు సీతారాములును, జనకవాల్మీకి వసిష్ఠులును, అరుంధతీ గంగా పృథ్వులును, లక్ష్మణుఁడును, చంద్రకేతు కుశలవులును, వనదేవతా నదీదేవతలును, సుమంత్రుఁడును, శంబూకుఁడును వాల్మీకిరామాయణమున ఎట్టి గుణశీలములు గలవారుగా ఏయేయంతస్తు గలవారుగా ఎదురుగా అగపడినారో, అందలి సూచనలచే ఊహకు అందినారో అట్టిగుణశీలములు గలవారుగానే ఆయాయంతస్తు గలవారుగానే ఈ నాటకమున నిర్వాహముఁ గన్నారు. శాకుంతలమునను —శకుంతలాదుష్యంతులతోను కాశ్యప తచ్ఛిష్యులతోను అదితిమారీచులతోను సానుమతీవసుమతులతోను శకుంతల చెలులతోను—ప్రాయికముగా ఇట్టి నిర్వాహము ఉన్నను, సేనాపతియు విదూషకుఁడును చెంబడియు పోలీసులును హీనజాతులు ఆ యంతస్తు అందుకొననివారు కలరు. దుష్యంతునియందును ఉదాత్తోన్నతితో తొలి యంకమందలి యాత్మాపహారమును, రెండవ యంకమందలియు లోపల నొకకారణముండఁగా బయటికి మఱియొక కారణము చెప్పి వేఁట మాన్పించుటయు, విదూషకునితో 'క్వ వయం? క్వ పరోక్షమన్మథః' అను బొంకు పలుకుటయు, ఐదవ యంకమందలి హంసపదిక నేస్తమును శీలమును కొన్నిమెట్లు క్రిందికి దించునవి కలవు. శకుంతలయు ఆనిరాకరణమున మనస్వినియై భర్తను 'అనార్యుఁడా' అని తిట్టినది. రామాయణ సీత మనస్వినియై, రాముఁడు తన్ను అడవికి వెంటరానీని ఏవేవో భయము గొలుపు మాటలు చెప్పఁగా,

> "సా తం.......పరిచిక్షేప రాఘవమ్
> కిం త్వాఽమన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
> రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం
> అనృతం బత లోకోఽయ మజ్ఞానా ద్యద్ధి వక్ష్యతి
> తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే."

అని మానాయన నిజముగా పురుషరూపాన ఉన్న స్త్రీని నిన్ను, రామ, అల్లుఁడుగా పొంది ఏమనుకొనెనోగదా ... .......అని తెగడినది. నిర్దోషనే తన్ను వివాసనము చేయఁగా తన శుద్ధిని ఒట్టుపెట్టి నిర్ణయించి, మఱి రాముం గలియక, అతఁడు వలదు వలదు అనుచున్నను భూమిలో అడఁగినది. కాళిదాసుని రఘుసీతయు తన యగ్నిశుద్ధిని ఎఱింగియు నిష్కారణముగా తన్ను వివాసనము చేసినందులకు,

> వాచ్య స్త్వయా మద్వచనాత్ స రాజా
> వహ్నౌ విశుద్ధా మపి య త్సమక్షమ్
> మాం లోకవాదశ్రవణా దహాసీః
> శ్రుతస్య కిం తత్ సదృశం కులస్య ?

అని నిష్ఠురముగా అడిగినది. తన శుద్ధిని ఒట్టుపెట్టి నిర్ణయించి మఱి రాముం గలియక భూమిలో అడంగినది. ఉత్తరచరితమున ఎందును ఇట్టి పతనము లేనేలేదు. ఎల్ల వారును తమ తమ యంతస్తున, ఎత్తైనదానిలోనే, పతనోత్థానములు లేకుండ, మరల స్వభావ సమ్మతతకు వెలితిరాకుండ, నడుచుకొన్నారు. కావున శాకుంతలమును ఉత్తర చరిత మించినది అనుచున్నారు. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు శాకుంతలము గంగయయిన ఉత్తరచరిత మందాకిని యగును అన్నారు.

నాటకమున ఇతివృత్తమునడచుటకును పాత్రల శీలాదికము ఎఱుకపడుటకును భాషితములు—సంభాషణ—ఒక్కటే మార్గము. ఒక్కొక్కభాషితమునను వక్త యొక్క శీలము కాక, అందు ప్రస్తావింపఁబడువారియొక్కయు శీలమును అట్లట్లు ప్రకాశము గనుచును ఊహకు అందుచును ఉండును. కావున ఆయాయెడ ఆయా భాషితములకడ వానిచే ఉద్ద్యోతితములగునవి వ్యాఖ్యలో సూచింపఁబడినవి. మఱి యిట వాని నన్నింటిని సమాహరించి మొత్తముగా ఇంచుక.—

రాముఁడు—శ్రీరాముఁడు సకలసద్గుణరాశి. హిందూచిత్తమున రాజ్యాన రాజుగాఁ గాని, ఇంట గృహస్థుఁడుగాఁగాని, ఎందును అతని మించిన పురుషుఁడు లేఁడు; అన్ని ఘనతలకు లక్ష్యభూతుఁడు. అతనికి సీతయందు ఇంతంతయనరాని ప్రేమ. ఎప్పుడును దేవి యని సంబోధించి నిర్దేశించునంతటి గౌరవము. ఆమెంగూడిన సుమానుష (=దాంపత్య) భద్రమున హాయిగనుచు, ఇంకను గన నువ్విళులూరు చుండువాఁడు. అట్టి ప్రాణాధికప్రియనే ఆమెను, తాను నమ్మిన పవిత్రచారిత్రను, ఆమెకన్నం దనకు ప్రియమైన ప్రజానురంజన ధర్మానుష్ఠానమునకై, తెగువతో విడనాడి, దాన—ఆమె బాధలు ఉండనీ, తాను ఇంట నిరంతర దుర్భర దుఃఖమును అనుభవింప నియ్యకొన్న మహాత్యాగశాలి. [నిరాకృత శకుంతల దిక్కుదూలినతనమున కన్నను కన్నుల మిఱుమిట్లు గొల్పు రూపవతిని, ఆ గర్భిణిని నేను నీ భార్యను అని చెప్పుచున్నదానిని నిరాకరింపవలసి నిరాకరించిన దుష్యంతుని చిత్తమందలిభావసంఘర్షణ సహృదయునికి జాలి కలిగించునందురు.] తనకు మునుపు సీతను దూరలఁ గూర్చిన హనుమత్ సుగ్రీవ విభీషణాదుల కందఱికిని, తన కృతజ్ఞతకుం బాత్రములకు, తాను

ఇట్లు కృతఘ్నుఁడనైతినే అని తలంచుకొని యెంత పరితపించినాఁడు! అట్లు పండ్రెం డేండ్లు పొగులుచుండి, రాజకార్యవశమున, తనకు తెలియకయే, అకస్మికముగ, పంచ వటిం జేరి, ఆ చుట్టుపట్లు చూచి, దాన పెలపడిన పుండువలె ఆ దుఃఖము ఆఁగక బాధింపఁగా, అట సీతచెలి వాసంతిమోము చూడనోడియు చూచుటకును, అటనుండి వాల్మీకియాశ్రమముచెంగట సీతనాయన జనకుని మొగమును, కులగురు వసిష్ఠుని మోమును, అమ్మ కౌసల్యమోమును అరుంధతిమొగమును వాల్మీకిమొగమును చూడవలసి వచ్చి చూచినందులకును చిత్తమున నైలక్ష్యముతో ఎంత బాధపడినాఁడు! ఋషులవాక్కులందలి నమ్మకము, పరశురామచిత్రమునం జూపబడిన వినయము, కైకచిత్రమును దాఁటిపోవు నౌదార్యము, తాను దుఃఖాన మునిఁగియుండియు యమునాతీరపుఋషులం గావ అప్పుడే శత్రుఘ్నుం బంపునట్టియు, మృతబ్రాహ్మణశిశుసంజీవనమునకై అప్పుడే ఇల్లువెడలు నట్టియు కరుణతోడి ప్రజారక్షణదీక్ష, లోకకల్యాణపరతచే అశ్వమేధముం దొడంగుట — ఈలక్షణములచే కరము ఒప్పారినాఁడు. పంచవటి పునర్దర్శనమున పూర్వసహవాస స్మృతిచే దుఃఖము ఆఁపుకొనరాక దుఃఖించి, మూర్ఛలపాలై తాను కంటగనని సీత స్పర్శలకు ఉల్లాసము పొందినాఁడు. చంద్రకేతునియందు మన సెఱిఁగియు, లవకుశు లందు మన సెఱుఁగకయు పొంగిన అతిమాత్ర (పుత్ర) వాత్సల్యమున కరంగినాఁడు. ఇట్లు దుఃఖాన మూడి ఆ వియోగమునను శిశుదర్శనమునను వివిధభావముల తేలు చుండిన తనకు పెద్దలందఱు కూడి అపవాదము తుడిచి సీతను కొడుకులను మరలఁ గూర్పఁగా ఆనందవారిధిలో ఓలలాడినాఁడు. దేవుఁడని చెప్పకయే, నరుఁ డనుచునే, రాముని భవభూతి యిట్లు మనసార భక్తిమీఱ పూజించినాఁడు.

సీతాదేవి — సీతాదేవి మన పురాణములం బ్రసిద్ధలైన పతివ్రతలలో అగ్ర గణ్య, ఏలన ఆమె లక్ష్మియవతారము గదా. మఱి యామాటను ప్రకాశముగా చెప్పక, కవి ఆమెను స్త్రీలయందు ఏయేగొప్పతనము మంచితనము ఉండవలయునో దానికెల్ల ఎల్లగా నిర్వహించి ఆరాధించినాఁడు. సీతకు రామునిమీఁది మరులు ప్రేమ అగాధము ప్రగాఢము అన్నాఁడు. అరుంధతిచేతను పృథివిచేతను భాగీరథిచేతను గొప్ప దేవతల చేత ఆమెకు సేవలు చేయించినాఁడు. వారికి పయితము ఆమెవలన పావనతాతిశయ మని చెప్పించినాఁడు. నాయన తన్ను విడిచి యూరికి పోయినందులకు, ఆయన పోకతప్పదని యెఱింగియు, సీత తాను ఆ స్నేహముచే ఖిన్నయైనది. చిత్రదర్శనమున తన్ను అపహరించికొనిపోయిన తరువాతి రామచరితపు బొమ్మలం గాంచి తనకై రాముఁడు అప్పు డెట్లు దుఃఖాన పొగిలినాఁడు గదా.

అని తా నందులకు కారణమగుటకు ఇప్పుడు దుఃఖించును. వదినె సీతకు మఱఁది లక్ష్మణునియెడ ప్రీతి; అదెంత చనువు! రాముని రాజధర్మానుష్ఠానమునకు తనకు ఎంతో సంతోషము. ప్రజారంజనమునకై వలయునేని తన్నుసయితము వ్యథ చెందక విడిచిపెట్టెద నని రాముఁ డన్నందులకు, రాణియైన తాను ఆయభినివేశమునకు మెచ్చుకొనును, ఎంత వినీత సీత! తనకు అంతయు రాముని యనుగ్రహము వలననే అని యనును. కష్టాలు అనుభవించినది కావున శూర్పణఖను బొమ్మలో చూచినను భయపడి దిగులుపడును. వివాసనమున, తాను దిక్కుతోఁపక గంగలో దూఁకియు ఆ గంగచేత అత్తగారుగాను పృథివిచే అమ్మగాను కాన్పుసేవలుపొందిన మహనీయ! అంతట చనుబాలువిడిచినమాత్రనె తన బిడ్డల వియోగమును పొంది, పది యేండ్లు ఎట్లెట్లు దుఃఖపడుచు నిరాశచెందియుండినదో! పంచవటిలో ఆకస్మికముగా రాముం గలసికొని ఆతని తెల్లబాఱి కృశించిన యాకారముఁ గాంచి, తనకైన యాతని యుల్లాపములు విని, ఆతని యాదుఃఖమును చక్కఁగా గ్రహించి, మూర్ఛితు నాతని తాఁకి తేర్చి, ఆతనితాఁకున అదృశ్యగా నున్న తాను సాత్త్వికోదయముచే మిక్కిలి యోపనిదై ఎట్లో తేఱును. తన ప్రతికృతినే ఆతఁడు యజ్ఞమున పత్నిగా పెట్టుకొన్నాఁడు అని వినఁగానే తన్ను ఆతఁడు త్యజించినందులకు ఇఁకను తనకు ఆతని మీఁద ఏమియు లే దనుకొనును. పతివ్రత, రామమయజీవిత, మరల ఎట్లు రాముం గలసికొందునా అని ఎదురుసూడఁదొడంగి, ఆ దేవతలును వాల్మీకియు అరుంధతియు తన్నుం గూర్పఁగా తన బిడ్డలతోఁగూడ ఆయనం గలసికొన్నది. సకలసద్గుణరాశియై ఉత్తమశీలమునకు పతాకయై గృహిణిగా, పతివ్రతగా, రాణిగా, సీత తనకు మఱి సమానలు లేనిది.

జనకరాజు :—జనకుఁడు వేదములందు పైతము తన పేరు తగిలియుండువాఁడు, రాజర్షి. యాజ్ఞవల్క్యమునివలన బ్రహ్మపారాయణము పొందినవాఁడు, దశరథునింట అసాధారణ గౌరవము పొందిన వియ్యంకుఁడు, మిత్రుఁడు. తక్కిన పట్టాభిషేకాగతులువీడ్కొన్నను తాను సీతారాములను వీడలేక వీడలేక ఎట్లో కడపట వీడ్కొలు వడపివాఁడు. తనయందు అమ్మాయికి ఎంతయో ప్రీతి. ఆమెను సడివెట్టి వివాసనముచేయుట విని, తా నెంతయు అవమానముచెంది, ఆ దుఃఖము పట్టరాక, ఇంట నుండలేక అడవులపాలై దేహము తొఱంగు తపఃప్రయత్నము లెన్నియున్నవో అన్నిటను దానిని మాడ్చుచుండినాఁడు. నిప్పు అదెంత. దానికిని 'నిప్పు' సీత అని ఆయననమ్మకము. కావున రాముని మీఁద కోపము చెందియుండి తన పాతమిత్రమును వాల్మీకిం జూడఁవచ్చి యట కలసికొన్న

కౌసల్యతో నిష్ఠురములాడి, రాముని శపింపఁబోయి, తాను దేవతంబోలె ఆరాధించు అరుంధతి యెచ్చరికచే రాముని ప్రజాపరతంత్రత రాజధర్మమార్గము గ్రహించి, కోపము మాని ప్రకృతిపొంది, లవుం జూచి లాలించి వాని సీతారాముల పోలికచే ఏమేమో మనసున తోఁపగా, దానిని విచారింప వాల్మీకిం గలసికొని అంతర్నాటిక చూచి సీత మహిమ నెఱింగి ఆ పునఃసంయోగముం గాంచి సంతసించినాఁడు గొప్ప కర్మఠ గృహస్థుఁడు.

వాల్మీకిమహర్షి :—వాల్మీకి గొప్ప కులపతి, వసిష్ఠునికి ఉద్ది, తనచేత గంగపెట్టిన సీత శిశువులను కుశలవులను సంస్కరించి పెంచి చదువులు చెప్పి, రామాయణము రచించి దానిని వారికి పాఠ నేర్పి, అందలి యుత్తరకథను సీతావివాసాత్మకమును సరసనాటకము చేసి, దానిని తన మహిమచే అటఁ గూడిన సకలస్థావరజంగమములతోడి యయోధ్య పౌరజాన పదుల యెదుట నాడించి నిజ మెఱిగించి, సీత మహిమం దెలిపి, ఆడికను ఆ యద్భుతోపాయమున అట్లు తుడిచి, ఇట్లంతయు నెఱవేర్చి సీతాపునఃసంయోగమును కుదిర్చిన లోకక్షేమదీక్షితుఁడు మహర్షి.

వసిష్ఠమహర్షి :—ఈయన రంగాన అగపడఁడు. మఱి రామునికి కులగురువై, లోకారాధనవ్రతమున పరాకుపడనీక ఎచ్చరిక చేసి, జరిపించుచు, దాన సీతావివాసనమును, భావిమేలునకై, అందులకు ఏకసమర్థుఁడగు రామునిచే చేయించినాఁడు. తాను కులగురువు. వారికి యోగక్షేమావేక్షకుఁడు, సీతకు ఈ నింద ఎప్పుడైన నంటునదే దానిని ఇప్పుడే తీర్చి, ఇఁక వారి యాయుఃశేషమున ఇట్టిదేదియు లేకుండ హాయి కలిగింపఁగోరి ఇట్లు తాను ప్రోత్సహించుట. అది యీ తీఱిన మార్గమున తీఱును. మంగళము కలుగును అని తా నెఱుఁగును. అరుంధతియు ఎఱుంగును. కౌసల్యకును సూచించినాఁడు గాని, ఆమె జననీసులభమగు పామరత్వముచే దుఃఖము ఆపుఁకొనఁజాలఁదాయెను.

అరుంధతి :—భవభూతి యిందు అరుంధతికి చేసిన పూజ కాళిదాస కుమారసంభవ ప్రతిబోధనవలనం గాఁబోలు. అందు అరుంధతి హైమవతిని అమ్మాయిని పెండ్లికూఁతును ఒడిలో కూర్చుండఁబెట్టుకొని లాలించుట మొదలైనది కలదు.

> తాం ప్రణామాదరస్రస్త జామ్బూనద వతంసకామ్
> అఙ్క మారోపయామాస లజ్జమానా మరున్ధతీ.—కుమా. VI-91.

కులగురుభార్య ప్రసిద్ధ పతివ్రత. ఈమె కౌసల్యకు ఎందును తోడు. సీతతనకు తనయవలెను శిష్యవలెను అత్యంతవాత్సల్యాస్పదము. నిజశుద్ధిచే తనకుపైతము పావనత

కలిగించున దని గౌరవాస్పదమును. ఆమె సీతకు దోహదము తీర్పవలసినదని రాము నికి సందేశము పంపి అవివాసమునకు ప్రేరకురాలైనదేమో. ఐనను ఇందు ఆమె యభిప్రాయమును వసిష్ఠుని యభిప్రాయమే. సీతమీఁది ప్రేమచే ఆమెలేని యయోధ్యకు పోనన్నది. పునఃసంయోగము ఇట్లగునని గంగమొదలగువారివలన రహస్యముగ విని యున్నదేమో. తాను స్వయముగాను ఎఱుంగఁగల మహిమశాలిని గదా. వాల్మీకి తపో వనమునకు కౌసల్యాదులను పిలుచుకొని వచ్చి చేరినది. ఆమె జనకునికి సాక్షాదుషోదేవి యంతటి వంద్య. ఆయనకు రామునిమీఁది కోపమును తత్త్వము చెప్పి ఈమె తీర్చి నది. చంద్రకేతునిం గూర్చి విని సంతసించియు, లవుం గాంచి లాలించియు నిజ వాత్సల్యము ప్రకటించినది. లవు నెఱింగియు కౌసల్యతో ఎఱుంగనని బొంకి నిపుణ ముగా సంయోగసిద్ధికై న రహస్యముం గాఁచినది. పునఃసంయోగమున దేవతలు పృథ్వీ భాగీరథులు తనకు అప్పగించిన సీతను పాతివ్రత్యదేవతయగు తాను, ప్రజల నదల్చి ఒప్పించి తన్నమస్కృతను రామునికి అప్పగించి వాల్మీకివలన కుశలవులను అటం జేర్చి వారింగూడ అప్పగించినది. కులగురువులైనందున వసిష్ఠారుంధతులు ఈ యిక్కట్టున ఇట్లు ఆ కులమును కాపాడినారు.

గంగాపృథ్వులు :—ఒకామె ఇక్ష్వాకుల యింటి యాడుపడుచు, ఒకామె పెద్ద యిల్లాలు! ఇరువురును సీతను కాపాడుచుండుఁడు అని రాముఁడు అలవోకగా పలికిన మాటకే తలయొగ్గి, ఆమెకు కాన్పుచేసి, పాలుమానిన యామె శిశువులను వాల్మీకికి అప్పగించి పునఃసంయోగమునకు పదకము కుదిర్చి నెఱవేర్చి రాముని మాటను రామునికి అప్పగించినారు. పూజ్యులు దేవతలు అయిన వీరికి సీత పూజ్యయు దేవతా తుల్యయు, వారికిని తాను పావనతాపాదకురాలు.

> "గురోర్నియోగాద్ వనితాం వనాన్తే
>> సాధ్వీం సుమిత్రాతనయో విహాస్యన్
> అవార్యతే వోత్థితవీచిహస్తైర్
>> జహ్నోర్దుహిత్రా స్థితయా పురస్తాత్." — రఘు - XV - 51.

అన్నమాట విని సీతను తన యెదుట విడిచిపోవ వచ్చిన లక్ష్మణుని జాహ్నవి తన యలలచేతులతో 'వలదు. అట్లు చేయకూడదు' అని వారించుచున్నట్లుండె నఁట. ఒక వేళ కాళిదాసుని ఈ రఘుశ్లోకముచే భవభూతి జాహ్నవిని ఇట్లిందొక పాత్రఁ జేయ నుద్దేశము పొందినాఁడేమో!

లక్ష్మణుఁడు :—ఈ రాముతమ్మునికిని సీతమఱఁదికిని వారికి శుశ్రూష చేయుటే పని. ఎదురాడక వారు చెప్పిన పని చేయవలసినది! నాయన యూరికిపోయి

నందులకు ఖిన్నమైన గర్భిణిసీతకు వినోదమునకై ఆసమయమునకు సరిగా చిత్తరువులం దెచ్చి యొకటొకటిగా చూపి చెప్పుచుండెను. ఆమెకు గంగను చూడఁ బోవ తేరును ఆయితముచేయు మని రాముఁడు అతనితోడనే చెప్పును. అంతట సడి విన వచ్చిన తర్వాత ఆ వ్యాజముననే సీతం గొంపోయి అడవిలో దిగనాడుమనియు రాముఁడు అతనికే చెప్పి పంపును. వాల్మీకియాశ్రమము చెంగట కుశలవులం గాంచి. వారియందు అన్నపోలికలను కనిపట్టి ఇంకను ఇతరసందర్భములం దలపోసి వారు రాముని కొడుకులగుదు రని యూహించును. ఆటను చూచుచు చిత్తవికారములు మూర్ఛలు చెందు రామునికి తాను తోడు. పునఃసంయోగముం గని, ఆ దినము అట్లు రథాన కొనివచ్చినవాఁడును గదా తాను అను సిగ్గుతో సీతకు నమస్కరించును. ఆమె దీవన యొసంగును.

చంద్రకేతుకుశలవులు:___ఈ రఘుకుమారు లందఱును ఇంచుమించుగా తుల్యవయస్కులు తుల్యలక్షణులు. (నిజముగా ఒకయింటిబాలురే కదా). ఒక్క తెఱంగు రాజలక్షణములు వినయాలంకృతమైన పౌరుషాతిరేకము, పలువు రొక్కని పైకొనఁగూడదు, రథి పాదచారిం దాఁకకూడదు అను వీరధర్మముల యనుష్ఠానము, పరప్రతాపమును ఓర్వమి, పగవాని గొప్పగుణములు మెచ్చుకొనుట మొదలగు సద్గుణములు గలవారు. చంద్రునికి లవుం జూచినను, లవునికి చంద్రుం జూచినను కౌఁగిలింపం గోరికయే కాని కొట్టం గోరిక కలుగదు. రామప్రతాపమున ఇంచుక భిన్నాభిప్రాయము గలిగి, దాన చంద్రలవులు ఒండొరులపై కోపము రేఁగి తలపడి యొండొరులఁ గొట్టుకొందురు గాని, ఒకరి దెబ్బ యొకరికి తగులనీకుండ ప్రతిక్రియ చేయుచునే యుండి రామదర్శనమునను గొంతువినియు పోరు మానుదురు. మఱి ఆ జ్ఞప్తియే లేక సఖ్యపడుదురు. చంద్రకేతువు లవుంగూర్చి గొప్పగా రామునికి సిఫారసు చేయును. లవుఁడు దర్శనమాత్రమున రామునితేజమునకు పరవశుఁడై లొంగి మ్రొక్కి రామలాలితుఁ డగును. నాయన యని దగ్గఱఁజేరును. అట్లే తరువాత కుశుఁడును. జనకునికి లవమహిమలో వాని వినయము తొంగిచూచుచుండును. రామునికి లవకుశులలో వినయముతోఁగూడ ఆ నడక నిలక యాసనంబులలో సామ్రాజ్యలక్షణములు తోఁచును, దేహమున పెట్టుకొనని నగగా పుట్టు చక్కఁదనము అగపడును. వారిలో తక్కినవారిని కుశుఁడు అన్నిట మించినట్లు తోఁచును.

వాసంతి :___ఈమె జనస్థానవనదేవత. సీతకు నెచ్చెలి. రామునికిని. వారితో చాల చనువుగలది. ఆత్రేయికి అతిథిపూజ అతిశ్లాఘ్యముగ అత్యాదరముతో

గావించును. సీతకు కలిగిన చెట్టను విని మిక్కిలి దుఃఖించును. లక్ష్మణునికి కొడుకు పుట్టియున్నాఁ డని విని ఎంతేని సంతసించును. రాముఁడు మరల పంచవటికి వచ్చునని విని చాల సంతోషించును. 'రానీ, ఆయనను అడిగెదను సీతకు ఇట్లేల చేసితివిః' అని యడుగుటకు సిద్ధముగానున్నట్లుండును. సీత గున్నయేనుఁగుమీఁద తాను ప్రేమ గొనును. దీనిని ఎవరు కాపాడుదురా అని వాపోవును. రాముని కలసికొని అడుగనే యడుగును "సీతకు అట్లేల కావించితివి" అని. ఆమె యేమైనదో చెప్పవయ్య అని గ్రుచ్చిగ్రుచ్చి యడిగి చాల నిష్ఠురములాడును. రామునికి వనమునకుం దగిన యాతిథ్యము గావించి అచటిచోట్లు చూపి అతని దుఃఖమును తాను పంచుకొనుచుండి. దీనిని ఎట్లు తీర్తును నేను అని యాందోళన చెంది అతఁడు ఇఁక పోవుదు ననఁగా. సరే యని, ఇంతటియాయన యీదుఃఖమును పెద్దలు మాన్పఁగూడదా అని ఆశంసించును.

శంబూకుఁడు :— ఇతఁడు శూద్రుఁడుగాను తాపసిగాను రంగాన అగపడడు. మఱి రాముని కత్తిదెబ్బకు దివ్యపురుషుఁడై పోయి అగపడును. రామునిదెబ్బకు జడియక, అడ్డక, ఆ జగత్పతిని చూచినమాత్రకే తన తపస్సుకు వర మీవచ్చిన దేవతగా తలఁచి తల వంచి అభ్యుదయము పొంది "సత్సఙ్గజాని నిధనా న్యపి తారయన్తి" అను సూక్తిం బలికి, రామునికి అగస్త్యాశ్రమమునకు పోవను తోడై తన దివ్య లోకమునకు పోవును.

## 30 - నాటకలక్షణము - ఇంచుక

పుఱక్కారుపండితులు తమ నటీకా శాకుంతలమువ సద్యఃప్రకృతోపయోగము నకై ఇంచుక నాటకలక్షణము కూర్చినారు. శ్రీ గణపతిశాస్త్రులవారును అట్టిది తమ స్వప్నవాసవదత్తమునకు కడపట చేర్చినారు. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు తమ యుత్తరచరితోపోద్ఘాతమున అట్లు చేర్చియున్నారు. అది కొంత మదీయ శాకుంతల వ్యాఖ్యోపోద్ఘాతమున ఉద్ధరింపఁబడినది. ఇందును దానిని అనుసరించెదను.

"దృశ్యము శ్రవ్యము అని కావ్యము రెండు విధములు. అందు దృశ్యము అభినయింపఁబడును. దానికే నటునియందు రామాదిరూపము నారోపించుటచేత రూపకమని నామాంతరము. అభినయ మనఁగా అవస్థను అనుకరించుట. రూపకము ఉపరూపకము అని రూపకము రెండువిధములు. అందునాటకము ప్రకరణము భాణము ప్రహాన

నము డిమము వ్యాయోగము సమవకారము వీథి అంకము ఈహామృగము అని రూపకము పది విధములు. పదిరూపకములలో ఉ. రా. చ. నాటకమను తెగలోనిది. [కడమ రూపకములకును ఉపరూపకములకును దానిదానికి చెప్పఁబడు విశేషము దప్ప సామాన్యలక్షణ మెల్ల నాటకమునకు ఎట్లో అట్లె ఎఱుఁగవలయును.]

నాటకమునకు లక్షణము ఎట్లన :— నాటకమున ఇతివృత్తము ప్రసిద్ధమైనది. అయిదు సంధులు ఉండును. అది సుఖదుఃఖములచేత సముద్భవించునది. నానా రసములచే నిండినట్టిది. అందు అంకములు అయిదుమొదలు పదివఱకు ఉండును. నాయకుఁడు ప్రఖ్యాతవంశుఁడు రాజర్షి ధీరోదాత్తుఁడు ప్రతాపవంతుఁడు గుణవంతుఁడు దివ్యుఁడేని దివ్యాదివ్యుఁడేనియుఁ గావలయును. శృంగారమే గాని వీరమే గాని ఒక్కఁడే అందు ప్రధానరసముగా నుండును. కడమ రసము లన్నియు అంగములు (అప్రధానములు)గా నుండును. కార్యనిర్వహణమున అద్భుతరసము. కార్యమందు పనివడు పురుషులు నలువురేని అయిదుగురేని ముఖ్యులుగా నుందురు. దానిని గోపుచ్ఛాగ్రసమాగ్రముగా నిర్మింపవలయును.

అంకలక్షణము :—అంకమున నాయకుని చరితము ప్రత్యక్షముగా చూపఁబడును. రసభావములు వెలుంగుచుండును, శబ్దార్థములు అగూఢముగాను గద్య వాక్యములు చిన్నవిగాను ఉండవలయును, ఏదే నొక యవాంతర ప్రయోజనము సమాప్తి చెందవలయును. బిందువు కొంచెము అంటి యుండవలయును, కార్యములు పెక్కుగ నుండఁగూడదు. బీజమునకు సంహారము కూడదు. నానా సంవిధానములు వలయును. పద్యములు మిక్కుటముగా నుండఁగూడదు. ఆవశ్యక కార్యములకు భంగము కలుగఁ గూడదు. కథ అనేక దినములు పట్టునదిగా నుండఁగూడదు. నాయకుఁడు ఆసన్నుఁడుగా నుండవలయును. పాత్రములు ముప్వురు నలుగు రుండవలయును.

ఈ వక్ష్యమాణములు అందుం గూడవు—దూరమునుండి పిలుచుట, చంపుట, యుద్ధము రాజ్యము దేశము మొదలగువానికి ఉపద్రవము, పెండ్లి, భోజనము, శాపము, ఉత్సర్జనము, మరణము, రతము, దంతక్షతములుసేయుట, నఖక్షతములు సేయుట, ఇట్టి లజ్జాకరములగు నితరకృత్యములు, శయనించుట, మోవియానుట ఇత్యాదులు, నగరాదులను ముట్టడించుట, స్నానమాడుట, మైపూఁత పూసికొనుట - ఇవి అంకమందు చూపఁగూడదు. అంకము మిక్కిలి దీర్ఘముగా నుండఁగూడదు, దేవీ పరిజనాదులయు మంత్రులయు వణిజులయు భావరసోద్భవములైన ప్రత్యక్ష చిత్రచరిత్ర

ములతోఁ గూడినదై యుండవలయును; దాని యంతమున పాత్రము లందఱును విష్క్రమింపవలయును.

రంగద్వార ప్రస్తావనాదులు కలదై బీజమును ఫలమును గలదై ఒక యంకము గర్భములోపల ప్రవేశించినదైన మఱియొక యంకము గర్భాంక (Interlude) మనఁబడును. ఉదా: బాలరామాయణమందలి సీతాస్వయంవరము, ఉత్తరరామచరితయందలి కుశలవ జననభాగము, మదీయ ప్రతాపరుద్రీయమునందు అష్టమాంకమున ఓడలో సుల్తానుమ్రోల వర్తకు లాడించిన భాగము.

నాటకమందు ముందుగా పూర్వరంగము, అటుపిమ్మట సభాపూజ తర్వాత కవిని పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్యవస్తువుకంటె ముందుగా రంగ విఘ్నోపశాంత్యర్థము నటులుగావించునట్టిది పూర్వరంగ మనఁబడును. దీని యంగము లలోఁ ముఖ్యమైనది నాందియనునది. ఆశీర్వచనముతోఁ గూడినట్టిది దేవద్విజనృపా దుల స్తుతి నాంది యని చెప్పఁబడును. అది మంగళకరములైన శంఖ చంద్ర కమల చక్రవాక కైరవముల వచించునదియు, ఎనిమిదేని, పండ్రెండేని పదములు గలదియుఁ గావలయును. ప్రాయికముగా నాటకములలోఁ నాంది యని తలంపఁబడుచున్నట్టిది పూర్వరంగముయొక్క రంగద్వార నామకమైన యంగము గాని నాంది గాదని కొందఱ మతము.

సూత్రధారుఁడు మధురములును కావ్యార్థ సూచకములును అగు శ్లోకములచేత రంగమును ప్రసన్నముం గావించి రూపకనామమును కవినామ గోత్రాదులను కీర్తింప వలయును. భారతీవృత్తి నవలంబింపవలయును. ప్రాయికముగా నేదే నొక ఋతు వును ప్రస్తావింపవలయును. భారతి యనఁగా సంస్కృత ప్రాయమును నరాశ్రయము నగు వాగ్వ్యాపారము.

సూత్రధారుఁడు నటితోనేని విదూషకునితోనేని పారిపార్శ్వకునితోనేని, కూడు కొన్నవాఁడై తమ కార్యములనుండి యుత్పన్నములై ప్రస్తుతమును ఆక్షేపించునవైన చిత్రవాక్యములచేత చేయు సల్లాపము ఆముఖమనియు ప్రస్తావనయనియు చెప్పఁ బడును.

ఏవస్తువు నాయకునికి అనుచితమేని, రసమునకు విరుద్ధమేని, అగునో దానిని వదలవలయును. వేఱువిధముగానేని కల్పింపవలయును.

అంకములయందు చూపరానిది అయినను అవశ్యము తెలుపవలసినదియగు కథను అర్థోపక్షేపకములచేత చెప్పవలయును. అర్థోపక్షేపకములు అయిదు-విష్కంభ ప్రవేశక చూళి కాంకావతా రాంకముఖములు.

విష్కంభకము భూతభవిష్యత్కథాంశములను తెలుపుచు, సంక్షిప్తార్థముగా నుండును, అంకమున కాదిలో చూపఁబడును. అది ఒకరో ఇద్దఱో మధ్యపాత్రము లచే జరుపఁబడినయెడల శుద్ధ మనఁబడును, నీచమధ్యపాత్రములచే జరుపఁబడినచో సంకీర్ణ మగును.

ప్రవేశకము నీచపాత్రములచే నీచవాక్యములచేఁ జేయఁబడును. రెండంకముల నడుమ వచ్చును. మిగత లక్షణము విష్కంభకమున కెట్లో అట్లె.

చూళిక యనునది పరదాలోనివారు చేయునట్టి యర్థసూచన.

అంకాంతసూచిత పాత్రములు ఆ యంకమునకు తెంపులేనియట్లుగా నే పై యంకమును తొడంగుట అంకావతార మనఁబడును.

ఒక యంకములో అన్ని యంకముల సూచనయు సేయఁబడునేని దానిని అంకముఖ మందురు.

బీజ బిందు పతాకా ప్రకరీ కార్యములు అయిదు అర్థ ప్రకృతులు.

ఇంచుకగా ఉద్దేశింపఁబడి బహుప్రకారముల వ్యాపించునది ఫలమునకు ప్రథమ హేతువు బీజ మనఁబడును.

అవాంతరకథ విచ్ఛేద మొందినప్పుడు దానిని పై కథతో సంధానము చేయు నట్టిది బిందువు.

వ్యాపియగు ప్రాసంగికవృత్తము పతాక యనఁబడును.

ప్రాసంగికమై ఏకదేశస్థమగు చరితము ప్రకరి.

ఏది సాధింప నపేక్షితమో దేనికొఱకై యారంభమో, దేనిసిద్ధిచే సమాప్తియో అది కార్యమనఁబడును.

ఫలార్థులు తొడంగిన కార్యమునకు అవస్థలు:— ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమములు.

వరుసగా ఈ యైదవస్థలును మున్నుచెప్పిన యర్థప్రకృతులతో యోగముం బొందుటచేత ఇతివృత్తము అయిదు భాగము లగును. అవి క్రమముగా ముఖ ప్రతిముఖ గర్భ విమ ర్శోపసంహారములని అయిదు సంధు లగును.

ఉ. రా. చ. యందు 1 అంకమున ముఖసంధి. 2-3 అంకములందు ప్రతిముఖ సంధి, 4-5 అంకములందు గర్భసంధి, 6 అంకమున విమర్శసంధి, 7 అంకమున నిర్వహణసంధి.

ఇందులకు ఇంచుక వివరము :

"ఎచ్చట నానావస్తురసములను కలిగించుచు బీజసముత్పత్తి ప్రారంభముతో కూడుకొని యుండునో అది ముఖము." అనఁగా బీజారంభసంయోగము ఇతివృత్త ప్రథమఖండము ముఖసంధి. నాయకుల పునఃసమాగమము ఈయితివృత్తమున ఫలము. అందులకు ప్రథమహేతువు – బీజము—ఋషిదేవతానుగ్రహము. 'సర్వథా దేవా ఋషయశ్చ స్వస్తి కరిష్యన్తి' అని. అట్లే కవిభూషణ కుమారతాతార్యవ్యాఖ్యలోను వాధూల వీరరాఘవార్య వ్యాఖ్యలో నయితము చెప్పఁబడినది. సీతకు పరగృహవాసదూషణ లంకాసముద్రతీరమున ఇఁక నోఁకకుండునట్లు విశ్శేషముగ అగ్ని శుద్ధ్యాది దివ్యసాధనములచే కడిగివేయఁబడినది. ఐనను దానివి ఎఱుఁగనివారివలన ఆ నడి మరల పుట్టకమానదు. దానిని ఇఁక నెన్నఁటికిని ఎట్లును సీతకు లేకుండచేయవలయును. అట్లు చేయఁబడిన సీతతో రాముఁడు పునఃసంయోగముపొందుట ఈ నాటకమున ప్రధానఫలము. దానికి ప్రధానహేతువు ఋషిదేవతానుగ్రహము (బీజము) విత్తనము వసిష్ఠారుంధతీ ఋష్యశృంగాదుల యాశీర్వాదమునను తత్ప్రజానురంజన ప్రోత్సాహనమునను లెస్సగా నాటినట్లయి, అది నలుదెసల విచ్చి మొలకెత్తునట్లు జృంభకానుగ్రహ భాగీరథీవసుంధరాప్రార్థనాదులచే లెస్సగా అరంభమైనది. సీత వివాసనము పొందినది, సీతారామవియోగము కలిగినది. ప్రథమాంకము ముగిసినది.

"ముఖసంధిలో ఉంపఁబడినట్టిది ఫలప్రధానోపాయము అగపడియు అగపడవి యట్లు ఉద్భేదముం బొందుట ఎచటనో అది ప్రతిముఖము." అనఁగా బిందుప్రయత్నసంయోగము ఇతివృత్తద్వితీయఖండము ప్రతిముఖము. వాసంత్యాత్రేయుల యాతిథ్యాధ్యయన ప్రత్యూహాది ప్రస్తావములచే తెగినట్లయిన కథ 'స ఏష తే వల్లభబన్ధువర్గః' ఇత్యాది యాత్రేయిస్మరణచేతను 'కిన్నామ దణ్డ కేయమ్' అను రాముని యభిజ్ఞానముతోడి సీతాస్మరణచేతను ఆ తెంపు అదుకఁబడి ఫలమునకైన ప్రయత్నము దండిగా సమకూడినది రామునికి అగస్తిలోపాముద్రల యాశీర్వాదము. పంచవటిని ఒంటరిగాఁ గన్న యేడ్పు, సీతకు భాగీరథి తిరస్కరణి ననుగ్రహించి, ఒక తెలుంగు రామదర్శన సంయోగములం గూర్చి, అప్పటి రామచిత్తపరిజ్ఞానముచే సీతకు పరిత్యాగశల్యమును తివిచి ఆమెను పునఃసంయోగోత్సుకం జేయుట. అట్లే రాముఁడు సీతాప్రతికృతియైన

చూచి వినోదించుకొనఁ గోరుట. 'అవని రమరసిద్ధః సార్ధ మస్మద్విధాభిః' అను మొదలగు వాసంతీతమసల యాశీస్సు. ఇదెల్ల ఫలప్రాప్తికి తొందరతో కూడిన ప్రయత్నమే. ఇట్లు రెండవ మూఁడవ యంకములు ముగియును.

'ఫలప్రధానోపాయము మున్ను ఒకపాటి యుద్భేద మొందినట్టిది ఎచట సముద్భేదము (=నిండుగా అంకురించుటయు), మాటిమాటికి హ్రాసము (=అడ్డు పొందుటయు) అన్వేషము (=వెదకుటయును) కలదిగా నుండునో అది గర్భసంధి.' అనఁగా లవ(కుశుల) ప్రాసంగిక వృత్తము (నిర్వహణపర్యంతవ్యాపి) పతాక. దానికి ప్రాప్త్యాశతో యోగము గర్భము, ఇతివృత్త తృతీయఖండము. 'కిం న స్మరసి య దవోచ దృశ్యశృఙ్గాశ్రమే యుష్మాకం కులగురుః? త దుపజాత మేవ, కిన్తు కల్యాణోదర్కం భవిష్యతి' అను నరుంధతి వాక్కు, అవిర్భూతజ్యోతిషాం' ఇత్యాదియు ఆమె వాక్కు, వెంటనే లవదర్శనము అతనియందు సీతారాములపోలికలు ఎక్కువగా కనిపట్టఁబడుట- 'అతిగమ్భీర మేత త్కిమపి భవిష్యతి' అని జనకుఁ డనుకొనుట, 'రఘువంశస్యాప్రసిద్ధః ప్రరోహః' అని చంద్రకేతు వనుట, లవుని జృంభకాస్త్రప్రయోగము—ఆయుభయులకు యుద్ధోత్సాహమును పరిరంభణాభిలాష ప్రమింగుట, సుమంత్రునికి లవునందు రాముపోలికలు అగపడుట, కౌసల్య 'అతిక్రాన్తో మనోరథః' అనుట, సుమంత్రుఁడు 'లతాయాం పూర్వలూనాయాం' ఇత్యాది యనుట. ఇవన్నియు ఉపాయశంకలును, అపాయశంకలును. ఇట్లు నాలుగవ యైదవ యంకములు ముగియును.

'ఎందు ముఖ్యఫలోపాయము గర్భసంధియందు ఏపాటి యుద్భిన్నమైనదో అంతకన్న అధికముగా నుద్భిన్నమో, శాపాదులచేత సవిఘ్నంబునో అది విమర్శసంధి.' అది ప్రకరి-చంద్రకేతుని యేకదేశవృత్తియగు ప్రాసంగికచరితము—నియతాప్తితో యోగముఁబొందుట విమర్శ. ఇతివృత్తముయొక్క చతుర్థ ఖండము. మేధ్యాశ్వరక్షక సేనానాయక చంద్రకేతు చరితము ద్వితీయచతుర్థాంకములలోనే అంకురము పొందినట్టిది పంచమాంకమంతటను షష్ఠారంభమునను వ్యాపించినట్టిది, ఏకదేశవృత్తియు ప్రాసంగికమును ప్రకరి. దానికి నియతాప్తితో సంయోగము. చంద్రకేతువు లవుని తనకు ఏమేమో అనురాగాత్మకమనోభావములు కలిగించినవానిని దివ్యాస్త్రయుద్ధమునను సరితూగినవానిని తన యేకాంతప్రేమభాజనమును నాయకప్రీత్యవలోకనమునకు సిఫారసు చేసి అప్పగించి నివర్తిల్లును. శ్రీరామలవకుశుల సమాగమము' రామునిమనసులో విమర్శ, లవకుశులయందు రఘువంశీయుల యసాధారణ లక్షణములును, తనయు సీతయు పోలికలును, సామ్రాజ్యసూచక సాముద్రికాది లక్షణములును,

చిత్రదర్శనమప్పటి జృంభకాస్త్రాభ్యనుజ్ఞ ఫలించినదేమో అన్న తలంపును, ఆ వాల్మీకాశ్రమసామీప్యమును సీతగర్భగ్రంథి రెండుగా నుండుటను తాను కనిపట్టిన జ్ఞప్తియు, అంతలో కుశలవులు సీతయని నామగ్రహణము చేయఁగా వారు సీతకొడుకులుకారేమో అనుకొనుట, తద్దర్శనమున సొంత కొడుకులం గాంచిన నిర్వృతితో తన హృదయము పారిప్లవతం జెందుట - మొదలగు తలఁపోతలు. ఆఱవయంకము ముగియును.

"ఎందు బీజమును ముఖాదులగు నితివృత్తభాగములును తమతమ తావుల నెలకొల్పఁబడినట్టివి ఏకప్రయోజనముం బొందింపఁబడునో అది నిర్వహణము." కార్య ఫలాగమసంయోగము నిర్వహణము. ఇతివృత్తపంచమ-అంతిమ-ఖండము. సీతారామ సమాగమము అను ప్రధానఫలమునకు అనుగుణముగా కార్యము అంతర్నాటకసన్నాహము, దానికి భూతగ్రామము నెల్ల అట సన్నిధిసేయించుట అట ప్రవర్తిల్లుట మొదలగు సిద్ధిసాధనములు సమకూడుట—ఇదెల్ల సమకూర్పఁబడినది. ముఖసంధి మొదలు అన్నిట చెదరియున్న కథాంశములును దానికి అంగముగా ఉపసంహరణము పొందినవి. దేవమనుష్యతిర్యగాది సకలభూతగ్రామము నెదురను అయోధ్యాపౌరజానపదుల యెదురను వాల్మీకి సత్యవాక్కులయంతర్నాటకమూలమునను భాగీరథీ పృథ్వ్యరుంధతుల ప్రత్యక్ష వాక్కులచేతను సీతశుద్ధి నిర్ణయింపఁబడినది. ఋశ్యశృంగాశీర్వాదము బడి పుత్రపూర్ణోత్సంగయగు సీత పునఃసమాగమము, సమగ్రముగా, మఱెన్నటికిని ఏసేగియు కలుగకుండునట్లు సుస్థిరముగా, ఇంతకన్నను వింకేమి కావలయునన్న తృప్తి కలుగునట్లుగా వాల్మీకియాశీర్వాదముతో నెఱవేఱినది. ఏడవ యంకము ముగిసినది. నాటకమును పరిసమాప్తి చెందినది.

కవిభూషణ కుమారతాతార్యులు సూచించిన యిందలి పంచసంధుల నిర్వాహపు సంగ్రహము :—

'సర్వథా దేవాః ఋషయశ్చ స్వస్తి కరిష్యన్తి బీజన్యాసా (౧) దుపక్షేపో నామ ముఖసన్ధేః ఆద్య మఙ్గమ్.' పునఃసమాగమరూపక్షేమం సమ్పాదయిష్యన్తి. ఇదమేవ అస్మిన్ నాటకే బీజమ్. 'స్తోకోద్దిష్టః కార్యహేతు ర్బీజమ్, విస్తార్యనేకథా' 'కార్యస్య' ప్రకృతే నాయకయోః సమాగమస్య పరమప్రయోజనస్యహేతుః కారణమ్. పశ్చా దనేకధా తమసాది సాహాయ్యకేన ప్రాచేతసాదీనాం లోకప్రత్యాయనానుగ్రహాత్ బీజస్య బహూకరణమ్.

'ఏవ మనురక్తప్రకృతి రార్యపుత్త్రః న మాం స్వతో మోక్తుం శక్నుయాత్; కిన్తు ధర్మనిత్యత్వా దేవ, తత స్తత్త్వే గృహీతే పరిగృహ్ణీయా దితి

శక్యం ప్రత్యాశయా సముచ్ఛ్వసితుం.' ఇతి భావిని విరహే ఇదం సీతాయా ఆశ్వాసే బీజమ్.

అత్ర గురుజనానుగ్రహ బీజస్య బహూకరణాత్ (౨) పరికరః ముఖసన్ధ్యఙ్గమ్.

'ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థో ఽనుధావతి'-- ఇతి ఋషిశ్రేయో వితరణబీజస్య పరినిష్పత్తేః (౩) పరిన్యాసః సన్ధ్యఙ్గమ్.

'అనుగృహీతాః స్మః' - ఇతి 'బీజాగమః సమాధానమ్' ఇతి (౪) సమాధానమ్.

'యది వా జానకీ మపి'— ఇతి వర్త్రిష్యమాణ జానకీత్యాగస్య ఏతత్ ప్రతిజ్ఞయా భావిసూచనమ్.

తపస్తేజ ఏవ అస్మా న్నప్రరూపే ణానుసర తీతి దేవతానుగ్రహబీజవిష యాశ్చ ర్యావేశాత్ (౫) పరిభావనా సన్ధ్యఙ్గమ్.

'జనకానాం రఘూణాం చ సమ్బన్ధః కస్య న ప్రియః ఇతి త్రైకాలికజ్ఞాన శాలిభి రుపపాదితే అస్మిన్ సమ్బన్ధే భద్రాశంసనం తదధీన మే వేతి ఋషిశ్రేయో వితరణబీజస్య ప్రకాశనాద్ (౬) ఉద్భేదః ముఖసన్ధ్యఙ్గమ్. సన్ధ్యఙ్గానాం క్రమాతిలఙ్ఘన మాచార్యానుమత మేవ.

తాపసీవనదేవతాతిథ్యప్రస్తావేన విచ్ఛిన్నస్య బీజస్య పున రనుసన్ధానం (బిన్దుః).

సీతాసుత దేవతా (భాగీరథ్య) భ్యుపపత్తి వర్ణనాత్ అయం ప్రతిముఖసన్ధిః 'లక్ష్యాలక్ష్య స్యోద్భేద స్తస్య ప్రతిముఖం మతమ్.' రామాపత్యత్వేన వాల్మీక్యాదిభిరభి లక్ష్యయో రితరైరనభిలక్షణీయయోశ్చ కుశలవయో రుపనయనాది కథా ముద్భేదాత్.

దణ్డకాయాం చిరపరిచిత వస్తు ప్రత్యభిజ్ఞాన కథనాత్ (౧) పరిసర్పః ప్రతిముఖ సన్ధ్యఙ్గమ్.

'రామభద్ర! అలం త్వయాః ఇతి ప్రముఖనిష్ఠురవచనం (౨) వజ్రం ప్రతి ముఖాఙ్గమ్.

'భగవత్యరున్ధతి నాహం వధూవిరహితాం' ఇత్యాదినా అరున్ధత్యాః సీతాను రోధేన, కౌసల్యాదీనాం అరున్ధత్యనుసరణేన (౩) 'పర్యుపాసనం' ప్రతిముఖసన్ధ్యఙ్గమ్.

'సీతాప్రతికృతికరణమ్' అనేన రామస్య దేవ్యా మనురాగప్రకాశనాత్ (౪) ప్రగమః' ప్రతిముఖాఙ్గమ్.

ఏతేన సీతాయాం రామస్య రత్యవిచ్ఛేదజ్ఞానేన వాసన్త్యా స్తస్మిన్ అరత్యుప శమనాత్ (౫) 'శమో' నామ ప్రతిముఖాఙ్గమ్.

అత్ర వామదేవ చన్ద్రకేతు యోధానాం వర్ణానాం కీర్తనాత్ చతుర్వర్గ విర్వర్ణ నమ్ (౬) 'వర్ణసంహారః' ప్రతిముఖాఙ్గమ్.

శమ్బూకే ప్రహారోక్త్యా 'వ్యవసాయా దచలనం స్థైర్యం'. అత ఇదం (౭) 'విధూతం' నామ ప్రతిముఖాఙ్గమ్. 'అవిష్టవస్తువిక్షేపో విధూతం' ఇతి

'త్వయా సహ విహర్త్స్యామి వనేషు మధుగన్ధిషు ఇతి చారమత్రైవ ...' ఇ త్యత్ర సీతాప్రణయాతిరేక స్మరణాత్, రామస్య తత్సమాగ మాశాయాః ప్రకాశనాత్. (౮) విలాసో నామ ప్రతిముఖసన్ధ్యఙ్గమ్. 'రత్యర్థేహా విలాసః స్యాత్.' ఇతి.

పఞ్చవట్యాః సుఖదుఃఖహేతుత్వ వర్ణనాత్ (౯) 'విధానం' సన్ధ్యఙ్గమ్ - 'విధానం సుఖదుఃఖకృత్' - ఇతి.

'ఏహి సమ్భావ యాస్మాన్. అశ్వమేధాయ సజ్జో భవిష్యసి' - ఇ త్యత్ర ఋషి శ్రేయోవిధానరూప బీజస్య వ్యాపారపర్యన్తత్వ ప్రతీత్యా (౧౦) 'ప్రయత్నః'. 'ప్రయత్న స్తు తదప్రాప్తౌ వ్యాపారో ఽతిత్వరాన్వితః' - ఇతి.

పూర్వాఙ్కే వాసన్త్యాత్రేయీసమాగమే గోపితం అనన్తరసీతా వృత్తాన్తం భావినం సీతారామయో రేకత్రసమాగమం చ ప్రతిపాదయన్.

> 'ఫలప్రధానోపాయస్య ప్రాగుద్భిన్నస్య కిఞ్చన
> గర్భో యత్ర సముద్భేదో హ్రాసాన్వేషణవాన్ ముహుః'

ఇత్యుక్త లక్షణ ప్రాప్త్యాశా పతాకయోః సన్ధిరూపం గర్భసన్ధిం అంశేన ప్రపఞ్చ యతి. "పీచీవాతైః శీకరక్షోదశీతైః" ఇతి. ఈదృశ రామ సఞ్జీవనోపయోగి విలమ్బా దానా యైవ తస్య స్వాశ్రమప్రాపణ మితి ఋషిశ్రేయో వితరణరూప బీజస్య అన్వేష ణాత్ గర్భసన్ధి రయమ్

'ఈదృశానాం విపాకోఽపి' ఇత్యాదిః అయం ఋషిదేవతానుగ్రహ బీజస్య పరామర్శాత్ 'బిన్దుః'.

'గృహాచారచ్ఛద్మనా' ఇత్యాది రామ సీతా సాన్నిధ్యోపయోగితయా ఏత దాచార ఛద్మాచరణాత్ (౧) 'అభూతాహరణం' గర్భసన్ధ్యఙ్గమ్.

'దిష్ట్యా అపరిహీణరాజధర్మః' ఇత్యుత్కర్షప్రతిపాదనాత్ (౨) 'ఉదాహృతి' ర్నామ గర్భసన్ధ్యఙ్గమ్. 'ప్రస్తుతోత్కర్షాభిధాన ముదాహృతిః' ఇతి.

అత్ర సీతాస్పర్శే హరిచన్దనద్రవాది వితర్కణాత్ (౩) 'రూపం' నామ గర్భా ఙ్గమ్. 'రూపం వితర్కవ ద్వాక్యమ్' - ఇతి.

'అనభ్యనుజ్ఞాత సన్నిధానేన కోపిష్యతి' ఇతి అత్ర శఙ్కాత్రాసయో రుపనిబన్ధ నాత్ (౪) 'సమ్భ్రమః' గర్భాఙ్గమ్. 'శఙ్కాత్రాసౌచ సమ్భ్రమః' ఇతి.

'క్వాసౌ దురాత్మా!' ఇతి సహసోత్థాన మిదం (౫) తోటకం. 'రోషసమ్భ్రమ వచనం తోటక మితి.

'ప్రకృష్ట మైశ్వర్యం మన్దాకిన్యాః' ఇత్యాది (౬) 'సఙ్గ్రహో' గర్భాఙ్గమ్. 'ప్రస్తుతోపయోగి సమాధాన వాక్య' మితి.

అయం తావ దీదృశః, తౌ పునః కుశలవౌ కీదృశౌ? ఇతి కలభవృద్ధ్యా కుశలవ వృద్ధ్యనుమానాత్ (౭) 'అనుమానం' గర్భాఙ్గమ్.

'అనురుధ్య ముగ్ధాం తా మేవ — శాన్త మథవా' ఇ త్యత్ర 'తా మే వే'తి సాకాఙ్క్ష స్యాపి వాక్యస్య నిష్ఫలత్వజ్ఞానేన త్యాగాత్ (౮) 'వాక్కేళి' ర్నామ వీథ్య ఙ్గమ్. తస్య యథాసమ్భవం అఙ్కేషు ప్రయోగానుమతిః.

'బద్ధ స్తయా కాతర్యా దరవిన్దకుట్మలవిభః' ఇత్యాది ఇదం భూతకార్యాఖ్యానం (౯) ఉత్కీర్తనమ్ గర్భాఙ్గమ్.

'త్వయి వితరతు భద్రం' ఇత్యత్ర సురమునిశ్రేయో వితరణ బీజస్య సము ద్భేదాత్ (౧౦) ఆక్షేపః గర్భాఙ్గమ్. 'గర్భబీజసముద్భేదాత్ ఆక్షేపః' ఇతి.

కుశలవకథా పతాకా, జృమ్భకేన ప్రత్యభి జ్ఞోపయోగ సమ్పాదనాయ రామోప క్రా న్తాశ్వమేధ హయగ్రహణం ప్రస్తౌతి.

గర్భః వీరరస సఞ్చారీ, సః అఙ్గరసం వీరం పుష్ణాతి.

అథ కవిః పతాకానాయక విక్రమోదాహరణ మాలమ్బ్య నియతా ప్తి ప్రకరీ యోగేన విమర్శసన్ధి ముపవర్ణయితు ముపక్రమతే. చన్ద్రకేతుః ప్రకరీనాయకః.

'సం స్తమ్భయామి' - ఇతి సేనాప్రతిష్టమ్భవర్ణనాత్ (౧) 'విద్రవః' విమర్శాఙ్గమ్. 'విద్రవో వధబన్ధాది' ఇతి.

చన్ద్రకేతు సహాయభూతానాం పారవశ్యాపాదనేన సఙ్ఘభేదనమ్. అయం సంహాత్యః 'మన్త్రార్థదైవశక్త్యాదేః సంహాత్యః సఙ్ఘభేదమ్'. ఇతి.

'ప్రసూన స్యాగమః కుతః?' ఇతి అ త్రాశ్చర్యేణ లవస్య రామావత్య త్వావ మర్శాత్ 'విమ' ర్శోయమ్. 'క్రోధే నావమృశే ద్యత్ర వ్యసనా ద్వా విలోభనాత్

గర్భనిర్భిన్నబీజార్థః సోఽవమర్శః' 'అర్థః వివృత్తిః', లవే మైథిలేయత్వస్య వివర్తనాత్.

'దేవ స్త్వాం సవితా ధినోతు' ఇత్యాది. అత్ర సవిత్రాదీనాం గురుజనానాం కీర్తనాత్ (౧) 'ప్రసఙ్గః' విమర్శాఙ్గమ్. 'గురుకీర్తనం ప్రసఙ్గ' ఇతి.

'ఋషయో రాక్షసీ మాహుః' ఇతి 'కామాశా దుగ్ధే' ఇతి చ అన్వయ వ్యతిరేకాభ్యాం రామభద్రస్య దోషప్రఖ్యాపనాత్ (౨) 'అపవాదః'. విమర్శాఙ్గమ్. 'దోషప్రఖ్యాఽపవాదః స్యాత్' ఇతి. 'కిం వ్యవస్థిత విషయాః క్షత్రధర్మాః?' ఇతి స్థానే మమ అమర్ష ఇతి లవస్య స్వశక్త్యుక్త్యా (౩) 'వ్యవసాయః' విమర్శాఙ్గమ్.

'కో ప్యేష సమ్ప్రతి నవః పురుషావతారః' ఇతి (౪) 'ఛలనం' విమర్శాఙ్గమ్. 'అవమానన లక్షణం ఛలన' మితి.

వృద్ధాస్తే ఇత్యాది అత్ర గురో రపి రామస్య తిరస్కారాత్, (౫) 'ద్రవః' విమర్శాఙ్గమ్.

'అయేః మ య్యేవ భ్రుకుటీధరః' ఇతి (౬) 'సమ్ఫేటః' విమర్శాఙ్గమ్. 'రోష భాషణాత్' - ఇతి.

'శాన్తో లవః' ఇతి విరోధశమనాత్ (౭) 'శక్తిః' విమర్శాఙ్గమ్.

'కల్యాణమస్తు' ఇతి భావి సీతాసమాగ మాశాస్త్యా (౮) 'ప్రరోచనా' విమర్శాఙ్గమ్.

ప్రకృతనాట కోపసఙ్క్షిహీర్షయా నిర్వహణసన్ధి ముపాదదానః విచ్ఛిత్తివిశేష వత్తయా సీతాత్యా గావస్తరవృత్త వర్ణనోపయోగితయా చ అంతర్నాటికా ముపక్షిపతి - 'తత' ఇతి.

అత్ర పృథ్వీభాగీరథ్యోః సీతావలమ్బ నోక్త్యా దేవర్షి శ్రేయో వితరణ రూప బీజస్య ఉపగమాత్ (౧) 'సన్ధి' ర్నామ నిర్వహణాఙ్గమ్. సమాశ్వసిహి. ప్రసూతాసి- ఇత్యాది (౨) 'ప్రసాదః' నామ నిర్వహణాఙ్గమ్. పృథ్వీ భాగీరథీభ్యాం సీతాయాః 'ప్రశంసనాత్.' 'ప్రసాదః' పర్యుపాసనమ్ ఇ తీదం నిర్వహణాఙ్గమ్.

విస్మయానన్ద సన్దర్భ జర్జరాః కరుణోర్మయః-ఇత్యాది-అత్ర విరహవ్యథాయాః శైథిల్యోక్త్యా 'సమయో దుఃఖనిర్గమ' ఇతి (౩) 'సమయః' నిర్వహణాఙ్గమ్.

దిష్ట్యా అత్ర దేవతాః స్ఫురన్తి ఇతి 'కృతిర్లబ్ధార్థశమనమ్' ఇతి (౪) 'కృతిః' నిర్వహణాఙ్గమ్.

'కిన్తే భూయః ప్రియ మిత్యాది వాల్మీకే ర్వరదానవర్ణనాత్ (౫) 'కావ్య సంహారః' నిర్వహణాఙ్గమ్.

శ్రీరామాయణ వివర్త భూత మిద ముత్తరరామచరితం అఖిలేష్టప్రాప్తిం అశేషానిష్ట నివృత్తీం చ సమ్పాదయేత్ ఇతి శుభాశంసనాత్ (౬) 'ప్రశస్తిః' నిర్వహణాఙ్గమ్ - 'ప్రశస్తిః శుభశంసనా' ఇతి.

అయం చ నిర్వహణసన్ధిః సీతారామ సమాగమాత్మక ప్రధాన ఫలానుగుణ్యేన కావ్యస్య ఘటనాత్. ముఖాదిసన్ధిషు విప్రకీర్ణానాం కథాంశానాం తదఙ్గతయా ఉప సంహారాచ్చ.



౩౧ - ఉత్తరచరితయందు సామెతలవంటి సూక్తులు కొన్ని—

1. సర్వథా వ్యవహర్తవ్యం - కుతో హ్యవచనీయతా? ప్రస్తా - 5.
2. యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః. ప్రస్తా - 5.
3. అనుష్ఠాన నిత్యత్వం స్వాతన్త్ర్య మపకర్షతి. I - 1.
4. లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి. I - 3.
5. తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః I - 6.
6. నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా
మూర్ధ్ని స్థితి ర్న చరణై రవతాడనాని. I - 7.
7. తే హి నో దివసా గతాః. I - 12.
8. అపి గ్రావా రోది త్యపి దళతి వజ్రస్య హృదయం. I - 21.
9. సతాం సద్భిః సఙ్గః కథ మపి హి పుణ్యేన భవతి. II. వి - 1.
10. ప్రియప్రాయా వృత్తిః - ఇత్యాది అర్యవృత్తము. II. వి - 2.
11. వితరతిగురుః— ఇత్యాది.
ప్రభవతి శుచి ర్బిమ్బగ్రాహే మణి ర్న మృదాం చయః. II. వి - 4.
—విద్యార్థుల ప్రజ్ఞల భేదము.
12. వజ్రా దపి కఠోరాణి మృదూని కుసుమా దపి
లోకోత్తరాణాం చేతాంసి కోను విజ్ఞాతు మర్హతి? II. వి - 7.
13. సత్పుజ్ఞాని నిధనా న్యపి తారయన్తి. II - 2.
14. త త్తస్య కిమపి ద్రవ్యం యో హి యస్య ప్రియో జనః
—మైత్రిమహిమ. II - 10.
15. ఈదృశానాం విపాకోఽపి జాయతే పరమాద్భుతః. III. వి - 3.
16. అన్తఃకరణతత్త్వస్య దమ్పత్యోః స్నేహసంశ్రయాత్.
ఆనన్దగ్రన్థి రేకోఽయ మపత్య మితి బధ్యతే. III - 10.
—బిడ్డలవలని యానందము

17. పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా
శోకక్షోభే చ హృదయం ప్రలాపై రేవ ధార్యతే. III - 22—
—శోకశాంతికి ఉపాయము.

18. క్షతే క్షార మి వాసహ్యమ్. IV - 5.

19. గుణాః పూజాస్థానం గుణిషు న చ లిఙ్గం న చ వయః. IV - 9.

20. పురన్ధ్రీణాం చిత్తం కుసుమసుకుమారం. IV - 10.

21. సుహృ దివ ప్రకటయ్య ఇత్యాది. IV - 13.

22. ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం ఇత్యాది. IV - 16.

23. అహేతుః పక్షపాతో యః ఇత్యాది. V - 17.
—తారామైత్రకము స్నేహము.

24. ఋషయో రాక్షసీ మాహుః ఇత్యాది. V - 30.-రాక్షసమగువాక్కు.

25. కామాన్ దుగ్ధే విప్రకర్ష త్యభూని ఇత్యాది. V - 31.-సూనృతోక్తి

26. సిద్ధం హ్యేత ద్వాచి వీర్యమ్ ఇత్యాది. V - 33.
—బ్రాహ్మణులకు వాక్కున, క్షత్రియులకు బాహువున, వీర్యము.

27. వృద్ధా స్తే న విచారణీయచరితాః. V - 35.
— పెద్దలనడువడిని ఆక్షేపింపఁగూడదులే.

28. మహర్షు స్తీ ర్థానా మివ హి మహతాం కో వ్యతిశయః.
—మహాత్ముల యతిశయము. VI - 4

29. వ్యతిషజతి పదార్థా నా న్తరః కోఽపి హేతుః ఇత్యాది. VI - 5.
—పూర్వకర్మ వాసన.

30. న తేజ స్తేజస్వీ ప్రసృత మపరేషాం విషహతే. VI - 7.
—తేజస్వి వృత్తము.

31. కో నామ పాకాభిముఖస్య జన్తు
ర్ద్వారాణి దైవస్య పిధాతు మీష్టే. VII - 4.-విధి దాఁటరానిది.

32. సులభసౌఖ్యం తావత్ బాల్యం. IV.

33. సర్వ మతిమాత్రం దోషాయ. VI.

---

### ౩౨ - భవభూతి నాటకములలో రెంటను మూఁటను ఉమ్మడిగా నుండు శ్లోకాదికము—

| ఉత్తర చరిత | వీర చరిత | మాలతి |
|---|---|---|
| I. 1. కిన్త్వనుష్ఠాన. | IV. 33. | …… |
| I. 8. బ్రహ్మాదయో. | I. 42. | …… |
| I. 15. పుత్రసఙ్క్రాన్తే. | IV. 51. | …… |
| I. 24. ఏతస్మిన్ మదకల. | …… | IX. 14. |
| II. 11. ఇహసమద. | V. 40. | IX. 24. |
| 12. దధతికుహర. | V. 41. | IX. 6. |
| IV. 18. చూడాచుమ్బి. | I. 18. | …… |
| IV. 27. జ్యాజిహ్వాకా | III. 29. | …… |
| VI. 2. త్రాతుంలోకాన్. | II. 41. | …… |
| I. 27. జీవయన్నివ. | …… | VIII. 8. |
| III. 11. లీలోత్ఖాత. | …… | IX. 34. |
| III. 26. దళతి హృదయం. | …… | IX. 12. |
| III. 33. హాహాదేవి. | …… | IX. 20. (మాతర్మాతః). |
| IV. 2. అనియతరుదిత | …… | X. 2. |
| IV. 13. సుహృదివప్రకట. | …… | IV. 7. |
| VI. 5. వ్యతిషజతి. | | I. 27. |
| I. 6. తీర్థోదకంచవహ్ని | IV. 27. | …… |
| I. 7. నైసర్గికీ సురభిణః. | …… | IX. 51. |
| I. 9. గౌతమశ్చశతానన్దః | I. 19. | …… |
| I. 10. జనకానాంరఘూణాం. | I. 57. | …… |
| VI. 9. యాజ్ఞవల్క్యముని. | I. 14. | …… |
| IV. 14. అమృతాధ్మాత. | II. 46. | …… |
| II. 29. మ్లానస్యజీవకు. | …… | VI. 8. |
| I. 20. గుఞ్జత్కుఞ్జకుటీర— | …… | V. 19. |
| III 4. పరిపాణ్డుదుర్బల. | …… | II. 4. |
| V. 13. వ్యతికరఇవ భీమః. | …… | IX. 54.<br>X. 8. |

| | | |
|---|---|---|
| VII. 4. కోనామపాకాభిముఖః. | ...... | X. 13. |
| VI.(15.) లలాటం తప స్తపతి. | ...... | I. (22) |
| I. 31. ఇయ మమృత వ_ర్తిర్న యనయోః. | I. 28. | I. (25) |
| VI. 5 స్నేహాశ్చ నిమి_త్త. | ...... | I. (27) |
| III. 16. త్రస్తైకహాయన | ...... | IV. 8. |
| III. 8. తటస్థం నైరాశ్యాద్. అపి చ కలుషం విప్రియ వశాత్. | ...... | V. 28. ఆతఙ్కా-ద్వికలం ద్రుతం కరుణయా. |
| III. (3) దిష్ట్యా కథం ప్రభాత చన్ద్రమణ్డ లాపాణ్డర పరిణామ. | ...... | VII. (ఆరమ్భే) ప్రభాత ఇత్యాది. |
| I. 11. అయ మాగృహీత కమ నీయ కఙ్కణః. | ...... | IX. 9. |
| I. 26. నీలః స్నిగ్ధః శ్రయతి శిఖరం నూతనస్తోయ. | V. 42 | IX. 24. |
| VI. 28. తదాకిఞ్చిత్ | ...... | VIII. 29. తదాకిఞ్చిత్ |
| III. జలభర భరిత మేఘ స్తనిత గమ్భీర మాంసలః కుతో న్వేష భారతీ నిర్ఘోషః. | II. (21) పుష్కలావ_ర్తక స్తనిత మాంసలో వాఙ్నిర్ఘోషః. | ...... |
| IV. 21. మహిమ్నా మేతస్మి న్వినయ శిశుతా మౌగ్ధ్య. | II. (38) పార మార్థిక వినయ దుర్వి భావ్యః నిపుణబుద్ధి. | ...... |
| V. మ య్యేవ భ్రుకుటీధరః సంవృ_త్తః. | II. (46) మ య్యేవ భ్రుకుటీ. | ...... |
| VI. (6) య దాయుధపరిగ్రహం యావ దధ్యారూఢో దుర్యోగః. | IV. 22. | ...... |
| IV. (21) ఏష వో లవస్య శిరసా ప్రణామపర్యాయః. | IV. (24). ఏష వో రామశిరసా. | ...... |
| III. 25. విలపనవినోదో వ్యసు లభః. | V. (28) | ...... |

## 33 - ఇందలి పద్యముల వృత్తములు

1. ఈయుత్తరచరితమున మొత్తము 256 పద్యములు ఉన్నవి. అందు—
1. అనుష్టుబ్ - శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం సర్వత్ర లఘు పఞ్చమమ్ ద్విచతుః పాదయోర్హ్రస్వం సప్తమం దీర్ఘ మన్యయోః. అనుష్టుభులు సులభగ్రాహ్యము లయినందున వానిని ఇట నిర్దేశింపలేదు. వాని మొత్తము. 89.

2. శిఖరిణీ - రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ (6, 11) I - 21, 22, 28, 31; II - 1, 2, 17, 18; III-8, 25, 35, 39; IV 1, 8, 9, 10, 11, 12, 19; V - 9, 16, 26; VI - 4, 7, 21, 23, 26, 28, 31, 32—వీని మొత్తము, 30.

3. వసన్తతిలకా - ఉక్తా వసన్తతిలకా తభజాజగౌగః—ప్ర. 7; I-2, 7, 18, 29; II-1. 2, 13, 14; III-3, 6, 7, 16, 21, 23, 42; IV-4, 21, 27; V - 10, 11, 24, 34; VI - వి. 7, 9, 12— మొత్తము. 26.

4. శార్దూల విక్రీడితమ్ - సూర్యాశ్వైర్మసజస్తతాస్సగురవః శార్దూల విక్రీడితమ్ (12, 7). I - 32; II - వి. 9; 7, 19, 20, 21; III - 11, 32, 38, 40. IV - వి. 1; 3, 15, 18, 20. 22; V - 6, 14, 19, 28, 35, 36; VI - 11, 33; VII - 20 వీని మొత్తము, 25.

5. మాలినీ-ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః. (8. 7). I - 17. 19, 20; II - 11, 12; III - వి. 5; 14, 18. 20, 43; V - 2, 3, 13; VI - 5. 17, 19—వీని మొత్తము. 16.

6. మన్దాక్రాన్తా - మన్దాక్రాన్తా జలధిషడగైర్మ్భౌ భనౌ తౌ గురూచేత్. (4, 6, 7). I-26; II-4, 5, 16; III-1, 10, 31, 33; IV-24; V-12; VI-2, 15; VII-6—వీని మొత్తము, 13.

7. హరిణీ - నసమరసలాగః షడ్వేదైర్హయైర్హరిణీ మతా. (6, 4, 7), I - 13, 16; II - వి. 4; III - 17, 19, 27, 27; IV - 17; V - 29—వీని మొత్తము. 9.

8. ఉపేన్ద్రవజ్రా - ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ. I - 8; II - వి. 6; III - 30, 37; IV - 14; VI-8, 20—ఇవి. 7.

9. ప్రహర్షిణీ - త్ర్యాశాభిర్మనజరగాః ప్రహర్షిణీయమ్. (3, 10), I - 23, 24, 33, 42; III - 34; V-1. 18—వీని మొత్తము. 7.

10 ఇన్ద్రవజ్రా - స్యా దిన్ద్రవజ్రా త త జా స్తతో గా. I - 4. 37; II - వి, 3; IV - 6; VII - 4, 16—వీని మొత్తము, 6.

11. పుష్పితాగ్రా - అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా. III - 13, 15; IV - 2; V - 4; VI - 1—వీని మొత్తము, 5.

12. మఞ్జుభాషిణీ - సజసా జగౌ భవతి మఞ్జుభాషిణీ. I - 11; III - వి. 4; VI - వి. 4; 10, 34—వీని మొత్తము, 5.

13. శాలినీ - శాలి న్యుక్తా మ్తా రగా గోబ్ధిలోకైః. (4, 7.) I - 35; III - వి, 2; IV - 16; V - 31, 33—వీని మొత్తము, 5.

14. పృథ్వీ - జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీగురుః. (8, 9,) V - 5; VI - వి. 1; 30—వీని మొత్తము, 3.

15. రథోద్ధతా - రాన్నరా విహ రథోద్ధతా లగౌ I - 27, 30, 38—ఇవి మొత్తము, 3.

16. ఆర్యా -

యస్యాః పాదే ప్రథమే ద్వాదశమాత్రా స్తథా తృతీయేఽపి
అష్టాదశ ద్వితీయే చతుర్థే పఞ్చదశ సార్యా.

III - 36; VI - 6—ఇవి, 2.

17. ద్రుతవిలమ్బితమ్ - ద్రుతవిలమ్బిత మాహ నభౌ భరౌ. III - 22, IV - 13. మొత్తము, 2.

18 ఔపచ్ఛందసిక - ఇది సున్దరీ—

అయుజో ర్యది సౌ జగౌ, యుజోః
సభరా ల్గౌ యది సున్దరీ తదా.

దీనికి ప్రతిపాదాంతమున గురువు కలిపిన ఔపచ్ఛందసికము. V - 8—ఇది, 1.

19. వంశస్థమ్ - జతౌ తు వంశస్థ ముదీరితం జరౌ. VI - 18—ఇది, 1.



## ౩౪ - ఈ నాటకమున కొన్ని అర్థాలంకారములకు దిక్ ప్రదర్శనముగా సూచి.

1. అనుమానః - యత్ర కార్యముఖేన కారణస్య అవగతిః. IV - 18.

2. అపహ్నుతిః - ప్రకృతం ప్రతిషిధ్యాన్యస్థాపనం స్యా దపహ్నుతిః. III-29.

3. అప్రస్తుత ప్రశంసా -

క్వచి ద్విశేషః సామాన్యాత్ వా విశేషతః
కార్యా న్నిమిత్తం కార్యఞ్చ హేతో రథ సమాత్ సమమ్
అప్రస్తుతా త్ప్రస్తుతశ్చే ద్గమ్యతే పఞ్చధా తతః
అప్రస్తుతప్రశంసా స్యాత్. I - 1.

4. అర్థాన్తరన్యాసః -

సామాన్యం వా విశేషేణ విశేష స్తేన వా యది
కార్యఞ్చ కారణే నేదం కార్యేణ సమర్థ్యతే
సాధర్మ్యే ణేతరే ణార్థాన్తరన్యాసో ష్టధా తతః.

IV - 9; V - 2; VI - 4, 5. 7; VII - 4.

5. ఆక్షేపః -

వస్తునో వక్తు మిష్టస్య విశేషప్రతిపత్తయే
నిషేధాభాస ఆక్షేపో వక్ష్యమాణో క్తగో ద్విధా. III - 21.

6. ఉత్ప్రేక్షా -

భవే త్సమ్భావ నోత్ప్రేక్షా ప్రకృతస్య పరాత్మనా.

I - 41; II - వి. 6; III - వి. 4; 6, 8, 9, 34; IV - 17; V - 3, 6, 14; VI - వి. 3; 2, 12, 14, 15, 19, 24.

7. ఉపమా -

సామ్యవాచ్య మవై ధర్మ్యం
వాక్యైక్యే ఉపమా ద్వయోః.

I - 27, 33, 38; II - 17; III - వి. 5; 2, 4, 18, 31, 37, 38, 42; IV - 5; VI - వి. 6; 14 (అభూతోపమా.)

8. కావ్యలిఙ్గమ్ -

హేతో ర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గం విగద్యతే. II - 1; III - 5.

9. దీపకమ్ -

అప్రస్తుత ప్రస్తుతయో ర్దీపక మ్తు విగద్యతే
అథ కారక మేకం స్యా దనేకాసు క్రియాసు చేత్. IV - 18

10. దృష్టాన్తః -

దృష్టాన్త స్తు సధర్మస్య వస్తునః ప్రతిబిమ్బనమ్.
I - 7; III - 24; V - 20.

11. విదర్శనా -

సమ్భవ న్ వస్తుసమ్బన్ధోఽసమ్భవ న్ వా పి కుత్రచిత్
యత్ర బిమ్బానుబిమ్బత్వం బోధయేత్ సా విదర్శనా.
V - 11. 36; VI - 4.

12. ప్రతివస్తూపమా -

ప్రతివస్తూపమా సా స్యా ద్వాక్యయో ర్గమ్యసామ్య యోః
ఏకోఽపి ధర్మః సామాన్యో యత్ర విర్దిశ్యతే పృథక్. I - 6; III - 24.

13. యథాసంఖ్యమ్ -

యథాసంఖ్యం క్రమే ణైవ క్రమికాణాం సమన్వయః. III - 20

14. రూపకమ్ -

రూపకం రూపితారోపా ద్విషయే నిరపహ్నవే.
I - 29, 31; III - ౨. 5; 4, 21; VI - 25.

15. విరోధః -

జాతి శ్చతుర్భి ర్జాత్యాద్యై ర్గుణో గుణాదిభి స్త్రిభిః
క్రియా క్రియాద్రవ్యాభ్యాం య ద్ద్రవ్యేణవా మిథః
విరుద్ధ మివ భాసేత విరో ధోసౌ దశాకృతిః.
III - 6, 34; IV - 6, V - 12.

16. విషమమ్ -

గుణౌ క్రియే వా యత్స్యాతాం విరుద్ధే హేతుకార్యయోః
య ద్వారబ్ధస్య వైఫల్య మనర్థస్య చ సమ్భవః
విరూపయోః సఙ్ఘటనా యా చ తద్విషమం మతమ్.

I - 14; I - 36; V - ఐ. 7.

17. శ్లేషః -

శ్లిష్టైః పదై రనేకార్థాభిధానే శ్లేష ఉచ్యతే. V - 3.

18. సన్దేహః -

స్యాత్ స్మృతిర్భ్రాన్తి సన్దేహై స్తదఙ్కాలంకృతి త్రయమ్. VI - 12.

19. సముచ్చయః -

సముచ్చయో య మేకస్మిన్ సతి కార్యస్య సాధనే
ఖలేకపోతికాన్యాయాత్ తత్కరఃస్యాత్ పరోపి చేత్
గుణౌ క్రియే వా యుగపత్ స్యాతాం యద్వా గుణక్రియే.

I - 2; III - 25; V - 26.

20. స్మరణమ్ -

సదృశానుభవా ద్వస్తుస్మృతిః స్మరణ ముచ్యతే. V - 4.

21. స్వభావోక్తిః -

స్వభావోక్తి ర్దురూహార్థ స్వక్రియారూపవర్ణనమ్.

II - 11, 12; VI - 18, 24.



# ఉదాహృతగ్రంథములు

అనర్ఘరాఘవము—మురారి

అభిజ్ఞానశాకుంతలము—కాళిదాసు

అమరము— అమరసింహుఁడు

అమరుకము—శంకరాచార్యులు

ఆంధ్ర ధ్వన్యాలోకము—వేదాల తిరువేంగళాచార్యులు

ఆప్టే నిఘంటువు—ఆప్టే

ఆర్యాసప్తశతి—గోవర్ధనాచార్యులు

Introduction to a study of English Literture—Hudson.

ఉత్తరరామాయణము—కంకంటి పాపరాజు

ఉత్తరరామాయణము—తిక్కన

ఉత్తరరామచరిత కళావ్యాఖ్య—కవిభూషణ కుమార తాతార్య

,, భావబోధినీవ్యాఖ్య—రామచంద్రబుధేంద్ర

,, తలస్పర్శినీ వ్యాఖ్య—వాధూల వీరరాఘవాచార్య

,, ఆంగ్లటీక—కాలే పండితుడు

,, ఆంగ్లటీక—బిల్వాళికార పండితుడు

,, ఆంగ్లటీక—శారదా రంజన రే

ఋతుసంహారము— కాళిదాసు

Essays in Criticism—Hutton

ఔచిత్యవిచారచర్చ— క్షేమేంద్రుఁడు

కథాసరిత్సాగరము—సోమదేవభట్టు

కర్పూరమంజరి—రాజశేఖరుఁడు

కామందక నీతిశాస్త్రము—కామందకుఁడు

కావ్యప్రకాశము—మమ్మటుఁడు

కావ్యమీమాంస—రాజశేఖరుఁడు

కావ్యాలంకారసూత్రవృత్తి—వామనుఁడు

కిరాతార్జునీయము—భారవి

కుందమాల—దిఙ్నాగుఁడు
కుమారసంభవము—కాళిదాసు
కువలయానందము—అప్పయ దీక్షితులు
గౌడవహము—వాక్పతిరాజు
చంపూరామాయణము—భోజదేవుఁడు
జైమిని భారతము—జైమిని
తంత్రవార్తికము—కుమారిలుఁడు
దశరూపకము-- ధనిక, ధనంజయులు
ధర్మసూత్రములు—గౌతమర్షి
ధ్వన్యాలోకము—ఆనందవర్ధనుఁడు
నాగానంద నాటకము—శ్రీహర్షుఁడు
నీలకంఠచంపువు—నీలకంఠ దీక్షితుఁడు
పాద్మపురాణము—
ప్రసన్నరాఘవనాటకము—జయదేవుఁడు
బాలరామాయణనాటకము—రాజశేఖరుఁడు
బాహటము— వాగ్భటుఁడు
బృహత్సంహిత—వరాహమిహిరుఁడు
భరతనాట్యశాస్త్రము—భరతముని
భారతి—సెప్టెంబరు, 1964
భర్తృహరి సుభాషితము—భర్తృహరి
భోజప్రబంధము—బల్లాలసేన
మనుచరిత్ర—అల్లసాని పెద్దన
మనుస్మృతి—
మల్లినాథ సంజీవనులు—
మేఘ, కుమార, రఘువులు
మహాభారతము—వేదవ్యాసులు
మహావీరచరితము—భవభూతి
మాలతీమాధవము—భవభూతి
మాలవికాగ్నిమిత్రము—కాళిదాసు
వ్యాఖ్య --శ్రీనివాసాచార్యులు

ముద్రారాక్షస నాటకము—విశాఖదత్తుఁడు
మృచ్ఛకటిక నాటకము—శూద్రకరాజు
మేఘసందేశము—కాళిదాసు
రఘువంశము—కాళిదాసు
రసగంగాధరము—పండితరాయ జగన్నాథ కవి
రసార్ణవ సుధాకరము—సర్వజ్ఞసింగమనాయఁడు
రసాస్వాదిని—శాకుంతల వ్యాఖ్య
రసిక జీవనము—
రాజతరంగిణి—కల్హణుఁడు
లోచనము—అభినవగుప్తుఁడు
వాల్మీకి రామాయణము—
వాల్మీకి ఉత్తరకాండము—
Winter's Tale—షేక్స్పియరు
విక్రమోర్వశీయము—కాళిదాసు
వైఖానస శ్రీనివాసాచార్య వ్యాఖ్య—శాకుంతలము
శారీరక మీమాంస—శంకరాచార్యులు
శిశుపాలవధ—మాఘకవి
శృంగార ప్రకాశిక—భోజదేవుఁడు
సరస్వతీ కంఠాభరణము—భోజదేవుఁడు
సాముద్రికము—
సాహిత్యదర్పణము—విశ్వనాథకవి
సాహిత్యదర్పణము - ఆంధ్రము—వేదము వేంకటరాయశాస్త్రులు
సిద్ధాంతకౌముది—భట్టోజిదీక్షితులు
సుభాషితనీవి—వేదాంతదేశికులు
సుశ్రుతము—
సూక్తి ముక్తావళి—
Cymbeline—షేక్స్పియరు
స్వప్నవాసవదత్తము—భాసుఁడు
హర్షచరితము—బాణుఁడు

## ఉత్తరరామచరిత నాటక గతాః పురుషాః

(ఈ నాటకమందలి పురుషులు)

సూత్రధారః

నటః

గర్భాఙ్క సూత్రధారః

రామః—కథానాయకః

కఞ్చుకీ

అష్టావక్రః—కశ్చిన్మునిః

లక్ష్మణః —నాయకానుజః

దుర్ముఖః —అన్తఃపురపరిచారకః

శమ్బూకః—శూద్రమునిః

సౌధాతకిః } వాల్మీకి శిష్యౌ
భాణ్డాయనః }

జనకః —విదేహానాం రాజా, నాయికాజనకః

గృష్టిః—కఞ్చుకీ

కుశః } రామస్య పుత్రౌ
లవః }

బ్రాహ్మణవటవః

పురుషః—చన్ద్రకేతు సైనికః

చన్ద్రకేతుః—లక్ష్మణస్య పుత్త్రః

సుమన్త్రః—చన్ద్రకేతు సారథిః

విద్యాధరః

వాల్మీకిః —రామాయణ ప్రణేతా మహామునిః



## ఏతన్నాటక గతాః స్త్రియః

సీతా—రామపత్నీ, కథానాయికా

ప్రతీహారీ

ఆత్రేయీ—తాపసీ

వాసన్తీ—వనదేవతా, సీతాయాః సఖీ

తమసా—నదీదేవతా

మురళా—నదీదేవతా

అరున్ధతీ—వసిష్ఠపత్నీ

కౌసల్యా—రామస్య మాతా

విద్యాధరీ

పృథ్వీదేవతా—సీతాయాః మాతా

భాగీరథీ



## ఉత్తరరామచరితనాటకాఙ్కాదీనాం స్థలనిర్దేశః.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రస్తావనా | — | రాజమన్దిరాత్ బహిర్దేశః. |
| 2. | ప్రథమాఙ్కః | — | సీతావాసగృహః |
| 3. | విష్కమ్భః | — | జనస్థాన తపోవనమ్ |
| 4. | ద్వితీయాఙ్కః | — | జనస్థాన తపోవనమ్. |
| 5. | విష్కమ్భః | — | పఞ్చవటీ గోదావరీహ్రదపరిసరః |
| 6. | తృతీయాఙ్కః | — | తత్రైవ. |
| 7. | విష్కమ్భః | — | వాల్మీక్యాశ్రమసమీపదేశః |
| 8. | చతుర్థాఙ్కః | — | ,, |
| 9. | పఞ్చమాఙ్కః | — | వాల్మీక్యాశ్రమాత్ కిఞ్చిద్దూరదేశః |
| 10. | విష్కమ్భః | — | తత్రైవ - ఆకాశః |
| 11. | షష్ఠాఙ్కః | — | తత్రైవ |
| 12. | సప్తమాఙ్కః | — | వాల్మీక్యాశ్రమసమీపగఙ్గాతీరదేశః. |



శ్రీః

# ఉత్తరరామచరితనాటకమ్

## ప్రస్తావనా

శ్లో॥ ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే ;
విన్దేమ దేవతాం వాణీ మమృతా మాత్మనః కలామ్. ౧

---

శ్లో. ౧. ఇదం=ఇదె, పూర్వేభ్యః కవిభ్యః=తొల్లింటివారగు కవులకు, నమోవాకం='నమః' అనిపలికి, అమృతాం = మోక్షరూపిణియు, ఆత్మనః కలాం = పరమాత్మయొక్క యంశయైనదియునగు, దేవతాం వాణీం=వాగ్దేవిని, విన్దేమ (ఇతి)= పడయుదుముగాక యని, ప్రశాస్మహే=కోరుచున్నాను.

పాఠాంతరమునకు.—నమోవాకం = నమః అనుపలుకును, ప్రశాస్మహే = కోరుచున్నాను. మనస్సున ఉన్న భక్తిని ఇట్లు నోట పలుకుచున్నాను; వాగారంభమును దొరయించుచున్నాను - అనుట. దేవతాం వాచం చ=ఆవాగ్దేవిని సయితము, వన్దేమహే=నమస్కరించుచున్నాను.

ఇందు తొలిపాఠమున శ్లోకమంతయు కారణకార్యసంబంధముచే ఒక్కవాక్యముగా అన్వయము. రెండవదానియందు రెండువాక్యములుగా. తొలిదానిని దాక్షిణాత్యులు గ్రహించినారు; రెండవదానిని ఇతరులు. తొలిదే, 'విన్దేమ' అనునదే, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు అంగీకరించినది. కవులకు నమస్కారమును, దాన కోరిక పడయుటయు. రెండవదాన ఊరక రెండు నమస్కారములు.

తొంటి కవుల కెల్ల ఇదిగో నమస్కారము అనుచు కోరికలు తీఱునట్లు చేమోడ్పు ఇడెదను; (దాన) అమృతయు పరమాత్మాంశయును ఐన వాగ్దేవిని పడసెదనుగాక.

'పూర్వేభ్యః కవిభ్యః'—బహువచనము పూజార్థము గాదు; అది వాల్మీకి వ్యాస కాళిదాసాదుల నెల్లరను సమాహరించుటకు. 'నమోవాకం'-'నమః' అని నోటను జెప్పుట భక్తి నిండి పొరలుటచేత. 'అమృతాం'—దేవతకు మృతిలేమి -

శాశ్వతత - చెప్పఁకయే కలిగినది గనుక, ఇట ఒండు అర్థము, మోక్షరూపిణి అను నది గ్రాహ్యము.

ఇది కొందఱ మతమున నాంది. 'నాంది అనునది నాటకాదుల యారంభ మందు దేవబ్రాహ్మణరాజప్రభృతులకు స్తుతిగా సామాజికాదులచే ఆశీర్వచన రూపముగా 8, 12, 18, 22 పదములుగలదిగా రచింపఁబడును. ఇందు బిల్వ శంఖ చంద్ర కమల చక్రవాక కుముదాది శుభవస్తు వాచకములును కావ్యార్థసూచ నయు, ఉండవలయును. కొందఱ మతంబున పదనియమ కథాంశసూచనలు పాక్షికములు.'

'ఆశీర్వచనసంయుక్తా స్తుతి ర్యస్మాత్ ప్రయుజ్యతే
దేవద్విజనృపాదీనాం తస్మా న్నాన్దీతి సంజ్ఞితా,
మఙ్గల్య శఙ్ఖ చన్ద్రాబ్జ కోక కైరవ శంసినీ
పదై ర్యుక్తా ద్వాదశభి రష్టాభి ర్వా పదై రుత.' సా. ద.
'య త్రాష్టాభి ర్ద్వాదశభి రష్టాదశభి రేవ వా
ద్వావింశత్యా పదై ర్వాపి సా నాన్దీ పరికీర్తితా.'
'అర్థతః శబ్దతో వాపి మనా క్కావ్యార్థసూచనమ్.'
'పదాది నియ మోపి వా'

'నన్దన్తి దేవతా యస్మాత్ తస్మా న్నాన్దీతి సంజ్ఞితా'—అనగా, ఎందువలన దేవతలు (అ) నందింతురో అందువలన నాంది యని చెప్పఁబడినది, అని నాందీ సంజ్ఞావివరణము. ఈ నాందియందు పదనియమము లేదు. ఏలన ఇందు పదునొకండు పదములె ఉన్నవి. ఇది నాందికై చెప్పిన ఏసంఖ్యయు కాదు. నియమము వైకల్పికము. అట్లే ఇందు కావ్యార్థసూచనయు లేదు. 'కేచిత్ నాన్ద్యాం కావ్యార్థసూచనాం నేచ్ఛన్తి' అనియు కలదు. కవికి కావ్యార్థసూచన ఇంచుకగా నైనను అభిమతమేని, దానికి గమకము శ్లోకమున స్పష్టముగా నుండ వలయునే కాని మఱింత గూఢముగా దుఃఖబోధముగా ఉండుట సరిగాదు. ఈ శ్లోకమున నాందీలక్షణములు అంతగా పట్టలేదు.

ఇది నాంది కాదు, 'రంగద్వారము' అని సాహిత్యదర్పణకారుని మతము. ఏలన 'నాంది' పూర్వరంగాంగము, నాటకకవి రచింపవలసినది కాదు. రంగ ద్వారముం దొడంగి కవి రచింపవలసినది అని భరతముని యనుశాసనము.

మాలతిలో తొలిశ్లోకములు ప్రౌఢముగా కల్పనలు గలిగి ఏతత్కావ్యార్హ ముగా నుండి, ఇందు ఇది కరము పేలవముగా శుష్కవైదికోక్తికల్పముగా నుండు

టకు ఏమి హేతువు? ఇట్లూహింప నగుంగాక—భవభూతిని సమకాలమువారు కొందఱు మెచ్చక అవజ్ఞం బలుకుచుండిరి. కావుననే మాలతిలో,

'యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జానన్తి తే కి మపి, తా న్ప్రతి నైష యత్నః;
ఉత్పత్స్యతే మమ తు కో౽పి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.'

అని అందు సూత్రిచేత పలికించినాఁడు. 'పరాపవాద స్యాత్మోత్కర్షోపాధి రుదత ఉచ్యతే' అని ఉదత్తకవి లక్షణము, రసార్ణవసుధాకరమున. ఏమను ఇందు ఔద్ధత్యమున దాఁగిన రవంత ఋజుతను కలదా అని శంక. మాలతిలోని శృంగారమును కవులు తన కాలమువారు మెచ్చరైరి. అంతట తనకు వీరాద్భుతములు ప్రియము అగునని సాకు చెప్పికొనుచు,

'తే వేద మద్ధ్రత జగ త్త్రియ మస్యమాల
మస్తోకవీర మురుసాహస మద్భుతం చ
వీరాద్భుతప్రియతయా రఘునన్దనస్య
ధర్మద్రుహో దమయితు శ్చరితం నిబద్ధమ్.'

అని మహావీరచరితమును నిర్మించెను. 'వశ్యావాచః కవే ర్వాక్యమ్' అని తన యాత్మవిశ్వాసమును వీడక పలికెను. దానిని సయితము వారు మెచ్చరైరి.

'యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః'

అని యామాటను, 'అవజ్ఞాం ప్రథయన్తి' అని మున్నన్నట్లే, ఈ యుత్తరచరిత మున సూచించినాఁడు. అంతట మహాకవి ఆత్మవిశ్వాసము కొంతవడనివాఁడే కడు ఖిన్నుఁడై, ఇందు కరుణవిప్రలంభమునకుం గడంగి, కవ్యాదరప్రాపకముగా పూర్వకవులను సవినయముగా కొలిచి పరస్వతిని ఇందు పొందఁగోరుచున్నాఁడు. అట్లే గదా, రెండు నాటకములు వ్రాసి, తరువాతిదైన యీ మూఁడవదాని యందును 'విన్దేమ దేవతాం వాణీం' అని వాణీదేవతను బడయుదుముగాక యని ప్రార్థించుకొనుచున్నాఁడు. కాళిదాసు రఘువులోని తొలి శ్లోకములు,—

"వాగర్థా విన సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ,",
"మన్దః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్"
"అథవా కృతవాగ్ద్వారే వంశే౽స్మిన్ పూర్వసూరిభిః."

(నాన్ద్యన్తే)

సూత్రధారః—అల మతివిస్తరేణ. అద్య ఖలు భగవతః కాల
ప్రియనాథస్య యాత్రాయా మార్యమిశ్రా న్విజ్ఞాపయామి.

---

అను మొదలైనవి ఇట సాటునకు స్మృతికి వచ్చినను అవి ఉత్తమోపమాలంకృతములు కవనసౌభాగ్యముతో వెలుంగునవి. ఇది శుష్కవైదికుని స్తోత్రపాఠముగా ఉన్నది. ఇట్లే వచఃశుద్ధికై కవులఁ బ్రస్తుతించిన ఆంధ్రకవితాపితామహుని అల్లసాని పెద్దనం గనఁదగును.

"వనజాక్షోపము వామలూరుతనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిన్ జోరు న్మురారి న్మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జేకొందున్ వచఃశుద్ధికిన్."

కాదా, నేను లోంటికవులం గొలుతుఁగాని వర్తమానులను లెక్క సేయను అని నిజకవ్యైకజీవితను వాగ్దేవీసిద్ధినిం దడవు భవభూతియౌద్ధత్య మేని ఇందు భావింపఁదగును. "యం బ్రహ్మాణ మియం దేవీ వాక్" ఇత్యాదియు "పరిణతప్రజ్ఞస్య వాణీ మిమాం" ఇత్యాదియు పలుకఁగలఁడుగదా. ఈ యుత్తర రామచరితము "భవభూతి ర్విశిష్యతే" అనునంతటి వాసిం గాంచినది భవభూతి నాటకములు రచించిన వరుస ఇది, మాలతీమాధవ మహావీరచరి;తోత్తరరామ చరితలు అని కవి సహృదయ చక్రవర్తి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి మతము.

నాన్ద్యన్తే సూత్రధారః - నాంది ముగియఁగానే సూత్రధారుఁడు - నాంది పూర్వరంగమునకు ఒక యంగము. పూర్వరంగము నాటకకవి రచించునది కాదు; నటకుటుంబము యథాసంప్రదాయముగా నేపథ్యమునం జేసికొనునది. దాని కడపటి యంగము 'రంగద్వారము' అనునది. అందు అభినయము మొదలు పెట్టఁబడును. రంగద్వారము మొదలుకొని కవి నాటకము రచింపఁదగును అని భరతునిచే చెప్పఁబడియున్నది. కావున ఈ శ్లోకము 'రంగద్వార' మని గ్రహింపఁదగును అని పైన చెప్పఁబడినదిగదా, మఱి 'నాన్ద్యన్తే' అని చెప్పుటయందు అభిప్రాయ మేమి అనఁగా - "యచ్చ...'నాన్ద్యన్తే సూత్రధారః' ఇతి లిఖనం తస్యాయ మభిప్రాయః - నాన్ద్యన్తే సూత్రధారః ఇదం ప్రయోజితవాన్, ఇతః ప్రభృతి మయా నాటక ముపాదీయతే ఇతి కవే రభిప్రాయః సూచితః ఇతి." నాంద్యంతమున సూత్రధారుఁడు ఈ రంగద్వారమును పఠించి ప్రస్తావనకుం

ఏవ మత్రభవన్తో విదాఙ్కుర్వన్తు. అస్తి ఖలు తత్రభవాన్ కాశ్యప శ్శ్రీకణ్ఠపదలాఞ్ఛనః పదవాక్యప్రమాణతత్త్వజ్ఞో భవభూతిర్నామ జాతూకర్ణీపుత్రః.

---

గడంగుచున్నాఁడు అనుట. 'సూత్రం కథాసూత్రం ధారయతీతి సూత్రధారః' సూత్రమును అనఁగా కథాసూత్రమును ధరించువాఁడు సూత్రధారుఁడు, ప్రధాన నటుఁడు, రంగమున నాటక మెల్ల నడపువాఁడు.

అలం అతివిస్తరేణ - అతివిస్తరము వలదు. 'అలం' - నిషేధార్థక మైనపుడు తృతీయాయోగము, అతివిస్తరేణ - అని. ఇప్పటికే విస్తర మైనది. ఇంకను ఇట్లే చెప్పుచున్న 'అతి' యగును అనుట, 'కాలప్రియానాథస్య' - ఈ కాలప్రియనాథుఁ డెవఁడో ఇంకను నిర్ణయము కాలేదు. భవభూతి సొంత యూరగు విదర్భదేశ మందలి పద్మపురమందలి దేవుఁడని ఒక వ్యాఖ్యాత. భవభూతి యేరాజు నాస్థానంపుఁ గవియో ఆకన్యాకుబ్జమందలి దేవుఁ డగునా అని యొకయూహ. 'యో గాధిపురస్య దక్షిణః స కాలప్రియస్య[1] ఉత్తర ఇతి' అను రాజశేఖర వాక్యముం బట్టి 'కాలప్రియ'ము ఒక పురముగా తోఁచుచున్నది. అది ఏదగునో! దాని నాథుని యాత్ర అనుట. ఇతఁడు ఉజ్జయినీ మహాకాళేశ్వరుఁడు. కాళిదాసు పూజించినవాఁడు కాఁ డని యూహింపఁదగును; పేరులు భిన్నము లగుటచేత. మహాకాలుఁడని ప్రసిద్ధుని కాలప్రియుఁడని యేల యనును? యాత్రాయాం - ఉత్సవమునందు. గొప్ప యుత్సవమునకు 'యాత్ర' అని పేరు. 'యాత్ర' నుండి వచ్చినది తెలుగు 'జాతర' - 'తిరునాళ్ళ' అన్నమాట. జగన్నాథుని రథయాత్ర ప్రసిద్ధముగదా. ఆర్యమిశ్రాన్ - 'ఆర్య' అనుటయందే పూజ గలదు. 'మాన్య' అన్నమాట. 'మిశ్రాన్' అని చెప్పుటచే పూజాతిశయము. 'మిశ్ర' పూజ్య వాచకము. 'కర్తవ్య మాచరన్ కామ మకర్తవ్య మనాచరన్ తిష్ఠతి ప్రకృతాచారః సదా ఆర్య ఇతి స్మృతః.' చేయఁదగినదానిం జేయుచు కూడనిదానిని మానుచు ఎల్లప్పుడు సదాచారసంపన్నుఁడుగా నుండువాఁడు ఆర్యుఁడు. ఇట్లు పరిషత్తును గౌరవించుట వారు నాటకమును గౌరవించుటకు. 'అత్రభవన్తః' - ఈ పెద్దలు - ఎదురుగా ఉన్నవారు - ఇదియు గౌరవవాచకము. ఎడముగా ఉన్న వారైన 'తత్రభవన్తః' అని. 'మహానుభావులు మీరు' అన్నమాట. శ్రీకణ్ఠపద లాఞ్ఛనః భవభూతిర్నామ - ఇందు బిరుదు ఏది, పేరు ఏది అని విచారింతురు. 'శ్రీకంఠుఁడ'ని తల్లిదండ్రులు అతనికిడిన పేరు, 'భవభూతి' అని ప్రసిద్ధికెక్కిన బిరుదు - అని ఒక పక్షము.

---

1. కాలప్రియము నగరమనియు, నేఁటి 'కాల్పి' అనియు వేములవాడ శాసనముచే నిర్ధారితము. చూ. ఉపోద్ఘాతము.

శ్లో॥ యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యే వానువర్తతే,
ఉత్తరం రామచరితం తత్ప్రణీతం ప్రయుజ్యతే ౧

---

'తపస్వీ కాం గతోఽవస్థా మితి స్మేరాననా విశ
గిరిజాయాః స్తనౌ వన్దే భవభూతిసితాననౌ."

అని గిరిజా స్తనమున 'భవభూతిం' జెప్పినందున, దానిని మెచ్చుకొన్న రాజుచే భవభూతి యన్న పేరు కవికి బిరుదుగా ఘటితమైన దని అనుకొందురు. ఇదేమి, పేరు-బిరుదు-పెట్టఁదగినంత కల్పనయా? 'సామ్బా పునాతు భవభూతి పవిత్ర మూర్తిః' ఇదియు అంతే. 'హిమాలయో నామ' 'శ్యామో నామ' 'ప్రస్రవణో నామ' 'శ్రమణా నామ' అన్నట్లు 'భవభూతి ర్నామ' అనుటయు. భవభూతి యనియే పేరు. శ్రీకణ్ఠ పదలాఞ్ఛనః-శ్రీః వాగ్దేవి కణ్ఠే యస్య సః - వాగ్దేవి అతని కంఠమున కాపురము అనుట. 'పద' 'లాఞ్ఛన' అను శబ్దముల యోగముచే ఇది బిరుదనుట స్పష్టము-అని ఒక పక్షము. పదవాక్యప్రమాణ తత్త్వజ్ఞః 'పద' మనఁగా శబ్దశాస్త్రము, వ్యాకరణము, 'వాక్య' మనఁగా తర్కశాస్త్రము, 'ప్రమాణ' మనఁగా మీమాంసాశాస్త్రము. వీని 'తత్త్వమును'-రహస్యమును కూలంకషముగా ఎఱింగినవాఁడు అనుట. 'జాతూకర్ణీ పుత్రః' - అతని యమ్మ పేరు జాతూకర్ణి అని. దానిం జెప్పుట ఆమెవలనను తనకుం గల ప్రసిద్ధిని సూచించుటకు, ఆమెను గౌరవించుటకు.

శ్లో. ౧. బ్రహ్మాణం ఇవ=బ్రహ్మనుం బోలె, యం=ఎవనిని, ఇయం దేవీ వాక్=ఈ వాగ్దేవి-పలుకురాణి, వశ్యా = వశము చెందినదిగా - తలఁపులోన మెలఁగు నదిగా, అనువర్తతే=అనుసరించియుండునో, తత్ ప్రణీతం=అతని చేత రచితమైన, ఉత్తరం రామ చరితమ్ = రాముని యుత్తరకథ - పట్టాభిషేకానంతరపుఁ గథ. ప్రయుజ్యతే=ఆడఁబడుచున్నది.

వాగ్దేవి బ్రహ్మకు ఎంత వశ్యయో ఇతనికిని అంత వశ్య. అతఁడు రచించినాఁడు ఉత్తరరామచరిత (నాటక)మును. నేను దానిని ప్రయోగింపఁ బూనుకొంటిని.

భవభూతి వశ్యవాక్కు. దేనింగాని ఎట్లెట్లు చెప్పఁగోరిన అట్లట్లు అనాయాసముగా చెప్పఁగలఁడు. 'అనువర్తతే'-అతని పాండితీ రసికతలకు మరులు గొన్నదై-అని భా. 'ఉత్తరమ్'-పూర్వచరితమును మహావీరచరిత మను పేర తాను మునుపే రచించినాఁడు. 'ఉత్తరమ్' అనఁగా 'శ్రేష్ఠము' అనియు. మాల

ఏషోఽస్మి కార్యవశా దాయోధ్యక స్తదానీన్తన శ్చ సంవృత్తః. (సమన్తా దవలోక్య) భో భో యదా తావ దత్రభవతః పౌలస్త్య కులధూమకేతో ర్మహారాజరామ స్యాయం పట్టాభిషేకసమయో రాత్రిన్దివ మసంహృతానన్దనాన్దీకః, తత్కి మిదానీం విశ్రాన్తచారణాని చత్వరస్థానాని!

---

తిలో 'యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం' ఇత్యాద్యుద్ధత వాక్యన డాఁగినట్లు తోఁచు బిడియమును తొలఁగఁ బలుకునట్లును, వీరచరితమున 'వశ్య వాచః కవే ర్వాక్యమ్' అని అంతకంటె బిట్టుతనము తోఁచునట్లును, 'యం బ్రహ్మాణ మియం దేవీ వాక్' అని యిందు పరిణతప్రజ్ఞను పరిణతాత్మవిశ్వాసమును ప్రకటించునట్లును - ఆపలుకులలో తరతమత అరయఁదగును.

ఏషః అస్మి = ఇదిగో నేను, 'అస్మి' అవ్యయము, 'నేను' అని అర్థము. కార్యవశాత్ - ఈ నాటకప్రయోగముకొఱకు అనుట. ఆయోధ్యకః - అప్పుడు క్రొత్తగా అయోధ్యకు వచ్చినవాఁడు, అయోధ్యావాసి. తదానీన్తనః - అప్పుడు రామ సమకాలమున, ఉన్నవాఁడను. సూత్రి ప్రస్తావనకొఱకు అయూతి యాత్రికు వాఁడగుట ఈ నాటకమునందే. మఱెందును లేదు. పరదేశమునుండి అప్పుడే ఆ యూరనుండుటకు వచ్చినవాఁడైనాఁడు. పౌలస్త్యకుల ధూమకేతోః - పౌలస్త్యుఁడు పులస్త్యప్రజాపతివంశమున బుట్టినవాఁడు, రావణుఁడు. అతనివంశమున కెల్ల - ధూమకేతువు=అగ్ని, నాశకుఁడు అయినవాఁడు - రాముఁడు - అతనియొక్క - అభిషేకసమయః=పట్టాభిషేకసమయము. రావణకుల సంహారముగావించి అయోధ్యకు మరలి క్రొత్తగా రాజ్యపట్టాభిషేకము చేసికొన్న కాలము. దీనిచేత నాటక కథారంభకాలమును సూచితమగుచున్నది. రాత్రిందివం = రేయింబవలు, అసంహృత ఆనన్ద నాన్దీకః=ఎడతెంపులేని ఆనందసూచకములగు మేళతాళములును ఆటపాటలును గలది. విశ్రాన్త చారణాని - (ఆటపాటలు) చాలించుకొన్న నటులు గలవి. చత్వరస్థానాని = ముంగిళ్లు. మిక్కిలి సందడి కలిగియుండవలసిన సమయము, మఱి సందడి లేక యున్నది అని ప్రశ్న కుతూహలము. 'చారణాని' అనుట తరువాత నట (=చారణ) ప్రవేశమునకు సూచకము.

భావ=బావా - నాట్యోక్తియందు సూత్రిని పారిపార్శ్వకుఁడగు నటుఁడు 'బావ' అనియు, నటుని సూత్రి మారిష అనియు పిలుచును. అది పరిభాష. భావ అనఁగా మాన్యుఁడు అని అర్థము.

నటః—(ప్రవిశ్య) భావ, ప్రేషితా హి తే మహారాజేన స్వగృహాన్ ప్రతి లఙ్కాసమరసుహృదో మహాత్మానః ప్లవఙ్గమ రాక్షసాః, సభాజనోపస్థాయినో నానాదిగన్తాగతాః బ్రహ్మర్షయో రాజర్షయశ్చ, య దారాధనాయ ఇయతో దివసాన్ ఉత్సవ ఆసీత్. సంప్రతి హి,-

శ్లో। వసిష్ఠాధిష్ఠితా దేవ్యో గతా రామస్య మాతరః,
అరున్ధతీం పురస్కృత్య, యజ్ఞే జామాతు రాశ్రమమ్. 3

సూత్ర— వైదేశికోఽస్మీతి, పృచ్ఛామి. కః పున ర్జామాతా?

---

లఙ్కా సమర సుహృదః_ఆ యుద్ధమైనంతట ఆ సుగ్రీవాది ప్లవంగములు. విభీషణాదిరాక్షసులు అపుడు రామమిత్రులైనవారు రామునితోకూడనే ఆ పుష్పకమునందే వచ్చినారు. సభాజనోపస్థాయినః (తన్ను) ఆనందం బొందింప (=Congratulate చేయ) వచ్చిన వారు. పదునాలు గేండ్లు అరణ్యావాసము చేసి, తమకు మహోపకార మగునట్లు సకల రాక్షససంహారము గావించి, రాజ్యపట్టాభిషేకము చేసికొనుచున్న రామునికి ఈ సభాజనము ఎంతయు ఆవశ్యకము. మంగళాశాసనము చేయ నరుదెంచిన వారు అనుట. ప్రేషితాః_పంపఁబడినారు. వీడ్కోలు మర్యాదలతో అనుట. బ్రహ్మర్షయః_వామదేవాదులు, రాజర్షయః_జనకాదులు. ఇయతః దివసాన్=ఇన్నిదినంబులును_అనవరతము అనుట. 'దివసాన్' అని కాల వాచక ద్వితీయ అత్యంత సంయోగార్థము_నిముసమేని మానకుండ_ఇయతః_ఇన్ని. ఎన్ని? కొన్ని నెలల దినాలు అనుట. య దారాధనాయ=ఎవరిని సంతోష పెట్టుటకు_అదియే సూత్రి చెప్పినది 'అవస్ద వాస్దిక' అని. ఉత్సవ ఆసీత్=ఉత్సవము_పండుగ జరుగుచుండినది. సంప్రతి హి=మరి యిప్పుడన్ననో, ఇప్పుడు అనఁగా దానికి తరువాత అనుట.

శ్లో. 3. రామస్య మాతరః=రాముని తల్లులైన, దేవ్యః=రాణులు_కౌసల్యా సుమిత్రా కైకేయులు ముగ్వురును, వసిష్ఠాధిష్ఠితాః అరున్ధతీం పురస్కృత్య=వసిష్ఠుఁడు అధిష్ఠాతగా, దారిలో వీరిని విచారించుకొనువాఁడుగా, అరుంధతీదేవిని_ఆడుతోడుగా పెద్దగా_మున్నిడుకొని, యజ్ఞే=యజ్ఞమందు_యజ్ఞమును కన్నులారఁ గాంచను, జామాతుః ఆశ్రమమ్=అల్లుని యాశ్రమమునకు_అల్లుఁడు ఋష్యశృంగుఁడను మహర్షి, గతాః=పోయినారు.

నటః—

శ్లో॥ కన్యాం దశరథో రాజా శాన్తాం నామ వ్యజీజనత్,
అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ యాం దదౌ. ౪

విభణ్డకసుత స్తాం మృశ్యశృఙ్గ ఉపయేమే. తేన ద్వాదశవార్షికం సత్ర మారబ్ధమ్. తదనురోధా త్కఠోరగర్భా మపి వధూం జానకీం విహాయ, గురుజన స్తత్ర గతః.

---

అనఁగా బయటిదేశమునుండి వచ్చినవారు తమ తమ యిండ్లకు పోవుటే కాదు, ఇంటిలో స్వజనము, తల్లులు, వారితో పురోహితుఁడు ఆయన భార్య సయితము పోయినారు అనుట. యజ్ఞము చూడవలసినది, అందులకు అనాహూతు లయ్యు పోవలసినది అని శాస్త్రము. మఱి చెప్పవలయునా! అది పండ్రెండేండ్ల గొప్పయజ్ఞము, దానిని చేయువాఁడు తమ సొంత యల్లుఁడు. కావున తప్పక పోవుట.

ఇది నాటకకవి జిత్తు, బహుప్రయోజనసాధకము. రామునికి సన్నిధిలో ఆ పెద్దలయెడ అవినయాదికమును పరిహరించుటకును, ఆ పెద్దలకును ఆ వివాస మున అనుమతిని పరిహరించుటకును.

వైదేశికః అస్మి ఇతి-పరదేశమువాఁడను అని.

శ్లో. ౪. దశరథః రాజా = దశరథమహారాజు, శాన్తాం నామ కన్యాం = శాంతయను కూఁతును, వ్యజీజనత్ = కనెను. యాం=ఎవతెను - ఆమెను అనుట. అపత్య కృతికాం = పెంపుడు కూఁతునుగా, రాజ్ఞే రోమపాదాయ = (తన మిత్ర మయిన అంగరాజు) రోమపాదమహారాజునకు, దదౌ=ఇచ్చెను.

ఉపయేమే = పెండ్లియయ్యెను. ద్వాదశవార్షికం సత్రం = పండ్రెండేండ్ల యజ్ఞము, తదనురోధాత్ =ఆయనమీఁది దాక్షిణ్యమువలన - ఆయనమాటను తప్పక జరుపవలయుటవలన - కఠోరగర్భాం అపి=పూర్ణగర్భిణియైనను, గురుజనః - తల్లులు గురువులే, వసిష్ఠారుంధతులును గురువులే. వధూం = కోడలిని, అప్పటికే నిండు చూలు అనుటచే, ఆయుత్సవములు అన్ని నెలలు జరిగినవి అనుట. ఉత్తర కాండలో రెండు మూఁడు నెలలని తోఁచునటు లున్నది. ఇంకను దీర్ఘకాలమే అని తలంపఁదగును. అది అంతటి యుత్సవ మనుట.

రాజద్వారం = రాజుగారి దర్వాజాకడకు. తత్ కిం అనేన = దీనితో మన కేమి? మన కేల యీజోలి అనుట. స్వజాతిసమయేన=మన (=నటుల) కుల

సూత్ర—తత్కిమనేన? ఏహి రాజద్వార మేవ; స్వజాతి సమయే నోపతిష్ఠామః.

నటః—తేన హి నిరూపయతు రాజ్ఞః స్సుపరిశుద్ధా ముపస్థాన స్తోత్రపద్ధతిం భావః.

సూత్ర—మారిష,

శ్లో॥ సర్వథా వ్యవహర్తవ్యం, కుతో హ్యావచనీయతా?
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః. ౫

---

ధర్మముచేత - సూత్రియు నటుఁడే - నటాగ్రణి. తత్కులధర్మము - స్తోత్రము సేయుట, ఉపతిష్ఠామః = సేవింతము - బహువచనమునకు ఇట ద్వివచనము అర్థము. 'అస్మదో ద్వయోశ్చ' ఏకత్వే ద్విత్వేచ వివక్షితే అస్మదో బహువచనం వా స్యాత్ - వయం బ్రూమః, పక్షే అహం బ్రవీమి... సిద్ధాంతకౌముది.

నిరూపయతు - 'ఫలానా' అని నిర్ణయించునుగాక, చూచిపెట్టును గాక. సుపరిశుద్ధాం=కడుం బరిశుద్ధమైన-ఎట్టి తప్పును లేని-విప్రాసలు లేమి మొదలైన పరిశుద్ధిగలదానిని.

మారిష - ఇది నాట్యపరిభాషలో సూత్రధారుఁడు పారిపార్శ్వకుని సంబోధింపనైన పేరు. అతని నితఁడు 'భావ' యనియు, ఈతని నతఁడు 'మారిష' అనియు వ్యవహరింపబడెనది.

'సూత్రధారం వదే ద్భావ ఇతి వై పారిపార్శ్వకః
సూత్రధారో మారి షేతి...' సా. ద.

శ్లో. ౫. సర్వథా = ఎల్ల తెఱంగుల, వ్యవహర్తవ్యం = (కులవృత్తి) జరుపవలసినది. అవచనీయతా హి=దూఱు లేకుండుట యన్ననో, కుతః = ఎక్కడిది? - ఎటు చూచినను, ఎంత మెలఁకువ వహించినను, అది తప్పదు అనుట. జనః = జనులు, స్త్రీణాం సాధుత్వే యథా = స్త్రీలయొక్క పాతివ్రత్యవిషయమున నెట్లో, వాచాం (సాధుత్వే) తథా = వాక్కుల - పలుకుల - రచనల తప్పులేని తన మందును, అట్లే, దుర్జనః=దుష్టులు - తప్పు లెన్ను ఖలులు.

ఎట్లెట్లు ఆలోచించిచూచినను, కులవృత్తిని అనుష్ఠించుటయే లెస్స. మానకూడదు. ఎట్లును నింద యేమో తప్పదు. అదెట్లు అని యడిగిన, స్త్రీల

పాతివ్రత్యవిషయమునను వాగ్రచనలవిషయమునను జనులు ఏదియో తప్పు పట్టుచునే యుందురు. వారు అట్టి ఖలులు.

దీనిని సూత్రధారుఁడు తన నాటకప్రయోగముం గూర్చియు, కవి తన నాటకరచనంగూర్చియు చెప్పుకొన్న మాటగాను గొనందగును. కాళిదాసన్నను శాకుంతలమున,

"నటీ—సువిహిత ప్రయోగతయా న కిమపి పరిహీయతే....

సూత్ర—ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్."

అని చెప్పించినాఁడు. నటి 'సువిహిత' అన్నది. ఎంత సువిహితమైనను 'విద్వాంసులు' మెచ్చుకొనవలదా అని సూత్రి అన్నాఁడు. మెచ్చుకొనవలసినవారు విద్వాంసులే అనియు, ఇతరులను తాను సరకుసేయననియు, దీనిని మెచ్చుకొనని వాఁడు విద్వాంసుఁడు కాఁడనియు కవి తన 'యభిమానమును' దాఁచి పలికినాఁడు. ఇతనిని రసార్ణవసుధాకరకారుఁడు సర్వజ్ఞ సింగమనీఁడు 'ఉదాత్త' కవి యన్నాఁడు. బ్రహ్మయంతటివాఁడు తాను (భవభూతి;) మఱి తన కృతియందును వచనీయమును వెదకుదురు లోకులు. "జానన్తి తే కిమపి" మాలతి; 'కుతో హి అవచనీయతా?' "దుర్జనో జనః" ఉ. రా. చ., అని పరాపవాదముచే నిజోత్కర్షం జెప్పుకొన్నాఁడు. ఇతనిని ఆయాచార్యుఁడే 'ఉద్ధత' కవి యన్నాఁడు.

"కవయస్తు ప్రబన్ధార, స్తే భవేయు శ్చతుర్విధాః,
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః,
అన్తర్గూఢాభిమానోక్తి రుదాత్త ఇతి గీయతే.

యథా మాళవికాగ్నిమిత్రే...'పురాణ మి త్యేవే'తి. అత్ర సన్తః పరీక్ష్య త్యనేన వస్తుకృతేః పరీక్షణ క్షమత్వ కల్పితో నిజగర్వః కాళిదాసేనవివక్షిత ఇతి తస్యోదాత్తత్వమ్.

అథోద్ధతః-పరాపవాద స్వోత్కర్షోపాధి రుద్ధత ఉచ్యతే.
యథా మాలతీమాధవే 'యే నామ కేచి ది'తి. అత్ర 'జానన్తి తే కిమపీ'తి పరాపవాదాత్ 'మమతుకోఽపి సమానధర్మా' ఇతి ఆత్మోత్కర్షకథనాచ్చ భవభూతే రుద్ధతత్వమ్."

రసార్ణవ సుధాకర.

నటః—అతిదుర్జన ఇతి వక్తవ్యమ్.

శ్లో। దేవ్యా మపి హి వైదేహ్యాం సాపవాదో యతో జనః,
రక్షోగృహస్థితి ర్మూల, మగ్నిశుద్ధౌ త్వనిశ్చయః. ౭

సూత్ర—యది పున రియం కింవదన్తీ మహారాజం స్పృశేత్, తతః కష్టతరం స్యాత్.

---

‘యథా స్త్రీణాం తథా వాచాం’ ఇత్యాదిని ఇట్లు వావిచ్చి చెప్పుటచేత మాలతీ మహావీరములను పండితులు నరకు సేయలేదని తెలియుచున్నది. ‘యథా స్త్రీణాం’ అనుటలో ఆ చాకలివాని కూఁత రవంత పరామృష్ట మగుచున్నది.

అతిదుర్జన ఇతి వక్తవ్యమ్ - అతిదుర్జనులని చెప్పవలసినది. దీన భవభూతి యుద్ధతత స్పష్టమగుచున్నది.

శ్లో. ౭. యతః = ఏలయన, దేవ్యాం వైదేహ్యాం అపి = దేవి విదేహరాజు కూఁతురు సీత విషయమునసే, జనః = జనము, సాపవాదఃహి = దూఱుతో కూడు కొన్నది ఐనది - దూఱుం బల్కఁజొచ్చినది - కదా. (అందులకు) రక్షోగృహస్థితిః మూలం=రక్కసుని యింట నునికి (మూలం=) కారణము. అగ్నిశుద్ధౌ తు=అగ్ని యందలి (సీతకైన యగ్ని దివ్యమునందు తేలిన) పరిశుద్ధియందు అన్ననో, అనిశ్చయః=విశ్వాసము లేదు.

అతిదుర్జను లని ఏల చెప్పఁదగు ననఁగా, వారు వైదేహీదేవినిగూర్చి సైతము నిందలు పల్కఁజొచ్చినారే! రావణుని యింట నుంట కారణమఁట! అగ్నిశుద్ధిని తాము నమ్మరఁట!

‘దేవి’ అనఁగా పట్టపురాణి దేవతాతుల్య, అయోనిజత్వాది గుణములచేత స్వాభావికముగానే దేదీప్యమానముగా నుండునది; ‘వైదేహి’ - విదేహుఁడు జనకుఁడు శ్రుతులందును ప్రసిద్ధమగు మహామహిమలు గలవాఁడు; అట్టి యాపవిత్రుని కిం గూఁతురు; సర్వథా సతీశీలపతాకయైనట్టిది. ‘అపి’ అట్టియామె యైనను అనుట. (అట్టి - వశ్యవాక్కు రచనల యందును - అనుట) ‘హి’ని కూడ ‘అపి’తో కలుపుకొని ఈయర్థమునే మఱింత యవధారితము చేయఁదగును. అపవాదస్వరూపమును వాచ్యభంగిగా వావిచ్చి చెప్పలేదు.

యది పునః ఇయం కింవదన్తీ మహారాజం స్పృశేత్ - ఈజనవాదము మహారాజును తాకెనా - అనఁగా మహారాజునకు అందెనా, చెవికివచ్చెనా - కష్టతరం = మిగులఁ గష్టము. మహారాజు గావున అట్టి నిందను ఓర్వఁజాలఁడు. మఱి యేమి

సర్వథా ఋషయో దేవతాశ్చ శ్రేయో విధాస్యన్తి. (ఇతి పరిక్రమ్య) భోభోః క్వేదానీం మహారాజః? (ఆకర్ణ్య) ఏవం జనాః కథయన్తి.

శ్లో॥ స్నేహాత్సభాజయితు మేత్య దినా న్యమూని
నీ త్వోత్సవేన జనకో౽ద్య గతో విదేహాన్,

---

పొసఁగునోగదా—అనుట. అందుననియు కష్టము కలుగుననియు, అనఁగా రాముఁడు సీతను వివాసనము చేయుననియు సూచన.

సర్వథా ఋషయః దేవతాః చ శ్రేయః విధాస్యన్తి—ఎల్లవిధముల ఋషులును దేవతలును మేలుసేయుదురు. జగన్మంగళకారణము ఈదంపతులు. వీరికి చెట్ట కలుగునేని జగమే నిర్విణ్ణమగును. దానిం దొలంచుటకు జగన్మంగళ పర్యవేక్షకులు, వీరిచే రావణ సంహారాదివలన కరము ఉపకృతులు, ఆ ఋషులును దేవతలును తామే యతనము సేయుదురు అనుట. కింవదంతి రాజుం దాఁకుట, గొప్ప కష్టము కలుగుట, పృథ్వీ భాగీరథ్యాది దేవతలును ప్రాచేతసాది మహర్షులును దానిని నివారించి, సీతారామ పునః సంయోగముం గూర్చుట అని సకల నాటకవస్తువును సూక్ష్మముగా సూచింపఁబడినది. భోః క్వ ఇదానీం మహారాజః? = ఓహోయి ఇప్పుడు మహారాజు ఎక్కడ ఉన్నాఁడు? ఆకర్ణ్య-విని-అనఁగా వినుటను అభినయించి అని ఆ నటునికి అభినయమునకై ఎచ్చరిక. ఇది 'ఆకాశ భాషితము' అనఁబడును. పాత్రప్రవేశము లేకయే 'ఓహోయి' అని పిలిచి ప్రశ్న యడిగి, దానికి ఎవరో జవాబు చెప్పినట్లును దానిని తాను విన్నయట్లుగా అనువదించుట ఆకాశభాషితము; రవంతకోసము మఱియొక పాత్రప్రవేశమును మాన్పు ఉపాయము.

కిం బ్రవీ ష్యేవ మిత్యాది వినా పాత్రం బ్రవీతి యః
శ్రు త్వే వాను క్త మప్యర్థం స్త త్స్యా దాకాశభాషితమ్.

శ్లో. 2. స్నేహాత్ = (కూఁతునందలియు అల్లునియందలియు) అర్మిలివలన, సభాజయితుం = ఆనందమిడుటకు, ఏత్య = వచ్చి, అమూని దినాని = ఈదినములు, ఉత్సవేన=పండువుతో, సంతోషముతో, నీత్వా=కడపి, జనకః=జనకమహారాజు, అద్య=ఇప్పుడే, విదేహాన్=విదేహదేశమునకు, గతః = వెడలినాఁడు. తతః=అందువలన, విమనసః = మనసునం గుమారిలుచున్న, దేవ్యాః = సీతాదేవియొక్క (=సీతాదేవిని), పరిసాన్త్వనాయ = ఊఱడించుటకై, నరేన్ద్రః = రాజు, ధర్మాసనాత్ =

దేవ్యా స్తతో విమనసః పరిసాన్త్వనాయ
ధర్మాసనా ద్విశతి వాసగృహం నరేన్ద్రః.
(ఇతి నిష్క్రాన్తౌ.)

ఇతి ప్రస్తావనా

---

ధర్మాసనమును, ఆస్థానకార్యాసనమును విడిచి, వాసగృహం = పడుకటింటిని, విశతి=ప్రవేశించుచున్నాఁడు.

పదునాల్గేండ్లకు అక్షతదేహులుగా అరణ్యవాసమునుండి మరలి రాజ్యమున పట్టాభిషిక్తులగుచున్న కొడుకునకు అల్లునికి ఆనందము కలిగింపను ఎంతో ఆర్తిలితో ఇచటికి వచ్చి జనకమహారాజు ఇన్నాళ్ళు ఆ యుత్సవములం గడపి ఇప్పుడే వారిని వీడ్కొని ఊరికి పోయినాఁడు. దానివలన సీత చాల ఖిన్నగా నున్నది. ఆమెను ఓదార్చుటకై రాముఁడు కార్యాసనమునుండి సీతయున్న పడుకటింటికి పోవుచున్నాఁడఁట.

స్నేహాత్ - అట్టిసమయమున నాయనయు మామయునగు జనకుఁడు అంతస్నేహపారవశ్యమున వచ్చియుండుటను, వారిని ఆయుత్సవమును చూడను కానుకలు పెట్టి వారిని దీవించి సంతోషపెట్టను! 'అమూని దినాని' - అనఁగా నెలలయినను కొన్నిదినములే అని తోఁచుచున్నది. విదేహాః - దేశవాచకములు సంస్కృతమున బహువచనముగా నుండును. - విదేహజనపదములు అనుట. నిమి, జనకుల కూటస్థుఁడు ఇట 'విదేహుఁడు' - దేహమును విడిచినవాఁడు - ఐనందున దానికి 'విదేహ' నామమని పౌరాణికులు. అట్టి కారణములం బేర్లు దేశములకుం గలుగును, అట్టిది మఱియొకటి, కాముఁడు అంగము విడిచిన చోటు అంగదేశము. జనకుని వీడ్కోలు, సీత విమనస్కత, తనకును ఆడే, ఇవి కలిగియున్నను, అదినమును రామ మహారాజు యథావిధిగా ధర్మాసనమునకుం బోకుండ నుండలేదు. వాసగృహం - శయనాగారము. కఠోరగర్భయు సద్యః పితృవిరహ విమనస్కయుం గావున శయనాగారమున ఉన్నది. వాసగృహం = పడుకటిల్లు అని అమరవ్యాఖ్య. వట్టి కాపురపుటిల్లు గాదు. సీతకు ఇపుడు ఈ యూరార్పు కరము అవశ్యకము. రాజు ధర్మాసనమునుండి లేచుట సామాన్యముగా మధ్యాహ్నమున, మాళవికాగ్నిమిత్ర మోర్వశీయములవలనను ప్రియదర్శికారత్నావళ్యాదులవలనను ఇది ప్రసిద్ధము. ఒకవేళ రాముఁడు బలవత్కారణములు కలిమి, నేఁడు ఇంచుక

ముందుగా ధర్మాసనమునుండి లేచినాఁడా? రామునియందు రాచకార్యములలో అట్టి వ్యతిక్రమము ఉండదు.

ఇతి - నిష్క్రాన్తా - అని - నిష్క్రమింతురు. ఇది వారికి నిష్క్రమణ వ్యాజము. 'రా, రాజద్వారమునకే పోయి' - అని అన్నాడుగదా. వీరు చత్వరములో ఉన్నారు. ఇంక వాసగృహముకడకు పోయెదరు.

వసిష్ఠారుంధతీమాతలను అల్లే జనకుని సయితము సన్నిధిలో లేకుండ చేసిన నాటకసన్నివేశమును కుదుర్చుచున్నాఁడు కవి, వివాసనమునకు అనుకూలమగునట్లు.

ఇతి ప్రస్తావనా - ప్రస్తావన ముగిసినది. ప్రస్తావన యనఁగా - నటియేని విదూషకుఁడేని పారిపార్శ్వకుఁడేనియు సూత్రధారునితో స్వకార్యములంగూర్చి చిత్రవాక్యములతో ఆరంభించి నాటకవస్తువును ప్రశంసించునట్టి సంభాషణ. అది ఆముఖమనియు ప్రస్తావనయనియు పేర్కొనఁబడును.

'నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రై ర్వాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభి ర్మిథః
ఆముఖం తద్విజానీయాత్ బుధైః ప్రస్తావనోచ్యతే.' సా. ద.

ఇట ఈ ప్రస్తావన పారిపార్శ్వక సూత్రధారుల భాషితములది. ఇందు నాటకవస్తువు సూచింపఁబడినది; సీతారామ పాత్రప్రవేశము సూచింపఁబడినది. ప్రరోచనయుం గలదు. 'ప్రస్తుతాభినయేషు ప్రశంసాతః శ్రోతౄణాం ప్రవృత్త్యున్ముఖీకరణం ప్రరోచనా.' అని సా. ద. ఇందులకు శ్రీహర్ష నాటకములయందలిది 'శ్రీహర్షో నిపుణః కవిః' ఇత్యాది ప్రసిద్ధోదాహరణము. ఇం దన్నో "అస్తి తత్రభవాన్" మొదలైనదియు, "యం బ్రహ్మాణం" మొదలైనదియు కవి ప్రశంస; "ఉత్తరం రామచరితం" అని వస్తుప్రశంస. "ఆర్యమిశ్రాః" ఇత్యాది పరిషత్ ప్రశంస; "స్వజాతిసమయేన ఉపతిష్ఠావః" "సర్వథా వ్యవహర్తవ్యమ్" ఇత్యాది నటప్రశంస-అని దిక్కు. ఇట్లితరమును అరయఁదగును. ఇందు నటుఁడు పారిపార్శ్వకుఁడు నిత్యాయోధ్యావాసియు, సూత్రధారుఁడు ఆగంతుకుఁడును ఐయుండ, వారినడుమ 'భావమారిష' వ్యవహారము పొసఁగునా అనిన, ఏల, పొసఁగనే పొసఁగును; అది రమణీయమును, ఇట ఈ ప్రస్తావన సంలాపమునకు మిక్కిలి పనికివచ్చునదియు.

# ఉత్తరరామచరితనాటకమ్

## ప్రథమాఙ్కః

(తతః ప్రవిశ త్యుపవిష్టో రామ, స్సీతాచ.)

రామః — దేవి, సమాశ్వసిహి; తే హి గురవో న శక్నువన్తి విహాతు మస్మాన్.

శ్లో॥ కి న్త్వనుష్ఠాన నిత్యత్వం స్వాత న్త్ర్య మపకర్షతి,
సఙ్కటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయై ర్గృహస్థతా. ౧

---

ప్రవిశతి ఉపవిష్టః=కూర్చున్న వాఁడుగా ప్రవేశించుచున్నాఁడు. ప్రస్తావనాంతమున సూచింపఁబడినట్లు అనుట. 'ప్రవేశము' అనఁగా పరిషత్తునెదుట రంగాన అగపడుట అని నాటకపరిభాష. సమయమున నిద్రితుఁడును మూర్ఛితుఁడును గూడ ప్రవేశించును.

సమాశ్వసిహి_ఊఱడిల్లుము. తే హి గురవః=ఆపెద్దలు - జనకులవారినే ముఖ్యముగా ఉద్దేశించినను, వీడ్కొనిపోయిన పెద్ద లెల్లరం గూర్చియు. న శక్నువన్తి హి - శక్తులు గారు సుమా - పోవను ఇచ్ఛగింపకున్నను, మానలేక పోయినారు అనుట.

శ్లో. ౧. కింతు=ఐనను, అనుష్ఠాన నిత్యత్వమ్=(అగ్నిహోత్రాది ధర్మములను) అనుష్ఠించుట ఒక్కనాఁడును తప్పఁగూడని దగుట, స్వాతన్త్ర్యమ్ = స్వేచ్ఛావర్తనమును, అపకర్షతి = పోఁగొట్టును. ఆహితాగ్నీనాం = అగ్నిని (నిత్యోపాసనకై) ఉంచుకొన్న గృహస్థులకు, గృహస్థతా=(అట్టి) గృహస్థధర్మము, ప్రత్యవాయైః=(కూడనివానిం జేయుట, వలసినవానిని మానుట మొదలగువానం గలుగు) పాపములచేత - దోషములచేత, సఙ్కటా హి=క్లేశావహము గదా.

దేవి, వారికి అనుష్ఠానము ఒక దినమైనను మానఁదగినది గాదు; చేసితీఱవలయును. అట్లు శాస్త్రము. కాఁగా వారికి బొత్తిగా స్వాతంత్ర్యము ఉండదు. ఆహితాగ్నులయిన గృహస్థులు ఎక్కడ ఏప్రత్యవాయము కలుగునో యని చాల సంకటపడుచుందురు. కావున వారికి మనలను విడిచిపోవలసివచ్చినది.

సీతా—జాణామి అజ్జఉత్త; కిందు సందావఆరిణో బన్ధుజణవిప్పఓఆ హోంతి. [జానామి, ఆర్యపుత్ర; కిన్తు సన్తాపకారిణో బన్ధుజన విప్రయోగా భవన్తి.]

---

'అనుష్ఠాననిత్యత్వాత్' అను పాఠము శ్లాఘ్యము గాదు. ఆపక్షమున పూర్వార్ధము నొక వాక్యముగాఁ గొనుటకు అది కర్తృహీన మగును. శ్లోకము నెల్ల ఒక్క వాక్యముగా-'ఆహితాగ్నీనాం ప్రత్యవాయైః సఙ్కటా గృహస్థతా అనుష్ఠాననిత్యత్వాత్ స్వాతన్త్ర్యమ్ అపకర్షతి హి,' అని అన్వయించుకొనవలయును. అదియు అంత సరసము గాదు. నిత్యత్వమ్ అను పాఠమును, రెండు వాక్యములుగా అన్వయమును శ్లాఘ్యము. మఱియు 'సఙ్కటా' అనఁగా 'నిబిడా' మెండుకొని నిండియుండును - అను నర్థము తాత వీరరాఘవులు చెప్పినది సరి గాదు. ఆపక్షమున ప్రత్యవాయాస్పదము గాని గార్హస్థ్యమును, అట్టి గృహస్థుఁడును లోకమున ఎన్నఁడును లేఁడని యేర్పడును. జనకాదు లన్నను ప్రత్యవాయ స్పర్శ సయితము లేనివా రనఁదగును. 'దుఃఖకరము - క్లేశావహము' అని చెప్పనొప్పును. వీరరాఘవవ్యాఖ్యలో పక్షాంతరముగా 'దుఃఖరూపా' అని యున్నది. అదియే శ్లాఘ్యపక్షము. 'అరిది గాద' వే. వేం. శాస్త్రులవారి యనువాదము. ఆహితాగ్నులు గృహస్థతను ప్రత్యవాయములు పొసఁగకుండ నడుపుకొనుట మిక్కిలి కష్టము - అసాధ్యము గాదు. గృహస్థు అగ్నిని ఇంటినుండి సులభముగా ప్రయాణములయందు తీసికొని రాఁగూడదు. ఇంట శిష్యులకు వదలి వచ్చిన వారు కర్మ యథావిధిగా జరుపుదురో జరుపరో, వారికిని అభ్యంతరము కలిగి హోమము నిలిచిపోవునేమో. ఆ నిత్యతకు భంగము రానేకూడదు. ఇట్టి ప్రత్యవాయములు పొసఁగునను దిగులు ఆహితాగ్నులను సంకట పెట్టును. కనుక వారు దీర్ఘకాలము ఇంటిని వదలి అగ్నిని వదలి ఉండఁజాలరు - అని భావము. నాగానందమున జీమూతకేతువు, ఇంట మఱి అంతగా దిక్కు లేనివాఁడు, అగ్నిం గొనియే బయలుదేఱును. "సాగ్నినా మేవ అస్మాకం యుక్తం అనుసర్తుమ్... వయ మపి అగ్నిశరణా దగ్ని వాదాయ త్వరిత మేవ ఆగచ్ఛామః" నాగా. V.

జానామి ఆర్యపుత్ర = ఎఱుంగుదును ఆర్యపుత్రుఁడా, - దీనిచే సీతకు గల కర్మనిష్ఠాగౌరవము తెలియును. బన్ధుజన విప్రయోగాః=బంధుజనులతోడి - నాయనం బోనివారితోడి - యెడబాట్లు, సన్తాపకారిణః = 'అప్పటికి' 'తాత్కాలికముగా నైనను' అనుట - సన్తాపకారిణః=సంతాపము (=చిత్తఖేదము) కలిగించునవే, కాలక్రమమున మనస్సునకు సమాధానము కలిగినను, అనుట. దీనిచే సీతకుఁ గల బంధుప్రేమాతిశయము సూచితము.

రామః—ఏవ మేతత్. హృదయమర్మచ్ఛిద స్సంసారభోగాః, యేభ్యో బీభత్సమానా స్సర్వా న్కామా న్పరిత్యజ్యారణ్యే మనీషిణో విశ్రామ్యన్తి.

కఞ్చుకీ—(ప్రవిశ్య) రామభద్ర, (ఇత్యర్ధోక్తే సాశఙ్కమ్) మహారాజ.

---

ఏవ మేతత్ = ఇది యట్లే - హృదయ మర్మచ్ఛిదః - హృదయమందలి ఆయమును చీల్చునవి, సద్యః ప్రాణాపహారకములు - అనఁగా అంతటి బాధకలిగించునవి అనుట. దేహమున 108 మర్మములు (=ఆయములు) అనఁగా జీవస్థానములు కల వందురు, ఎందు ఘాత ప్రాణహరమో. ఐనను ఘాత దానిదానియందు వేఱువేఱు అవధిగా ప్రాణాపాయము కలిగించును. హృదయమందలిది అన్నిటో తత్క్షణమే. సంసార భోగాః = ఐహికభోగములు. 'ంభావాః' - అనియు పాఠము. 'స్థితయః దశావిశేషాః' - విషయములు అని యర్థము. 'ంభాగాః' అను వీరరాఘవుల యచ్చుతప్పునుండి 'భోగా' అనుపాఠము ఊహితము. బీభత్సమానాః = రోఁతగొనువారై, మనీషిణః = జ్ఞానులు, విశ్రామ్యన్తి = విశ్రమింతురు - హాయిగా నుందురు. ఈ మాట సీతను అరణ్యముల చూడ వాసఁ గొల్పుటకుగా కవిహృదయము కాఁబోలు.

కఞ్చుకీ ప్రవిశ్య - నౌకరు గావున సూచన లేకయే ప్రవేశము. "అన్తః పురచరో వృద్ధో విప్రో గుణగణాన్వితః" అనియు, 'యే విద్యా సత్త్వ సంపన్నాః కామదోష వివర్జితాః । జ్ఞాన విజ్ఞాన కుశలాః కాఞ్చుకీయాస్తు తే స్మృతాః' అనియు లక్షణము. రాజాంతఃపురమున నియోగమునకు అట్టివాఁడుగా ఉండవలయును. కంచుకము - పొడుగుపాటి చొక్కా - తొడుగుకొనియుండువాఁడు, తన నియోగమునకు గుర్తుగా. రామభద్ర - 'భద్ర' చేర్చిన సంబోధన నిర్దేశములు రాముంగూర్చి వయస్సుచే పెద్దలు చేయుదురు. 'భద్ర' ఆశీర్గర్భము. అర్ధోక్తే సాశఙ్కమ్ - సగము పలికి జంకుపడి, అట్లు పిలుచుట అలవాటు బలిమిచేత. జంకు పడనేల? తాను ముసలివాఁడు, బ్రాహ్మణుఁడు, ఇన్నాళ్లును చిన్నప్పటి వాడుక బడి రాముని రామభద్రా యని పిలుచుచుండెను. మఱి యిపుడు పట్టాభిషేకమై రాముఁడు రాజయినాఁడు; కావున దేవ, మహారాజ మొదలగువిధమున పిలువవలసినది. అది జ్ఞప్తికి వచ్చి. అలవాటు బలిమిచేత తాను పొరపాటు చేసితిని కదా యని మాట సగములో ఆపుటయు, జంకుటయు, 'మహారాజ' అని దిద్దుకొని పలుకుటయు. 9 నెలలైనను ఇంకను క్రొత్తయా? ముదిమివలని తడబాటు.

రామః—(సస్మితం) ఆర్య, నను రామభద్ర ఇత్యేవ మాం ప్రత్యుపచారశ్శోభతే తాతపరిజనస్య, తద్యథాభ్యస్త మభిధీయతామ్.

కఞ్చుకీ—ఋశ్యశృఙ్గాశ్రమా దష్టావక్ర స్సంప్రాప్తః.

సీతా—కిం విళంబీఅది ? (కిం విలమ్బ్యతే ?)

---

సస్మితమ్ - పొరపాటునకును తడబాటునకును నవ్వు. రాజయిన క్రొత్త యని భావము. ఉపచారః = మర్యాద. తాత పరిజనస్య = నాయన నౌకరులకు, అనఁగా నాయనగారి దినాలనుండి నౌకరులుగా నుండి అట్లు వ్యవహరించుచున్న వారికి అనుట. నను శోభతే = రాణించును గదా - నిక్కముగా. దీన రాముని వినయము సూచితము. అష్టావక్రః సంప్రాప్తః=అష్టావక్రులవారు వచ్చినారు - గురు సందేశమును తెచ్చియుందు రని సూచన. అష్టావక్రుఁడు ఒక గొప్ప ఋషి. కహోదమహర్షికి కొడుకు, ఉద్దాలకునికి దౌహిత్రుఁడు, గర్భమున నుండియే నాయనను తాను విద్యాతిసంగియై అమ్మను విచారించుట లే దని తిట్టి ఆయనచేత 'యస్మాత్ కుక్షౌ వర్తమానో బ్రవీషి తస్మాత్ వక్రో భవితాసి అష్టకృత్వః' అని శాప మొంది ఎనిమిది వంకరలతో పుట్టెను. తరువాత ఒకప్పుడు నాయన యనుగ్రహమునచే నిర్వక్రతం బొందెను. ఇది మఱియొక పాఠము - అష్టావక్రుఁడు ఏకపాదునికి సుజాతయందు పుట్టిన కొడుకు. ఇతఁడు గర్భమున నుండుకాలమున అనవరతము శిష్యులచే వేదాధ్యయనము చేయించుచు ఉండు తన తండ్రితో శిష్యులు నిద్రలేమిం జేసి చదువు తప్పఁ జదువుచున్నారు అనినందులకు తండ్రి కోపగించి నీవు అధ్యయనంబునకు వక్రముగా పలికితివి, కావున అష్టవక్రుఁడవై జన్మింపుము అని కొడుకునకు శాపము పెట్టెను. ఇతఁడు అతితేజస్వియు లోకపూజితుఁడు నై యుండెను. ఈతని కురూపము చూచి ఒకప్పుడు రంభాద్యప్సరసలు నవ్వినందున వారు దొంగలచే పట్టువడునట్లు శపింపఁబడిరి. అది కారణముగా, వారు గోపికలుగా పుట్టి కృష్ణునికి భార్యలుగా నుండి అతని నిర్యాణానంతరము అర్జునుని వెంట వచ్చు నవసరమున దొంగలచే పట్టువడిరి. భవభూతి ఇట ఈయనం దెచ్చుట ఆయన మహాప్రభావతను, రాముఁడు సీతయు తచ్ఛరీర వక్రతాదిని చూడక తపస్వితను బాంధవమును గౌరవించుటను ప్రకటించుటకు.

కిం విలమ్బ్యతే - విలంబము ఏల? ఋశ్యశృంగుఁడు, శాంత, జన్నము, అత్తలు - అందఱును జ్ఞప్తికి వచ్చి, అట్టివారికడనుండి వచ్చినవానిం గూర్చియు ముందు నివేదించుటచేత నగు విలంబము ఏల యని భావము. ఈ సీతపలుకున రామ

రామః—త్వరితం ప్రవేశయ.

(కఞ్చుకీ నిష్క్రాన్తః)

అష్టావక్రః—(ప్రవిశ్య) స్వస్తి వామ్.

రామః—భగవ న్నభివాదయే. ఇత ఆస్యతాం.

సీతా—ణమో దే. అవి కుసళం సఅల గురుఅణస్స? అజ్జాఏ సంతాఏ? (నమస్తే. అపి కుశలం సకల గురుజనస్య? ఆర్యాయాః శాన్తాయాశ్చ?)

రామః—నిర్విఘ్న సోమపీథీ మే భావుకో భగవా నృశ్యశృఙ్గః?

సీతా—అమ్హే వా సుమరేది? [అస్మా న్వా స్మరతి?]

అష్టా—(ఉపవిశ్య) అథ కిం. దేవి భగవా న్వసిష్ఠ స్త్వామాహ.

---

హృదయజ్ఞత చేతనైన అభేదభావన, సందేశము సమాచారములు వినను సీత తొందరయు తోఁచును.

త్వరితం ప్రవేశయ - రాముని భక్తిగౌరవములు సూచితములు.

ఇట్లు ఆశ్రమమునుండి సందేశము తెచ్చుటచే వసిష్ఠకౌసల్యాదులు ఇందుండి పోయి కొన్నాళ్లైనదని తలంపఁదగును.

ఇతః ఆస్యతామ్=ఇటఁ గూర్చుండుఁడు. కూర్చుండ చోటు చూపుట ఆదరాతిశయముచేత.

సమగ్రస్య గురుజనస్య = గురుజనుల కెల్లరకును. ఇట్లు సీత ముచ్చటాడి అడుగుట ప్రేమగౌరవా ద్యతిశయముచేత. ఆర్యాయాః - ఆఁడుబిడ్డకును అక్క అని నిర్దేశవ్యవహారములు. ఇపుడు మన యిండ్లయందును అట్టిది కలదు. భర్తకు అక్క తనకును అక్క.

నిర్విఘ్నసోమపీథీ(తి) - అను సమాసపాఠము మంచిది. అపి - ప్రశ్నార్థకము. నిర్విఘ్నముగా సోమపానము గావించినారా? ఆవుత్తః = బావ - ఆర్య - అక్క. ఇది రాముని శ్రౌతకర్మశ్రద్ధను తెలుపును. - ఆ సత్రాన సోమపానము ఎన్నాళ్ళకో.

స్మరతి - కాపవుచే, గొంతు సవ్వడిచే ప్రశ్న - తలంచుకొనునా? ఈ ప్రశ్న స్త్రీసదృశము.

అథకిం - నాటకసంభాషణలో 'అవును' అని యర్థము. మఱేమి ఇఁక నేమి అని అవయవార్థము చెప్పరాదు.

త్వాం ఆహ=నీకు చెప్పెను - చెప్పిపంపినాఁడు అనుట.

శ్లో॥ విశ్వమ్భరా భగవతీ భవతీ మసూత,
రాజా ప్రజాపతిసమో జనకః పితా తే,
తేషాం వధూ స్త్వ మసి నన్దిని పార్థివానాం
యేషాం గృహేషు సవితా చ గురు ర్వయం చ. ౨

అ త్రి - మన్య దాశాస్మహే! కేవలం వీరప్రసవా భూయాః!
రామః — దేవి, అనుగృహీతాః స్మః.

---

శ్లో. ౨. భగవతీ విశ్వమ్భరా = మాహాత్మ్యవతి యైన భూదేవి, భవతీం = నిన్ను, అసూత=కనెను. ప్రజాపతి సమః=బ్రహ్మకు సమానుఁడైన, రాజా జనకః = జనకరాజు, తే పితా=నీకు తండ్రి, నన్దిని=పట్టీ, యేషాం గృహేషు = ఎవరియింట, సవితా గురుః = (కూటస్థుఁడగు) సూర్యుఁడు పెద్దయో, తండ్రియో, వయం చ = మేమును, గురవః = పెద్దనో - పురోహితుఁడనో అచార్యుఁడనో, తేషాం పార్థివానాం=ఆరాజులకు, త్వం వధూః అసి=నీవు కోడలివి అగుదువు.

అమ్మ సాక్షాత్తు విశ్వంభరాభగవతి. నాయన బ్రహ్మతుల్యుఁడు జనకుఁడు. నీ (యత్త)మామలు సూర్యవంశపురాజులు, నా శిష్యులు. ఇఁక నీకేమి తక్కువమ్మా!

'విశ్వమ్భరా' విశ్వము నెల్ల మోచు తల్లి అని యామె మహిమయు ఓర్పును. 'భగవతీ' - ఆమె దేవతయు. 'భవతీం' - వసిష్ఠులవారికిని సీతయందు అట్టి గౌరవము. 'భవతీం' - అమ్మ, నిన్ను అనుట. 'ప్రజాపతిసమః' - బ్రహ్మతుల్యుఁడు, అంతటిగొప్పవాఁడు మహాత్ముఁడు అనుట. 'పితా' పాలయితా - పోషించి శిక్షించి పెంచినవాఁడు. 'గృహేషు' - ఇది సాధు పాఠము. గృహ శబ్దమునకు బహువచనముననే ప్రయోగము, ఏకవచనము అర్థము. 'కులేషు' - అపపాఠము. బహువచనము నిరర్థకము, అపార్థముగలదియు. 'సవితా' అభిజన సూచకము. వయం చ - ఇది ఆత్మస్తుతి కాదు. 'సతాం హి సన్దేహపదేషు' 'సతాం సద్భిః సఙ్గః' అనువానింబోనిది.

కిం అన్యత్ = ఇంతకన్న మఱియేది? సకలాశీర్వాద ఫలములు ఇందే ఇమిడియున్నవి - అనుట; కేవలం వీరప్రసవా భూయాః=కేవలము - తప్పక - వీరునిఁ గన్నదానవు అగుదువుగాక - వీరునిం గందువుగాక. ఇది ఈ సమయమున పలుకఁదగినది. ఇంతే. దీన పురుషసంతానము సూచితము.

అనుగృహీతాః స్మః - దానికి జవాబు రాముఁడు అందుకొని చెప్పుచున్నాఁడు- ఆయాశీర్వాదమున తనకు, తమ వంశమునకుఁ గల ఫలముం బట్టిన సంతోషము చేత. ప్రసవ ప్రస్తావమున సీతకు సిగ్గుకలుగును గాన ఆమె అందుకొనదు. మఱియు

శ్లో॥ లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే,
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థో నుధావతి. 3

అష్టా—ఇదం చ భగవ త్యారున్ధత్యా దేవీభి శ్శాన్తయా చ

---

ఈ భాషితమునకు ముందు 'దేవి' అను సంబోధన యుండుట శ్రేయస్కరపాఠము. 'లౌకికానాం' ఇత్యాదిశ్లోకమునకు ఇది అవతారిక. ఆశీర్వాదము పొల్లు గాదని దంపతులు కలియఁబలుకుకొని సంతోషించుట.

శ్లో. 3. లౌకికానాం=సామాన్యసంసారులగు - లౌక్యులగు, సాధూనాం=సజ్జనులయొక్క, వాక్=వాక్కు=పలుకు, అర్థం=అర్థమును, వారు చెప్పఁగోరినదానిని, అనువర్తతే హి=అనుగమించును గదా. ఆద్యానాం ఋషీణాం పునః = తొల్లింటి - పురాణులైన - ఋషులయొక్క యన్ననో, వాచం = వాక్కును=పలుకును, అర్థః= (దాని) అర్థము, అనుధావతి=వెంబడి పరువెత్తి వచ్చును.

లౌక్యులగు సాధువులు అర్థమును తలంచుకొని దానికి తగిన మాటలు పలుకుదురు. ఆద్య పరమ మహర్షులు అర్థము అనుకొనకయే పలుకు పలుకుదురు, కాని ఆయర్థము తఱుముకొనివచ్చినట్లు వచ్చి ఆపలుకున నిలుచును. ఆపలుకు తప్పక నిజమగును, జరిగి తీఱును.

'సాధూనాం' - సజ్జనులు, చెప్పఁగోరినదానిని నూటిగా చెప్పువారు, కాకువులు అలీకములు వ్యళీకములు కావలయు నని చెప్పువారు కారు అనుట. వారు తాము చెప్పఁ గోరిన యర్థమునకు సరియగు మాటలు ప్రయోగింతురు. అర్థమును మాటలు అనుసరించును. 'ఆద్యానాం' - పురాణుల - ఇట వసిష్ఠుఁడు మన్వంతరపురాణుఁడు. 'ఋషీణాం' - 'ఋషయః సత్యవచసః' - ఋషుల నోట వచ్చు మాట సత్యమగును. వసిష్ఠుఁడు మహర్షి; మఱి చెప్పవలయునా? అనుధావతి = వెంట పరువెత్తుకొని వచ్చును. 'అనువర్తతే అనుధావతి' - అను వీని తారతమ్యమును అరయఁదగును.

ఈసూక్తి ఋషివాక్కుంబోనిది. ప్రత్యగ్ దృష్టి లేని కవి ఈలోకోత్తర సూక్తిని చెప్ప నేరఁడు. భవభూతి అట్టిదృష్టి గలవాఁ డని - ప్రత్యగ్ జ్యోతిః ప్రకాశము గలవాఁ డని - ఎంచఁదగును. ఇట్టివానిని కాళిదాసును చెప్పఁగలఁడు.

భగవత్యా అరున్ధత్యా, దేవ్యా శాన్తయా చ - దేవీభిః శాన్తయా చ అనియు పాఠము. ఆపాఠమున శాంతాదేవిచేత అని. ఈ పాఠమున కౌసల్యాదిదేవుల చేతను శాంతచేతను అని. భూయః భూయః = మాటిమాటికి - మిక్కిల యక్కుఱం

భూయోభూయ స్సన్దిష్టం - య కశ్చి ద్గర్భదోహదోఽస్యా సోఽచిరాత్ సమ్పాదయితవ్య ఇతి

రామ — క్రియతే యద్యేషా కథయతి

అష్టా — వనాన్దు పత్న్యా చ దేవ్యా స్సన్దిష్ట మృశ్యశృఙ్గేణ - వత్సే కఠోరగర్భేతి నానీతాసి వత్సోఽపి రామభద్ర స్త్వద్వినోదార్థమేవ స్థాపిత తత్పుత్రపూర్ణోత్సఙ్గా మాయుష్మతీం ద్రక్ష్యామ ఇతి

---

దెలుపుడు దోహదసంపాదనకు సందేశమును ముఖ్యముగా అనుభవశాలిను లగు స్త్రీజనులు చెప్పి పంపుట అరయ దగును ఇది ఒకవిధముగా జూడ సీతను అడవి తప్పక పంపు మనుట అగును గర్భదోహద - కోరిక - గర్భకాలమున తోచు నపూర్వవస్త్వభిలాష గర్భకాలమున కలుగు దోహదమును దీర్పకున్న ప్రత్యవాయము కలుగునని భిషగ్వరుడు సుశ్రుతాచార్యుడు - దౌహృద విమాన నాత్ కుబ్జం కుణిం ఖఞ్జం జడం వామనం వికృతాక్షు మనక్షం వా నారీ సుతం జనయతి అని అన్నాడు గర్భిణి ఏయింద్రియార్థముల యనుభవమునకైన కోరిక తీఱదో గర్భమునకు ఆయింద్రియపు వైరూప్యము వైకల్యమును కలుగును అని

క్రియతే యద్యేషా కథయతి - ఈమె చెప్పనేని జరుప గలవాడను పద్మినియు గాఢలజ్జయు గాన చెప్పదు బిడియపడును అనుట యదేషా అను పాఠము సరిగాదు చూ రఘు III - 5

న మే హ్రియా శంసతి కిఞ్చి దీప్సితమ్
  స్పృహావతీ వస్తుషు కేషు మాగధీ ?
ఇతి స్మ పృచ్ఛ త్యనువేల మాదృత
  ప్రియాసఖీ రుత్తరకోసలేశ్వర

సీతనోట చెప్పించి విని దానిం జరిపి సంతోషపెట్టను ఆసంతోషమును చూచి తానును సంతోషము అనుభవింపను రాముని కోరిక

వనాన్దా=భర్తకు తో డబుట్టువు శాంతాదేవి ఆడుబిడ్డ కఠోరగర్భ ముదిరిన - నిండిన - నెలకటితో ఉన్నది వత్స అని తాను వయసుచే పెద్దాయన కావయు మహర్షియునై ప్రీతితో నిర్దేశించుట అట్లే రాముని కూడ వత్స

రామ — ఔత్సుక్యస్మితం తథాస్తు భగవతా వసిష్ఠేన న కిఞ్చి దాదిష్టోఽస్మి

అష్టా — శ్రూయతామ్

శ్లో॥ జామాతృయజ్ఞేన వయం నిరుద్ధా
స్త్వం బాల ఏ వాసి నవంచ రాజ్యం
యుక్తః ప్రజానా మనురఞ్జనే స్యా
స్తస్మా ద్యశో య త్పరమం ధనం వ ౪

---

అనుట వత్సే కఠోరగర్భా ఇతి - ఇత్యాది అమ్మాయీ నిండు చూలాలి వని నిన్ను రప్పింపమైతిమి అబ్బాయిని రామభద్రుని కూడ నీకు వినోదము కొఱకే నిలిపితిమి పుత్రపూర్ణమైనయొడిలోడి యాయుష్మతిని చూడగలము రామ భద్ర యని భద్రయోగము అశీర్గర్భము ముద్దునకు అట్లే చంద్ర అనియు చేర్చుట కలదు వినోదార్థం - ప్రొద్దుపుచ్చుటకు రాము డొక్కడు తనతో ఉన్నం జాలును మఱెవ్వరు ఊరు పోయినను పోవచ్చును వారు ఊరి పోయిరి అని తనకు తోపదు పుత్రపూర్ణోత్సఙ్గాం - పుత్రునితో నిండిన యొడిగలదానిని ఇందు గర్భమున ఆశీర్వాదము కలదు ప్రసవానంతరము పిలిపింతుము అనుట ఏలన అది పన్నెండేండ్ల జన్నము తరువాతను ఎన్ని యేండ్లో జరుగుచుండగలద ఆయుష్మతీం - వయసుచే పెద్దవారు గురువులు పిన్నలను ఆశీర్గర్భముగానే ప్రీతితో సంబోధన నిర్దేశములు చేయుమాట ఇది

సహర్షస్మితమ్ - తనకు బిడ్డ పుట్టుట ఇందు కలదు గాన సంతోషము అదే ఔత్సుక్యము - కోరిక దానివలన రవంత నవ్వు అట్లే తాను తథాస్తు అని తటస్థునివలె అనుచున్నందువలనను రవంత నవ్వు ఇందు లజ్జా అని కలిపిన పాఠము మందము రామునియెడ లజ్జ చెప్ప దగినది కాదు ఇది రామవేషధారి అభినయోపదేశము ఆదిష్ట - ఆదేశింప బడినవాడు - ఆజ్ఞాపింపబడినవాడు ఆదిష్టోఽస్మి - ఇది ప్రశ్న ప్రశ్నార్థకము లేకున్నను కాకువు (=గొంతు సవ్వడి) చేత నా కేమియు ఆజ్ఞప్తి ఒసంగలేదా అనుచు ఇట్లు అడుగుట దానిని నిర్వర్తించి తాను ధన్యు డగుటకు

శ్లో॥ ౪ జామాతృయజ్ఞేన=అల్లుడు గావించుచుండు మఖముచేత వయం= మేము నిరుద్ధా =ఇందే యుండవలసినట్లు - ఇందుండి ఎక్కడికిని పోనీకుండ - అడ్డగింప బడితిమి త్వం=నీవు బాల ఏవ అసి=పసివాడవే అగుదువు రాజ్యంచ=పరి

రామః—యథా భగవాన్మైత్రావరుణిస్సమాదిశతి.

పాలనయు - దాని మార్గములును అనుట, నవం = క్రొత్తది. కావున ఇది చెప్పు చున్నాను, ఉపదేశము, ఆదేశమును అనుట. ఆయన కులగురువు కదా. ప్రజానాం అనురఞ్జనే = ప్రజలను సంతోషపెట్టుటయందు, యుక్తః = పూనిక కలవాఁడవు, స్యాః = అగుము, తస్మాత్ = దానివలన, యత్ యశః = ఏకీర్తియో, (తత్ = అది) వః = మీకు, పరమం ధనం = మేలి ధనము.

అల్లుఁడు చేయు యజ్ఞమును చూడఁబోక తప్పదు. పోయినవారు తప్పక అందే ఉండవలయును - నడుమ విడిచి రాను వీలుపడదు. మన్వంతర పురాణులు కులగురువులు నగు వసిష్ఠులవారి మనస్సునకు రాముఁడు ఎటుకయు సామర్థ్యము కలవాఁడే యైనను, ఇపుడును బాలప్రాయుఁడే, పెద్దలవలన మంచి సుబ్బరలు ఎటుంగవలసినవాఁడు. క్రొత్తగా పట్టాభిషిక్తుఁడైనందున, రాజకార్యములందును పెద్దలసలహా అపేక్షింపవలసినవాఁడు. మఱి అనివార్యముగా తాము దూరాన ఉండ వలసివచ్చినది. కావున ఉపదేశించుచున్నాఁడు - 'రాజ్యపాలన కంతటికిని మూల సూత్రము ప్రజానురంజనము. అది యెఱుంగుము. అందు ఎంతేని పూనిక కలిగి యుండుము. దానఁ కలుగు యశమే సూర్యవంశమువారికి ధనము, అనఁగా మిక్కిలి ఆర్జించి కాపాడుకొనవలసినది' - అని. 'అనురఞ్జనే యుక్తః స్యాః' - అడవికి సీతను తప్పక పంపు అన్నమాటయే! దీనిని రామునికంటె ఒరుఁడు పాటింపనేరఁడు.

త్రేతాయుగమునుండియు (తత్ పూర్వయుగమున మాత్ర మెు?) అనఁగా లెక్కలేని వేలయేండ్లుగా మనదేశమున ప్రసిద్ధమగు రామరాజ్యమున రాజు పాలన యందు నిరంకుశత కాదు లక్ష్యము, ప్రజలప్రీతియే ఏకలక్ష్యము.

'జామాతృ' - దశరథునికి అల్లుఁడైనను, వారికులగురు వగు వసిష్ఠుఁడును, ఇంకను ఆయింటి పెద్ద లందఱును గూడ అల్లుఁడనియే వ్యవహరింపుట, చనువు ప్రీతి గౌరవముల చేత, 'బాల' 'వత్స' అనుటచే అనుభవము చాలమి. వనత ప్రస్తా వనలోని యభిషేకోత్సవ ప్రస్తావముచేతను, 'రామభద్ర - మహారాజ' అను కంచుకి తడబాటుచేతను తెలియుచున్నది.

యథా సమాదిశతి - ఎట్లు ఆదేశించినాఁడో అట్లు చేసెదను అన్నమాట. 'యథా సమాదిశతి' 'సరే అట్లే' అని సంభాషణలో అంగీకారమును తెలుపు మర్యాదను వినయమును సూచించు మాటలకూర్పు. అవయువాగ్ము చెప్పకయుండ దగినది. భగవాన్ మైత్రావరుణిః - అని తన్మహిమ ద్యోతక నిర్దేశము.

శ్లో॥ స్నేహం దయాం తథా సౌఖ్యం యది వా జానకీ మపి,
ఆరాధనాయ లోకస్య ముఞ్చతో నాస్తి మే వ్యథా. 12

శ్లో. 12. స్నేహం = అక్కిలిని, దయాం = దయను, తథా = అట్లే - మఱియు అనుట - సౌఖ్యం=హాయిని, యది వా=కావలసివచ్చినట్లైన, జానకీం అపి=జానకిని సైతము, లోకస్య = ప్రజల, ఆరాధనాయ=సంతోషపెట్టుటకై. ముఞ్చతః మే = వదలుచున్న నాకు, వ్యథా=వంత, న అస్తి=కలుగదు.

ఎందేని స్నేహము వీడుటయు, ఎందేని దయ పూనక పోవుటయు, మఱియు ఏసౌఖ్యము నేని మానుకొనుటయు, ఇది యది యన నేల? సీతను సైతము విడుచుటయు - ఇందు ఏదైనను సరే ప్రజల సంతోషమునకు అది కారణమగు నేని, అట్లు గావింప నేను సర్వథా సిద్ధముగా నుందును. అందులకై ఇసుమంతయు వంత చెందను. చూ. వాల్మీకిరాముఁడు ఏమన్నాడో, ఉ. కాం. 45-15. 'అప్యహం జీవితం జహ్యాం యుష్మాన్వా పురుషర్షభాః, అపవాదభయాద్భీతః, కింపునర్జనకాత్మజామ్?' అని. అతనికి సీతకన్న సోదరులు ఎక్కువ. యు. కా. లోకూడ 'దేశే దేశే కలత్రాణి!' అన్నాఁడు గదా. చూ. రఘు - XIV - 35.

"అపి స్వదేహాత్ కిము తేన్ద్రియార్థాద్.
యశోధనానాం హి యశో గరీయః."

"యశోధనానాం పుంసాం స్వదేహా దపి యశో గరీయః, ఇన్ద్రియార్థాత్ ప్రకృష్ణన వనితాదేః ఇన్ద్రియ విషయాత్ గరీయ ఇతి కిముత వక్తవ్యమ్?... సీతా చ ఇన్ద్రియార్థ ఏవ" - సంజీవని.

జానకీం అపి - జానకీం అని తుదను చెప్పుటచే అంతకంటె ప్రేమాస్పదము మఱి లేదనుట. ఆయనకు తెలియకయే, ప్రయత్నము లేకయే విధి యిట్లు నోటం బలికించుచున్నది. కవి బీజపోషణము గావించుచున్న మెలఁకువం గనఁదగును. యదివా - విశేషసముచ్చయార్థకము. 'అహో ఉతాహో యదివా' ఇతి రత్నమాలా అని ఘనశ్యామ వ్యాఖ్య. అట్లే చతుర్థాంకమునను-

త్వం వహ్ని ర్మునయో వసిష్ఠగృహిణీ
గఙ్గా చ యస్యా విదుః
మాహాత్మ్యం, యదివా రఘోః కులగురు-
ర్దేవః స్వయం భాస్కరః.

సీతా—అదో ఎవ్వ రాహవధురంధరో అజ్జఉత్తో. [అత ఏవ రాఘవధురన్ధర ఆర్యపుత్త్రః.]

రామః—కః కోऽత్ర భోః? విశ్రామ్యతాం మష్టావక్రః.

అష్టా—(ఉత్థాయ పరిక్రమ్య) అయే కుమార లక్ష్మణః ప్రాప్తః!

(ఇతి నిష్క్రాన్తః)

లక్ష్మణః—(ప్రవిశ్య) జయ, త్వార్యః. అర్జునేన చిత్రకారే

---

అతః ఏవ = అందువలననే - ఇట్లు ప్రజానురంజనార్థము దేనికైన తెగించువాఁడ వగుటచేతనే - ఉత్తమ ధర్మమును వీడనివాఁడవగుటచేతనే అనుట. 'సీతచేని' అని ఆయన యనుటయు, 'అతఏవ' అని యామె యనుటయు ఉభయుల గుణోన్నతిని ఔదార్యమును అన్యోన్యసదృశతను తెలుపును. పట్టమహిషి, అగ్రాంగలక్ష్మి, పతివ్రతయు గాన ఆయనవ్రతమే లోకారాధనమే ఆమె వ్రతమును. లోకారాధనకై రాముఁడు సీతను వివాసనము సేయుటయు - అందులకు సీత నిరభ్యంతరముగా సంతసముతో అంగీకరించుటయు - ఇట తామెఱుంగకయే తమనోట పలుకుట పరికింపఁ దగును. ఇది ప్రకటముగా జరిగచేని నాటకము తొలియంకముతోనె ముగిసిపోవును! రహస్యమైనందున ఏడంకాల నాటకము సాఁగినది!

కః కోఽత్ర భోః? = ఎవరోయి అక్కడ? ఇది రాజు సేవకరును ఎచ్చరించు కొను విధము. పరిక్రమ్య - పరిక్రమణము రంగాననే తిరుగాడుట; నిష్క్రమణము రంగమును వదలి లోనికి పోవుట. ఇవి నాటకపరిభాషలోని పదములు. 'విశ్రామ్యతాం' (=విశ్రమింపఁజేయవలసినది) ఇత్యాది నౌకరు ప్రవేశింపకముందే ఉత్తరువుం బలుకుటచేత తత్ప్రవేశము పరిహృతమైనది. అయే కుమారలక్ష్మణః ప్రాప్తః= అహో కుమారలక్ష్మణుఁడు వచ్చినాఁడు! అష్టావక్రుని యీమాటచే లక్ష్మణుఁడును తనకు అగపడినాఁడు అనియు లక్ష్మణప్రవేశమును సూచింపఁబడినవి. 'నా సూచితస్య పాత్రస్య ప్రవేశో నిర్గమోపి వా' అని యనుశాసనము. అయే! - అహో - అనుట. పట్టాభిషిక్తుఁడైన రాజుయొక్క తమ్ముఁడు కొడుకు మొదలైన యువల పేరునకు ముందు పెద్దలు కుమార అని చేర్చుట మర్యాద.

జయ త్వార్యః = జయము ఆర్యునికి - అన్నట్లు. ఇది తొలి ప్రవేశమున తమ్ముఁడు అన్నను ఎచ్చరించుకొను తెఱంగు. మర్యాద.

గాస్మదుపదిష్ట మస్యాం వీథికాయా మార్యస్య చరిత మభిలిఖితం ; త త్పశ్య త్వార్యః.

రామః—జానాసి వత్స, దుర్మనాయమానాం దేవీం వినోద యితుం. తత్కియ న్త మవధిం యావత్ ?

లక్ష్మణః—యావ దార్యాయా హుతాశనే విశుద్ధిః.

రామః—(ససా న్త్వవచనం)

---

అస్మదుపదిష్టం = మనము చెప్పినది - నియమించినది. ఈ యుపదేశించుటలో రాముఁడును కలఁడు. ఈ నాటకములో గొప్ప ప్రయోజనమును సాధించిన యీ చిత్రదర్శనమును కాళిదాసు రఘువున సూచించినాఁడు. XIV—25.

తయో ర్యథాప్రార్థిత మిన్ద్రియార్థా-
నాసేదుషో స్సద్మసు చిత్రవత్సు
ప్రాప్తాని దుఃఖా న్యపి దణ్డకేషు
సంచి న్త్యమానాని సుఖా న్యభూవన్.

ఆర్యస్య చరితమ్=అన్నయ్య చరిత్రమును, అస్యాం వీథికాయాం = ఈ వీథిక యందు. వీథీ గృహాఙ్గ ఇతి హైమః - వీథియే వీథిక - గృహాంగము - గోడయేని వసారా యేని. జానాసి వత్స = ఎఱుఁగుదువోయి, వత్స - అని రాముఁడు మెచ్చుకొనుట, దేవికి వినోదము అక్కఱయై యున్న యీసమయమునకు, జనక విశ్లేషమునకై వగగూరియున్న సమయమునకు సరిగా ఈ వృత్తాంతము దెచ్చుటచేత. ఆర్యస్య చరితమ్ - ప్రధానముగా సీతావిరహదశాగతమునకు చిత్రరువులు. ఆమె దానిని ఎఱుంగదు గావున అది ఆమెకు ఎక్కువ వినోదము నొసఁగును అని. రామాయణ మని కదా పేరు, దాని బొమ్మలు. తత్ కియ న్తం అవధిం యావత్ - అది - అనఁగా ఆ చరిత్రము ఎంతవఱకు - 'అభిలిఖితం' చిత్రింపఁబడినది? యావ దార్యాయా అగ్నిశుద్ధిః=వదినెగారి అగ్నిశుద్ధివఱకు.

తరువాతి రామభాషితమున పెక్కుపాఠములలో 'కా న్తమ్' అని చెప్ప కూడని మాటను వినవలసివచ్చినపుడు చెప్పుమాట ఉన్నది. ఐనను అగ్నిశుద్ధి మునుపు తాను కావించినదే కావున ఇపుడు ఆ మాటకు తానే 'కా న్తమ్' అనుట అంత యుచితము, నాజూకు గాదు, 'ససా న్త్వవచనం' - 'ఓదార్చుటగా' అని మాత్రమే గ్రహించుట శ్లాఘ్యము సాంత్వన మేల యన అమాట సీతకు అప్రియ మగుటచేత.

శ్లో॥ ఉత్పత్తిపరిపూతాయాః కిమస్యాః పావనాన్తరైః?
తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శ్శుద్ధి మర్హతః. ౬

దేవి దేవయజనసమ్భవే, ప్రసీద, ఏష తే జీవితావధిః ప్రవాదః.

శ్లో। కష్టం! జనః కులధనై రనురఞ్జనీయః,
స్తన్నో దురుక్త మశివం, నహి తత్క్షమం తే,

---

శ్లో. ౬. ఉత్పత్తిపరిపూతాయాః=పుట్టుకచేతనే పావనురాలైన, అస్యాః= ఈ మీ వదినెకు, పావనాన్తరైః = పవిత్రతకలిగించు ఇతరములచేత, కిం = ఏమి (పని)? తీర్థోదకం చ=ఋషులు సేవించిన పవిత్ర జలమును, వహ్నిః చ=అగ్నియు, అన్యతః=ఇతరములవలన, శుద్ధిం=పవిత్రతను, న అర్హతః=పొందఁదగవు.

"ఉత్పత్తిం" - అయోనిజత, దేవయజనసంభూతి - మిక్కిలి పవిత్రత కలిగించు సందర్భము. పావనాన్తరైః - 'అన్తరైః' అనుటచే ఈమెయే పావన, అన్నిటికిని శుద్ధి కలిగింపఁజాలినది అని సూచితము. పృథ్వి భాగీరథి అరుంధతి - ఇంతటివారును తమకు సీతవలన శుద్ధి యని ఈ నాటకముననే చెప్పెదరు. అరుంధతి అనును - IV శ్లో - 'వత్సాం ప్రతి అగ్ని రితి పరిలఘూ న్యక్షరాణి. సీ తే త్యేవ పర్యాప్తమ్ అని. తీర్థోదకమ్ - 'ఋషిజుష్టజలే తీర్థమ్' అని అమరము. సీతాదేవి పరిశుద్ధియందు రామునికి ఇప్పుడును మాయని నమ్మకము.

దేవయజనసంభవే - ఆ యుత్పత్తి పరిపూతతనే చెప్పు సంబోధన - దేవాః ఇజ్యన్తే అత్ర ఇతి - దేవయజనమ్. యజ్ఞక్షేత్రము. 'విశ్వంభరా భగవతీ భవతీం అసూత' అన్నమాట. ప్రసీద=మన్నింపుము - అని రాముఁడును మన్నన యడిగికొనుచున్నాఁడు. అంతటి గౌరవము. జీవితావధిః = బ్రదికియున్నంతకాలము ఉండునది. ప్రవాదః = నింద. - కనుక దానిం దీర్పనే సీతావివాసన దేవగ్యను - గ్రహాపునః సంయోగాది యీనాటకకథకూర్పు.

శ్లో. ౭. కష్టం=కష్టా! జనః = లోకులు, కులధనైః = కులమే ప్రీతితో జాగ్రత్తతో కాపాడుకొనవలసినధనముగా కలవారిచే, అనురఞ్జనీయః = సంతోషపెట్టఁబడవలసినవారు. తత్ = కాఁబట్టి. నః అశివం దురుక్తమ్ = నావలన చెట్ట అనుచితముగానే పలుకఁబడినది, తత్ =అది, తే = నీకు, నక్షమం హి = తగనిదే సుమా. నేను నిజముగా కూరనే ఐతిని అనుట, సురభిణః కుసుమస్య = తావిగుబులుకొను పూవునకు, మూర్ధ్నిస్థితిః = తలపై ఉనికి, నైసర్గికీ సిద్ధా=స్వభావము

నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా
మూర్ధ్ని స్థితి, ర్న చరణై రవతాడనాని. ౭

చేతనే కలిగియున్నది. చరణైః పాదాలతో, అవతాడనాని = నలియఁగొట్టుట(లు,) న=కాదు.

జనులు పాపము, పామరులు; వారిని కులకీర్తియే ధనముగాఁ గల మనము తృప్తి పఱుపవలయును గదా. అందులకై, ఆ లోకసమాధానమునకై, ఆ పాడు మాట—

"రావణాఙ్కపరిభ్రష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా
కథం త్వాం పున రాదద్యాం కులం వ్యపదిశ న్మహత్
త దర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా
నాస్తి మే త్వ య్యభిష్వఙ్గో యథేష్టం గమ్యతా మితః"

ఇత్యాది నేను నోటఁ జెప్పి నిన్ను అలంపవలసివచ్చినది. ఆ క్రౌర్యము నేను పూనితిని. నిజముగా అది నీకు సుంతయైనను తగనిదే. గుమగుమలాడు పూవును ప్రీతితో తలపైఁ దాల్పవలసినది; స్వభావముచేతనే దానికి ఆమర్యాద గలదు. అంతియ కాని, దానిని పాదాలతో నలియఁ ద్రొక్కఁ దగునా?

'క్లిష్టో జనః' - అని యొక పాఠము, అది సీతకు అన్వయించును. ఆపాఠము ఇట రసమునకు పనికివచ్చునది గాదు. ప్రజానురంజనము అను రాజ్యతంత్రసూత్రము ఇట అడుగడుగునను పరామృష్ట మగుచున్నది. అదియే ఇతివృత్తమునకు పాదు. కావున దానినే ఇందును స్మరింపఁదగును. "ప్రసీద" అన్నాఁడు కావున, ఆ తేర్పుటకు గల యుపపత్తిసర్వస్వము తన ప్రజానురంజనానుసరణము అనుట ఇందు చక్కఁగా చెప్పఁబడుచున్నది. దానికి 'కష్టం' - 'కష్టా' - 'అయోగ్యా' అనుట తగిన యారంభము. 'సురభిణః కుసుమస్య' - అనుటచే సీతకు కుసుమకోమలతయు పాతివ్రత్యాదిగుణముల మేలి తావియు సూచింపఁబడినది, ఇదెల్ల మరల నాటకాంతమున భాగీరథి మాటలం గలదు. చూ. VII—6.

ఘోరం లోకే వితత మయశో; యా చ వహ్నౌ విశుద్ధి
ర్లఙ్కాద్వీపే, కథ మివ జన స్తా మిహ శ్రద్దధాతు?
ఇక్ష్వాకూణాం కులధన మిదం య త్సమారాధనీయః
కృత్స్నో లోక, స్త దిహ విషమే కిం స వత్సః కరోతు?'

'అపి స్వదేహాత్ కిముతేన్ద్రియార్థాద్
యశోధనానాం హి యశో గరీయః. రఘు - XIV - 35.

సీతా—అజ్జఉత్త. పేక్ఖమ్హ దే చరిఅం. [ఆర్యపుత్ర, పశ్యామస్తే చరితమ్.]

(ఉత్థాయ పరిక్రామన్తి)

లక్ష్మణః—ఇదం త దాలేఖ్యం.

సీతా—(నిర్వర్ణ్య) కే ఏదే ఉవరి ణిరందరత్థిదా ఉవత్థువంది విఅ అజ్జఉత్తం? [క ఏతే? ఉపరి నిరన్తరస్థితాః! ఉపస్తువన్తీవ ఆర్యపుత్రమ్?]

లక్ష్మణః—ఏతాని తాని సరహస్యాని జృమ్భకాస్త్రాణి, యాని భగవతో కృశాశ్వా త్కౌశిక మృషిం విశ్వస్య మిత్రం విశ్వామిత్ర ముపసఙ్క్రాన్తాని; తేన చ తాటకావధే ప్రసాదీకృతా న్యార్యస్య.

---

పశ్యామః తే చరితమ్ - నీ చరిత్రమును చూతము. 'మన' అనలేదు. నను బాసి నీవు పడిన విరహక్లేశములను మత్పరోక్షవృత్తమును - అనుట.

ఉపరి = పైన - అనఁగా మింట. నిరన్తరస్థితాః - అనువఱకు ఒకవాక్యము. చిత్తరువుం జూచుచు తొలుత నట నాగుట. తర్వాత 'ఉపస్తువన్తి ఇవ' ఇత్యాది మఱియొక వాక్యముం బలుకుట - అది చిత్తరువుం బరికించు నభినయమునకు సదృశతరము. 'క ఏతే? ఉపరి నిరన్తరస్థితాః! ఉపస్తువన్తీవ ఆర్యపుత్రమ్.'

సరహస్యాని = రహస్యముతోడివి. ప్రయోగోపసంహారములందు ఏవియో రహస్యములు గలవి. అది సంప్రదాయముచేతనే, గురువువలన క్రమముగా శిష్యుఁడు ఉపదేశము పొందుటచేతనే ఎఱుంగఁదగినది. 'అప్పుడొక నిమ్మకాయను నలుపు' కాదా 'పసుపుపాడిని చల్లు' అనుటంబోనిది. ఆ యస్త్రప్రయోగము మంత్రముచే చేసినపుడు ఈరహస్యముం గూడ అనుష్ఠించిననే అది పాఱును. అస్త్రమునకు ఎఱుంగవలయు విధులు ఐదు—

"పఞ్చభి ర్విధిభిః పార్థ విద్యతే న త్వయా సమః
ప్రయోగ ముపసంహార మావృత్తిం చ ధనఞ్జయ,
ప్రాయశ్చిత్తం చ వేత్థ త్వం ప్రతిఘాతం చ సర్వశః.

మహాభారత.

ప్రసాదీకృతాని ఆర్యస్య - అన్వయ్యాపు అనుగ్రహింపఁబడినవి - ఒసంగఁబడినవి.

రామః—వన్దస్వ దేవి, దివ్యాస్త్రాణి.

శ్లో। బ్రహ్మాదయో బ్రహ్మహితాయ తప్త్వా
పరస్సహస్రాః శరద స్తపాంసి,
ఏతా న్యదర్శ న్గురవః పురాణాః
స్వా న్యేవ తేజాంసి తపోమయాని. ౮

సీతా.—ణమో ఏదాణం. [నమ ఏతేభ్యః]

రామః—సర్వ థేదానీం త్వత్ప్రసూతి ముపస్థాస్య న్తి.

సీతా.—అణుగహీదమ్హి. [అనుగృహీతాస్మి.]

లక్ష్మణః—ఏవ మిథిలావృత్తా న్తః.

---

శ్లో. ౮. పురాణాః గురవః=తొంటిగురువులైన, బ్రహ్మాదయః=బ్రహ్మ మొదలగువారు, బ్రహ్మ ప్రజాపతులు మొదలగు పెద్దలు, దేవతలు - బ్రహ్మహితాయ = వేదముల మేలునకై - వైదికమంత్రములను శ్రౌతమైన ధర్మమును కాపాడుటకై, పరః సహస్రాః శరదః = వేనవేలు ఏండ్లు, తపాంసి తప్త్వా = పెక్కుతెఱంగుల తపస్సులు కావించి, తపోమయాని = తపఃప్రాచుర్యములైన - తపస్సుతో నిండిన, స్వాని తేజాంసి ఏవ = తమ తేజములే ఐన, ఏతాని = వీనిని, అపశ్యన్ = కాంచినారు, సాక్షాత్కరించుకొన్నారు.

ఈ అస్త్రములు, ఈరూపు దాల్చిన వారి తేజములే, మఱేమియుం గావు లోకమున తాము కల్పించిన శ్రౌతధర్మముం గాపాడుటకు తామె వీని ఇట్టులై యున్నారు - అనుట.

ఈ శ్లోకము మహావీరచతలోను కలదు. I-42. ఇందే మరల VI లోను ఇది ఎనిమిదవది.

సర్వథా=ఎల్ల తెఱంగుల - అనఁగా తప్పకుండ అనుట. త్వత్ ప్రసూతిం = నీసంతానమును - ఇటం గావించిన ఈజృంభకానుగ్రహముచే అవి ఆ ప్రసూతిం జెంది, కుశలవుల యభిజ్ఞాన సమయమున ఉపయోగపడును. ఇది మొదటి చిత్తరువు; బాలచరితమున ప్రధానకథ యగు కౌశిక మఖ సంరక్షణమును తలంపించునది. ఈజృంభ కానుగ్రహముచే సంతతి మగ బిడ్డ యన్న రాముని నిశ్చయము సూచితము.

సీతా—అమ్హో హే! దలంతణీలుప్పల సామల సిణిద్ధ మసిణ సోహమాణ మంసలేణ దేహసోహగ్గేణ విమ్హఅ త్థిమద తాఅ దీసమాణ సోమ్మసుందరసిరీ అణాదర క్ఖండిఅ సంకరసరాసణో సిహండముద్ధ ముహమండలో అజ్జఉత్తో ఆలిహిదో. [అమ్మహే! దళన్నీలోత్పలశ్యామల స్నిగ్ధ మసృణ శోభమాన మాంసలేన దేహసౌభాగ్యేన విస్మయ స్తిమిత తాత దృశ్యమాన సౌమ్యసున్దరశ్రీః అనాదరఖణ్డిత శఙ్కర శరాసనః శిఖణ్డకముగ్ధ ముఖమణ్డలః ఆర్యపుత్త్రో ఆలిఖితః!]

లక్ష్మణః—ఆర్యే, పశ్య పశ్య!

---

రెండవది మిథిలలో ఈశ్వరధనుర్భంగము. దీనిని రవివర్మయు చిత్రించి యున్నాఁడు. దళ న్నవ నీలోత్పల......'దళత్' ప్రక్కన 'నవ' అనావశ్యకము, తీసివేయఁదగును. 'వికసించుచున్న నల్లగలువవంటి చామనచాయలోఁడి నిద్దపు తళతళ ప్రకాశించు కండగల మేని యందముతో, అవలీలగా విఱిచిన శంకరుని వింటితో, ముద్దులొలుకు సిగతో రాణించు మొగముతో ఇదిగో ఆర్యపుత్రుఁడు వ్రాయఁబడియున్నాఁడు. అన్నివిధాల ఆశ్చర్యము గొలుపు ఆయన సౌమ్యసౌందర్య లక్ష్మిని నాయన తెప్పవాల్పక చూచుచున్నాఁడు!' విస్మయ స్తిమిత తాతం - ఆశ్చర్యముచే తెప్పవాలక అట్లే నిలిచిపోయిన నాయనగారిచేత, శ్రీః=లక్ష్మి=సంపద - శేక అతిశయము - గలవాఁడు. సౌందర్యమున సౌమ్యత - చూడఁగానే స్నేహవిశ్వాసములం గొల్పునది, అట్లే—చూ - రఘు - II.

ధనుర్భృతోఽప్యస్య దయార్ద్రభావ
　మాఖ్యాత మన్తః కరణై ర్విశఙ్కైః
విలోకయన్త్యో వపు రాపు రక్ష్ణాం
　ప్రకామ విస్తార ఫలం హరిణ్యః.

'విస్మయ' మేల యన మూఁడు కాఁడు మీసాలరాజులు ఎత్తం గూడఁజాలని వింటిని అనాదరముగా త్రుంచివైచినాఁడు. శిఖణ్డక ముగ్ధ ముఖ మణ్డలః = సిగతో సొబగారు గుండ్రని మొగము గలవాఁడు. "కాలానాం తు శిఖా ప్రోక్తా కాకపక్షః శిఖణ్డకః." మణ్డలః - అనుటచే మొగముయొక్క వృత్తత్వ వైశాల్యములు స్ఫురించుచున్నది. ఈబొమ్మలో అట్టి జనకుఁడును అల్లయట్టి రాముఁడును ఉన్నారు. విఱిగిన శరాసనపుఁ దునుక రాముని చేత నున్నది. పెండ్లి

శ్లో॥ సమ్బన్ధినో వసిష్ఠాదీ నేష తాత స్తవార్చతి,
గౌతమశ్చ శతానన్దో జనకానాం పురోహితః. ౯

రామః—సుశ్లిష్ట మేతత్.

శ్లో॥ జనకానాం రఘూణాం చ సమ్బన్ధః కస్య న ప్రియః,
యత్ర దాతా గ్రహీతా చ స్వయం కుశికనన్దనః? ౧౦

---

కుమారుని ఆసేచనక (=ఎంత చూచినను తనివితీఱని) స్వరూపము అతిప్రియమగుటచే వగపును పోఁగొట్టును.

శ్లో. ౯. ఏషః తవ తాతః = వీరుగో మీ వాయన గారును, జనకానాం = జనకులకు - అనఁగా వంశపరంపరగా ఆయింటివారికి, పురోహితః గౌతమః శతానన్దః చ = పురోహితుఁడైన గౌతముని కుమారుఁడు (ఈ) శతానందుఁడును, వసిష్ఠాదీన్ = వసిష్ఠుఁడు మొదలగువారైన, సమ్బన్ధినః = వియ్యంకులను, అర్చతి = పూజించుచున్నారు.

ఇది తరువాతి చిత్తరువు. ఇందు మీ వాయన జనకరాజు ప్రక్కన పురోహితుఁడు గౌతమశతానందుఁడు చెప్పి చేయించుచుండఁగా వసిష్ఠుఁడు మొదలగు వియ్యాలవారిని పూజించుచున్నాఁడు.

'జనకానాం' - వంశపరంపరగా పురోహితుఁడు గావున బహువచనము. అందఱిని అర్చించువాఁడు జనకుఁడే, అడుగడుగునను పురోహితుఁడు వీరికి పాద్యము, ఇదిగో వీరికి గంధము అని నిర్దేశించుచుండెను. సంబంధులను జనకుఁడును వసిష్ఠాదులను శతానందుఁడును అని క్రమము చెప్పుట సరిగాదు. అట్టిసమయములందు జనకుఁడు సొంత చేతితో చేయుట మర్యాద; పురోహితుఁడు ప్రక్కనుండి చెప్పుచుండవలయును. అంతే. వసిష్ఠాదులును సంబంధులే, ఆక్రమము కవి హృదయమేని 'గౌతమశ్చ' అన్నట్లే...'వసిష్ఠాదీంశ్చ' అనియు ఒక చకారమపేక్షిత మగును.

సుశ్లిష్ట మేతత్ = ఇది చక్కఁగా పొందియున్నది. ఇదియే, సాధీయమగు పాఠము, తరువాతి శ్లోకార్థమునకు అనుగుణము.

శ్లో. ౧౦. యత్ర = ఎందు, దాతా = ఇచ్చువాఁడును, గ్రహీతా చ = కొనువాఁడును, స్వయం = స్వయముగా, కుశికనన్దనః = విశ్వామిత్రమహర్షియే (అయెనో) అట్టి, జనకానాం = జనకులకును. రఘూణాం చ = రఘువులకును, సమ్బన్ధః = వియ్యము, కస్య = ఎవనికి, న ప్రియః = సంతోషము కలిగింపదు?

విశ్వామిత్రుఁడు రెండిండ్లవారికిని ఉమ్మడి పెద్దయై, ఇమ్మని వారిని కైకొమ్మని వీరిని ఇట్లు ఒండొరులం గూర్చుచుండెం గాన ఆయనయే దాతయు గ్రహీతయు.

సీతా — ఏదే ఖు తక్కాల కిద గోదాణమంగళా చత్తారో భాదరో విఅహదిక్ఖిదా తుమ్హే, అమ్హో జాణామి తస్సిం ఎవ్వ పదేసే తస్సిం ఎవ్వ కాలే వట్టామి త్తి. [ఏతే ఖలు తత్కాల కృత గోదాన మఙ్గళాః చత్వారో భ్రాతరో వివాహదీక్షితా యూయం. అహో, జానామి తస్మిన్నేవ ప్రదేశే తస్మిన్నేవ కాలే వర్తే ఇతి!]

రామః — ఏవమ్.

శ్లో ॥ సమయ స్స వర్తత ఇవైష యత్ర మాం
సమనన్దయ త్సుముఖి గౌతమార్పితః,

---

సమ్బన్ధః - దీనికి ఏసంబంధమును అర్థమే. ఐనను 'వియ్యము' అను సంబంధ విశేషమున రూఢ్యతిశయము.

తత్కాల కృత గోదాన మఙ్గలాః - అప్పుడే గోదానమంగళమయినవారు. 'గావః కేశాః దీయన్తే అస్మిన్ ఇతి గోదానమ్' - వ్రతమ్.

చూ - రఘు - III - 33.

"అథాస్య గోదానవిధే రనన్తరమ్
వివాహదీక్షాం నిరవర్తయ ద్గురుః."

'గోదానం నామ బ్రాహ్మణాదీనాం షోడశాదిషు వర్షేషు కర్తవ్యం కేశాన్తాఖ్యం కర్మోచ్యతే. తదుక్తం మనునా—

'కేశాన్తం షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే
రాజన్యబన్ధో ర్ద్వావింశే వైశ్యస్య ద్వ్యధికే తతః' ఇతి.

రఘు సంజీవని.

అహో జానామి - అహో తలంచుచున్నాను. నాటకముల సంభాషణలో 'జానామి' ఈయర్థమున మాటిమాటికి ప్రయోగింపఁబడును. తస్మిన్నేవ ప్రదేశే... అచోటనే ఆసమయముననే ఇపుడు ఉన్నాను అని. ఇట్టిది భావికమనవ అస్పదము - 'ప్రత్యక్షా ఇవ యద్భావాః క్రియన్తే భూతభావినః తద్భావికమ్' - కావ్యప్రకాశము.

శ్లో. ౧౧. సుముఖి=అందమును మంగళాస్పదము నైన మొగముగలదానా, యత్ర = ఏసమయమందు, గౌతమార్పితః = గౌతమునిచే (నాచేత) ఉంపఁబడినదియు. అగృహీత కమనీయ కఙ్కణః=తాల్పఁబడిన యందంపుఁ బెండ్లి కంకణముగలదియు, అయం తవ కరః = ఈనీచేయి, మూర్తిమాన్ మహోత్సవ ఇవ =

అయ మాగృహీతకమనీయకఙ్కణ స్తవ
మూర్తిమా నివ మహోత్సవః కరః. ౧౧

లక్ష్మణః—ఇయ మార్యా, ఇయ మ ప్యార్యా మాణ్డవీ, ఇయ మపి వధూ శ్శ్రుతకీర్తిః.

సీతా—వచ్ఛ ఇఅం వి అవరా కా? [వత్స, ఇయ మపి అపరా కా?]

లక్ష్మణః—(సలజ్జస్మితం, అపవార్య) అయే ఊర్మిళాం పృచ్ఛ త్యార్యా. భవ, త్వన్యతః సఞ్చారయామి. (ప్రకాశమ్)

---

రూపుఁగొన్న యా పెద్ద పండుగయో యనఁ, మాం = నన్ను - సమనన్దయత్ = మిక్కిలియు ఆనందింపఁజేసెనో, స సమయః = ఆకాలము, ఏష వర్తత ఇవ = ఇపుడు జరుగుచున్నటువలె ఉన్నది.

సీతచేతికి పెండిలి కంకణము కట్టఁబడియున్నది. ఆచేతిని గ్రహింపుమని శతానందుఁడు రామునిచేత నుంచినాఁడు. ఆసమయమున రామునకు ఎంతేని ప్రమోదము కలిగెను. ఆప్రమోదముగొన్న రూపమే ఆచేయి అని ఆతఁడు సంతసించెను. ఇపుడు చిత్తరువుం జూడఁగా అదెల్ల ఇపుడు జరుగుచున్నట్లు రామునికిం దోఁచుచున్నది.

ఇంతకన్న నెట్లు ప్రీతిం జెప్పవలవిపడును? సుముఖి - ఇది ఇపుడు రాముఁడు సీత మొగమునఁ జూపునిలిపి, దాని సొబగునకు తన్మయుఁడగుచు చెప్పుట. పెండిలి సమయాన ఆపెద్దల యెదుట లజ్జచే అట్లు చూపు నిలిపియుండఁడు. అట్టి లజ్జ ఇపుడును లక్ష్మణునికి సీతారాముల యెదుట కలదుగదా. 'పాణిం గృహ్ణీష్వ పాణినా' అను వాల్మీకి ప్రసిద్ధ శ్లోకమును మనసున ఉంచుకొని కవి ఈచిత్తరువుం బ్రస్తావించుట. 'ఉద్గృహీత' అనుపాఠము అసాధువు, ఆకంకణమును ఏల ఎగఁద్రోయుట? 'కమనీయ' - కంకణము సౌవర్ణమును రత్నఖచితము అగునా? కాదు. యథాశాస్త్రమైన దారమే. ఐనను అది రాముని వివాహమగుటకై అతనిచేతనే కట్టఁబడినది. దానిచే సీత ఇఁక రాముని సొమ్ము అయినది. కానం జేసి ఆయనకు దాని కమనీయతయు, దానితోడిచేయి రూపుఁగొన్న ప్రమోద మగుటయు.

ఇయం ఆర్యా = ఈమె వదినెగారవు (నీవే.) వధూః = కోడలు - తమ్ముని భార్య మఱదలు, తమ యింటికి కోడ లగుటచే పెద్దవా రందఱు కోడలు అని వ్యవహరింతురు.

ఇయ మపి అపరా కా - ఈ యింకొకతె ఎవరు? ఇందు సీత చనువు ప్రీతి తెలియును. భవభూతియందు మందుకైన దొరకని హాస్యము, ఎగతాళి చవంత ఇది.

ఆర్యే, దృశ్యతాం. ద్రష్టవ్య మేతత్. అయం చ భగవాన్ భార్గవః.

సీత—బీదమ్హి! (భీతాస్మి!)

రామః—ఋషే, నమస్తే.

లక్ష్మణః—ఆర్యే, పశ్య పశ్య. అయ మసౌ వార్యేణ-

రామః—(సాక్షేపమ్) అయి వత్స, బహుతరం ద్రష్టవ్య మస్తి. అన్యతో దర్శయ.

సీతా—(స బహుమానం నిర్వర్ణ్య) సుట్ఠు సోహది అజ్జఉత్తో ఇమినా విణఅమాహప్పేణ. [సుష్ఠు శోభతే ఆర్యపుత్త్రః ఏతేన వినయమాహాత్మ్యేన.]

లక్ష్మణః—ఏతే వయ మయోధ్యాం ప్రాప్తాః.

రామః—(సాస్రమ్) స్మరామి! హన్త స్మరామి!

---

అపవార్య - నాటకపరిభాషలో ఇది 'ఆత్మగతమ్' అని యుండఁదగును. ఏలన 'అపవారితము'నకు చోటు ఇంచుక తలఁగుటయు, మఱియొకరితో చెప్పుటయు ఉండవలయును. చోటు తలగక లక్ష్మణుఁడు తాను మనసులో అనుకొన్నయది, ఆత్మగతమ యగును. అన్యతః సఞ్చారయామి - వేఱు విషయమునకు మరల్చెదను. అనఁగా వేఱొక మంచి చిత్తరువుం జూపెదను. 'దృశ్యతాం.' 'ద్రష్టవ్య మేతత్.' అని వాక్యద్వయముగాఁ గొనుట దర్శనప్రకరణమున మెఱుఁగు. ఇట్లు తరువాతి బొమ్మకడకు జరుగుట మంచి జిత్తు.

ఆర్యే, పశ్య పశ్య - అన్నా, చూడు చూడు. ఈయన నీచేత - (ఎట్లు నిర్వీర్యుఁడుగా చేయబడుచున్నాఁడో!) అని పరశురామభంగమును, అన్నం గూర్చిన శ్లాఘను పలుకఁబోవుచుండఁగా రాముఁడు వలదు అన్నట్లుగా ఇతరమును చూపుమనుచున్నాఁడు.

సాక్షేపమ్ - ఆత్మశ్లాఘా శ్రవణ వైముఖ్యాత్. 'వినయమాహాత్మ్యేన.' ఇదేందులకులే అను ఆక్షేపముతో కూడుకొన్నట్లుగా. వినయమాహాత్మ్యేన - వినయముగల ఎఱుఁగనైన రామునిమహిమవలన. ఒకవేళ 'మహాత్త్వాత్' అను పాఠము 'మాహాత్మ్యేన'గా స్ఖలితమై యుండునా - 'వినయాతిశయమువలన' అని? కాదు. స్థితమే శ్రేయము. సీత మహాత్మురాలు గావున ఆవినయమును మెచ్చుకొనుచున్నది.

'సాస్రమ్' - తనకోసమే ప్రాణము విడిచిన యాప్రేమభరితుఁడగు నాయన స్మరణదర్శనములచే 'అస్రము.'

శ్లో। జీవత్సు తాతపాదేషు, నూతనే దారసఙ్గ్రహే,
మాతృభి శ్చి న్త్యమానానాం, తే హి నో దివసా గతాః. ౧౨

ఇయ మపి తదా జానకీ,

శ్లో। ప్రతను విరలైః, ప్రాన్తోన్మీల న్మనోహరకున్తలమ్,
దశనముకులై ర్ముగ్ధాలోకం శిశు ర్దధతీ ముఖమ్,
లలితలలితై ర్జ్యోత్స్నాప్రాయై రకృత్రిమవిభ్రమై
రకృత మధురై రమ్బానాం మే కుతూహల మఙ్గకైః. ౧౩

శ్లో. ౧౨. తాతపాదేషు = నాయనగారు, జీవత్సు = బ్రదికియుండఁగా, దారసఙ్గ్రహే = పెండిలి, నూతనే = క్రొత్తదికాఁగా - పెండిలియైన క్రొత్తలో అనుట. మాతృభిః = అమ్మలచేత, చిన్త్యమానానాం = విచారించుకొనఁబడుచున్న, నః = మనకు, తే దివసాః = ఆదినములు, గతాః హి = పోయినవిగదా.

నాయనగారుండినారు. అన్నియు ఆయనయే విచారించుకొనుచుండెను. మనకు ఏపనియు ఉండినదిగాదు. ఇంట మనకు అన్నియు అమ్మలు విచారించుకొనుచుండిరి. పెండిలియైన క్రొత్త, మనము భార్యలం గూడి ఆక్రొత్త సంతోషమును తనివార అనుభవించుచుంటిమి. ఆహా - ఆదినాలు పోనేపోయినవి. ఇఁకను మరలునా?

ఆసుఖము, ఒకనాఁడు కాదు రెన్నాళ్ళు గాదు; పన్ద్రెండేండ్లు అనుభవించినాఁడట, రాముఁడు! కావున ఇంత ఉద్వేగులూటుట.

"సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే
భుఞ్జానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ."
రామా - సున్ద - 33-16-7.

శ్లో. ౧౩. ప్రతనువిరలైః - అలతులును పేజులునైన, దశన ముకులైః = పంటి ననలతో - ననలంబోలిన పండ్లతోను, ప్రాన్తోన్మీలన్మనోహరకున్తలం = అంచులఁ బ్రకాశించుచున్న యందంపు ముంగురులుగలదియు, ముగ్ధాలోకం = అందమైన చూపులు గలదియు నగు, ముఖం = మొగమును, దధతీ = వహించుచున్నదై, శిశుః = పసిదైనసీత, లలితలలితైః = మిక్కిలి కోమలములును అందములునైనవియు, జ్యోత్స్నాప్రాయైః = వెన్నెల నిగ్గులు నిండినవియు, అకృత్రిమ విభ్రమైః = స్వభావసిద్ధమైన విలాసములు గలవియు, మధురైః = మిక్కిలి చిత్తాకర్షకములైనవియునగు, అఙ్గకైః = సన్నని కోమలాంగములతో, మే అమ్బానాం = నాయమ్మగార్లకు, కుతూహలమ్ = చూచుచునే యుండవలయునన్న యాసను, అకృత = కావించెను - కొల్పెను అనుట.

సన్నగాను, విడివిడిగాను ఉన్న మొగ్గలంబోని దంతములతో ఒప్పారునదియు, అంచుల ముంగురులు మెఱయంగా, అందములును కపట మెఱుంగనివియు నగు చూపులు గ్రాలఁగా నొప్పు మొగము గలదియు, అతికోమలములును, వెన్నెలలు వెదఁజల్లునవియు, తెచ్చుకోలు కాని సహజవిలాసములు గలవియు, ఎల్ల తెఱంగుల చిత్తమును ఆకర్షించునవియు నగు లేయంగములతో, పసిదిగా అమ్మలకు చూచితీఱని సంతోషము కలిగించుచుండినది.

'ప్రతనువిరలైః' 'దశనముకులైః' - అని సాధుపాఠము. దశనములు ప్రతనువులు - సన్నినివి - గా నుండుటయు, విరలములు - ఎడము గలిగి విడివిడిగా తెలియుచుండుటయు, కావుననే మొగ్గలవలె నుండుటయు అందము. అట్లే సీత లవకుశుల మొగమును ఇందే III వ ఉద్భావించుచున్నది. 'ఈషద్విరళ కోమల దశనోజ్జ్వల కపోలం' అని. దీనిచేత 'శిఖరి దశనా' - అను కాళిదాసు మేఘము జ్ఞాపకమునకు వచ్చును. సాముద్రికమునం జెప్పఁబడినది.—

'స్నిగ్ధాః సమాః సరూపాః సుపఙ్క్తయః శిఖరిణోఽశ్లిష్టాః
దన్తా భవన్తి యాసాం తాసాం పాదే జగత్సర్వమ్.'
'తామ్బూలరసరక్తోఽపి స్ఫుటభాసః సమోదయాః
దన్తాః శిఖరిణో యస్యాశ్చిరం జీవతి తత్పతిః.'

'విరలైః' అనుటకుం దగినట్లుగా 'అశ్లిష్టాః' అనుటం బరికించునది. 'దశన' ములకు ముకుళ సామ్యము కాని, కుసుమసామ్యము సరసము గాదు. కుసుమముం జెప్పినయెడను ముకుళావస్థనే గ్రహింపఁదగును. 'పతన విరలైః' అను పాఠము అనుపాదేయము. పండ్లు కొన్ని రాలి తొఱ్ఱలు ఏర్పడియున్న యనుట అందమును వర్ణించుట గాదు. ప్రాన్తోన్మీలన్మనోహరకుట్మలైః దశనకుసుమైః' - వీడని పెద్దపండ్లు 'కుసుమములు' - తొఱ్ఱలలో అందందు మొలతెంచుచున్నవి 'కుట్మలములు' - ఇట్టి దశనవర్ణనయు, వానితో ఉపలక్షితమైన ముఖము వర్ణనయు విరసము. 'ప్రాన్తోన్మీలన్మనోహరకున్తలమ్' అని సాధుపాఠము. 'ంకున్తలైః' అనుటయు సాధువుగాదు. అది 'దశన...'కు విశేషణమై పండ్లప్రక్కన కుంతలముల కాంతిం జెప్పుట యగును. 'ప్రతను విరలైః' అని 'కున్తలైః' కి విశేషణము చేయుటయు విరసమే. కుంతలములకు ప్రతనుతయు విరలతయు ఉపాదేయములు గావు. ఆపక్షమున 'దశనముకులైః' కి విశేషణము లేకయుం బోవును. మఱి, ఉండఁజనును. ఈ తొఱ్ఱిపండ్ల వయసు గాని, అందము గాని రాముని సీతకు భవభూతి భావించినవి కావు. చూ. మహావీరచరితమ్—

లక్ష్మణః—ఏషా మన్థరా.

రామః—(అనుత్తర మన్యతో దర్శయన్) దేవి, వైదేహి,

---

ఆతఙ్క శ్రమ సాధ్వస వ్యతికర క్లాన్త్యాః క్షణం సవ్యథా
మఙ్గై ర్ముగ్ధ మధూక పుష్ప రుచిభి ర్లావణ్యసారై రయమ్
ఉన్నద్ధ స్తన కుమ్భకుట్మల భర వ్యాసావభుగ్నస్య తే
మధ్యస్య త్రివలీతరఙ్గకజుషో భఙ్గః ప్రియే మా చ భూత్. II - 21.

ఈ 'మహావీరుని' సీతయు, ఈ 'యుత్తరరాముని' సీతయు ఒక్కతెయే కాఁబోవును. చూ. VI - 30 'శిశుః' అనుట 'సా బాలా పరవతీతి' అను శాకుంతలము లోని బాలను పోలినది. 'అంగానాం మే' 'అంగకైః' అని లక్ష్మణునితో వావిచ్చి చెప్పుట సాజాపకాదు; అట్లే 'శిశుః' అని యిట ననుటయు. 'అమ్బానాం' అనుటయే సాధువు. క్రొత్తకోడలు సీత - అందటికన్నను - ఇట్టిట్టు - అమ్మలకు ముద్దుగా నుండినది అని తలపోసికొనుట. చూ. P 241 - కౌసల్యా. పాఠము—

'ప్రతనువిరలైః, ప్రాన్తోన్మీలన్మనోహరకున్తలమ్,
దశనముకులైః........అమ్బానాం...' అని. అమ్మలకు అనురక్తిచే జానకి మనంబున నాటుకొన్నది. ఈమె కడమ కోడండ్రవంటిది కాక అవతార విశేషమైనందున అట్లు సంతోషము కలిగించినది. అయోనిజ కదా.

అనుత్తరం - ఉత్తరము చెప్పక - ఏలన అదియెట్లో కైకేయి నిందను ప్రస్తావమునకుఁ దెచ్చును అని దానిని మానుటకు. లక్ష్మణుఁడు దానిం బ్రస్తావింపఁ బూనుటయు, రాముఁడు మానుటయు అరయఁదగును. లక్ష్మణుఁడును సీతయు తప్ప మఱెవ్వరును లేని యీ యేకాంతమందును రాముఁడు దానిని మానుటం జెప్పుట! 'విగ్రహవాన్ ధర్మః' అనుటను రామునియెడ దృఢముచేసి, సీతా వివాసమున కైన తెగువగలవానింగా చూపుటకు. రాముఁడు ఆ ప్రస్తావమును మానుటయ కాక, 'అన్యతః' అని యా ప్రసంగమందలి కొన్ని చిత్తరువులం దాఁటి, ఒక్క తూరిగా మంచి వృత్తాంతముగల చిత్తరువు కడకుం బోయి దానిం జూపుచున్నాఁడు. అట్లేగదా పుష్పకము దిగి ఇంట కైకేయింగాంచి ఆమెకు ఏబెరుకును తోఁపకుండునట్లు ఇట్లనుచు నమస్కరించెనట - కాళి - రఘు - XII—16.

'కృతాఞ్జలి స్తత్ర యదమ్బ సత్యా-
న్నాభ్రశ్యత స్వర్గఫలా ద్గురు ర్నః
తచ్చిన్త్యమానం సుకృతం తవేతి
జహార లజ్జాం భరతస్య మాతుః' అని.

శ్లో॥ ఇఙ్గుదీపాదప స్సోఽయం శృఙ్గిబేరపురే పురా,
నిషాదపతినా యత్ర స్నిగ్ధే నాసీ త్సమాగమః. ౧౪

లక్ష్మణః—(విహస్య, స్వగతమ్) అయే మధ్యమామ్బావృత్తాన్తోఽన్తరిత ఆర్యేణ.

శ్లో. ౧౪. అయం ఇఙ్గుదీపాదపః = ఈగారచెట్టు, సః=అది (సుమా)! శృఙ్గిబేరపురే = శృంగిబేరమను పురమునందు, యత్ర = దేనికడ - (దీనిక్రింద - అనుట.) పురా = మునుపు, స్నిగ్ధేన = మిక్కిలియు స్నేహముగలవాఁడగు, నిషాదపతినా = బోయ మన్నిఁడైన (గుహునితో,) సమాగమః = కూటమి, ఆసీత్ = కలిగెనో - చేకూరెనో, చేకూరినది అనుట.

ఆగారచెట్టును దాని క్రింద వీరిని గుహుఁడు కలసికొనుటయు ఈచిత్తరువున వ్రాసియున్నది అనుట.

"అవిదూరా దయం నద్యా బహుపుష్పప్రవాలవాన్
సుమహా నిఙ్గుదీవృక్షో, వసామోఽత్రైవ సారథే.
......................
...త మిఙ్గుదీవృక్షం త దోపయయతు ర్హయైః
రామోఽభియాయ తం రమ్యం వృక్ష మిక్ష్వాకునన్దనః
రథా దవాతర త్తస్మాత్ సభార్యః సహలక్ష్మణః
......................
తత్ర రాజా గుహో నామ రామ స్యాత్మసమః సఖా
నిషాదజాత్యో బలవాన్ స్థపతి శ్చేతి విశ్రుతః.
......................
తతో నిషాదాధిపతిం దృష్ట్వా దూరా దుపస్థితమ్
సహ సౌమిత్రిణా రామః సమాగచ్ఛ ద్గుహేన సః. రామా - అయో - 50.

స్నిగ్ధేన - గుహుఁడు పరమమిత్రము - మిత్రకార్యమును లెస్సగా నిర్వర్తించినవాఁడు గావున ఈమాటచే జ్ఞాపకముచేయుచున్నాఁడు. ఇది రాముని కృతజ్ఞతను తెలుపును. మురారియు చెప్పినాఁడు.—

'తస్మై సౌమిత్రిమైత్రీ మయ ముపకృతవా నాతరం నావికాయ' అని.

మధ్యమామ్బావృత్తాన్తః - కైకేయి మధ్యమాంబ. మధ్యమ యైనను ఇతరలకన్న ప్రియురాలఁట—చూ. రఘు - X - ౫౫.

'అర్చితా తస్య కౌసల్యా, ప్రియా కేకయవంశజా.'

వీరచరితమున కైకేయియెడ ఈ దుశ్చరిత్రమును మాని, కథను మార్చినను, భవభూతి ఇందు వాల్మీకికథనే అనుసరించుచున్నాఁడు. ఇందే అతనికి విశ్వాస

సీతా—ఏసో జడాసంజమణవుత్తంతో. [ఏష జటాసంయమన వృత్తాన్తః.]

లక్ష్మణః—(ప్రకాశమ్)

శ్లో। పుత్త్రసఙ్క్రాన్తలక్ష్మీకై ర్య ద్వృద్ధేక్ష్వాకుభి ర్ధృతమ్,
ధృతం బాల్యే త దార్యేణ పుణ్య మారణ్యకవ్రతమ్. ౧౫

మును, బహుమానమును. మఱి యందలి మార్పు అందలికి మాత్రమె, 'య త్స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్య వా' అను శాస్త్రమును నిర్వహింపను. ఇట్లు కైకేయివృత్తాంతము గల చిత్తరువును దాఁటిపోవుట రాముని యుదాత్తచిత్తతను సూచించును.

ఏష జటాసంయమన వృత్తాన్తః - ఈ చిత్తరువును అందు వ్రాయఁబడినది, అదయు ఉదాహరింపఁదగినదే అని. అట్లే గదా—

'సో౽హాం గృహీత్వా నియమం తపస్విజనభూషణమ్
......................
జటాః కృత్వా గమిష్యామి న్యగ్రోధక్షీర మానయ.
తత్ క్షీరం రాజపుత్త్రాయ గుహః క్షిప్ర ముపాహరత్
లక్ష్మణ స్యాత్మన శ్చైవ రామ స్తే నాకరో జ్జటాః."
రామా - అయో - 52 - ౬౭.

శ్లో. ౧౫. పుత్త్ర సఙ్క్రాన్త లక్ష్మీకైః = కొడుకులకు తమ రాజ్యలక్ష్మిని పూన్చినవారైన, వృద్ధేక్ష్వాకుభిః = ముసలివారై, (వానప్రస్థమును గొన్న) ఇక్ష్వాకువంశరాజులచేత, యత్ = ఏది, ధృతమ్ = ధరింపఁబడినదో - పూనఁబడినదో, తత్ = అ, పుణ్యం=పవిత్రమైన, ఆరణ్యకవ్రతమ్ = ఆరణ్యకుల - తాపసుల - వ్రతము, బాల్యే=చిఁఱ్ఱాయమందె, ఆర్యేణ=అన్న చేత, ధృతమ్=ధరింపఁబడెను.

ఇక్ష్వాకురాజులు ముసలివారై, తమ రాజ్యమును పుత్త్రుల కప్పగించి, తాము తపస్సుకై - అడవులం జేరుదురు. రాముఁ డన్నతో బాల్యమందే పవిత్రమైన అవ్రతముం బట్టఁ జాల్పడెను.

'వృద్ధేక్ష్వాకుభిః' - 'వార్ధకే మునివృత్తీనాం' రఘు.
అ స్త్యేతత్ పౌరవాణా మన్త్యం కులవ్రతమ్.
......................
నియ తైకపతివ్రతాని పశ్చాత్
తరుమూలాని గృహీభవన్తి తేషామ్." శాకుం. VII.

సీతా—ఏసా పసణ్ణపుణ్ణసలిలా భఅవఈ భాఈరహీ. [ఏషా ప్రసన్న పుణ్యసలిలా భగవతీ భాగీరథీ]

రామః—దేవి, రఘుకులదేవతే, నమస్తే.

శ్లో॥ తురగవిచయవ్యగ్రా నుర్వీభిద స్సగరాధ్వరే
కపిలమహసా రోషా త్ప్లుష్టా న్పితుః ప్రపితామహాన్,
అగణితతనూపాతం తప్త్వా తపాంసి భగీరథో
భగవతి తవ స్ప్రష్టా నద్భి శ్చిరా దుదదీధరత్. ౧౬.

---

అని సూర్యచంద్రవంశముల రాజుల సచ్చరిత్ర మను కాళిదాసు నుపదేశము నను తాను వ్యాసవాల్మీకులవలన గ్రహించి చేసిదానిని,ఇట భవభూతియు స్మరించుచున్నాఁడు. 'ంసక్రాన్త...' 'తనంతట సంక్రమించిన' అని కాదు - తాము వృద్ధులై, యథావిధిగా ఆశీర్వాదపూర్వముగా కొడుకులకు అప్పగించినది అ లక్ష్మి అనియే భావము. అప్పగింపనిరాజ్యము నిలువదు.

భూత్వా చిరాయ చతురన్త మహీసపత్నీ
దౌష్యన్తి మప్రతిరథం తనయం నివేశ్య
భర్త్రా తదర్పితకుటుమ్బభరేణ సార్ధం
శాన్తే కరిష్యసి పదం పున రాశ్రమేఽస్మిన్. శాకుం - IV.

అథ స విషయవ్యావృత్తాత్మా యథావిధి సూనవే
నృపతికకుదం దత్త్వా యూనే సితాతపవారణమ్. రఘు - III - 70.

స రాజ్యం గురుణా దత్తం ప్రతిప ద్యాధికం బభౌ. రఘు - IV - 1.

'శాన్త్యై' - ఇది రాముని మనోజయమును సూచించును.

ఏషా... భాగీరథీ - ఇది తరువాతి చిత్రరువు, మిక్కిలి వ్రాయఁదగినదని వ్రాసినది. ఇందు ముచ్చి పేర్పును తోఁచుచున్నది. చూడఁగానే అభిజ్ఞాతమగుచున్నది 'భాగీరథి' యని. ప్రసన్న పుణ్య సలిలా - తేటయును పవిత్రమునైన జలముగలది.

రఘుకులదేవతే - రఘువంశమువారికి ఆమె యెట్లు విశేషముగా దేవతయైనదో అది తరువాతి శ్లోకమున ఉపన్యస్తము.

శ్లో. ౧౬. సగర అధ్వరే = సగరుని (యశ్వమేధ) యాగమునందు, తురగ విచయ వ్యగ్రాన్ = గుఱ్ఱమును వెదకుటయందు మిక్కిలియు పనివడిన వారును, (అందులకై) ఉర్వీభిదః = భూమిని త్రవ్వుచున్నవారును, కపిల మహసా=కపిలుఁడను తేజస్సుచేత, రోషాత్=కినుకవలన, ప్లుష్టాన్ = కాల్పఁబడిన

సా త్వ మమ్బ, స్నుషాయాం సీతాయాం మరున్ధతీవ శివాను
ధ్యానపరా భవ.

---

బడినవారును, ఐన, పితామహాన్ = తన తాతలను, అగణిత తనూపాతః = లెక్కింపబడని తన దేహనాశము గలవాఁడై, తపాంసి తప్త్వా = తపస్సులు చేసి, భగీరథః = భగీరథుఁడు, భగవతి = మహిమలుగలతల్లీ, పురా = మునుపు, తవ అద్భిః స్పృష్టాన్ = నీ నీళ్ళచే తాఁకఁ (తడపఁ) బడినవారిని, _ అచలువచేత అనుట _ చిరాత్ = చిరకాలమునకు _ ఎట్టకేలకు అనుట, ఉదదీధరత్ = ఉద్ధరించెను.

ఓ భగవతీ, మునుపు సగరుఁడు అశ్వమేధమునకై విడిచిన గుఱ్ఱమును, (ఇంద్రుఁడపహరింపఁగా) అగపడకపోయినదానిని, వాని కొమాళ్ళు వెదుకఁ జొచ్చి, భూమిని మిక్కిలి త్రవ్వఁగా, ఆయడుగున తిరుగాడుచున్న తమ గుఱ్ఱముం గాంచి, దానిచెంత తేజోరాశిగా అగపడిన కపిలమహర్షిని ఆగుఱ్ఱపుదొంగయని భ్రమసి పరిభవింపఁబోగా ఆయన తన క్రోధాగ్నిచే వారిం గాల్చి బుగ్గిచేసెను. వారి యాత్మల నుద్ధరించుటకై, వారి మనుమని కొడుకైన భగీరథుఁడు పలుతెఱంగులైన కడింది తపములు గావించి, నిన్ను భూమిపైకి అవతరింపఁజేసి, వారి బూడిద యెమ్ములపై పాఱింపఁగా, వారికి స్వర్గప్రాప్తి కలిగినది. మావంశమునకు అట్టి పావనవు, మహోపకారిణివి.

దీన రాముని దేవతాభక్తి సూచితము. కపిలమహసా = కపిలుని తేజస్సుచే అనుటకన్నను కపిలుఁడను తేజస్సుచే అనుట మెఱుఁగు. 'సాగరులు' సగరునికై భూమిం ద్రవ్వి కాలిపోయినవారు భగీరథునికి ప్రపితామహులు.

'సగర స్యాసమఞ్జస్తు, అసమఞ్జా దథాంశుమాన్
దిలీ పోంశుమతః పుత్రో దిలీపస్య భగీరథః_'
స్వర్గం గచ్ఛేయు రత్యన్తం సర్వే మే ప్రపితామహాః

రామా. బాల. 42.

'శోషాత్ ప్లుష్టాన్' అన్నదానికి తగిన మాటుగా 'అద్భిః స్పృష్టాన్' అనుట.

సా త్వ మమ్బ _ 'సా' అను నిర్దేశము ఇట్టిచోట్ల పూర్వము వర్ణించి చెప్పిన యన్ని విశేషణములను ఆకర్షించును. 'మా భగీరథునిచే అవతారితవై, మా పూర్వులను ఉద్ధరించి, అట్లు మాకు కులదేవతవైన' అనుట. శివానుధ్యానపరా _ ఇట్లు అలవోకగా చేసిన రాముని ప్రార్థనను జగత్పతియు త్తరువుగాఁ గొని, భాగీరథి ఇఁకముందు వివాసితసీతను కాపాడి సెలవేర్చును. అట్లు కవి దానికి ఉత్తర ప్రయోజనమును ఉద్దేశించియున్నాఁడు.

లక్ష్మణః—అసౌ భరద్వాజావేదిత శ్చిత్రకూటయాయిని వర్త్మని వనస్పతిః కాళిన్దీతటే వట శ్శ్యామో నామ.

(రామః సస్పృహ మాలోకతే.)

సీతా—సుమరేది ఏదం ప్పదేసం అజ్జఉత్తో? [స్మరతి ఏతం ప్రదేశ మార్యపుత్రః?]

రామః—అయి కథం విస్మర్యతే?

శ్లో॥ అలసలులితముగ్ధా న్యధ్వసఞ్జాతఖేదా
దశిథిలపరిరమ్భై ర్దత్తసంవాహనాని,

వనస్పతిః...వటః శ్యామో నామ - చిత్రకూటమునకు దారి చెప్పుచో పెద్ద గుర్తుగా భరద్వాజులవారు చెప్పినది యీ మఱ్ఱి - దీనికి ప్రసిద్ధముగా 'శ్యామ' మని పేరు.

'తతో న్యగ్రోధ మాసాద్య మహాన్తం హరితచ్ఛదం
వివృద్ధం బహుభిర్ వృక్షైః 'శ్యామం' సిద్ధోపసేవితమ్
తస్మై సీతాఞ్జలిం కృత్వా ప్రయుఞ్జీ తాశిషః శివాః'

రామా - అయో. 55.

కాళిదాసును రఘువున దానిని మానలేదు. దానిని మింట పుష్పకమునుండి చూచుచున్నారు, సీతారాములు.

త్వయా పురస్తా దుపయాచితో యః
సోఽయం వటః శ్యామ ఇతి ప్రతీతః
రాశి ర్మణీనా మివ గారుడానాం
సపద్మరాగః ఫలితో విభాతి.

దీనినే 'అక్షయవట' మనియు అందురఁట.

కావుననే దానిని చిత్రగతము చేయుట. 'వనస్పతి' యనఁగా పూవుకే కాయలు కాచునది - మఱ్ఱి, అత్తి మొదలగునది. దీనికి తరువాత 'రామః సస్పృహ మవలోకయతి' - అనుపాఠము ఉండనే తగును, సీత 'స్మరతి' అను ప్రశ్నకుం దగినట్లు.

శ్లో. ౧౪. యత్ర=ఎచ్చట - అనఁగా ఇచ్చట అనుట, అధ్వ సఞ్జాత ఖేదాత్=మార్గము (నడచుట) వలన కలిగిన యలపువలన, అలస లులిత ముగ్ధాని = అలత చెందినవియు నలిగినవియునయ్యు (కావుననే) సొబగారుచున్నట్టియు, పరిమృదిత మృణాళీ దుర్బలాని = నలిగిన తామరతూండ్లవలె వాడి దుర్బలములైనట్టియు, అశిథిలపరిరమ్భైః=సడలని (బిగి) కాగిలింతలచే, దత్త సంవాహనాని =

పరిమృదితమృణాళీదుర్బలా న్యఙ్గకాని
త్వ మురసి మమ కృత్వా యత్ర నిద్రా మవాప్తా. ౧౨

లక్ష్మణః—ఏష విన్ధ్యాటవీముఖే విరాధసంరోధః.

సీతా—అళం దావ ఏదేణ. పెక్ఖామి దావ అజ్జఉత్తసహత్థ ధరిద తాళవెంటాదవత్తం అత్తణో దక్ఖిణారణ్ణపవేసారంభమ్. [అలం తావ దేతేన. పశ్యామి తావ దార్యపుత్రస్వహస్త ధృతతాల వృన్తాతపత్రం ఆత్మనో దక్షిణారణ్య ప్రవేశారమ్భమ్.]

---

ఒసంగఁబడిన పిసికిళ్లుగల యట్టియు, అఙ్గకాని=పాపము! (నీ) కోమలాంగములను, త్వం = నీవు, మమ ఉరసి కృత్వా = నా వక్షమునఁ గూర్చి, నిద్రాం అవాప్తా = నిదురం బొందితివి.

శ్యామమును చేరునప్పటికి సీత చాలదూరమునడిచినందున అలసిపోయినది. పాపము, ఆమె కోమలాంగకములు నలిఁగిన తామరతూండ్లవలె వాడి వత్తు లైపోయినవి; దాన రామునికి మఱియు అందముగాఁ దోచినవి. అట్లు రామునిం గౌఁగిలించుకొని అతని యురమునసే, అతని బిగి కౌఁగిలులే మార్గాయాసమును, అంగాల నొప్పులను తీర్చు సంవాహనములు కాఁగా, అట్లె అందే హాయిగా నిద్రవోయినది. (ఇది నిజముగా మఱపురానిదే!) లక్ష్మణుని యెదురుగాను సీతారాములు ఇట్లు మాటలాడుకొందురు. లక్ష్మణుఁడు పనివానిక్రింద లెక్క.

విరాధ సంరోధః_విరాధునితోడి యొరయిక._వాఁడు దారిని అడ్డుటకెదురైనది.

అలం తావత్ ఏతేన_ఇ దెందుకు లే, వలదు. 'అలం' నిషేధార్థకము. భీషణమై వెగటుకొల్పునదగుటచేత. సీతకు ఉద్వేగము కలుగును. రామునికి వికత్థన మగును.

ఆర్యపుత్ర హస్త ధృత తాళవృన్తాతపత్రమ్_ఆర్యపుత్రుఁడు చేతఁ దాల్చిన విసనకఱ్ఱయే నాకు గొడుగుగా నుండిన, అది సీత అనుభవించిన భాగ్యము. అందుచేతనే అచిత్తరువుం జూడ ఎక్కువ కోరిక.

రామః—

శ్లో॥ ఏతాని తాని గిరినిర్ఝరిణీతటేషు
వైఖానసాశ్రితతరూణి తపోవనాని,
యేష్వాతిథేయపరమాః శమినో భజన్తే
నీవారముష్టిపచనా గృహిణో గృహాణి. ౧౫

లక్ష్మణః—అయ మవిరళానోకహనివహానిరన్తరస్నిగ్ధనీలపరిసరారణ్యాపరిణద్ధ గోదావరీ ముఖర కన్దరః సన్తత మభిష్యన్దమాన మేఘమేదురితనీలిమా జనస్థానమధ్యగో గిరిః ప్రస్రవణో నామ.

---

ఈశ్లోకము రామభాషితము—

శ్లో. ౧౫. గిరి నిర్ఝరిణీ తటేషు = కొండ సెలయేరుల తీరములందు, వైఖానసాశ్రిత తరూణి=వైఖానసవ్రతులచేత ఆశ్రయింపఁబడిన చెట్లుగల, తపోవనాని= తపోవనములు, ఏతాని తాని=ఇవి అవే! - మఱువరాని మనోహరములు, అనుట. యేషు = వేనియందు, అనఁగా వీనియందు అనుట. ఆతిథేయపరమాః = అతిథి సపర్యయే ముఖ్యముగాఁ గలవారై, శమినః = శమము, (విషయవ్యావృత్తి,) కల వారై, నీవార ముష్టి పచనాః=పిడికిలి నివ్వరినే వండుకొనువారైన, గృహిణః = గృహస్థులు, గృహాణి=ఇండ్లను, భజన్తే=పొందియున్నారు.

ఇట కొండలు. వానిపై కొండవాగులు. వానితీరములలో మెండుగా తపోవనము లున్నవి. అందు చెట్లక్రింద వైఖానసులు. గుడిసెలలో గృహస్థులు. వారు మిక్కిలి శమముగలవారు, పిడికిలి నివ్వరినే వండుకొని (తిను) వారు; ఐనను అతిథి సపర్యను మానక ముఖ్యముగా ఆచరించువారు.

ఇందు వైఖానసులును గృహమేధులును, ఇరు తెఱంగులవారు చెప్పఁబడి నారు. వైఖానసులు ఇండ్లులేనివారు. చెట్లక్రింద కాపురముచేయువారు. గృహమేధులు కుటీరములు వేసికొని అందు కాపుర ముందురు. వారు ఇంద్రియజయముగలవారు. పిడికెఁడు నివ్వరికన్నను ఎక్కువ వండుకొనరు. మఱి ఆతిథేయమే వారి కెట్లు ముఖ్యమగును? అందులకై మఱికొన్ని పిడికిళ్లు వండుదురు. తాము పిడికిలినియమమును పాటింతురు. ఇవెల్ల సీతారాములకు మఱపురాని విషయములు.

అయం...గిరిః ప్రస్రవణః - ఇది లక్ష్మణభాషితము. ఇది ప్రస్రవణ మను కొండ. దీనికి మూఁడు విశేషణములు - (i) జనస్థానమధ్యగః - జనస్థానమునకు నడుమనుండు నది. (ii) అవిరళానోకహా...కన్దరః - దాని గుహలు గోదావరిచే మ్రోగుచున్నవి.

రామః—

శ్లో॥ స్మరసి సుతను తస్మిన్ పర్వతే లక్ష్మణేన
ప్రతివిహితసపర్యాసుస్థయో స్తా న్యహాని,
స్మరసి సరసనీరాం తత్ర గోదావరీం వా
స్మరసి చ తదుపా న్తే ష్వావయో ర్వ ర్తనాని. ౧౯

---

'గుహలు' అనఁగా 'గుహాద్వారములు' అనుట. ఆగోదావరి, చెంగటి యడవులచే ఒత్తిడికలిగియున్నది. ఆ యడవులు చెట్ల దట్టంపు మొత్తముచే సందులేనివై తళతళన నల్లగా నున్నవి. అనఁగా చీఁకటులు కమ్ముకొనుచున్న ట్లున్నవి. (iii) సతతం=అనారతము, అభిష్యన్దమాన...నీలిమా - వాన కురియుచున్న మేఘములచే, దట్టము సేయఁబడిన నైల్యముగలది - అనఁగా మిక్కిలి కారుకొనుచున్నది, అనుట. దీనినెల్ల భావించుట కవిప్రతిభ; చిత్రగతము చేయుట ముచ్చి నేర్పు.

శ్లో. ౧౯. సుతను = శుభాంగీ, తస్మిన్ పర్వతే = ఆగిరియందు, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ప్రతివిహిత సపర్యా సుస్థయోః = చక్కఁగా చేయఁబడిన సేవలచే హాయిగనున్న, (మన) తాని దినాని=ఆదినములు, స్మరసి = స్మరింతువా? కాకువుచే ప్రశ్న. తత్ర = అచట, అనఁగా ఆకొండచెంత, సరసనీరాం = తియని నీరు గలదైన, గోదావరీం వా=గోదావరినదిని సైతము, స్మరసి=స్మరింతువా? తదుపాన్తేషు = దాని సమీపములయందు. బహువచనముచే పెక్కుచోటుల నని భావము. ఆవయోః=మన యిరువురియు, వర్తనాని స్మరసి?=నడవడులను స్మరింతువా?

లక్ష్మణుఁడు చక్కఁగా శుశ్రూష సేయుచుండ సీతారాములు ఆదినాలను ఆట కడుహాయిగాఁ గడపిరి. చెంతనే గోదావరీ ప్రవాహము, తియ్యని నీళ్లు; దాని సమీపప్రదేశములలో మాటి మాటి వారు వర్తించిన తెఱంగులు - విహారవిశేషములు - అన్నియు వారికి ఒక నాఁటికిని మఱపువచ్చునవి కావు. ఆయరణ్యవాసమును వారు ఎంతో హాయిగా చేసినారు.

లక్ష్మణేన - సపర్యా సుస్థయోః - "తవ సర్వం కరిష్యామి" అని ఆసేవలు సేయుటే తనకు ఆనందమిడునని కోరి వచ్చినాఁడుగదా తమవెంట లక్ష్మణుఁడు. సరసనీరాం - గోదావరి నీటి తీపు భవభూతి సొంతముగా ఎఱింగి తానును ఇట స్మరించుకొన్నాఁడేమో! ఆంధ్రుఁడగునా? లేక ఆతీరవాసిమాత్రమా? 'సుస్థయోః' అనుపాఠము 'స్వస్థయోః' కన్నను శ్రేయము.

అపి చ—

శ్లో॥ కిమపి కిమపి మన్దమ్మన్దమాసత్తియోగా
దవిరళితకపోలం జల్పతో రక్రమేణ,
అశిథిల పరిరమ్భ వ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్. ౨౦

శ్లో. ౨౦. అశిథిలపరిరంభ...దోష్ణోః=చిక్కని కౌఁగిలింతలయందు పనివడిన ఒక్కొక్క బాహువు (ఇరువురియు రెండుబాహువులు) గల్గి, (కావుననే,) ఆసత్తి యోగాత్=చేరిక సెంపున-కూడుటవలన, అవిరళిత కపోలం=ఒకరి చెక్కు మఱియొకరి చెక్కునకు సందులేక అనించియున్నట్లుగా, (కావుననే) మన్దం మన్దం = మెల్లమెల్లగా, కిమపికిమపి = ఏమేమో, అక్రమేణ=ఒక వరుసయనునది లేక, ఒకరిమాట ఒక సంగతి ముగియక మునుపే మఱియొకరు మఱియొక సంగతి తొడంగుచు, జల్పతోః=మాటలాడుకొనుచున్న (మనకు,) అవిదిత గత యామా = ఎఱుంగఁబడకయే, అనఁగా మన పరాకుననే, కడచిపోయిన జాములు గలదై, రాత్రిః ఏవ=రాత్రియే, వ్యరంసీత్=తుదముట్టెను.

రాముఁడు ఒక్క చేతితోడనే సీతను, సీతయు ఒక్క చేతితోడనే రాముని మాటిమాటికి జాఱిపోనీక సవరించుచు కౌఁగిలించుకొన్నారు. అట్లు ఒకరి తట్టుకు ఒకరు ఒత్తిగిలి మెయిమెయినున్నందున చేరువచే ఒకరి చెక్కిలి ఒకరి చెక్కిలికి సందు లేక అనిపోయినది. కావున మెల్లమెల్లగా వారు ఏమేమో, ఒకటి ముగిసిన తరువాత ఒకటి యని కాని, ఒకరు ముగించిన తరువాత ఒకరు అని కాని, వరుస పాటింపక గోణగోణ మాటలాడుకొనుచునే యున్నారు. మాటలు ముగియలేదు. జాముజాముగా రాత్రి దాఁటిపోవుచున్నను వారికి తెలియనేలేదు. ఇంతలో వారికి తెలియకుండనే తెల్లవాఱిపోయినది.

ఇది మిక్కిలి స్వభావోక్తిగా నున్నది. కవి యసాధారణ ప్రజ్ఞను సూచించును. ఇది చాల ప్రసిద్ధశ్లోకములలో ఒకటి. యువతీయువకుల రాత్రి విస్రంభపు టేకాంతము అతి రమణీయముగా ఇందు వర్ణితము. ఈయొక్క శ్లోకమున కాళిదాస భవభూతుల కవనముల తారతమ్యమును రసికప్రకాండులు పరిగణించినారు. భవభూతి తన యీ యుత్తరచరితమును, 'దీనిని రవంత చూడవయ్యా, చూచి నీకు తోఁచినమాట చెప్పు' అని కాళిదాసుకడకు శిష్యునిచే పంపె ననియు, కాళిదాసు తాను కాంతతో సరసగోష్ఠిలో నుండియే, శిష్యుని చదువరా యని, తన లీలల

లక్ష్మణః—ఏషా పఞ్చవట్యాం శూర్పణఖా.

సీతా—హా అజ్జఉత్త, ఏత్తిఅం దే దంసణం. [హా! ఆర్యపుత్ర! ఏతావత్తే దర్శనం!]

రామః—అయి విప్రయోగత్రస్తే! చిత్ర మేతత్.

సీతా—జహాతహావా హోదు. దుజ్జణో అసుహం ఉప్పాదేది. [యథా తథావా భవతు. దుర్జనోఽసుఖ ముత్పాదయతి.]

---

పరాకువంబోలెనే యుండెననియు, పఠనము ముగిసెననియు, అంతట సరే, నీ విఁక పోరా అని ఆశిష్యుం బంపివైచెననియు, భవభూతి అప్రత్యాగతుని 'ఏమిరా, ఏమన్నాఁడాయన' అని యడుగఁగా, శిష్యుఁడు "ఆయన ఏమియు అన లేదు - ఆయన దీనిని విన్నట్లే లేదు. ప్రియురాలి చేతి తములపు మడుపు లందుకొను చున్నపుడుమాత్రము, నేనును 'కిమపి కిమపి' శ్లోకముం జదువుచుండగా, 'అత్ర బిందు ర్వ్యశిష్యతే' అని ఒకమాట అన్నాఁడు. సున్నము ఒకచుక్క ఎక్కువ పూసినావుగదే - అని కాంతను మందలించినాఁడు అనుకొన్నాను. మఱి యొక్క మాటకూడ అనలేదు." అని శిష్యుఁడు చెప్పెననియు, అట్లుగా! అని భవభూతి ఆ తన శ్లోకముం జూచుకొని, అరరే, ఇందు నేను 'రాత్రి రేవం వ్యరంసీత్' అని రచించితిని, 'ఏవం'లోని 'బిందువు' 'సున్న' ఎక్కువ - 'ఏవ' అని యుండఁదగును అని దానికి కాళిదాసు దిద్దుపాటు - అని గ్రహించి సంతసించి అట్లు దిద్దుకొనెను - అనియు కథ యల్లినారు. కాళిదాసభవభూతులు కాలముచే కడు విప్రకృష్టాంతరు లని చరిత్రకారుల నిర్ణయము. కావున ఈకథ యబద్ధము. మఱియు మహానుభావుఁడు భవభూతి 'వైదగ్ధి'కి తన ప్రసిద్ధిని తాన చెప్పుకొన్నవాఁడు ఇట్లానై 'ఏవ'ను వ్రాయ నేరనివాఁడు కాఁడు. మఱి యిందు సూచన యేమనఁగా కాళిదాసునకును భవభూతికిని కవితలో వాసి ఇంతటిది అని సచమత్కారముగా, వ్యంగ్యభంగిచే ఎవఁడో సహృదయుఁడు తెలుపుట. మఱియు 'వం'ను బిందువుతో కాక 'వమ్' అని వ్రాయుట శ్రేయము. 'ఆసక్తియోగాత్' అను పాఠము మందము. ఇట 'ఆసత్తి' చెప్పఁదగును, అట్టి జల్పనమునకు ఆ మిక్కిలి చేరుపు. ఈశ్లోకము సంభోగశృంగారమునకు దశరూపకమున ఉదాహృతము.

ఈ కాళిదాసీయముం గనుఁడు - రఘు - XIII - 85.

> అత్రానుగోదం మృగయానివృత్త-
> స్తరఙ్గవాతేన వినీతఖేదః.

రామః—హా న్త! వర్తమాన ఇవ మే జనస్థానవృత్తాన్తః!

లక్ష్మణః—

శ్లో॥ అథేదం రక్షోభిః కనకహరిణచ్ఛద్మవిధినా
తథా వృత్తం పాపై ర్వ్యథయతి యథా క్షాలిత మపి;
జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితై
రపి గ్రావా రోది త్యపి దళతి వజ్రస్య హృదయమ్. ౨౧

రహ స్త్వదుత్సఙ్గ నిషణ్ణమూర్ధా
స్మరామి వానీర గృహేషు సుప్తః.

ఇటను, ఉత్తరోత్తరము ఇట్టియెడను భవభూతికల్పనకు ఇది యెంత ఉత్తాపకమో!

పఞ్చవట్యాం శూర్పణఖా - ఇది అచిత్తరువు. చేటలవంటిగోళ్లతో శూర్పణఖ తెలియుచున్నది. పంచవటియు - చిత్తరువునకు మిక్కిలి తగినది.

హా, ఆర్యపుత్ర, ఏతావత్తే దర్శనమ్ - ఇది ప్రకృతపుఁ జెట్టకును సూచకముగా సీత నోట వచ్చిన మాటయు నగునా? ఆకథలో ఇట్లనుట ఇఁకను ఈ శూర్పణఖ చాడి చెప్పినంతనే రావణుఁడు వచ్చి సీతను హరించుకొనిపోవును గదా! 'అయి' అని కోమలామంత్రణము - ప్రియా - అన్నమాట. చిత్రం ఏతత్ -ఇది చిత్తరువు. యథా తథ' వా భవతు=ఎటులైనను కానీ, ఏదైనను కానీ. దుర్జనః - శూర్పణఖంబోనిది. రా - హా న్త - అయ్యో. సీతవంబోలెనే, రామునకును ఈచిత్ర దర్శనమున, స్మారితములై అప్పటి దుఃఖభావములు పైకొనుచున్నవి. కాళిదాసన్నటో

తయో ర్యథాప్రార్థిత మిన్ద్రియార్థా నాసేదుషోః సద్మసు చిత్రవత్సు
ప్రాప్తాని దుఃఖా న్యపి దణ్డకేషు సంచి న్త్యమానాని సుఖా న్యభూవన్.

రఘు - XIV - 25.

అన్నట్లు ఇట్టి చిత్రదర్శనము సుఖకారణ మగును. ఆతలంపును న్యాయ్యమే, సరసమే. ఈతలంపును న్యాయ్యమే, సరసమే, మఱి భవభూతి దీనిని ఇట్లు కల్పించుట కరుణోత్తరమైన తన వస్తువునకు తగిన సీతికం జేయుటకు.

శ్లో. ౨౧. అథ=ఇటుతర్వాత, ఇదం=ఇది - ఈవృత్తము అనుట. ఏ దనఁగా పాపైః=ఖలులగు, రక్షోభిః = రాక్షసులచేత, క్రూరాత్ములచేత అనుట, కనక హరిణ చ్ఛద్మ విధినా=బంగరులేడి యను మిష ప్రయోగించుటచేత, తథా వృత్తం=అట్లు కావింపఁబడినది, యథా = ఎట్లనఁగా, క్షాలితం అపి = (అది) కడిగివేయఁబడిన దైనను - పూర్తిగా ప్రతిక్రియ చేయఁబడిన దైనను అనుట. వ్యథయతి = వెత కలిగించుచునేయున్నది - స్మరణచేత సయితమును. శూన్యే = (సీతలేక) పాడువడిన,

సీతా—(సాస్రమ్ ఆత్మగతమ్) అమ్హో! దిణఅరఉలాణందణో ఎవ్వం మహ కారణాదో కిళిట్ఠఆసీ. [అహో దినకరకులానందన ఏవం మమ కారణా త్క్లిష్ట ఆసీత్.]

లక్ష్మణః—(రామం నిర్వర్ణ్య, సాస్రమ్) ఆర్య, కి మేతత్ ?

---

జనస్థానే=జనస్థానమందు, వికలకరణైః=ఇంద్రియములు పాటవముం గోలుపోయిన, ఆర్యచరితైః=అన్న చేష్టలచేత, అపి గ్రావా=రాయిసైతము, రోదితి=ఏడ్చును, అపి వజ్రస్య హృదయమ్=హీరమణియంతర్భాగము సైతమును, దళతి=చీలును!

అథ ఇదం - అని తరువాతి చిత్రపు కాఁబోలు ఇది. బంగరులేడిరూపాన (మారీచుఁడు) రాముని ఎలయించుకొని పోవుట - దూరాన దానిని అతఁ డేయుట. అతఁడు రామునిగొంతుంబోని గొంతున 'లక్ష్మణా' అని కుయ్యిడి నేల కొరగుట, లక్ష్మణుఁడు సీతాప్రేరితుఁడై సీతను ఒంటిగా డించి రామునికడకువచ్చుట, ఇంతలో రావణుఁడు రాముని కుటీరముం జొచ్చి సీతను హరించుకొనిపోవుట, రాముఁడు ఎట్టకేలకు అటకు వచ్చి సీతం గానక అత్యంతదుఃఖమున మునుంగుట! ఇంతకన్నను కరుణతర సంవిధానమును, ఆదికవి కన్నదానిని మఱి ఏకవియు గననేరఁ డన వచ్చును. 'అపి గ్రావా రోది' తీత్యాది భవభూతివాక్యమును వాల్మీకిం గూర్చిన మైమఱచిన మెచ్చుకోలుంగాఁ గొనఁదగును. మఱి దీనిని గోవర్ధనాచార్యులు ఉత్తరచరితమునందలి 'ఏకోరసః కరుణ ఏవ' ఇత్యాది ఘట్టములకు చిత్తమున అలరి భవభూతిభారతిని విశేషించుటకే వినియోగించినాఁడు!

'భవభూతేః సంబన్ధా ద్భూధరభూ రేవ భారతీ భాతి!
ఏత త్కృత కారుణ్యే కి మన్యథా రోదితి గ్రావా?' అని.

భవభూతి సంబంధమువలన భారతి కొండపుట్టువుగానే భాసిల్లుచున్నది! అట్లు కాదేని అతఁడు కూర్చిన కారుణ్యమున శిల ఎటువలె ఏడువనేర్చును? ఇందలి భావనాధీరత మహాకవితను, మహాప్రతిభను చెప్పుచున్నది.

'అహో, దినకరకులానన్దనః ఏతావత్ మమ కారణాత్ క్లిష్ట ఆసీత్' - ఇది సీతకు ఆత్మగతము గనుక, ఈపాఠము సాధీయ మగును. దినకరకులమువారికెల్ల ఆనందము కలుగఁజేయువాఁడు నా (యొక్కతె) కొసము ఇంత పెల్లిదముగాఁ దల్లడిల్లినాఁడు - అని అశ్రువులు. ఆయనదుఃఖమునకై తాను వగచుచున్నది.

ఈఘట్టము స్మృతికి రాఁగానే రామునికి ఆపుకొనరాని యేడ్పు వచ్చినది. దానినే లక్ష్మణుఁడు చెప్పుచున్నాఁడు. ఇది యాతని రామతత్పరతను సూచించును.

కిం ఏతత్ - ఏమియిది? - అనఁగా నీయందును, ఇపుడును, ఇదితగునా అనుట.

శ్లో॥ అయం తే బాష్పౌఘ స్త్రుటిత ఇవ ముక్తామణిసరో
విసర్పన్ ధారాభి ర్లుఠతి ధరణీం జర్ఝరకణః;
నిరుద్ధోఽప్యావేగ స్స్ఫురదధరనాసాపుటతయా
పరేషా మున్నేయో భవతి చ భరాధ్మాతహృదయః. ౨౨

రామః — వత్స,

శ్లో॥ తత్కాలం ప్రియజనవిప్రయోగజన్మా
తీవ్రోఽపి ప్రతికృతివాఞ్ఛయా విసోఢః,
దుఃఖాగ్ని ర్మనసి పున ర్విపచ్యమానో
హృన్మర్మవ్రణ ఇవ వేదనాం తనోతి. ౨౩

---

శ్లో. ౨౨. అయం=ఇదిగో ఈ, తే బాష్పౌఘః = నీ కన్నీటి ప్రవాహము, త్రుటితః ముక్తామణిసరః ఇవ=తెగిన ముత్తెపుమణుల పేరువలె, ధారాభిః ధరణీం విసర్పన్ = ధారలుగా నేలపైన వ్యాపించుచు, జర్ఝరకణః = బిందువులుగా చెదరినదై, లుఠతి=దొరలుచున్నది. ఆవేగః=సంభ్రమము, నిరుద్ధః అపి=అడ్డఁబడినదైనను, భర ఆధ్మాతహృదయః = పెక్కువచే నింపఁబడిన మనస్సుగలదై, స్ఫురదధర నాసా పుటతయా = అదరుచున్న అధరమును ముక్కుదొప్పలును కలదగుటచేత (-కలవాఁడవగుటచేత,) (అది ఆయావేగకార్యము) పరేషాం = ఇతరులకు, మాకు అనుట, ఉన్నేయః భవతి చ = ఊహింపఁదగినది అగుచున్నది. రాముని యీ యావేగము ఎంతచాపకు అంతగాలి అన్నట్లున్నది.

అన్నా, ఏమి యిది! ఇట్లేడ్చుచున్నావు! నీకన్నీటి ప్రవాహము పెరిగిన ముత్తెంపుఁ బేరుంబోలె ధారలుధారలుగా నేలపై బడి బిందువులుగా చెదరి దొరలుచున్నది. నీ దుఃఖసంభ్రమమును నీవు ఎంత అడంచుకొన్నను, అది నీ హృదయము నిండి పోయి, నీపెదవి ముక్కుదొప్పల యదరుచే మాకు ఎఱుంగనగుచునే యున్నది!

ఎంత ధీరోదాత్తుఁడును ఎంతటి గాంభీర్యముగలవాఁడును, ఇట్టి సమయమున దుఃఖమును ఆఁపుకొనఁజాలఁడు. ఇది స్వభావోక్తిగా నున్నది!

శ్లో. ౨౩. తత్కాలం=ఆ సమయమునందెల్ల, ప్రియజన విప్రయోగ జన్మా దుఃఖాగ్నిః = ప్రేయసిం బాయుటవలన కలిగినదైన యగ్నింబోలిన దుఃఖము, తీవ్రః అపి=తీవ్రమైన దైనను, ప్రతికృతి వాఞ్ఛయా = పగతీర్చుకొను నాసచే, విసోఢః=ఓర్చుకొనంబడినది; పునః = (ఇపుడు) మఱల, మనసి విపచ్యమానః=మన

సీతా—హద్ధి! హద్ధి! అహం వి అదిభూమిం గదేణ రణరణ ఏణ అజ్జఉత్తసుణ్ణం విఅ అత్తాణం పెక్ఖామి. [హాధిక్! హాధిక్! అహ మప్యతిభూమిం గతేన రణరణకేన ఆర్యపుత్త్రశూన్య మివ ఆత్మానం పశ్యామి.]

లక్ష్మణః—(స్వగతమ్) భవతు, అన్యతః క్షిపామి, (చిత్రం విలోక్య) (ప్రకాశమ్) అ హైత న్మన్వన్తరపురాణస్య గృధ్రరాజస్య

మున పరిపాకముం జెందుచున్నదై, (విపచ్యమానః = సెలవేయుచున్న,) హృన్మర్మవ్రణ ఇవ = హృదయపుటాయమునందలి గాయమువలె, వేదనాం = బాధను, తనోతి=(మిక్కిలిగా) కలిగించుచున్నది.

ప్రేయసిం బాసిన యాదుఃఖము అగ్నివలె అతితీవ్రమైనను ఆ సమయమున, దానిం గలిగించిన యాభార్యాపహర్తపై పగతీర్చుకొనునాసచే ఓర్చుకొనఁబడెను. అది యిపుడు మఱల తలఁపునకు వచ్చి, అఁపుకొనరాక, హృదయములో ఆయమున మఱల సెలవేసిన గాయమువలెనై, తీఱని వేదనం గలిగించుచున్నది.

అపూర్వవియోగముంగూర్చిన యీభావమునే ఇంకను వివరముగా భవభూతి రామునిచే చెప్పించును—III= 44.

'ఉపాయానాం భావా దవిరత వినోదవ్యతికరైః,
విమర్దైర్వీరాణాం జగతిజనితాత్యద్భుతరసః,
వియోగో ముగ్ధాక్ష్యాః స ఖలు రిపుఘాతావధి రభూత్;
కథం తూష్ణీం సహ్యో నిరవధి రిదానీ న్తు విరహః?'

రామునికి ఇపు డీదుఃఖము అవశకునముగానే తోఁచుచున్నది; భావివియోగ సూచకమై పైకథను అకర్షించుచున్నది. హృన్మర్మవ్రణ - దేహమున 108 మర్మములు - ఆయములు ఉన్నవి. అందు ఎందును ఘాతము ప్రాణహరమైనను కాలభేదము ఉండును. హృదయమందలి యాయమునందలి గాయము సద్యఃప్రాణహరమగును.

అతిభూమిం గతేన = మేర మీఱి పోయిన, రణరణకేన = వియోగదుఃఖముచేత, దానివలని వణఁకుచేత - ఆర్యపుత్రశూన్యనై ఉన్నా నని నాకు తోఁచుచున్నది. ఆత్మానం పశ్యామి = నన్ను తలంచుకొనుచున్నాను. సీత యీచిత్తవృత్తియు చెట్టకు సూచకమే.

'క్షిపామి' - అనఁగా దుఃఖమునుండి కృతజ్ఞతకు మరలించుచున్నాఁడు. మన్వన్తర పురాణ గృధ్రరాజస్య - ఒక మన్వంతర మనఁగా 43.20,000, నలుబదిమూఁడులక్షల యిరువదివేల యేండ్ల కాలము. కాశ్యపుని భార్యలలో తామ్రి ఒకతె. తామ్రకు మునిమనుమరాలు వినత, వినతకొడుకులలో అరుణుఁ డొకఁడు.

తత్రభవత స్తాతజటాయుష శ్చరిత్ర విక్రమోదాహరణమ్.

సీతా—హాతాద! నివ్వూఢో దే అపచ్చసణేహో. [హా తాత నిర్వ్యూఢ స్తే అపత్యస్నేహః.]

రామః—హా తాత కాశ్యప శకున్తరాజ, క్వ పున స్త్వాదృశస్య మహాత స్తీర్థభూతస్య సాధో స్సమ్భవః[2]

ఆ యరుణునికిం గొడుకు జటాయువు. కావున పెక్కు వేలయేండ్ల వయసువాఁడగును. ఒక మన్వంతరమో, మన్వంతరములో బ్రదికినవాఁడు - అంత పురాణుఁడు ముసలివాఁడు, కాదా ప్రాతవాఁడు - అనుభవశాలి, గౌరవార్హుఁడు. ఈ వైవస్వత మన్వంతరారంభమున జటాయురుత్పత్తిని అనుకొనియు ఇట్లు చెప్పఁదగును. తాతం - నాయనగారికి దశరథులవారికి మిత్రుఁడైనందునను 'నాయన' అని యీ వ్యవహారము కాఁదగును. చరిత్ర విక్రమోదాహరణమ్ - పనులయొక్కయు పరాక్రమముయొక్కయు ఉదాహరణము - అనఁగా చిత్తరువున వ్రాయఁబడియున్నదనుట.

నిర్వ్యూఢ స్తే అపత్యస్నేహః - నిరూఢ అనియు పాఠము, శ్రేయము. నీబిడ్డల (మగుమా) యందలి పక్షపాతమును చక్కఁగా నెఱవేర్చితివి - మాకుఁ గాఁపుగా మా చెంతనే కొండకొమ్మున కాపురముంటివి. తరువాత సమయాన నన్నుం గావ పోరాడి అసువులనే పాసితివి - ఇంతకన్న నిర్వాహము ఉండునా? 'నిరూఢము కావించితివి' - గట్టిగా రుజువుచేసితివి, ప్రాణములంగూడ ఒడ్డి; మా చెంతనే కాపురము ఉండియు - చూ II - ౧౬.

'అస్యై వాసీ న్మహతి శిఖరే గృధ్రరాజస్య వాసః
త స్యాధస్తా ద్వయ మపి రతా స్తేషు పర్ణోటజేషు.'

తీర్థభూతస్య = పవిత్రుఁడైనవాఁడు. సాధోః = మంచిగుణములుగలవాఁడు - వాయునకు సాటి. కావుననే తన చేతిమీఁదుగా అతనికి దహనసంస్కారము గావించి—

మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్
గృధ్రరాజ, మహాసత్త్వ, సంస్కృత శ్చ మయా, వ్రజ - రామా అర. 68

అని అపునరావృత్తిస్థానమునకుం బంపినాఁడు!

దనుకబన్ధాధిష్ఠిత - దనుకబంధుఁడు వసించుచున్న, సిద్ధశబరీ - సిద్ధ యనఁగా తపఃసిద్ధిగలది.

లక్ష్మణః—అయ మసౌ జనస్థానపశ్చిమః కఙ్గవాన్నామ దను కబన్ధాధిష్ఠితో దణ్డకారణ్యభాగః, త దిద మమృష్యపరిసరే మతఙ్గా శ్రమపదం, ఇయం శ్రమణానామ సిద్ధశబరీ, త దేత త్పమ్పాభి ధానమ్ పద్మసరః.

సీతా—ఎత్థ కిల అజ్జఉత్తేణ విసజ్జిదామరిసధీరత్తణం పముక్క- కణ్ఠం పరుణ్ణం ఆసీ. [అత్ర కిల ఆర్యపుత్రేణ విసృష్టామర్షధీరత్వం ప్రముక్తకణ్ఠం ప్రరుదిత మాసీత్.]

రామః—దేవి, రమణీయ మేతత్ సరః.

శ్లో । ఏతస్మి న్మదకలమల్లికాక్షపక్ష
వ్యాధూత స్ఫుర దురుదణ్డపుణ్డరీకాః,

---

విసృష్టామర్ష ధీరత్వం - పగవానిమీఁది కోపమును స్వాభావిక ధైర్యమును (=నిబ్బరమును) మాని రాముఁడు అట్లు ఏడ్చెనని ఆమె ఎట్లు ఎఱుఁగును? ఊహయా? కాదు. లంకనుండి అయోధ్యకు పుష్పకమున మరలుచో దారిలోని విశేషములను తనకు అనుభూతపరిచితములను రాముఁడు సీతకు చూపుచుండెను. అప్పుడు పంపను ఇట్లు చెప్పుచుం జూపెను—రామా—యుద్ధ - 127 - 3౫.

ఏషా సా దృశ్యతే పమ్పా నళినీ చిత్రకాననా
త్వయా విహీనో యత్రాహం విలలాప సుదుఃఖితః.

అటనే రఘువులో పంప, అందు నీరు సారసములచేతను వానీరములచేతను మఱుఁగుపడియుండఁగా దానిని తాను దృష్టిని నిగిడించి చూడవలసివచ్చెను. ఇటనో కువలయములకు పుండరీకముల మఱుఁగు.

ఉపాన్తవానీరవనోపగూఢా న్యాలక్ష్య పారిప్లవ సారసాని
దూరావతీర్ణా పిబ తీవ ఖేదా దమూని పమ్పాసలిలాని దృష్టిః.

రఘు - xiii - 30.

రాముఁడు పంపను పరకాయించి చూచుట విరహదుఃఖాపనోదార్థము.

శ్లో. ౨౮. ఏతస్మిన్ = ఇందు, మదకల మల్లికాక్షపక్ష వ్యాధూత స్ఫుర దురుదణ్డ పుణ్డరీకాః = సంతసముచే త్రుళ్ళుచు కూయుచు నున్న నల్లని ముక్కు- లును నల్లని పాదములును గల మల్లికాక్షముల రెక్కలచే నెట్టఁబడినవై కద లుచు నూఁగుచు నున్న లావు తూండ్లనొప్పు తెల్లతామరలుగలవైన, కువలయినః =

బాష్పామ్భః పరిపతనోద్గమాన్తరాలే
సన్దృష్టాః కువలయినో భువో విభాగాః. ౨౮
లక్ష్మణః — అయ మార్యో హనూమాన్.

కలువలకు తావలములయిన, భువః విభాగాః=ప్రదేశముల భాగములు, బాష్పామ్భః పరిపత నోద్గ మాంతరాలే = కన్నీళ్ళు రాలి మరల పొడము నంతరమునందు, సన్దృష్టాః=కాంచఁబడినవి.

ఈ పంపలో మల్లికాక్షములు సంతసమునం ద్రుళ్ళుచు కూయుచు ఈదు చుండెను. లావు కాడలు గల తెల్లదామరల గుబురు లుండెను. వాని లావు తూండ్లను మల్లికాక్షములు టెక్కులం గొట్టి ఇటునటు త్రోపఁగా, వాని మాటున నున్న కలువతండముల తావులును కానవగుచుండెను. అట్టి యాసరస్సుం జూచు చుండ నాకు నిరంతరముగా కన్నీళ్ళు పొడముచు రాలుచు నుండెను.

కలువ తండముల యాకులు నాళములు పూలు అన్నియు చిన్నవిగను సన్న విగను నుండును. తెల్లతామరల తండముల యాకులు నాళములు పూలు అన్నియు పెద్దవిగను లావైనవిగను నుండును - కావున పూర్వములు ఉత్తరముల మాటునం బడియుండును. వీనిని మల్లికాక్షములు టెక్కులతో నెట్టివైచినపుడు, అదరు తూండ్లతో ఆతామరలు సందీయఁగా, ఆ కలువతండములు బయటపడి కను పండువు సేయును. మల్లికాక్షముల యీఁతలు, పుండరీకముల వ్యాఘూతాప సరణములు, కువలయవద్భాగములు అన్నియు కనుపండువులే, ఉద్దీపకములే, ప్రమోదనముం గలిగించునవే. కువలయవంతములుం గల వనియు, పుండరీకము లను అట్లు విశేషింపకున్న ఇవి బయలుపడవనియు 'వ్యాఘూత' ఇత్యాది దీర్ఘ విశేషణము. ఆయంతరాళమునం జూచితి ననఁగా నిరంతరము ఏడ్చుచుం జూచుచు నుంటిని అనుట.

'ఏషా ప్రసన్నసలిలా పద్మనీలోత్పలాయుతా
హంసకారణ్డవాకీర్ణా పమ్పా సౌగన్ధికాన్వితా.' రామా - కిష్కి - 1.

ఈ శ్లోకము కవికి ప్రియమగుటచే ఇందే కాక, దీనిని మాలతియందును ఒకానొక పద్మ సరోవర్ణనమున, కుచ తప్పకుండ, చెప్పినాఁడు. IX - 14. ఐనను నాలవపాదమునమాత్రము వేఱు పాఠము 'దృశ్యన్తా మవిరహిత శ్రియో విభాగాః' అని. కువలయములు లేవు.

ఆర్యో హనూమాన్ - పూజ్యుఁడు - మహాత్ముఁ డగుటచేత. చిర నిర్విణ్ణ జీవ లోక సముద్ధరణ గురూపకారీ - చిరకాలము నిర్వేదము (దుఃఖము) చెందిన ప్రాణి

సీతా—ఏసో సో చిరణివ్విణ్ణజీవలోఅ సముద్ధరణగురూవఆరీ మహాభాఓ మారుదీ. [ఏష స చిరనిర్విణ్ణ జీవలోక సముద్ధరణ గురూపకారీ మహాభాగో మారుతిః.]

రామః—

శ్లో॥ దిష్ట్యా సోఽయం మహాబాహు రఞ్జనానన్దవర్ధనః!
యస్య వీర్యేణ కృతినో వయం చ భువనాని చ! ౨౫

---

కోటిని ఉద్ధరించుటచే మహోపకారము చేసినవాఁడు - లోకమున తన్ను ఉద్ధరించుట ఎల్లవారిని ఉద్ధరించుటగా తోఁచును, తనకు ఉపకారి లోకమున కెల్లను ఉపకారి అని తోఁచును. కావున ఇది తన్నుంగూర్చిన విశేషమును సామాన్యము చేసిన తెఱఁగు. స్త్రీజనము ప్రాయికముగా ఇట్లు పలుకును. రావణుఁడు 'లోకరావణుఁడు.' వానిచే లోకము 'చిరనిర్విణ్ణము.' వానిం జంపుటకు ముఖ్యకారణమైనందున ఇట్లు భావించి 'జీవలోక...రీ' అన్నది సీత, యనుట అంత సరసము గాదు. మహాభాగః మహామహుఁడు. సీతకుఁ గల కృతజ్ఞత సూచితము.

శ్లో. ౨౫. దిష్ట్యా=సంతోషము! సంతోషము! సః అయం మహాబాహుః = అతఁడే ఆమహాభుజుఁడే, ఇతఁడు. అఞ్జనానన్దవర్ధనః = అంజనాదేవి కొమారుఁడు. యస్య=ఎవనియొక్క (ఇతనియొక్క అనుట.) వీర్యేణ = వీరముచేత. వయం చ = మనమును, భువనానిచ = (ఎల్ల) భువనములును (అనఁగా అందఱివారును,) కృతినః= కృతార్థులము, ధన్యులము.

ఆహాహా, ఈతఁడు ఆమహాభుజుఁడు, అంజనేయుఁడు. ఈతనివీరముచే ఉపకృతులమై మనము ధన్యుల మైతిమి. అట్లే ఎల్ల భువనములలోని వారును.

ఇది రాముని కృతజ్ఞతావాక్యము. భువనాని చ - అని శ్రీరాముఁ డనుట ఇతఁడు ఎల్ల లోకములకు పీడ కలిగించుచున్న రావణుని వధకును సహాయుఁ డగుటచేత. మహాబాహుః - చిత్తరువున అట్లు వ్రాయఁబడియున్నాఁడు. ఆహా ఈ చేతులతో ఈది దాఁటినాఁడు కాఁబోలు సముద్రమును అన్నట్లును, సర్వకార్యములను వానితో సాధించినాఁడు కాఁబోలు అన్నట్లును - హర్షాతిరేకము. భవభూతి శ్రీరామమహావీరచరితముం గూర్చి 'తే వేద ముద్ధృత జగత్త్రియ మన్యమూలమ్' అనెను గదా. లోకోద్ధారకుఁడును విశ్వసంస్తూయమానుఁడును అగుటచే అఞ్జనానన్దవర్ధనః - తన తల్లికి ఆనందవర్ధనుఁడనుట.

సీతా — వచ్ఛ, ఏసో కుసుమిఅ కలంబ తరు తండవిఅ వరహిణో కిం ణామ హేఓ గిరీ? జత్థ అణుహావసోహగ్గ మేత్తపరిసేసధూసరసిరీ ముచ్ఛంతో తుఏ పరుణ్ణేణ ఓళంబిదో తరుఅళే అజ్జవుత్తో ఆళిహిదో. [వత్స ఏష కుసుమిత కదమ్బ తరు తాణ్డవిత బర్హిణః కిన్నామధేయో గిరిః, యత్రానుభావ సౌభాగ్యమాత్ర పరిశేషధూసర శ్రీః మూర్ఛం స్త్వయా ప్రరుదితే నావలమ్బిత స్తరుతలే ఆర్యపుత్ర ఆలిఖితః?]

లక్ష్మణః —

శ్లో. సోఽయం శైలః కకుభసురభి ర్మాల్యవాన్నామ యస్మి
న్నీల స్స్నిగ్ధ శ్శ్రయతి శిఖరం నూతన స్తోయవాహః,
ఆర్యే నాస్మిన్...

---

ఏష కుసుమిత కదమ్బతరు తాణ్డవిత బర్హిణః - ఈచిత్రరువులం దెల్ల ముచ్చనేర్పును భవభూతి ఎత్తింగించుచునే యున్నాఁడు. దాన తన చిత్రకర్మ రసికతయు. చూడఁగానే కడిమిచెట్లనియు, అందు పూత యనియు, వానిపై నెమళ్లు తాండవించుచున్నవనియు తెలియుచున్నది. దీనిచేత వర్షాగమము. దాననే సీతావియుక్తి, రామునికి మూర్ఛాదికమును, దాన లక్ష్మణుని యేడ్పును. 'అనుభావ సౌభాగ్య మాత్ర పరిశేష ధూసర శ్రీః' - 'అనుభావో భావబోధకః'-రూపమాత్రమునం దోఁచు మహిమ; స్వాభావికమైన తేజస్సు - సౌభాగ్య = స్వతఃసిద్ధమైన యందము, అవి మాత్రము మిగిలియున్నట్టిదియు, ధూసరమైనదియు = మాసినదియు - నగు మేనిసిరిగలవాఁడు. స్వభావముచే చిత్తవికారములు సులభమైనట్టిది సీత; అందును విశేషముగా ఇట్టిసమయములందు. అట్టి యామెచేత, అట్టి యవస్థం జెందిన రాముని చూచుచుండఁగా, ఈకొండ పేరేమి?' అని యడిగించుట ఇట చాల మందము! ఇట్టిదానిని లక్ష్మణునిచేత చెప్పించి, దాని విన్నందులకు తగిన మాటలను సీతచేత పలికించి యుండఁదగును. కాదా ఇట్లు సమాధానపడఁదగును. ఆకొండపేరు జ్ఞప్తియుంచుకొనఁ దగినది. ఇట తనతోడి విరహామును ఓర్వఁజాలక రాముఁ డట్లాయెను గదా.

శ్లో. ౨౬. అయం = ఇది, స శైలః = ఆకొండ, కకుభ సురభిః = కొండమల్లెలతో పరిమళించునట్టిది, మాల్యవాన్ నామ = మాల్యవంతమను పేరుగలది. యస్మిన్ - దేని (=దాని) మీఁద, శిఖరం = శిరమును - కొమ్మును, నీలః=నల్లనిదియు

రామః—

విరమ విర మాతః పరం న క్షమోఽస్మి;

ప్రత్యావృత్తస్స పున రివ మే జానకీవిప్రయోగః. ౨౬

లక్ష్మణః—అతః పర మార్యస్య తత్రభవతాం కపిరాక్షసానాఞ్చ అసఙ్ఖ్యాతా న్యుత్తరోత్తరాణి కర్మాశ్చర్యాణి. పరిశ్రాన్తా చేయ మార్యా. త ద్విజ్ఞాపయామి విశ్రమ్యతా మితి.

సీతా—అజ్జఉత్త ఏఇణా చిత్తదంసణేణ పచ్చుప్పణ్ణదోహళాఏ మే అత్థి విణ్ణప్పం. [ఆర్యపుత్ర ఏతేన చిత్రదర్శనేన ప్రత్యుత్పన్న దోహదాయా అస్తి మే విజ్ఞాప్యం.]

---

స్నిగ్ధః = (నీరు నిండియుండుటచే) నిద్దముగా - తళతళన - ఉండునదియును నగు, నూతనః=క్రొత్త - ఈసంవత్సరమునకు ఇదే మొదటిదైన, తోయవాహః=మేఘము, శ్రయతి=పొదివియున్నది.

వత్స=నాయనా, ఏతస్మాత్=దీనినుండి. విరమ విరమ = మాను, మానరా. అతః పరమ్=ఇంతకుపైన, న క్షమః అస్మి = (ఓర్వ) శక్తుఁడ గాను. సః జానకీవిప్రయోగః = సీతతోడి యావియోగము, మే=నాకు, పునః=వెండియు, ప్రత్యావృత్తః ఇవ=సంభవమైనదివోలె నైనది.

ఇది యామాల్యవంతము, కొండమల్లెల పరిమళము గుబాళించుచుండునట్టిది. దాని శిఖరమును తళతళని కార్మొయిలు, అప్పుడే వచ్చినట్టిది, పొదివియున్నది. నాయనా, లక్ష్మణ, మానరా, మానరా, దానిని, ఇఁక నేను విన శక్తుఁడ గాను. నాకు ఆ సీతావిరహము మఱల వచ్చినట్టు లగుచున్నదిరా!

రఘువున ఇదిగో పుష్పకమునుండి యగపడిన మాల్యవంతము - అందుండియే అది వీరచరితోత్తర చరితలకు వచ్చినది - రఘు - XIII - 26 - 9.

ఏ తద్గిరే ర్మాల్యవతః పురస్తా-
దావిర్భవ త్యమ్బర లేఖి శృఙ్గమ్
నవం పయో యత్ర ఘనై ర్మయా చ
త్వ ద్విప్రయోగాశ్రు సమం విసృష్టమ్.

గన్ధశ్చ ధారాహతపల్వలానాం కాదమ్బ మర్ధోద్గత కేసరంచ
స్నిగ్ధాశ్చ కేకాః శిఖినాం బభూవు ర్యస్మి న్నసహ్యాని వినా త్వయా మే.
పూర్వానుభూతం స్మరతా చ యత్ర కమ్పోత్తరం భీరు తవోపగూఢం
గుహావిసారీ ణ్యతివాహితాని మయా కథంచి ద్ఘనగర్జితాని.

రామః—నన్వాజ్ఞాపయ.

సీతా—జాణే పుణోవి పసణ్ణగంభీరాసు వణరాఇసు విహారిస్సం పవిత్త సొమ్మసిసిరావగాహం భఅవదిం భాఈరహిం ఓగాహిస్సంతి—[జానే పునరపి ప్రసన్నగంభీరాసు వనరాజిషు విహరిష్యే, పవిత్రసౌమ్యశిశిరావగాహాం చ భగవతీం భాగీరథీ మవగాహిష్యే ఇతి.]

---

వీరచరితమునను - లక్ష్మణుఁడు అడుగును.

'కిం...సజ్జలిత బాష్పపటలయా దృశా ..ధనురవష్టమ్భధీరధారిత శరీరేణ ఆర్యేణ స్థీయతే! అని. రాముఁడు బదులిడును-

'...శ్రయతి శిఖరమద్రే ర్నూతన స్తోయవాహః' - అని.

ఆమాల్యవంతమున రాముఁడు ఇట్లు ఓపక మూర్ఛిల్లినట్లు వాల్మీకి చెప్ప లేదు. వర్షల్లెల్ల రామునిచేతనే వర్ణింపించినాఁడు గాని మఱి ఆయనను ఇట్టి యవస్థపాలు చేయలేదు. 'నూతన స్తోయవాహః' అనుటచే కాళిదాసుని 'నవ జలధరః సన్నద్ధోఽయం' అను పురూరవుని, 'అన్తర్బాష్ప శ్చిరమనుచరో రాజరాజస్య' అను యక్షునిం దలంచుకొని ఆతనిజాడం బడి తద్వైరివస్యం జేయుచున్నాఁడు.

ఒకవిధముగాఁ జూడ ఇవన్నియు శ్రీరాముని యనురక్తికి తార్కాణములు, గావున ఇట్టివానిని ఎంతవిన్నను సీతకు తనివితీఱదనియు తలంపఁదగును.

రాముని ఇట ఇంత ఓపనిదుఃఖము పాలుచేసి. సీతను ఊరక నిలఁబెట్టి నాఁడు కవి! అప్పుడే 'అతిభూమిం గతేన రణరణకేన ఆర్యపుత్రశూన్య మివ ఆత్మానం పశ్యామి' అని యన్నదే - ఇపుడు ఈ చిత్తరువులం జూచినపుడు రాముఁ డట్లగుచుండ, సీత యెట్లు కాఁదగును! ఇది యీఘట్టమున అరయఁదగును. ముక్త మునకు ఇరువురిచేతను - 'ఆర్యపుత్రశూన్య మివ' ఇత్యాది అటనే సీతచేతను, 'ప్రత్యావృత్తః పున రివ' అని ఇట రామునిచేతను చెప్పించి, ఈచిత్తఖిన్నత యను వవశకునముచే దుర్ముఖునిమాట వినుటకును, వివాసదుఃఖ మనుభవించుటకును కవి పీఠిక కుదిర్చినాఁడు. లక్ష్మణుఁడు ఒకింత తటస్థుఁడుగానే ఉన్నాఁడు.

అసఙ్ఖ్యాతాని - లెక్కలేనివి - కర్మాశ్చర్యాణి - కర్మరూపమైన యాశ్చర్య ములు. 'ఆశ్చర్యాణి' విశేష్యము, విశేషణము గాదు. ఉత్తరోత్తరాణి=ఒకదానిని మించిన దొకటియైనవి.

పరిశ్రాన్తా చ ఇయం ఆర్యా - మఱి వదినె ఇదిగో అలసిపోయినది - అని చూపుచు చెప్పట. ఈ చిత్రదర్శనమునకు రెండు ప్రయోజనములు. ఒకటి సీతా

రామః—వత్స అచిరం సమ్పాదనీయో దోహద ఇతి సమ్ప్రత్యేవ గురుభి స్సన్దిష్టం; త దస్ఖలితసుఖ సమ్పాతం రథ ముపస్థాపయ.

సీతా—తు స్మేహిం వి ఆఅంతవ్వం. (యుష్మాభి ర ప్యాగన్తవ్యమ్.)

రామః—అయి కఠినహృదయే, ఏతదపి వక్తవ్య మేవ?

సీతా—తేణ హి పిఅం మే. [తేన హి ప్రియం మే.]

లక్ష్మణః—యథాజ్ఞాపయ త్యార్యః (ఇతి నిష్క్రాన్తః)

రామః—ప్రియే ఇతో వాతాయనోపకణ్ఠే ముహూర్తం సంవిష్టా భవ.

---

రాములకు అవశ్యము మనఁదగునట్టి మనోభావము కలిగించుట. రెండు - సీతకు ఈదోహదోత్పత్తిం గూర్చుట.

అస్తి మే విజ్ఞాప్యమ్ - అని సీత యనుట, నను ఆజ్ఞాపయ - అని రాముఁ డనుటయు పరికింపఁదగును. నను సంబోధన - ప్రేయసీ అన్నట్లు. 'ఆజ్ఞాపింపుము' - నీకోరికం దీర్ప నేను సిద్ధముగా నున్నాను - అనుట. అనురాగస్నేహాతిశయమున రాముఁడు సీత 'ఆజ్ఞను' బ్రతీక్షించుట కాంతానువృత్తి రసజ్ఞత యగును.

ప్రసన్నగంభీరాసు - వనరాజిషు = అడవిబారులయందు. అవి 'ప్రసన్న' ము లగుట 'నిర్బాధము' లగుట - రాక్షసులు ఘాతుకజంతువులు మొదలగునవి లేకుండుట. గంభీరములు - దట్టమైన లోతు (వైశాల్యము) కలిగినవి. ఈకోరిక సీతకు కలిగించుటకే ఈచిత్రదర్శనకల్పన. ఈకోరిక మిక్కిలియు స్వాభావికము.

గురుభిః సన్దిష్టమ్ - అరుంధతియు శాంతాదేవియు అష్టావక్రునిచే చెప్పిపంపినారు గదా - ఇదియే వారు కోరినది.

అస్ఖలిత సుఖ సమ్పాతం = కుదిలింత లేక సుఖముగా పోవునట్టిది. ఉపస్థాపయ= తెప్పింపుము.

అయి కఠినహృదయే - నీవు చెప్పకున్న మేము రా మని యనుకొన్నావటే - నిన్ను విడిచియుండలేని నన్నుంగూర్చి అట్లు నీవు భావించుటే నీ హృదయ కాఠిన్యము. ఇందు రాముఁడు సీతను వంచించుచున్నాఁడా? లేదు. నింద విన్న తరువాత చిత్తము మార్చుకొన్నాఁడు. లక్ష్మణుఁడును ఇప్పుడు రామునిచే వంచితుఁడు గాఁడు. లక్ష్మణునితోను అతఁడు సద్భావముతోనే చెప్పినాఁడు. కుదుపులేని తేరు తెప్పింపుము అని. ఆడిక విన్నతరువాత 'నూతనోరాజా' ఇత్యాది

సీతా — ఏవం హోదు, ఓహారిజ్జమ్మిమ్హి పరిస్సమజణిదాఏ ణిద్దాఏ. [ఏవం భవతు, అపహ్రియేఖలు పరిశ్రమజనితయా నిద్రయా.]

రామః — తేన హి నిరన్తర మవలమ్బస్వ మామనుగమనాయ.

శ్లో॥ జీవయన్నివ ససాధ్వసశ్రమ
స్వేదబిన్దు రధికణ్ఠ మర్ప్యతాం,
బాహు రైన్దవమయూఖచుమ్బిత
స్యన్దిచన్ద్రమణిహారవిభ్రమః. ౨౮

---

ఆదేశమును దుర్ముఖునిచేత పంపినాఁడు. దానికి ఈ ప్రకృతమును 'ఛద్మ' గా విని యోగించినాఁడు.

వాతాయనోపకణ్ఠే = కిటికి చెంత.

సంవిష్టా భవ=కూర్చున్నదానవు, కాదా, పరుండినదానవు కమ్ము. కూర్చుండుము - పరుండుము అనుట.

పరిశ్రమజనితయా - బడలిక వలనకలిగినదైన. అపహ్రియే - అపహరింపఁబడుచున్నాను. ఎటకో కొనిపోఁబడుచున్నాను. అనఁగా నిద్రకు పరవశ నగుచున్నాను. అనఁగా అపుకొనరాక నిద్రవచ్చినది సీతకు.

నిరన్తర మవలమ్బస్వ మాం అనుగమనాయ - ఎడయక నన్ను పట్టుకొనుము, వెంట వచ్చుటకు. పట్టుకొని వెంటరమ్ము. 'అత్ర శయనాయ' అను పాఠము సాధువుగాదు. అట్టి అపహరణమున 'పండుకొనుటకై' పట్టుకొనుట ఎందులకు? ఇంకను కొన్ని అడుగులు నడువవలసియున్న, అప్పుడు అందులకై అవలంబము వలయును. అప్పుడే తరువాతి శ్లోకమునం జెప్పినట్లు, అవలంబనప్రకారముగా, తన బాహువును రాముని కంఠాన ఉంచుటయు సరి యగును.

శ్లో. ౨౮. ససాధ్వసశ్రమ స్వేద బిన్దుః=భయమువలనను అలసటవలనను కలిగిన చెమరుబొట్లు కలిగి, ఐన్దవ మయూఖ చుమ్బిత స్యన్దిచన్ద్రమణిహార విభ్రమః = చంద్రునిదైన కిరణములు తగిలి నీరు కాఱుచున్న చంద్రకాంతముల హారపు సొబగు గలదై, జీవయన్ ఇవ = నాకు ప్రాణమిచ్చునదియుం బోలె నున్న, బాహుః = నీ భుజము, అధికణ్ఠమ్=నా మెడపై, అర్ప్యతాం=ఉంపఁబడును గాక.

గర్భిణీసులభమైన భయములకును, ఇంతసేపు నిలంబడి చిత్తరువులం జూచుచుండిన యలసటకును నీ బాహువున చెమరుబొట్లు కూడినవి. దాన అది ఇందుని కిరణములు సోఁకి నీటిబొట్లు ఓడుచున్న చంద్రకాంతముల హారముం బోలి తెల్లగ తళతళవ చల్లగా నున్నది. దానిని నా మెడ నుంతువేని నాకు పోయినప్రాణములు వచ్చునట్లు ఆప్యాయముగా హాయిగా నుండును - అట్లు ఉంపుము.

(తథా కారయన్, సానన్దం) ప్రియే కి మేతత్ ?

శ్లో. వినిశ్చేతుం శక్యో న సుఖ మితి వా దుఃఖ మితి వా,
ప్రబోధో నిద్రా వా, కిము విషవిసర్పః, కిము మదః ?
తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేన్ద్రియగణో
వికార శ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతి చ. ౩౫

ఇది సీతాబాహుస్పర్శసౌఖ్య వర్ణనము. ఇందుమణిహారము తెల్లగా తళతళన ఉండును. తనంతటనో చల్లనిది, చంద్రకిరణములు సోఁకి చెమ్మగిల్లిన మిక్కిలియు చల్లని దగును. అట్టి సొబగును శైత్యమును కలిగియున్నది, ఆబాహువు అనుట. అది కంఠమునకు తగులఁగానే ఎంతో హాయిగానున్నది. సాధ్వస = భయము. సీతకు భయమేల? చిత్రదర్శనమునం గలిగినదా ? అట్టి భయంకరమైనవి అం దేవియు సీత చూడలేదే. దోహదమును గూడ గొన్నదే! ఇది గర్భిణులకు తొలిగర్భమున తనంతటనే యుండు సాధారణ భయము కాఁదగును. ఈ శ్లోకము కవికి ప్రియము, మాలతియందును గలదు.

తథా కారయన్=అట్లు చేయించుచు - అనఁగా తానే సీతబాహువును తన మెడపై ఇడుకొనుచు - ఇది అంత ప్రీడాకరమనియు రంగమున చూపఁగూడని దనియు అనుకొన నక్కఱలేదు.

శ్లో. ౩౫. సుఖం ఇతి వా=సుఖ మనియో, దుఃఖం ఇతి వా=దుఃఖమనియో; విబోధః (వా) = మెలఁకువ యనియో, నిద్రా వా=నిదురయనియో, విషవిసర్పః కిము=విష మెక్కుటయో, మదః (కిము)=కైపెక్కుటయో, వినిశ్చేతుం = నిర్ణయించుటకు, న శక్యః = అలవిపడనిదై, తవస్పర్శే స్పర్శే = నీపీడని తాఁకునందు - తాఁకుటవలన, పరిమూఢేన్ద్రియగణః = కన్ను మొదలగు నా యింద్రియ సమూహమునకు పరిమోహము (=మైకము) కలిగించునదై, వికారః=ఒక వికృతి, మమ = నాయొక్క, చైతన్యమ్=చేతనను, భ్రమయతి హి = ఊఁపుచున్నది గదా, సమున్మీలయతి చ హి=(వేరుతో కూడ) పెకలించుచునున్నదికదా.

ప్రియా, నీవు తాఁకినమాత్ర నాకు ఒక చిత్రవికారము కలుగుచున్నది. అది యిట్టిదని భావించుకొననేరకున్నాను. సుఖమో, దుఃఖమో; మెలఁకువో నిద్రయో; విష మెక్కుటో కైపెక్కుటో. దాన నా యింద్రియములకు ఏమో మోహము కలుగుచున్నది. ఇది నాచేతనను సుడియించుచున్నది గదా, పెకలించియే వైచుచున్నది గదా.

సీతా—థిరప్పసాదా తుమ్హే, ఇదో దాణిం కి మపరం? [స్థిర ప్రసాదా యూయం, ఇత ఇదానీం కి మపరం?]

రామః—

శ్లో॥ మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సన్తర్పణాని సకలేన్ద్రియమోహనాని,

---

ఈవ్యభిచారిభావముల వర్ణన అతిశ్లాఘ్యము, ప్రౌఢము, ఇతర కవ్యతీతము. ఈవికారము లన్నియు ఇంద్రియములకు మోహము కలిగించునవే. సుఖము గానీ, దుఃఖము గానీ, అట్లే తక్కినవియు. దుఃఖము, నిద్ర, విషవిసర్పము - ఇవి చెడ్డవి, సుఖము, ప్రబోధము, మదము - ఇవి మంచివి. వీనిజంటలు చెప్పఁబడినవి. నిద్ర యేకాంతముగా చెడ్డది కాదు. ఐనను అప్రబోధముప్రక్కన చెడ్డదే. ఇందు ఏది ఉత్కటమైనను ఆ మంచిచెడుగులు లెక్కలేక, ఏకవిధముగా ఇంద్రియములకు విమోహము కలుగును. కావుననే ఈ మోహాతిరేకముం దెలుపుటకే వానింగూడ జెప్పుట. 'ప్రబోధ' మందును ఇంద్రియగణము మోహము చెందునా యన్న, ఇది అవట్టి మెలఁకువ గాదు. మఱి 'ప్రకృష్టబోధ' 'నిరంతర పరమధ్యానము' అనుట. చిత్తము అందే లీనమైపోవుట. 'విష విసర్పః - మదః' ఇందువరుసతప్పుట ప్రక్రమ భంగముగా లెక్కసేయ నక్కఱలేదు, ఇంద్రియగణ పరిమోహాది కార్యము ఏక విధమే యగుటవలన.

స్థిరప్రసాదాః యూయం=తిరమైన యనుగ్రహము గలవారు తమరు. ఇతః ఇదానీం కిం అపరం = ఇంతకన్నను ఇపుడు ఇంకేమి యున్నది? నాయందు ఏమి యెక్కువ యున్నది? అట్లు తోఁచుటెల్ల నాపై తమ యనుగ్రహము వీడకుండుటే. యూయం=మీరు - ఈ బహువచనము సాధారణముగా వాల్మీకి కాళిదాసాదులలో వాడుక లేనిదే. ఐనను సంభావనలో ఇటీవలి యాచారమని గ్రహింపఁదగును. నాయందు ఏమి గుణము ఇత్యాది అనుట సాధ్వీలక్షణము. సీత కృతజ్ఞతాది ఉత్తమ శీలమును సూచించును.

శ్లో. ౭౫. సరోరుహాక్షి, ఏతాని తే సువచనాని = ఈ నీ మంచిమాటలు, 'స్థిరప్రసాదాః' మొదలైనవి - మ్లానస్య జీవ కుసుమస్య వికాసనాని = దూనమై వాడిన పువ్వుంబోలె నున్న, నాయాత్మకు, అప్యాయనము కలిగించి, వికసిల్ల (ఊఱడిల్లఁ) జేయునవి, సంతర్పణాని = తృప్తి కలిగించునవి, సకలేన్ద్రియ మోహనాని=అన్ని యింద్రియములకు సౌఖ్య కలిగించునవి, కర్ణామృతాని= చెవులకు అమృతమువలె ఆమెత యైనవి, మనసః=చిత్తమునకు, రసాయనాని చ = రసా

ఏతాని తే సువచనాని సరోరుహాక్షి,

కర్ణామృతాని మనసశ్చ రసాయనాని. ౨౯

సీత—పిఅంవద, సఇస్సమ్. (ప్రియంవద శయిష్యే.)

[ఇతి శయనాయ సమన్తతో నిరూపయతి.]

రామః—అయి, కి మన్వేష్టవ్యమ్?

శ్లో॥ ఆవివాహసమయా ద్గృహే వనే

శైశవే తదను యౌవనే పునః,

---

యన మను మందుంబోలె సకలబాధలు తొలగించి బలమును సంతోషమును కూర్చునవి!

ఓ పద్మనయనా, నీవుపలుకు మంచిమాటలు వినఁగా దూనమైన నాయాత్మ ఆప్యాయితమై వికసిల్లుచున్నది; ఎంతో తృప్తి కలుగుచున్నది, సకలేంద్రియములకు (ఆనందముచే) మైకము కలుగుచున్నది, చెవులకు ఆమెతగా నున్నది. హృదయమునకు తియ్యనై అన్నిచింతలుమానఁగా శ్రోత్రబలము కలుగుచున్నది.

రామునికి ఇప్పుడే మనసునకు సీతావియోగము కలిగినట్లు తోఁచి దుఃఖము కలిగెనుగదా. అంతట ఈసీతబాహువుతో కంఠాలింగనము. ఈసీత తియ్యని మాటలు వినుట కలుఁగఁగా చిత్తమునకు అన్ని బాధలు తీఱి ఎంతో యూఱట కలుగుచున్నది. అంతియకాక ఇట్లు పలుకు టెల్ల రాముని కాంతానువృత్తి చాతుర్యము నగును, సీతను మెచ్చుకొనుచు ఉత్సాహము పెంచుట, సంతోషము కలిగించుట. ఆమె స్థిరప్రసాదము అన్నందులకు ఇది మెచ్చుకోలు. రసాయన మనఁగా—

'దీర్ఘమాయుః స్మృతి ర్మేధా మారోగ్యం తరుణం వయః
ప్రభా వర్ణ స్వరౌదార్యం దేహేన్ద్రియ బలోదయమ్
వాక్సిద్ధిం వృషతాం కాన్తి మవాప్నోతి రసాయనాత్.' వాహట.

ప్రియంవద—ఇది రామవాక్యమును సీత అభినందించుట.

శయనాయ నిరూపయతి—శయనించుటకు కలయం బరికించును. తలాఁపి ఏమగునా అని కాఁబోలు.

అయి—అని కోమలామంత్రణము—ప్రేయసీ అనుట. కిం అన్వేష్టవ్యమ్—ఏమి వెదకవలసియున్నది? అనఁగా ఏమి వెదకెదవు? అనుట.

శ్లో. ౩౦. ఆ వివాహసమయాత్ = పెండ్లిసమయమునుండియు, గృహే = ఇంటియందును, వనే=వనమందును—ఊరిలో ఉన్నప్పుడేమి, అడవిలో ఉన్నప్పుడేమి అనుట. శైశవే=బాల్యమందును, తదను=తరువాత, పునః = మరల—అనఁగా

స్వాపహేతు రనుపాశ్రితోఽన్యయా
రామబాహు రుపధాన మేష తే. 30

సీతా—(నిద్రాం నాటయన్తీ.) అత్థి ఏదమ్, అజ్జఉత్త, అత్థి ఏదమ్. (అస్త్యేతత్, ఆర్యపుత్ర, అస్త్యేతత్.)

(ఇతి స్వపితి)

రామః—కథం! ప్రియవచనా వక్షసి ప్రసుప్తైవ! (నిర్వర్ణ్య సస్నేహం)

శ్లో। ఇయం గేహే లక్ష్మీ, రియమమృతవర్తి ర్నయనయో,
రసా వస్యాః స్పర్శో వపుషి బహుళ శ్చన్దనరసః.

---

ఆశ్లేషే అనుట - యౌవనే = జవ్వనమునందును, స్వాపహేతుః = నిద్రకు కారణము, నిద్రను కలిగించునది, అన్యయా = మఱియొకతెచేతను, అనుపాశ్రితః = ఆశ్రయింపఁబడనిది, ఏషః=ఇదిగో ఇది, రామబాహుః - రాముని భుజము, తే=నీకు, ఉపధానమ్-తలాఁపి.

పెండ్లిసమయము ఆరంభము. అది మొదలుకొని, నీవు ఎంతున్నను, ఎట్లున్నను, నీకు తప్పని తలాఁపి, ఇదిగో, నాబాహువు, నీకు ఎప్పుడును నిద్రకు కారణమైనది, మఱి యెవరిచేతను ఆశ్రయింపఁబడనిది.

శైశవే అనఁగా అసలు శిశువుగా ఉన్నప్పుడు అనికాదు, ఆ పెండ్లియైన వయఃసంధికాలమే గ్రహింపఁదగును. యౌవనే - యౌవనమందును, ఇపుడును, మున్న నిన్న నేఁడునుంగూడ. అనుపాశ్రితః అన్యయా - రాముఁడు ఏకపత్నీవ్రతస్థుఁడు గావున. ఏషః ఇదిగో - అని చూపుచుం బలుకుట.

'నాటయన్తీ' - ఇది ఆ వేసమున నున్న మానినికి అభినయోపదేశము.

కథమ్ - ఏమి! ఆశ్చర్యముం దెలుపును. ఇంతలో నిద్రపోయినదే అనుట. సుప్తైవ - ఏవ 'ఇంతలోనే' అని సూచించును. ఇది గర్భిణిలక్షణము. ఎక్కువ నిద్ర కావలయును; నిద్ర క్షణములో వచ్చును. 'అన్యద్ వ్రీడాకరం చ యత్' అని రంగాన ఆలింగనాదులకు సాహిత్యదర్పణమున నిషేధము గలదు. కావున ఇట్లు రామబాహువున, ఉరమున నిద్రించుట రంగాన సభ్యమా? ఒంటిపాటున ఆపాటి వ్రీడాకరము కాదేమో! నిర్వర్ణ్య = పరికించి, సస్నేహం = స్నేహముతో. ఇవియు రామపాత్రమునకు అభినయోపదేశములు.

శ్లో. 31. ఇయం=ఈ (కల్యాణి,) గేహే=ఇంటియందు, లక్ష్మీః=లక్ష్మి-నా గృహలక్ష్మి అనుట. ఇంట నాసకలసంపదలు ఈమెయే, నాయింటి యెల్లసింగార

అయం కణ్ఠే బాహుః శిశిరమసృణో మౌక్తికసరః;
కి మస్యా న ప్రేయో యది పర మసహ్యస్తు విరహః. ౩౧

ప్రతిహారీ—(ప్రవిశ్య) దేవ్వ ఉవట్ఠిదో. [దేవ, ఉపస్థితః.]

రామః—అయే! కః?

---

మను ఈమెయే - అనుట. ఇయం=ఈ (కల్యాణి,) నయనయోః = కన్నులకు, అమృతవర్తిః = అమృతంపు వత్తి - అమృతంపుసలాక - కనులకు అంతటి చల్లని యానందమును కలుగఁజేయునది. అమృతపు సలాకను కనులకు చలువకై, ఆప్యాయనమునకై, అంటించుకొందురు. అసౌ=ఇదిగో ఇది, అస్యాః స్పర్శః = ఈమె మేని తాఁకుడు, వపుషి=దేహమునందు అలందిన, బహులః చన్దనరసః=చిక్కని గంధపు రసము - ఉరమునం బర్వ్వించియున్నది గావున ఇదిగో అనుభూయమానమగు చున్నది. అయం = ఇదిగో ఇది, కణ్ఠే బాహుః = (నా) కంఠమునందలి, భుజము, శిశిర మసృణః=చల్లగాను తళతళన నున్నగాను ఉన్నట్టి, మౌక్తికసరః=ముత్తెంపుఁ బేరు. అస్యాః కిం=ఈ (కల్యాణిది) ఏది, న ప్రేయః = మిక్కిలి ప్రియము గాదు? విరహః తు యది = విరహము కలిగనేని, పరం అసహ్యః = మిక్కిలి యోర్వరాని దగును

ఈకల్యాణి నాగృహలక్ష్మి; నాకన్నుల యమృతశలాక; ఈ కల్యాణి యీ తాఁకుడు నామేనికి దట్టంపు గంధంపుఁబూత, నా మెడలోని యీ కల్యాణి యీబాహువు చల్లఁగా నున్నగా తళతళన యున్నట్టిది, అట్టిదేయైన ముత్తెంపు బేరు. ఈకల్యాణిది ఏదియు నాకు ప్రియము - విరహమన్ననో మిక్కిలియు ఓర్వరాని దగును.

అయం కణ్ఠే బాహుః - శిశిర మసృణః - ఈ విశేషణము బాహువునకుం దగి నదే, మౌక్తిక సరమునకును. ఇపుడే దీనిని 'చంద్రమణిహారవిభ్రమము' అన్నాఁడు.

ఈరామవాక్యము 'విరహః' అని ముగిసినది. దానికి తగులుకొనునట్లుగా అవ్యవహితముగా వచ్చి పలికిన ప్రతీహారివాక్యారంభాంగము 'దేవ ఉపస్థితః' - 'విరహః ఉపస్థితః' అని యన్వయమై, ఉపశ్రుతిగా రామునికి చిత్తమున 'కళుక్కు' మనును. దానికి ఉండఁదగిన సూచన రామభాషితమున ఏపాఠమునను గానరాదు. ఒకవేళ 'అయి కః' అనునది 'అయే! కః' అని యుండఁదగునా? అట్లే యుండునని తోఁచెడి. అయే - ఇట ఖేద సూచకమగు నవ్యయముగాఁ గొనఁదగును. అయే-'అ!' అన్నట్లు. దానివాక్యమేమో 'దేవ ఉపస్థితః ఆసన్న పరిచారకో దుర్ముఖః' అని. అఁపె 'ఉపస్థితః' అని ఆఁగలేదు, ఆఁగ నక్కఱలేదు. మఱి ఇట్లు అమంగళము

ప్రతిహారీ—ఆసణ్ణపరిఆరఓ దేవ్వస్స దుమ్ముహో. [ఆసన్న పరిచారకో దేవస్య దుర్ముఖః]

రామః—(స్వగతం) శుద్ధాన్తచారీ దుర్ముఖః! స మయా పౌరజానపదేష్వపసర్పితుం ప్రయుక్తః. (ప్రకాశమ్) ఆగచ్ఛతు.

(ప్రతీహారీ నిష్క్రాన్తా.)

దుర్ముఖః—(ప్రవిశ్య స్వగతమ్.) హా కహం సీదాదేవిం అందరేణ ఏరిసం అచింతణిజ్జం జణాపవాదం దేవ్వస్స కహాఇస్సం? అహవా నిఓఓ ఖు ఏరిసో మందభాఅస్స. [కథ మిదానీం సీతాదేవీ మన్తరే

---

తోఁచినందున రాముఁడు అంతలోనే 'అయే' అని అడ్డపడి, ఇంచుక కలవరముం బడి 'అయే కః' అన్నాఁడు. ప్రతీహారి దాన ఆఁగి వాక్యముం బూరించినది; అది రామునికి జవాబును ఐనది.

ఉపస్థితః - పుల్లింగము; 'కః'కు విశేషణము. తెలుఁగున దానికి రెండర్థములును ఉండఁదగును. 'ఏమి?' 'ఎవరు?' అని.

ఈ ముద్రారాక్షసోద్ధారమును దీనిని పోలినదానిని కనఁదగును - IV.

రాక్షసః - అపినామ చాణక్యవటుః

దౌవారికః - జయతి!

రాక్షసః - అతిసన్ధాతుం శక్యః స్యాత్?

దౌవారికః - అమాత్యః.

'అపినామ' మొదలు - 'స్యాత్' వఱకు ఒకటే వాక్యము, రాక్షసుని తలపోఁత. మఱి యందు చాణక్యవటుః అను నవయవమునకు దౌవారికుని 'జయతి'యు, 'అమాత్యః' అనుదానికి 'అతిసన్ధాతుం శక్యః స్యాత్' అనియు తగులుకొని వక్తకు రాక్షసునికి అనిష్టసూచన చేసెను. 'ఇతి వాగీశ్వరీ...ప్రతిపాదయతి' అని యతఁడు అనుకొనియు తన పట్టు వదలఁడాయెను.

ఈ 'ఉపస్థితః' ఇత్యాదిని దశరూపకకారుఁడు గండమనియు, సాహిత్యదర్పణకారుఁడు పతాకస్థానమనియు నిర్దేశించినారు. ఇట్టి వాగీశ్వరీప్రస్తావములు నాటకముల నటనటఁ గనఁదగును.

ఆసన్నపరిచారకః - ఎప్పుడును కూడ నుండి చెప్పినపనులు చేయుచుండు నౌకరు.

దుర్ముఖః - చెడ్డనోటివాఁడు, చెడ్డమాటలు పలుకువాఁ డనియు అర్థము. వాఁడు అట్టివాఁడే స్వభావముచే అగుచేని వానిని నౌకరుగా ఉంచుకొనియుండరు. చెడ్డ మొగముగలవాఁడు - ఎట్టిదో మొగాన రూపహాని కలవాఁడు. ఉత్తర

నేదృశ మచిన్తనీయం జనాపవాదం దేవస్య కథయిష్యే; అథవా నియోగః ఖల్వీదృశో మన్దభాగ్యస్య ]

సీతా—అజ్జఉత్త కహిఁసి, కహింసి. (ఆర్యపుత్ర, క్వాసి! క్వాసి!)

రామః—అయే సైవ రణరణకదాయినీ చిత్రదర్శనా ద్విరహభావనా దేవ్యాః స్వప్నోద్వేగం కరోతి. (అఙ్గమస్యాః పరామృశన్.)

శ్లో ၊ అద్వైతం సుఖదుఃఖయో, రనుగతం సర్వా స్వవస్థాసు యః,
ద్విశ్రామో హృదయస్య యత్ర, జరసా యస్మి న్నహార్యో రసః,

---

కాండమునను రఘువంశమునను 'భద్రుఁ'డని ఈచరుని పేరు. అపసర్పితుం = వేగు ఉండుటకు. వేగుగా మాఱువేసములనుం బోయి పౌరులు జానపదులు ఏమను కొనుచున్నారో, ఏమి చేయుచున్నారో కనిపట్టుటకు.

అచిన్తనీయమ్ = తలంపరానిది. నియోగః = చేయవలసినపని, నౌకరి. మన్ద భాగ్యస్య=అదృష్టహీనునికి, నిర్భాగ్యునికి. 'అచిన్తనీయం జనాపవాదం' ఆ యపవాదమును స్ఫుటముగా ఈగ్రంథమున నెచటనుం జెప్పలేదు. ఇట నిదియు స్వగతమే.

ఉత్స్వప్నాయతే - కలలో పలవరించును.

రణరణకదాయినీ - కంపము కలిగించునది. స్వప్నోద్వేగం - కలలో భయము. పరామృశన్ - ఆప్యాయముగా నిమురుచు.

శ్లో. 3౨. యత్ = ఏది=ఏసమానుషము (=దాంపత్యము,) సుఖదుఃఖయోః= సుఖమునందును, దుఃఖమునందును, అద్వైతమ్ = ఒక్కటిగానే ఉండునో,-ఒకరి సుఖమే మఱొకరి సుఖము; ఒకరి దుఃఖమే, మఱొకరి దుఃఖము. యత్ =ఏ (దాంపత్యము,) సర్వాసు అవస్థాసు = అన్ని యవస్థలయందును - సంపదలందును ఆపదలందును; ఉత్సవసమయములందును అరణ్యవాసమునందును - అన్నింటను, అనుగతమ్=అనుగమించియే, కూడవచ్చుచునే, యుండునో; యత్ర=ఎందు (ఏదాంపత్యమునందు,) హృదయస్య - (ఒండొరుల) చిత్తమునకు, విశ్రామః = ఊఱటయో, యస్మిన్=ఎందు (ఏదాంపత్యమందు,) జరసా = ముదిమిచేత, రసః=రక్తి, ప్రీతి, అహార్యః = హరించుటకు వీలుగాదో, యత్ = ఏ (దాంపత్యము,) కాలేన = కాల

కాలే నావరణాత్యయా త్పరిణతే య త్స్నేహసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమ ప్యేకం హి త త్ప్రార్థ్యతే.

దుర్ముఖః—(ఉపసృత్య) జఅది జఅది దేవో. (జయతి జయతి దేవః!)

రామః—బ్రూహి య దుపలబ్ధం.

దుర్ముఖః—ఉవత్థువంది దేవ్వం పోరజాణపదా, జహా, విసుమరిదా అహ్మే మహారాఅ దసరహస్స రామ భద్దేణ త్తి. [ఉపస్తు

---

ముచే - అది సాగుటచే, ఆవరణాత్యయాత్ = ఆవరణము - కప్పు, క్రొత్తదనమువలని, అత్తమామలవలనియు, భయము లజ్జ మొదలైనది - తొలఁగుటవలన, పరిణతే = పండిన, స్నేహసారే = ప్రేమ స్థిరాంశమున, స్థితం = నెలకొనియుండునో, తస్య సుమానుషస్య = ఆ దాంపత్యముయొక్క, ఏకం తత్ భద్రం = ముఖ్యమగు నా భద్రము - మంచి - క్షేమము, కథ మపి = ఎట్లేనియు, ప్రార్థ్యతే = కోరఁబడుచుండును.

దాంపత్యమంగళమునకై, ఎట్లేనియు, ఎల్లవారును ఆశింతురు. అందు సుఖ దుఃఖానుభవమున ఒకరికి ఒకరు తోడగుటమాత్రము గాదు, ఈడుగా, ఒక్కటి గానే యుందురు. ఏయవస్థయందును, వారు ఒండొరుల వీడక కలసియేయుందురు. చిత్తమునకు అందే యూఁటట - ఒకరొకరితో తలపోసికొని, ఏ కష్టము వచ్చినను సుఖము గలిగినను, ఊఁడిల్లుదురు. ముదిమి పైకొనుటచే, ఇరువుర కెవరికిని ప్రీతి డింపదు; కాలము సాఁగ సాఁగ, అన్ని యావరణములు తొలఁగి, వారి ప్రేమ పండి స్థిరాంశమగును.

జరసా యస్మిన్ అహార్యో రసః - ధనాదికముచే ఉత్పన్నమైన వేశ్యాజన ప్రీతియు, యౌవనసుభగతచే ఉత్పన్నమైన పరకీయాప్రీతియు జరచే అపహృత మగును. దంపతుల ప్రీతియన్ననో నిర్వ్యాజము. ఆవరణము - కప్పు - తెర - అత్త మామలవలని భయాది, తమకును క్రొత్తదనమువలన లజ్జాది - ఇవి కాలము సాగు కొలఁది తుదముట్ట పోవును. ప్రేమసారము తేలును.

ఈ యద్వైతభావనచే ఇప్పుడే దాంపత్యము అపవర్గతుల్య మైనది. ఆ దాంపత్య భావానుభవమునకే ఇంతలో భంగము వచ్చుచున్నదనుట. ఈ సందర్భ ముల ఒకుదొడుకు, సంఘట్టన పరికింపఁదగును. కవికార్పు!

జయతి దేవః = ఇది నౌకరు దొరను దర్శించినపుడు ఆచారోక్తి. ఇందు రామునికి తేఁపవగొల్పు ఉపశ్రుతి కలదా?

య దుపలబ్ధమ్ = ఏది ఎఱుంగఁబడినదో, ఏమేమి తెలిసికొనివచ్చితివో.

వన్తిదేవం పౌరజానపదాః, విస్మారితా వయం మహారాజ దశరథస్య రామభద్రేణేతి.]

రామః—అర్థవాద ఏషః. దోషం తు మే కఞ్చిత్కథయ, యేన ప్రతివిధీయతే.

దుర్ముఖః—(సాస్రం) సుణాదు దేవో. (శృణోతు దేవః.) (కర్ణే ఏవ మేవమ్)

రామః—అహహ తీవ్రసంవేగో వాగ్వజ్రః! (ఇతి మూర్ఛతి)

దుర్ముఖః—సమాససిదు దేవో. (సమాశ్వసితు దేవః)

రామః—(సమాశ్వస్య)

---

విస్మారితాః - మఱపింపఁబడితిమి. మఱచునట్లు చేయఁబడితిమి. దశరథుని సాటి రాముఁడు, మించినవాఁడును అనుట. మహారాజదశరథస్య = దశరథమహారాజును - షష్ఠికి ద్వితీయ అర్థము. 'స్మృ' ధాతుపుకర్మ షష్ఠియందును ఉండును.

అర్థవాదః - స్తుతి, వట్టి పొగడ్త - అబద్ధము కాఁదగును; దశరథనాయనను మించుట అసాధ్యము. కాదా అట్టిది వట్టి యాశంసయు కాఁదగును - మఱపించువాఁడగును గాక అని. వేదమున 'విధులు'=తపస్సు చేయుము మొదలైనవి - చెప్పి, అవి చిత్తమునకెక్క అనుష్ఠితము లగుటకు - దానిచే అట్టి లాభము కలిగినది, ఇట్టి కీడు తొలఁగినది అని దృష్టాంతములం బోని కథలు, వట్టి అబద్ధములే చెప్పఁబడియుండును. అట్టివానికి 'అర్థవాదములు' అని పేరు. అట్టి వట్టి జనస్తుతులు నాకెందులకు చెప్పుట? దోషము లేమేని జనులు అనుకొనునవియున్నఁ జెప్పుము. దానిని దిద్దుటకుఁ దగిన ప్రయత్నము చేయుదును అన్నమాట. రాముని యీ యుత్తమశీలము పరికింపఁదగును.

కర్ణే ఏవం ఏవం - చెవిలో ఇట్లు ఇట్లు. ఈనాటకమునం దెక్కడను ఆ యపవాదము ఏమగునో, మహాకవి మెలఁకువతో ఎవ్వరిం జెప్పనీక వారించినాఁడు, జగన్మాతవిషయమున. ఊహామాత్రమే అందించినాఁడు - ఎట్టిదో ఒకయట్టిది అని. ఎట వచ్చినను స్వగతమో చెవిలో చెప్పుటయో. అట్లు ఔచితి పోషించినాఁడు.

వాగ్వజ్రః=వాక్కె వజ్రము - పిడుగుమాట - మాటపిడుగు - అదే అపవాదము. మానము పోవుటకంటె ప్రాణముపోవుట మేలు - అనుట.

శ్లో॥ హాహా! ధి! క్పరగృహవాసదూషణం య
ద్వైదేహ్యాః ప్రశమిత మద్భుతై రుపాయైః,
ఏతత్తత్పున రపి దైవదుర్విపాకా
దాలర్కం విషమివ సర్వతః ప్రసృప్తమ్! 33

తత్కి మత్ర మన్దభాగ్యః కరోమి? (విమృశ్య సకరుణం) అథవా కి మన్యత్ ?

---

శ్లో. 33. హాహా - అక్కటా, ధిక్ - ఛీఛీ, వైదేహ్యాః=సీతయొక్క, యత్ = ఏ, పరగృహవాస దూషణం=ఒరుని యింట నుండినదన్న నింద, అద్భుతైః=ఆశ్చర్యకరములైన, ఉపాయైః = ఉపాయములచేత, ప్రశమితమ్ = అడంపఁబడెనో, తత్ ఏతత్ =అదే ఇది - ఇదిగో ఇపుడు అన్నమాట, దైవ దుర్విపాకాత్ = విధియొక్క దుష్టఫలమువలన, ఆలర్కం విషం ఇవ=పిచ్చికుక్కదైన విషమువలె, సర్వతః ప్రసృప్తమ్=అంతటను వ్యాపించినది!

పిచ్చికుక్కవిషము, కాటుపడఁగానే తాత్కాలిక చికిత్సచే మానినట్లగును. మఱి కాలాంతరమున, ముఖ్యముగా వానకారు రాఁగానే, మరల ఆవిష వేగము తొడంగి, దేహమంతయు వ్యాపించి, చావునుం దెచ్చును. అట్లే సీతకు రావణునింటి వాసపు దోషము, అపుడు అద్భుతోపాయములచే అణంపఁబడినది. అదే, ఇపుడు మరల, దౌర్భాగ్యఫలముగా ప్రజలలో నెల్ల వ్యాపించినదే, అక్కటా!

అద్భుతైః ఉపాయైః - అగ్నిశుద్ధి, సాక్షాత్తుగా దేవతలు వచ్చి ఆమె పాతివ్రత్యముంగూర్చి ప్రబల సాక్ష్యము చెప్పుట - మొదలైనవి. వానికన్నను ప్రమాణీకరింపఁదగినవి మఱి లేవు. దైవ దుర్విపాకాత్ - దైవము పాడు ఫలము లిడుట వలన - అద్భుతమైన యుపమ - మిక్కిలి తగినది - 'ఆలర్కం విషమివ' ఇత్యాది.

విమృశ్య - విమర్శించుకొని - ఇది రామపాత్రమునకు అభినయోపదేశము. ఆక్షణముననే విమర్శించుకొని ఇతికర్తవ్యమును నిశ్చయించుకొన్నాఁడు రాముఁడు - సీతకు వివాసము విధించి అడవిం ద్రోయింపవలసినదని. ఇదెల్ల 'సకరుణము'గానే, మనకు ఆయనయందు జాలి కలుగఁదగినట్లే చేయును. కాదా 'దుఃఖముతో కూడుకొన్నట్లుగా' - అనఁగా అప్పుడే మనసున వివాసననిశ్చయము చేసికొన్నాఁడు అనుట.

అథవా కి మన్యత్ - చిత్తమున విమర్శ జరిగినది. దానిపైన అనుచున్నాఁడు కాక మఱేమి? అని.

శ్లో॥ సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్,
తత్పూరితం హి తాతేన మాం చ ప్రాణాంశ్చ ముఞ్చతా. ౩౮

సమ్ప్రత్యేవ భగవతా వసిష్ఠేన సన్దిష్టమ్. అపి చ,

శ్లో॥ యత్సావిత్రైర్దీపితం భూమిపాలై
ర్లోకశ్రేష్ఠైస్సాధు శుద్ధం చరిత్రమ్,

---

శ్లో. ౩౮. సతాం=సాధువులకు, కేన అపి కార్యేణ = ఏపనిచేసైనను, లోకస్య ఆరాధనం=లోకమును - జనులను - సంతోష పెట్టుటయే - పూజించుటయే, వ్రతమ్=మానరాని యాచారము. తత్ హి = అదియేకదా, మాం చ = నన్నును, ప్రాణాన్ చ=ప్రాణమును, ముఞ్చతా=విడిచిపెట్టుచున్నవాఁడైన, తాతేన=మా నాయన (దశరథుని) చేత, పూరితమ్= నెఱపఁబడెను.

కైకేయికి ఇచ్చినవరముం బాలింపకున్న లోకాన ఆఁడుదానికి ఆపదలో మాట ఇచ్చి, పిదప సమయమున తప్పినాఁడు అని గొప్ప లోకనింద కలుగును. దానిని మాన్ప లోకమును ఆరాధించువాఁడై నన్ను విడిచెను. అనఁగా వనవాసమునకుఁ బంపెను. అంతట నావియోగమును ఓర్వలేక అసువులంబాపెను. రెండును లోకారాధన వ్రతానుష్ఠాన ఫలములు. నాకన్నను, తన ప్రాణములకన్ననుం గూడ లోకారాధనమే ప్రియమాయెను. అది నాకు ఒరవడియగును అనుట. తన్ను నాయన మున్ను సత్యమునకై - లోకము నారాధించుటకై - అడవికి పంపెనే దానిని తా నిపుడు మెచ్చుకొనుచున్నాఁడు. తాను ఇపుడు అనుష్ఠింప నిశ్చయించుకొన్నాఁడు.

అంతియకాదు - ఇప్పుడే వసిష్ఠులవారు సందేశించినారు - 'యుక్తః ప్రజానామనురఞ్జనే స్యాః, తస్మాద్యశో యత్ పరమం ధనం వః' - అని.

మఱియు ఇదియు నొకటి - ఏదనఁగా.

శ్లో. ౩౯. యత్ - ఏ, సాధు, శుద్ధం, చరిత్రమ్=ఉత్తమమైనదియు, ఏదోషములును లేక పరిశుద్ధము (పవిత్రము) ఐనదియు, అగు చరిత్రము - కథ, సావిత్రైః=సూర్యవంశజులును, (కావునే,) లోకశ్రేష్ఠైః = లోకమునకు అగ్ర్యులైనవారును అగు, భూమి పాలైః=(మనువుందొట్టిన) రాజులచేత, దీపితమ్=వెలిగింపఁబడినదో -

మత్సమ్భవాత్కలుషితం కిమివాస్తి

స్యాచ్చేదస్మిన్ హన్త! ధిఙ్మామధన్యమ్! 3 ॥

హా దేవి, దేవయజనసమ్భవే! హా స్వజన్మానుగ్రహపవిత్రిత వసున్ధరే!

హా నిమిజనకవంశనన్దిని! హా పావకవసిష్ఠారున్ధతీ ప్రశంసిత శీలశాలిని!

హా రామమయజీవితే! హా మహారణ్యావాసప్రియసఖి!

---

విరాజిల్లంజేయఁబడినకో, అస్మిన్=అందు, మత్సమ్భవాత్ = నాసంబంధమువలన - నేను అందు పుట్టి, ఇట్టిట్టి నడువడియు సంగతులును కలవాఁడ నగుటవలన, కళ్మలా=మలినమైన - అపకీర్తికరమైన - పాడు, కిం వద న్తీ=నింద - ఆడిక, స్యాత్ చేత్ = కలుగునేని, హా న్త=అయ్యో, మాం అధన్యం ధిక్=ఛీఛీ నేను ఎంత అధన్యుఁడను!

సూర్యవంశపురాజులు, మనువు, ఇక్ష్వాకువు, రఘువు మొదలగు ఎల్లరును లోకమున అన్నివిధాల తొలిమెట్టునకు చెందినవారు. ఆ వంశచరిత్రమును ఈ నిమిషమువఱకు సాధువుగాను శుద్ధముగాను వెలుంగఁజేసినారు. అందు నావలన నేనును సావిత్రుఁడ నగుటవలన ఇన్నాళ్ళకు ఒక మలినమైన నింద సోఁకిన, అయ్యో, ఛీఛీ, నేనెందుకు బ్రదికియుండుట! కావున కానిపుడు పరార్థముగా లోకార్థముగా నడుచుకొనవలయును.

సావిత్రు లనుటయు, లోకశ్రేష్ఠు లనుటయు మెచ్చుకోలు పరాకాష్ఠ. చూ - రఘు - XIV - 37 -

"రాజర్షి వంశస్య రవిప్రసూతే రుపస్థితః పశ్యత కీదృశో௨యం
మత్తః సదాచారశుచేః కలఙ్కః పయోదవాతా దివ దర్పణస్య."

'దేవి' - రాముఁడు సీతను 'దేవి' అనియే సంబోధించును, నిర్దేశించును. అది తనకు ఆమెయందుఁగల మిక్కిలి గౌరవమునకు సూచకము. దేవయజనసమ్భవే - ఇత్యాది ఈ హాపోయిన క్రమమున సీతయొక్క గొప్పతనము సర్వమును, నిశ్శేషముగా చెప్పఁబడినది. అట్లే తన ప్రీతి యను రాగములకు ఏకభూమి యనుటయు. వానికి మించి యింక మాటలులేవు. శీలమునకు పావకునికన్నను వసిష్ఠునికన్నను అరుంధతికన్నను ప్రశంస పలుకగలవారు కలరా? వారి యెల్లర ప్రశంసయు పొందినట్టిది, సీత. ఇదెల్ల రాముఁడు చక్కఁగాఎఱుంగును; నమ్మును, ఈనిముసమునను.

'అవైమి చైనాం అన ఘేతి కింతు। లోకాపవాదో బలవాన్మతో మే' -
రఘు - XIV - ४०.

రామమయజీవితే - 'స్నేహ స్తస్యాః స తాదృశః' - అని యనును గదా రాముఁడే - II - లో. కథం=ఏమి! ఏమి యిది! అని అబ్బురపడుట. ప్రశ్న కాదు.

హా ప్రియస్తోకవాదిని! కథ! మేవంవిధాయా స్త వాయ మీాదృశః పరిణామః!

శ్లో॥ త్వయా జగన్తి పుణ్యాని
త్వ య్యపుణ్యా జనోక్తయః,
నాథవన్త స్త్వయా లోకా
స్త్వ మనాథా విపత్స్యసే. ౩౬

---

ఏవంవిధాయాః తవ=ఇట్టిదానవైన నీకు, అయం ఈదృశః పరిణామః=ఇదిగో ఇది యిట్టిది పరిణామము! మార్పు_కడపటికి గతి. కడపటికి ఇట్టి (అడవిపాలగు) గతి పట్టినదే!_అనుట. ఇందలి సీతావిశేషణములచే ఆమె కళత్ర సకలసద్గుణశాలిని,_ అని సూచింపఁబడినది. రాముని యాపరాని దుఃఖమునకు ఇది యొక తెలుఁగు పొంగు.

'కథం_పరిణామః' ఎట్లు కలిగినది ఈపరిణామము అని ఒక ప్రశ్న చేయుట_ ప్రకరణమును నాటకములో సంభావణ తెలుగును అరయలేమి, అజ్ఞానవిలసిత మగును. 'పరిణామః' అనుటచే రాముఁడు అప్పుడే తన మనసున సీతావినాసమును నిశ్చయించెనని తెలియుచున్నది. నాయన నాఁడు తన్ను ప్రాణములను వదలెను, తాను నేఁడు సీతను వదలును!

శ్లో. ౩౬. త్వయా=నీచేత, జగన్తి=లోకములు, పుణ్యాని = పావనములు. త్వయి=నీయెడ, జనోక్తయః=లోకులమాటలు, అపుణ్యాః = పావనములు కాక యున్నవి. త్వయా=నీచేత, లోకాః=ఎల్లలోకములు, నాథవన్తః=దిక్కు (రక్షణ) గలయవి, త్వం=నీవు, అనాథా=రక్షకుఁడు (=దిక్కు) లేనిదానవై, విపత్స్యసే= ఆపదఁ జెందుచున్నావు!

పైన వాపోయినదానినే భంగ్యంతరమున ఇందు చెప్పుచున్నాఁడు. నీవు ఇందున్న కారణమున ఈలోకములెల్ల పవిత్రమైనవి. మఱి నీయెడ ఆలోకుల మాటలు మలినముగా నున్నవి. నీవలననే లోకమునకు ఒక రక్షకుఁ డున్నాఁ డనుట. మఱి నీకే రక్షకుఁడు లేక నీవు ఆపదం బొందనున్నావు?

చూ_రఘు_XIV_64.

"నిశాచరోపప్లుత భర్తృకాణాం
తపస్వినీనాం భవతః ప్రసాదాత్
భూత్వా శరణ్యా శరణార్థ మన్యం
కథం ప్రపత్స్యే త్వయి దీప్యమానే."

ఇట్లు విరోధము తోఁపఁ బలికినాఁడు. అందు అయన యున్నాఁడు గనుక అది పుణ్యక్షేత్రము, ఇందు ఈయన యున్నాఁడు గనుక ఇది పుణ్యక్షేత్రము,

దుర్ముఖ, బ్రూహి లక్ష్మణం;-ఏష తే నూతనో రాజా రామ
స్సమాజ్ఞాపయతి. (కర్ణే ఏవ మివ)

దుర్ముఖః—కహం దాణిం అగ్గిపరిసుద్ధాఏ గబ్భట్ఠిద పవిత్త
రహుఉలసంతాణాఏ దేవీఏ దుజ్జణవఅణాదో ఏవ్వం అజ్ఝవసి దం
దేవ్వేణ? [కథ! మిదానీ మగ్నిపరిశుద్ధాయా గర్భస్థిత పవిత్ర రఘుకుల
సన్తానాయాః దేవ్యా దుర్జనవచనా దేవ మధ్యవసితం దేవేన!]

---

అన్నట్లు, నీవు ఇందున్న కారణమున ఈలోకాలు పుణ్యమైనవి. అట్టి నిన్నుఁ
గూర్చి లోకులు మలినపుమాటలు పలుకుచున్నారు. ఆమాటలు ఫలానా అని నోట
చెప్పఁడు, అత్యంతమలినములు అనుచున్నాఁడు. నీవలన లోకము సనాథము.
లోకాలను రక్షించువానవు నీవు. నీ కెవనిమీఁద నేని కరుణ గలిగిన, వానిని
రక్షించి సకలాభ్యుదయములుం గూర్ప నేనున్నాను. 'అనాథా'-అట్టి నీకు నేను
రక్షకుఁడం గాకపోవుచున్నాను. నీవు దిక్కుమాలినదానవయితివే! నీవు ఆపదం
బొందనున్నావే! ఏమి సేయుదును! రాముఁడు సీతావివాసమును మనసులో నిశ్చ
యించుకొనినయైనది. కావున ఇట్లు పలుకుచున్నాఁడు. దానినే సద్యః దుర్ముఖుని
చెవిలో లక్ష్మణునికి సందేశించుచున్నాఁడు.

'నిశ్చిత్య చానన్యనివృత్తి వాచ్యం।
త్యాగేన పత్న్యాః పరిమార్ష్టు మైచ్ఛత్'- రఘు-XIV-35.

ఏష తే నూతనో రాజా రామః సమాజ్ఞాపయతి-మీయన్న చెప్పుచున్నాఁ
డని కాదు, సందేశము. నూతనః=క్రొత్తగా, రాజా = రాజైనవాఁడు, రామః =
ధర్మము తప్పనివాఁడు-ఒక్కొక్కమాటయు తన మాటను లక్ష్మణుఁడు, తిరుగు
లేక అనుష్ఠింపవలయుటకు కారణోపన్యాసగర్భము. క్రొత్తరాజాను త్తనువు, దాఁట
రానిది. కర్ణే-చెవిలోచెప్పుట-రహస్యమును ఔచిత్యమును రక్షించుటకు.

కథం-ఏమి!-ప్రశ్నార్థకము గాదు, ఆశ్చర్యార్థకమే. వాఁడు రాముని
ఎదురుగానే ప్రశ్న తొడంగుపాటియా? మఱి 'ఇదాణిం అగ్నిపరిశుద్ధాయాః-'
ఇత్యాది కాకువుచే ప్రశ్నయే. దానినైనను ఆతఁ డడుగుట ఆసన్నపరిచారకుఁ
డైన చొరవచేత. దుష్యంతుఁడు శకుంతలం గొని తాపసులు తన కడకు వచ్చు
టకు కారణము ఏమగునా అని వేత్రవతితో తలపోసికొనును గదా. ఇట్టి ప్రశ్న
కైన వీని యీ వాగారంభమునకు కారణము సీతమీఁదియు రఘుకులముమీఁదియు
ఇంతంతనరాని యతని ప్రీతిగౌరవములు. వాన, తనంతట ప్రశ్న నెట్టుకొని
వచ్చినది.

రామః—శాన్తమ్‌పాపమ్! కథం దుర్జనాః పౌరజానపదాః? పశ్య,

శ్లో॥ ఇక్ష్వాకువంశోఽభిమతః ప్రజానాం
జాతశ్చ దైవాద్వచనీయబీజం,
యచ్చాద్భుతం కర్మ విశుద్ధికాలే
ప్రత్యేతు కస్తద్వ్యతిదూరవృత్తమ్! 32

తద్గచ్ఛ.

దుర్ముఖః—హా! దేవి! (ఇతి నిష్క్రాన్తః)

రామః—హా! కష్ట! మతిబీభత్సకర్మా నృశంసోఽస్మి సంవృత్తః; యోఽహమ్.

శాన్తమ్-వినఁగూడనిది చెవిం బడినపుడు ఆపాపము శమించును గాక అని చెప్పు వచనమిది, 'అట్లనకు' అన్నట్లు. కథం దుర్జనాః? వారెట్లు దుర్జను లగుదురు, పాపము?

శ్లో. 32. ప్రజానాం = లోకులకు, ఇక్ష్వాకువంశః = ఇక్ష్వాకుకులము, అభిమతమ్=మాననీయమైనది. వచనీయబీజమ్=నిందకు కతంబు, దైవాత్ = (దుర్) విధివలన, జాతమ్=కలిగినది. విశుద్ధికాలే = (అనిందా) విశుద్ధి కావించిన యా కాలమందు, అద్భుతం కర్మయత్=అద్భుతమైన పని ఏది జరిగినదో, అతిదూరవృత్తమ్ = చాల దూరములో, ఎక్కడనో లంకాసముద్రతీరమున, జరిగిన, తత్=దానిని, కః ప్రత్యేతు హి=ఎవఁడు నమ్మునయ్యా?

ఇక్ష్వాకువంశ మన్న ప్రజలకు అదెంత అభిమానము! ఊరక వారేల నింద పలుకుదురు? మఱి అందు నిందకు కారణము దైవగతిచే కలిగినది. విశుద్ధికాలమందు ఏయద్భుతములు జరిగినవో, అంతదూరమున జరిగినవానిని ఇక్కడ ఎవఁడు నమ్మును?

దైవాత్-మా దుర్దైవమువలన సీతాపహరణము, సీతకు రావణునింట వాసము కలిగినది. ఐనను అనిందయంతయు అత్యద్భుతకర్మలచే, అగ్నిశుద్ధి, బ్రహ్మేంద్రాదులగు ఎల్లదేవతల సాక్షాత్ సాక్ష్యము-మొదలగువానిచే నిశ్శేషముగా అప్పుడు తొలగింపఁబడినది. అదెల్ల లంకలో జరిగినది, అంతదూరాన. అయోధ్యప్రజలకదెట్లు ఎఱుక? వారు దానిని ఎట్లు నమ్ముదురు? ఇది జనులు అపవాదము పలుకుటకు రాముని సమాధానము. అది న్యాయ్యమే అనుచున్నాఁడు.

అతిబీభత్సకర్మా=అతిఘోరకర్మా-మిక్కిలియు ఏవ, రోత పుట్టు పని చేయువాఁడను. నృశంసః-క్రూరుఁడను. అట్టి సీతను ఇట్టి గర్భిణిగా నున్న సమయమునను అడవిం ద్రోచి రమ్మని ఉత్తరువు పంపినాఁడను. ఇంతకన్నను బీభత్సము క్రూరము ఉండునా ఎందైనను? మగనిచేఁతకును రాజుచేఁతకును ఇట ధర్మసంఘర్షణ.

శ్లో॥ శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం,
సౌహృదా దపృథగాశయా మిమాం,
ఛద్మనా పరిదదామి మృత్యవే
సౌనికో గృహశకున్తికా మివ. 38

తత్కి మస్పర్శనీయః పాతకీ దేవీం దూషయామి!

[సీతాయాశ్శిరః స్వైర మున్నమయ్య బాహుం కర్షన్,]

శ్లో. 38. శైశవాత్ ప్రభృతి = పిన్నతనమునుండి, పోషితాం = పెంపఁబడినట్టియు, ప్రియాం=మిక్కిలి ప్రీతికి తావలమైనట్టియు, సౌహృదాత్ = హార్దివలన, అపృథగాశయాం = వేఱు తలంపు లేనట్టియు, ఇమాం = ఈసీతను, సౌనికః = (పక్షులం బెంచి చంపి యమ్ముకొను) కసాయివాఁడు, - శైశవాత్ ప్రభృతి పోషితాం - మొదలగు నన్ని విశేషణములతో కూడుకొన్న - గృహశకున్తికాం ఇవ=జాలి గొలుపుచున్న ఇంటి పెంపుడు పక్షినింబోలె, ఛద్మనా = మిషచేత, - భాగీరథీతీర భూములం జూపుటకు అను సాకుచేత, మృత్యవే=మృత్యువునకు, పరిదదామి = చేతులార అర్పించుచున్నాను.

చిన్నప్పటినుండియు పెంచితిని; ఎంతో ప్రీతికి పాత్రమైనది; స్నేహాతిశయమున, నేను తప్ప ఎప్పుడును మఱి వేఱు తలఁపే లేనిది. అట్టి సీతను, ఏదియో సాకున, మృత్యువునకు నేనే నాచేతులార ఒసంగుచున్నాను; కసాయివాఁడు అట్టిదేయైన జాలి గొల్పు పిట్టను చేతులార కోయునట్లు - ఎంత చక్కని ఉపమ!

అపృథగాశయాం - అనుట సాధుపాఠము. మీరుకూడ రావలయును నాతో అని యిపుడును అన్నది. ఎందును ఎప్పుడును నేను తప్ప వేఱు తలంపే లేనిది. ఆపెంపుడు శకుంతికయు పెంచినవానిని నిముసమేని యేమఱక, దేనికిని కూడ పరువెత్తుచునే యుండును. మృత్యవే - మృత్యువునకు - ఈయవస్థలో అడవిపాలు చేయఁబడిన యీమెకు సద్యః చావు నిశ్చితమే గదా - అనునుగదా "క్రవ్యాద్భి రఙ్గలతికా నియతం విలుప్తా' అని - III - అ. 'ఛద్మనా' - వనవీథుల విహారమును గంగాస్నానమును కోరినదే, ఆమిషతో అడవిలో విడిచిరమ్మని దుర్ముఖముఖమున లక్ష్మణునికిం బంపిన యాజ్ఞ దీన గూఢనిర్దిష్టము.

అస్పర్శనీయః=తాఁక కూడని వాఁడను. చండాలునిం బోని మలీమసుఁడను. పాతకీ=పాపము పైకొన్నవాఁడను. దేవీం=పాతివ్రత్యాదిచే దేవతంబోని పవిత్రను, దూషయామి=మైలచేయుదును.

శ్లో। అపూర్వకర్మ చణ్డాల మయి ముగ్ధే విముఞ్చ మాం,
శ్రితాసి చన్దనభ్రాన్త్యా దుర్విపాకం విషద్రుమమ్. ౩౯

---

ఉన్నమయ్య=ఎత్తి. రంగాన ఇంతసేపును ఇట్లు తఃపై పండుకొనఁ బెట్టుకొనుట, తగునా? శయనాధరపానాదుల కూడదన్నదే సాహిత్యదర్పణము - అన్న, అంతగా అనుచితము కాదు. శ్రాంతికైన ఈ శయనమాత్రము అని తలంపఁదగును.

శ్లో. ౩౯. అయి ముగ్ధే=ఓ నేరనిముగుదా, అపూర్వ కర్మ చణ్డాలం=ఇప్పటికి ఎందును ఎన్నఁడును కనని వినని కర్మ చండాలుఁడ నైన, మాం = నన్ను, విముఞ్చ = విడుము, చన్దన భ్రాన్త్యా = చందనమను భ్రమచే, దుర్విపాకం = చేదు పండును ఇడునట్టి, విష - ద్రుమమ్=కాలకూటపుఁ జెట్టును, శ్రితా అసి = ఆశ్రయించినదాన వైతివి!

తెలియనిదానా, నేను అపూర్వపుఁ గర్మ చండాలుఁడనే - విడిచిపెట్టుము నన్ను, చందన మని, విసంపుఁబండు పండు విషద్రుమమునీడకు వచ్చితివి!

ఈ కాళిదాసీయముం గనుఁడు - రఘు -

"ప్రియంకరో మే ప్రియ ఇత్యనన్దత్
నాబుద్ధ కల్పద్రుమతాం విహాయ
జాతం తమాత్మన్యసిపత్రవృక్షమ్.

'అపూర్వ - చణ్డాలం' - స్మృతులలో కర్మచండాలుర కొన్ని విధాలవారు చెప్పఁబడినారు. 'అసూయకః పిశునశ్చ కృతఘ్నో దీర్ఘరోషకః' అని. నేను క్రొత్తవిధమైన వాఁడను; ఇంతవ మున్నెందును లేనట్టివాఁడను.

విషద్రుమమును చందనమువలె శైత్యాది యన్ని బయటి మంచి గుణములు గలిగియుండును. పండినపుడు మాత్రము ఆ పండు వట్టి కాలకూటముగా నుండును. ఆ గుణములచే తొలుత ఆశ్రయమునకు ఆకర్షించును; ఆ ఫలముచే పిదప చంపును. అట్లే రక్షించెద నని నాయండం జేరిన నిన్ను చంపివేయుచున్నాను. 'కర్మ' చణ్డాలమ్ - ఇతరుఁడు 'జాతి' చండాలుఁడు. అతనికన్నను నిహీనుఁడు కర్మ చండాలుఁడు - అస్పృశ్యతరుఁడు. ఇంతకన్న ఆత్మనింద యుండదు - దివ్యమైన ఉపమ.

తనయిచ్ఛమెయిం గాకయే, కేవలము ధర్మముం గోరి, ప్రజలను అనురంజించుటకై ఈపని చేయుచున్నాఁడు.

హన్త విపర్యస్త స్సంప్రతి జీవలోకః! అద్యావసితం జీవిత ప్రయోజనం రామస్య! శూన్య మధునా జీర్ణారణ్యం జగత్! అసార స్సంసారః! కష్టప్రాయం శరీరం! అథవా?

శ్లో। దుఃఖసంవేదనా యైవ రామే చైతన్య మాహితమ్,
మర్మోపఘాతిభిః ప్రాణై ర్వజ్రకీలాయితం స్థిరైః. ౪౦

---

విపర్యస్తః = తలక్రిందైనది, జీవలోకః = ఈ ప్రాణిలోకము. జీవిత ప్రయోజనమ్ = బ్రతికియుండుటవలని యుపయోగము - ఇఁక నేల నేను బ్రదికియుండుట? అధునా - శూన్యం జీర్ణారణ్యమ్ - వట్టి వల్లకాఁడు. జీర్ణానాం అరణ్యం - జీర్ణులు అనఁగా ముసిసిపోయినవారు, పితరులు అనుట - జీర్ణారణ్యం - అనునది 'పితృకాననమ్' వంటిది. తత్పర్యాయమే. 'జరద్వనం' 'జరదరణ్యం' అనియు ప్రయోగములు గలవు. శూన్యం=పాడు, పాడుపడిన. సంసారః - ఐహికపుటునికి. కష్టప్రాయం=కష్టము తప్ప ఇఁకను ఈ శరీరమునకు ఏమున్నది? అథవా=కాకేమి? - దుఃఖమున ఇదియొక తెలుఁగు అల.

శ్లో. ౪౦. దుఃఖ సంవేదనాయ ఏవ = దుఃఖమును లెస్సగా అనుభవింపఁ జేయుటకొఱకే, రామే=రామునియందు, చైతన్యం = చేతన, ఆహితమ్ = ఉంపఁబడినది. స్థిరైః=స్థిరమై, నన్ను వదలనిదై, మర్మ ఉపఘాతిభిః=మఱి ఆయములను ప్రక్కలించుచున్నదియు నై, ప్రాణైః=ప్రాణము, వజ్రకీలాయితమ్ = వజ్రపు మేకవలె నైనది. 'భావే ప్రయోగమునకు' తెలుఁగున కర్తరిగా అర్థము.

మొన్ననే అడవిలో ఆ దుఃఖ మెల్ల అనుభవించి వచ్చితిని. ఇపుడు మఱల ఈ దుఃఖము, కడలేనిది వచ్చినది. ఇట్లు ఒక్క మొగిని దుఃఖ మనుభవించుటకే నాకు దేహాన ఈ చేతన. ప్రాణమైనను పోవునా యన్న, అది వదలక నాయాయములను ప్రక్కలించుచున్నది. ఇట్టిచోట్ల ప్రాణశబ్దమునకు బహువచనముననే ప్రయోగము. ఎల్ల కాలము దుఃఖభాజనమనే ఐతిని - అని భావము. లోకములో సుఖములో సుఖమే, కష్టములో కష్టమే జప్తికి వచ్చును.

రాముఁడు ఒక్క మొగిని ఏడ్చుచునే ఈ విలాపవిధానమెల్ల కావించెను. అట్లే మా. రఘు XIV - 84.

బభూవ రామః సహసా సబాష్ప
స్తుషారవర్షీవ సహస్యచన్ద్రః

హా! అమ్బ అరున్ధతి! హా! భగవన్తౌ వసిష్ఠవిశ్వామిత్రౌ! హా! దేవి భూతధాత్రి! హా! తాత జనక! హా! తాత! హా! మాతరః! హా! ప్రియసఖ మహారాజ సుగ్రీవ! హా! సౌమ్య హనూమన్! హా! మహోపకారిన్ లఙ్కాపతే విభీషణ! హా! సఖి త్రిజటే! ముషితాస్థ, పరిభూతాస్థ రామ హతకేన! అథవా, కో నామ తేషా మహ మిదానీ మాహ్వనే!

శ్లో॥ తే హి మన్యే మహాత్మానః కృతఘ్నేన దురాత్మనా
మయా గృహీతనామాన స్స్పృశ్యన్త ఇవ పాప్మనా. ౪౧

యోఽహం!

---

కాలీన భీతేన గృహాన్నిరస్తా
వ తేన వైదేహసుతా మనస్తః.

రామునికి బ్రతికియుండుట ఇపు డంతి దుర్భరముగా నున్నది.

రాముని మఱియొక పెద్ద దుఃఖపుటల ముంచుమన్నది. సీత ఎవరెవరికి గారాబో ఆతన పెద్దలందఱును, పూర్వవియోగమున సీతను వెదకి తెచ్చి కూర్పను ఎవరెవరు ఉపకారము చేసినారో వారందఱును తలంపునకు వచ్చుచున్నారు - ముషితాః = కొల్లఁబోయితిరి - పరిభూతాః=అవమానితులైతిరి. వారందఱు ఇపుడున్న, వివాసనము జరుగదేమో - ఆ మాటయే ఆత్రేయితో వాసంతి యనును. II. కష్టం! అరున్ధతీత్యాది.

కః నామ అహం=నే నెవఁడను - ఆహ్వనే=పేర్కొనుటకు.

శ్లో. ౪౧. హి = ఏలయన, తే మహాత్మానః = ఆమహాత్ములు, దురాత్మనా = దుష్టుఁడను, కృతఘ్నేన = చేసిన మేలు మఱచువాఁడ నగు, మయా = నాచేత, గృహీత నామానః = పేర్కొనంబడినవారై, పాప్మనా=పాపముచేత, స్పృశ్యన్త ఇవ = సోకఁబడుచున్నవారుం బోలె - (అని) - మన్యే=తలంతును.

సీతకు ఇట్టి కీడు కావించినవాఁడను, వారు చేసిన ఆ మహోపకారమును మఱచినవాఁడను - తుడిచివేసినవాఁడను - పాపాత్ముఁడను. అట్టి నేను వారి పేరును నోటఁ జెప్పినను వారికి మైల - పాపము - సోఁకు నని తలంతును.

యోఽహమ్ - ఎట్టివాఁడను నేను!

శ్లో॥ విస్రమ్భా దురసి నిపత్య జాతనిద్రా-
మున్ముచ్య ప్రియగృహిణీం గృహస్య లక్ష్మీం,
ఆతఙ్కస్ఫురితకఠోరగర్భగుర్వీం
క్రవ్యాద్భ్యో బలిమివ నిర్ఘృణః క్షిపామి! ४৯

(సీతాయాః పాదౌ శిరసి కృత్వా) దేవి అయం పశ్చిమస్తే రామస్య శిరసా పాదపఙ్కజస్పర్శః. (ఇతి రోదితి)

---

శ్లో. ४৯. విస్రమ్భాత్=(నాప్రియుఁడు, నారక్షకుఁడు, నా సర్వము అను) విశ్వాసమువలన, ఉరసి=(నా) యెదపై, నిపత్య = వ్రాలి, లబ్ధనిద్రాం=పొందిన నిద్రగలదానిని, గృహస్య లక్ష్మీం = ఇంటికి సర్వసంపద, శోభ, దీపమువంటిది అయినట్టియు, ఆతఙ్క స్ఫురిత కఠోర గర్భ గుర్వీమ్ = (గర్భిణీ సులభమైన) భయములచే అదరుచున్న నిండు చూలుచేత, చాల బ్రేఁగైనట్టిదియు అగు, ప్రియ గృహిణీం = నా యత్యంతప్రియయగు యిల్లాలిని; ఉన్ముచ్య = నేనే తలను ఎత్తి అవతల పెట్టి, వదలి, క్రవ్యాద్భ్యః = పచ్చిమాంసముం దినునవైన (పులి తోడేలు మొదలైన) వానికి, రాక్షసులకు అని యేని, బలిం ఇవ=బలిని (ఆహారమును) బోలె, నిర్ఘృణః = దయమాలినవాఁడనై, క్షిపామి = పాఱవేయుచున్నాను - అయ్యో! అనుట.

విస్రమ్భాత్ - నమ్మకమువలన - ఇక్కడ మనకు ఏ యాపదయు నెబ్బరయు కలుగదు, ఏయాపదయు ఇక్కడ నున్న తీఱిపోవును అను నమ్మకమువలన. పసి పిల్లలు తల్లిదండ్రులు కసరినను కొట్టినను గూడ వారిని వదలక వారి యొడిలో దాఁగుకొనుట ఎట్టి నమ్మకమువలననో అట్టి నమ్మకమువలన, 'ఉరసి' - ఆ చోటును ఆవిస్రంభముం బట్టినదే. 'నిపత్య' ఇదియు ఆ నమ్మకముం దెలుపునదే - లబ్ధనిద్రాం= అనుటయు ఆ కొలతలేని నమ్మకమునే తెలుపును. క్షిపామి - అడవిలో పాఱవేయుచున్నాను! అట్లే తరువాత వివాసిత సీతంగూర్చి యనుకొనును - 'క్రవ్యాద్భిరఙ్గలతికా నియతం విలుప్తా' అని.

పశ్చిమః - కడపటిది. సీత పాదములను రాముఁడు శిరమున నుంచుకొనుట - 'పశ్చిమః' - అనఁగా ఇట్లు ఇదివఱకు పలుమాఱు చేయువాఁడే అనుట, ఆత్మనోప పరిహారమునకై - రామునికి సీతయందు అంతగౌరవము గల దనుట. భార్యపాదములను తలయం దుంచుకొనుట యేమి అని యనఁదగదు. ఉంచుకొనకపోవుట పురుష త్వాహితాభిమానముచేత; ఉంచుకొనుట వినయ గౌరవములచేత. 'దేవి' అని సీతయందు రామునికి, పూజ్య యనుభావము సిద్ధము. ఇది ఈశ్లోకపాయిత

(నేపథ్యే)

(అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యమ్!)

రామః—జ్ఞాయతాం భోః కి మేతత్.

(పున ర్నేపథ్యే)

శ్లో॥ ఋషీణా ముగ్రతపసాం యమునాతీరవాసినామ్,
లవణత్రాసితస్ స్తోమ శ్శరణ్యం త్వా ముపస్థితః. ౮౩

రామః—ఆః కథ మద్యాపి రాక్షసత్రాసః! త ద్యావ దస్య దురాత్మనో మాథురస్య కుమ్భీనసీపుత్రస్య సమున్మూలనాయ

---

మాన మూనినపుడు కొట్టు కాలితాఁపు కాదు. అదియు సమయాన కలుగును గాక. ఇది అంతకంటెను వేఁటు 'స్పర్శ.' 'శోదితి' - వావిచ్చి యేడ్చుచున్నాఁడు. అబ్రహ్మణ్యమ్ - 'కావరయ్యా' అని కుయి - అపాయము కలిగినపుడు దీనులు శరణుకై అఱచుటకు మాట. 'అబ్రహ్మణ్య మవధ్యోక్తౌ' అని యమరము.

భోః - ఇది ఎదురుగా లేని నౌకరునకు ఎచ్చరిక, పిలుపు. ఇంతలో జవాబు నేపథ్యమునుండియే వినంబడుచున్నది. పాత్ర ప్రవేశ నిష్క్రమణములం బరిహరించిన తెఱంగు.

శ్లో. ౮౩. యమునా తీర వాసినామ్ = యమునానదితీరమున ఆశ్రమములయం దుండువారును, ఉగ్రతపసాం = తీవ్రమైన తపస్సుగలవారును అగు, ఋషీణాం స్తోమః = ఋషుల గుంపు, లవణ త్రాసితః = లవణాసురునిచే భయపెట్టఁబడినదై (వారై,) శరణ్యం = ఆపదలం దీర్చు రక్షకుఁడవైన, త్వాం=నిన్ను, ఉపస్థితః = తటిసినది, చేరవచ్చినది.

ఉగ్రతపసాం - తమ తపస్సుచే తమ్ముం గాపాడుకొన వలంతులయ్యు, తద్వ్యయమును ఇచ్ఛగింపనివారై, శరణ్యం = కాపాడవలయుట రాజధర్మము గావున, దానికి తగినవాఁడైన రాముని, త్రాసితః - వాఁడు పెట్టుచుండు యాతనలం బడలేక భయము చెందినవారై, రాముని నిష్క్రమణమునకు వ్యాజము.

ఆః - అని చిత్తపీడం దెలుపును. రాముని చిత్తమున వివిధభావముల సంఘర్షణం జూపుటకు కవి ఈ సమయాన ఈకుయిని వినుచుట. ఏసమయమునను రాముఁడు ధర్మమును ఏమరఁడు - అనుటకు.

పునః ప్రతినివృత్త్య - మరల మరలివచ్చి - వీడలేని దయయు జాలియు, ఏమగునో గదా అను భయమును; వానికిని వీడనేవలయు ధర్మాగ్రహమునకును చిత్తాన సంఘర్షణ.

శత్రుఘ్నం ప్రేషయామి. (కించిత్పరిక్రమ్య పునః ప్రతినివృత్య) హా దేవి! కథ మేవంగతా భవిష్యసి? హా భగవతి వసున్ధరే, శ్లాఘ్యాం దుహితర మవేక్షస్వ జానకీం.

శ్లో॥ జనకానాం రఘూణాం చ యత్కృత్స్నం గోత్రమఙ్గళం,
యాం దేవయజనే పుణ్యే పుణ్యశీలా మజీజనః. ౪౪

(ఇతి నిష్క్రాన్తః.)

---

కథం ఏవం గతా భవిష్యసి! – ఏవంగతా=ఇట్టిగతిం బొందినదానవై – అడవిలో విడువఁబడినదానవై, కథం భవిష్యసి!=ఎట్లు అగుదువో, ఏమగుదువో. తనకు ప్రతిక్రియ ఏమియుఁ తోఁపకున్నది.

వసున్ధరే – ఇపుడు సీత దేనిమీఁదనున్నదో అది, ఎందును సీతం జూచుచుండునది, సర్వవ్యాపినియై అడవిలో తా నొక్కతెయే దిక్కు కాఁగలది. కావున ఇపుడు రామునిమనసునకు వచ్చినది. పృథ్వీభాగీరథులయందు రామునికి నిజమైన నమ్మకము, గౌరవము.

శ్లో. ౪౪. యత్=ఏది – ఎరతె అనుట. 'మఙ్గలమ్' అను విధేయప్రాధాన్యముచే, నపుంసకలింగము, జనకానాం=జనకులయు, రఘూణాం చ = రఘువులయు, కృత్స్నం = సమస్తమైన, గోత్ర మఙ్గలమ్ = వంశమునకు మంగళభూతయైనదో, తాం పుణ్యశీలాం=ఆపుణ్యశీలను, పవిత్రమయిన చారిత్రము గలదానిని, పుణ్యే = పవిత్రమైన, దేవయజనే=యజ్ఞక్షేత్రమందు (దేవతలను యజించు చోట,) అజీజనః=కంటివి, నీవు, దీనికి విధేయమైన విషయము, 'కావున నీవు కాపాడుము' మొదలైనది ఈ శ్లోకపు టవతారిక యగు గద్యభాషితమున నున్నది.

జనకులయింట పుట్టి ఆవంశమున కెల్ల సమస్తమంగళభూతయైనది. రఘువులయింట మెట్టి, ఆవంశమునకెల్ల సమస్తమంగళభూతయైనది. అట్టి యీ పుణ్యశీలను సీతను నీవు యజ్ఞక్షేత్ర సీత (నాగటిచాలున) యందు కంటివి. తల్లివి. విచారించుకొనవమ్మ. (మఱి దిక్కులేనిదైనది.)

ఇతి నిష్క్రాన్తః – రాముఁడు నిష్క్రమించినాఁడు. (శత్రుఘ్నుం బంపుటకు.) పృథ్వీ ఈ రాముని ప్రార్థనను అట్లే జరుపును. భాగీరథియు. ఇట సీతను రాముఁడు వదలిపోయిన తెఱంగు భవభూతి చెప్పినది, కరము కరుణోత్తరముగానే యున్నది. ఒంటిపాటున తాను అట్లు ఏడ్చి యేడ్చి, వదలిపోను కాళ్ళాడక మరలను వచ్చి చూచి, దిక్కుమాలినవారికి దిక్కు కాగల వసుంధరకు అప్పగించి

సీతా—హా! సొమ్మ అజ్జఉత్త కహింసి? (సహసోత్థాయ) హద్ధీ హద్ధీ దూసివిణవిణ విప్పళద్ధా అజ్జఉత్తసుణ్ణం విఅ అత్తాణం పెక్ఖామి. (విలోక్య) హద్ధీ హద్ధీ! ఏఆఇణిం మం పసుత్తం ఉజ్ఝిఅ గదో అజ్జఉత్తో. కిందాణిం ఏదం? హోదు సే కుప్పిస్సం, జఇ తం పేక్ఖంతీ అత్తణో పహవిస్సం. కో ఏత్థ పరి అణో? [హా! సౌమ్య ఆర్య పుత్ర కుత్రాసి? హా ధిక్, దుస్స్వప్నేన విప్రలబ్ధా ఆర్యపుత్రశూన్య మివాత్మానం ప్రేక్షే, హాధిక్! హాధిక్! ఏకాకినీం మాం ప్రసుప్తా ముజ్ఝిత్వా గత ఆర్యపుత్రః. కిమిదానీ మేతత్? భవ త్వస్మై కోపి ష్యామి, యది తం ప్రేక్షమాణా ఆత్మనః ప్రభవిష్యామి. కోఽత్ర పరిజనః?]

---

వెక్కి యేడ్చుచునే పోయినాఁడు. ఇట్లు మనసున నున్నదానిం జెప్పికొని యేడ్చుటకు ఒంటిపాటుం గల్పించినాఁడు. అందు రామునికి సీతాపాదస్పర్శకును అవకాశము కలిగినది. సీతను తాను పెట్టుచున్న క్లేశమును చక్కఁగా ఎఱిఁగి తలపోసికొని తలపోసికొని యేడ్చినాఁడు, రాముఁడు. తాను ఇఁక నెప్పటికిని మనసున ఇట్లు ఏడ్చుచునే యుండునని సూచించినాఁడు. బయటికి వచ్చినప్పుడు ఇటు లక్ష్మణాదులు తమ్ములు, ఇతరులు నౌకరులు – వారి యెదురుగా తాను ఏడ్చుటెట్లు? అంతయు చిత్తమున ఆఁపుకొనవలసియుండును. ఇదియెల్ల భవభూతి యేడ్చునట్టియు ఏడ్పించునట్టియు నేర్పు. రఘువంశమునఁ గాని రామాయణమునఁగాని ఇట ఇట్టియేడ్పు చెప్పఁబడలేదు. ఎందును రామపరోక్షముననే సీతను లక్ష్మణుఁడు రథ మెక్కించుకొని పోయినాఁడు. తిక్కన తన ఉత్తరరామాయణమున మాత్రము వేఱువిధముగా మార్చినాఁడు. రాముఁడు తాను సొంతముగా సీతాలక్ష్మణులను రథమెక్కించును. అత్తఱి సీతారామలక్ష్మణులు ఏమి యనుకొనుటం గనఁదగును. రాముని తెచ్చుకోలు ధైర్యముం బరికింపఁదగును!

'ఆర్యపుత్త్రుఁడా, ఎక్కడ నున్నావు' – ఇట్లే రెండు నిముసములకు ముందును సీత పలవరించెను. దానికి సీతదేహమును రాముఁడు సుమానుష భద్ర ప్రార్థనతో నిమురుచుండఁగా దుర్ముఖుఁడు వచ్చి జనాపవాదముం జెప్పినాఁడు. దానిని విన్న మాత్రకే, మఱి వేఱు ఆలోచన లేక, రాముఁడు ఏడ్చుచునే ఆ దుర్ముఖుని చేతనే లక్ష్మణునికి సీతను అడవులకుం గొంపొమ్మని ముదల యంపి, తాను ఆఁపుకొన రాక ఎల్ల భంగుల నేడ్చి సీతను విడిచిపెట్టి పోయినాఁడు. సీత మరలను అటే

దుర్ముఖః—(ప్రవిశ్య) దేవి, కుమార లక్ఖణో విణ్ణవేది, సజ్జో రహో. ఆరుహదు దేవి త్తి. (దేవి, కుమారలక్ష్మణో విజ్ఞాపయతి, సజ్జో రథః, ఆరోహతు దేవీతి.)

సీతా—ఇఅం ఆరుహామ్హి. (ఉత్థాయ పరిక్రమ్య,) ఫురఇ మే గబ్భభారో! తా సణిఅం గచ్ఛమ్హ. [ఇయ మారోహామి. స్ఫురతి మే గర్భభారః. తత శ్శనై ర్గచ్ఛావః.]

పలవరించుచు తటాలున లేచి కలలో తన యనుభవముం జెప్పుచున్నది. 'ఆర్య పుత్రశూన్య మివ ఆత్మానం పశ్యామి' - 'ఆర్యపుత్రుఁడు లేనిదానినిగా నన్ను తలఁచుకొనుచున్నాను.' అని. కలుగఁబోవుదానికి సూచనగా అవశకునము ఈకల. ఒకవేళ చిత్రదర్శనమున తనకుఁ గల్గిన భావననే కలం గాంచినదేమో. లేక ఇది వేఱు క్రొత్తభావనయో. యది తం ప్రేక్షమాణా ఆత్మనః ప్రభవిష్యామి - ఆయనం గన్నప్పుడు నేను నావశమన యేని. ఆయనయెదుట తాను ఆయనపై కోపపడ నేరదు. ముందు అనుకొన్నను, ఎదుట ఆ నిశ్చయము శిథిలమైపోవును. ఆయనతో పలుక సిగ్గు జంకు చెందును. రాముఁడును మును పు అన్నాఁడుగదా - 'యద్యేషా కథయతి' అని, దోహదముం గూర్చి. మఱియు సమక్షమున అతి స్నేహగౌరవ పరవశ. కోపపడను అసమర్థ. ఎవరక్కడ పరిజనుఁడు? అనునప్పటికి, కాకతాళీయముగా, దుర్ముఖుఁడు లక్ష్మణ సందేశముతో వచ్చి, సీతప్రశ్నకు జవాబుంబోలె దానిని అందించును. చిత్రదర్శనానంతరము సీతకోరిక విని ఆమె యెఱుకగానే లక్ష్మణుం బంపెనుకదా, కుదుపులేని తేరిని తెమ్మని. కావున ఇపుడు సీత ఏమియు అనుకొనక శంక లేక వెడలిపోవును రథమెక్కుటకు

రాముఁడు దుర్ముఖునివలన సీతంగూర్చిన లోకుల యాడిక విని, తచ్ఛుద్ధని యెఱింగియు, తానెంతేని యెడ్చుచునే లోకరంజనమునకై, సీతను వివాసింప నిశ్చయించుకొని తాను సీతకు మఱుఁగపడక పరోక్షముననుండియే సీతం గొంపొమ్మని లక్ష్మణునికి ముదలయిడును. వాల్మీకి ఉత్తరకాండయందు అట్లే చెప్పినాఁడు.

'శ్వ స్త్వం ప్రభాతే సౌమిత్రే సుమంత్రాధిష్ఠితం రథం
ఆరుహ్య సీతా మారోప్య విషయాంతే సముత్సృజ.' 45 - 17

కాళిదాసును రఘువున అట్లే చెప్పినాఁడు—

ప్రజావతీ దోహదశంసినీ తే, తపోవనేషు స్పృహయాలు రేవ
స త్వం రథీ తద్వ్యపదేశనేయాం ప్రాపయ్య వాల్మీకిపదం త్యజైనామ్.

గురో ర్నిదేశా ద్వనితాం వనాన్తే సాధ్వీం సుమిత్రాతనయో విహాస్యన్.

XIV - 45 - 51.

కుందమాలయందును అట్లే చెప్పఁబడినది.

...వత్స లక్ష్మణ...సుమన్త్రాధిష్ఠితం రథ మారోప్య కస్మింశ్చి ద్వనోద్దేశే పరిత్యజ్య నివర్తస్వ - ఇతి.

కంకంటి పాపయ్య వాల్మీకిని అనుసరించి ఇట్లే చెప్పెను. VI - 220 - 1.

‘జనవిభుఁ డంతట లక్ష్మణుఁ గనుఁగొని......
పల్మాటల్ దలపెట్ట కర్కుఁ డుదయింపన్ రేపె యీలోకనిం
ద ల్మానంగ సుమంత్ర చోదిత రథాధ్యాసీనఁ గావించి వ-
న్యక్రోడంబునఁ జూడరమ్మనుచుఁ గాంతన్ నీవు గొంపోయి యా
వాల్మీకుల్ వసియించు నాశ్రమముచేర్వన్ డించిరమ్మా వెసన్,’ అని.

మఱి తిక్కయజ్వ లక్ష్మణునితో సీతాప్రస్థానమును రామునిచే సమక్షమున సాంతముగా చేయించెను. లక్ష్మణుఁడు సుమంత్రునిచే రథ మాయితంబు సేసి తెప్పింపఁగానే ...అంత మేదినీవిభుండు

౧౩౧. క. అడ లడఁచి నెమ్మనంబున, వెడ తెలి వాడఁగూర్చి మాట వేర్పడకుండం
జిడిముడి వడక నయంబున నెడమడు వొక్కింత లేక యిట్లనుసతితోన్.

౧౩౨. చ. పొలఁతుక, గంగ చేరువ తపోవనభూములు చూడ నీమదిన్
మొలచిన కౌతుకంబు దుదిముట్టఁగ లక్ష్మణదేవు నిన్ను నం
దులకు మనోముదం బెసఁగఁ దోడ్కొనిపో నియమించితిన్ సము
జ్జ్వల మణి కాంతిమైన రథసత్తము నెక్కుదు రమ్ము నావుడున్.

౧౩౩. ఉ. అక్కట, నాదు వేడ్క యుచితానుచితంబులు చూడకే విభుం
డొక్కతలంపువాఁ డయి సముత్సుకతన్ నను దవ్వు పుచ్చఁగా
నిక్కమ యియ్యకో లరయ నెయ్యముతియ్యము గాదె యంచు నిం
పెక్కఁగ, రాముడెంద ముడు కెక్క, రథంబు లతాంగి యెక్కెన్.

౧౩౪. ఉ. అత్తఱి నన్నదైన్యమున కచ్చెరువందుచు, జీవితేశు వ్యా
ద్వృత్తి మెఱుంగమిన్ వదనె దీనికి నమ్ముట కుమ్మలించుచుం,
జిత్తముఖేద మానసముఁ జెందిన, మాన్పఁగ లేక, లక్ష్మణుం
డుత్తలమందుచున్న, విభుఁ డుగ్మలి కాతనిఁ జూపి యిట్లనున్.

౧౩౫. ఉ. దూరము నాక ఘోర వన దుర్గతలంబులఁ గేలి సల్పఁగాఁ
గోరెడు భామలం బ్రియులఁ గోరినయట్టులు పుచ్చు రాజులన్

దుర్ముఖః — ఇదో ఇదో దేవీ. [ఇత ఇతో దేవీ.]

సీతా — ణమో రహుఉళ దేవదాణం [నమో రఘుకుల దేవతాభ్యః]

(ఇతి నిష్క్రాన్తాః సర్వే.)

చిత్రదర్శనో నామ
ప్రథమో౽ఙ్కః.

---

ధారుణి నెందుఁ గాన మని తా మును దీనికి నడ్డపెట్టనేఁ
బోతకమాడి యిట్లు నినుఁ బుచ్చుట కల్గినవాఁడు నూచితే.

౧౩౬. క. అని తన మొగ మొప్పమి క
మ్మనుజేంద్రుఁడు నెపము చెప్పి మాటాడినఁ దా
నును దదనురూప వచనము
లను సంభావన మొనర్చె లక్ష్మణుఁడు దగన్.

తే. ఇవ్విధంబునఁ దన తలఁ పించుకంతయైనఁ జానకి యెఱుఁగనియట్లు గాఁగఁ
బాలతోడ విషం బిడు పగిది ననిచిపుచ్చి రాఘవు డుల్లంబు నొచ్చిమరలె.

ఇందు కరుణాదితారతమ్యమును సహృదయులు అరయఁదగును.

నిష్క్రాన్తాః సర్వే - అంకాంతమున సర్వపాత్ర నిష్క్రమణము అని ఆలంకారికులు.

చిత్రదర్శనమ్ - ఇతివృత్తముం బట్టి ఈ యంకమునకు పేరు. చిత్రరువులం జూచుటయే ఈ యంకము నెల్ల సాఁగించినది.

# శుద్ధవిష్కంభః



(నేపథ్యే)

స్వాగతం తపోధనాయాః.

(అధ్వగవేషా) తాపసీ—(ప్రవిశ్య) అయే వనదేవతేయం, ఫలకుసుమపల్లవార్ఘ్యేణ మాముపతిష్ఠతే!

వనదేవతా—(ప్రవిశ్య, అర్ఘ్యం వికీర్య.)

శ్లో॥ యథేచ్ఛం భోగ్యం వో వనమిద, మయం మే సుదివస,
స్సతాం సద్భిస్సఙ్గః కథమపి హి పుణ్యేన భవతి;

---

ప్రథమాంకము సీతావివాసముతో ముగిసినది. ఇందు ఆత్రేయి పునః సంయోగవస్తువును తొడంగుచున్నది. నేపథ్యమున వినంబడినది - స్వాగతం తపోధనాయాః. ప్రవిశ్య - అధ్వగవేషా - అధ్వగుల (= బాటసారుల) వేషముగలది. - దారి వెదకునది. వనదేవతా ఇయం - అని ఒరులు చెప్పక, వారి యన్యోన్యభాషితము వలననే వారెవరో ప్రేక్షకులకు తెలిసిపోయినది. ఇట్లు ప్రేక్షకులకు ఇట్టిది సులువుగాను అవిలంబితముగాను అందే తెలియునట్లు కవి రచింపవలయును. రంగానం బ్రవేశించిన పాత్రము ఎవరగునా అని నాటకప్రదర్శన ప్రకటన కథాసంగ్రహ పత్రముం గాంచి ఎఱుంగందగిన ట్లుండరాదు. అర్ఘ్యమ్ = పూజకైన పూలు మొదలైనది, వికీర్య=చల్లి.

శ్లో. ౧. ఇదం వనం = ఈవనము, వః = మీకు, యథేచ్ఛం = (మీ)యిచ్చమెయి, భోగ్యం = అనుభవింపందగినది. అయం = ఇది, మే=నాకు, సుదివసః = సుదినము. సతాం = సాధువులకు (ఉన్నచోటును వదలలేక అందే యుండువారికి అనియేని. - వనమునకు అధిదేవత నియతముగా తదేకవాసగా నుండునుగదా,) సద్భిః = సాధువులతో, సఙ్గః=సమాగమము, కథమపి=ఎట్టకేలకు, పుణ్యేన హి=పున్నెముచేతనే కదా - పుణ్యఫలముగాఁ గదా, భవతి - కలుగును! తరుచ్ఛాయం= చెట్లనీడలు, తోయం=నీళ్ళు, యత్ అపి=ఏది మఱి, తపసః=తపస్సునకు - తాపసులకు అనుట,

తరుచ్ఛాయం తోయం యదపి తపసో యోగ్యమశనం,
ఫలం వా మూలం వా తదపి న పరాధీన మిహ వః. ౧

తాపసీ—కి మత్రోచ్యతే?

---

యోగ్యం=తగిన, అశనం=భోజనమో, ఫలం వా=పండేని, మూలం వా=వేరేని, తదపి=అదెల్ల, ఇహ=ఇచట, వః=మీకు, న పరాధీనమ్=పరాయత్తము గాదు, మీవశమె - అనుట.

ఇందు ఇది చేయఁదగును ఇది కూడదు అను విచార మిసుమంతయు లేక, ఇది నాది ఇది నాది గాదు అను జంకుగొంకులు లేక, ఈ వనము మీ రనుభవింపఁ దగును. ఇది నాకు మిక్కిలి సుదినము. వనదేవతనై, ఇందుండి ఎందుఁబోవను అవకాశము లేనిదానను నేను. నాకు సాధువుల సంగతి కలుగుట ఎంతో పుణ్యఫలము. ఇందు చెట్లనీడలు నీళ్ళు, మీకు తగిన భోజనము ఏదేది కావలసియున్న అదియెల్ల మీరు స్వేచ్ఛగాఁ గొనఁదగును. దేనికిగాని ఎవరిని అడుగ నక్కఱలేదు, అనుమానపడ నక్కఱలేదు.

ఇదెల్ల వాసంతి యతిథిపూజాప్రవణత. 'సతాం సద్భిః సఙ్గః కథమపి హి పుణ్యేన భవతి.' - ఇందు 'సాధువులకు' అని తన్ను నిర్దేశించుకొనుట ఆత్మశ్లాఘ యగునుగదా అని యాక్షేపింతురేమో. వస్తుస్థితి చెప్పుటగానే అట్టిది సమయానుమతమే యగును, శ్లాఘ యను దోషముం జెందదు - 'సతాం హి సన్దేహపదేషు వస్తుషు' అని కాళిదాసు దుష్యంతునిచేత చెప్పించినాఁడు. దానిని నిరవద్యముగా కుమారిలభట్టునంతటివాఁడు గ్రహించినాఁడు. 'తరుచ్ఛాయం' - నపుంసకలింగమున పెక్కు చెట్లు అర్థము.

కిం అత్ర ఉచ్యతే - ఇందు చెప్పవలసినది ఏమున్నది? మీఁబోంట్లకు ఈ సౌజన్యము స్వతఃసిద్ధమే - అనుట. అట్లే శాకుంతల పంచమాంకము మొదట పురోహితుఁడు రాజుంగూర్చి మునులతో - 'ప్రాగేవ ముక్తాసనో వః ప్రతిపాలయతి. పశ్యతైనమ్' అనఁగా, శార్ఙ్గరవుఁడు 'కామ మేత దభినన్దనీయమ్' అనియు 'తథాపి వయ మత్ర మధ్యస్థాః.

కుతః- భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమైః
నవామ్బుభి ర్దూరవిలమ్బినో ఘనాః
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః
స్వభావ ఏ వైష పరోపకారిణామ్.' అని తమ మాధ్యస్థ్యముం జెప్పెను.

శ్లో॥ ప్రియప్రాయా వృత్తి, ర్వినయమధురో వాచి నియమః,
ప్రకృత్యా కల్యాణీ మతి, రనవగీతః పరిచయః,
పురో వా పశ్చా ద్వా త దిద మవిపర్యాసితరసం,
రహస్యం సాధూనా మనుపధి విశుద్ధం విజయ తే. ౨

(ఉపవిశతః.)

వన — కాం పున రత్రభవతీ మవగచ్ఛామి?
తాప — ఆత్రేయ్యస్మి.

---

శ్లో. ౨. వృత్తిః=కాయికవర్తనము, చేఁత అనుట, ప్రియప్రాయా=మిక్కిలి ప్రియమైనది - ప్రీతితోనిండినది; వాచి=మాటయందు, నియమః=ఏర్పాటు, మితి, వినయమసృణః=వినయము (అడఁకువ)చే కోమలము - మంజులము; మతిః=తలంపు, ప్రకృత్యా = స్వభావముచేతనే, కల్యాణీ = మేలైనది (శుభావహమైనది;) పరిచయః=స్నేహము, వారు చేయునది గాని, వారితో చేయునది గాని, అనవగీతః= అనిందితము. పురః వా = ఎదుటగాని, లేక ముందు అనఁగా క్రొత్తలో గాని, పశ్చాత్ వా=వెనుక గాని - పరోక్షమున గాని, పిదప గాని, అవిపర్యాసితరసం= మార్పుచెందని రుచి (లేక గుణము లేక భావము లేక ప్రీతి) గలదైన, తత్ ఇదం=అయీ, సాధూనాం రహస్యం=సజ్జనుల గుట్టు, తత్త్వము, అనుపధి=నిర్వ్యాజముగా, స్వభావముచేతనే, విశుద్ధం=పరిశుద్ధమైనదై, విజయతే = సర్వోత్కృష్టముగా వెలయును.

చేఁతయంతయు ప్రియముం గూర్చునదే; మాట పరిమితము కట్టుబాటునకు లోనై, వినయముతో మధురము; చిత్తవృత్తి స్వభావముచేతనే శుభమైనది, చెడ్డతలంపు కలుఁగనే కలుఁగదు; మొగ మెఱుక స్నేహము ప్రశంసింపఁదగినది, ఒకప్పుడును నిందపాలుకానిది; తొలుత గాని పిదపగాని, ఎదుర గాని మఱుంగున గాని మార్పుచెందక దాని రుచి అనఁగా ఆప్రీతి ఏకరీతిగా నుండును. సాధువుల గుట్టు అనఁగా తత్త్వము నిసర్గపరిశుద్ధమై వెలయును.

ఇందు ఆర్యవృత్తము నిపుణముగా ఉపన్యసింపఁబడినది. ఇంత నిపుణముగా చిత్తవృత్తి విశేషములను సామాన్యకవులుం జెప్పఁజాలరు.

కాం అవగచ్ఛామి = ఎవతెనుగా ఎఱుంగుదును? నీ వెవరు. నీ పేరేమి అనుట. ఆత్రేయీ - గోత్రముం జెప్పుచున్నది; పేరు గాదు. పేరు గాక, గోత్రముం జెప్పుట మర్యాద. ఇది దండకారణ్యమట - వనదేవత చెప్పుచున్నది.

వన—ఆర్యే ఆత్రేయి, కుతః పునరిహాగమ్యతే? కింనిమిత్తో వా దండకారణ్యప్రచారః?

ఆత్రేయీ—

శ్లో॥ అస్మిన్నగస్త్యప్రముఖాః ప్రదేశే
భూయాంస ఉద్గీథవిదో వసన్తి.
తేభ్యోఽధిగన్తుం నిగమాన్తవిద్యాం
వాల్మీకిపార్శ్వా దిహ పర్యటామి. 3

వన—యదా తావ దన్యేఽపి మునయ స్త మేవ పురాణ బ్రహ్మవాదినం ప్రాచేతస మృషిం బ్రహ్మపారాయణా యోపాసతే తత్కోఽయ మార్యాయాః దీర్ఘప్రవాసప్రయాసః?

---

కుతః=ఎందుండి? ప్రచారః=తిరుగుట. కింనిమిత్తః=ఎందుకోసము?

శ్లో. 3. అస్మిన్ ప్రదేశే=ఈ ప్రదేశమందు, అగస్త్యప్రముఖాః=అగస్త్యుఁడు మొదలైనవారు, భూయాంసః=పలువురు, ఉద్గీథవిదః=సామవేదము ఎఱిఁగినవారు, ఓంకారతత్త్వము నెఱింగినవారు, వసన్తి=వసింతురు. తేభ్యః=వారివలన, నిగమాన్తవిద్యాం=వేదాంతవిద్యను, అధిగన్తుం=నేర్చుకొనుటకు, వాల్మీకిపార్శ్వాత్=వాల్మీకి చెంతనుండి, ఇహ=ఇచటికి, పర్యటామి=వచ్చుచున్నాను.

ఈచోట అగస్త్యులవారు మొదలగు పలువురు సామవేదవిదు లున్నారని, వారివలన వేదాంతము నేర్చుకొనుటకు వాల్మీకిచెంతనుండి వచ్చుచున్నాను.

ఇది కేవలము కథలో లంకె. అంతే.

ఉద్గీథము సామవేదము, గొంతెత్తి పాడంబడునది, వేదములలో శ్రేష్ఠము. అగస్త్యులవారిది గోదావరిచెంత గొప్పవిద్యాస్థానము. వాల్మీకులవారిది భాగీరథి చెంత గొప్పవిద్యాస్థానము. అది యాతట్టును ఇది యీతట్టునుం గూడ ప్రసిద్ధము. తాపసస్త్రీలును నిగమాంతవిద్య నేర్చుకొందురు. ఆత్రేయి స్త్రీవిద్యాభ్యాసమును శంబూకుఁడు శూద్రతపశ్చర్యను నెలకొల్పుచున్నారు. భవభూతి రెంటిని చెప్పినాఁడు.

యదా = యతః - ఎందువలన...తత్ = అందువలన - దీనికి ప్రతియోగిగా 'యదా' ఇట ప్రయుక్తము.

బ్రహ్మ - తత్త్వం - వదతీతి - తత్త్వముం బలుకువాఁడు - ఉపదేశించువాఁడు. బ్రహ్మపారాయణాయ - తత్త్వముం బూర్తిగా నేర్చుకొనుట - ఈ వనదేవత యాత్రేయితోడిమాటలలో బ్రహ్మ - అనఁగా వేదము - అను అర్థము పనికిరాదు.

ఆత్రేయీ—తత్ర మహా నధ్యయనప్రత్యూహ ఇతి దీర్ఘప్రవాసో౽ఙ్గీకృతః.

వన—కీదృశః?

ఆత్రేయీ—తస్య భగవతః కేనాపి దేవతావిశేషేణ సర్వప్రకారాద్భుతం స్తన్యత్యాగమాత్రకే వయసి వర్తమానం దారకద్వయ ముపనీతమ్, తత్ఖలు న కేవల మృషీణాం, అపి తు చరాచరాణాం భూతానా మాన్తరాణి తత్త్వా న్యుపస్నేహయతి!

వన—అపి తయో ర్నామసంవిజ్ఞాన మస్తి?

ఆత్రేయీ—తయైవ కిల దేవతయా తయోః కుశలవా వితి నామనీ ప్రభావ శ్చాఖ్యాతః.

వన—కీదృశః ప్రభావః?

ఆత్రేయీ—తయోః కిల సరహస్యాని జృమ్భకా స్త్రాణి జన్మసిద్ధానీతి!

---

స్త్రీలకు తదక్షరగ్రహణరూపపారాయణము నిషిద్ధము. తదర్థగ్రహణము కూడినదే. ఆ యర్థమే 'తత్త్వము.' దీర్ఘప్రవాస - చిర లేక దూరప్రవాస. అధ్యయన - చదువుకొనుట. ప్రత్యూహః=విఘ్నము.

ఎవరో దేవత - ఆమె భాగీరథి అని తరువాత తెలియును. ఆత్రేయికి అది రహస్యముగా నున్నది. అట్లే అచట ఇతరులును ఆదేవత యెవరో ఎఱుఁగరు కాబోలు.

సర్వప్రకారాద్భుతమ్ = ఎల్ల తెఱంగుల ఆశ్చర్యకరమైనది. ఆకారమున, ప్రతిభలో - ఇట్లు సర్వమందును. ఉపస్నేహయతి = స్నేహము గొల్పుచున్నది. ఎవరును వారిమీఁద తనంతట కలుగు స్నేహముచే వారికి పరవశము కావలసినదే -

నామసంవిజ్ఞానం = పేరులఎఱుక - పేరు లెఱుంగుదువా? - అనుట. వారికి కుశలవులన్న పేరు రామాయణమున వాల్మీకి ఇడును; ఇందు భాగీరథి! కావునే భాగీరథియింట నున్న సీతకును ఆపేరులు తెలియును. ఆయస్త్రములు జన్మసిద్ధములన్నమాటయే కాని అది అట తార్కాణపడుటకు ఇంకను అవకాశము కలుగలేదు. ఆసిద్ధివిధము ఇందలి కటపటియంకమందలి అంతర్నాటికలో తెలియును. ఐదవయంకములో లవుఁడు దానిని మేధ్యాశ్వరక్షాసేనమీఁద ప్రయోగించును.

వన.—ఇతి హి భో శ్చిత్రమ్!

ఆత్రేయీ.—తౌ చ భగవతా వాల్మీకినా ధాత్రీకర్మవస్తుతః పరిగృహ్య పోషితౌ పరిరక్షితౌ, వృత్తచూడౌ చ, త్రయీవర్జ మితరా విద్యా స్సావధానేన పాఠితౌ. సమనన్తరం చ గర్భైకాదశే వర్షే క్షాత్త్రేణ కల్పే నోపనీయ త్రయీవిద్యా మధ్యాపితౌ. న హ్యేతాభ్యా మతిప్రదీప్తప్రజ్ఞామేధాభ్యా మస్మదాదే స్సహాధ్యయనయోగోఽస్తి. యతః.

శ్లో॥ వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే;
న హి ఖలు తయో ర్జ్ఞానే శక్తిం కరో త్యపహన్తి వా;
భవతి చ తయో ర్భూయా న్భేదః ఫలం ప్రతి; తద్యథా,
ప్రభవతి శుచి ర్బిమ్బగ్రాహే మణి ర్న మృదాం చయః. ౪

---

ధాత్రీకర్మవస్తుతః పరిగృహ్య = దాదిపని మొదలుకొని తానేపూనుకొని - అతిప్రదీప్త ప్రజ్ఞామేధాభ్యాం = మిక్కిలి ప్రకాశించు ప్రజ్ఞయు మేధయుగల వారితో - ప్రజ్ఞా - నేర్పినదానిని గ్రహించుశక్తి. మేధా - గ్రహించినదానిని ధారణ చేయుశక్తి. సావధానేన - వారికి ఒకమాఱు చెప్పినం జాలునుగదా - కావున. సహాధ్యయన యోగః=కూడి చదువుకొను యోగ్యత.

శ్లో. ౪. గురుః=గురువు, విద్యాం=విద్యను, ప్రాజ్ఞే యథా= ప్రజ్ఞాశాలియందు- ప్రజ్ఞాశాలికి అనుట - ఎట్లో. తథా ఏవ=అట్లే, జడే=(ప్రజ్ఞ లేని) మందునికిని, వితరతి=ఒసఁగును. తయోః=వారిరువురికిని, జ్ఞానే= నేర్చుకొనుటయందు, శక్తిం=సమర్థతను, న చ కరోతి ఖలు=కలిగింపఁడు గదా, న వా అపహన్తి ఖలు=తొలగింపఁడు గదా. ఫలంప్రతి=ఫలము విషయమున, అనఁగా తెలివియందు, తయోః = అయిరువురకు, భూయాన్ భేదః = మిక్కిలి భేదము, భవతి చ = కలుగుచున్నది. తత్ యథా = అది యెట్లటన్న, శుచిః = (మసకలేని) పరిశుద్ధమైన, మణిః = రత్నము, బిమ్బగ్రాహే=ప్రతిబింబమును - నీడను - గ్రహించుటయందు, ప్రభవతి=శక్తి కల దగను, మృదాం చయః=మట్టిముద్ద, న (ప్రభవతి) = (శక్తికలది) కాదు.

వన—అయమ సా వధ్యయనప్రత్యూహః?

ఆత్రేయీ—అపరశ్చ.

వన—అథాపరః కః?

ఆత్రేయీ—అథ స బ్రహ్మర్షి రేకదా మధ్యందినసమయే నదీం తమసా మనుప్రపన్నః. తత్రచ యుగ్మచారిణోః క్రౌఞ్చయో రేకం వ్యాధేన విధ్యమాన మపశ్యత్. ఆకస్మిక ప్రత్యవభాసాఞ్చ దేవీం వాచ మవ్యతికీర్ణా మనుష్టుభేన ఛన్దసా పరిచ్ఛిన్నా మభ్యుదైరయత్.

---

గురువు ఒక తెఱంగుననే చుఱుకైనవానికిని, మొద్దుగానికిని విద్య నేర్పును. నేర్చుకొనుటకు ఒకనికి తా శక్తి నీయఁడు, ఒకనికి మాన్పఁడు. మఱి ఫలముంబట్టి చూడ, తెలివిలో ఇరువురకు మిక్కిలి భేదము. అది యెట్లనఁగా - నిర్మలమైన మణిలో నీడ (= ప్రతింబము) చొచ్చును; మట్టిముద్దలో చొందుగదా.

కాళిదాసు సైతము చెప్పినాఁడు - చూ - మాళ. - I.

పాత్రవిశేషే న్యస్తం గుణాన్తరం వ్రజతి శిల్ప మాధాతుః.

జల మివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య.

రఘువునను - III - 29 - క్రియా హి వస్తూపహితా ప్రసీదతి.' క్రియా=శిక్షా - సంశీవని. కౌటిల్యుఁడును - క్రియా హి ద్రవ్యం వినయతి, న అద్రవ్యం, అని.

అయం అసౌ...ప్రత్యూహః - ఇదియా ఆ యభ్యంతరము అని కాకువుచే ప్రశ్న, కాదా అంగీకారము. బ్రహ్మర్షి=బ్రాహ్మణుఁడైన ఋషి. యుగ్మచారిణోః= కలయికలోనున్నవైన, క్రౌఞ్చయోః=కొంగదంపతులలో, వ్యాధేన విధ్యమానమ్= బోయవానిచే ఏయఁబడుచున్నదానిని - అనఁగా - బోయఏయుటను. ఆకస్మిక ప్రత్యవ భాసాం=ఆకస్మికముగా (కారణములేక తనంతట) స్ఫురించినట్టిది. దేవీం వాచం=వాగ్దేవిని - ఆమె తానే ఈ శ్లోకరూపమున తోఁచినదని - ఇట్లు దేవతగా నిర్దేశించుట. అవ్యతికీర్ణాం=సంకీర్ణ గాక, విడివిడిగా నున్నట్టివానిని - అక్షరములు చెవరక అన్నియుకలసి మొత్తముగా ఏర్పడియున్నదానిని. అనుష్టుప్ఛన్దసా పరిచ్ఛిన్నాం - పా - పరిణతాం=అనుష్టుప్ఛందస్సున కుదురుకొన్నదానిని - తానే కుదురుకొన్నది, ఆయనచే కుదుర్పఁబడలేదు. కావుననే ఆశ్చర్యపడి అక్కఱతో దానిం బరికించుట

శ్లో॥ "మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌఞ్చమిథునా దేక మవధీః కామమోహితమ్" ఇతి. ని

వన—చిత్ర! మామ్నాయాదన్యో నూతన శ్ఛన్దసా మవతారః!

ఆత్రేయీ—తేన ఖలు పున స్సమయేన తం భగవన్త మావిర్భూత శబ్దబ్రహ్మప్రకాశ మృషి ముపగమ్య భగవాన్ భూతభావనః పద్మయోని రవోచత్, ఋషే, ప్రబుద్ధోఽసి వాగాత్మని బ్రహ్మణి, తద్ బ్రూహి రామచరితం, అవ్యాహత జ్యోతి

---

శ్లో. మా. నిషాద = ఓరిబోయ, త్వం = నీవు, శాశ్వతీః సమాః = పెక్కేండ్లు, ప్రతిష్ఠాం=మంచిస్థితిని, మా అగమః = పొందవు పోరా! యత్ = ఏలన, క్రౌఞ్చ మిథునాత్ = కొంగలజంటనుండి, కామమోహితమ్ = కామముచే - కామునివలన - ఒడలు తెలియక (ఆనంద) పరవశమైయున్న, ఏకం = ఒకదానిని, మగదానిని, అవధీః=చంపితివే!

ఓరిబోయవాఁడా, నీవు ఎప్పటికిని (కలకాలము) బాగుపడవు పోరా. మెయి మెయిఁగూడియున్న ఆకొంగజతలో, వలపుచే ఆనందమున మైమఱచియున్న యీ మగదానిని చంపితివిగదరా!

వాల్మీకిమనమున కొంగం జూడఁగాఁ గలిగిన శోకము ఇట్లు 'శ్లోక'రూపమును తనంతట పొందినది. 'శోకః శ్లోకత్వ మాగతః.' అట్లే రామాయణమున వాల్మీకి, రఘువున కాళిదాసును.

'శోకార్తే నాస్య శకునేః కి మిదం వ్యాహృతం మయా!
చిన్తయన్ స మహాప్రాజ్ఞ శ్చకార మతిమా న్మతిమ్.
పాదబద్ధోఽక్షరసమ స్తన్త్రీలయసమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా.'
రామా - బాల - II - 16 - 8.

నిషాదవిద్ధాణ్డజదర్శనోత్థః శ్లోకత్వ మాపద్యత యస్య శోకః
తేన సమయేన - ఆసమయమందు. [రఘు - XIV - 70.

ఆవిర్భూత శబ్దబ్రహ్మప్రకాశమ్ - శబ్దబ్రహ్మయొక్క వెలుఁగు తనయందు పొడమినవానిని - శబ్దజ్ఞానముయొక్క వెలుఁగు ఆయనయం దావిర్భవించినది. పద్మయోనిః- ఇది ఆయన పేరు. భూతభావనః - ఆయనకు విశేషణము - మహిమం దెలుపునది-భూతములను సృష్టించువాఁడు, సృష్టించినవానిని సరిగా, సప్రయోజనముగా, ఉంచువాఁడు. ఇక్కడ ఇపుడు వాల్మీకినోట శబ్దబ్రహ్మను పుట్టించినాఁడు. దానికి

రార్షం తే ప్రాతిభం చక్షుః. ఆద్యః కవిర సీ' త్యుక్త్వా అన్తర్హితః. అథ భగవాన్ ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణ స్తాదృశం వివర్తమితిహాసం రామాయణ మృషిః ప్రణినాయ.

వన—హన్త! పండిత స్సంసారః!

ఆత్రేయీ—తస్మా దవోచం మహా నధ్యయనప్రత్యూహ ఇతి.

వన—యుజ్యతే.

ఆత్రేయీ—విశ్రాన్తాస్మి భద్రే. సమ్ప్ర త్యగస్త్యాశ్రమస్య పన్థానం బ్రూహి.

వన—ఇతః పఞ్చవటీ మనుప్రవిశ్య గమ్యతా మనేన గోదావరీ తీరేణ.

ఆత్రేయీ—(సబాష్పం) అ ప్యేత త్తపోవనం? అ ప్యేషా పఞ్చవటీ? అపి సరి దియం గోదావరీ? అ ప్యయం గిరిః ప్రస్రవణః? అపి జనస్థానవనదేవతా వాసన్తీ త్వం?

వాసంతీ—అ స్త్యేత త్సర్వం.

---

ప్రయోజనమును జూపుటకై - 'బ్రూహి రామచరితమ్' - అని ఉపదేశించుటకై వచ్చినాఁడు. 'అవ్యాహతజ్యోతిః - ముక్కవోని వెలుతురుగలది-' అది పాఱనిచోటు ఉండదు అనుట. ఆర్షం - ఋషయః సత్యవచసః - సత్యమును, ఉన్నది ఉన్నట్టు, జరిగినది జరిగినట్లు, కనంజాలినది. ప్రాతిభం చక్షుః - ప్రతిభాచక్షుస్సు - 'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా, యదనుప్రాణనా జ్జీవేద్వర్ణనానిపుణః కవిః' అని. 'ప్రతిభా అపూర్వవస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా' అని అభినవగుప్తుఁడు. ప్రబుద్ధోఽసి...జ్ఞాని వైతివి - వశ్యవాక్కువును. వివర్తం = పరిణామమును, మార్పును, పణ్డితః సంసారః-సంసారము పాండితికలదైనది. పాణ్డితీమణ్డితః అనియు పాఠము. పాండిత్యముచే అలంకరింపఁబడినది. ఇది గీర్వాణమున ఆదికావ్యప్రశంస.

తస్మాత్ = అందువలన, ప్రత్యూహః = విఘ్నము - ఆయన పాఠము చెప్పుట మానివేసి కవిత్వములో దిగినాఁడు. ఒకవేళ చెప్పినపుడు వారిని కూర్చుండఁ బెట్టుకొని చెప్పుటచే, నాబోంట్లకు పాఠము అందుటయు లేదు.

అనేన గోదావరీ తీరేణ - ఈ గోదావరితటముననే - దండకలో పంచవటి, గోదావరీతటము అగస్త్యాశ్రమము అని దారివరుస.

అప్యేతత్ - అపిః ప్రశ్నే.

అస్త్యేతత్ సర్వమ్=సర్వమును అట్లే.

ఆత్రేయీ—వత్సే జానకి!

శ్లో॥ స ఏష తే వల్లభ బన్ధువర్గః,
ప్రాసఙ్గికీనాం విషయః కథానా
న్త్వాం నామశేషా మపి దృశ్యమానః
ప్రత్యక్షదృశ్యా మివ నః కరోతి. ౬

---

శ్లో. ౬. ఏషః - ఇదిగో ఇది. తే - నీయొక్క, స వల్లభ బన్ధువర్గః = ఆ ప్రియ బంధువులసమితి; (ఇదియే) ప్రాసఙ్గికీనాం = ప్రసంగవశమున (మేము) చెప్పికొను, కథానాం = కథలకు - ఉబుసున ప్రస్తావవశమున చెప్పికొనువానికి, విషయః=విషయ మైనది - వీనింగూర్చిన కథలతోనే మేము ఉబుసు పుచ్చుకొందుము. నామశేషాం అపి = పేరుమాత్రమే మిగిలిపోయినదాని నైనను - చనిపోయినదాని నైనను, త్వాం = నిన్ను, దృశ్యమానః = ఇది యిపుడు చూడఁబడుచున్నదై, ఇది యిపుడు కనుల కగపడుచున్నదై, నః = నాకు, ప్రత్యక్షదృశ్యాం ఇవ = ప్రత్యక్షముగ అగపడు చున్న దానివలె, కరోతి=చేయుచున్నది.

ఆత్రేయికి వాల్మీక్యాశ్రమమున రామాయణమును వినుచున్నదానికి, ఆ విను కలిచేతనే సీతయం దతిమాత్రవాత్సల్యభావన కలిగెను. సీతయు సీతకథలును అడుగడుగున ఆ యాశ్రమమున ప్రస్తావమునం దుండెను. పంచవటీ గోదావరీ తపోవన ప్రస్రవణగిరులును వాసంతియు, అచటి వానినడిమి సీతవృత్తమును ప్రతి దిన మెంతతూరియైనను స్మరణకు వచ్చునవే. ఆమెకు వానియం దెంతయో కూరిమికదా. ఇపు డీ సన్నివేశము కన్నులంజూడఁగా ఆత్రేయికి సీతయు కన్ను లకుం గొడగట్టునట్లైనది. మఱి అడుగఁదగును - ఆత్రేయికి సీత రామాయణ కథలు విని తాను తలపోసికొను తలంపులోనిదే కాని ఎన్నఁడును ప్రత్యక్ష దృష్ట కాదుగదా. దానచే తనకు ఇట్టి మానసిక సీతాస్నేహము. సీతను ఒంటరిగా లక్ష్మణుఁడు అడవిలో విడిచి పోవుటవఱకు వాల్మీకి రచించినాఁడని లవుఁడు చెప్పును గదా - మా. IV. తరువాత సీతవృత్తాంతము ఆత్రేయికి తెలియదు. ఆమె సీత నామశేషయాయెనని తలంచినది. దుఃఖించినది. దుఃఖించుచున్నది. తరువాతి యయోధ్యవృత్తాంతము - రాముఁడు ఇపు డేమి చేయుచుండుటయు అశ్వమేధము తొడంగుట మొదలైనదియు అట్లే బ్రాహ్మణబాలుని వృత్తాంతమును ఆత్రేయికి ఎట్లు తెలియును, వాసంతి ఆత్రేయిని అడుగుచున్నదే - అని. వసిష్ఠారుంధతీ కౌస ల్యాదులు ఋశ్యశృంగాశ్రమమునుండి వచ్చి వాల్మీకియాశ్రమముచెంత చేరినారు. కావున వారు విని చెప్పుకొను నయోధ్యవృత్తాంతము వాల్మీకియాశ్రమమున వ్యాప్తిపొందియుండఁదగును. కాన అదియు అట్లు ఆత్రేయికి తెలియఁబోలును,

వాసన్తీ—(సభయమ్, స్వగతమ్)—కథం! నామశేషా మిత్యాహ! (ప్రకాశమ్) ఆర్యే, కి మత్యాహితం సీతాదేవ్యాః?

ఆత్రేయీ—న కేవల మత్యాహితం, సాపవాదం చ.

(కర్ణే ఏవ మివ.)

వాసన్తీ—అహహ! దారుణో దైవనిర్ఘాతః! (మూర్ఛతి.)

ఆత్రేయీ—భద్రే సమాశ్వసిహి సమాశ్వసిహి.

వాసన్తీ—హా! ప్రియసఖి మహాభాగే! ఈదృశ స్తే నిర్మాణ భాగః! రామభద్ర! రామభద్ర! అథవా అలం త్వయా! ఆర్యే ఆత్రేయి, అస్మా దరణ్యా త్పరిత్యజ్య వినివృత్తే లక్ష్మణే సీతాయాః కిం వృత్త మితి కాచి దస్తి ప్రవృత్తిః?

ఆత్రేయీ—నహి నహి.

వాసన్తీ—ఆః కష్టమ్! అరున్ధతీ వసిష్ఠాధిష్ఠి తేషు రఘుకుటుమ్బ కేషు, జీవ న్తీషు చ వృద్ధాసు రాజ్ఞీషు, కథ మిదం జాతమ్?

IV. వ అంకమున 'భోభోః సైనికాః, ఏష ఖలు కుమారచన్ద్రకేతుః ఆజ్ఞాపయతి' అన్న భాషితము వినఁబడఁగానే అరుంధతీజనకులు 'అయే మేధ్యాశ్వరక్షా ప్రసఙ్గాత్' అని అశ్వమేధారంభమును తామెఱిఁగినట్లు పలుకుదురు. వారివలన అయోధ్యారామవృత్తాంతములు వాల్మీకి యాశ్రమమున వ్యాపించియుండఁదగును. చూ. ఉపో. పు. 72-అంతాన.

వాసంతికి సీత జనస్థానమందున్నదినాలలో ఆమెయెడ ఇంతంతనరాని ప్రీతి స్నేహములు కలిగియుండెను. కావున 'సభయమ్'-సీత నామశేషయైనందులకు ఆమెకు దుఃఖభయములు కలిగినవి. అత్యాహితం=మహాపద. కర్ణే ఏవ మివ-ఆత్రేయి వాసంతికి చెవిలో చెప్పను. మఱి ఆయపవాదము ఏమనియో, నోట నుచ్చరింప రానిదానిని సీతను దేవతగానే ఆరాధించుచున్న మహాకవి ఈ నాటకమున ఎందును ఎవరిచేతను పలుకనీఁడుగదా. అట్లు మెలఁకువతో కడవఱకును నిర్వ హించినాఁడు. దైవనిర్ఘాతః-దైవమే అను, కాదా దైవమువలని, పిడుగు, నిర్ఘా తము వాయుసంహతివిశేషము. ఇది నిజముగా సీతకు తగులఁదగినది గాదు!

నిర్మాణభాగః-జన్మయొక్క భాగధేయము-భాగ్యము అనుట. అలం త్వయా-నీతో నేమి? అరణ్యాత్ పరిత్యజ్య నివృత్తే-ఇది వృత్తకథాంశ నిర్దేశమునకు.

రఘుకుటుమ్బకేషు - రఘుకుటుంబమునందు - 'కదమ్బకేషు' - ఇది అంత శ్లాఘ్యపాఠము గాదు. వృద్ధాసు రాజ్ఞీషు-వృద్ధలు రాణులు-కౌసల్యాదులు గర్భిణి

ఆత్రేయీ—ఋష్యశృఙ్గాశ్రమే గురుజన స్తదాసీత్. సంప్రతి పరిసమాప్తం ద్వాదశవార్షికం సత్రం, ఋశ్యశృఙ్గేణ విసర్జితాః సంపూజ్య గురవః. తతో భగవ త్యరుంధతీ 'నాహం వధూవిరహితా మయోధ్యాం గమిష్యా' మి త్యాహ. త దేవ రామ మాతృభి రనుమోదితం. తదనురోధా ద్భగవతో వసిష్ఠస్య సుపరిశుద్ధా వాచః యథా-''వాల్మీకి తపోవనం గత్వా తత్ర వత్స్యామ'' ఇతి.

వాసన్తీ—అథ స రాజా కిమాచార స్సమ్ప్రతి?

గానున్న సీతకు ఇట్లు గావించుట కూడదని చెప్పఁదగిన పెద్దలు-మగనికి చిన్నవానికి అట్లు కోపమువచ్చినను బుద్ధులు చెప్పి మాన్పఁదగినవారు, మాన్పవలసినవారు, ముఖ్యముగా వృద్ధస్త్రీలు, కావున, విసర్జితాః-అంపకముచేయఁబడినారు. తద్ద్వాదశవార్షికంసత్రమ్-దీనిచే ప్రథమాంకమునకును ఇప్పటికిని పండ్రెండేండ్లయెడము కలిగినది అనుట. ఇన్నాళ్ళు రామునికి సీతావిరహమును, సీతకు రామవిరహమును; సీతకొమాళ్ళకు ఇప్పటికిని ఇంతవయసు. అరుంధతిరాణులు అప్పుడే సీతాస్నేహమువలని దుఃఖవశమునను కోపవశమునను అయోధ్యకుం బోకూడదని నిశ్చయించుకొన్నారు. వారు వాల్మీకితపోవనము చేరినందున ఈవృత్తాంతము ఆత్రేయికి తెలియవచ్చెను. వాల్మీకితపోవనమున కేల? అది రాముని యయోధ్యకు దూరమగుటచేతను, వాల్మీకిసాన్నిధ్యము పవిత్రము గొప్పది అగుటచేతను చిత్తశాంత్యాపాదకమగును అని పైకి. అరుంధతీ వసిష్ఠులకు ఇంకను అపరోక్షభవద్భావిదర్శన మున్నందున, సీతా పునఃసంయోగ సన్నివేశము అట కావఁగూడునని లోపలికిం గాఁబోలును. దీనిచే వసిష్ఠులవారు ఋశ్యశృంగాశ్రమమునకు పోవుటకుముందు అయోధ్యలో రామునికడ నుండిరని తెలియును. వసిష్ఠులయభిప్రాయమేమన ఎట్లును సీతయెడ, అపవాదమునకు అవకాశ ముండకూడదని-దానిని తొలఁగింపవలెనని, సీతాప్రేమచేత అరుంధత్యాదులు అయోధ్యకు పోనొల్లమి. సీత యపవాదము ఆత్రేయి రెుఱుఁగును. జనకుఁడు ఎఱుఁగును. అదియే వసిష్ఠుల కోరిక. అది లోకమంతయు ఎఱుంగవలయునని. ఒక్కమ్మడి అడంగవలయునని.

కిమాచారః-ఏమి యాచరించుచున్నవాఁడు? ఇట్లు ఆత్రేయి నడుగుటకు ఇప్పటి రామునియాచారము ఆమె కెట్లు ఎఱుక? వాసంతికి రామునియెడ ఎంత స్నేహము! ముందు 'రామభద్ర' అని నోట నెట్టుకొనివచ్చినదికదా? ఇప్పుడు కోపముచే అతని రాచతికమును దెప్పుచు 'రాజా' అని నిస్స్నేహముగా పలుకుచున్నది. 'కిమాచారః'-అంత దొడ్డరాజు గొప్పపనులు పూనుకొనక అలంతులఁ గాలము గడ

ఆత్రేయీ—తేన రాజ్ఞా క్రతు రశ్వమేధః ప్రక్రాంతః.

వాసన్తీ—హా ధి క్పరిణీత మపి!

ఆత్రేయీ—శాన్తమ్! శాన్తమ్! నహి, నహి.

వాసన్తీ—కా తర్హి యజ్ఞే సహధర్మచారిణీ?

ఆత్రేయీ—హిరణ్మయీ సీతాప్రతికృతిః.

వాసన్తీ—హన్త భోః.

శ్లో॥ వజ్రా దపి కఠోరాణి మృదూని కుసుమా దపి,
లోకోత్తరాణాం చేతాంసి; కోను విజ్ఞాతు మర్హతి? 2

---

పఁడుగదా అని ప్రశ్న. రాముఁడు యజ్ఞముం దొడంగినాఁడనుట ఒకవేళ వాల్మీక్యాది మహర్షుల తపోవనములకుం దెలుపఁదగినదై తెలుపఁబడినది అని యనుకొందమన్నను, బ్రాహ్మణపుత్రమృత్యాద్యాది అచటికి ఎట్లు తెలియవచ్చును ఆత్రేయి యెఱుంగుటకు? ఇది చోద్యము. ఒకవేళ రాముని తల్లులును వసిష్ఠారుంధతులును ఎందున్నను, అక్కడికిని అయోధ్యకును 'దూతల' రాకపోకలు కలవని తలంపఁదగునా? అట్లుగాదు. చూ. ఉపో. పు. 72-అంతాన-

పరిణీత మపి- పెండ్లికూడ చేసికొన్నాఁడా? ఇట్లడుగుట యేల యన, భార్యాసహచరితుఁడు గాక యజ్ఞమును, విశేషముగా అశ్వమేధమును, చేయరాదు గావున.

హిరణ్మయీ సీతాప్రతికృతిః - బంగారపు సీతాప్రతిమ. సీతాస్నేహము వీడరాకయున్నది. "స్నేహా నాహుః కిమపి విరహే ధ్వంసిన స్తే త్వభోగా। దిష్టే వస్తు న్యుపచితరసాః ప్రేమరాశీభవన్తి"-అన్నట్లు ఉపచితరస మగుట మాత్రము గాదు. సీతను మానలేక తాను గావించిన ఘోరాపకారానుశయముచే సీతాస్నేహము ఆ దుఃఖముచే మఱియు గాఢముగా నున్నది.

శ్లో. 2. వజ్రాదపి-ఇత్యాది-వజ్రాత్ అపి=(కాఠిన్యమునకు పేరుగన్న) వజ్రమున కంటెను. కఠోరాణి = కఠినములును, కుసుమాత్ అపి = పూవునకంటెను, మృదూని=కోమలములును ఐన, లోకోత్తరాణాం=విఖ్యాతిగులౌ పురుషులయొక్క, చేతాంసి=మనములను, కో ను=అరయగా (=నిజముగా)ఎవరు, విజ్ఞాతుం అర్హతి= ఎఱుంగఁగలరు?

గొప్పవారు (ధర్మానుష్ఠానమునకై) అంతలో చిత్తమున అంతులేని కాఠిన్యమును వహింతురు, (అందులకయ్యే) అంత కనికరముం దాల్తురు. వారి మనస్సు ఇట్టిదని నిశ్చయింప నెవరితరమౌను?

ఆత్రేయీ—విసృష్టశ్చ వామదేవాభిమన్త్రితో మేధ్యాశ్వః. ప్రక్లృప్తాశ్చ యథాశాస్త్రం రక్షితారః. తేషా మధిష్ఠాతా చ లక్ష్మణాత్మజ శ్చన్ద్రకేతుః అవాప్తదివ్యాస్త్రసమ్ప్రదాయ స్తురఙ్గబలాన్వితః ప్రహితః.

వాసన్తీ—(సస్నేహకౌతుకాస్రమ్) కుమారలక్ష్మణస్యాపి పుత్రః! హన్త! మాతః! జీవామి!

ఆత్రేయీ—అత్రాన్తరే బ్రాహ్మణేన మృతం పుత్రమారోప్య రాజద్వారి, సోరస్తాడ మబ్రహ్మణ్య ముద్ఘోషితమ్. తతో "న

---

ఇట్లు చేతముల యీ భేదమును ఎవరు కనిపట్టఁగలరు? ఇట్లు ఎవరు చెప్పఁగలరు - భవభూతికాక! శాకుంతలమున జాలరివాని మాటలలో ఇట్టి యుక్తి కలదు- 'పశుమారణకర్మదారుణో౽నుకమ్పామృదు రేవ శ్రోత్రియః.' అని. అట్లే భర్తృహరియు-'సమ్పత్సు మహతాం చిత్తం భవ త్యుత్పలకోమలమ్; ఆపత్సు చ మహాశైలశిలాసఙ్ఘాతకర్కశమ్.' ఇట పావిత్రకీర్తినాశనము ఆపద.

వామదేవాభిమన్త్రితః - వసిష్ఠులవారు లేనందున వామదేవుఁడు పురోహితుఁడైనాఁడు.

యథాశాస్త్రం - యథావిధిగా - విధియు - 'యదమిత్రా అశ్వం విన్దేరన్ హన్యేత తస్య యజ్ఞః, చతుఃశతా రక్షన్తి యజ్ఞస్యాఘాతాయ' అని. తురఙ్గబలాన్వితః - గుఱ్ఱపుదండుతోఁ గూడుకొన్నవాఁడు. 'చతురఙ్గబలాన్వితః' అను పాఠమును అసాధువు గాదు. ఇఁక ముందు గుఱ్ఱపుదండే కాక రథగజములును చెప్పఁబడును. చూ. V-౫.

సస్నేహకౌతుకాస్రమ్ - వాసంతికి అంత లక్ష్మణస్నేహము! మునుపు అట్లు అన్నియు మానుకొని రామసేవకు అడవులకు, జనస్థానమునకు వచ్చియుండెను గదా! అస్రము సంతోషాతిశయముచేత. అంత సంతోషము పుత్రప్రాప్తివలన మునుపు హిందువునకు!

అబ్రహ్మణ్యమ్ - 'కావరయ్యా కావరయ్యా' అను కుయి. 'అబ్రహ్మణ్య మవధ్యోక్తౌ' అను. ఆకుయికి సంకేతమగు మాట.

రాజాపచారం అన్తరేణ = వినా రాజదోషం - రాజు చేసినదోషము లేక. అయ్యో! ఏమిచేసినాఁడనో గదా నేను ఇది కలుగుటకు అని. చూ - రఘు XV-

రాజాపచార మన్తరేణ ప్రజా స్వకాలమృత్యూ శ్చరతీ" త్యాత్మ దోషం నిరూపయతి కరుణామయే రామభద్రే, సహసై వాశరీరిణీ వా గుదచరత్.

---

43. శోచనీయాసి వసుధే యా త్వం దశరా చ్చ్యుతా
రామహ స్త మనుప్రాప్య కష్టాత్ కష్టతరం గతా.

44. శ్రుత్వా తస్య శుచో హేతుం గోప్తా జిహ్రాయ రాఘవః
న హ్యకాలభవో మృత్యు రిక్ష్వాకుపద మస్పృశత్.

'జిహ్రాయ - లజ్జితః' - సంజీవని.

..................................

47. రాజ న్ప్రజాసు తే కశ్చి దపచారః ప్రవర్తతే
త మన్విష్య ప్రశమయే ర్భవితాసి తతః కృతీ.

'రాజాపచార'మన్నమాట కూడ దీన సమర్పితమే భవభూతికి.

రామా. ఉ.కాం.73 స - 18.

'సువ్యక్తం రాజదోషో ఽయం భవిష్యతి న సంశయః
పురే జనపదే వాపి తతో బాలవధో హ్యయం.'

రాముఁడే ఇందు తన యపచారముఁ దడవుకొన్నాఁడని చెప్పుటచే భవభూతి రాముని కరుణామయతను ధర్మధురంధరతను సూచించినాఁడు. 'రామస్య గాత్ర మసి,...కరుణా కుత స్తే?' అని రాముఁడే పలుకును II - 1.

అశరీరిణీ వాక్ ఉదచరత్ - అశరీరవాక్కు వెలువడినది - వినఁబడినది. ఇట్లు సమయాన అశరీరవాక్కు వినంబడుటయు రామమహిమస్ఫోరకమే. మిన్నును మింట దేవతలును రామునికి సాయపడుదురు. చూ. రఘు - XV

46. అత్ర శస్త్ర స్త దధ్యాస్య ప్రస్థితః స రఘూద్వహః
ఉచ్చచార పుర స్తస్య గూఢరూపా సరస్వతీ

47. రాజన్ ప్రజాసు తే కశ్చి దపచారః ప్రవర్తతే
తమన్విష్య ప్రశమయే ర్భవితాసి తతః కృతీ.

50. ఆత్మానం శమ్బుకం నామ శూద్రం సురపదార్థినం

.............................................

51. శిర శ్ఛేద్యం పరిచ్ఛిద్య నియన్తా శస్త్రమాదదే.

.............................................

53. కృతదణ్డః స్వయం రాజ్ఞా లేభే శూద్రః సతాం గతిం,
తపసాదుశ్చరేణాపి న స్వమార్గ విలఙ్ఘినా.

శ్లో॥ శమ్బూకో నామ వృషలః పృథివ్యాం తప్యతే తపః,
శీర్షచ్ఛేద్య స్స తే రామ, తం హత్వా జీవయ ద్విజమ్. ౮

ఇ త్యుపశ్రుత్య కృపాణపాణి ర్విమాన మారుహ్య సర్వా దిశో విదిశశ్చ శూద్రతాపసాన్వేషణాయ జగత్పతి శ్చరితు మారబ్ధవాన్.

వాస న్తీ—శమ్బూకో నామ ధూమపోఽస్మిన్నేవ జనస్థానే తప శ్చరతి. త దపినామ రామభద్రః పున రిదం వన మలఙ్కుర్యాత్ ?

ఆత్రేయీ—భద్రే. గమ్యతేఽధునా.

వాస న్తీ—ఏవ మస్తు, కఠోరీభూత స్తు దివసః. తథాహి-

---

శ్లో. ౮. శమ్బూకః నామ వృషలః = శంబూకుఁడను పేరి శూద్రుఁడు, పృథివ్యాం = ధరణియందు, తపః తప్యతే=తపస్సు చేయుచున్నాఁడు. రామ = ఓ రాముఁడా, సః=అతఁడు, తే=నీకు-నీచేత అనుట. శీర్షచ్ఛేద్యః=తలఁద్రెంపఁగా వలసినవాఁడు. తం హత్వా = వానిని చంపి, ద్విజం జీవయ = బ్రాహ్మణుని బ్రదికింపుము.

శంబూకుఁడను పేరి శూద్రుఁడు పృథివియందు తపస్సు చేయుచున్నాఁడు. శూద్రుఁడన్నచో తపస్సు చేయదగనివాఁడు. కావున దండ్యుఁడు వాఁడు; రామ, రాజవగు నీచే తలత్రెంపఁబడవలసినవాఁడు. వానిం జంపి, బ్రాహ్మణబాలుని బ్రదికింపవయ్యా. ఇది నీరాజధర్మము.

పృథివ్యాం - ఈ సర్వభూమియు రామరాజ్యము. ఇందు అధర్మము ఎందున్నను దానిని రాముఁడు దండింపఁదగును. 'వృషం లాతీతి వృషలః' అని సాభిప్రాయము, ధర్మము చెఱుచువాఁడు అని. 'ధూమపః' - ఇది మిక్కిలియు తామస తపస్సు.

అపి నామ...అలఙ్కుర్యాత్ - అలంకరించునా? 'నామ' సంభావనం దెలుపును. అట్లు అలంకరించుట తనకు ఆసఁగొనఁదగిన దనుట. ఆ ట్లాయన అలంకరించుటకు నేను ఉవ్విళులూరుదును అనుట. కఠోరీభూతః=ముదిరినది. మట్టమధ్యాహ్నము కఠోరము, తర్వాత ప్రొద్దువాలుకొలఁది కఠోరత తగ్గును.

శ్లో॥ కణ్డూల ద్విప గణ్డపిణ్డ కష ణోత్కమ్పేన సమ్పాతిభిర్
ఘర్మస్రంసితబన్ధనైః స్వకుసుమై రర్చన్తి గోదావరీం,
ఛాయాపస్కిరమాణ విష్కిర ముఖ వ్యాకృష్ట కీటత్వచః
కూజత్క్లాన్తకపోతకుక్కుటకులాః కూలే కులాయద్రుమాః.

(పరిక్రమ్య నిష్క్రాన్తే)

ఇతి శుద్ధవిష్కమ్భః

---

౯. శ్లో. కణ్డూ లేత్యాది-కూలే=(గోదావరీ) తీరమందు, కులాయద్రుమాః= పక్షులగూండ్లుగలచెట్లు, ఘర్మ స్రంసిత బన్ధనైః = వెట్టచే పట్టువదలిన తొడిమలు గలవై, కణ్డూలద్విప...మ్పేన కణ్డూల = దురదగొన్న - ద్విప గణ్డపిణ్డ = ఏనుఁగుల చెక్కిటి గుండ్లయొక్క - కషణ = ఒరయికచేత-సంపాతిభిః = రాలుచున్న, స్వకుసుమైః = తమపూలతో, గోదావరీం = గోదావరిని, అర్చన్తి = పూజించుచున్నవి. (మఱియు)ఛాయాఽపస్కిర...చః-ఛాయా=(తమ) నీడయందు-అపస్కిరమాణ= కెక్కిరించుచున్నవైన-విష్కిర = పక్షులయొక్క-ముఖ=ముక్కుతో - వ్యాకృష్ట= లాఁగఁబడిన-కీటత్వచః=కీటకములు గల బెరడులు గలిగియున్నవి. కూజత్ క్లాన్త... కులాః-కూజత్=కూయుచున్న, క్లాన్త=(ఎండకు) బడలిన-కపోత=పావురాలయు,- కుక్కుట=కోళ్ళయు, కులాః=గుంపులుగలిగియున్నవి.

ఇపుడు మట్టమధ్యాహ్న మయినది. ఏనుఁగులు తాపశాంతికై తీరవృక్షముల నీడలకు వచ్చి, దురదగొన్న తమ చెక్కిటిగుండ్లను, దురద తీఱ, చెట్లకు రాచుకొనుచున్నవి. ఆయదరునకు ఎండవెట్టకు తొడిమలు సడలిపోయిన పూవులు గోదావరిలో రాలుటం జూడఁగా, గోదావరిని ఆచెట్లు తమపూలు చల్లి పూజించుచున్నవా యన్నట్లు లున్నది. ఆ నీడలో పక్షులు గుంపులు కూడి ఆ చెట్లబెరడుల సందులలో ఇట్టటులా పురుగులను ముక్కులతో లాఁగికొని తినుచున్నవి. పావురాలు కోళ్ళు (మొదలైనవి) ఎండవడకు బడలి తమ గూళ్ళుచేరి (హాయిగా) కూయుచున్నవి.

ఇతి - ముగిసినది.

శుద్ధ విష్కమ్భః.

వృత్త వర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః
సంక్షేపార్థ స్తు విష్కమ్భో మధ్యపాత్ర ప్రయోజితః
ఏకానేకకృతః శుద్ధః; సఙ్కీర్ణో నీచమధ్యమైః.

అని దశరూపకము. ఇందు ఇరువురును ఆత్రేయీవాసంతులు సంస్కృతము భాషించువారు మధ్యపాత్రలు - కావున ఇది శుద్ధవిష్కంభము. ఇందు కుశలవులు అరుంధతీ వసిష్ఠ కౌసల్యాదులు, రాముఁడు మొదలైనవారి వృత్తములును, శంబూక వధాదివర్తిష్యమాణములును అగు కథాంశములు సంక్షిప్తముగా సూచింపఁబడినవి. విష్కంభము నాటకమున అర్థోపక్షేపకములలో నొకటి. ఏ యర్థములు అంకమున కెక్కనంతటివి కావో, మఱి వేనిజ్ఞానము కథాగ్రహణమునకు అవశ్యకమో అట్టివి ఇట్టివానిలో చెప్పఁబడును.



# ఉత్తరరామచరితనాటకమ్

## ద్వితీయాఙ్కః

(తతః ప్రవిశతి సదయోద్యతఖడ్గో రామభద్రః)

రామః—

శ్లో॥ రే హస్త దక్షిణ, మృతస్య శిశోర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణం;
రామస్య గాత్ర మసి, దుర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుతస్తే? ౧

సదయోద్యతఖడ్గః = దయతోడ కత్తిని చేత పూనినవాఁడై - దయ యేల యన శూద్రుఁడు సాధువు, తాపసుఁడై కడిది తపస్సు చేయుచున్నవాఁడు. అది ధర్మశాస్త్రముబడి తప్పు అగును గాని అతని ఖలత్వము గాదు. వానిం జంపుట ధర్మముం బ్రతిష్ఠించుటకు; అచావుచే ఈ సంజీవనము అని పెద్దలు చెప్పియున్నం దున. కావున ఇట్లు చంపఁబూనుట. చేయి ఆడకయున్నందున దానికి అవష్టం భముం గొలుపుచున్నాఁడు-రేహస్త-అని.

శ్లో. ౧. రేహస్త ఇత్యాది - రే హస్త దక్షిణ = ఓరి కుడి కరమ, ద్విజస్య మృతస్య శిశోః= బ్రాహ్మణుని చనిపోయిన బాలునియొక్క, జీవాతవే= బ్రదికించు టకై, శూద్రమునౌ = శూద్రజాతియైన (యీ) మునిమీఁద, కృపాణమ్ = కత్తిని, విసృజ= విడువుము. దుర్భరగర్భఖిన్న సీతావివాసనపటోః= మోయరాకున్న (నిండు) చూలుచే మిక్కిలియు ఓపనిదైన సీతను తఱిమిన కూళయైన - కఠినాత్ముఁడైన, రామస్య= రామునియొక్క, గాత్రం అసి= అవయవ మగుదువే, తే కరుణా కుతః= నీకు దయ ఎక్కడిది?

ఓరి కుడిచేయిగా, చచ్చిన యీ బాపనబాలుఁడు దీనం బ్రదుకునఁట, కావున ఈ శూద్రమునిపై కత్తిని వేయుము. నిండువేఁకటిచే ఇంచుకయు ఓపిక లేకున్న యాసీతను అడవులకుం దఱిమిన రాముని యవయవమవే! నీకు కరుణ ఎక్కడిది?

[కథంచి త్ప్రహృత్య] కృతం రామసదృశం కర్మ. అపి జీవేత్ స బ్రాహ్మణపుత్రః!

(ప్రవిశ్య) దివ్యపురుషః:—జయతు జయతు దేవః.

దక్షిణ-అనఁగా 'కుడి' యనుటకన్న మఱే యే విశేషార్థము గల్పించుటయు పనికిరాదు. వక్తయగు రామునినోట ఈ ప్రకరణమున అట్టిది శ్లేషాదిచమత్కారము, అయుక్తమగును, 'కుడి' అని యొకటే అర్థము. ఆ సంబోధన శక్తిని వైచుట దాని పనియగుటచేత. అంతియ. ద్విజబాలుని బ్రదికించుటకై ఈ క్రూరకార్యమును చేయుచున్నాఁడు. లోకులు ఆడికలు పలికినారని, పరిశుద్ధయని తా నెఱింగి నమ్మిన సీతను, అట్లు చీఁకటిలో బడలియున్నదానిని అడవులకుం దఱిమినవాఁడు. (ధర్మానుష్ఠానమునకును, ప్రజానురంజనమునకును అడ్డము వచ్చునేని) అతనికి కరుణ పాటించుట యెక్కడిది?

'ఇచట ద్విజశిశుజీవనమునకై మునియైనను శూద్రుఁడు వధ్యుఁడని రామునికి ఆత్మకర్మ నింద కాదు; కాని అనయకారియగు వానిం జంపుటకు రోత (జుగుప్స) పుట్టినది. అంతలో అది సీతాపరిత్యాగవిషయమగు జుగుప్సను స్మృతికి తెచ్చి అది అట్లుగానే మిక్కుటమై తిరముగొనుచున్నదని గ్రహింపఁదగును. శంబూకవిషయమున దానికి పుట్టుకమాత్రమే' అని కంఠాభరణమ్మున భోజదేవుఁడు. చీ, చీ, రాముఁడు ఇట్టి కూళ! అని.

'రామస్య గాత్ర మసి' 'రామసదృశం కర్మ'-అని రాముఁడు ఆత్మ నామగ్రహణము చేయుట నిరనుక్రోశతకు ప్రసిద్ధిగన్నవాఁడని అవివక్షితవాచ్యధ్వని.

కథఞ్చిత్ ప్రహృత్య-ఇది రంగాన ప్రకటముగాఁ జంపుట కాదు. ఇంకను శంబూకుఁడు ప్రవేశింపలేదు. నేపథ్యముననే యున్నాఁడు. కావున ఇది అంకాన ఆచార్యులచే ప్రదర్శననిషిద్ధమైన వధం జూపుట గాదు.

అపి జీవేత్ స బ్రాహ్మణపుత్రః-ఆ బ్రాహ్మణ పుత్రుఁడు బ్రదుకును గాక. ప్రశ్న కాదు. (ప్రవిశ్య) జయతు జయతు దేవః-ఇది రాముని 'అపి జీవేత్'కు జవాబుగా వినంబడిన 'ఉపశ్రుతి'ంబోనిది. అది యట్లే జయించును, ఉత్కర్ష కలిగి వర్తించును అనుట. అనఁగా సంజీవనాదులగు అన్నియు నెఱవేఱును. ఉత్కర్ష కలుగును అనుట.

శ్లో॥ దత్తాభయే త్వయి యమా దపి దణ్డధారే,
సఞ్జీవిత శ్శిశు రయం, మమ చేయ మృద్ధిః,
శమ్బూక ఏష, శిరసా చరణౌ నత స్తే;
సత్సఙ్గజాని నిధనా న్యపి తారయన్తి. ౨

రామః—ద్వయ మపి ప్రియం నః, త దనుభూయతా ముగ్రస్య తపసః ఫలమ్.

---

శ్లో. ౨. దత్తాభయేత్యాది. యమాత్ అపి=యమునివలనను, దత్తాభయే= అభయమిచ్చినవాఁడవై, త్వయి = నీవు, దణ్డధారే = దండమును (దండనమును) ధరించినవాఁడవు (పూనిన - చేసిన - వాఁడవు) కాఁగా, అసౌ శిశుః=ఈ (బాపన) నిసుఁగు, సఞ్జీవితః=బ్రదికింపఁబడినాఁడు. మమ చ=నాకును, ఇయం ఋద్ధిః=ఈ (ఇట్టి) శుభసంపద (కలిగినది.) శమ్బూకః ఏషః=వీఁడుగో (నేను) శంబుకుండను. తే చరణౌ = నీపాదములను, శిరసా = మౌళితో, నతః = మ్రొక్కినవాఁడను. సత్సఙ్గజాని = సాధుజనసంగభవంబులగు, నిధనాని అపి = చావులు గూడ, తారయన్తి = తరింపఁజేయునవగును.

ఈ శిశువుం జూచుకొనుఁడు, ఇదే నే బ్రదికింతునని యమునివలనను అభయమిచ్చినవాఁడవై నీవు నన్ను (కత్తివ్రేటుతో) దండించి చంపఁగా, ఈ నిసుఁగు జీవనమొందినాఁడు. నాకును ఇట్టి శుభము (దివ్యత్వము) కలిగినది. నేను శంబుకుండను. ఇదిగో నీపాదములం బ్రణమిల్లుచున్నాను. ఆహా - సత్పురుష సంబంధమువలన కలుగు చావులు సైతము కడతేర్చును కదా!

'తం హత్వా జీవయ ద్విజం' అని అశరీరవాక్కు చెప్పినదే కదా. అట్లే వానిం జంపిన, వీఁడు బ్రదికినాఁడు. శంబూకుఁడు తాను దివ్యపురుషుఁడైనందున ఇంతుండిరే ఆసంగతి ఎఱుంగఁజాలెను. తా సజ్జనుఁడును గొప్పవాఁడునుం గాన వినీతముగా ముందు ఆ బాపనబాలుని యభ్యుదయమును తరువాత నిజస్థితిని చెప్పుచున్నాఁడు. సత్సఙ్గజాని-ఇత్యాది లోకోక్తి.

ఉగ్రస్య తపసః ఫలమ్-తపస్సు చేయఁగూడనిదే, దానికిని ఫలముగలదా?- అన్న, లేదు, రాముఁడు ఊరక ఉపచారముగా పలుకుచున్నాఁడు. నిజముగా అది రామునిచేతి దండనకు, నోటి యీ యనుగ్రహమునకు ఫలము.

శ్లో॥ యత్రానన్దాశ్చ మోదాశ్చ యత్ర పుణ్యాశ్చ సమ్పదః,
వైరాజా నామ తే లోకాస్తైజసా స్సన్తు తే ధ్రువాః. 3

శమ్బూకః—యుష్మత్ప్రసాదోపాదాన ఏవ మహిమా, నతు తపసః ఫలమ్. అథవా. మహా దుపకృతం తపసా.

శ్లో। అన్వేష్టవ్యో య దసి భువనే లోకనాథ శ్శరణ్యో;
మా మన్విష్య న్నిహ వృషలకం యోజనానాం శతాని.

---

శ్లో. 3. యత్రేతి - యత్ర = ఎందు, ఆనన్దాః చ = ఆనందములు (అగునో,) (యత్ర) మోదాః చ = మోదములు (ఎసఁగునో), యత్ర = ఎందు, పుణ్యాః = పుణ్యము లగు, సంపదః చ = సంపదలును (కలుగునో) వైరాజానామ = వైరాజములను పేరు గల, తైజసాః లోకాః = తేజోరూపములగు, తే లోకాః = ఆలోకములు, తే = నీకు, ధ్రువాః సన్తు = స్థిరవాసము లగును గాక.

ఆనందములును మోదములును సకలపుణ్య సంపదలును వెల్లివిరియు వైరాజములని ప్రసిద్ధములగు సర్వతేజోమయలోకములు నీకు స్థిరవాసము లగును గాక.

లోకాః సాన్తానికా నామ యత్ర తిష్ఠన్తి భాస్వరాః। తే వైరాజా ఇతి ఖ్యాతా దేవానాం దేవ దేవతాః, వైరాజః - ఇవి అట్టి లోకవిశేషములు - బ్రహ్మలోకము గాదు. శంబూకుఁడు అపవర్గమును కోరినవాఁడు కాఁడు, ఐశ్వర్యాభిలాషి.

యుష్మత్ప్రసాదాత్ ఏవ ఏష మహిమా, న తు తపసః ఫలమ్-

ఈమహిమ మీ ప్రసాదమునకు ఫలము గాని, తపస్సునకు గాదు. అథవా- అట్లనఁగూడదు. మహదుపకృతం తపసా-తపస్సే మహోపకారము గావించినది.

శ్లో. ౪. అన్వేష్టవ్యఇతి-భువనే=భూమియందు, భూతనాథః=సకలభూతము లకు (ప్రాణులకు) పతివి. శరణ్యః = శరణుచొరఁదగినవాఁడవు, రక్షకుఁడవును, (కావుననే) అన్వేష్టవ్యః = వెదకఁబడవలసినవాఁడవు, యత్ అసి = అగుదువు. అయ్యును, వృషలకం = ముక్కడి శూద్రుఁడనగు, మాం = నన్ను, అన్విష్యన్ = వెదకుచు, యోజనానాం శతాని = నూఱులు ఆమడలు, క్రాన్త్వా = దాఁటి, ఇహ = ఇచటికి, ప్రాప్తః = అరుదెంచితివి, ఇహ = దీనియందు, సః = అది, తపసః = తపము యొక్క, సంప్రసాదః = మహిష్ఠమైన (మిక్కిలి గొప్పదైన) అనుగ్రహము. (అగును అనుట.) అన్యథా చేత్ = అట్లుగాకున్న, అయోధ్యాయాః = అయోధ్యనుండి, దణ్డ

క్రాన్త్వా ప్రాప్త! స్స ఇహ తపసాం సమ్ప్రసాదోఽన్యథా చే,
త్క్వాయోధ్యాయాః పున రుపగమో దణ్డకాయాం వనే వః?౹౨

రామః — కిం నామ దణ్డ కేయం? (సర్వతోఽవలోక్య)

శ్లో॥ స్నిగ్ధశ్యామాః క్వచి, దపరతో భీషణాభోగరూక్షాః,
స్థానేస్థానే ముఖరకకుభో ఝాఙ్కృతై ర్నిర్ఝరాణాం,

కాయాం వనే=దండకాటవియందు, పునః ఉపగమః=మరల అరుదెంచుట, వః=నీకు, క్వ=ఎక్కడిది? కలిగియుండదు అని భా.

ఈ భువనమందు ఎల్లప్రాణికోటికి నాథుఁడవు, ఆపదలందు రక్షకుఁడవు; కావున ఎల్లవారును నిన్ను వెదకుకొనివత్తురు. అట్టి నీవు, ఒక ముక్కడి శూద్రుని నన్ను ఇందెందో ఉన్నవానిని వెదకుచు నూఱామడలు వచ్చితివే! ఇది నాతపస్సునకే యయిన మహాఫలము. అట్లుగాకున్న అదెక్కడ ఆ యయోధ్య! ఇదెక్కడ ఈ దండకాటవి! నీ విచటికి అరుదెంచుట అదెక్కడ!

భువనే భూతనాథః శరణ్యః_ఈ లోకమునందు అన్ని భూతములకు నాథుఁడవు. ఎవనివలననేని దేనివలననేని ఎంతవానికైనను శరణు ఈఁగలవాఁడవు. 'అభయం సర్వభూతేభ్యో దదామి' అన్నవాఁడుగదా రాముఁడు. అది యిట స్మారితము.

కింనామ దణ్డకా ఇయం=ఏమి దండకయా ఇది? సర్వతః అవలోక్య-అంతటం గలయంజూచి, ఏలయన పూర్వము పండ్రెండేండ్లవాసముచే తనకు అత్యంతము పరిచితమైనది. ఇప్పుడు అంతదూరము ఇచటికి వచ్చినాఁడనా! శంబూకుఁ డిందున్నాఁడని రామునికి తెలియదు. వెదకి వెదకి కనిపట్టినాఁడు. కాదా పుష్పకమునకు దివ్యశక్తిచే తెలియును, అది ఇచటికి కొనివచ్చినది. ఇచట ఈ యనుషంగమున చిత్రదర్శనము ప్రస్తావింపని పూర్వరామారణ్యజీవితాంశములు చెప్పఁబడుచున్నవి.

శ్లో. ౫. స్నిగ్ధశ్యామేతి_క్వచిత్=కొన్నియెడల, స్నిగ్ధ శ్యామాః=(దట్టంపుఁ జెట్లగుబురులచే) తళతళన పచ్చగ నున్నవి; అపరతః=వేఱొండెడల, భీషణ ఆభోగ రూక్షాః=భయంకరములగు వైశాల్యములచే (కాలి యెండి) కంటికి కఱకుగా నున్నవి. స్థానే స్థానే=ఆయా స్థలములయందు, నిర్ఝరాణాం=సెలయేళ్ల యొక్క, ఝాఙ్కృతైః=(పాటుల)ఝాంకారశబ్దములచే, ముఖర కకుభః=మొరయు

ఏతే తీర్థాశ్రమ గిరి సరిద్గర్భ కాన్తార సాన్ద్రాః
సన్దృశ్యన్తే పరిచితభువో దణ్డకారణ్యభాగాః! ౫

శమ్బూకః—దండకైవైషా. అత్ర కిల పూర్వం నివసతా దేవేన.

శ్లో॥ చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణాం
త్రయశ్చ దూషణ ఖర త్రిమూర్ధానో రణే హతాః. ౬

---

చున్న దిక్కులు గలిగియున్నవి. ఏతే = ఇవిగో - కట్టెదుట అనుట, తీర్థ ఆశ్రమ గిరి సరిత్ గర్భ కాన్తార సాన్ద్రాః = పుణ్యప్రదేశములు, ఆశ్రమములు, కొండలు, నదుల తమలోగల పేరడవులు దట్టముగా నున్నట్టియు, పరిచితభువః = పరిచితములగు చోట్లుగల, దణ్డకారణ్య భాగాః = దండకాటవియొక్క నానాభాగములు, సన్దృశ్యన్తే అగపడుచున్నవి.

ఇవిగో నే నెఱిఁగినవే, దండకారణ్యభాగములు. కొన్నియెడల కాఱడవులు పచ్చగా నిగనిగన ఉన్నవి. వేఱెడల చెట్లు లేవు, విశాలపుఁబయళులు, కంటికి వెక్కసముగా నున్నవి. అటనట సెలయేళ్ళ దూఁకుటలను దిక్కులు ఘాంకరించుచున్నవి. పుణ్యతీర్థములు, ఆశ్రమములు కొండలు ఏర్లు - ఇవెల్ల లోపల మెండుకొన్న పేరడవులతో నిండియున్నవి!

దణ్డకా ఏవ ఏషా - దండకయే ఇది. అత్ర కిల - ఇచటగదా, దేవేన= దేవరచేత.

శ్లో. ౬. చతుర్దశేతి - భీమకర్మణాం = ఘోరమైన - క్రూరమైన - పనులు చేయువారైన, రక్షసాం చతుర్దశ సహస్రాణి = రాక్షసుల పదునాల్గువేలు - చతుర్దశ అనిత్యస్తపదము - పదునాలుగువేల రాక్షసులును, దూషణ ఖర త్రిమూర్ధానః = దూషణుఁడు, ఖరుఁడు, త్రిశిరుఁడును (అను), త్రయః చ = మువ్వురును, రణే = యుద్ధమందు, హతాః=చంపఁబడిరి!

ఖరదూషణత్రిమూర్ధులు తమ పదునాలుగువేల రాక్షససేనతో ఇందుండి క్రూరకర్మలు - ఋషులను బాధించుటలు మొదలైనవి - చేయుచుండిరి. వారు రామునిచే, ఒక్కనిచేతనే, యుద్ధమున చంపివేయఁబడిరి.

ఈ శ్లోకము ఇట్లే రామాయణమున గలదు. కవికి వాల్మీకిమీఁది భక్తిచే సమయముల రామాయణశ్లోకములు అట్లే దొరలివచ్చును. అంతయు కంఠస్థము.

యేన సిద్ధిక్షేత్రే జనస్థానే మాదృశానా మపి భీరుజనానా మకుతో భయ స్సఞ్చార స్సఞ్జాతః.

రామః — న కేవలం దణ్డకా! జనస్థాన మపి!

శంబూకః — బాఢం. ఏతాని ఖలు సర్వభూతరోమహర్షణాని ఉన్మత్త చణ్డ శ్వాపదకులాక్రాన్త గిరిగహ్వరాణి జనస్థానపర్యన్త దీర్ఘారణ్యాని దక్షిణాం దిశ మభివర్తన్తే, పశ్య.

శ్లో॥ నిష్కూజ స్తిమితాః క్వచి, త్క్వచి దపి ప్రోచ్చణ్డస త్త్వస్వనాః,
స్వేచ్ఛాసుప్త గభీరభోగ భుజగ శ్వాసప్రదీ ప్తాగ్నయః,

---

యేన=ఎందుచేత - అనఁగా - అందుచేత. సిద్ధిక్షేత్రే జనస్థానే - జనస్థానమున తపస్సు తప్పకయు సులువుగాను ఎక్కువగాను సిద్ధించునని ప్రసిద్ధి. కావున అందు అదై దీనిని తాపసులు విశేషముగా ఆశ్రయించెడివారు. ఖరాదులు ఇట కాపురము చేరినది మొదలు ఇది సాధువులకు చొరరాని దైనది. వారిం జంపివైచినందున ఇపుడు చొరఁదగిన దైనది. సిద్ధిక్షేత్రమైనందుననే శంబూకుఁడు తపస్సునకు ఇక్కడికి వచ్చినాఁడు.

న కేవలం దణ్డకా-దండకయె కాదు! జనస్థానం అపి=ఇది జనస్థానము సయితము నా! జనస్థానము దండకాభాగము. సర్వభూత రోమహర్షణాని = సకలప్రాణులకు (భయముచే) గగుర్పాటు కలిగించునవి. వీనిం గాంచిన సింహశరభములు ఉద్విగ్నులూరుదు. అనఁగా అంత భయంకరమైనవి. ఉన్మత్త చణ్డ శ్వాపదకుల సఙ్కులగిరిగహ్వరాణి = మదమెక్కిన (ఒడలెఱుఁగక చేష్టించుచున్న - అనుట), రేఁగియున్న ఘాతుకజంతువుల (పులుల)సమూహములు క్రిక్కిఱిసియున్న కొండ బొరియలు గలవి. జనస్థానపర్యన్త = జనస్థానముకడపల నున్న, దక్షిణాం దిశం అభివర్తన్తే=దక్షిణపుదిక్కుగా వ్యాపించియున్నవి.

శ్లో. 3. నిష్కూజేతి - సీమానః = (ఈ) ప్రదేశములు, క్వచిత్ = కొన్ని యెడల, నిష్కూజ స్తిమితాః = కూఁతలు లేక ఏకదలికయు లేక ఉన్నవి. క్వచిత్ అపి = మఱి కొన్నియెడల, ప్రోచ్చణ్డస త్త్వస్వనాః = జంతువుల భయంకర శబ్దములు - అర్భటులు - కలిగియున్నవి. (క్వచిత్ = మఱియు కొన్నియెడల - అని శేషము.) స్వేచ్ఛాసుప్త...గ్నయః = స్వేచ్ఛా = ఇచ్చమెయి-హాయిగా, సుప్త = నిద్రించుచున్నవియు-గభీరభోగ=లోఁతుపడగ - లేక - పెద్దదేహము గలవియునగు, భుజగ = పాములయొక్క, శ్వాస = నిట్టూర్పు(గాలు)లచేత - ప్రదీప్త = వెల్లగా

సీమానః ప్రదరోదరేషు విలసత్స్వల్పామ్భసో యాస్వయం
తృష్యద్భిః ప్రతిసూర్యకై రజగరస్వేదద్రవః పీయతే. ౭

రామః—

శ్లో॥ పశ్యామి చ జనస్థానం భూతపూర్వఖరాలయం,
ప్రత్యక్షానివ వృత్తాన్తా న్పూర్వా ననుభవామి చ. ౮

మంటఁగొల్పఁబడిన - అగ్నయః = (దావ+) అగ్నులు గలిగియున్నవి, (క్వచిత్.) ప్రదరోదరేషు = లోఁతుబగుళులలోపల, విలసత్ స్వల్పామ్భసః = మినుకుచున్న మిక్కిలియు నల్పములగు నీళ్ళుగలిగియున్నవి. యాసు = వేనియందు - అనఁగా వీని యందు అనుట. అయం = ఇదిగో, తృష్యద్భిః = దప్పిగొనుచున్న, ప్రతిసూర్యకైః = తొండలచేత, అజగరస్వేదద్రవః = కొండచిలువల చెమట నీరు - కాఱిన చెమట, పీయతే = త్రాఁగఁబడుచున్నది.

కొన్ని ప్రదేశములు ఏశబ్దమును లేక ఏచలనములును లేక యున్నవి. దానికి విప రీతముగా కొన్ని, జంతువుల యఱపులచే భయంకరముగా మాఱుమ్రోగుచున్నవి. మఱియు కొన్నిట పాములు హాయిగా నిద్రించుచున్నవి. వాని పెనుగొట్టాల వంటి దేహములనుండి, కాదా పడగలనుండి, వెడలు శ్వాస - కొలిమితిత్తిగాలులవలె నుండి - అగ్నులు మిక్కిలియు మండుచున్నవి. ఎక్కడను నీరు అగపడలేదు. నేల లోఁతుపగుళులందు అడుగున అల్పాంబువులు మిణుక్కు-మిణుక్కు మనుచున్నవి. ఇచ్చట అజగరముల పెనుదేహములనుండి చెమటనీరు కాఱుచున్నది. దానిని దప్పిగొన్న తొండలు త్రాఁగుచున్నవి.

భవభూతి ఇట్టి భయానక బీభత్సవర్ణనయందు చాల సమర్థుఁడు. అది వీర చరితయందును అంతకన్నను మాలతియందును మఱియు వన్నెకెక్కియున్నది. 'గభీరఘోష' అనుటకన్నను 'గభీరభోగ' అనుపాఠము శ్రేయము. 'భోగము' దేహమని పడగయని. 'గభీర' లోఁతుగా పెనుసొరంగమువలె నుండుటచే శ్వాస గాలి మెండు. 'ప్రతిసూర్యక' 'సూర్యునివలె మెఱుగమిడునవి' కావున వానికి దప్పి యెక్కువ.

శ్లో. ౮. పశ్యామీతి.-భూతపూర్వఖరాలయం = మునుపు ఖరుఁడు కాపుర మున్నచోటగు, జనస్థానం = జనస్థానమును, పశ్యామి చ = కాంచుచున్నాను. పూర్వాన్ వృత్తాన్తాన్ = అల్లనాఁటి = (మునుపటి) వృత్తాంతములను, ప్రత్యక్షాన్ ఇవ = ఇప్పుడు కనులయెదుర జరుగుచున్నవానింబోలె, అనుభవామి చ = తోడనే అనుభవించుచును న్నాను.

(సర్వతోఽవలోక్య) సర్వథా ప్రియారామా హి వైదేహ్యాసీత్, ఏతాని తాని నామ కాన్తారాణి. కి మతఃపరం భయానకం స్యాత్? (సాస్రమ్)

శ్లో॥ త్వయా సహ నివత్స్యామి వనేషు మధుగన్ధిషు;
ఇతి హా రమ్యతైవాసౌ స్నేహ స్తస్యాః స తాదృశః! ౯

---

ఇదిగో మునుపు ఖరుఁడు కాపురముండిన జనస్థానము అగపడుచున్నది. అది యగపడఁగానే అలనాఁటి వృత్తాంతములును - సీతతో హాయిగానుండుట, ఇంతలో శూర్పణఖ వచ్చి భంగపడుట, ఖరాదులతో యుద్ధము, బంగారులేడి యగపడుట - మొదలగున వన్నియూ - ఇపుడు నాకన్నుల యెదుట జరుగుచున్నట్లున్నది.

పశ్యామి చ - అనుభవామి చ - అను 'చ' కారద్వయముచే ఇది యగపడఁగానే అవియు అనుభవమునకు వచ్చుట యను అవ్యవహితత తోఁచును.

ప్రియారామా - ఆరామ ప్రియ - ఆమాటయే సీతవాక్యముగా తరువాతి శ్లోకమున ఉన్నది - త్వయా సహ...మధుగన్ధిషు అని. 'తాని కాన్తారాణి' అన్న విశేషమందును కలదు. కావున ఇదియే 'ప్రియరామా' అను పాఠమువకన్న శ్రేయము.

కి మతః పరం భయానకం స్యాత్ - ఆమెను 'ఎడబాసి' వీనిం గాంచుటకన్న 'భయానకము' ఏమున్నది! అనుట. సబాష్పమ్ - అశ్రుపూర్ణ దృష్టిచే దుఃఖమూ పొరలివచ్చుచున్నది.

శ్లో. ౯. "త్వయేతి.- మధుగన్ధిషు = తేనె తావిగలవైన, వనేషు = కావలందు త్వయా సహ = నీతోకూడ - నిన్నుంగూడి, నివత్స్యామి = కాపురముందును." ఇతి = అని, ఇహ = ఇందు, అసౌ = ఆమె, అరమత ఏవ = సంతోషముతో ఆటగాఁ గడపినది - విహరించినది అనుట. తస్యాః స స్నేహః = ఆమెకు నాపైఁగల యా నెయ్యము, తాదృశః = అట్టిది!

నేను నీతోఁగూడ వత్తును. ఆయడవులం గాపురముందును. అవి తేనె తావులు గుబాళ్ళించుచుండునుగదా, అది నా కంతేని ప్రియము - అని నాతో కూడ ఈయడవులకు వచ్చి ఎంతో విహార మనుభవించినది! ఆమెకు నామీఁద అంత స్నేహము! అంత ప్రీతి! చూ. రామా-అయో-౨౭-12-3.

'శుశ్రూషమాణా తే నిత్యం నియతా బ్రహ్మచారిణీ
సహ రంస్యే త్వయా వీర, వనేషు మధుగన్ధిషు,'

'సహ' - నీతోకూడియున్న, వనమువను నాకు 'రతి'యే - విహారమే. ఇటను వాల్మీకి వాక్యము.

శ్లో॥ అకిఞ్చి దపి కుర్వాణ స్సౌఖ్యై ర్దుఃఖా న్యపోహతి;
తత్తస్య కిమపి ద్రవ్యం యో హి యస్య ప్రియో జనః. ౧౦

శమ్బూకః—త దల మేభి ర్దురాసదైః. అథై తాని మదకల మయూర కణ్ఠకోమలచ్ఛవిభి రవకీర్ణాని పర్వతైః, రవిరళ నివిష్ట నీల బహుళచ్ఛాయ తరుణ తరుషణ్డమణ్డితాని అసమ్భ్రాన్తవివిధమృగయూథాని పశ్యతు మహాభాగః ప్రశాన్తగమ్భీరాణి మధ్యమారణ్యాని.

---

శ్లో. ౧౦. అకించిదితి_యః = ఎవరు, యస్య = ఎవనికి, ప్రియః జనః = ప్రియమైన జనమో, తస్య = వానికి, తత్ = అది, ఆప్రియజనము_విధేయప్రాధాన్యమునుబట్టి నపుంసకలింగము, కిమపి ద్రవ్యమ్_ఏమో ఇట్టిదని చెప్పరాని వింత ద్రవ్యము! అకిఞ్చిత్ అపి కుర్వాణః = అది (=ఆజనము) తా నేమియు చేయకయే, సౌఖ్యైః = సౌఖ్యముల చేత, దుఃఖాని = దుఃఖములను, అపోహతి=పోఁగొట్టును_విదుల్చును అనుట.

ప్రియజనము తా నేమియు చేయకయే, కేవల సన్నిధిమాత్రముచేతనే, సుఖములు కలిగించి మనసునుండి దుఃఖములం దోలును. అదేమో ఇట్టిదని చెప్పరాని ద్రవ్యము. రామునికి సీత అట్టి ద్రవ్య మనుట.

అలం ఏభిః_తృతీయతో కూడిన 'అలం' ప్రతిషేధార్థకము. 'చాల దివి'. చిత్తగింపఁదగినవి కావు_అనుట. అథ ఏతాని...ఇటుపైని ఇవి...మధ్యమారణ్యములు. మదకల మయూరకణ్ఠకోమలచ్ఛవిభిః = మత్తుతో కూయుచు త్రుళ్ళుచునుండు నెమిళుల మెడల రమణీయమైన కాంతివంటి కాంతిగలవి_చెట్లసాంద్రతచే దూరానకు అట్టి కాంతిగలయట్లు అగపడుచున్నవి. కాదా అట్టి నెమిళులును వాని మెడల కాంతియు, దానివలని రామణీయకమును కొండలయందు తోఁచుచున్నవనియు_ఆ మెడల కాంతులతోనే కూడుకొన్న కొండలు అనుట. శంబూకుఁడు దివ్యపురుషుఁ డైపోయినందున ఈ దూరమునకును వాని దివ్యదృష్టికి ఆ నెమిళ్ళ మెడలును కనఁబడుచున్నవని భావము. అవకీర్ణాని = వ్యాప్తములు_అక్కడకొండ అక్కడ కొండగా పెక్కు కొండలు చల్లినట్లు వ్యాపించియున్నవి. బహులచ్ఛాయ_దట్టమైననీడగల అనుటకన్న, ఈదూరానకు దట్టమైన కాంతిగల అనుటమంచిది. అసమ్భ్రాన్త=బెదరొందని, వివిధ=పలుతెగలగు, మృగయూథాని=జింకలకదుపులతో కూడుకొన్నవి. పూర్వము చెప్పిన దక్షిణారణ్యములు చాల భయంకరములు, ఈమధ్యమారణ్యము లన్ననో ప్రశాంతగంభీరములు.

శ్లో॥ ఇహ సమదశకున్తాక్రాన్తవానీరవీరుత్
ప్రసవసురభిశీతస్వచ్ఛతోయా వహన్తి,
ఫలభరపరిణామశ్యామజమ్బూనికుఞ్జ
స్ఖలనముఖరభూరిస్రోతసో నిర్ఝరిణ్యః. ౧౧

---

శ్లో. ౧౧. ఇహేతి - ఇహ=ఇక్కడ, సమదశకున్తా..తోయాః=మదించిన పక్షులచే ఆక్రమింపఁబడిన ప్రబ్బలి తీఁగలపూలతో పరిమళించుచు చల్లనై తేటలైన నీళ్ళుగలవియు, ఫలభర...స్రోతసః = కాయలు మిక్కిలి పండుటచే నల్లనైన నేరేడిపొదలం దొఱ్ఱిలుటచే శబ్దము కలిగినవియు ఉబికినవియు నగు ప్రవాహములుగలవియు నగు, నిర్ఝరిణ్యః=కొండవాఁగులు, వహన్తి=పాఱుచున్నవి.

ఇక్కడ సెలయేళ్లు ప్రవహించుచున్నవి. వాని క్రేవల ప్రబ్బలితీఁగలు పూచియున్నవి. వానిమీఁద పక్షులు వ్రాలియున్నవి. ఆ యదరునకు ప్రబ్బలిపూలు ఆవాఁగులందు రాలినవి. కొండవాఁగులైనందున నీళ్ళు చల్లగా తేటగా నున్నవి. ఈ పూలపరిమళము కలిగియు నున్నవి. ఆ వాఁగులవారిలో నేరేడిపొదలు, వాని నిండ పండ్లు మిక్కుటము వాని శ్యామకాంతిని చీకటి మిక్కుటమో యనిపించుచుండగా, చాల అందముగా నున్నవి. వాఁగులు పొదలను తగులుటచే నీరు ఉబికి, వానినుండి దూసికొని ప్రవహించుటచే మ్రోఁతలు కలిగి యున్నవి. ఇదెల్ల దర్శనీయమే.

ఫలభరపరిణామశ్యామ-కాయలు మిక్కిలి పెల్లి నల్లగా పండుటచే కొమ్మలయు ఆకులయు రంగు తోఁపక అంతయు పండ్లగుత్తుల నలుపుగానే యున్నది.

ఈవర్ణన కవికి ప్రియమగుటచే, తుల్యసంవిధానమున మాలతియందును ఈ శ్లోకమే చెప్పినాఁడు. ఇవి తొలకరిదివసములని అందు 'ఘర్మామ్భోవిగమాగమ వ్యతికర శ్రీవాహినో వాసరాః' అని స్పష్టముగా చెప్పినాఁడు. ఆషాఢమున మేఘదూతమున కాళిదాసు సూచించినదే ఈ సౌభాగ్యము. 'జమ్బూకుఞ్జ ప్రతిహతరయం తోయమాదాయ గచ్ఛేః' I-20. అనియు - 'త్వయ్యాసన్నే పరిణత ఫల శ్యామ జమ్బూవనాన్తాః' I-24. అనియు. 'ఇదం జమ్బూకుఞ్జ స్ఖలిత జల ఝాత్కార లహరీ గభీరాయాః__' అని - మాలతి. 'జమ్బూవేతసవానీరకదమ్బోదుమ్బరార్జునాః__' అని అనూపజములజాబితా బృహత్సంహితయందు. ఈ తొలకరికాలము రమణీయమైనందున ఎల్లో కవి దానికి అవకాశము కల్పించును.

శ్లో॥ దధతి కుహరభాజా మత్ర భల్లూకయూనా
మనురసితగురూణి స్త్యాన మమ్బూకృతాని,
శిశిరకటుకషాయః స్త్యాయతే సల్లకీనా
మిభదళిత విశీర్ణగ్రన్థి నిష్యన్దగన్ధః. ౨౧

రామః—(సబాష్పస్తమ్భం) భద్ర, శివాస్తే పన్థానః. దేవయానం ప్రతిపద్యస్వ పుణ్యేభ్యో లోకేభ్యః.

---

శ్లో. ౨౧. దధతీతి.–అత్ర = ఇచట, కుహరభాజాం = బొఱియలలోనున్న, భల్లూకయూనాం=ఎలుఁగుయువలయొక్క, అమ్బూకృతాని=ముక్కులతో ‘అమ్బు-అమ్బు’ అను మ్రోఁత కలుగునట్లుగా నిశ్వసించు ఎల్గు చేష్టలధ్వనులు, అనురసిత గురూణి = ప్రతిధ్వనులచే బిగ్గరయగుచున్నవై, స్త్యానం దధతి = వృద్ధిగనుచున్నవి. సల్లకీనాం = అందుగుచెట్లయొక్క, ఇభదళిత విశీర్ణగ్రన్థి నిష్యన్దగన్ధః = ఏనుఁగులచే చీల్పఁబడి చిందరవందర చేయఁబడిన కణుపులనుండి కాఱిన రసముయొక్క వాసన, శిశిరకటుకషాయః = చల్లగాను, కారము (గాటు)గాను, చేదుగాను ఉన్నదై, స్త్యాయతే=వ్యాపించుచున్నది–మన ముక్కులకు ఎక్కువగా కొట్టుచున్నది–అనుట.

బొఱియలలోని యెల్గుయువలు అంబూకృతము సేయఁగా, అది ప్రతిధ్వనిం గూడి దీర్ఘమై, పెనుమ్రోఁతయగుచున్నది చెవికి. అట్లే ఏనుఁగులు అందుగుచెట్ల గణుపులను చీల్చి వెదచల్లఁగా వాని పాల వాసన చల్లగా గాటుగా చేదుగా వ్యాపించి ముక్కులకుఁ గొట్టుచున్నది.

సబాష్పస్తమ్భమ్–బాష్పముల నడంచుకొని–ఇక్కడ సీత మునుపు తన్నుం గూడి విహరించినది. ఆసీతను తా నిపు డట్లు తఱిమివేసితి నే–అని పట్టరాని దుఃఖము వచ్చినది రామునికి. వానియెదుట దాని నావిష్కరింప నొల్లఁడాయె. ధీరోదాత్తుఁడు గాంభీర్యశాలి దాని నెట్లో అడంచుకొనుచున్నాఁడు. గొంతులో కూడ ఆ గుటుకు బయటికి తెలియనీకుండ శంబూకునికిం జెప్పుచున్నాఁడు.

దేవయానం ప్రతిపద్యస్వ=దేవయానమును పొందుము. (దానిం బొంది–అందు ఎక్కిపొమ్ము.) ఉపనిషదుదాహృతము దేవయాన మొకటి కలదు. ఛాన్దోగ్య–‘తద్య ఇత్థం విదుర్యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే, తేఽర్చిష మభి సమ్భవ, న్త్యర్చిషోఽహ, రహ్న ఆపూర్యమాణపక్ష, మాపూర్యమాణపక్షా ద్యాన్ షడు దఙ్ఙేతి మాసాంస్తాన్. మాసేభ్యః సంవత్సరం, సంవత్సరాదాదిత్య, మాదిత్యాచ్చన్ద్ర మసం చన్ద్రమసో విద్యుతం, తత్పురుషో మానవః స ఏతాన్ బ్రహ్మగమయత్యేష

శంబూకః—యావ త్పురాణబ్రహ్మవాదిన మగస్త్య మృషి మభివాద్య శాశ్వతం పదం ప్రవిశామి. (నిష్క్రాన్తః)

రామః—

శ్లో॥ ఏత త్తదేవ హి పున ర్వన మద్య దృష్టం
యస్మి న్నభూమ చిర మేవ పురా వస న్తః
ఆరణ్యకా శ్చ గృహిణ శ్చ రతా స్స్వధర్మే
సాంసారికేషు చ సుఖేషు వయం రసజ్ఞాః. ౧౩

---

దేవయానః పన్థా ఇతి. అర్చిరాది మార్గమనియు పేరు. ఐనను అది అపునరావృత్తికి. రా. ఉ. కాండలో శంబూకుఁడు తన కోరిక దేవత్వమనియు దేవలోక జిగీషయనియు అన్నాఁడు. కావున ఇట ఇది దేవతల యానము (=బండి,) విమానము. వైరాజములు దేవలోక విశేషమగును గాని అపునరావృత్తిపదము గాదు. ంల్లోకేభ్యః - వైరాజములనె లోకములను రాముఁడే అతనికి అనుగ్రహించి వాఁడుగదా - అక్కడికి, బ్రహ్మవాదినం = తత్త్వమును పలుకువాఁడు - ఉపదేశించువాఁడు - వేదాంతి - ఐన. వైరాజములకుం దరలిన తాను ఆయనను వీడ్కొనఁ గోరుచున్నాఁడు. యావత్ ప్రవిశామి - ప్రవేక్ష్యామి = చొరఁగలను - పోఁగలను అనుట. ఇఁకను రాముఁడు ఒంటరి యైనాఁడు. సీతకై ఇంట అట్లు ఏడ్పుతో కుములుచున్న వాఁడు దైవికముగా ఈ చోటికి వచ్చినాఁడు - పట్టరాని దుఃఖము నుకేఁపుచోటికి.

శ్లో. ౧౩. ఏతదితి - ఏతత్ = ఇదిగో, తత్ ఏవ వనం = ఆకాననమే. పునః= వెండియు, అద్య = ఇపుడు, దృష్టం హి = చూడఁబడినది - (చూచినాఁడను) కదా. యస్మిన్ = ఎందు - (అనఁగా ఇందు) పురా = మునుపు, చిరమేవ = చాలకాలమే - పెక్కు సంవత్సరములు, వయం= మేము, ఆరణ్యకాః చ=అరణ్యకులముగను-అనఁగా ఆ తాపసవ్రత మాచరించువారముగను, గృహిణః చ = గృహస్థులముగను - అనఁగా ఆ వ్రతమాచరించువారముగను. స్వధర్మే రతాః చ = మా సొంత(క్షాత్ర) ధర్మమున - ఆర్తత్రాణాదియందు - ఆసక్తికలవారముగను, సాంసారికేషు సుఖేషు = ఐహిక సుఖములయందు, రసజ్ఞాః చ=రసమెఱింగినవారముగను, వసన్తః అభూమ = కాపురమున్న వారమైతిమి,

ఆయడవినే నేను మరల ఇపుడు చూడఁగంటిని. ముందు మేము ఇందు చాలకాలము కాపురముంటిమి. గృహస్థులమైనను ఆరణ్యకవ్రతమును ఆచరించితిమి. మఱి గృహవ్రతమును మానినవారము గాము, దానినింగూడ ఆచరించితిమి.

శ్లో॥ ఏతే త ఏవ గిరయో విరువన్మయూరా,
స్తాన్యేవ మత్తహరిణాని వనస్థలాని,
ఆమఞ్జువఞ్జులలతాని చ తా న్యమూని,
నీరన్ధ్రనీప నిచులాని సరిత్తటాని. ౧౪

శ్లో॥ మేఘమాలేవ యశ్చాయ మారా దపి విభావ్యతే,
గిరిః ప్రస్రవణః సోఽయం యత్ర గోదావరీ నదీ. ౧౫

మా సొంత తపాత్త్రవ్రతమును, ఆర్తులం గాపాడుట మొదలైనదియు ఆదరించితిమి. నేను సీత, మాకు తోడు లక్ష్మణుఁడు నున్నందున విహితధర్మముల వీడకయే, సంసారసుఖరసమును అనుభవించుచుంటిమి.

ఆసీతను అట్లు తలిమికొని ఇపుడిచటికి ఇట్లు వచ్చి వీనిం గాంచినందున నా కదెంతటి దుఃఖముగా నున్నది! — అని తలపోసికొనుట.

శ్లో. ౧౪. ఏత ఇతి — విరువన్మయూరాః = కూయుచున్న నెమిళులు గలవి. ఏతే = ఇవి, తే గిరయ ఏవ = ఆ కొండలే, (ఏతాని) మత్తహరిణాని = మదించిన జింకలుగల యివి, తాని ఏవ వనస్థలాని = ఆ వనప్రదేశములే, అమూని ఆమఞ్జువఞ్జులలతాని = ఇవిగో సొంపారు వేతసపుఁ దీఁగెలుగలవియు, నీరన్ధ్రనీపనిచులాని = దట్టంపు కడుములను నిచులములుం గలవియు అగు నివి, తాని ఏవ సరిత్తటాని చ = ఆ యేటి యొడ్డులే —

ఇవి ఆకొండలే. వీనిపై అప్పటివలెనే ఆ నెమిళ్లు కూయుచున్నవి. ఇవి ఆ వనప్రదేశములే, ఇందు ఆ జింకలే మదించి దుముకుచును తెండియు నున్నవి. ఈయేటికట్టలును అవే — ఆ వేతసపుఁ దీగెలయందము, ఆ నీపములు నిచుళములు దట్టముగా గుబురుగొనియుండుట — అదెల్ల అట్లే యున్నది.

రాముఁడు సీతంగూడి కొన్ని యేండ్లు ఇచట కాపురముండెను, సీతాపహరణమువలన. ఆ సీతావియోగము ఒక సంవత్సరము కాఁబోలు — అందందు ఆమెకై వెదకుచు తిరుగుచు నుండెను, తరువాత రావణవధ. అనంతరము అయోధ్యలో పట్టాభిషేకము. సీతావివాసము. తర్వాత ఇపుడు పండ్రెండేండ్లయినది. నేఁడు శంబూకవధవ్యాజమున ఇచటికి వచ్చినాఁడు. వీనిం గాంచుచున్నాఁడు. ఇట్లు తలపోసికొనుచున్నాఁడు. ఇట్టితలంపులే తొలియంకమున ఈ ఘట్టపుఁ జిత్రదర్శనమున 'కిమపి కిమపి మన్దం మన్దం' ఇత్యాదిని ఉదాహృతములు. అక్కడ చెప్పనివి ఇక్కడ చెప్పఁబడుచున్నవి.

శ్లో. ౧౫. మేఘేతి — అయం = ఇదిగో, మేఘమాలా ఇవ = మొగిళ్ళబారువలె, ఆరాత్ అపి = ఈవద్దనుండి సయితము, యః విభావ్యతే = ఏది యగపడుచున్నదో,

శ్లో॥ అస్యైవాసీ న్మహతి శిఖరే గృధ్రరాజస్య వాసః
స్తస్యాధస్తా ద్వయ మపి రతా స్తేషు పర్ణోటజేషు;
గోదావర్యాః పయసి వితతశ్యామలానోకహశ్రీ
రన్తః కూజన్ముఖరశకునో యత్ర రమ్యో వనాన్తః. ౧౬

---

సః అయం = అల్లయది, ప్రస్రవణః గిరిః = ప్రస్రవణమను కొండ, యత్ర = ఎక్కడ అనఁగా-అక్కడ అదిగో, గోదావరీ నదీ=గోదావరి ఏఱు.

అదిగో ఈ దూరమునకును అగపడుచున్నది, మొగిళులబారువలె, అదే ప్రస్రవణము. దాని చెంగట అదిగో గోదావరి.

ఆ సౌభాగ్యమెల్ల కన్నులకుం దోఁచుచున్నది. 'జానే పునరపి ప్రసన్నగమ్భీరాసు వనరాజిషు విహరిష్యామి' అని సీత పలికిన దోహదమున నీనింగాంచు కోరికయు నుండెఁగాఁబోలు. మఱి యదెల్ల అట్లయినది! 'ప్రస్రవణ' - చుట్టును ఊటబుగ్గలుగలది. కావుననే మేఘమాల పోలిక.

శ్లో. ౧౬. అస్యైవేతి - అస్య ఏవ = దీనియొక్కయే, మహతి శిఖరే = గొప్ప కొమ్ముమీఁద, గృధ్రరాజస్య=గద్దలఱేని (=జటాయువు యొక్క), వాసః=కాపురపుగూడు, ఆసీత్ = ఉండెను. తస్య అధస్తాత్ = దానికి క్రింద, వయం అపి = మేమును, తేషు పర్ణోటజేషు = అవిగో ఆయాకులగుడిసెలలో, రతాః = సంతోషములో ప్రీతితో నుంటిమి. యత్ర = ఎక్కడ - అనఁగా అక్కడ, గోదావర్యాః = గోదావరియొక్క, పయసి = నీటియందు, వితత ... శ్రీః = (నీడగా) వ్యాపించిన నల్లని (ముదురు పచ్చని) చెట్ల కాంతిగలదియు, ముఖర శకునః = కూయుచున్న పక్షులుగలదియై, అన్తః కూజత్ = తాను లోపల కూయుచున్నట్టిదియు, (కావుననే) రమ్యః=రమణీయమునైన, వనాన్తః=వనమును, వెలసియుండెను.

ఈ కొండపెనుఁగొమ్ముననే జటాయువుగూడు. దాని క్రింద ఆయాకుగుడిసెలలో మేము ఎంతోహాయిగా నుంటిమి. పక్కనే గోదావరి. దాని చెంగటి దాండమైన యావనము. దాని చెట్లు ఆ గోదావరి తేటనీటిలో ప్రతిబింబించుచు మనోహరముగానుండును. వానియందు పక్షులు గూయుచుండ ఆ వనము మొరయుచుండునట్లుండును. ఆ గుఱుతులెల్ల ఇపుడును అట్లే అగపడుచున్నవి.

జటాయువుగూడు ఆ కొండకొమ్మున నుండినందున, నూఱుయోజనముల దూరమైనను చూడఁగల చూపునైశిత్యము, రావణునైనను అదలింపఁగల దేహపు

అత్రైవ సా పఞ్చవటీ, యత్ర చిరనివాసేన వివిధవిస్రమ్భాతి ప్రసఙ్గసాక్షిణః ప్రదేశాః, ప్రియాయాః ప్రియసఖీ వాసన్తీ చ ప్రతి వసతి. తత్కిమిద మాపతిత మద్య రామహతకస్య? సంప్రతి హి,

శ్లో॥ చిరా ద్వేగారమ్భీ ప్రసృత ఇవ తీవ్రో విషరసః,
కుతశ్చి త్సంవేగా చ్చలిత ఇవ శల్యస్య శకలః,

---

బలము, తాను నాయనకు మిత్రమన్న యపత్యవాత్సల్యము గల జటాయువు వీరికి ఎట్టినోడో ఎట్టికాఁపో అరయఁదగును. పర్ణోటజేషు - బహువచనము - వంటకు వేఱు, వినోదానికకు వేఱు, పడుకకు వేఱు అగునట్లుగా కొన్ని గుడిసెలు వేసికొన్నారు వారు. ఒకటియే కాదు, ఎన్ని ఎట్లు వేసికొన్న తమకు అన్ని తెఱంగుల సుఖముగా నుండునో అన్న.

అత్ర ఏవ సా పఞ్చవటీ - అదియు అగపడుచున్నది. ఐదుమఱ్ఱులు ఒక్కట మొత్తమైయుండు చోటు. అది యెంతో విశాలమై చల్లనై చాలహాయిగా నుండు చోటు. మదరాసు అడయారులో ఆనిబిసెంటువారి కట్టడములున్నయెడ అట్టి పెద్దచెట్లు నీడలు పర్వుచు నున్నవి గదా. అంతకన్నను ఈచోటు ఎంతరమణీయముగా శోభనీయముగా నుండునో! యత్ర=ఎచ్చట, అనఁగా ఇచ్చట అన్నమాట. చిర నివాసేన=చాలకాలము కాపురమున్నందున, ప్రదేశాః=ఈప్రదేశములు - వివిధ విస్రమ్భాతిప్రసఙ్గ సాక్షిణః = పెక్కు తెఱంగుల నమ్మకము మిక్కిలిగా కలిగియుండినందులకు - అట్టి నమ్మకములోడి పనులు అతిక్రమణములు సైతము చేయ కావించినందులకు - సాక్షులైనవి. గుడిసెకు గోళ్లముసైతి మిడక తిరుగువారము. కూర్చుందుము - పొరలాడుదుము - మాటాడుదుము - విహరింతుము - ఏమేమో చేయుదుము - వాని నన్నిటిని చూచుచుండినవి ఈప్రదేశములు. ప్రియాయాః ప్రియసఖీ = నాప్రియురాలికి సీతకు అనుంగునెచ్చెలియైనది. ఇచటి వనదేవత వాసంతి. తత్కిమిదం ఆపతితం అద్య రామహతకస్య - ఏమి వాటిల్లినది ఇపుడు రామహతకునికి! తలఁపని తలంపుగా ఆ పుష్పకము శంబూకవధవ్యాజమున ఇచటికి చేర్చినది, నా దుర్దైవవశమున! సీత నాతోడ లేదు. సీతకు నేను ఆపని కావించితిని. పతి యట ఓసియొసఁట వీరియెదుట ఎట్లు నిలువఁగలను! అని దుఃఖము ఆఁకలేక పొరలి వచ్చుచున్నది, రామునికి ఇపుడు. హతకుఁడన్న ఆత్మనింద తన దుర్దైవమునకు. ఎఱిఁగియెఱిఁగి సీతకు అట్లు చేయవలసినవాఁడనైతినే - అని.

శ్లో. ౧౭. చిరాదితి - చిరాత్ = చాలకాలమునకు - పన్నెండేండ్లకు ఇపుడు వేగారమ్భీ = వేగము - దాని (చెడు) గుణము - చూపందొడంగినదై, - లేఁగినదై,

వ్రణో రూఢగ్రన్థి స్స్ఫుటిత ఇవ హృన్మర్మణి పునః
ఘనీభూత శ్శోకో వికలయతి మాం నూతన ఇవ. ౧౭

తథాపి తాన్ పూర్వసుహృదో భూమిభాగాన్ పశ్యామి,
(నిరూప్య) అహో అనవస్థితో భూమిసన్నివేశః.-

---

ప్రసృతః = వ్యాపించిన, తీవ్రః = తీక్ష్ణమైన, విష రస ఇవ = విషంపుద్రవముభలెను; కుతశ్చిత్ = ఎందుండియో (తగిలిన), సంవేగాత్ = దెబ్బవలన, దేనియో ఉరవడివలన, చలితః = కదలిన, శల్యస్య శకల ఇవ = బాణంపు ములికికణికవలెను; రూఢగ్రన్థిః = పొక్కుకట్టినదై, పునః స్ఫుటితః = మరల పగిలి సెలవేసిన, హృన్మర్మణి = గుండియ యాయువుపట్టులోని, వ్రణ ఇవ = గాయమువలెను; పునః = మరల (ఇపుడు), ఘనీభూతః = పేరుకొన్నదైన, శోకః = దుఃఖము, నూతన ఇవ = క్రొత్తదియుం బోలె, మాం = నన్ను, వికలయతి = తెలివితప్పినవానింగా చేయుచున్నది- ఏమియు చేయఁజాలనివానింగాఁ జేయుచున్నది, అవశీకరించుచున్నది.

కొన్నివిషములు ద్రమింగినపుడు బాధించియు అడఁగి తరువాత చిరకాలమునకు మరల తమ వేగము చూప నారంభించి వేఁగి వ్యాపించును.—దానివలెను; ములికికణిక గ్రుచ్చుకొన్నప్పుడు చాలబాధ కలిగించును. అది యడఁగును. ఏదేని పెద్దదెబ్బచే అది కదలిన మరల ఎంత తీవ్రబాధకలిగించును! దానివలెను; హృదయము ఆయువుపట్టులలో చేరినది, అందు గాయము ఎంత నొప్పి కలిగించును? అది యెట్లో పొక్కుకట్టినది. మరల యెట్లో పగిలి సెలవడిన, అది యెంత యోర్వరాని బాధకలిగించును!_దానివలెను; సీతను తఱిమివేసిన దుఃఖము ఆ సమయమున ఎంతో యోర్వరానిదై యుండినది. సమాళింపుడు వచ్చినట్టులుండినది. అయినను ఇన్నియేండ్లకు ఇపుడు వీనిదర్శనమున మరల పేర్చుచున్నదై క్రొత్తదియుం బోలె నన్ను అవశుని చేయుచున్నది.

అన్ని యుపమానములచేతను తొలుత ఓర్వరానిబాధ కలిగించియు, కాలముచే కొంత యడఁగియున్నట్టిది, ఇపుడీకారణము కలుగఁగా తొల్లిటికంటెను బాధకలిగించుచున్నది అనుట తెలియఁదగును. అత్యంతోత్కటభావము అసదృశముగా చెప్పినాఁడు కవి!

తథా అపి = అట్లైనను_దర్శనము మిక్కిలి దుఃఖమును పొంగించుచున్నను, పూర్వసుహృదః = పూర్వమిత్రములను_మునుపు ఎంతో స్నేహము గొల్పినవానిని, నిరూప్య = చక్కఁగా పరికించి, భూమి సన్నివేశః = నేలమీది యేర్పాటు, నేల

శ్లో॥ పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం
విపర్యాసం యాతో ఘనవిరళభావః క్షితిరుహాం,
బహోర్ దృష్టం కాలా దపరమివ మన్యే వనమిదం,
నివేశ శ్శైలానాం తదిద మితి బుద్ధిం ద్రఢయతి. ౧౮

---

ఉండుటయు, అనవస్థితః=నిలుకడలేనిదిగానున్నది. భూమి అదే యైనను, దానిమీఁది యున్న వేశము మార్పు చెందినది. పంద్రెండేండ్లయినవికదా.

శ్లో. ౧౮. పురేతి_పురా=మునుపు, సరితాం=నదులలో, యత్ర=ఎక్కడ, స్రోతః=నీటిపాఱుదలయో, అధునా=ఇపుడు, తత్ర=అక్కడ, పులినమ్=ఇసుకదిన్నె. క్షితిరుహాం= చెట్లయొక్క, ఘనవిరళభావః= సాంద్రతయు విరళతయు-దట్టముగానుండుటయు, పలుచగానుండుటయు, విపర్యాసం యాతః = మార్పును-అది యిదియు ఇది యదియు అగుటను, పొందినది. బహోః కాలాత్ దృష్టం = చాలకాలమునకు చూడఁబడిన, ఇదం వనమ్=ఈయడవిని, అపరమ్ ఇవ=వేఱొకటిగా, మన్యే=తలంచుచున్నాను. అట్లు తోఁచుచున్నది. (అయినను), శైలానాం= అచలములయొక్క, నివేశః=ఏర్పాటు, ఉన్నతియు, తత్ ఇదం ఇతి=అదియే ఇది యని, బుద్ధిం ద్రఢయతి=బుద్ధిని గట్టిపఱుచుచున్నది. నమ్మించుచున్నది_అనుట.

నదులలో మునుపు పాఱుదల యున్నచోట, ఇపుడు ఇసుకదిన్నె; మునుపు ఇసుకదిన్నె యున్నచోట ఇపుడు ప్రవాహము కానఁగుచున్నది. చెట్లు మునుపు దట్టముగా నున్నచోటుల ఇపుడు పలుచవాఱినవి; మునుపు పలుచగా నున్న చోటుల ఇపుడు దట్టమైనవి. ఇన్నియేండ్లయినతర్వాత చూడఁగా ఈ యడవి, అదె, క్రొత్తదివోలె తోఁచుచున్నది. కొండలు అచలములు, మార్పులేనివిగదా-వాని యేర్పాటుం గాంచి అదె ఇది యని గట్టిగా నమ్మకము కలుగుచున్నది.

దీనిని సారూప్యసమాసోక్తికి ఉదాహరణముగా అప్పయదీక్షితులు కువలయానందమున ఉదాహరించెను. ఒక యూరిలో మునుపు ధనసంతానసమృద్ధకుటుంబములు అవి; అవి ఇపుడు దైన్యము చెందినవి. మునుపటి యధనసంతానదీనకుటుంబములు ఇవి; ఇవి ఇపుడు సమృద్ధిచెందినవి. ఊరు గుఱుతు తెలియక పోయినది. ఐనను అదిగో ఆ గొప్పకుటుంబము, అల్ల యదియు, నాఁటికి నేఁటికి ఒక తీఱుగా నుండి ఇది ఆ యూరే అని గుర్తింప నవుపఱుచుచున్నది_అన్నట్లు. రసగంగాధరకారుఁడును ఉదాహరించి, దానిని ఆక్షేపించి, ఇంగు అప్రస్తుతప్రశంసయ అని యనెను. దీనిని క్షేమేంద్రుఁడును ఔచిత్యవిచారచర్చయందు ఉదాహరించినాఁడు_దేశౌచిత్యమునకు.

హన్త! పరిహరన్తమపి మా మితః పఞ్చవటీస్నేహో బలాదాకర్ష తీవ. (సకరుణమ్)

శ్లో॥ యస్యాన్తే దివసాస్తయా సహామయా సీతా యథా స్వే గృహే,
యత్సమ్బన్ధికథాభి రేవ సతతం దీర్ఘాభి రాస్థీయత,
ఏకః సమ్ప్రతి నాశితప్రియతమ స్తామేవ రామః కథం
పాపః పఞ్చవటీం విలోకయతు వా గచ్ఛ త్వసమ్భావ్య వా?

---

హన్త=అయ్యో, పరిహరన్తమపి=విడనాడి పోవుచున్నవానినైనను, సకరుణమ్=దుఃఖముతో.

శ్లో. ౧౯. యస్యామితి—యస్యాం=ఎందు, యథా స్వే గృహే=మా సొంతయింటంబోలె, తే దివసాః=ఆ దినములు, తయా సహ=ఆమెంగూడి, మయా సీతాః=నాచేత పుచ్చఁబడెనో, దీర్ఘాభిః=నిడుపులైన, యత్సమ్బన్ధికథాభిః ఏవ=దేనికి సంబంధించిన కథలతోనే, సతతం=ఎల్లప్పుడు, ఆస్థీయత=(ఉండఁబడెనో-అనఁగా) ఉంటిమో, తాం పఞ్చవటీం=ఆ పంచవటిని, ఏకః=ఒక్కరుఁడు, నాశితప్రియతమః=తాన ప్రియతమను నాశనముచేసినవాఁడు, పాపః=పాపుఁడునైన, రామః=రాముఁడు, అద్య=ఇప్పుడు, కథం=ఎట్లు, విలోకయతు వా=కనును? అసమ్భావ్య=కనకయే, గచ్ఛతు వా=పోవును?

ఈ పంచవటియందు ప్రియయు నేనును మా సొంతయింటంబోలె ఆ దినములు పుచ్చినారము. ఎప్పుడును మాకు ఇక్కడి యా కడునిడుదలగు కథలే చెప్పికొనుటకు. మాకు జోడుగా ఇరువురకు ఒక్కట దీనియందు అట్టిమైత్రి. మఱి యిపుడు నేను ఒక్కరుఁడనే, ప్రియను తఱిమిన పాపాత్ముఁడను ఆ చోటిని ఆ పంచవటిని ఎట్లు కాంతును, కాంచక ఎట్లు పోదును?

'యత్సమ్బన్ధికథాభిః'-చూ. రఘు-XIV-25-"తయో ర్యథాప్రార్థిత మిన్ద్రియార్థా నాసేదుషోః సద్మసు చిత్రవత్సు ప్రాప్తాని దుఃఖా న్యపి దణ్డకేషు సంచి న్త్యమానాని సుఖా న్యభూవన్." తరువాత అయోధ్యయందును 'సంచి న్త్యమానాని' అన్నాఁడు, కాళిదాసు. పంచవటితో అట్లు తనకు సీతంగూడినయప్పటి మైత్రి. నేఁడు సీతను తఱిమివేసిన యొక్కరుఁడను దానిని ఎట్లు కాంతును? - అనుట. భావముల ఒరయిక, కొఱ్ఱలయు అడ్డంకులయు ఘర్షణ.

ఇంతలో పోవుటకు సాకు దొరకినది.

శంబూకః—(ప్రవిశ్య) జయతు దేవః. దేవ, భగవా నగస్త్యో మత్తశ్శ్రుత భవత్సన్నిధాన స్త్వా మాహ "పరికల్పితావతరణమఙ్గళా ప్రతీక్షతే వత్సలా లోపాముద్రా, సర్వే చ మహర్షయః. తదేహి, సమ్భావయాస్మా౯, అథ ప్రజవినా పుష్పకేణ స్వదేశ ముపగ మ్యాశ్వమేధాయ సజ్జో భవిష్యసీతి".

రామః—య దాజ్ఞాపయతి భగవా౯.

శమ్బూకః—ఇత స్తర్హి ప్రవర్తయతు పుష్పకమ్.

రామః—(పుష్పకం ప్రవర్తయ౯) భగవతి పంచవటి, గురు జనానురోధాత్ క్షణం క్షమ్యతా మతిక్రమో రామస్య.

శంబూకః—దేవ! పశ్య పశ్య.

---

మత్తః శ్రుత భవత్ సన్నిధానః = నీ సన్నిధానమును నావలన విన్నవారై - నీ విట ఉన్నారని నేను వారికి చెప్పితిని అనుట. పరికల్పిత విమానావతరణ మఙ్గలా = విమానము దిగునప్పటిమంగళసంవిధానమునకు, హారతియొత్తుట మొదలగు దానికి కావలసినదెల్ల - సమకూర్చుకొని. 'వత్సలా' లోపాముద్రమ్మకు రాముని యందు పుత్రవాత్సల్యము, తత్ ఏహి = కావున రమ్ము. సమ్భావయ అస్మా౯ = మాకు అగపడుము. మమ్ము గౌరవింపుము అనుట. ప్రజవినా పుష్పకేణ - పుష్పకము వాయు వేగముతోను మనోవేగముతో సయితము పోవునది కావున, ఈ యలంతివిలంబము లెక్క సేయఁదగదు అనుట. అశ్వమేధాయ సజ్జో భవిష్యసి - అన్న మహర్షి వాక్యాన దారిలోనే సీతాపునర్యోగము గూఢముగా నున్నదా? తమ యాశీర్వాదములును అందులకు సాయపడును అని. వదలిన గుఱ్ఱము మరల ఊరు చేర వలయును - తరువాత ముఖ్యయజ్ఞము.

ప్రవర్తయతు - నడుపును గాక.

గురుజనానురోధాత్ = పెద్దల(యాజ్ఞ) ననుసరించుటవలన, రామస్య అతి క్రమః = రాముని యతిక్రమము - నిన్ను చూడక దాఁటి అటుపోవుట, రామునికిఁగల పెద్దలయెడని విధేయత కనవగును.

శ్లో॥ గుఞ్జత్కుఞ్జకుటీర కౌశికఘటాఘూత్కారవత్కీచక
స్తమ్బాడమ్బరమూకమౌకులికులః క్రౌఞ్చావతోఽయం గిరిః,
ఏతస్మిన్ ప్రచలాకినాం ప్రచలతా ముద్వేజితాః కూజితై
రుద్వేల్లన్తి పురాణరోహిణతరుస్కన్ధేషు కుమ్భీనసాః. ౨౦

---

శ్లో. ౨౦. గుఞ్జదితి_గుఞ్జత్కు...కులః_గుఞ్జత్ = 'గుంజ్' అని శబ్దించుచున్న-కుఞ్జకుటీర = పొదలు అనెడి గుడిసెలలో నున్న, కౌశికఘటా = గూబలగుంపుల యొక్క - ఘూత్కారవత్ = 'ఘూత్' అను కూఁతలుగల, కీచక స్తమ్బ = బొంగు వెదురు పొదలయొక్క, ఆడమ్బర = రొదచేత, మూక = మూగలైన, మౌకులికులః = కాకులగుంపులు గలదైన, అయం గిరిః = ఈకొండ, క్రౌఞ్చావతః = క్రౌంచావతము (అను పేరిది). ఏతస్మిన్ = దీనిమీఁద, ప్రచలతాం = తిరుగాడుచున్న, ప్రచలాకినాం = నెమిళ్ళయొక్క, కూజితైః = కూఁతలచేత, ఉద్వేజితాః = బెదరఁగొట్టబడినవై, పురాణరోహిణ తరుస్కన్ధేషు = ముదురుగందపు మ్రాఁకుల బోదియలయందు, కుమ్భీనసాః = పెనుఁబాములు, ఉద్వేల్లన్తి = అదరిపడుచున్నవి.

ఇదిగో క్రౌంచావతగిరి. దీనిమీఁద పొదలు గుడిసెలవలెనుండి 'గుంజ్' అని శబ్దించుచున్నవి. వానిలోపల చేరి గూబలు గుంపులుగూడి ఘూత్కరించుచున్నవి. ఆశబ్దములతో బొంగువెదురుపొదల రొదయుం గూడినది. దానిచే (బెదరి) వానిమీఁది కాకులగుంపులు నోరు తెఱవక మూగలై యున్నవి. ఇదిగో దీనిమీఁద నెమిళ్ళు కేకలిడుచు తిరుగాడుచున్నవి. ఆ కేకలకు ఆ ప్రాంత పెద్ద ముదురు గందపు వృక్షముల బోదెలం జుట్టుకొనియుండు పెనుఁబాములు ఉదరిపడుచున్నవి.

'గుంజ్' అని మొరయు పొదరుగుడిసెలు, అందు, 'ఘూత్' అని కూయు గూబపిండులు, (గాలిపోసికొని 'గీ' అని మొరయు) బొంగువెదురు పొదలు, వానిపై మూగలైయున్న కాకులగుంపులు; వెదురుపొదలు దట్టమై చీకటులుపఱపి రాత్రియను భ్రాంతిని కలిగించుచున్నవి. కావున గూబలు ఘూత్కరించుట, కాకులు మూకములగుట. అట్లే తిరుగాడుచు కేకలిడు నెమిళ్లు, ముదుక గందపు వృక్షములు, వానిబోదెలమీఁద 'కేక'లకు ఉదరిపడు పెనుఁబాములు! ఈ కొండను చూడవయ్యా క్రౌంచావతమును! అచోట ఆకొండ ఆకూఁతలు అవన్నియు వానిం గూడ చేర్చినవారికి అది యొక రామణీయకమే - నేత్రోత్సవమే! చూపువాఁడు దివ్యుఁడు, చూచువాఁడు దేవుఁడు!

అపిచ—

శ్లో॥ ఏతే తే కుహరేషు గద్గదనదద్గోదావరీవారయో
మేఘాలఙ్కృత మౌళి నీలశిఖరాః క్షోణీభృతో దక్షిణాః,
అన్యోన్యప్రతిఘాత సఙ్కులచల త్కల్లోలకోలాహలై
రుత్తాలా స్త ఇమే గభీరపయసః పుణ్యా స్సరిత్సఙ్గమాః. ౩౧
(ఇతి నిష్క్రాన్తౌ)

ఇతి పంచవటీప్రవేశో నామ
ద్వితీయాఙ్కః

---

శ్లో. ౩౧. ఏత ఇతి – కుహరేషు = గుహలయందు, గద్గదనదత్ గోదావరీ వారయః = 'గద్ గద్' అని మ్రోఁతగల గోదావరినీళ్ళు గలవియు, మేఘా లఙ్కృత...రాః = మొగిళులచే అలంకరింపఁబడినవై జొట్టువలెనున్న నల్లని కొమ్ములుగలవియు, ఏతే = ఇవిగో, తే దక్షిణాః క్షోణీభృతః = ఆదక్కినంపుఁ గొండలు. అన్యోన్య...కోలాహలైః – అన్యోన్య = ఒండొంటిని – ప్రతిఘాత = కొట్టుకొనుటచేత – సఙ్కుల = ఒండొంటింగలసిపోయి – చలత్ = లేచుచున్న – ఊఁగుచున్న – కల్లోల = అలలయొక్క – కోలాహలైః = పెనుధ్వనులతో కూడుకొని, ఉత్తాలాః = తాటిచెట్టు ఎత్తుకలేచి దూఁకుచున్న, గభీరపయసః = కడు లోతునీళ్లుగల, పుణ్యాః = పావనములైన, తే సరిత్సఙ్గమాః = ఆయేళ్లకూడలులు, ఇమే = ఇవిగో!

ఇవిగో దక్షిణపుఁగొండలు. గోదావరినీళ్లు వీని గుహలలోనికి దూఱి గద్గద యని మ్రోయుచున్నవి. శిఖరములు మేఘాలంకృతములై వాని జొట్టువలె నల్లగా నున్నవి. ఇవిగో ఆ పావనములై మిక్కిలి లోతైన నదీసంగమములు, ఒక యేటి యలలు ఒండొక యేటియలలతో ఎదురుకొట్టుకొని సంకులములై పాఱు పెను మ్రోఁతలతో తాటిచెట్టునెత్తుక ప్రతిభయముగ లేచుచున్నవి.

ఇదియు మేలి ప్రకృతి సౌభాగ్యవర్ణనము. ప్రకృతిలో అబ్బో! అని భయముతోఁచు మహిమయందు – ఒకతూఱి చూచిన మరి మఱపురాని యుద్ధతి యందు – భవభూతి రామణీయకమును భావించును. ఆ చోటులను కన్నులతో ప్రత్యక్షముగా తాను చూచినట్లు తోఁచుచున్నది. పుణ్యాః = పావనములు – ఈ ఘట్టమున స్నానాదికము సకలపాపములం గడిగివైచును. అచ్చట సంగమేశ్వర స్వామియు వెలసియున్నాఁడు. భవభూతి కంటితో చూచి అపాసగా అనుభ

వించినాఁడేమో ఈచోటులను! ఇట్లు అసదృశముగా వర్ణించినాఁడు. శంబూకుని నోట ఇంత వర్ణన ఏల యన రామునికి అగస్త్యాశ్రమమార్గమున వినోదమునకు.

తొలియంకమున చిత్రదర్శనమును, ఈ యంకమునను తృతీయమునను గూడ పంచవటిలో విడియుటయు - ఇది యొక తెలుంగు వ్యాజమున భవభూతిచేయు రామాయణపారాయణమును, వాల్మీకిసేవయు. 'మా నిషాద ప్రతిష్ఠాం త్వం' 'చతుర్దశ సహస్రాణి'. 'త్వయా సహ నివత్స్యామి...' ఇవి రామాయణశ్లోకములే ఇందులోనికి దొరలినవి. ఇంకను ఇతరమును అట్టిదే పెల్లుగాఁ గలదు.

శంబూకుని జనస్థానమున నుంపకున్న ఈ రెండంకముల కథ లేకపోవును. అశరీరవాక్కు అతఁడు తపస్సు చేయుచున్నచోటుం జెప్పమియు, పుష్పకము, ఆ దేవత, ఆచోటు వెతఁగి రాముని అచటికిం దెచ్చుటయు, అది జనస్థానముగుటయు - కథలో కల్పన - కథ అట్లు సాఁగినది. పశ్య - చూడు చూడు అని ఈ మార్గముం జెప్పుట నిష్క్రమణమునకు సాకు.

ఇతి వృత్తముంబట్టి ఈయంకమునకు పేరు,
పంచవటీ ప్రవేశము



# శుద్ధవిష్కమ్భః

(తతః ప్రవిశతి నదీద్వయం తమసా మురళా చ.)

తమసా—సఖి మురళే, కిమసి సమ్భ్రాన్తేవ?

మురళా—భగవతి తమసే, ప్రేషితాస్మి భగవతోఽగస్త్యస్య పత్న్యా లోపాముద్రయా సరిద్వరాం గోదావరీమభిధాతుం—"జానాస్యేవ యథా వధూత్యాగాత్ప్రభృతి—

శ్లో॥ అనిర్భిన్నో గభీరత్వా, దన్తర్గూఢఘనవ్యథః,
పుటపాక ప్రతీకాశో, రామస్య కరుణో రసః! ౧

---

నదీద్వయం = నదుల దోయి _ ఇరువురు నదీదేవతలు. తమసయు, మురళయు· తమస వాల్మీకియాశ్రమము చెంగటిది; ఉత్తరాన ఉండునది. భాగీరథికి ఆశ్రితురాలు. ఉపనది. సీతకు సఖి; కాదా తోడు వచ్చిన పెద్దామె. సీత ఎంతటిమహిమశాలిని యనఁగా అట్టి నదీదేవతలు తాము కోరుకొని తన్నుం గూడు నంతటిది. 'తమసాం అను ప్రపన్నః' II., 'వితమసా తమసా సరయూతటాః' అని రఘువు. మురళ అగస్త్యాశ్రమము చెంగటిది; దక్షిణాన ఉండునది. లోపాముద్రకు ఆశ్రితురాలు. ఇందు అరుంధతీ లోపాముద్రలకు పృథ్వీభాగీరథుల మించిన మహిమకలిమి కవిచే భావింపఁబడినది. వారి కెల్లరకును సీతారాముల యందు అపత్యవాత్సల్యమే కాక, పోర్దముగా మానుషమున దాఁగిన లక్ష్మీనారాయణులన్న అంతర్భక్తియు కలదు; లోకేశులన్న ప్రజాగులభక్తియు కలదు· అవి అంతర్వాహినులుగా ప్రవహించుచునే యుండును. అట్లే గోదావరికి కాఁదగును. తమసమురళలు విప్రకృష్టాంతరలైనను నదీదేవత లగుటచే సఖులు; ఇపుడు కారణవిశేషముచే కలిసికొన్నారు. తమస మురళకు పూజ్య, మురళ తమసకు స్నేహభూమి_ఆభేదము పరికింపఁదగును.

సమ్భ్రాన్తా ఇవ=సంభ్రమము_తత్తరపాటు_గలదానివలె, వధూత్యాగాత్ = కోడలిని విడనాడినప్పటినుండి. అందఱు రామునివారై సీతం గోడలింగాఁ గార వింతురు. 'వధూ' _ అని కోడలికి నిర్దేశము, సంబోధన. జానాసి ఏవ = ఎఱుఁగనే ఎఱుఁగుదువు. నేను చెప్పనక్కఱలేదు.

శ్లో. ౧. అనిర్భిన్నో_గభీరత్వాత్ = గాంభీర్యమువలన _ చిత్తవికారములను బయటికి తెలియనీని లోఁతుపాఁతు గలుగుటవలన, అనిర్భిన్నః = వెలికిఁ బ్రిదుల

నిదియు, (కావుననే), అన్తర్గూఢఘనవ్యథః_లోపల దాఁపబడినందున పైకి అగపడని గాటంపు బాధకలిగించునదియునై, రామస్య కరుణః రసః=రాముని దుఃఖభావము, పుటపాక ప్రతీకాశః=(కావుననే) పుటమునం బాకముం బొందు పాటువ చెందినదై, యున్నది.

పుటములో పాకము లోతులో లోపలనున్నదై, బయటికి అగపడకున్నను, ఆలోపల మఱింతగా నుడుకుచుండును. అట్లే రాముని సీతా వియోగదుఃఖము అతని గాంభీర్యమువలన బయటికి రాదు, మఱి లోలోపలనే ఎవరికిని తెలియకుండ దానిబాధ అతి ఘనముగా నున్నది.

'అన్తర్గూఢ'_ఇది యొకరితో బయటికి చెప్పఁకొనఁదగినదికాదు_అట్లు చెప్పికొనుటచే కొంతయూఱట కలుగును. దీని కారణము తెలియుంబట్టి అట్లు ప్రకటముగా చెప్పఁకొనఁదగినది కాదు. దాఁచుకొననే వలసినది, తానొక్కఁడే తనలో ఎంతేని కుములవలసినది. స్వభావసిద్ధముగా తన గాంభీర్యము గొప్పదే_ఏవికారము బయటికి సామాన్యముగా తోఁపనీనిది. ప్రకృతమున అది మఱియు ఎక్కువ, ఎట్లును నిర్భేదములేనిది. పుటపాకోపమ కరము రమణీయమైనది. కరుణోరసః= కరుణరసము_అనఁగా ఉత్కటదుఃఖము_'ప్రియావియోగనిబన్ధనః శోకసమ్భారః' అని రామచంద్ర బుధేంద్రవ్యాఖ్య. 'శోకజో మనోవికారః' అని శారదారంజన రే. ఇట్లనుటయే సాధువు అని శ్రీవేదము వేంకటరాయశాస్త్రిలవారు. "...... రసము కథాపురుషులందుఁ గాని నటులందుఁ గాని ఉండదు. అది సామాజికుల హృదయమందు ఉద్బుద్ధమగును." కావున ఇది యీ నాటకమందలి రసమునకు నిర్దేశకము గాదు. "మఱియు_రామస్య కరుణోరసః_ఇత్యాది వాక్యములయందు కరుణపదము కరుణరసపరము యేని కవికి నాయకునియందు రసమును స్వశబ్దము చేతనే చెప్పిన దోషము సంభవించును. ఎట్లన_సాహిత్యదర్పణ సప్తమపరిచ్ఛేదమున 'అథ రసదోషా నాహ_రసస్యోక్తిః స్వశబ్దేన...రసస్య స్వశబ్దో రసశబ్దః శృఙ్గారాది శబ్దశ్చ..................' అట్లయిన రామస్య కరుణోరసః_ఇత్యాది వ్యవహారములయందు ఆశబ్దమున కర్థ మేమన, దుర్భరవిరహవ్యథయే యర్థము. అదియే కరుణ విప్రలంభోద్బోధకము". "మఱి రామస్య కరుణో రసః అనుచో కరుణశబ్దము నిరుక్తరసపరముగాదేని కవి దానిని రసమని వ్యవహరించినాఁడే, అది యెట్లు సంగతమగును?_అని యందురేని ఇట్టి స్థలములలో రసశబ్దము భావపరముగాని శృంగారాది రసపరిగణనాంతర్గత కరుణరసపరము గాదు. మాళవికయందలి యీ క్రింది ప్రయోగముం గనుఁడు__

'అజ్ఞైరన్తర్నిహితవచనైః సూచితః సమ్యగర్థః,
పాదన్యాసో లయ మనుగత, స్తన్మయత్వం రసేషు.

తేనచ తథావిధేష్టజనకష్టవినిపాతజన్మనా ప్రకర్షిగతేన దీర్ఘ శోకసన్తానేన సమ్ప్రతి నితరాం పరిక్షీణో రామభద్రః. తమవలోక్య కమ్పిత మివ మే హృదయమ్. అధునాచ ప్రతినివర్తమానేన రామ భద్రేణ నియత మేవ పఞ్చవటీవనే వధూసహవాసవిస్రమ్భసాక్షిణః ప్రదేశా ద్రష్టవ్యాః. తత్ర చ నిసర్గధీర స్యా ప్యేవంవిధాయా మవస్థాయా మతిగభీరాభోగ శోకక్షోభసంవేగా త్పదేపదే మహాన్తి ప్రమాదస్థానాని శఙ్కనీయాని. తద్భగవతి గోదావరి, త్వయా సావ ధానయా భవితవ్యమ్.

---

ఇందులకు 'రసేషు సాత్త్విక వ్యభిచారి భావేషు' అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. 'అత్ర రస శబ్దేన ఉపచారాత్ పరిపోషాతిశయవన్తో భావాః కథ్యన్తే, ప్రకృత త్వాత్. రసే ష్వతి ప్రసఙ్గాత్.' అని కాటయవేమారెడ్డి వ్యాఖ్య." వే. వేం. వారి ఉ. రా. చ. ఉపోద్ఘాతము. తత్త్వ మిట్లుండ దీనిమీఁద 'కరుణః కరుణ విప్ర లమ్భాఖ్యః, రసః విభావాదిసామగ్రీ చర్వణాపాదితస్థాయితాకో భావః' అను శ్రీకుమారతాతార్యవ్యాఖ్య ఎట్లు గుఱితప్పిన దెంత పొరపాటో అరయఁ దగును.

తేన చ = దానంజేసి, తథావిధ... నా = అట్టి (వినిపాతమునకు విశేషణము) యాప్తేయునికి కలిగిన యనిష్టపుటాపదవలనం బొడమినట్టియు, ప్రకర్షగతేన = పెంపుపొందినట్టియు, దీర్ఘశోకసన్తానేన=చాలకాలపు (12 ఏండ్ల తెంపులేని) శోకపరంపరచేత, పరిక్షీణః = కృశించియున్నాఁడు. తం అవలోక్య = అతనిం గాంచి - ఇపుడే మాయాశ్రమమునకు వచ్చి యగపడినాఁడు. కమ్పితం ఇవ మే హృదయం = నాగుండె క్రక్కదలిపోయినట్లున్నది. ప్రతినివర్తమానేన = ఇందుండి మరలిపోవుచున్నవానిచేత - నియతం ఏవ = తప్పకుండను, వధూసహవాస విస్రమ్భ సాక్షిణః = కోడలితోడి సావాసపు విస్రంభపుఁ (జేఁతలకు) సాక్షులైన, అతి గమ్భీరా...... గాత్ = కడులోఁతును పఱపును గల శోకము కలఁతపెట్టు నోర్వ రాని వ్యథచేత (కాదా తీవ్రతచేత), ప్రమాదస్థానాని = ప్రమాదకారణములు, శఙ్కనీయాని = వెఱవవలసియున్నవి. సావధానయా = కడు మెలఁకువ కలదాన వుగా- ఇంచుకయు పరాకులేనిదానవుగా-

శ్లో॥ వీచీవాతైః శీకరక్షోదశీతై
రాకర్షద్భిః పద్మకిఞ్జల్కగన్ధాన్,
మోహే మోహే రామభద్రస్య జీవం
స్వైరం స్వైరం ప్రేషితైస్తర్పయేతి. ౨

తమసా — ఉచిత మేవ దాక్షిణ్యం స్నేహస్య. సఞ్జీవనోపాయ స్తు మౌలిక ఏ వాద్య సన్నిహితః.

మురలా — కథమివ?

---

శ్లో. ౨. వీచీతి _ శీకరక్షోదశీతైః = తుంపురుల పొడితో చలువగలవియు, పద్మకిఞ్జల్కగన్ధాన్ = తామరపూల యకరువుల పరిమళమును, ఆకర్షద్భిః = లాఁగి మోచికొనివచ్చునవియు, మోహే మోహే = అడుగడుగునం గలుగుమూర్ఛలయందు, స్వైరం స్వైరం = ఇచ్చమెయి, ప్రేషితైః = పంపఁబడినవియునగు, వీచీవాతైః = మృదూర్మిపవనములతో _ చిన్ని యలలమీఁదిగాలులతో, రామభద్రస్య జీవం = రామచంద్రుని ప్రాణమును, తర్పయ = తేర్పవమ్మ.

సన్నని పొడివంటి నీటితుంపురులతో చల్లనివియు, తామరయకరువుల పరిమళమును లాఁగికొనివచ్చునవియు, నగు నీ పిల్లయలలగాలులను మాటిమాటికి మూర్ఛకలిగినప్పుడెల్ల నెమ్మదిగా వీఁచి శ్రీరాముని ప్రాణములను తేర్పవమ్మ.

ప్రక్కన కూరుచుండి వీవనతో ఆప్యాయముగా విసరినట్లు అనుట. 'శీతైః' అని శైత్యమును, 'గన్ధాన్' అని సౌరభ్యమును, శీకరక్షోదమును మోచుటచేత, కింజల్కముల లాఁగుటచేత, వీచులం జోపుటచేతను, స్వైరం స్వైరం అనుటచేతను, మాంద్యమును _ ఇట్లు గాలి మూఁడు మంచిగుణములు చెప్పఁబడినవి.

తాను రామునిఁ జూచుటకు గాక, ఇట్లు ప్రమాదనివారణ ప్రయత్నము అను అవకాశముపొందుటకే వత్సల లోపాముద్ర రాముని ఆశ్రమమునకు పిలిపించినది. అట్టిది ఆ స్నేహము!

స్నేహస్య = ఆ (పుత్రీ) వాత్సల్యమునకు, దాక్షిణ్యం = ఈదయ, ఉచితమ్ = తగియున్నది. సఞ్జీవనోపాయః తు = సంజీవనోపాయమన్ననో, మౌలికః ఏవ = మూలమునుండివచ్చినదే _ ప్రధానతమమే _ సీతావియోగమునం గలుగుదానికి సీతాసంయోగమునం గలుగుదానిం గూర్చుటకన్న మేలిమందు, ప్రతిక్రియ యుండునా? కావున ఇది మౌలికము _ 'మూలాత్ ఆగతః' _ ప్రాప్తప్రసవవేదనం _ కలిగిన కాన్పునొప్పులుగలదానిని _ గఙ్గాప్రవాహే నిక్షిప్తవతీ _ గంగప్రవాహమందు వైచికొన్నది. ఇది ఆత్మహత్య చేసికొనుటగాదా?_

తమసా — శ్రూయతాం. పురా వాల్మీకితపోవనోపకణ్ఠాత్ పరిత్యజ్య గతే లక్ష్మణే, సీతాదేవీ ప్రాప్తప్రసవవేదన మాత్మాన మతిదుఃఖసంవేగా ద్గఙ్గాప్రవాహే నిక్షిప్తవతీ. తదైవ తత్రదారకద్వయం ప్రసూతా. భగవతీభ్యాం పృథ్వీభాగీరథీభ్యా మభ్యుపపన్నా, రసాతలం చ నీతా; స్తన్యత్యాగాత్పరేణ చ తద్దారకద్వయం ప్రాచేతసస్య మహర్షే ర్గఙ్గాదేవీ స్వయ మర్పితవతీ.

మురళా — (సవిస్మయం)

---

'న ఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే।
త్యజేయం, రాజవంశస్తు భర్తు ర్మే పరిహాస్యతే.'

రామా - ఉత్తర XXVII - 8.

'కిం న ఖలు తస్యైవ నిరనుక్రోశస్య సమాన ఏవ ప్రసవః ప్రేక్షితవ్య ఇతి వచనీయకణ్టకోపహితం జీవితం పరిరక్షామి?'

కున్దమాలా - I.

కిం వా తవాత్యన్త వియోగమోఘే
కుర్యా ముపేక్షాం హత జీవితేఽస్మిన్
స్యా ద్రక్షణీయం యది మే న తేజ
స్త్వదీయ మన్తర్గత మన్తరాయః. రఘు. XIV - 65.

ఇట్లు మహాకవు లందఱు ఆమె గర్భరక్షణార్థము అట్టి పని చేసికొనదని నిశ్చయించుకొనుటం జెప్పినారు. ఇందును అట్టి నిశ్చయము ఉన్నను, వాల్మీకి యనుగ్రహమును హానం జెప్పవలదానిని మునుగలుగఁ జెప్పుటందున, ఆ ప్రసవవేదనాభరము, విశేషముగా అమడలకాన్పునం గలుగునది, స్త్రీ సులభముగా ఒక నిమిషమున అన్ని నిశ్చయములను తొలఁగించి అన్ని యడ్డులను నెట్టును - కాన తటాలున సీత తన్ను గంగలో త్రోచికొన్నది! తరువాతిరక్షణ దైవికము - రామమహిమకును సీతమహిమకును సదృశమైనది. తదైవ - ఆనిముసముననే నొప్పులు తీఱి కాన్పు ఐనది. భగవతి భాగీరథి జలములస్పర్శయు పృథ్వీతలస్పర్శయు ఆమెకు అట్టి యుపకారముం జేసినవి. అభ్యుపపన్నా = అనుగ్రహింపఁబడినది - కాపఁబడినది. వధువునకు తొలికాన్పున అమ్మగారును అత్తగారును అన్నివిధాల ఆదుకొని నొప్పులకు పట్టుకొని కాతురు గదా. సీతకు అట్టిది కలుగనే కలిగినది - ఒకవేళ రాజ్యాన ఇంటనున్న ఇది కలిగియుండదేమో! అమ్మను భూదేవిని అత్తను భాగీరథిని కోడలికి సీతకు-మహాలక్ష్మికే-శుశ్రూషకు పెట్టినాఁడు భర్తుఁడు కవి! ఆమాటను మురళ చేత పలికించినాఁడు - సవిస్మయమ్ = ఆశ్చర్యముతో —

శ్లో॥ ఈదృశానాం విపాకోఽపి జాయతే పరమాద్భుతః,
యత్రోపకరణీభావ మాయాత్యేవంవిధో జనః. 3

ఇదానీన్తు శమ్బూక వృత్తాన్తే నానేన సమ్భావితజనస్థానా గమనం రామభద్రం సరయూముఖా దుపశ్రుత్య భగవతీ భాగీరథీ యదేవ లోపాముద్రయా స్నేహవశా దాశఙ్కితం, తదే వాశఙ్క్య, సీతాసమేతా కేనచి దిద గృహాచారవ్యపదేశేన గోదావరీం విలోకయితు మాగతా.

---

శ్లో. 3. ఈదృశానామితి - ఈదృశానాం = ఇట్టివారికి, విపాకః అపి = కష్టదశ, అపాయము - సైతము, పరమాద్భుతః = పరమవిస్మయము కలిగించునదిగా, జాయతే = పరిణమించును. యత్ర = ఎందు - అందు అనుట - ఉపకరణీభావమ్ = ఉపకరణము - సహాయము - అగుటను, ఏవంవిధః జనః = ఇట్టివారు, ఆయాతి = పొందుదురు.

ఇట్టి (గొప్ప)వారికి (=లోకాతిగులకు) కష్టదశ వచ్చిన, అదియు కర మాశ్చర్యకరముగానే యుండును. అందు సాయము సేఁతకును ఇట్టివారే సమకూడుదురు.

'ఆయాతి' - తామే, ఇతరప్రార్థన - చోదన - లేకయే, వత్తురు. సీతకు కలిగిన విపాకము - ఇట్లు కఠోరగర్భముతో తన్నుం బోలిన మహారాణి, వివాసముం బొందుట, గంగయొడ్డున ఒంటరిగా దిక్కులేక విడిచిపెట్టఁబడుట, కాన్పునొప్పులు. వానియోర్వలేమి, అంతట గంగలో దూఁకుట - ఇంతకన్నను ఆశ్చర్యకరమైన విపాక ముండునా? ఇతరులు దూఁకిన నేమగును? మునుకయు, చావును. మఱి సీతకు సుఖప్రసవము, పృథ్వీభాగీరథుల సొంత శుశ్రూషావీక్షణములు, పాతాళమున సుఖవాసము, బిడుతలు సకలసంస్కారములకు ఉత్తమస్థానమగు వాల్మీకియాశ్రమము చేరుట - ఇంతకన్న సాయముండునా అడమయముననే?

సమ్భావితజనస్థానాగమనం రామభద్రం - రామభద్రుని జనస్థానమునకు రాక ఊహింపఁదగునని, సరయూముఖాత్ ఉపశ్రుత్య = సరయువు (నోటి)వలన విని - సరయువు అయోధ్యచెంగటి నది - భాగీరథికి ఉపనది - ఆ నదియు దేవత, జరుగఁబోవుదానిని ముందుగానే ఎఱుంగఁగలదు. కావున ఆమె భాగీరథికిం జెప్పినది. కేనచిత్ గృహాచారవ్యపదేశేన = ఏదియో గృహాచారమును మిషపెట్టుకొని - రఘుకులాచారమును దేనినో మిషగాఁ గొని.

మురళా—సువిచిన్తితం భగవత్యా భాగీరథ్యా. "రాజధానీస్థితస్య ఖలు తైస్తై ర్జగతా మాభ్యుదయికైః కార్యై ర్వ్యాపృతస్య రామభద్రస్య నియతా శ్చిత్తవిక్షేపాః. అవ్యగ్రస్య పున రస్య శోకమాత్రద్వితీయస్య పఞ్చవటీప్రవేశో మహా ననర్థ" ఇతి. తత్కథ మిదానీం సీతాదేవ్యా రామభద్ర ఆశ్వాసనీయ స్స్యాత్?

తమసా—ఉక్త మత్ర భగవత్యా భాగీరథ్యా "వత్సే దేవయజన సమ్భవే సీతే, అద్య ఖ ల్వాయుష్మతోః కుశలవయోః ద్వాదశసంవత్సరస్య సఙ్ఖ్యామఙ్గళగ్రన్థి రాబధ్యతే. త దాత్మనః పురాణశ్వశురం ఏతావతో మానవస్య రాజర్షి వంశస్య ప్రసవితారం సవితార మపహతపాప్మానం దేవం స్వహస్తావచితైః పుష్పై రుపతిష్ఠస్వ. న చ త్వా మవనిపృష్ఠచారిణీ మస్మత్ప్రభావాత్

---

జగతాం ఆభ్యుదయికైః కార్యైః = జగములకెల్ల రాజు గావున, అన్నింటికిని అభ్యుదయముం గూర్చు వ్యాపారముల చేత. _ కార్యాసనమున నుండుట దండ్యుల దండించుట ఆపన్నులం గాచుట _ మొదలగునవి. చిత్తవిక్షేపాః = మనసు ఇటు అటు చెదరుటలు _ ఇది యాలోచించుట అది యాలోచించుట _ అను మనోవ్యాపారములు, నియతాః=తప్పక యుండును _ అనఁగా ఆయాభ్యుదయిక వ్యాపార 'వ్యగ్రుఁడుగ' నుండును. అవ్యగ్రస్య = అట్టి (చిత్త)వ్యాపారము లేనివానికి. శోకమాత్రద్వితీయస్య = శోకమే తోడుగాఁ గలవానికి _ ఏడ్చుట తప్ప మఱి రెండవ పని లేనివానికి_మహాన్ అనర్థః _ మహానర్థకరము_కథం ఆశ్వాసనీయః _ ఎట్లు ఊఱటఁగొల్పఁదగినవాఁడు (అగును)? _ ఇట్లడుగుట యేల యన _ వివాసిత సీత తాను రామునికి ఎట్లు అగపడవచ్చును, ఊహించుటకు?

అత్ర=ఇందు _ ఈవిషయమున, సఙ్ఖ్యామఙ్గలగ్రన్థిః = సంఖ్యామంగలంపుముడి. ఇదియ కాఁబోలు అగృహాచారము, కుశలవులు తనతో లేరు _ వాల్మీకికడ నున్నారు. వారి పరోక్షమునను ఇట్లు ఏఁటేఁట మంగలార్థము _ ఆయుర్వృద్ధి, ఒకనాఁటికి నాయనం గలసికొనుట _ మొదలగు యోగక్షేమములంగూర్చుటకు _ ఇది రఘువుల యింటివాడుక. పురాణశ్వశురం = ముదుసలి _ పెద్ద మామగారిని _ ఏతావతః = ఇంతటికిని, ఈ సర్వమునకును, మానవస్య రాజర్షి వంశస్య = మానవ రాజర్షి వంశమునకంతటికిని, ప్రసవితారం = జనకుని, అపహత _ పాప్మానం = పాపమడంచువానిని, ఉపతిష్ఠస్వ = పూజింపుము _ తన చేయవలయు పూజకు తన చేతులతోనే పూలుకోసి చేయుట ఎక్కువ ఫలప్రదము.

వనదేవతా అపి ద్రక్ష్యన్తి, కింపున ర్మర్త్యా" ఇతి. అహం చాజ్ఞాపితా. "తమసే, త్వాయి ప్రకృష్టప్రేమైవ వధూ ర్వత్సా జానకీ; అత స్త్వమే వాస్యాః ప్రత్యనన్తరీ భవే"తి. సాహ మధునా యథాదిష్ట మనుతిష్ఠామి.

మురళా—అహ మ ప్యముం వృత్తాన్తం లోపాముద్రాయై నివేదయామి. రామభద్రోఽప్యాగత ఏవేతి తర్కయామి.

తమసా—త దియం గోదావరీహ్రదా న్నిష్క్రమ్య,

---

అవనిపృష్ఠ = నేలమీఁద, అస్మత్ప్రభావాత్ - మా(నా) ప్రభావంబువంజేసి - వనదేవతా అపి = వనదేవతలుసయితము - కావుననే ఉత్తరకథలో సీత రామునికిని వాసంతికిని అగపడదు. ఈయగపడమి వనదేవతలకు మాత్రమా, నదీదేవతలకుం గూడనా? తమసకో? గోదావరికో? వనదేవతలకు మాత్ర మని కొనందగును. కాదా-తాను అనుగ్రహించిన నదీదేవతలకును - తమసకు తానే భాగీరథి సీతకు తోడుండుమని యాదేశించినందున తమసకు తద్దర్శనసిద్ధి - ఈ తిరస్కరణము ఎంత యక్కఱయో అంతవఱకే - అట్లు వ్యవస్థచేయుటకును భాగీరథికి ప్రభావముగలదు అనుట. వాల్మీకి దివ్యమహిమంబట్టి అక్కడి నదులదేవతలును ఆయన యనుగ్రహము వేడియు, లోకజననియగు సీత శుశ్రూషంగోరియు ఆయాశ్రమమున చరించుచుందురు. అట్లే అగస్త్యాశ్రమమునను. అట్టి లోకమును మనము భావింపవలయును. ప్రత్యనన్తరీ = అనుచరి - తోడు - 'యథాదిష్ట మనుతిష్ఠామి' 'నివేదయామి' అని ఇరువురకును నిష్క్రమణవ్యాజములు. తర్కయామి = తలంతును. ఆగత ఏవ ఇతి-అగస్త్యాశ్రమమునుండి వెనుమరలి ఇచటికి రానే వచ్చినాఁడు అని.

గోదావరీహ్రదాత్ నిష్క్రమ్య = గోదావరిమడుగునుండి వెలువడి - అనఁగా స్నానమాడి మడిగా పూలుకోసికొని వచ్చినది - హ్రదాత్ - మడుగునుండి అనఁగా గంగయడుగున రసాతలమున కదా సీతయుండుట - గోదావరియు - హ్రదములందు - రసాతలవ్యాపిని - అటనుండి రసాతలమునవే ఇటకును, ఇట మడుఁగునుండి వెలికిని - అని ఒక వ్యాఖ్య. అదే సాధువు. 'గోదావరీం విలోకయితు మాగతా' అని.

శ్లో॥ పరిపాణ్డుదుర్బలకపోలసున్దరం దధతీ విలోలకబరీకమాననమ్,
కరుణస్య మూర్తిరథవా శరీరిణీ విరహవ్యథేవ వన మేతి జానకీ.

మురళా—ఇయం హి సా.

శ్లో॥ కిసలయ మివ ముగ్ధం బన్ధనా ద్విప్రలూనం
హృదయకుసుమశోషీ దారుణో దీర్ఘశోకః,

---

శ్లో. ౪. పరిపాణ్డ్వితి-పరిపాణ్డు...రం-పరిపాణ్డు=అంతటనుపాలి-దుర్బల = క్రుక్కియున్న - కపోల = చెక్కిళ్ళచే - సున్దరం = సొబగారుచున్నదియు. విలోల కబరీకం = చెదరిన తుఱుముగలదియు నగు, ఆననం = మొగమును, దధతీ = తాల్చినదై. కరుణస్య మూర్తిః ఇవ = కరుణదాల్చిన మూర్తివలెను, వా = కాదేని, శరీరిణీ విరహవ్యథా ఇవ = మెయిగొన్నవిరహబాధవలెను, ఉన్నదై, జానకీ = సీత, వనం ఏతి=వనమునకు అరుగుదెంచుచున్నది.

ఇదిగో సీత (పూలుకోయుటకై) వనమునకు అరుదెంచుచున్నది. చెక్కులు పాలి క్రుస్సి యున్నవి. తుఱుము సంస్కారాభావముచే చెదరియున్నది. అయినను మొగము సొగ సులుకుచునే యున్నది. కరుణము ఇట్లు మూర్తిగొన్నదా అన్నట్లును, విరహవ్యథ ఇట్లు రూపుదాల్చినదా అన్నట్లును ఉన్నది.

అతిమాత్రశోకముగాని విరహవ్యథగాని కలవారికి అట్టి కపోలము కబరి ముఖము ఉండును. సీతకు అవి మితిమీఱి యున్నవి - అనుట.

తమస తా నిన్నాళ్ళును సీతతో కూడిమాడియున్నది. ఆమెకు సీత ఇప్పుడట్లు తోఁచినది. మురళ ఇప్పుడే సీతను ఈయవస్థలోనిదానిని ఇదె తొలుమారు చూచుచున్నది. ఆమెకు ఎట్లు తోఁచినదనఁగా సీత - ఇయం హి సా = ఈమెయే గదా యామె!

శ్లో. ౫. కిసలయమితి - బన్ధనాత్ విప్రలూనం = తొడిమనుండి గిల్లివేయఁబడిన, కిసలయం ఇవ = చిగురాకువలె, ముగ్ధం = ముద్దుగులుకుచున్నదైన, అస్యాః = ఈమెయొక్క, పరిపాణ్డు = వెల్లబాఱినట్టియు, క్షామం = కృశించినట్టియు, శరీరం = దేహమును, శరదిజః=శరత్తునంబుట్టిన (శరత్కాలపు), ఘర్మః=ఎండ, కేతకీ గర్భపత్రమ్ ఇవ = మొగలి లోరేకుంబోలె, హృదయకుసుమశోషీ = పూవుంబోని హృద

గ్లపయతి పరిపాణ్డుక్షామ మస్యా శ్శరీరం
శరదిజ ఇవ ఘర్మః కేతకీగర్భపత్రమ్. ౫

[పరిక్రమ్య నిష్క్రాన్తే.]

ఇతి శుద్ధవిష్కమ్భః

---

యమును వాడ్చునదైన, దారుణః = తీవ్రమైన, దీర్ఘశోకః = చాల ఏండ్లుగా పడు
చున్నదుఃఖము, గ్లపయతి=వాడ్చివేయుచున్నది.

తెల్లనై కృశించిన యీమెదేహమును, తొడిమకడపిన చిగురువలె బెడఁ
గొందుచున్నదానిని పూవుంబోని యీమెహృదయమును ఎండించుచున్న తీవ్ర
దీర్ఘశోకము వాడ్చివేయుచున్నది - అదెట్లనఁగా, శరత్కాలపు టెండవేడి మొగ
లిఱేకుంబోలె, ౦విప్రలూనమ్-తొడిమనుండి గిల్లినది సులువుగా వాడిపోవును. ఇది
సీత అశక్తతను అసహాయతను సూచించును రామునిం గూడియున్న వాడ దనుట.

ఈ శ్లోకములు క్షామక్షామకపోల మాననం ఇత్యాది శాకుంతల శ్లోకమును
స్మృతికి ఎలయించునా? అందలి 'సున్దరం' అనునదియు, ఇందలి 'ముగ్ధం' అను
నదియు - 'తదపి కమనీయం వపు రిదం. సమ స్తాపః కామం మనసిజ నిదాఘప్రస
రయోః, నతు గ్రీష్మ స్యైవం సుభగ మపరాద్ధం యువతిషు' అనుదానియందలి
'కమనీయ సుభగములం' దలంపించునా? సీతకు ఇదియు విరహము - ఆశ్రమమున
తాపసులయు దేవతలయు ఆరాధనం బొందుచున్నది. కావున ఆమెకు ఇది కృశించి
నను కాంతి యొక్కించు కాళిదాసు చెప్పిన బాధంబోనిదే అని గ్రహింపఁ
దగును. తలుగుదేహమున ఈ కాంతి పెరుఁగు రహస్యమును కాళిదాసు కనిపట్టి
నాఁడు, శకుంతలాదుష్యంతాదులయందు నిబంధించినాఁడు, కవి సహృదయ
లోకమునకు చూఱలిచ్చినాఁడు! నిత్యము చూచు తమకుకు 'సుందరము'గా నున్నది.
ఇపుడె చూచు మురళకు 'ముగ్ధము'గా నున్నది, సీత.

ఈ విష్కంభము - శుద్ధము - ఇందు వ్యాపృతలయిన యిరువురును సంస్కృ
తము భాషించు మధ్యమపాత్రలు. స్త్రీలయ్యును దేవతలయినందున వీరు
సంస్కృతము భాషింతురు. ఒండెడ స్త్రీలు మధ్యమలు, ఉత్తమలైననుంగూడ,
నీచులవలెనే ప్రాకృతము భాషింతురు. కావున నీచమధ్యమాది నిర్దేశము స్త్రీ
పాత్రలయెడ కేవలము భాషంబట్టియే చేయను, దానిం బట్టి విష్కంభమును
శుద్ధమనియో మిశ్రమనియో నిర్ణయింపను వలనుపడదు. శాకుంతలమున నాలవ
యంకారంభములోనిది, సర్వప్రాకృతమైనను, దానిపాత్రలు శకుంతలసఖులు అన
సూయాప్రియంవదలు మధ్యమపాత్రలైనందున, శుద్ధవిష్కంభకమే యగును.

'వృత్తవర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః । సంక్షిప్తార్థస్తు విష్కంభో మధ్యపాత్రప్రయోజితః' ఇత్యాది లక్షణము మున్నుచెప్పినదె. ఇందు రామునిం గూర్చియు సీతంగూర్చియు వృత్తాంశములును వర్తిష్యమాణాంశములును చెప్పఁబడినవి సులువుగా అరయఁదగినవే - రాముఁడు అగస్త్యాశ్రమమునుండి పంచవటికి మరలి అచట మిక్కిలియు దుఃఖముపాలగుట - అతనిని ఊరడింపను అదృశ్యతను అనుగ్రహించి భాగీరథి సీతను ఇటకుం దెచ్చుట - మొదలగునది వృత్తము. సీత రాముం జూచుచును రాముఁడు సీతం జూడకుండను - వారు అద్భుతసమాగమ మనుభవించుట మొదలైనది వర్తిష్యమాణము.



# ఉత్తరరామచరితనాటకమ్

## తృతీయాఙ్కః

( నేపథ్యే )

హా న్త! ప్రమాదః! ప్రమాదః!

( తతః ప్రవిశతి పుష్పావచయవ్యగ్రా, సకరుణౌత్సుక్య మాకర్ణయన్తీ సీతా. )

సీతా— అమ్మహే, జాణామి పిఅసహీ వాసంతీ మే వాహరది.
[అహో! జనామి, ప్రియసఖి వాసన్తీ మే వ్యాహరతి.]

( పునర్నేపథ్యే )

శ్లో॥ సీతాదేవ్యా స్వకరకలితై స్సల్లకీపల్లవాగ్రై
రగ్రే లోలః కరికలభకో యః పురా పోషితోఽభూత్.

---

నేపథ్యే - ప్రమాదః! ప్రమాదః! - తెరలోపలనుండియే రంగాన పాత్రము ప్రవేశింపకయే పలికినది ఇది - ఏమఱుపాటునం గలిగిన అపాయము ఆపద - ప్రమాదమునం గలిగినది - ప్రమాదము.

తతః ప్రవిశతి పుష్పావచాయవ్యగ్రా = పూలను చేతితో కోసికొనుటయందు అక్కఱతో వ్యాపృతయై - ఇది భాగీరథియాదేశమునం జరుపుట - సూర్యపూజకు. సకరుణౌత్సుక్యం - ఆపదయని కరుణ, ఎవరికో అని ఔత్సుక్యము. గొంతుసవ్వడి వాసంతిదిగా తోంచినందున ఈ రెండును ఎక్కువగా కలిగినవి.

జానామి - నాటకసంభాషణలో మాటిమాటికి దీనికి 'తలంతును' అని యర్థము. 'ఎఱుంగుదును' అని కాదు. వాసంతిని వీడిపోయి పన్నెండేండ్లు కొక్కువ యైనను మునుపటి పెక్కేండ్ల మిక్కిలి చెలిమిచే గొంతు మొదలైనది చిత్తమున నాటుకొని జ్ఞాపకమున్నది.

పునర్నేపథ్యే - నేపథ్యమున ఆభాషితము సాంగుచున్నది. సీత ఉన్నను అగపడదు, సీతమాటలు వినంబడవు. కావున 'సీతాదేవ్యా' ఇత్యాది శ్లోకము

సీతా—కిం తస్స? (కిం తస్య)

(పునర్నేపథ్యే)

శ్లో॥ వధ్వా సార్ధం పయసి విహరన్ సోఽయ మన్యేన దర్పా
దుద్దామేన ద్విరదపతినా సన్నిపత్యాభియుక్తః. ౧

'ప్రమాదః'-అన్నదానితో అంటి తెంపులేక పలికిన భాషితశేషమే యగును. ఈ మాటల తెంపు కూడికలయందును, ఒకరిది ఒకరికి వినఁబడి, ఒకరిది ఒకరికి వినఁబడమియందును ప్రేక్షకులకు ఇంచుక చమత్కారము కలుగును. రంగాన ఈ దృశ్యతా దృశ్యతలం జూపుటెట్లు? జిలుగు వల తెరలచే గాఁబోలును.

శ్లో. ౧. సీతేతి_సీతాదేవ్యా = సీతాదేవిచేత, స్వకరకలితైః = తన సొంత చేతితో ఒసంగఁబడిన, సల్లకీపల్లవాగ్రైః = అందుగుఁ జిగుళ్లకొనలచేత, అగ్రే = ఆమె యెదుర, లోలః = ఆసాసగా తోఁక యాడించుచు తొండము త్రిప్పుచు పలుకుచు పలుతెఱంగుల మురిపముం జూపుచున్నదై, యః కరికలభకః = ఏ యేనుఁగుగున్న, పురా = మునుపు. పోషితః అభూత్ = పెంపఁబడినదాయెనో, సః అయం = అదే ఇదిగో, వధ్వాసార్ధం = తన పిడితోడం గూడి, పయసి విహరన్ = (గోదావరి)నీట ఈఁదుచు విహరించుచుండఁగా, దర్పాత్ = పొగరుకలన, ఉద్దామేన = ఉగ్రముగానున్న, అన్యేన ద్విరదపతినా = మఱియొక గజరాజుచేత, సన్నిపత్య = పైకిదూఁకి, అభియుక్తః = పోరఁ బైకొనంబడినది.

మునుపు ఇందున్నప్పుడు సీతాదేవి తన సొంతచేతితో అందుగుఁ జిగుళ్ళకొనలను పెట్టి మేపి పెంచినది యీ యేనుఁగుగున్నను. ఇదియు ఆమె యెదుట ముద్దుగా మురిపముఁజూఁపుచు తిని యెదిగినది. అట్టియది యిపుడు పెద్దదై తన పిడి సుందరితో నీట క్రీడావిహారములు సేయుచుండఁగా, ఎక్కడిదో ఒక్క మదపుటేనుఁగు కోపముతో దానిపై భయంకరముగా పడి జగడ మారంభించినది.

సీతాదేవియీ వృత్తము ఇప్పటికి పన్నెండేండ్లక్రిందటిది. వనదేవత వాసంతి దానిని స్మరించుమన్నది. ఆ స్నేహ మట్టిది. ఆ యేనుఁగునకే ఇపుడీ ప్రమాదము వాటిల్లినది. కనుక ఇట్లు పెట్టుకొని మయ్యాడినది. స్వకర_తన సొంత చేతితో పెట్టుట వాత్సల్యభరముచేత. ౦పల్లవాగ్రైః_పల్లవములు మృదుకోమలములు_ వాని యగ్రములు మృదుకోమలతరములు. వానిచే ఏర్చి నోటఁబెట్టుట మఱియు తదతిశయముం దెలుపును. ఇది 'శ్యామాకముష్టిపరివర్ధితకో జహాతి। సోఽయం న పుత్రకృతకః పదవీం మృగస్తే'_శాకుం. IV_13. అను నిందలి శకుంతల చామల పిడికిళ్ళం దలఁపించును. 'వధ్వా'_ఆపిడిని 'వధు'వనుటయు ఆ ప్రీతిని, సీతవ

సీతా—(ససమ్భ్రమం కతిచిత్పదాని దధతీ) అజ్జఉత్త పరిత్తాహి పరిత్తాహి మమ తం పుత్తఅం. (స్మృతి మభినీయ సవైక్లబ్యమ్) హద్ధి హద్ధి! తాఇం ఏవ్వ చిరపరిచిదాఇం అక్ఖరాఇం పంచవడీదంసణేణ పుణో వి మం మందభాఇణిం అణురుద్ధన్తి. హా అజ్జఉత్త! (ఇతి మూర్ఛతి.)

[ఆర్యపుత్ర, పరిత్రాయస్వ పరిత్రాయస్వ, మమ తం పుత్రకం. హా! ధిక్! హా! ధిక్! తా న్యేవ చిరపరిచితా న్యక్షరాణి పఞ్చవటీ దర్శనేన పున రపి మాం మన్దభాగినీ మనురుద్ధన్తి. హా! ఆర్యపుత్ర!]

తమసా—(ప్రవిశ్య) వత్సే సమాశ్వసిహి, సమాశ్వసిహి.

( నేపథ్యే )

విమానరాజ, అత్రైవ స్థీయతాం

సీతా—(ఆశ్వస్య ససాధ్వసోల్లాసం) అమ్మహే జళధరిదమేహ

---

చెలియగుటచే తనకును నాఁటినుండి సంక్రమించియున్నదానిం దెలుపును. దాననే ఇపుడు ఇట్లు 'ప్రమాద'మని తాను భయ్యెడుట.

'ససంభ్రమం కతిచిత్ పదాని దధతీ'_అనియు. 'స్మృతి మభినీయ సవైక్లబ్యమ్'_అనియు_సీతవేసము గొనువారికి అభినయోపదేశము. తొట్రుపాటుతో కొన్నియడుగులు నడిచి_జ్ఞప్తి నభినయించి సిగ్గుతోడి దైన్యముతో_తాను వివాసమున నున్నను తన నోట ఆ 'నిరనుక్రోశుని' పేరు, ప్రార్థనయు తటాలున అట్లు వచ్చినదే అని సిగ్గును దైన్యమును. పండ్రెండేండ్లయిపోయినను, అయనంగూడి మునుపు కాపురమున్న పంచవటిదర్శనముచే తన నోట, తనకు తెలియకయే వచ్చివేయుచున్నవి. 'మన్దభాగినీం' _ అదృష్టహీనురాలిని _ అనురున్ధన్తి _ అనుసరించుచున్నవి. నేను పలుకుట కాదు, ఆ యక్షరములు తమంతట నానోట వెలువడుచున్నవి! అనుట. 'హా ఆర్యపుత్ర!' ఒక్కుమ్మడి ఆ పూర్వానుభవము_ఆ యనురాగము ఆ సుఖము_ఇప్పటి తనదశలో జ్ఞప్తికలుగఁగా మూర్ఛ ముంచుకొనివచ్చినది. వత్సే_పట్టీ_తమస సీతను అట్లు ప్రీతితో శుశ్రూషించును. తమస విష్కంభసూచితమైనట్లు ప్రవేశించి సీతకు తోడగును.

విమానరాజ_పుష్పకము దేవతకావున ఇట్లు సంబోధనయు, మాటయు. ఈ రామప్రవేశమును విష్కంభసూచితము.

ఆశ్వస్య_ఇత్యాది నటోపదేశము_ఊఁఅడిల్లి_అమాటలు రాముఁడు పలికినవి. ఆగొంతు చెవిం బడఁగానే ఆయూఁఅట కలిగినది. ససాధ్వసోల్లాసమ్_తన్ను

త్థణిదగంభీరమంసళో కుదో ను ఏసో భారదీణిగ్ఘోసో భరిజ్జమాణ కణ్ణ వివరం మం వి మందభాఇణిం ఝత్తి ఊసాసేఇ!

(అహో! జలభరిత మేఘ స్తనిత గమ్భీరమాంసలః కుతో ను ఏష భారతీ నిర్ఘోషః, భ్రియమాణ కర్ణవివరాం మామపి మన్దభాగినీం ఝటితి ఉచ్ఛ్వాసయతి!)

తమసా—(సస్నేహాస్రం) అయి వత్సే.

శ్లో॥ కిమవ్యక్తేఽపి నినదే, కుతస్త్యేఽపి త్వమీదృశీ,
స్తనయిత్నో ర్మయూరీవ చకితోత్కణ్ఠితం స్థితా? ౧

---

తలిమిన రామునికంటెఁ బడుదురో అని 'సాధ్వస' - భయము. ఆ గొంతు - మాటలు చెవికి అట్లు ఇంపుకాఁగా, మూర్ఛ తొలఁగినదనియు, ఆయనను ఎట్లో తాఁ గాడఁగందునేమో అని - 'ఉల్లాసము'. అమ్హహే = అహో - ఆశ్చర్యార్థకము. జలభరిత మేఘ స్తనిత గంభీరమాంసలః - ఇది రాముని గొంతు, ఆ రాజాధిరాజు ధీరోదాత్తకంఠస్వరమును వర్ణించుట. రామవేషగ్రాహి అట్టి గొంతుగలవాఁడుగా నుండవలయును. 'నీరు నిండిన మొయిలు ఉఱుమువలె' - గంభీరమధురమును - మాంసల = బిగ్గరయును - ఐనది. ఒకింతదూరమునుండియే వినవచ్చినది. 'భారతీ' - అతి గౌరవముతో నిర్దేశము - ఆమాటలకు. భ్రియమాణకర్ణవివరాం = నింపఁబడుచున్న వీనులరంధ్రములు గలది. వీనులు తనకు ఆమాటలతో నిండిపోయినవి. ఉచ్ఛ్వాసయతి=ఊఱట కలిగించుచున్నది. మన్దభాగినీం - ఇప్పటికి పన్నెండేండ్లుగా ఏ యూఱటయు నెఱుఁగని దురదృష్టురాలిని.

వీరచరితమున పరశురాముని గొంతు తొలిమాటు విన్నప్పుడు రాముఁడనుట - తన్వి...... పుష్కలావర్తక స్తనిత మాంసలో వాఙ్నిర్ఘోషః కర్ణవివర మాప్యాయయతి.

సస్నేహాస్రమ్ - స్నేహమువలని జాలివలన బాష్పములు. అయి - అని సుకుమారమగు నామంత్రణము - 'అయే - అనునది ఆశ్చర్యాద్యర్థకము, అది వేఱు.

సీతగాని తమసగాని రామునికిని వాసంతికింగూడను అగపడరు.

శ్లో. ౧. కిమితి = అవ్యక్తే = వ్యక్తిం బొరయనిదై - ఫలానామాటలు అని స్పష్టముగా తెలియనిదై - కుతస్త్యే అపి = ఎక్కడినుండియో వచ్చినది వినను - ఫలానావారు పలికినదని తెలియకున్నను, నినదే = శబ్దమున, అనఁగా అది వినంబడఁగానే - నాకు వట్టి 'నినద'మాత్రముగా ఉన్నది, త్వం = నీవు, ఈదృశీ అవి కిం=ఇట్టిదానవైతివేమె! స్తనయిత్నోః=మేఘముయొక్క, (నినదే=శబ్దమున

సీతా—భఅవది కిం భణాసి అపరిప్ఫుడం తి? మఏ ఉణ సరసంజోఏణ పచ్చభిఆణిదం అజ్జఉత్త ఎవ్వ వాహరది. (భగవతి, కిం భణసి అపరిస్ఫుట మితి? మయా పునః స్వరసంయోగేన ప్రత్యభిజ్ఞాతం, ఆర్యపుత్ర ఏవ వ్యాహరతి.)

తమసా—శ్రూయతే తపస్యతః కిల శూద్రస్య దణ్డధారణార్థమైక్ష్వాకో రాజా జనస్థాన మాగత ఇతి.

సీతా—దిట్ఠిఆ! అపరిహీణరాఅధమ్మో క్ఖు సో రాఆ! (దిష్ట్యా అపరిహీన రాజధర్మః ఖలు స రాజా!)

---

అని శేషము), మయూరీ ఇవ = నెమిలి కోమలివలె, చకితోత్కణ్ఠితం = భయపడినదానవును, (ఉత్కంఠ=) అర్మిలిగలదానవునుంగా, స్థితా=ఉన్నావు!

వట్టి శబ్దము వినఁబడినది, ఏమాటయైనదియు తెలియలేదు, ఎందుండి యైనదియు తెలియలేదు; దానికే ఇట్టులైనావేమమ్మా! భయపడితివి! ప్రీతితోడి కోరికను (ఆసను) జెందితివి! అదెట్లనఁగా, తటాలున మేఘరవము విన్నయాడు నెమిలివలె!

తమసకు రామకంఠము రామవాక్కు శ్రుతచరమే. ఐనను చక్కఁగా అనవాలు పట్టలేకపోయినది. మాటలు ఫలానా అని తెలియలేదు. పలుకు మాత్రము వినవచ్చినది. సీతకే వ్యక్తమయినది. అదే అనురాగమహిమ. దానితో సీతకు కలిగిన యాప్యాయనమునకు తమస అచ్చెరువందుచు ఇట్లు పలికినది. నెమలికి మేఘరవమునకై ఆస ప్రసిద్ధము.

భగవతి - సీతకు తమసయెడ దేవతగా ఉపచారము. స్వరసంయోగేన - పలుకు (=గొంతు) సవ్వడిచేత, ప్రత్యభిజ్ఞాతమ్=ఆనవాలు పట్టఁబడినది.

శ్రూయతే=వినంబడుచున్నది - నేను విన్నాను - ఆమాట నా చెవికి వచ్చినది. శూద్రస్య దణ్డధారణార్థమ్ = శూద్రునికి దండన ఒసంగుటకై, ఐక్ష్వాకః రాజా = ఇక్ష్వాకుగోత్రపు రాజు - రాముఁడు - నీ యార్యపుత్రుఁడు.

దిష్ట్యా = ఆహా - ఇది సంతోషముం దెలుపును. అపరిహీనరాజధర్మః = కొఱవడని రాజధర్మముగలవాఁడు - రాజై తన్ను తటిమినాఁడు, రాచకార్యములను మానక చేయువాఁడని నిందాగర్భముగా చెప్పుట గాదు- జానకి ఎప్పుడుగానీ, అట్లు చెప్పునది కాదు - ఇది మతి హార్దమైన మెచ్చుకోలే అగును. (I - ౧౨) 'యది వా జానకీమపి । ఆరాధనాయ లోకస్య ముఞ్చతో నాస్తి మే వ్యథా.' అన్న మాటలను విన్నవాఁడును 'అత ఏవ రాఘవధురన్ధర, ఆర్యపుత్రః' అన్నది. చూ. (I)

( నేపథ్యే )

శ్లో॥ యత్ర ద్రుమా అపి మృగా అపి బన్ధవో మే
యాని ప్రియాసహచరశ్చిర మధ్యవాత్సం,
ఏతాని తాని బహునిర్ఝరకన్దరాణి
గోదావరీ పరిసరస్య గిరేస్తటాని. 3

సీతా—(దృష్ట్వా) హా! కహం! పహాదచందమండ లాపండుర పరిక్ఖామ దుబ్బలేణ ఆఆరేణ అలం గంభీరాణుహావ మేత్త పచ్చహిజాణీదో అజ్జఉత్తో ఎవ్వ. హా! మం ధారేహి.

---

విమానరాజ అత్రైవ - మొదలుకొని ఒకటే రామభాషితము - 'యత్రద్రుమా అపి' ఇత్యాదియు 'అన్తర్లీనస్య' ఇత్యాదియునై, 'హా...విదేహరాజపుత్రి! (మూర్ఛతి)' వఱకును, ఆయనకు సీతాతమసలు తిరస్కృతిమహిమచే అగపడరు, వినఁబడరు. ఆయన వీరికి అగపడును, ఆయనమాటలు వినఁబడును. ఆయన భాషితము అవయవము అవయవముగా వీరికి వినంబడినపుడు, వీరికి కలుగు భావములును వీరు పలుకుమాటలును దానికి నడుమ అగపడుచున్నవి, చొచ్చుకొనుచున్నవి. కవి అట్టి సంవిధానముం గల్పించినాఁడు. ఈ యంకమంతయు నిట్లే - దీనిని ప్రేక్షకులకుం జూపి తాత్త్వికబుద్ధి గొల్పుటకు ప్రతిభ అవసరము, ప్రేక్షకులకును ఒకింత భావనాబలము అపేక్షితము. నేఁడు సులభములగు వలతెరలు మంచుతెరను సన్నని యద్దమువలెను ఉండు మేలి పట్టుతెరలు మొదలైనవానితో నిపుణముగా ఈయంకమును రంగానం జూపఁదగునేమో!

శ్లో. 3. యత్రేతి - యత్ర = ఎచట (వేనియందు), ద్రుమా అపి = చెట్లు సయితము, మృగా అపి = లేళ్ళుసయితము, మే = నాకు, బన్ధవః = (అనఁగు) చుట్టములో, యాని = వేనియందు, ప్రియాసహచరః = ప్రియనుకూడినవాఁడనై, చిరం = చాలకాలము, అధ్యవాత్సమ్=కాపురముంటినో, తాని=అవే, బహునిర్ఝరకన్దరాణి= పెక్కు సెలయేళ్ళును గుహలును గల, గోదావరీపరిసరస్య = గోదావరిచెంగటనున్న, గిరేః=కొండయొక్క, తటాని=దరులు, ఏతాని=ఇవిగో.

నేను ప్రియంగూడి మునుపు చిరము కాపురముండిన యాగోదావరిదాపు కొండదరులు ఇవిగో; పెక్కు సెలయేళ్ళు (అవి మొఱయు) గుహలుగలవి. ఇందు చెట్లును, లేళ్లును గూడ నాకు చుట్టములై యుండెను.

[హా కథం ప్రభాతచన్ద్రమణ్డలాపాణ్డురపరిక్షామదుర్బలే నా కారేణ గమ్భీరానుభావమాత్ర ప్రత్యభిజ్ఞాతః ఆర్యపుత్ర ఏవ! త న్మాం ధారయ.] (ఇతి తమసా మాశ్లిష్య మూర్ఛతి.)

తమసా—(ధారయన్తీ) వత్సే సమాశ్వసిహి, సమాశ్వసిహి.

( నేపథ్యే )

అనేన పంచవటీదర్శనేన.

అన్తర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః,
ఉత్పీడ ఇవ ధూమస్య మోహః ప్రా గావృణోతి మామ్. ౮

---

ప్రియాసహచరితుఁడనై హాయిగా నుండిన యీ చోటికి నేఁడిట్లు దైవవశమున ఒంటరిగా వచ్చుట కలిగినది! అయ్యో!—అని యనుకొనుట.

హా — కథం = ఎట్లూ! — అని ఆశ్చర్యార్థకముగాని, ప్రశ్నార్థకము గాదు. ఇట్టిది నాటకసంభాషణలో పలుమాఱు ప్రయోగింపఁబడుచుండును. ప్రభాతచన్ద్ర......దుర్బలేన = ప్రాతఃకాలమందలి చంద్రమండలమువలె పాలి చిక్కి బలహీనమైన యాకారముతో, అయం = ఈయన, గమ్భీరానుభావమాత్రప్రత్యభిజ్ఞాతః = గంభీరమైన (తన సొంత) కాంతిచేతమాత్రమే ఆనవాలు తెలియుచున్నాఁడు! ఎఱుకవడుచున్నాఁడు — అనుట, మాం ధారయ=నన్ను పట్టుకొనుము. ఇట్టే యీయనం జూడఁగా నేను నన్ను సమాళించుకొనలేకయున్నాను. నాదుఃఖమును భరింపలేకయున్నాను — మూర్ఛవచ్చుచున్నది — అనుట. తమసాం ఆశ్లిష్య మూర్ఛతి = తమసను కౌఁగిలించుకొని మూర్ఛిల్లినది — ఇది రెండవతూరి మూర్ఛిల్లుట. సమాశ్వసిహి=ఊఱడిల్లుము — అని తమస తేర్చుచున్నది. అనేన పఞ్చవటీదర్శనేన= ఈ పంచవటి దర్శనముచేత.

శ్లో. ౮. అన్తర్లీనస్యేతి-అంతః లీనస్య=హృదయమున (లీనమై) దాగి యున్నదియు, అద్య=ఇపుడు, ఉద్దామం=అఁకను ఎగఁద్రోసికొని, జ్వలిష్యతః=మండఁబోవుచున్నదియు నగు, దుఃఖాగ్నేః = దుఃఖాగ్నియొక్క, ప్రాక్ = మున్ను లేచెడి, ధూమస్య ఉత్పీడ ఇవ=పొగ ముత్తమో యన. మోహః=మూర్ఛ, మాం=నన్ను, ఆవృణోతి=కమ్ముచున్నది.

సీతను అడవిపాలుచేసిన దుఃఖము నాఁడెట్లో భగ్గుమనిమండినట్టిది, హృదయమున లీనమై కుములుచునే యున్నది ఇపుడు సీతాసహవాస విస్రంభసాక్షులను ఇటచూడఁగా అది అడ్డులేక భగ్గుమనఁబోవుచున్నది. దానికిముందు లేచెనుపొగ ముత్తమో యన నన్ను మూర్ఛ కమ్ముచున్నది.

హా! ప్రియే! జానకి!

తమసా—(స్వగతమ్) ఇదం తదాశఙ్కితం గురుజనేనాపి.

( నేపథ్యే )

హా! దేవి, దణ్డకారణ్యవాసప్రియసఖి! హా! విదేహరాజపుత్రి!

సీతా—హద్ధీ! హద్ధీ! మం మంధభాఇణిం వాహరిఅ ఆమీలంతణేత్తణీలుప్పలో ముచ్ఛిదో ఎవ్వ అజ్జఉత్తో! హా! ధరణిపిట్ఠే కహం! ణిరుద్ధణీసాస ణీసహం విపల్హత్థో! భఅవది తమసే పరిత్తాహి పరిత్తాహి, జీవావేహి అజ్జఉత్తం. (ఇతి పాదయోః పతతి)

[హాధిక్ హాధిక్! మాం మన్దభాగ్యాం వ్యాహృత్య ఆమీలన్నేత్ర నీలోత్పలో మూర్ఛిత ఏవార్యపుత్రః! హా! కథం! ధరణీపృష్ఠే నిరుద్ధనిశ్వాస నిస్సహం విపర్యస్తః! భగవతి తమసే పరిత్రాయస్వ పరిత్రాయస్వ! జీవయార్యపుత్రమ్.]

---

మంటకు ముందు ఎక్కువ పొగ, అంతట మంట కదా. ఇందుండి తేలఁగానే, అపరాని యేడ్పులు ప్రవర్తిల్లును - అనుట. ఇదం తత్ ఆశఙ్కితం గురుజనేనాపి - ఇదే అది, గురుజనులుకూడ ఆశంకించినట్టిది - కలుగునని దిగులుపడినట్టిది - గురుజనులు - అటు లోపాముద్రయు, ఇటు భాగీరథీదేవియు — పెద్దలు, తల్లులంబోనివారు.

హా ప్రియే జానకి! హా దేవి దణ్డకారణ్యవాసప్రియసఖి! - ఇదెల్ల ఒక్కటే రామవాక్యము. అది సీతాతమసలకు అదృశ్యులుగానున్నవారికి వినంబడును. అవయవావయవమునకు వారు దానికి ఏమో అనుకొందురు. వారిభాషితములు, రామునకు వినఁబడనివి, మఱి యీయనమాటలకు సంబంధపడినవే నడుమనడుమ వినఁబడును.

మన్దభాగ్యాం వ్యాహృత్య = భాగ్యహీనురాలిని పేర్కొని, ఆమీలన్నేత్ర నీలోత్పలః = మొగుడుచున్న నల్లకలువలంబోని కన్నులుగలవాఁడై, నిరుద్ధనిశ్వాస నిస్సహం = ఊపిరియాడకయు, (దాననే) తాళలేక, విపర్యస్తః = 'దబ్బున' పడినాఁడు - చాఁపకట్టుగా పడినాఁడు అనుట. పరిత్రాయస్వ=కావుము, జీవయ=బ్రదికింపుము. '- నేత్రనీలోత్పలః' - పురుషుని నేత్రములకు ఉత్పలసామ్యము అరుదు. అయినను మూర్ఛపడుచున్నవానియందు, తెల్లకాంతికన్నను, నల్లకాంతి తోఁచుటం జేసి మహాకవి యీసామ్యము నిర్దేశించినాఁడని స్వారస్యము గ్రహింపఁదగును.

తమసా—

శ్లో॥ త్వమేవ నను కల్యాణి సఞ్జీవయ జగత్పతిం;
ప్రియస్పర్శో హి పాణిస్తే తత్రైవ నియతో భరః. ౫

శ్లో. ౫. త్వమేవేతి - నను కల్యాణి=ఓ కల్యాణీ, త్వం ఏవ=నీవే, జగత్పతిం= జగములకు ప్రభువైన శ్రీరాముని, సఞ్జీవయ=బ్రదికింపుము. మూర్ఛనుండి తేర్పుము. హి = ఏలన, తే పాణిః = నీచేయి, ప్రియస్పర్శః = (ఆయనకు) ప్రియమగు తాఁకు గలది. తత్ర ఏవ=దానియందే, భరః=భారము, బ్రదికించితీఱవలయుట, నియతః= తప్పకయున్నది. భరము అనఁగా రక్షణము అనియేనియు.

ఓ కల్యాణీ, నీవే జగత్పతియగురాముని మూర్ఛ తేర్పుము. నీచేతితాఁకు ఆయనకు మిగులప్రియము. నీవు తాఁకినమాత్రకు ఆయనకు మూర్ఛతొలఁగును. (కావున) అందే యున్నది తప్పక ఆయనరక్షణము.

తుల్యసంవిధానమున కుందమాలలో సీత రాముని ఆలింగనముచేసికొన్నది. అట్లు చెప్పుటకన్నను ఇట్లు తాఁకుం జెప్పుట మెఱుఁగు.

చూ. "సీతా - హాధిక్ హాధిక్ మోహంగత ఆర్యపుత్రః!......శోకా వేగ బలాత్కారితా ఆత్మనః నప్రభవస్తి ఈదృశం సాహస మనుతిష్ఠామి...(పరి ష్వజతే)

రామః - (ప్రత్యాగమనం నాటయతి).........(విలపన్) గాఢ మాలిఙ్గ వైదేహి దేహి మే దర్శనం ప్రియే ....................." కున్దమాలా - IV. విక్రమోర్వశీయమున అనంగక్లిష్టాంగుని పురూరవుని ఆతనికిం దెలియనీక ఉర్వశి కనులుమూసి తాఁకను, అపుడు—

"రాజా - (స్పర్శం రూపయిత్వా) నారాయణోరుసమ్భవా సేయం వరోరూః

.................................

అఙ్గ మనఙ్గక్లిష్టం సుఖయే దన్యా న మే కరస్పర్శాత్
నోచ్ఛ్వసితి తపనకిరణై శ్చన్ద్ర స్యేవాంశుభిః కుముదమ్." విక్రమో - III - 16. అట్లే మరల నాలవయంకమునను—

"రాజా - (నిమీలితాక్ష ఏవ స్పర్శం రూపయిత్వా) అయే!
ఉర్వశీగాత్రసమ్పర్కా దివ నిర్వృతం మే శరీరమ్.

......................................

అతో వినిద్రే సహసా విలోచనే
కరోమి న, స్పర్శవిభావితప్రియః. విక్రమో - IV - 69.

సీతా—జంహోది తం హోదు. జహా భఅవఈ ఆణవేది. [యద్భవతి తద్భవతు. యథా భగవత్యాజ్ఞాపయతి]

(ఇతి ససమ్భ్రమం నిష్క్రాన్తా.)

[తతః ప్రవిశతి భూమ్యాం నిపతిత స్సాస్రయా సీతయా హృది స్పృశ్యమాన స్సాహ్లాదోచ్ఛ్వాసో రామభద్రః.]

సీతా—(సహర్షం స్వగతమ్) జాణే పుణోవి పచ్చాఅదం జీవిదం తెళ్ళోఅణాహస్స, [జానే పున రపి ప్రత్యాగతం జీవితం త్రైలోక్యనాథస్య.]

రామః—హన్త! భోః! కిమేతత్!

శ్లో॥ ప్రశ్చ్యోతనం ను హరిచన్దనపల్లవానాం!
నిష్పీడితేన్దు కరకన్దళజో ను సేకః!

---

ఆ స్పర్శను దానికార్యమును భవభూతి కడునిపుణముగా అవలంబించుచున్నాఁడు.

యద్భవతి తద్భవతు-ఏమగునో అది కానిమ్ము-ఏమైన నగుఁగాక. అనంగీకృత సన్నిధానమునకు కోపము వచ్చిన రానిమ్ము, మఱేమైననుం గూడఁ గానిమ్ము-అన్న మాట,

సాహ్లాదోచ్ఛ్వసః - ఆహ్లాదముతో ఉచ్ఛ్వసిల్లుచున్నవాఁడు - అనఁగా మూర్ఛ తేఱుచున్నవాఁడు.

జానే=తలంతును. త్రైలోక్యనాథస్య - రాముఁడు ముల్లోకములకు ప్రాపు. కావున ఆయన సంజీవనము ముల్లోకములకు అక్కఱ.

హన్త - ఇతిహర్షే - ఓహో! భోః - ఎవరిక్కడ! అని యాశ్చర్యముతో తడవుకొనుట. కిమేతత్ - ఏమి యిది! - అని ఆశ్చర్యార్థకమే - ప్రశ్నకాదు. ప్రశ్నకు అట నెవరును లేరుగదా.

శ్లో. ౬. ప్రశ్చ్యోతనమితి - హరిచన్దనపల్లవానాం = హరిచందనమను ఒక జాతి గంధపు చిగుళ్ళయొక్క (పసరుయొక్క - పసరును అనుట), ప్రశ్చ్యోత - నం ను=దట్టముగా చిలుకుటో - అనఁగా - పూయుటయో! నిష్పీడితేన్దు కరకన్దళజః=

ఆర్తప్రజీవితతరోః పరితర్పణో మే
సఞ్జీవనౌషధిరసో ను హృది ప్రసిక్తః? ౬

అపిచ

శ్లో॥ స్పర్శః పురా పరిచితో నియతం స ఏష,
సఞ్జీవనశ్చ మనసః పరిమోహనశ్చ,
సన్తాపజాం సపది యః ప్రతిహృత్య మూర్ఛా
మానన్దనేన జడతాం పున రాతనోతి. ౭

---

పిండఁబడిన చంద్రుని కిరణముల కొనల రసమునం గలిగిన - రసముతోడి అనుట - సేకః ను = చిలుకుటయో, - తడుపుటయో! మే=నాయొక్క, ఆర్తప్రజీవితతరోః = (దుఃఖమున) గాచఁబడిన ప్రాణమనెడి చెట్టునకు, పరితర్పణః = తృప్తి కలిగించు నదై, సఞ్జీవనౌషధిరసః = సంజీవనమను (ప్రాణము పోయినపుడు బ్రదికించునదైన) ఓషధియొక్క రసము, హృది= డెందాన, ప్రసిక్తః ను=అలందఁబడినదో!

శ్లో. ౭. స్పర్శఇతి—ఏషః = ఇది, నియతం = తప్పక - నిశ్చయముగా, సఞ్జీవనః చ=మూర్ఛ తేర్చునదియు, మనసః=చిత్తమునకు, పరిమోహనః చ = మైమఱపు కలిగించునదియు నగు, పురా పరిచితః = మునుపుపరిచితమైన, సః స్పర్శః = అల్లయూతాఁకుడే, యః = ఏది - అనఁగా ఇది, సన్తాపజాం మూర్ఛాం సపది ప్రతిహృత్య = దుఃఖమువలన కలిగిన మూర్ఛను ఇపుడె మాన్పి - తొలగించి, ఆనన్దనేన = ఆనందము కలిగించుటచేత, పునః= వెండియు, జడతాం=మ్రానుపాటును, ఆతనోతి=కలిగించుచున్నది.

ఏమియిది! నా కెఱుంగరాక యున్నది! హరిచందనపుఁ జిగుళ్ళరసమునో, చంద్రకిరణాలకొనలరసమునో చిక్కగా చల్లి యలందినటులున్నది! దుఃఖాన మాడిన నా ప్రాణవృక్షమునకు హాయి కలిగించునట్లుగా నాయురమున సంజీవని తీఁగరసము పూసినట్లున్నది! ఈతాఁకుడు నాకు మునుపు పరిచితమైనదే, పోయిన ప్రాణము మరల వచ్చునట్లు చేయునది, మనోమోహకమైనది. అది సోకఁగానే దుఃఖాన కలిగిన యామూర్ఛ తటాలున తేఱి, మరల ఆనందమువలన మైమఱపు (=మ్రాన్పాటు) గలుగుచున్నది!

'హరిచన్దన' - పసపువన్నెగల యొకజాతి గంధపుచెట్టు - గోశీర్షక మనంబడునది - దానికి శైత్యసౌరభ్యము లెక్కువ. కాళిదాసు పలుమాఱు ప్రస్తావించినది. కరకన్దలజ - కరములు మింటినుండి క్రిందికి ఉండునవి. కాన వాని యమృతము ఆకొనలకు దిగి సమృద్ధముగా నుండును, పిండఁగానే మఱింతగా నిష్యందము

సీతా—(ససాధ్వసకరుణం కిఞ్చి దపసృత్య) ఎత్తిఅం ఎవ్వ మే దాణిం బహుదరం. [ఏతావ దేవ మే ఇదానీం బహుతరం.]

రామః—(ఉపవిశ్య) నను ఖ ల్విదానీం దేవ్యా వత్సల యాభ్యుపపన్నోఽస్మి.

సీతా—హద్ధి హద్ధి కిం త్తి మం అయ్యఉత్తో మగ్గిస్సది? [హాధిక్! హాధిక్! కిమితి మా మార్యపుత్రో మార్గిష్యతి?]

రామః—భవతు పశ్యామి.

సీతా—భఅవది తమసే ఓసరమ్హ, జఇ దావ మం పెక్ఖిస్సది తదో అణబ్భణుణ్ణాద సంణిహాణేణ అహిఅదరం మమ మహారాఓ కుప్పిస్సది. [భగవతి తమసే, అపసరావః. యది తావ న్మాం ప్రేక్షిష్యతే,

---

వచ్చును - అనుట. 'సఞ్జీవనౌషధి' - ఇదియు ప్రసిద్ధము. చల్లఁగా ఆప్యాయముగా ప్రాణమునిచ్చునది - మూర్ఛను తొలఁగించునది. మాడినచెట్టును తడిపి చిగిరింపఁ జేయునది. జడత మూర్ఛయందుం గలదు, మైమఱపునందుం గలదు. అది సంతాపజము, ఇది ఆనందజము. పరిచితమే - అనుటచే, ఇది సీత చేతితాఁకుడుగా నున్నది. మఱి యెదెక్కడిది! అసంభవముగదా అనుకొనుట. ససాధ్వసకరుణం - భయముతోను, దుఃఖాన జాలితోఁచునట్లును. అపసృత్య=ఓసరిల్లి, ఏతావత్ ఏవ ఇదానీం మే బహుతరం - ఈపాటియే ఇపుడు నాకు ఎంతో యెక్కువ. ఇది సీత కృతజ్ఞత. రామునికి సమయాన ఇట్లు సంజీవనము చేయు నవకాశము తనకు కలిగినదిగదా- అందుచేత అన్నమాట. 'నన్నేల తాఁకినది' అని కోపపడక 'జడతా మాతనోతి' అని యన్నాఁడే - అందులకును.

నను ఖలు అభ్యుపపన్నః అస్మి = అనుగ్రహింపఁబడినవాఁడను కాఁబోలు - అని యనుకొనుట. 'వాత్సల్యముచే సీతాదేవి అనుగ్రహించినది కావలయు!'

మార్గిష్యతి? - వెదకునా ఏమి? తత్కాలసంభ్రమమున సీతకు తన యదృశ్యత మఱపునకు వచ్చును. దాన భయ మించుక కలుగును.

భవతు పశ్యామి = కానీ పరికించెదను - ఆమాట వినఁగా తన్ను వెదకునను భయ మెక్కువయగును.

అనభ్యనుజ్ఞాత సన్నిధానేన=అనుమతి, అంగీకారము లేని నా సన్నిధానము చేత - మహారాజః - 'ఆర్యపుత్రః' అనలేదు - రాజభావమున కోపించుటయు దండించుటయు - వాఁడు తఱుముటయు. అదియే సీతకు జ్ఞాపకము - అని. వనదేవతానాం

తతోఽనభ్యనుజ్ఞాత సన్నిధానేన అధికతరం మే మహారాజః కోపిష్యతి.]

తమసా—అయి వత్సే, భాగీరథీప్రసాదా ద్వనదేవతానా మప్యదృశ్యాసి సంవృత్తా.

సీతా—అం అత్థి ఏదం. [అస్ అస్త్యేతత్.]

రామః—నను ప్రియే జానకి!

సీతా—(సమన్యుగద్గదం) అజ్జఉత్త అసరిసం ఖు ఏదం వఅణం ఇమస్స వుత్తంతస్స! (సాస్రం) అహవా కింతి వజ్జమఈ జమ్మంతరేవి అసంభావిద దుళ్ళహ దంసణస్స మం ఎవ్వ మందభాఇణిం ఉద్దిసిఅ వచ్ఛళస్స ఎవ్వంవాదిణో అజ్జఉత్తస్స ఉవరి ణిరణుక్కోసా హువిస్సం? అహం ఏఅస్స హిఅఅం జాణామి మమ ఏసో త్తి. [ఆర్యపుత్ర అసదృశం ఖ ల్వేత ద్వచనం అస్య వృత్తాన్తస్య! అథవా కిమితి వజ్రమయీ జన్మాన్తరేపి అసమ్భావితదుర్లభదర్శనస్య, మామేవ మన్దభాగినీ ముద్దిశ్య వత్సల స్యైవంవాదిన ఆర్యపుత్ర స్యోపరి నిరనుక్రోశా భవిష్యామి? అహ మేతస్య హృదయం జానామి మమ ఏషః. ఇతి.]

---

అపి - మతి నదీదేవతలకు అదృశ్యురాలు - తమసకుఁగాని, గోదావరికిఁగాని. వనదేవత యగు వాసంతిని మనసున ఉంచుకొనియే భాగీరథీభగవతి వనదేవతలకు అగపడనీక అనుగ్రహించినది. రామునికి అగపడమి ఉండనేయున్నది.

సమన్యుగద్గదమ్=శోకమునలని డగ్గుత్తికతో - నన్ను ఎప్పటి ప్రీతిపిలుపుతోనే పిలిచినాఁడే - అవి యీ వివాసమున తలఁపునపరాఁగా శోకము. అసదృశం ఖలు=సరిపడదుగదా. ప్రియురాలను ఇంటినుండి వెడలఁగొట్టుటకును అన్యోన్యవిరోధముగదా. అథవా=అట్లుగాదు, ఇపుడు ఆవిరోధము స్మరణీయము గాదు. అందులకై ఆయనయెడ కాఠిన్యము పూనరాదు, ఇపుడు ఇంత ప్రీతిని ఇంత స్నేహమును చూపుచున్నాఁడు గావున. నిరనుక్రోశా=కనికరములేనిదానను - ఆయన స్నేహమును స్మరింపక కాఠిన్యమును స్మరించుదానను, దాన నన్ను దాఁచుకొనుదానను. అహం ఏతస్య హృదయం జానామి, మమ ఏష ఇతి = నేను ఈయనహృదయము నెఱుంగుదును, ఈయన నాహృదయమును ఎఱుంగును అనుట. వీరి యన్యోన్యస్నేహము

రామః—(సర్వతో విలోక్య సనిర్వేదమ్) హా! అత్ర న కశ్చిదపి!

సీతా—భఅవది తమసే, తహా ణిక్కారణ పరిచ్చాఇణో వి ఏఅస్స ఏవ్వం విహేణ దంసణేణ కేరిసో మే హిఅఆణుబంధో త్తి ణఆణామి! [భగవతి తమసే తథా నిష్కారణపరిత్యాగినో౽ ప్యేతస్య ఏవంవిధేన దర్శనేన కీదృశో మే హృదయానుబన్ధ ఇతి న జానామి!]

తమసా—జానామి వత్సే, జానామి.

శ్లో॥ తటస్థం నైరాశ్యా, దపిచ కలుషం విప్రియవశా,
ద్వియోగే దీర్ఘేఽస్మిన్ ఝటితి ఘటనా త్తమ్భిత మివ,
ప్రసన్నం సౌజన్యా, ద్దయితకరుణై ర్గాఢకరుణం,
ద్రవీభూతం ప్రేమ్ణా, తవ హృదయ మస్మిన్ క్షణ ఇవ. ౧౩

---

నవి అన్యసాక్ష్యము అక్కఱలేదు. ఇది యెపుడును ఒండొంటిపై లోపము వహింపవు. హా కథమ్=హా! ఏమి! - నిర్వేదాశ్చర్యార్థకములు. అత్ర న కశ్చిదపి=ఇట నెవరును లేరే! నిర్వేదము ఎవరును అగపడని యాశాభంగమువలన, ఏవంవిధేన దర్శనేన=ఇట్లు దుఃఖించుచున్న యీయనను ఆకస్మికముగా చూచుటచేత, కీదృశో మే హృదయానుబన్ధః ఇతి = నాహృదయము ఏదశను - ఏ ప్రకారమును - పొంది యున్నదో, న జానామి=ఎఱుంగ లేకున్నాను. అనిర్వాచ్యముగా నున్నది అనుట.

శ్లో. ౧౩. తటస్థమితి - అస్మిన్ క్షణే = ఈనిముసమందు, తవ హృదయమ్=నీ డెందము, నైరాశ్యాత్ = ఆసలేకపోయినందుచేత, తటస్థ (ఇవ) = ఉదాసీనము బలెను, అపి చ=మఱియు, విప్రియవశాత్=తతిమెనన్న యప్రియమువలన, కలుషం (ఇవ) = కలఁగినదిబలెను, అస్మిన్ దీర్ఘే వియోగే = (ఇప్పటికి పన్నెండేండ్లుగా పర్విన) ఈ చిరతరమైన ఎడబాటునందు, ఝటితి ఘటనాత్ త్తమ్భితం ఇవ=ఆకస్మికంపుఁ గలయికచేత ప్రాపు - ఊఁట - గన్నదిబలెను, సౌజన్యాత్=ఆయన మంచితనము (ప్రత్యక్షీకరించుకొన్నందు) వలన, ప్రసన్నం (ఇవ) = (కోపశోకములు లేక) తేటయును దయయును కలదిబలెను, దయితకరుణైః = వల్లభుఁడైన (రాముని) శోకములచేత - శోకపుఁబలుకులచేతను చేష్టలచేతను, గాఢకరుణం (ఇవ)=గాటంపు శోకముగలదిబలెను, ప్రేమ్ణా=అనురాగముచేత - అనుసయనురాగము గన్నందునను

రామః— దేవి,

శ్లో॥ ప్రసాద ఇవ మూర్తస్తే స్పర్శః స్నేహార్ద్రశీతలః.
అద్యాప్యానన్దయతి మాం, త్వం పునః క్వాసి నన్దిని? ౯

---

నీకు అనురాగము కలిగినందునను, ద్రవీభూతం ఇవ=కరంగినదియుంబలెను - ఐనది - అని శేషము.

ఈనిముసమున నీ హృదయము ఎట్లున్నదనఁగా ఈవివాసమున పన్నెండేండ్లయిపోయినందున రామపునర్దర్శనము - ఇఁకను ఈ జన్మలో లేదని, ఆజన్మమును ఇఁక నింతే అని యనుకొన్నందున నిరాశ చెంది తగులకున్నది. ఇట్లు నిష్కారణముగా తఱిమినాఁడే అన్న విప్రియమునకు, అపకారమునకు, కలఁగిపోయినట్లున్నది. ఇన్నాళ్ళకు ఇట్లు డబ్బాటుగా కలసికొన్నందున ఊఱట గన్నట్లున్నది. ప్రకృతిసిద్ధమైన మంచితనమువలన సంతసమును దయయు చెందుచున్నట్లు ఉన్నది ప్రియుని యేడ్పులం జూచి ఏడ్పులపాలగుచున్నది. ప్రేమచేత కరఁగిపోవుచున్నది. ఇట్టి భావముల సమ్మేళనముం బొందుచున్నది.

బహుభావసాంకర్యమును అసదృశముగా వర్ణించినాఁడు, కవి.

అట్లే మాలతిలో మాలతిని అఘోరఘంటుని కత్తినుండి కావఁగన్నప్పుడు మాధవవాక్యము. V - 28-.

రాహోశ్చన్ద్రకలామివాననచరీం దైవాత్ సమాసాద్య మే
దస్యోరస్య కృపాణపాతవిషయా దాచ్ఛిన్దతః ప్రేయసీమ్,
ఆతఙ్కాద్వికలం, ద్రుతం కరుణయా, విక్షోభితం విస్మయాత్,
క్రోధేన జ్వలితం, ముదా వికసితం, చేతః కథం వర్తతే!

కుందమాలలోని యీసంవాదకల్పమును గనందగును.—

'అహో దృష్ట ఇతి పరితోషః, చిరప్రవాస ఇతి మన్యుః, పరిత్యాగ ఇత్యుద్వేగః, నిరనుక్రోశ ఇత్యభిమానః, చిరపరిచిత ఇత్యనురాగః, దర్శనీయ ఇత్యుత్కణ్ఠా, స్వామీతి బహుమానః, కుశలవయోః పితేతి కుటుమ్బినీసద్భావః, అపరాధం ప్రవేశితాస్మీతి లజ్జా.— న జానామి ఆర్యపుత్రదర్శనేన కీదృశీమవస్థామనుభవామీతి."

దీనికి అనుకరణమును, సంస్కరణమును, విపులీకరణమును భవభూతియెడ ఇటను ఇఁకముందును పరికింపఁదగును.

శ్లో. ౯. ప్రసాదేతి_నన్దిని=ఆనందముకలుగఁజేయుచున్నదానా, మూర్తః=రూపుఁగొన్న, ప్రసాద ఇవ = అనుగ్రహమో యన, స్నేహార్ద్రశీతలః = (నాకైన)

సీతా—ఏదే ఖు దే అగాధ దంసిద సణేహసంభారా ఆణం దణిస్సందిణో సుహామఆ అజ్జఉత్తస్స ఉల్లావా, జాణం పచ్చఏణ ణిక్కారణ పరిచ్చాఅ సల్లిదోవి బహుమదో మే జమ్మలాహో. [ఏతే ఖలు తే అగాధ దర్శిత స్నేహసమ్భారా ఆనన్దనిష్యన్దినో సుధామయా ఆర్యపుత్రస్య ఉల్లాపాః, యేషాం ప్రత్యయేన నిష్కారణపరిత్యాగ శల్యితోఽపి బహుమతో మే జన్మలాభః.]

రామః—అథవా. కుతః ప్రియతమా? నూనం సఙ్కల్పాభ్యాసపాటవోపాదాన ఏష భ్రమో రామభద్రస్య.

---

కూరిమితో తడిసి చల్లగానున్నట్టి, తే స్పర్శః = సీతా! నీ, అద్యాపి=ఇపుడుకూడ, మాం=నన్ను, ఆనన్దయతి = ఆనందము చెందించుచున్నది - సంతోషపెట్టుచున్నది, పునః=మఱి, త్వం=నీవు, క్వ అసి=ఎటనున్నావు?

ఆనందమిడుదానా, సీతా! నీ, రూపు దాల్చిన నీయనుగ్రహముంబోనిది, ఎప్పటికప్పుడు క్రొత్త (పచ్చి)గా నుండు స్నేహముతో చల్లగా నుండునట్టిది, ఇట్లు ఇప్పుడును నాకు ఆనందమిడుచున్నదే, మఱి నీ వెక్కడనున్నావే ప్రేయసీ!

అద్యాపి - ఇపుడును - ఆ ప్రసాదమునకును ఆ స్నేహమునకును అవకాశము లేని ఈ పన్నెండేండ్ల వివాసమున ఈ యడవిలో సయితము. 'ఆర్ద్రయతి' అనుటకన్నను 'ఆనన్దయతి' అనుపాఠము శ్రేయము. సీతా! నీ అగపడుచున్నది, నీవు అగపడకున్నావే! - అనుట.

అగాధ దర్శిత స్నేహసంభారాః=లోఁతు ఇంత యని చెప్పనలవిగాని యట్లు ప్రకటింపఁబడిన స్నేహంపుఁ బెను మొత్తముగలవి - మిక్కిలి స్నేహముతో నిండినవి, ఆనన్దనిష్యన్దినః=ఆనందము కాఱుచున్నట్టివి, ఉల్లాపాః=ఉప్పొంగి చెప్పిన మాటలు - దుఃఖభారము పొంగి పొరలినట్లు చెప్పినమాటలు. సీతకు రాముఁడు అగపడుటయు, రామభాషితములు వినఁబడుటయు, ఆమె మనసులోని నిష్కారణపరిత్యాగశల్యము ఊడుటకే. 'నిష్కారణ' - ఈనాటకమున అకారణము - జననింద - ఆమె చెవిలో వేయనే లేదు. యేషాం ప్రత్యయేన=వేనియందలి - అనఁగా వీనియందలి - అనుట - నమ్మికచేత - బహుమతః - సమ్మతః - మిక్కిలి ప్రియమైనది. సీతకు రామునిమీఁద ఇంచుకయు కోపము లేదు.

అథవా = కాదు, కాదు. సఙ్కల్పాభ్యాసపాటవోత్పాదితః = మాటిమాటికి కూర్చుకొన్నకోరిక (=తలఁపు) బలముచే కలిగినట్టిది - భ్రమ - రాముఁడు తన్ను 'రామభద్రుఁడు' అని నిర్దేశించుకొనుచున్నాఁడు, సీతప్రీతి తలఁపునకురాఁగా.

( నేపథ్యే )

ప్రమాదః! ప్రమాదః!

'సీతా దేవ్యా స్వకరకలితై 'రి త్యాది పూర్వార్ధం పఠ్యతే.

రామః—(సకరుణౌత్సుక్యం) కిం తస్య ?

( పున ర్నేపథ్యే )

( 'వధ్వా సార్ధమి' త్యుత్తరార్ధం పఠ్యతే. )

సీతా—కో దాణిం అహిఉజ్జిస్సఇ. [క ఇదానీం అభియోక్ష్యతే?]

రామః—ఆః క్వాసౌ దురాత్మా యః ప్రియాయాః పుత్రకం వధూ ద్వితీయ మభిభవతి ? (ఇత్యుత్తిష్ఠతి.)

వాసన్తీ—(ప్రవిశ్య సంభ్రాన్తా) కథం దేవో రఘునాథః!

సీతా—కహం! పిఅసహీ మే వాసంతీ! [కథం! ప్రియసఖీ మే వాసన్తీ!]

వాసన్తీ—జయతు దేవః.

రామః—(నిరూప్య) కథం! దేవ్యాః ప్రియసఖీ వాసన్తీ!

వాసన్తీ—దేవ త్వర్యతామ్ త్వర్యతామ్ ఇతో జటాయుశిఖ

---

సకరుణౌత్సుక్యమ్=జాలితోను, ప్రమాద మేమో యెఱుంగు కోరికతోను, కిం తస్య=ఏమిదానికి ? అది సీత కంతో అంతే తనయను అనుంగు కదా.

క ఇదానీం అభియోక్ష్యతే=ఇపుడు ఎవరు (దానిని ఎదుర్కొని) దండింతురు?

క్వాసౌ దురాత్మా=ఎక్కడ అదుష్ట(గజ)ము, యః అభిభవతి=ఏది పైకొను చున్నదో. పుత్రకం=పెంపుడు పుత్రుని.

ప్రవిశ్యసంభ్రాన్తా=సంభ్రాంతురాలు ప్రవేశించి - ఏనుఁగునాపదవలని దిగులు వలననో, రాముని యాకస్మిక దర్శనమువలననో, ఉభయమువలననో - సంభ్రమము - తత్తఱపాటు. కథం! - ఏమి! - ఆకస్మికతవలని యాశ్చర్యమును దెలుపును. అట్లే కథం! ప్రియసఖీ - అనుటయందును. అట్లే కథం! దేవ్యాః - ఇత్యాదియందును. జయతిదేవః - ఇది అచారోక్తి, మహారాజుప్రథమదర్శనమున. జటాయు శిఖరస్య=

రస్య దక్షిణేన సీతాతీర్థేన గోదావరీ మవతీర్య సమ్భావయతు దేవ్యాః పుత్రకం దేవః.

సీతా—హా! తాద జడాఉ, అజ్జ సుణ్ణం తుఏ విణా జణట్ఠాణం! [హా! తాత జటాయో, అద్య శూన్యం త్వయా వినా జనస్థానం!]

రామః—అహహ హృదయమర్మచ్ఛిదః ఖల్వమీ కథోద్ఘాతాః.

వాసన్తీ—ఇతఇతో దేవః!

సీతా—భఅవది సచ్చం ఎవ్వ వణదేవదా వి మం ణ పెక్ఖంది. [భగవతి సత్యమేవ వనదేవతా అపి మాం న పశ్యన్తి.]

తమసా—అయి వత్సే, సర్వదేవతాభ్యః ప్రకృష్ట మైశ్వర్యం భగవత్యా మన్దాకిన్యాః. తత్కిమిత్యాశఙ్కసే?

సీతా—తదో అణుసరమ్హ. (పరిక్రామతః.) [తతోఽనుసరామః.]

రామః—భగవతి, గోదావరి, నమస్తే.

---

జటాయుశిఖరమునకు - సీతాతీర్థేన=ఆ పేరుగల రేవున, సమ్భావయతు=ప్రాపు అగును గాక - లేక - చిత్తగించును గాక. తాత=నాయనా-ఇది తెనుఁగులోని 'తాత' కాదు. దీనికి తెనుఁగు 'తాతుఁడు' అగును. త్వయా వినా = నీవు లేక, జటాయువులేని జనస్థానమును సీత మున్నెన్నడును చూడలేదు - ఇదె తొలుమాఱు. మునుపు జనస్థానమున సీత చొచ్చినదిమొదలు, రావణాపహృతయై దానిని విడిపోయినంతవఱకు అందు జటాయువు తోడుగా నున్నవాఁడే. ఒక నాఁడైనను ఆయన యెడబాటు కలుగలేదు. కావున ఇపుడు మిక్కిలి శూన్యముగా - బోసిగా - అగపడుచున్నది.

కథోద్ఘాతాః = కథారంభములు - అనఁగా మునుపటికథల ప్రస్తావములు - జటాయుశిఖర మనుటయు, సీతాతీర్థ మనుటయు ప్రాతకథలను స్మృతికి తెచ్చి, హృదయమర్మచ్ఛిదః=డెందమునందలి యాయువుపట్టులం జీల్చునవి - అట్టి దుఃఖమును గలిగించునవి - గదా - అనుకొనుట. ౦గోదావరి నమస్తే - భాగీరథికి సమానముగా పూజ్య - మునుపు తమ పూజల నందుకొనుచున్నట్టిది - మహానది - రామునికిఁగల తత్పూజ్యభావము ఆయనశీలమును వెలిగించును.

వాసన్తి—దేవ, మోదస్వ. విజయినా వధూద్వితీయేన దేవ్యాః పుత్రకేణ.

రామః—విజయతా మాయుష్మాన్,

సీతా—అమ్హహే ఏరిసో ఏసో సంవుత్తో. [అహో ఈదృశ ఏష సంవృత్తః.]

రామః— దేవి, దిష్ట్యా వర్ధసే!

శ్లో॥ యే నోద్గచ్ఛ ద్విసకిసలయస్నిగ్ధ దన్తాఙ్కురేణ
వ్యాకృష్టస్తే సుతను లవలీపల్లవః కర్ణపూరాత్,
సోఽయం పుత్ర స్తవ మదముచాం వారణానాం విజేతా
యత్కల్యాణం వయసి తరుణే భాజనం తస్య జాతః. ౧౦

---

విజయినా మోదస్వ=విజయముగొన్నవానిచేత సంతోషింపుము - అనఁగా - విజయముగొన్నాఁడు, దాన సంతోషింపుము - అనుట. విజయతాం - వర్ధిల్లునుగాక - అని శుభాశంస, ఆశీర్వాదము పలుకుట.

ఈదృశః ఏషః సంవృత్తః=ఇది యిప్పటికి ఇట్టిదిగా అయినది. దానిని తాను విడిపోయి చిరకాలమైనది. - పదుమూఁడు ఏండ్లైనవి - కావున అట్లు ప్రీతితో తలపోసికొనుట.

దేవి, దిష్ట్యా వర్ధసే! - దేవి, నీవు అదృష్టవంతురాలవు! ఈగజవిజయమున, అది సీత పెంపుడుకొడుకైనందున, సీతకు మేలొనఁగూడిన దని ఇట్లు పలుకుట. దీనిం గాంచి సీతను మిక్కిలి తలంచుకొనుచున్నాఁడు.

శ్లో. ౧౦. యే నేతి - సుతను - శుభాంగిరో, ఉద్గచ్ఛ ద్వి .....ఙ్కురేణ - ఉద్గచ్ఛత్ =పొడతెంచుచున్నదై - విసకిసలయ = తామరతూటికొనలవలె - స్నిగ్ధ = నిగనిగలాడుచున్న - దన్తాఙ్కురేణ - దంతపుమొలకలుగలదైన, యేన = దేనిచేత, తే కర్ణపూరాత్ =నీ కర్ణావతంసమునుండి, లవలీపల్లవః = లవలిచిగురు, వ్యాకృష్టః = లాగఁబడెనో (-మేయఁబడెనో,) సః అయం తవ పుత్త్రకః=నీ యాగారాబుకొమారుఁడు, వీఁడుగో, మదముచాం వారణానాం విజేతా = మదజలము ఓడుచున్న యేనుగుల జయించినవాఁడు(ఐ), తరుణే వయసి=ప్రాయమునందు, యౌవనమునందు, కల్యాణం యత్ =శుభము ఏదియో, తస్య = దానికి - అనఁగా దాంపత్యకల్యాణమునకు, భాజనం జాతః=పాత్రమైనాఁడు.

సీతా—అవిఉత్తో దాణిం దీహాఊ ఇమాఏ సోమ్మదంసణాఏ సమం హోదు. [అవియుక్త ఇదానీం దీర్ఘాయు రనయా సౌమ్య దర్శనయా సమం భవతు.]

రామః—సఖి వాసన్తి, పశ్య, కాన్తానువృత్తిచాతుర్య మపి శిక్షితం వత్సేన!

---

ఓ శుభాంగీ, మునుపు ఈయేనుఁగుగున్న మొలకెత్తుచున్న దంతపు మొలకలు తామరతూటికొనలవలె నిగనిగలాడుచుండఁగా (వాల్లభ్యముచే) నీ కర్ణావతంసముననున్న లవలిచిగురును లాఁగికొని మేసినది. అట్టి నీ ప్రేమపాత్రము, ఇపుడు యౌవనము పొంది, మత్తేభములను జయించి, యీ ప్రాయమున ఏది కల్యాణమో ఆ వధూయోగమును పొందినది - నీపుణ్యము గొప్పది అనుట.

దంతపు మొలకలచేత దాని బాల్యమును అప్పటి దాని సౌభాగ్యమును, 'వ్యాకృష్టః' అనుటచే దానికిఁగల చనవును, దానియందలి సీతవాత్సల్యమును సూచింపఁబడినవి. కర్ణపూరాత్ - మఱి యితరములతో, శిరీషోత్పలాదిలో వేఱు రంగుగలదానితో సొబగారునట్లు తెల్లని యీ చిగురును పొదివి అవతంసించు కొన్నది - అని యాదినాల సీత నాజూకు చెప్పఁబడినది. అట్లే గౌరి కలువతోఁగూర్చి స్కందుని నెమిలియీఁకను చెవియందు చెరివికొనునఁట—

'జ్యోతిర్లేఖావలయి గళితం యస్య బర్హం భవానీ
పుత్రప్రేమ్ణా కువలయదళప్రాపి కర్ణే కరోతి' మేఘ - I - 48.

కలువఱేకులో పొదివి - అన్నమాట.

శ్లోకపూర్వోత్తరార్ధములలో వయోభేదము స్పష్టముగా సూచితమైనది - బాల్యము, తారుణ్యము. ఇట్టి భోగము తాఁ గోల్పోయినందులకై రాముని వియోగాగ్ని ప్రదీప్తమగును. అందులకు ఈవర్ణన. 'అవియుక్త ఇదానీం అయం దీర్ఘాయుః అనయా సౌమ్యదర్శనయా భవతు' - దయితవియోగబాధను మునుపును ఇపుడును తనవలె అనుభవించినవారు లేరు గాన, పుత్రప్రేమభరముతో ఈ నిత్యసంయోగముం గూర్చి ఆశీస్సును పలుకుచున్నది. ఇపుడు ఈదీర్ఘాయువు - అనఁగా ఇపుడు ఇట్లు పెండిలియైన యీ దీర్ఘాయువు - ఈ యందములొలుకు పిడితో ఎప్పుడును సంయోగము గలవాఁడే - వియోగ మెఱుంగనివాఁడు - అగును గాక. అట్లే యక్షుఁడు మేఘునియెడ ఆశంసించును—

'మా భూ దేవం క్షణ మపి చ తే విద్యుతా విప్రయోగః.' మేఘ-II-55.

'కాన్తానువృత్తి చాతుర్యం' - కాంతను అనువర్తించి మఱి తన్ను వదలిపోకుండ అనురక్తను చేసికొను నేర్పు - శిక్షితం వత్సేన - పుత్రకుని చేత నేర్వఁబడియున్నది - నేర్చియున్నాఁడు ఇతఁడు - అన్నమాట. ఈ తారుణ్యములో ఆచాతుర్యము తానే వచ్చినది.

శ్లో॥ లీలోత్ఖాత మృణాళకాణ్డ కబళచ్ఛేదేషు సమ్పాదితాః
పుష్యత్పుష్కరవాసితస్య పయసో గణ్డూషసఙ్క్రాన్తయః,
సేక శ్శీకరిణా కరేణ విహితః కామం, విరామే పున,
ర్యత్స్నేహా దనరాళనాళ నళినీపత్రాతపత్రం ధృతమ్. ౧౦

---

శ్లో. ౧౦. లీలేతి — యత్ = ఎట్లనఁగా, లేక ఏమనఁగా, లీలోత్ఖాత...... చ్ఛేదేషు=నాజూకుగా — అదియు ఒకయాటగా తోఁచునట్లుగా — పెకలింపఁబడిన తామరతూటికాడల కబళ తునుకలయందు (తునుకలు చేసి పెట్టిన కబళములయందు,) పుష్యత్ పుష్కర...స్య=విరియుచున్న తెల్లదామరల చేవాసనగలదైన, పయసః= నీటియొక్క, గణ్డూషసఙ్క్రాన్తయః=పుక్కిలింతల పోయుటలు, సమ్పాదితాః= సమకూర్పఁబడినవి. శీకరిణా=తుంపురులుగలదైన, కరేణ=తొండముతో, కామం = తనియునట్లుగా — దండిగా, సేకః = చిలుకుట, విహితః = కావింపఁబడినది. (ఏనుఁగుతొండముచివరఁ బుట్టు మదమునకును శీకరమని పేరు.) విరామే=(దాని) ముగింపునందు, అనఁగా ముగించి మానునపుడు, పునః=మఱి, స్నేహాత్ =కూరిమి వలన, అనరాళనాళనళినీపత్రాతపత్రం=వంకరలేని తొడిమ, లేక కాడగల తామరపాకుగొడుగు, ధృతమ్=పట్టఁబడినది.

ఆ చేయుట యెట్లనఁగా — నాజూకుగా తామరతూండ్లం బెకలించి, తునుకలు చేసి, కబళము కబళముగా నోటఁబెట్టి, వానియందు అప్పుడే విరియుచున్నవగుటచే మిక్కిలియు సౌరభముగలదైన తెల్లతామరపూవుల వాసన యొక్కన నీటి పుక్కిలింతలను పోసినది. తరువాత తొండమునిండ నీరు పీల్చుకొని, దానితో (అప్యాయమైన) శీకరసేకము — తుంపురులుచల్లి స్నానమాడించుట — దానికి తృప్తి కలుగునట్లు చేసినది. మరల — (=మఱియు) కూరిమి మీఱ వంకరలేక సరిగానున్న (పొడుగుపాటి) తూడుగల తామరపాకును గొడుగుగా పట్టినది.

లీల — నాజూకుగా. చమత్కారముగా — దీనిని చూచి కూడ ఆడియేనుఁగు సంతోషించునట్లు — ఛేదములను కవళముకవళముగా అందిచ్చుటయు. కాంతకు పేరు 'కబల' — పదము నమలినది కాఁబోలు. వాసితస్య — అట్టి పరిమళముగల నీటిని తాను తొండమునం దీర్చి, దాని నోటికి పుక్కిలింతగా అందిచ్చుటయు. అట్లే తాప మాఱ, ఇఁక దానికి చాలునని తోఁచునట్లు, శీకరసేకము చేయుటయు. అంతట నిట్టనిగిడిన తూటికాడతోడి తామరపాకును ఎత్తి గొడుగుగా పట్టుటయు. యత్ — దీనిని శ్లోకారంభమున అన్వయించుకొనవలయును. ఆ శిక్షణ ఎట్లనఁగా లేక ఏమనఁగా — అని యర్థము. కాదా యత్ — ఏలయన — ఏల 'శిక్షితమ్' అని చెప్పితి ననఁగా — అని యేనియు అర్థము. ఈశ్లోకము మాలతీమాధవమందును కలదు; అందు

సీతా—భఅవఇ తమసే, అయం దావ ఏరిసో జాదో. దేవ్వుణ ణ ఆణామి కుసలవా ఎత్తిఏణ కాలేణ కేరిసా విఅ హోంతి. [భగవతి

---

పాఠము 'యత్స్నేహాత్' అనుటకు 'నస్నేహాత్' అని కలదు_అది యచట ఉచితమే_ఏలయన దాని యవతారికయైన మాధవభాషితమున_'సాపవాదమ్'_దూషణతో కూడుకొన్నట్లుగా అని యొక్కువ యున్నది. అది యట మాధవునియెడ దానిపై అసూయ చెందినవానియెడ మిక్కిలి తగును. ఇట పుత్రవాత్సల్యమునకును అదిగల రామునికిని ఉచితము గాదు. ప్రకరణములకు వక్తలకుఁ దగినట్లు కవి శ్లోకపాఠముల మార్చినాఁడు. 'ఛేదేషు'_అనఁగా కడులకు కడులకు నడుమ_కడులుమాని నీరు త్రాఁగుట మరల కడులు పెట్టుట_అని ఈవిధముగా అనియేని_'మధ్యే మధ్యే పానీయమ్' అన్నట్లు. ఇట్టి భోగములు తాఁ గోల్పోయినందులకు రాముని విరహాగ్ని దీనను ప్రదీప్తమగును.

శంభుతపోవనమున వసంతమున కాళిదాసుకరేణువు గజమునకు ఇట్టి గండూషము పెట్టినది. అట్లే చక్రవాకము చక్రవాకికి అరనమలిన తామరతూటిం బెట్టినది. కుమార_III_37.

> దదౌ రసాత్ పఙ్కజరేణుగన్ధి
> గజాయ గణ్డూషజలం కరేణుః;
> అర్ధోపభుక్తేన బిసేన జాయాం
> సమ్భావయామాస రథాఙ్గనామా.

ఈ భవభూతియేనుఁగు ఆరెండు ఉపచారములను ఆగురువులకడ నేర్చుకొన్నది. అట్లే ఈప్రస్తావమున కాళిదాసుపురూరవుని యేనుఁగును ఈకవికి మనసున లేకుండునా? విక్ర_IV_44_7.

> “అయ మదిరోద్గతపల్లవ ముపనీతం ప్రియాకరేణుహస్తేన
> అభిలషతు తావ దాసవసురభిరసం సల్లకీభఙ్గమ్.
> అయే కృతాహారకః సంవృత్తః! భవతు, పృచ్ఛామి.
> ........................
> స్త్రీరత్నేషు మమోర్వశీ ప్రియతమా యూథే తవేయం వశా.
> సర్వం మా మను తే; ప్రియావిరహజాం త్వం తు వ్యథాం మానుభూః.
> సుఖమాస్తాం భవాన్. సాధయామస్తావత్.”

అట ప్రకరణమునకు నాయకునకు తగినట్లు అతఁడు, ఇట ప్రకరణమునకు నాయకునకు తగినట్లు ఈతఁడు. కవిగురుశిష్యకుతూహలు స్పష్టములు.

తమసే, అయం తావ దీదృశో జాతః, తౌ పున ర్న జానామి కుశలవౌ ఏతావతా కాలేన కీదృశా వివ భవతః.]

తమసా—యాదృశోఽయం తాదృశౌ తా వపి.

సీతా—ఏరిసీ అహం మందభాఇణీ, జావ ణ కేవళం అజ్జఉత్త విరహో, పుత్తవిరహో వి. [ఈదృ శ్యహం మన్దభాగినీ, యస్యా న కేవల మార్యపుత్రవిరహః, పుత్త్రవిర హోఽపి.]

తమసా—భవితవ్య తేయ మీదృశీ.

సీతా—కిం వా మఏ పసూదాఏ? జేణ తారిసాణం మమ పుత్తఆణం ఈసి విరళ కోమల దస ణుజ్జల కవోలం అణుబద్ధ ముద్ధ కాఅలి విహసిఅం ణిబద్ధ కాఅసిహండఅం అమల ముహపుండరీఅ జుఅలం ణ పరిచుంబిఅం అజ్జఉత్తేణ! [కిం వా మయా ప్రసూతయా? యేన తాదృశయో ర్మమ పుత్రకయోః ఈషద్విరళకోమల దశనోజ్జ్వల

---

అయం తావత్ ఈదృశో జాతః; తౌ పున ర్న జానామి.....ఇది యిట్టిదైనది. ఇంతటిది అయినది. మఱి వారు అకుశలవులు ఇంతకాలమునకు ఏపాటిగా నవుదురో, ఐయుందురో, ఎఱుంగను. దీనిం జూడఁగానే ఆస్మరణము ఆతలంపు మిక్కిలి స్వభావోచితము. తల్లి సుతత్యాగమునుండి పన్నెండేండ్లు చూడఁగానకపోయిన కొడుకులంగూర్చి ఇట్లు తలంచుకొనుట ఎంతయేని సదృశము. ఈదృశీ అహం మన్దభాగ్యా=నేను ఇట్టి మందభాగ్యురాలను, భవితవ్యత=విధివిధానము - తలవ్రాఁత. భవభూతి భవితవ్యతయందలి నమ్మకమును మాటిమాటికి చెప్పును. కిం వా మయా ప్రసూతయా=నేను కన్నదాననై ఏమి? నేను కని యేమిప్రయోజనము - అన్నమాట. 'ప్రసూతా' - ఇట కర్తరి. కులకాంతలకు తమ కన్న బిడ్డను కాంతుఁడు లాలించి ముద్దుగొనిన, అది యెంతో సంతోషము గూర్చును. ఈష ద్విరళ కోమల దశ నోజ్జ్వల కపోలం=ఇంచుక యెడములు గల కోమలదంతములచే భాసిల్లుచున్న చెక్కిళ్ళుగలది - ముఖపుణ్డరీకమునకు విశేషణము. దంతముల యీషద్విరళత కోమలతలవలని సౌభాగ్యమును భవభూతి మాటిమాటికి చెప్పును. అఙ్కే-I. 'ప్రతనువిరళైః - ఇత్యాది - క్రొత్తకోడలైన సీత మొగము వర్ణన. అనుబద్ధ ముగ్ధ కాకలీ విహసితమ్=అంటియున్న (=వీడక కూడు

కపోలం అనుబద్ధ ముగ్ధ కాకలి విహసితం నిబద్ధకాకశిఖణ్డకం అమల ముఖ పుణ్డరీక యుగళం న పరిచుమ్బిత మార్యపుత్త్రేణ!]

తమసా—అస్తు దేవతాప్రసాదాత్.

సీతా—భఅవది తమసే, ఏదేణ అపచ్చసంసుమరణేణ పణ్హుదత్థణీ తాణం అ పిదుణో సంణిహాణేణ ఖణమెత్తం సంసారిణీమ్హి సంవుత్తా. [భగవతి తమసే, ఏతేనాపత్యసంస్మరణేన ప్రస్నుతస్తనీ తయోశ్చ పితు స్సన్నిధానేన క్షణమాత్రం సంసారిణ్యస్మి సంవృత్తా.]

తమసా—కి మత్రోచ్యతే! ప్రసవః ఖలు ప్రకర్ష పర్యన్తః స్నేహస్య. పరమశ్చైత దన్యోన్యసంశ్లేషణం పిత్రోః.

అన్తఃకరణతత్త్వస్య దమ్పత్యో స్స్నేహసంశ్రయాత్,

---

కొన్న) ముద్దులొలుకు మధురమూత్కోస్ఫుట (ధ్వనితోడి) హసితముగలది. అనుబద్ధముగా-పీడక అంటియుండునది హసితము-నిబద్ధకాకశిఖణ్డకమ్ = చక్కఁగా ముడివైచుకొన్న జుట్టుగలదియు-లేక జుట్టుముడి గలదియు-దానిని కాకపక్షమనియు అందురు. 'క్షత్రియాణాంచూడా కాకపక్షః' అని క్షీరస్వామి. అమల = నిర్మలమైన-వెలుఁగుచున్న, అస్తు దేవతాప్రసాదాత్ = దేవతల యనుగ్రహమువలన కలుగునుగాక. ప్రస్నుతస్తనీ = చేఁపినచన్నులుగలది. ఈ బిడ్డలతలంపుచే చన్నులు చేపుటచేతను వారితండ్రియెదుట నిలఁబడుటచేతను ఈవంతసేపు సంసారిణిగా లోకములో ఎల్లకుటింబినులవంటి దానను గా ఐతిని. భవభూతి లోకస్వభావమును రహస్యములతో ఎఱుఁగును. కి మత్ర ఉచ్యతే-అత్ర = ఇందులకు-ఈవిషయమునకు ఏమందుము? అది యట్లే; దానికి చెప్పవలసిన దేమున్నది? ప్రసవః ఖలు...... కానుపుగదా స్నేహముయొక్క అతిశయమునకు పరమావధి. దీనికి మించిన స్నేహప్రకర్ష మఱి లేదు-అనుట. ఏతత్ పిత్రోః పరమం అన్యోన్యసంశ్లేషణమ్. ఇది తల్లిదండ్రులకు ఒండొరులతో ఉత్కృష్టమైన కూర్పు. ఇందు వారిరువురు ఒక్కటిగా కలసియుందురు. భవభూతికి ఎంతటి కుటుంబతత్త్వపరిజ్ఞానము!

శ్లో. ౧౧. అన్త ఇతి. దంపత్యోః = భార్యాభర్తల యిరువురయొ, స్నేహసంశ్రయాత్ = ప్రీతియొక్క కూడికవలన-భార్యాభర్తల యన్యోన్యస్నేహమునకు ఇది యేకాశ్రయము అగుటవలన, అన్తఃకరణతత్త్వస్య = ఇరువురి మనకు అను

ఆనన్దగ్రన్థి రేకోఽయ మపత్య మితి బధ్యతే. ౧౧

వాసన్తీ—ఇతోఽపి దేవః పశ్యతు;

శ్లో॥ అనుదివస మవర్ధయ త్ప్రియా తే
యమచిరనిర్గతముగ్ధలోలబర్హమ్,
మణిముకుట ఇవోచ్ఛ్రితః కదమ్బే
నదతి స ఏష వధూసఖ శ్శిఖణ్డీ. ౧౨

పదార్థములయొక్క, ఏకః=ఒక్కటియైన, ఆనన్దగ్రన్థిః=హర్షముయొక్క ముడి, అపత్యం ఇతి=అపత్యము అని. అపత్యమను పేరుతో, బధ్యతే=కట్టబడును.

దంపతుల యిరువురియొక్కయు ప్రేమకు ఏకాశ్రయ మగుటవలన, బిడ్డ యను పేరుగలది ఆమె యంతఃకరణపదార్థమును ఆయన యంతఃకరణపదార్థమును లాగి కలిపి చేసిన హర్షపు ముడి, ఒక్కటియే యైనది, మరి సాటిలేనిది.

భవభూతి లోకమునకు పరిజ్ఞానము కల్పించి చెప్పువాడు గదా. వారి ప్రేమకు ఏకాశ్రయమగుటవలన బిడ్డ వారి మనఃసంతోషపు ముడి, గంటు, ముల్లె - అన్నట్లు. దంపతుల పుత్రప్రేమను గుఱించి కాళిదాసునూ క్రియు కనఁదగును.

రథాఙ్గనామ్నో రివ భావబన్ధనం
బభూవ య త్ప్రేమ పరస్పరాశ్రయమ్
విభక్త మ ప్యేకసుతేన త త్తయోః
పరస్పర స్యోపరి పర్యచీయత. రఘు - III - 24.

“సుదక్షిణాదేవికిని దిలీపమహారాజునకును ఒకరిహృదయమును ఒకరిమీఁదికి లాఁగుచున్నట్టి యనోన్యప్రేమ యుండెను. ఆ ప్రేమను ఇపుడు వారి యేకపుత్త్రుఁడు తాను పంచుకొన్నప్పటికిని వారికి పరస్పరమును తఱుఁగలేదు, మరి పెరిఁగినది”- శ్రీ వేంకటరాయశాస్త్రులవారు చెప్పిన తాత్పర్యము.

శ్లో. ౧౨. అనుదివసమితి - తే ప్రియా=నీ ప్రేయసి (సీత,) అనుదివసమ్=ప్రతిదినమును - ఒకదినమేని ఏమరకుండ, అచిరనిర్గత ముగ్ధ లోల బర్హమ్=క్రొత్తగా మొలచిన యందమైన కదలాడు పింఛముగల, యం=దేనిని - ఏనెమలిని, అవర్ధయత్ = పెంచెనో, సః=అది, ఏషః=ఇదిగో, ఉచ్ఛ్రితః=ఎత్తుగా పెరిఁగిన నీగగలదై, (కావున నే) మణిముకుట ఇవ=రత్నాల కిరీటమువలె నున్నట్టిది, కదమ్బే = కడిమి చెట్టుమీఁద, వధూసఖః=పెంటితోఁ గూడినదై, నదతి=కూయుచున్నది.

సీతా—(సకౌతుకాస్రం) ఏసో సో? [ఏష సః?]

రామః—మోదస్వ వత్స మోదస్వ.

సీతా—ఎవ్వం హోదు. [ఏవం భవతు.]

రామః—

శ్లో॥ భ్రమిషు కృతపుటాన్తర్మణ్డలావృత్తి చక్షుః
ప్రచలిత చటులభ్రూతాణ్డవై ర్మణ్డయన్త్యా,
కరకిసలయతాళై ర్ముగ్ధయా నర్త్యమానం
సుత మివ మనసా త్వాం వత్సలేన స్మరామి. ౧౩

---

అదిగో కడిమిమీఁద నెమిలి—అది మునుపు నీ ప్రేయసి ప్రతిదినము ఏమరక పెంచినట్టిది. అప్పుడు దానికి పురి క్రొత్తగా ఇంచుక బయటికి వచ్చి అటుఇటు (తళతళ) కదలాడుచు ఎంతో ముద్దుగా నుండినది. దానికి సిగ ఎత్తుగా పెరిఁగినది, కావున అది, పురులయు సిగయు తళతళచేత, ఒక రతనాలకిరీటమువలె నున్నది. అదిగో తన పెంటింగూడి కూయుచున్నది.

'అతరుణ మదతాణ్డవోత్సవాన్తే'—అని ప్రథమపాదమునకు పాఠాంతరము. అది 'అన్తే' అని ముగిసిపోయిన—అనఁగా రామునికంటఁబడని—యా తాండవముం జెప్పునది అంత మంచిదిగాదు. 'అనుదివసం' ఇత్యాది, 'సీతాదేవ్యా స్వకర కలితైః' ఇత్యాదిగా ఏనుఁగుగున్నంగూర్చి చెప్పినదానింబోలినది, సీతను ఎక్కువగా స్మరణకు తెచ్చునది శ్రేయము. అచిరవిరత...ర్హమ్—అది యప్పటి దాని పసితనముం దెలుపును. 'లోల'—దానిచేత అది తళతళలాడును. అదియూ ఇపుడు బాగుగా పెరిఁగియున్నది. కావున మఱింత కాంతి.

ఏష సః—అది యీ ఇది?—అని సకౌతుకాస్రమ్—ఆసక్తితో చూచుటయు కన్నీరు గ్రమ్ముటయు కూడుకొన్నట్లుగా. నెమిలి ఎన్నియేండ్లు బ్రదుకునో? ఇన్నియేండ్లు—15, 20 యేండ్లు బ్రదుకునా? బ్రదుకును కాఁబోలు(?)

మోదస్వ—ఆనందింపుము—అని ప్రీతితొలుకు మాట. ఏవం భవతు—అట్లే అగుఁగాక—అనఁగా ఆమెయు 'మోదస్వ వత్స, మోదస్వ' అన్నట్లు.

శ్లో. ౧౩. భ్రమిష్వితి—భ్రమిషు=గొండిలులందు (=మండలాకార నృత్యములందు,) కృతపుటాన్తర్మణ్డలావృత్తి=కావింపఁబడిన రెప్పలలోపలి మండలాకారమైన సుడియుటగల—రెప్పలలోపలి కంటిదొప్పలో గ్రుడ్డును మండలాకారముగా సుడియించుట (అట్లు సంకేతము, సంజ్ఞ)గలదైన, చక్షుః=కంటిని, ప్రచలిత...వైః=కదల్పబడిన—ఆడింపఁబడిన—(చటుల=) నేర్పుతోడి లేక అందమైన—బొమలయాడించుటలతో, మణ్డయన్త్యా=అలంకరించుచున్నదైన, కరకిసలయ

హన్త! తిర్యఞ్చోఽపి పరిచయ మనురుధ్యన్తే.

---

తాలైః = చివురులంబోని చేతుల చప్పటలతో, (తాలో గీతక్రియామానమ్) - ముగ్ధయా=అందముగలదైన నాప్రేయసిచేత, నర్త్యమానం = ఆడింపఁబడుచున్న, త్వాం=నిన్ను, సుతంఇవ=నా కొమారునిగా, వత్సలేన మనసా=గారవ మొప్పు మనసుతో, స్మరామి=తలంచుచున్నాను.

కంటిలో చూపును - కనీనికను - మండలాకారముగా సుడియించుచును, వానికి అందమిడునట్లుగా బొమలను సేర్పుమీఱ నాడించుచును, చివురులంబోని చేతులతో తాళము వేయుచును మునుపు నాప్రియ నిన్ను గొండిలులలోఁ గొల్పుచుండెనే - కొనుగోలు ఇచ్చి ఆడించుచుండెనే, నాగారాబుకుమారక, అదెల్ల యిపుడు నాకు తలంపునకు వచ్చుచున్నదిరా!

అతిమధురమును ప్రియమును ఐన స్మరణము! ఆనాఁటి యాటపాటలు తలంపునకు వచ్చుట.

ఇట ఈ కాళిదాసీయములను స్మరింపఁదగును - సంవాదమునకుఁ గాకున్నను ఇందలి కవి తలంపులను లేపుటకు - విక్రమో - IV - 18.

"ఆలోకయతి పయోదాన్ ప్రబలపురోవాతతాడిత శిఖణ్డః
కేకాగర్భేణ శిఖీ దూరోన్నమితేన కణ్ఠేన."

మేఘ - II - 18.

"తన్మధ్యే చ స్ఫటికఫలకా కాఞ్చనీవాసయష్టి
ర్మూలే బద్ధా మణిభి రనతిప్రౌఢ వంశప్రకాశైః
తాలైః శిఞ్జావలయ సుభగై ర్నర్తితః కాన్తయా మే
యా మధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః."

కృతపుటాన్తర్ ...భ్రూతాణ్డవైః - అనుట నంతయు ఒక్క సమాసముగాను కొనఁదగును - చేయఁబడిన దొప్పలలోపలి గుండ్రని సుడియుటలుగల కనులు గలుగునట్లుగా కదల్పఁబడిన సుందరమైన బొమలయాటలచేత - అప్పుడు 'ముగ్ధయన్త్యా' కు 'త్వాం' కర్మ. అనఁగా అట్టి కొనుగోలిచ్చు దృష్టిప్రసారము ఆ నెమలిపై మండనముగా నొప్పెనని. 'ముగ్ధయా' - సీత అప్పటికిని ఒకపాటి చిన్నవయసుదై అట్టియాటలందు ప్రీతిగలిగియుండె ననుట. సుతం ఇవ - కొమారుని'వలె' అనుటేల యన - సీత పెంచుకొన్నందున అది సీతకు కొడుకు; ఈయనకును కొడుకువలె - అని. 'తాలైః - అనుటచే గాజుల గల్లును ఊహింపవలదా, కాళిదాసుని శింజావలయ సౌభాగ్యమును?

తిర్యఞ్చః అపి=పక్షులు మొదలగు తిర్యక్కులు సయితము, పరిచయం అనురుధ్యన్తే=పరిచయమును అనుసరించును. కవి ఇది ఎంతయో ప్రజ్ఞతో చెప్పి నూక్తి. ఏల యిట్లు చెప్పుట యనఁగా—

శ్లో॥ కతిపయ కుసుమోద్గమః కదమ్బః
ప్రియతమయా పరివర్ధితో య ఆసీత్,
సీతా—(నిశ్వస్య సాస్రమ్) సుట్ఠు పచ్చహిజాణిదం అజ్జ
ఉత్తేణ. [సుష్ఠు ప్రత్యభిజ్ఞాతం ఆర్యపుత్రేణ.]
రామః—
స్మరతి గిరిమయూర ఏష దేవ్యాః.
స్వజన ఇవాత్ర యతః ప్రమోద మేతి. ౧౮

శ్లో. ౧౮. కతిపయేతి - ప్రియతమయా = ప్రేయసిచేత. పరివర్ధితః= పెంపఁబడిన, యః కదమ్బః=ఏకడిమి, కతిపయకుసుమోద్గమః = కొన్నియే పూవులపూత కలది, బాలకదంబమయి క్రొత్తగా పూతపవచ్చి, పూచియు పూవని దశయందున్నది - ఆసీత్ =ఆయెనో, అత్ర=ఆ దీనియందు. ఏష గిరిమయూరః = ఇదిగో ఈ కొండనెమలి, స్వజనే ఇవ=ప్రియబంధువునందుంబోలె, యతః=ఏల, ప్రమోదం ఏతి=హర్షము గనుచున్నదో, (తతః=దాన), దేవ్యాః = (సీతా)దేవిని, స్మరతి= తలఁచుచున్నది.

ఈకడిమియు సీత పెంచినదే, అప్పుడు గున్న, కతిపయకుసుమములే బయటికి వచ్చినవి; పూచియు పూవకయుండినది. ఈకొండనెమలియు సీత పెంచినదే. కావున కడిమియు నెమ్మియు తోఁబుట్టువులంబోనివి. అందుచేత అది దీనియందు హర్షము గనుచున్నది. కావున అది నిజముగా సీతమ్మను తలంచుచున్నది.

కాళిదాసుసీత పంచవటిలో గున్నమామిళ్లను పెంచినది, కృష్ణసారములను గూడ. చూ.-రఘు. XIII - 34.

ఏషా త్వయా పేశలమధ్యయాపి ఘటామ్బు సంవర్ధిత బాలచూతా
ఆనన్దయ త్యున్ముఖకృష్ణసారా దృష్టా చిరాత్ పఞ్చవటీ మనో మే.
ఈచూతముల మృగముల పఞ్చవటి భవభూతిచిత్రమున ఏమేమి లేపవు!

ప్రత్యభిజ్ఞాతం = ఆనవాలుపట్టఁబడినది. నాఁటి గున్నకడిమి ఇపుడు పెద్ద మ్రానైయున్నది. నాఁటి గిరిమయూరము పెద్దదిగలో పెంటింగూడునంత పెద్దదయున్నది. అది యొక్కటగా తన 'యన్న'యైన యీ కడిమిమీఁదనే ప్రీతిగొని దానిమీఁదనే యున్నది. ఇదెల్ల ఆసీతస్మరణమే. 'గిరిమయూరః' సీత పెంచిన నెమలిని కొండనెమలి యనుటేమి? పెంపకముందు కొండది, పెంచి విడిచిన యనంతరమును కొండదే, నడుమ కొన్నాళ్లే పెంపుడుదియైనది. మరల నిట్లు తన ప్రకృతిం బొందియున్నందున, దానిని వీడి పదుమూఁడేండ్లయినందున - 'గిరిం.' దానికిని

వాసన్తీ—అత్ర తావ దాసనపరిగ్రహం కరోతు దేవః.

శ్లో॥ ఏత త్తదేవ కదళీవన మధ్యవర్తి
కాన్తాసఖస్య శయనీయ శిలాతలం తే,
అత్ర స్థితా తృణ మదా ద్బహుశో య దేభ్య
స్సీతా తతో హరిణకై ర్న విముచ్యతే స్మ. ౧౫

రామః—ఇద న్తావ దశక్య మేవ ద్రష్టుమ్. [ఇత్యన్యతో రుద న్నుప విశతి.]

---

కడిమికిని బాంధవము తెగిపోలేదు. ఆసోదరస్నేహముచేత సీతయందలి మాతృస్మరణ ఊహింపఁబడుచున్నది.

ఏనుఁగును నెమలిని ఈయన అనవాలుపట్టెను కాని అవి యీయనను అనవాలుపట్టుట చెప్పఁబడలేదు. కాలాంతరము అందులకు చాల ఎక్కువ.

ఆసనపరిగ్రహం కరోతు దేవః - ఇట్లు ప్రథమపురుషగా చెప్పుట - నీవు అనకపోవుట - సాకూతము, మర్యాదయు - దేవర యిటఁ గూర్చుండును గాక. 'ఇట' అని ఆసనయోగ్యదేశమును చూపుచున్నది.

శ్లో. ౧౫. ఏతదితి - కాన్తాసఖస్య = కాంతతోఁ గూడియున్న, తే=నీకు. కదళీవనమధ్యవర్తి = అరఁటితోఁట నడుమనున్న, తత్ =ఆ, శయనీయశిలాతలం = పడుకగానున్న రాతియరుఁగు, ఏతత్ ఏవ=ఇదియే - ఇదిగో ఇక్కడ నున్నది. అత్ర స్థితా (సతీ)=ఇందు ఉన్నదై, సీతా=సీత, ఏభ్యః=వీనికి, యత్ బహుశః తృణం అదాత్ =పలుమాఱు గడ్డి యొసంగినందున, తతః=ఆకారణమువలన, హరిణకైః=లేళ్లచేత, న విముచ్యతే స్మ=(ఇది) విడువఁబడలేదు.

మునుపు కాంతతోఁ గూడి యిందుండఁగా నీవు వాడుకగా ప్రియంగూడి కూర్చుండు నా రాతియరుఁగు, అరఁటివనమునడుమ ఇదిగో. లేళ్ళు ఎప్పుడును దీని చుట్టును తిండియే యుండెను. అవి దీనిని విడిచిపెట్టనే లేదు. ఏలన ఇందు కూర్చుండియే సీత ఎక్కువగా మాటిమాటికి వానికి గడ్డిపెట్టి మేపుచుండినది.

న విముచ్యతే స్మ - అలవాటు పడిపోయినందున. ఈ కదళీవనవృత్తస్మారణము ఇపుడు రాముని కెట్లుండు ననఁగా లంఘనాలలో అల్లెపుభోజనపుఁదలంపువలె. కావుననే, 'ఇదం తావత్ అశక్య మేవ ద్రష్టుం' - ఇది యన్నను చూచుటకు శక్యము గాకయే యున్నది! - మఱి యిందు ఎట్లు కూర్చుండగలఁడు? పూర్వ విస్రంభవృత్తాంతము లన్నియు స్మరణకు వచ్చుచున్నవే. ఆ కదళీవనము ఆయరుఁగు ఆసీతాసఖ్యము ఆతృణదానము ఆలేళ్ళు! కావుననే 'అన్యతః రుదన్ ఉపవిశతి' - ఒండెడ నేడ్చుచుం గూర్చుండును.

సీతా—సహి వాసంతి! కిం తుఏ కదం, అజ్జఉత్తస్స మహఅ ఏదం పదేసం దంసయంతీఏ! హద్ధి! హద్ధి! సోఎవ్వ అజ్జఉత్తో, తం ఎవ్వ పంచవడీవణం, సా ఎవ్వ పిఅసహీ వాసంతీ, తే ఎవ్వ వివిహవీసంభ సక్ఖిణో గోఅవరీకాణణుద్దేసా, తే ఎవ్వ జాదణివ్విసేసా మఅపక్ఖి పాఅవా, మహ ఉణ మందభాఇణీఏ దీసమాణం వి, సవ్వం ఏదం ణత్థి! ఏరిసో జీవలోఅస్స పరిణామో సంవుత్తో. [సఖి వాసంతి కిం త్వయా కృత మార్యపుత్రస్య మమ చ ఏతం ప్రదేశం దర్శయన్త్యా! హా హన్త! హా హన్త! స ఏ వార్యపుత్రః, తదేవ పఞ్చవటీవనమ్, సైవ ప్రియ సఖీ వాసన్తీ, త ఏవ వివిధవిస్రమ్భ సాక్షిణో గోదావరీకాననోద్దేశాః, త ఏవ జాతనిర్విశేషా మృగపక్షిపాదపాశ్చ. మమ పునర్మన్ద భాగ్యాయా దృశ్యమాన మపి సర్వ మేత న్నాస్తి. ఈదృశో జీవలోకస్య పరిణామః సంవృత్తః!]

వాసన్తీ—సఖి సీతే, కథం న పశ్యసి రామభద్ర స్యావస్థామ్!

---

శ్రీరాముని యాశ్రమమునకు అరఁటుల యావరణముకలదని వాల్మీకిరాముఁడు చెప్పుచున్నాఁడు - రామా. అరణ్య - 42 - ౧౩.

'ఏతద్రామాశ్రమపదం దృశ్యతే కదళీవృతమ్' అని. 42 - ౨౩.

'కదళీగృహకం గత్వా......'

కిం త్వయా కృతం! ఏమి చేయఁబడినదే నీచేత - ఏమి చేసితివే నీవు! హాధిక్ హాధిక్ - అయ్యొ, అయ్యయ్యొ! జాతనిర్విశేషాః=బిడ్డలకన్న వేఱుగానట్టివి - బిడ్డలే యనవి - అన్నమాట. దృశ్యమానం అపి=అగపడుచు నేయున్నను, సర్వం ఏవ తత్ నాస్తి=ఇదెల్లను లేనిదే! ౦పరివర్తః - పరిణామము, మార్పు.

ఈదండకదర్శనము సీతకు మనసున ఆశ్చర్యకరమును, ఇట్టిదని చెప్పనలవిపడనిదియు నగు నొక మనఃసంతోషస్థితిం గూర్చుచున్నది.

సఖి సీతే - సఖి సీతా - ఇది తలఁపునకు వచ్చిన సీతయే కాని ఎదుటనున్న సీత కాదు - సీత కన్నులకు అగపడదు. ఈసంవిధానము సీతను తలఁపునకు లాఁగుచున్నది. ఎక్కడనున్నావే నీవు, సీతా! కథం న పశ్యసి - ఏమి చూడకున్నావా?

శ్లో॥ కువలయదళస్నిగ్ధై రఙ్గై ర్దదన్నయనోత్సవం
సతత మపి తే స్వేచ్ఛాదృశ్యో నవో నవ ఏవ యః,
వికలకరణః పాణ్డుచ్ఛాయ శ్శుచా పరిదుర్బలః
కథమపి స ఇ త్యున్నేతవ్య స్తథాపి దృశోః ప్రియః. ౧౮

సీతా—పేక్ఖామి సహి పేక్ఖామి. (ప్రేక్షే, సఖి, ప్రేక్షే.)

తమసా—పశ్యన్తీ ప్రియం భూయాః.

---

శ్లో. ౧౮. కువలయేతి - యః=ఎవఁడు, కువలయదల స్నిగ్ధైః=కలువరేకులవలె తళతళ సొంపారునట్టి, అఙ్గైః=అవయవములతో, నయనోత్సవం = కన్నులపండువును, దదత్=ఒసంగుచున్నవాఁడై, తే=నీకు, స్వేచ్ఛాదృశ్యః అపి=ఇచ్చమెయి (తలఁచుకొన్నపుడెల్ల) చూడఁదగినవాఁడయ్యును, సతతం=ఎల్లప్పుడును, నవః నవః ఏవ=క్రొత్తవాఁడే క్రొత్తవాఁడే (అయెనో,) సః=అతఁడే, అయం=వీఁడుగో, శుచా=దుఃఖముచేత, వికలకరణః=వసముతప్పిన యంగములుగలవాఁడును, పాణ్డుః=పాలిపోయిన దేహముగలవాఁడును, పరిదుర్బలః = మిక్కిలియు దుర్బలుఁడును, (ఐ), కథమపి=ఎట్టకేలకు, స ఇతి = అతఁడే యని, ఉన్నేతవ్యః = ఊహించి యెఱుంగఁదగినవాఁడై, తథా అపి=అట్లుండియు, దృశాం ప్రియః = కన్నులకు ప్రియముగానే యున్నాఁడు - ప్రీతిగొల్పుచునే యున్నాఁడు.

కలువరేకులవలె తళతళలాడు అంగములతో కన్నులపండువు సేయువాఁడు' తలఁచినపుడెల్ల ఇచ్చమెయి నిరాటంకముగా నీవు చూడఁగలిగినను, నీ కెప్పటి కప్పుడు క్రొత్తక్రొత్తగానే తోఁచుచుండువాఁడు - అట్టి సోయగముగలవాఁడు, ప్రీతిగలిగించువాఁడు (అరాముఁడే,) ఇప్పుడు శోకముచే అంగములు వసముతప్పి, దేహము పాలిపోయి, బలము హీనమై, అతఁడే ఈతఁ డని కష్టముతో ఎట్టకేలకు ఊహించి కనిపట్టవలసినవాఁడుగా ఐ యున్నను కన్నులకు ఆమెత కలిగించు చునే యున్నాఁడు.

మునుపటికిని ఇప్పటికిని భేదము అరయఁదగును.

నాఁడు కన్నులతో చూచి యనుభవించిన వాసంతి నేఁడును రాముని చూచి యనుభవింపఁగన్నది. ఈద్వారమున కవియే రామసౌభాగ్యము భావించి సేవించుచున్నాఁడు.

సీతా—హా దెవ్వ! ఏసో మఏ వినా, అహం వి ఏదేణ విణ త్తి. కేణ సంభావిదం ఆసి! తా ముహుత్తం వి జమ్మంతరాదో విఅ లద్ధదంసణం బాహసలిలంతరేసు పేక్ఖామి దావ వచ్ఛలం అజ్జఉత్తం. (సతృష్ణం పశ్యతి.) [హా దైవ! ఏష మయా వినా, అహ మప్యేతేన వినేతి కేన సమ్భావిత మాసీత్ ? తస్మాన్ముహూర్త మపి జన్మాన్తరాదివ లబ్ధదర్శనం బాష్ప సలిలాన్తరేషు పశ్యామి తావద్వత్సల మార్యపుత్రమ్.]

తమసా—(సస్నేహం పరిష్వజ్య)

---

విరహదుఃఖ కార్శ్యపాండిమలచే దేహమునకు కాంతి యొక్క రమణీయా కృతిగానే యుండు ననుట కాళిదాసు చెప్పిన రహస్యము - "సర్వా స్వవస్థాసు రామణీయక మాకృతివిశేషాణాం! ఏవ ముత్సుకోఽపి ప్రియదర్శన ఏవ........

తేజోగుణా దాత్మనః

సంస్కారోల్లిఖితో మహామణి రివ క్షీణోఽపి నాలక్ష్యతే." శాకుం. VI - 5.

'యథా పరిహీయమానై రఙ్గైః శోభసే' - విక్రమో.

'క్షణేక్షణే య న్నవతా ముపైతి త దేవ రూపం రమణీయతాయాః'

— మాఘుఁడు.

పశ్యన్తీ ప్రియం భూయాః - ప్రియునిఁ జూచుచుండువుగాక - సీత చూపు రామైకాగ్రమైయున్నది - దానిని అభినందించుచు పలుకుట. అట్లే శ్లో. ౩౦ లో - 'ప్రత్యుప్త స్యేవ దయితే' 'ప్రియునియందు నాటఁబడినట్లైయున్నది చూపు' అనును.

హా దైవ - హా దైవమా - ఈవియోగము కేవలము దైవికము గాన, దైవమా అనుచున్నది. 'ఏష మయా వినా అహం ఏతేన వి నేతి కేన సమ్భావిత మాసీత్' - అన్యోన్య ప్రియులగు దంపతులు నమ్మకముతో అట్లు తలంతురు! జన్మాన్తరా దివ = జన్మాంతరమందుం (=కలనం)బోలె - ఇప్పటికి పన్నెండేం డ్లయిపోయినవి. కావున 'జన్మాంతరమందు' అనుట. బాష్పసలిలాన్తరేషు=బాష్పజలముల నడుమనడుమ - ఆఁగక పొడముచునే యున్నవి కన్నీళ్ళు, చూపును అడ్డగించుచు - కావున 'నడుమనడుమ' అనుట. ముహూర్త మపి=రవంత సేపు. రవంత సేపే కదా కార్య వశమున వచ్చిన రాముఁడు ఈయడవిలో ఇట నుండఁబోవుట. ఈక్షణమున వివాస దుఃఖము తలంపుననే లేదు.

శ్లో॥ విలులితమతిపూరై ర్బాష్పమానన్దశోక
ప్రభవ మవసృజన్తీ తృష్ణ యోత్తానదీర్ఘా,
స్నపయతి హృదయేశం స్నేహనిష్యన్దినీ తే
ధవళబహళముగ్ధా దుగ్ధకుల్యేవ దృష్టిః. ౧౭

---

శ్లో. ౧౭. విలులితమితి...అతిపూరైః=వెల్లువలచే, విలులితం=పొరలితొణుకుచున్న, ఆనన్దశోకప్రభవమ్=ఆయన అగపడి వాత్సల్యముతో వాపోవుచున్నాఁడన్న యానందమువలనను, నేను ఇట్లు అడవిపాలైన విరహిణి నైపోయితినే అను దుఃఖమువలనను పొడమిన, బాష్పం=కన్నీటిని, అవసృజన్తీ=కార్చుచున్నదై, తృష్ణయా=ఆసతో, ఉత్తానదీర్ఘా=(విప్పారినందున) వెడల్పుగాను పొడుగుగాను ఉన్నదై, (తెల్లగాను సమృద్ధముగాను అందముగాను ఉన్న), తే దృష్టిః=నీ కన్ను, స్నేహనిష్యన్దినీ=కూరిమి జాలువాఱుచున్నట్టిదై, ధవళబహళముగ్ధా=తెల్లగాను దండిగాను అందముగాను ఉన్న, దుగ్ధకుల్యా ఇవ=పాలకాలువ వలె, హృదయేశం=ప్రాణనాథుని, స్నపయతి=స్నానము చేయించుచున్నది.

ఆనందాశ్రువులను దుఃఖాశ్రువులను నిండి తొణుకుచున్న నీ కన్నులు, ఇన్నాళ్లకు అగపడెను, మఱి యెప్పుడైన దొరకునా అను పేరాసతో వెడల్పుగా విస్ఫారితములును (చెవులందాఁక) పొడుగులైనవియు నై, తెలుపును, సమృద్ధియు అందమును కలవై, కూరిమిజాలుతో, అట్టిదే ఐన పాలకాలువవలె, ప్రాణనాథుని స్నానముచేయించుచున్నవి, ముంచుచున్నవి. అంత ఆత్రముతో చూచుచున్నవి-అనుట.

ఇట దృష్టి కన్న, చూపా యన్న, బాష్పపూరములు తొణుకుట ఉత్తానము దీర్ఘమును అగుట-మొదలగు విశేషణములంబట్టి కన్నే యగును. తిమ్మఁయే మరల సీతకు ఇఁక దానిని లాఁగికొనుము. ఉపసంహరింపుము అని చెప్పిన శ్లో. 40 కమందు, దీనికే నిర్దేశము అని చెప్పఁదగినదానియందు, 'తృష్ణాదీర్ఘస్య చక్షుషః' అని చక్షుస్సు' (='కన్నే') చెప్పఁబడియున్నది. కన్ను తదుపుట చూపుచేతనే, 'విలోకనప్రభావీచికలం దదీయపదవిన్ గలశాంబుధి వెల్లిగొల్పుచున్' (కలశాంబుధి=పాలసముద్రము) 'చంద్రికల్ దనుకం జూచె లతాంగి భూసురు'-మను. II-29, 30. భావశబలత ఇందు కననగును. సీతకైన తమస స్నేహార్ద్రితయు.

వాసన్తీ—

శ్లో॥ దదతు తరవః పుష్పై రర్ఘ్యం ఫలైశ్చ మధుశ్చ్యుత,
స్స్ఫుటిత కమలామోదప్రాయాః ప్రవాన్తు వనానిలాః.
కల మవిరళం రత్యుత్కణ్ఠాః క్వణన్తు శకున్తయః,
పున రిద మయం దేవో రామ స్స్వయం వనమాగతః. ౧౮

---

శ్లో. ౧౮. దదత్వితి - రామదేవుని కూర్చుండఁబెట్టి వాసంతి, తాను వనదేవత యగుటకు తగినట్లు అతిథిసత్కారముఁ గూర్చుచున్నది. తరవః=వృక్షములు, పుష్పైః=పూలతోడను, ఫలైఃచ=పండ్లతోడను, మధుశ్చ్యుతః=తేనె కాఱుచున్నవై, అర్ఘ్యం=అర్ఘ్యమును, దదతు=ఒసంగునుగాక. స్ఫుటిత కమలామోద ప్రాయాః=విరిసిన తమ్ముల సౌరభము ఎక్కువగా కలవై, వనానిలాః=అడవిగాలులు, ప్రవాన్తు = వీచునుగాక, రత్యుత్కణ్ఠాః=ప్రీతితో - రక్తితో - ఎలుంగుఎత్తినవై, కాదా - సంతసముతోడి యాటలకాసగొన్నవై, శకున్తయః=పక్షులు. కలం=అవ్యక్తమధురముగా, అవిరతం=అవిచ్ఛిన్నముగా - ఎడతెంపులేక, క్వణన్తు = కూయును గాక. (అవిరళం=దండిగా - అనియు పాఠము.) అయం=వీఁడుగో, దేవః రామః = రామదేవుఁడు, పునః=మరల, ఇదం వనం=ఈవనమునకు, స్వయం=తానే, ఆగతః = వచ్చినాఁడు.

పండ్లుం బూవులుంగూడిన తేనెతో చెట్లు అర్ఘ్యమిచ్చునుగాక. విరిసిన తామరల పరిమళము ప్రచురముగ - వెల్లువ పొరలునట్లుగా - అడవిగాలులు వీచును గాక. ఆటలలో ఆసగొన్నవై పక్షులు తెంపులేక అవ్యక్తమధురముగా కూయును గాక. మరల ఇపుడు శ్రీరామదేవుఁడు స్వయముగ ఈవనమునకు వచ్చినాఁడు.

అర్ఘ్యమిచ్చి, వీచోపులిడుచు, పాట వినుచును, శ్రీరామమహారాజునకు వనదేవత వాసంతి తనకు సదృశముగా అతిథిసపర్య కావించుచున్నది. పూవులు, పండ్లు, వానితో తేనె. తేనె అర్ఘ్యమేని, పాద్యము నయిత మేని, పానీయము నయిత మేనియు - అతిథికి. అడవిగాలులును ఆ మెతగా నుండును. 'దదతు' 'ప్రవాన్తు' - అని ప్రథమపురుషగా చెప్పుట వాడుక. వారువారు ఆపనులు చేయుదురుగాక. మీరు మీరు మీరును - అందఱును ఆయాపనులు చేయుఁడు - అనుట. వాసంతియొక్క పరమ రామభక్తియు పూజయు కనగును.

రఘువున కాళిదాసు దిలీపునికి అరణ్యద్రుమాదులచేత ఇట్లు రాజోపచారములు సంపాదించినాఁడు. మల్లినాథుఁడు ఇట్లు అవతారిక కూర్చినాఁడు - "తస్య మహామహిమతయా ద్రుమాదయోఽపి రాజోపచారం చక్రుః" అని.—

చూ. - II - 9 - 14.

రామః—సఖి వాసన్తి, న న్విహా సీయతామ్.

వాసన్తీ—(ఉపవిశ్య సాస్రం) మహారాజ, అపి కుశలం కుమార లక్ష్మణస్య?

రామః—(అశ్రుతి మభినీయ.)

శ్లో। కరకమల వితీర్ణై రమ్బునీవారశష్పై
స్తరు శకుని కురఙ్గా న్మైథిలీ యా నపుష్యత్,

---

విస్పృష్టపార్శ్వానుచరస్య తస్య పార్శ్వద్రుమాః పాశభృతా సమస్య
ఉదీరయామాసు రివోన్మదానా మాలోకశబ్దం వయసాం విరావైః
మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం త మర్చ్య మారా దభివర్తమానం
అవాకిరన్ బాలలతాః ప్రసూనై రాచారలాజై రివ పౌరకన్యాః
ధనుర్భృతోఽ ప్యస్య దయార్ద్రభావ మాఖ్యాత మన్తః కరణై ర్విశఙ్కైః
విలోకయన్త్యో వపు రాపు రక్ష్ణాం ప్రకామవిస్తార ఫలం హరిణ్యః
స కీచకై ర్మారుత పూర్ణరన్ధ్రైః కూజద్భి రాపాదిత వంశకృత్యమ్
శుశ్రావ కుఞ్జేషు యశః స్వ ముచ్చై రుద్గీయమానం వనదేవతాభిః
పృక్త స్తుషారై ర్గిరి నిర్ఝరాణా మనోకహా కమ్పితపుష్పగన్ధీ
తమాతపక్లాన్త మనాతపత్ర మాచారపూతం పవనః సిషేవే.

ఐనను ఈ కాళిదాసీయమున రాజునకు వట్టి ఆచారము జరుపుటవలె తోఁచుచున్నది. భవభూతిలోనో ప్రీతిభక్తులు నిండి తొణుకుచున్నవి.

సఖి వాసన్తి, నను ఇహా సీయతాం - ఇటఁ గూర్చుండుము. ప్రకరణమున 'కూర్చుండుటే' అర్థము - దేవత, తా సఖియైనను, రామునియెదుట అననుమతముగా కూర్చుండను సంకోచపడును - అని చెప్పుచున్నాఁడు.

అపి కుశలం కుమారలక్ష్మణస్య=కుమారలక్ష్మణునికి కుశలమా? లక్ష్మణుఁడును ఆమెకు చాల పరిచితుఁడు, మునుపు వనవాసమున. కావున ఈ యుపచారోక్తి. 'మహారాజ'-అను సంబోధనకు ప్రేమశూన్యమైనది అని భావము; రాముఁడే అనంతరము చెప్పును. అశ్రుతిం అభినీయ - ఇది పాత్రమునకు అభినయజ్ఞాపకము. రామునకు అటఁ గూర్చుండి చుట్టును చూచినప్పుడు ముంచుకొనివచ్చిన దుఃఖమునకు మేరలేనందున అదే పరాకు, వాసంతి మాటలు వినఁబడలేదు. దానిచే చెప్పుచున్నాఁడు 'వికారః' అని.

శ్లో. ౧౯. కరేతి - కరకమలవితీర్ణైః=కమలమువంటి చేతితో ఒసంగఁబడిన, అమ్బునీవారశష్పైః = జలము, నివ్వరి, గఱిక - అనువానితో - అనఁగా అవి పెట్టి, యాన్ తరు శకుని కురఙ్గాన్=ఏ చెట్లను, పిట్టలను, జింకలను, అపుష్యత్ =

భవతి మమ వికార స్తేషు దృష్టేషు కోఽపి
ద్రవ ఇవ హృదయస్య ప్రస్తరోద్భేదయోగ్యః. ౧౯

వాసన్తీ—మహారాజ, నను పృచ్ఛామి, అపి కుశలం కుమార లక్ష్మణస్య?

రామః—(ఆత్మగతం) అయే! మహారాజేతి నిష్ప్రణయ మామన్త్రణ పదం. సౌమిత్రిమాత్రే చ బాష్పస్ఖలితాక్షరః కుశల ప్రశ్నః. తథా మన్యే విదితసీతావృత్తా న్తేయ మితి. (ప్రకాశం) ఆం, కుశలం కుమారస్య. (ఇతి రోదితి.)

---

పెంచెనో, తేషు దృష్టేషు=అవి చూడఁబడఁగా - వానిని చూడఁగానే, ప్రస్తరోద్భేదయోగ్యః=రాతిబండను పగులఁగొట్టుటకుఁ జాలినట్టిది - అంతపటువైనది, హృదయస్య ద్రవ ఇవ = హృదయముయొక్క పగిలి వెలువడిన నీటింబోని, కాదా, హృదయమే కరఁగి పాఱుచున్నదో యనునట్టి, కః అపి వికారః=ఒకానొక - ఇట్టిదని వర్ణించి చెప్పనలవిపడని, వికారము, భవతి=కలుగుచున్నది.

ఇచటి చెట్లను పక్షులను మృగములను సీత తన సొంత కరకమలములతో నీరు, నివ్వరి, గరికయు పెట్టి పోషించినది. ఇట నిపుడు వీనిని చూడఁగా నాకు మనసులో ఇట్టి దని చెప్ప నలవికాని వికారము రాతిబండను పగిల్చి నీరు బయటికి వచ్చునట్లుగా చేయునంతటిది, హృదయము పగిలి నీరుకాఱుచున్నదో అనునట్లుగా కలుగుచున్నది.

ఆ వికారము ఎంతబలీయమో ఇట్లు ఇట్టి యుపమానముచేత తెలియఁజెప్పుచున్నాఁడు. మునుపటి రాముని యేడ్పువలన 'అపి గ్రావా రోదితి అపి దళతి వజ్రస్య హృదయం' అన్నాఁడు గదా - చూ - I. ౨౧.

మహారాజ, నను పృచ్ఛామి=మహారాజా, అడుగుచున్నాను గదా - రాముఁడేమో 'సఖి, వాసంతి' అన్నాఁడు, మునుపటి తనవాడుక ప్రకారము. వాసంతి తన వాడుకబడి రామభద్ర అనియో, రామచంద్ర అనియో వయస్య అనియో స్నేహముతోఁడి పలుకరింపు పలుకక, శ్రోత్రమాదిరిగా, స్నేహశూన్యముగా, ఆచారమాత్రముగా మహారాజ అని అనుచున్నది. ఇపుడు రాముని చూచినది మొదలు దేవ దేవ అనియే అనుచుండినది. 'నను' - అని తన మాట చెవింబెట్టమికి, జ్ఞాపకము సేయుటకు. పెట్టకున్నను జ్ఞాపకముసేయుట మునుపు అలవడిన చనవుచేత. సౌమిత్రిమాత్రే చ=లక్ష్మణునిగూర్చి మాత్రము - అనఁగా అంతకంటెను ముందుగా అడుగవలసిన తన చెలి సీతంగూర్చి యేమియు అనక, వీకపై రత్తక. బాష్పస్ఖలితాక్షరః=డగ్గుత్తికచే చెదరిన యక్షరములు గలది. బాష్పము గొంతుక అడ్డపడి, డగ్గుత్తిక గూర్చెను. తథా మన్యే=కావున తలంచెదను. విదిత సీతా

వాసన్తీ—అయి దేవ, దారుణః ఖల్వసి?

సీతా—సహీ వాసంతి కిం తుమం ఎవ్వం వాదిణీ? పిఅరుహాో ఖు సవ్వస్స అజ్జఉత్తో, విసేసదో మహ పిఅసహీఏ? [సఖి వాసన్తి, కిం త్వం ఏవం వాదినీ? ప్రియార్హః ఖలు సర్వ స్యార్యపుత్రః. విశేషతో మమ ప్రియసఖ్యాః?]

వాసన్తీ—

శ్లో॥ త్వం జీవితం, త్వ మసి మే హృదయం ద్వితీయం,
త్వం కౌముదీ నయనయో, రమృతం త్వ మఙ్గే.
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
తా మేవ,

[నిశ్వస్య] శాన్త! మథవా, కి మిహోత్త రేణ? ౨౦
(ఇతిమూర్ఛతి)

---

వృత్తాన్తా ఇయం – ఈమెకు సీతావృత్తాంతము ఎఱుకపడి యున్నదని. ఎంత నిష్ఠుర ముగా ఊహ సేయుచున్నాఁడు రాముఁడు! సీతయనుంగు మిత్రముగు వాసంతిని కలిసికొన్నప్పటినుండి ఆమె ఏమనుగునో అని బెడిదము గలదు, రామునికి. దారుణః ఖల్వసి = క్రూరుఁడవుగదా ఐతివి...ఏవం వాదినీ = ఇట్లు పలికెద వేమి? ప్రియార్హః = ప్రియార్హుఁడు = ప్రీతిపాత్రము – ప్రియమైన మాటలు పలుకఁదగిన వాఁడు. విశేషతః మమ ప్రియసఖ్యాః = నాకై నా ప్రియసఖివి నీవు ఆర్యపుత్రునితో ప్రియము మాటలాడవలసినదానవు – అట్టివాఁడు నీకు ఆయన – అనుట.

శ్లో. ౨౦. త్వమితి – త్వం (మే) జీవితమ్ = నీవె నా జీవితమవు – ప్రాణమవు (అపి.) త్వం మే ద్వితీయం హృదయం అసి = నీవె నా రెండవ హృదయమవు అగుదువు. త్వం నయనయోః కౌముదీ = నీవె నా కన్నులయందు వెన్నెలవు (అపి.) త్వం అఙ్గే అమృతమ్ = నీవె (నా) దేహమందు అమృతమవు. – ఇత్యాదిభిః = అను మొదలైన వైన, ప్రియశతైః = నూర్ల యిచ్చకములతో, ముగ్ధాం = చేలను, అనురుధ్య = అను సరించి, లాలించి, తాం ఏవ = దానినే, శాన్తం = (ఆ పాపుబిధి) అడంగునుగాక. అథవా = అట్లుగాక, ఉత్తరేణ = ఆపైమాటచేత – 'అడవిలో పాఱవైచితివే!' అను మొదలగు దానిచేత, ఇహ కిమ్ = ఇపుడు ఈవిషయమున ఏమిప్రయోజనము?

నీవే నా ప్రాణమవు, నీవు నా రెండవ హృదయమువు, నాకన్నులకు నీవు చల్లని తెల్లని వెన్నెలవు, నాదేహమందు నీవే అమృతమవు – అని యిట్లు లెక్కలేని ఇచ్చకములాడి యాడి, కడకు దానినే – సరి, ఇఁక నెందుకులే ఆ తరువాతి మాట? అది యడిగి యేమి ప్రయోజనము? నోరాడని దానిని నానోట అనుటయు నేల? ఆపాపము అడంగును గాక.

రామః—స్థానే ఖలు వాక్య నివృత్తిః, మోహశ్చ. సఖి, సమాశ్వసిహి సమాశ్వసిహి

వాసన్తీ—(సమాశ్వస్య) తత్కిమిద మకార్య మనుష్ఠితం దేవేన?

సీతా—సఖి వాసన్తి విరమ, విరమ.

---

రామునిమీఁద కట్టితప్పున కటిదముగా పలుకుచున్నది! నీవు లేకున్న నాకు ప్రాణములేనట్లే; క్షణమైనను జీవింపను. నీవు చెప్పక, నీవు చెప్పక నేను ఏమియు చేయను. నా తలఁపులే నీవు - సుఖము నీవు, దుఃఖము నీవు. నిన్ను చూచుచున్న నాకన్నుల వెన్నెలచలువలు నిండుచుండును. నిన్ను తాఁకిన, నీవు తాఁకిన, అమృతము సోఁకినట్లు, పూసినట్లు ఆప్యాయన కలుగును - ఇట్లు ఎన్నెన్నియో ఇచ్చకములు పచరించుచు, నిరంతరము లాలించుచుండి. కడకు దానికే - దా నీవు చేసిన పని నేను నోట చెప్పనైనఁ జాలనే. ('విసరి క్రవ్యాదములకు పాలువై చితివే అయ్యో!' అని వాక్యపూరణము కాబోలు!) విధీ! అని ఆ క్రార్య స్మరణచే ఆ మాట నోట పలుక నేరక మూర్ఛిల్లినది. దీనిచేత మునుపు పంచవటిలో రాముఁడు సీతతో ఎట్లెట్లు కడపెనో, ఎట్టి సీతారామస్నేహము పరిచితమో, వాసంతికి సీతయందు ఎట్టి స్నేహభరమో, జగత్పతి రామునియందు ఎట్టి చనవో, తెలియుచున్నది. ఈ సమాగమమున రాముని కెట్లో! వాసంతి కెట్లో! అని అనిపించుచున్నది.

స్థానే ఖలు = యుక్తము గదా. వాక్యనివృత్తిః = మాట మానుటయు. మోహః చ = మూర్ఛిల్లుటయు. ఇది మహాకవి స్వాంత కార్దమైన మెచ్చుకోలును అంగీకారము నగును. రాముఁడు వాసంతిని మూర్ఛ తేర్చెను.

కిమిద మకార్య మనుష్ఠితం దేవేన - ఏల యీ అకార్యమును దేవర కావించెను? వాసంతి 'అకార్య' మని రాముని మొగాన అనఁగలిగినది. ఏల కావించితివి అని యడుగజుం గలిగినది. అట్టిది ఆమెకు ఆ సీతారాములయందలి స్నేహము, చనవు. దేవేన=దేవర చేత అనుటయు చెప్పుటయే.. అకార్య మని ఆమెనిశ్చయము, అవశ్యకార్య మని రామునినిశ్చయము!

వాసన్తి, విరమ విరమ=మానవే, మానవే. ఏల యట్లనుచున్నది అనఁగా, అది రాముని ఆక్షేపించుట అగుననియు, ఆయనకు దానికి జవాబు చెప్పు క్లేశమును కలిగించుట అగుననియు. ఏలన, తన్నే తలఁచుకొని రాముఁడు ఏడ్చు

రామః—లోకో న మృష్యతీతి.

వాసన్తీ—తత్కస్య హేతోః?

రామః—స ఏవ జానాతి కిమపి.

తమసా—ఉచిత స్తదుపాలమ్భః.

వాసన్తీ—

శ్లో॥ అయి కఠోర యశః కిల తే ప్రియం!
కి మయశో నను ఘోర మతః పరం?
కి మభవ ద్విపినే హరిణీదృశః?
కథయ నాథ కథం బత మన్యసే. ౧౮

---

చుండుటను మూర్ఛిల్లుటనుంగూడ తాను ఇప్పుడే చూచినది కదా. తన కెంత కష్టము వచ్చినను రాముని మనస్సు నొవ్వనాడఁగూడదు.

లోకః న మృష్యతి ఇతి_లోకము ఒప్పలేదు అని. భవభూతి లోకజనని సీతకుఁ గావించిన యిందలి పూజలో, సీతమీఁది యానింద ఏమో దానిని ఎవరి నోటను పలికింపకుండుట ముఖ్యము. దుర్ముఖుఁడు రాముని చెవిలో పలికినాఁడు ఇట్టిట్లు అని. ఎట్టెట్లో దానికి ఎటను ఈనాటకమున 'ప్రకాశము' లేదు. సీతకు తన్నేల వివాసనముచేసెనో ఇప్పటికి తెలియదు. ఇప్పుడైనను 'లోకము' అని ఏమో చూచాయగా తెలియుచున్నది.

తత్ కస్య హేతోః=అది ఎందువలన? అందుల కేమి కారణము? స ఏవ జానాతి కిమపి=అదేదియో అదియే (లోకమే) ఎఱుఁగును. 'కిమపి' అనుటచే దానిం జెప్పుట తనకు అప్రియమని సూచితము. త దుపాలంభః=దానిని నిందించుట. లోకమును నిందింపఁదగును, కాని సీత నేల అడవిపాలుసేయుట? అని భావము.

శ్లో. ౧౮. అయి కఠోర=ఓయి క్రూరుఁడా, కఠినాత్ముఁడా, తే=నీకు, యశః కిల=యశమే కదా, ప్రియం=అభిమతము. నను=అయ్యా, దేవా, కిం అయశః=ఏ యయశము, అతఃపరమ్ = ఇంతకంటెను, ఘోరం = భయంకరము, దారుణము? విపినే = అడవియందు, హరిణీదృశః = మృగికన్నులవంటి కన్నులుగలదైన యా సీతకు, కిం అభవత్ =ఏమాయెను? నాథ=రాజా, కథయ=చెప్పవయ్యా. బత = అయ్యయో! కథం మన్యసే=ఎట్లని _ ఏమాయెనని _ తలంతువో, ఊహింతువో! _ నీవు ఏమనుకొన్నావో, చెప్పు.

సీతా—తుమం ఎవ్వ సహి వాసంతి దారుణా కఢోరా అ, జా ఎవ్వం అజ్జఉత్తం పదీత్తం పదీవేసి. [సఖి వాసన్తి, త్వమేవ దారుణా కఠోరా చ, యా ఏవం ఆర్యపుత్రం ప్రదీప్తం ప్రదీపయసి.]

తమసా—ప్రణయ ఏవం వ్యాహరతి, శోకశ్చ.

రామః—సఖి కిమత్ర మన్తవ్యం?

శ్లో॥ త్రిస్త్రైకహాయన కురఙ్గవిలోలదృష్టే

స్తస్యాః పరిస్ఫురిత గర్భభరాలసాయాః,

---

ఓయి క్రూరుఁడా, నీకు యశము ఒక్కటియే గదా ఎంతయు ప్రియమాయెను! ఏయయశము ఇంతకన్నను - ఆలిని కానలకుఁ దఱిమినాఁడు, కఠోరగర్భను - అనుటకన్న - ఘోరమైనది లోకాన నుండును? అయ్యో ఆలేడికంటికి కానలో ఏమైనదో కదా! రాజా, నీ వైనను ఏమని యూహింతువయ్యా?

రామునికడ ఎంత చనవు కలిగిన, సీతకై ఎంత జాలి గలిగిన, వాసంతి రామునితో ఎట్టెదుట ఇట్లు పలుక నేర్చును? దుఃఖము పట్టకయున్నది. కఠోర - అని నోట పెట్టుకొనివచ్చుచున్నది. యశము కోరి కదా ఈపని చేసితివి? నిజముగా ఇంతకంటెను ఘోరమైన అపయశము లోకాన ఉండునా? యశమును కోరితివి, దానిని పొందితివా? అపయశమును మాన్పఁ దలఁచితివి, మఱి దానినే పొందితివి కదా. 'కథం మన్యసే?' - నీవుమాత్రము ఎఱుంగుదువా? ఊహలు చేయవలసినదే కదా. నాథ - నీవే కదా ఎల్లరకు నాథుఁడవు, రక్షకుఁడవు, సీతకును. మఱి ఆమె అడవిలో ఏమైనదని యూహింతువు? - అనుట.

ప్రదీప్తం ప్రదీపయసి = క్షుభితుని క్షోభపెట్టుచున్నావు! నన్ను తలంచుకొని ఇప్పుడే ఏడ్చుచు మూర్ఛపొందుచు తేఱుచు ఉన్నవానిని నీయీమాటలచే మిగుల కాఁతియఁబెట్టుచున్నావు. సీతకు తాను ఏమైపోయినను సరే; రాముని యెడ అట్టి గాఢప్రేమ. ప్రణయ ఏవం వ్యాహరతి, శోకశ్చ - ప్రేమయు శోకమును ఇట్లు పలుకుచున్నవి, అనఁగా పలికించుచున్నవి. వాసంతియు వశము తప్పియే ఈమాట అనుచున్నది. కిం అత్ర మన్తవ్యమ్ = ఇందు అనుకొనవలసినది ఏమున్నది? సులువుగా తెలియుచున్నదే - అనుట.

శ్లో. ౨౨. త్రిస్త్రేతి. త్రిస్త్రైకహాయన కురఙ్గ విలోల దృష్టేః = బెదరిన, ఒక్క సంవత్సరము వయసైన, లేడి (పిల్ల) యొక్క కన్నులవంటి చపలపుఁగన్నులుఁగలదియు, పరిస్ఫురిత గర్భభరాలసాయాః = అదరుచున్న కేఁకటిప్రేగుచేత ఓపికలు తూలినదియు ఐన. తస్యాః = ఆమెయొక్క, జ్యోత్స్నామయీ ఇవ = వెన్నెలమయము

జ్యోత్స్నామయీవ మృదుముగ్ధమృణాళకల్పా
క్రవ్యాద్భి రఙ్గలతికా నియతం విలుప్తా. ౨౧

---

మయీవ - వెన్నెలతో చేసినదియో యన - నున్నట్టిదియు, మృదుముగ్ధమృణాలకల్పా = మెత్తగా ముగ్ధగా నున్న తామరతూడితో సమానమైనదియు నగు, అఙ్గలతికా = తీవంబోని దేహము, క్రవ్యాద్భిః = పచ్చిమాంసమే వెతికి తిను పులి మొదలైన ఘాతుకమృగముల చేతనో, లేక అట్టి రాక్షసుల చేతనో, విలుప్తా = ముగించివేయఁ బడినది - మెసవి, లేకుండ చేయఁబడినది. నియతమ్=నిజము.

చెదరుగొన్న ఒక్కయేఁడు నిండియునిండని జింకపిల్ల కన్నులవంటి కన్నులుగలిగియుండి - అట్టిచూపులం జూచుచుండఁగా, గర్భభరము అదరుచు ఓపికలు తూలింపఁగా, వెన్నెలవలె తళతళని లేఁత తామరతూఁడివలె మెత్తని, తీవంబోని యామె దేహము ఏపులియో ఏతోడేలో ఏరాక్షసుఁడో నిజముగా నమలి చేసి లేకుండఁ జేసియుండును. అంతే.

త్రస్త - ఏకహాయన - అని యింతవివరముగా చెప్పుట కన్నుల లౌల్యాతిశయమును చిత్తమునకు తెచ్చుటకు. క్రవ్యాదములు పట్టుకొనఁగా అప్పటి యా చూపులను చిత్తమునకు తెచ్చి జాలింబెంచుటకు. పరిస్ఫురిత...యాః - తప్పించుకొనుట కైన ఏప్రయత్నమునకును - పరుగెత్తుట మొదలైనదానికిని - దానిచేతనే అలసిపోయినదానికి, అనుటకు, క్రవ్యాదమునకు ఆహారముగా దొరకినప్రాణి - పిల్లినోట ఎలుక కీచుకీచుమనుటయు, పులినోట జింక తన్నుకొనుటయుం బోలె - చూపులం జూచుటయు చేష్టలం జేయుటయు నమలుటకుతూహలముం బెంచును. అట్లేకదా కాళిదాసు - శాకుం. VI - 6.

'ఏష త్వా మభినవ కణ్ఠశోణితార్థీ
శార్దూలః పశు మివ హన్మి చేష్టమానమ్.'

అని 'చేష్టమానం' అన్నాఁడు. మఱియు చంపువున భోజదేవుఁడు అపహృత సీతంగూర్చి ఈ రామ పరిదేవనముల గూర్చినాఁడు - అరణ్య - 39.

'స ప్రాణా చే జ్జనకతనయా కిం న తిష్ఠేత మహ్యాం?
హింస్రైః సత్త్వై ర్న ఖలు నిహతా, రక్తసిక్తా న పృథ్వీ.
గోదావర్యాం పులినవిహృతిం రామశూన్యా నకుర్యాత్.
యుక్తం, నక్తంచర కబలనాత్ సంస్థితా సర్వథా సా.

ఇందు కడపటిచరణముం బరికింపఁదగును. 'జ్యోత్స్నామయీ' ఇది భవభూతికి కడుప్రియము. మా - 1 - ౨౦ "లలితలలితై ర్జ్యోత్స్నాప్రాయైః...అఙ్గకైః" 'మృదు ముగ్ధమృణాలకల్పా...విలుప్తా.' తామరతూఁడిని తుంచుకొని నమలినట్లుగా అవ

సీతా—అజ్జఉత్త ఏసా ధరామి. [ఆర్యపుత్ర, ఏషా ధ్రియే.]

రామః—హా ప్రియే జానకి క్వాసి?

సీతా—హద్ధి హద్ధి అజ్జఉత్తో వి పముక్కకంఠం రుణ్ణో! [హాధిక్ హాధిక్ ఆర్యపుత్రోఽపి ప్రముక్తకంఠం రుదితః!]

తమసా—వత్సే, సామ్ప్రతికమేవైతత్, కర్తవ్యాని ఖలు దుఃఖితై ర్దుఃఖ నిర్వాపణాని, యతః—

శ్లో॥ పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా,
శోకక్షోభే చ హృదయం ప్రలాపై రేవ ధార్యతే. ౨౩

---

లీలగా ఆసాసగా తినివేసియుందురు - అనుట. నియతమ్ - తప్పకుండ - ఇది సంభావనను, ఉత్ప్రేక్షను తెలుపును. నిజముగా సీత యట్లు మృత యని రాముఁడు నిశ్చయించుకొనఁడు, అట్టిది సీతగ్రహచారము అని రాముఁడు తన మనసును రాయిచేసికొన్నాఁడు! (తన గ్రహచారమును! అట్లు వివాసనము చేయవలసి వచ్చుట!)

ఏషా ధ్రియే=ఇదిగో నేను బ్రదికియే యున్నాను. విముక్తకణ్ఠం రోదితి = వావిచ్చి యేడ్చుచున్నాఁడు! ధీరోదాత్తుఁడు అమహాసత్త్వుఁడును - అని శేషము. దీనిచేత రామునికి గాంభీర్యలోపము చెప్పరదు. ఆదుఃఖాతిశయము, ఈ కొచ్చెలి సాన్నిధ్యము, అంత కక్కుర కాని యడవియొంటిపాటు. వాసంతి యెదుట తలుపు బార్లా తెఱచినట్లు ఏడుపు ఆఁపుకొనరాక పొరలును. అట్లే తమస వ్యాఖ్యానించుచున్నది. సామ్ప్రతిక మేవ ఏతత్=ఇది యుక్తమే.

శ్లో. ౨౩. పూరేతి - పూరోత్పీడే = వెల్లువ మిక్కుటముగా పొడిచినప్పుడు, దరులఁ బొరలినపుడు, తటాకస్య=చెఱువునకు, పరీవాహః = కలుజు తెఱచి నీరు బయటికి పాఱించుట, ప్రతిక్రియా = ఆఁపుదల, శోకక్షోభే = దుఃఖమువలని కలఁతలో, హృదయం చ=మనస్సు సయితము, ప్రలాపైః ఏవ=తనకు ఇట్లు ఇట్లు అని వాపోవుటలతోడి యేడ్పులచేతనే, ధార్యతే=నిలుపఁబడును, కాచఁబడును.

చెఱువున వెల్లువ మిక్కుటమయినపుడు, కట్ట తెగిపోఁవును. (అట్లు తెగుచేని నష్టములు కొలువరానివిగదా.) అట్లు తెగనీక, ఒకవూఱ కలుజు తెఱచి నీరు వెలికి పాఱించివేసిన, అది కట్ట తెగిపోనీక, చెఱువునిండ నీటిని నిలిపి కాపాడును. అట్లే శోకముయొక్క క్షోభ మిక్కుటమైన గుండె బ్రీలి యపాయము కలుగును. వావిచ్చి యేడిచిన శోకమునకు ఇంచుక వేగము తగ్గును. గుండె బ్రీలక నిలుమను, రక్షితమగును మిక్కిలియు తగిన యుపమానము.

విశేషతో రామభద్రస్య బహుతర ప్రకార కష్టో జీవలోకః.

శ్లో॥ ఇదం విశ్వం పాల్యం విధివ దభియుక్తేన మనసా;
ప్రియాశోకో జీవం కుసుమ మివ ఘర్మో గ్లపయతి,
స్వయం కృత్వా త్యాగం విలపనవినోదోఽప్యసులభ!
స్తద ద్యా ప్యుచ్ఛ్వాసో భవతి, నను లాభో హి రుదితమ్. ౨౮

---

'పరీవాహ' - 'జలం ప్రవృద్ధం ఉచ్ఛ్వసితి పరివహతి యైర్నిర్గమమార్గైస్తే పరీవాహాః - కలుజు, 'ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవ హి రక్షణమ్। తటాకోదరసంస్థానాం పరీవాహ ఇవాంభసాం.' అని పెద్దలు.

విశేషతః=విశేషముగా - సామాన్యముగా ఎవనికైనను అట్లు అగును. రామభద్రునికి ఇతరులకంటె చాల ఎక్కువగా అగును. బహుతర ప్రకారకష్టః=పలు దెఱంగుల కష్టముగ యున్నది. జీవలోకః=ఈప్రాణిలోకము - సంసారము అనుట. ఆప్రకారములనే జాబితాగా చెప్పుచున్నది, తమస, ఒకపాటి రామపక్షపాతమును అవలంబించి.—

శ్లో. ౨౮. ఇదమితి. - ఇదం విశ్వం = ఈలోకమంతయు, విధివత్ = విధులు దాఁటకుండ - యథావిధిగా - శాస్త్రముప్రకారము, అభియుక్తేన మనసా = పూనిక గల చిత్తముతో, పాల్యం = ప్రోవవలసియున్నది. (-ఇది యొక కష్టప్రకారము. మఱి ప్రోవకూడదా యన్న-) ప్రియాశోకః=ప్రియకిడిన యిడుములకైన(తన)దుఃఖము, ఘర్మః=ఎండ, కుసుమం ఇవ=పూవునుం బోలె, జీవం=(తన) యాత్మను, గ్లపయతి=వాడ్చుచున్నది. స్వయం=తానై సొంతముగా, త్యాగం = విడిచిపెట్టుటను, కృత్వా=చేసి - అనఁగా వివాసనము చేసి, కానలకు తఱిమి - అనుట - చేసి అనఁగా చేసినందున అనుట. విలపన వినోదః అపి=వావిచ్చి యేడ్చి (ఆశోకమును) దీర్చుకొనుటయు, అసులభః=సులువుకాక యున్నది. తత్ =కావున, అద్య అపి=ఇప్పుడైనను, ఉచ్ఛ్వాసః=ఊఱట, భవతి=కలుగును. నను=ఏమమ్మా, సీతా, రుదితమ్ = ఏడ్పు, లాభః హి=మేలు - ప్రయోజనకరము - కదా.

పూనికతోడ. శాస్త్రప్రకారము, పొరపాటు లేకుండ (తనరాజ్యమైన) యీ లోకమంతయు పరిపాలింపవలసియున్నది. అట్లే పరిపాలింపఁగూడదా యన్న, ప్రియకు తాను గావించిన చెట్టలని తన శోకము, ఎండ పువ్వుంబోలె, తన యాత్మను వాడ్చుచున్నది. శోకమును ఏడ్చి తీర్చుకొనరాదా యన్న, నీకె తఱిమి మరల ఏడ్చెదవా అందురేమో అని, అతనికి అదియు సులువు గాదాయెను. కావున ఇప్పుడైనను — ఈ వావిచ్చిన యేడ్పులచేత రవంత యూఱట కలుగును గదా. అట్లు ఏడ్పు ప్రయోజనకరమే అగును గదా, సీతమ్మా.

రామః — కష్టం భోః కష్టం.

శ్లో॥ దళతి హృదయం గాఢోద్వేగాద్, ద్విధా తు న భిద్యతే;
వహతి వికలః కాయో మోహం, న ముఞ్చతి చేతనాం;
జ్వలయతి తనూ మన్తర్దాహః, కరోతి న భస్మసాత్;
ప్రహరతి విధి ర్మర్మచ్ఛేదీ, న కృన్తతి జీవితమ్. ౨౫

---

ఇట్లు రాముని యేడ్పునకు సమాధానము. 'విధివత్' 'అభియుక్తేన మనసా'- సీతా-దుఃఖాక్రాంతుఁడైనను, రాముఁడు చేయుచుండు రాజ్యపాలన ప్రకారమునకు ఇది తమస సాక్ష్యము. బ్రాహ్మణశిశువును బ్రదికింప పూటపడి ఇంతకుముందే శంబూకుం జంప నాఱులామడలు వచ్చినాఁడు! రోదనమును చక్కఁగా సమర్థించినది, తమస. 'ప్రధానం క్షత్రియే కర్మ ప్రజానాం పరిపాలనం' అని యాజ్ఞవల్క్యుఁడు. కష్టమ్ - కట్టా. (అను తెనుఁగునకు అది ప్రకృతి) - దుఃఖసూచకము.

శ్లో. ౨౫. దళతీతి. - హృదయం=గుండె, గాఢోద్వేగాత్=గాటమైనభయము వలన, కాదా, సీత పోయినదే అను కలవరమువలన, దళతి=పగులుచున్నది, చీలుచున్నది; తు=కింతు=అయినను, ద్విధా న భిద్యతే=రెండుగా తునియుటలేదు! కాయః=దేహము, వికలః=వసముతప్పినదై, మోహం=మూర్ఛను - సొమ్మసిల్లుటను, వహతి=తాల్చును - పొందును. (కింతు=కాని,) చేతనాం=ప్రాణమును, న ముఞ్చతి=వీడదు! అన్తర్దాహః=(చిత్తము)లోని మంట, తనూం=దేహమును, జ్వలయతి=కాలుచును (కింతు=అయినను,) న భస్మసాత్ కరోతి=బూడిదగా చేయదు! విధిః=(నా వాత) విధి, మర్మచ్ఛేదీ=ఆయువుపట్టులను కోయునదై, ప్రహరతి=బిట్టు కొట్టును. (కింతు=అయినను,) జీవితమ్=బ్రదుకును, ఆయువును, న కృన్తతి=కోయదు!

నాగుండె పెనుభయమున (కలవరమున) పగులుచున్నది, కాని రెండు తునకలు కాదాయె! దేహము మూర్ఛలచే వివశతను పొందునే కాని, ప్రాణమును విడువదాయె! కడుపులోని సొద దేహమును మండించునే కాని, బూడిద చేయదాయె! ఆయువుపట్టులం గోయునదై విధి బిట్టు కొట్టునే కాని, బ్రదుకును కత్తిరించివేయదాయె!

శోకాతిరేకముం జెప్ప నీశ్లోకమునకు మించినది లేనట్లు భవభూతిప్రీతితో దీనినే తుల్యసంవిధానమున ప్రియావియోగదుఃఖమున మాలతిలో మాధవుని చేతం బలికించినాఁడు. IX - 12. గుండెప్రీలుట, దేహమును మూర్ఛపైకొనుట, లోనిసెగ దేహమును కాల్చుట, విధి మర్మములం బ్రహరించుటయు - ప్రాణాంతకములు

సీతా—ఎవ్వ ణ్ణేదమ్. [ఏవంను ఏతత్.]

రామః—భవన్తః పౌరజానపదాః,

శ్లో॥ నఖలు భవతాం దేవ్యా స్థానం గృహేఽభిమతం. తత
స్తృణ మివ వనే శూన్యే త్యక్తా, న చా ప్యనుశోచితా;
చిరపరిచితా స్తే తే భావా పరిద్రవయన్తి మా
మిద మశరణై ర ద్యాస్మాభిః, ప్రసీదత, రుద్యతే. ౨౮

---

బాధను కలిగించునవి. అబాధం జెప్పుటకు మఱి ప్రకారాంతరము భాషలో లేదనఁదగును. అట్టి ప్రాణాంతము సేయునంత బాధకలుగుచున్నదే కాని ప్రాణాంతము కాకయున్నది! ప్రాణము అంతమైన, మఱి బాధ యుండదు. కావున్న, ఆబాధ ఉత్కటోత్కటము, దుర్భరతమము. మహాకవి ఎంతయు నేర్పుతో అందముగా వివరించినాఁడు.

ఏవంను ఏతత్ =ఇట్టిదే ఇది. సీత తన సొంతయనుభవముచేత రామోక్తి సమంజసతను అంగీకరించుచున్నది. ఆ దుఃఖము అట్టిది యనుటకు సీతారాములిరువురును అనుభవించి యెఱింగినసాక్షులు.

భవన్తః=అయ్యలారా - పూజతోడి సంబోధన. ఎదుట లేని వారిని తలఁపునం బిలుచుట - విశేష సంబోధన.

శ్లో. ౨౮. నఖల్వితి - దేవ్యాః=రాణియొక్క, గృహే స్థానం=ఇంటనుండుట, భవతాం=మీకు, న అభిమతం ఖలు=ఇష్టము గాకపోయెనుగదా. (పా. నకిల) తతః=దానంజేసి, తృణం ఇవ=గడ్డిపరకవలె, శూన్యే వనే=ఎవ్వరును లేని అడవియందు, త్యక్తా=విడిచిపెట్టఁబడినది. అపిచ=అంతియకాదు, మఱియు, న అనుశోచితా = తరువాత ఆమెం దలఁచుకొని ఏడువనైతిని. చిరపరిచితాః=చిరకాలము (నాకు మునుపు) పరిచితములైన, తే తే భావాః=ఆయావస్తువులు, విషయములు, మాం = నన్ను, పరిద్రవయన్తి=కరఁగించివేయుచున్నవి. అశరణైః=మఱి శరణము లేనివాఁడనైన, అస్మాభిః = నాచేత, అద్య=ఇప్పుడు, రుద్యతే = ఏడువఁబడుచున్నది. - నేను ఏడ్చుచున్నాను అనుట. ప్రసీదత=మన్నింపుఁడు.

మీ మదికి దేవి జానకి యింట నుండుట సరిపడదాయెను. దానచే ఆమెను గడ్డిపరకవలె శూన్యమైన యడవిలో విడిచి పెట్టితిని. మఱి ఆమెకై ఏడువనైతిని, ఇపుడు ఆమెం గూడి నేను మునుపు చిరపరిచయము గన్న ఆయాపదార్థములం గాంచఁగా నామనస్సు కరఁగి దుఃఖము వెల్లువపొడిచినది. దానిని ఆఁపుకొనజాలనివాఁడనై ఇదిగో ఇట్లు ఏడ్చుచున్నాను. ఇందులకై నన్ను మీరు కోపపడక మన్నింపుఁడు.

తమసా—(స్వగతం)అతిగమ్భీర మాపూరణం శోకసాగరస్య!
వాసన్తీ—అతిక్రాన్తే ధైర్య మవలమ్బ్యతాం దేవేన.
రామః—సఖి కి ముచ్యతే ధైర్య మితి?

---

'సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్' అని తన కులక్రమాగత వ్రతము. కాఁగా, సీతచారిత్రమును 'లోకో న మృష్యతి' 'లోకము మన్నింపదాయె'నని తాను వినఁగానే, లోకమును ఆరాధించువాఁడై, ఆమె చారిత్రమందలి తన నమ్మకమును లెక్కసేయక, ఆమెను ఇంట నుండనీక, ఒక తృణమువలె, ఒంటరిగా దిక్కులేనియడవిలో విడిచినాఁడు. ఆ దెల్ల లోకమును తృప్తిపఱుచుటకే. తాను మిక్కిలి ఇష్టములోనే చేసినాఁడు, ఆపనిని. అందులకై ఆమెకై తాను దుఃఖించిన లోకము మెచ్చదు, తనకు ఇష్టముగాని పని చేసినాఁడు రాముఁ డని తలంచును అని తన దుఃఖమును ఇన్నాళ్ళు (పండ్రెండేండ్లు) ఆఁపుకొనియుండినాఁడు. నేఁడు ఆమెంగూడి తాను చిరకాలము బాంధవముసల్పిన యీ పంచవటి, ఆ గోదావరి, ఆ యరఁటితోట, ఆ వాసంతి మొదలైనవానిని తాఁ గాంచఁగా ఆఁపుకొనరాక దుఃఖము పొంగి పొరలినది. అందులకై ఏమియు అనుకొనక తన్ను మన్నింపుమని ప్రజలను తలంచుకొని బతిమాలుకొనుచున్నాఁడు దీన సీతావివాసనమున రాముని చిత్తవృత్తి యెట్టిదో స్పష్టముగా తెలుపఁబడినది. 'గృహే స్థానం'-అనుటవలన 'ఇంట తెచ్చిపెట్టుకొన్నాఁడు' అని లోకము దెప్పినది ఊహింపఁదగును. చూ. ఉత్తర కాండ.

43 సర్గ-13. శృణు రాజన్ యథా పౌరాః కథయన్తి శుభాశుభం

.....................

16. హత్వా చ రావణం యుద్ధే సీతా మాహృత్య రాఘవః
అమర్షం పృష్ఠతః కృత్వా స్వ వేశ్మ పున రానయత్.
17. కీదృశం హృదయే తస్య సీతాసంభోగజం సుఖమ్!'

ఇట్టిదే చెవిలో చెప్పిన యిందలి దుర్ముఖునివాక్కును అని ఊహింపఁదగును. 'మరల ఇంట తెచ్చిపెట్టుకొన్నాఁడు' అనియే ఇట్టియెడ లోకనిందోక్తిప్రకారము.

ఆపూరణం శోకసాగరస్య=శోకసముద్రముయొక్క నిండు, అతిగమ్భీరమ్=మిక్కిలి లోఁతుగానున్నది. అనఁగా అట్లు పోటుపొడిచి, అందనిలోఁతుగా, పొంగినది శోకము-అనుట. అతిక్రాన్తే=కడచిపోయిన దానింగూర్చి-పండ్రెండేండ్లయిపోయినది-ఇఁకను ఇపుడు ఏడ్చి ఏమి? ధైర్యం అవలమ్బ్యతాం = తేఁకువ-

శ్లో॥ దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః,
నష్టం సీతేతి నామాపి; న చ రామో న జీవతి. ౨౮

సీతా—మోహిద ఏ దేహిం అజ్జఉత్తవఅణే హిం. [మోహితాస్మి ఏ తై రార్యపుత్రవచనైః.]

---

తాల్మి - అవలంబింపఁబడునుగాక. కిం అత్ర ఉచ్యతే ధైర్యం ఇతి - ఇందు ధైర్యము అని ఏల చెప్పుచున్నావు? అనఁగా నేను అవలంబించిన ధైర్యము ఇంతంతయా, కొలఁది యున్నదా? సీతావిరహితుఁడనై పండ్రెండేండ్లయినను నేను ప్రాణముతోనే యున్నానే ఇంకను. ఇంతకన్న ధైర్యము ఉండునా లోకాన - అనుట.

శ్లో. ౨౮. దేవ్యేతి. - దేవ్యా=(సీతా) దేవిచేత, శూన్యస్య = శూన్యమైన - దేవి లేకపోయిన, జగతః=లోకమునకు, ద్వాదశః పరివత్సరః=పండ్రెండవ పెద్దయేఁడు. సీతా ఇతి నామ అపి=సీతయనెడు పేరును, నష్టం = నష్టమైనది - లేకపోయినది. రామః=రాముఁడు. న చ న జీవతి=లేకపోలేదు. - రామః చ = రాముఁడన్ననో, న న జీవతి - బ్రతికియుండక - చచ్చి - పోలేదు.

దేవిలేక (నావు) పాడుపడిన ఈలోకమునకు ఇపుడు పండ్రెండవ పెద్ద సంవత్సరము. అనఁగా అంత దీర్ఘకాలమైనది. సీతయన్న పేరుసైతము మాసిపోయినది. కఠినాత్ముఁడు రాముఁడు లేకపోయినాఁడన్నమాట ఇంకను లేదాయెను. ఇది తాలిమిపరాకాష్ఠ.

దేవ్యా శూన్యస్య జగతః - దేవి లేనందున జగము శూన్యముగా పాడుపడినట్లులున్నది. పరివత్సరః - వత్సరము అన్న నే ఒకయేఁడు. పరివత్సరః - ఒక్కొక్క సంవత్సరము కడు దీర్ఘముగా తోఁచుచున్నది యనుట - 'దీర్ఘయామా త్రియామా' అన్నట్లు - యామము ఎప్పుడును మూఁడు గంటల దైర్ఘ్యముగలదే - ప్రియవియోగాదులయందు ముప్పదిగంటలదిగా తోఁచును. అట్లే వత్సరము పండ్రెండునెలలదైనను, ఈవియోగమున ఒక్కటొక్కటియు ఇరువదినెలలదైనటులు తోఁచును. అట్టిది యిది పండ్రెండవ సంవత్సరము. 'చ రామః' 'రామః చ' - 'రామః తు' అన్నట్లు. రాముఁడు అని తన పేరుం జెప్పుటచే కఠినాత్మత చెప్పుకొన్నట్లు. ననజీవతి - చావలేదు - లేకపోలేదు. పండ్రెండేండ్లు సీత పేరు మాసిపోవునంత సుదీర్ఘమైనకాలము. మఱి రామునికి ఇంకను చావు రాలేదు. 'లేఁడు రాముఁడు' అన్నమాట ఇప్పటికిని లేదాయెను. ఇట్లు బ్రతికియే యున్నాఁడు.

మోహితా అస్మి=మూఢనగుచున్నాను, మూర్ఛితనగుచున్నాను - సంతోషాతిశయముచేత సీతకు ఈపారవశ్యము. ఏలన అవి అంత స్నేహపూర్వకములుగా

తమసా—ఏవం వత్సే.—

శ్లో॥ నైతాః ప్రియతమా వాచ స్స్నేహార్ద్రా శ్శోకదారుణాః;
ఏతా స్తా మధునో ధారా శ్చ్యోతన్తి సవిషా స్త్వయి. ౫౫
రామః—వాసన్తి, మయా ఖలు

శ్లో॥ యథా తిరశ్చీన మలాతశల్యం ప్రత్యుప్త మన్త స్సవిషశ్చ దంశః,
తథైవ తీవ్రో హృది శోకశఙ్కు ర్మర్మాణి కృన్తన్న పి కిం నసోఢః!

---

నున్నవి. ఇప్పుడు తేటతెల్లముగా తెలియుచున్నది సీతకు, రాముఁడు, తానై కాక, ప్రజలసంతోషముకై ఇట్లు ప్రియం దతిమినాఁడని, అందులకై ఇట్లు ఏడ్చుచు నున్నాఁడని. తన మనసున రామునిమీఁద కోపము ఇంచుకయు లేక తొలఁగిపోయినది. ఏవం=అట్లే, నీవు మూఢవగుట సరియే. ఏలన—

శ్లో. ౫౫. 'నైతా' ఇతి—స్నేహార్ద్రాః = అనురాగముతో తడిసినవియు (=కూడుకొని చల్లగా నుండునవియు,) శోకదారుణాః=దుఃఖముచేత నిష్ఠురముగా నుండునవియు నగు, ఏతాః వాచః=ఈపలుకులు, న ప్రియతమాః=మిక్కిలియు ఇష్టములు గావు. ఏతాః=ఇవి, తాః మధునః ధారాః=ఆ తేనెధారలు, సవిషాః = విసముతో కలసినవై, త్వయి=నీమీఁద, చ్యోతన్తి = కురియుచున్నవి. (నీకైన) స్నేహమునకు సూచకములైనందున చిత్తమునకు చల్లగానుండునవియు, అయన దైన శోకముతో పూర్ణములైనందున చిత్తమునకు చాల నిష్ఠురముగానుండునవియు నగు ఈ రామునిమాటలు నీకు అంతప్రియములుగావు. వినఁగానే ఆప్యాయముగా నుండి, ఆదుఃఖభరముచే దుస్సహములుగా నుండును. మకరందపుధారలు (నాలుకకు తగులగానే తియ్యగా మ్రింగఁబడి,) విసముతోకూడినవైనందున మూర్ఛకలిగించును. అట్లు, మయాఖలు=నాచేత, నీకే చెప్పవమ్మా! - అన్నట్లు, తరువాతి శ్లోకముతో అన్వయము.

శ్లో. ౫౬. యథేతి - అన్తః = లోపల హృదయములో, ప్రత్యుప్తం=నాటఁబడినదియు, తిరశ్చీనం = అడ్డముగా, వంకరగా నున్నదియు నగు, అలాతశల్యమ్ యథా=కొఱవి (కాలుచున్నకట్టె) ములికి యెట్లో, సవిషః=విసముతోకూడుకొన్న, దంశః చ యథా=కాటు, పాముకాటు అనుట. ఎట్లో, తథా ఏవ=అట్లే, హృది=హృదయమందు, తీవ్రః=తీవ్రమైన, ఓర్వరానిదైన, శోకశఙ్కుః=దుఃఖపు మేకు, మర్మాణి=ఆయువుపట్లను, కృన్తన్ అపి=కోయుచున్నను, న సోఢః కిం=ఓర్చుకొనఁబడలేదా?

సీతా—ఎవ్వం మ్హి మందభాఇణీ పుణో వి ఆఆసఆరిణీ అహం అజ్జఉత్తస్స. [ఏవ మస్మి మన్దభాగినీ పునర ప్యాయాసకారిణీ ఆర్యపుత్రస్య.]

రామః—ఏవ మతినిష్కమ్ప స్తమ్భితా న్తఃకరణ స్యాపి మమ

అడ్డముగ హృదయమున నాటిన కొఱవిములికివలెను, విషముతోడి (పాము) కాటువలెను, అందలి యాయువుపట్లను కోయుచున్న తీవ్రమైన మేపంబోనిదగు దుఃఖమును నేను ఓర్చుకొన లేదా? అంతకన్న ధైర్యమును నాకన్న ధైర్యశాలియు మఱియొండేని యుండునా - నేను తాల్మి వహించువాఁడనే కదా?

ఎంతయు తగినయుపమానములు! 'తిరశ్చీనం' - అడ్డముగ గ్రుచ్చిన, తివియరాక, ఎక్కువ బాధపెట్టున దగును. 'శల్యం' - ములికియైన నాటవచ్చును. 'అలాత' - మండుచున్నట్టిది, నిప్పుతోడిది, ఓర్వరానిబాధం గలిగించును. 'మర్మాణి కృన్తన్ అపి' - సీత అతిపవిత్ర, నిర్దోష - తా నెఱుఁగును; 'స్వయం కృత్వా త్యాగం' అని ఆమెను తానే కానపాలుచేసినవాఁడు - ఈతలంపులు, హృదయములోనివి, అక్కడ యాయువుపట్లను నిరంతరము కఱకఱకోయుచున్నవి. మఱి అవి తాను ఓర్చుకొనుచునేయున్నాఁడు - చావలేదు. ఇది తన యత్యంతధైర్యమునకు సాక్ష్యము. ఇట ఉక్తి సాటువకు, ఇంచుక వేఱు ప్రకరణములోనిదైనను ఈ నాగానందోద్ధారమును చూడఁదగును. నాగా - II.

"విదూ - భోవయస్య, కుత్ర ఖలు గతమ్ తే ధీరత్వమ్?
నాయ - వయస్య, నను ధీర ఏ వాస్మి. కుతః-

3. నీతాః కిం న నిశాః శశాఙ్కధవళాః? నాఘ్రాతమిన్దీవరం?
కిం నోన్మీలితమాలతీ సురభయః సోఢాః ప్రదోషానిలాః?
ఝంకారాః కమలాకరే మధులిహాం కిం వా మయా న శ్రుతాః?
నిర్వ్యాజం విధురే ష్వధీర ఇతి మాం యే నాభిధత్తే భవాన్?

అథవా సమ్య గభిహితం వయస్యేన.

౪. స్త్రీహృదయేన న సోఢాః క్షిప్తాః కుసుమేషవోఽప్యనఙ్గేన,
యే నాద్యైవ పుర స్తవ వదామి ధీర ఇతి స కథ మహమ్?

విదూ - ఏవ మధీరత్వం ప్రతిపద్యమానే నావిష్కృతోఽనేన మహాన్ హృదయ స్యావేగః......................"

ఏవం అస్మి మన్దభాగ్యా = నేను ఇట్లు - ఇంత - మందభాగ్యురాలను! పునరపి ఆయాసకారిణీ...మరలను ఆర్యపుత్రునికి ఆయాసము కలిగించుదాన నైతిని! అతి నిష్కమ్ప స్తమ్భి తా న్తః కరణస్య అపి=ఇంచుకయు చలింపనీక మనస్సును

సంస్తుత తత్ప్రియవస్తు దర్శనా దద్యాయ మావేగః. తథాహి:—

శ్లో॥ వేలోల్లోల క్షుభితకరణో జ్జృమ్భణ స్తమ్భనార్థం
యో యో యత్నః కథమపి మయా ధీయతే తం త మన్తః,
భిత్త్వా భిత్త్వా ప్రసరతి బలాత్కోఽపి చేతోవికార
స్తోయస్యే వాప్రతిహతరయ స్సైకతం సేతు మోఘః. 30

---

స్తంభించుకొన్నవానికైనను - మనస్సును ఇట్లు రాయి చేసికొన్నవానికైనను - సంస్తుత...పరిచితమైన - అద్య అయం ఆవేగః=ఇపుడు ఈ (శోక) భావంపు టుద్రేకము, దుఃఖంపు టుప్పెన! ఇది ఎంతయు స్వభావసిద్ధమైన సత్యము!

శ్లో. 30. వేలేతి - వేల ఉల్లోల క్షుభిత కరణ ఉజ్జృమ్భణ స్తమ్భనార్థం = హద్దుమీఱినదైన కలఁగిన యింద్రియముల విజృంభణముయొక్క (పొంగుయొక్క - ఆవేగముయొక్క) ఆఁపుటకై, యః యః యత్నః=ఏయేజతనము, కథమపి=ఎట్టకేలకు, మయా=నాచేత, అధీయతే=చేయఁబడునో, తం తం=దానిని దానిని - జతనముల నన్నింటిని. అంతః=నడుమనే, అప్రతిహతరయః = ఆఁపరాని వేగము (=విసరు)గలదైన, తోయస్య ఓఘః=నీటిప్రవాహము, సైకతం సేతుం ఇవ=ఇసుకతో పెట్టిన కట్టంబోలె, భిత్త్వా భిత్త్వా=అప్పటికప్పుడే త్రోసివైచి, కోఽపి=ఇట్టిదని చెప్పనలవిపడని, చేతోవికారః=(నా) మనసునందలి వికారము - వేదన, బలాత్ = బలాత్కారముగా, నెట్టన, నెట్టుకొని, ప్రసరతి=వ్యాపించుచున్నది.

కలఁగిపోయిన నాయింద్రియముల మట్టుమీఱిన యావేగమును అడంచుటకై నేను ఎంతయో క్లేశముతో ఏయేప్రయత్నమును చేయుదునో దానినెల్ల, ఇసుక కట్టను అప్పటికప్పుడే నెట్టివేసి పాఱు అడంపరాని వేగముగల నీటిప్రవాహమువలె, ఏదియో ఇట్టిదని చెప్ప నలవికాని చేతోవికారము మాటిమాటికి నెట్టన నెట్టుకొని నెట్టుకొని వ్యాపించుచున్నదే. (ఏమి సేయుదును? అనుట.)

ఇదియు రాముఁడు తనధైర్యమునుగూర్చి వాసంతికి చెప్పు మాటయే. నేను దుఃఖమును అడంచుకొనను ఆఁపుకొనను ఎంతెంతయో ప్రయత్నములు చేయుచున్నాను. అది నాకు అలవిపడక పొంగుచునే యున్నది, ఏమిసేయుదును - అనుచున్నాఁడు. 'ధైర్య మవలమ్బ్యతాం' అన్న వాసంతిమాటకు రాముని జవాబు ఇట మూఁడుశ్లోకములతోడి మూఁడువాక్యములు - ఒక్కటే మొత్తము అని జ్ఞాపకముండఁదగును. నడుమనుండు తమసాసీతల వాక్యములు కలిపించు వ్యత

సీతా—అజ్జఉత్తస్స ఏదేణ దువ్వారదారుణారంభేణ దుక్ఖసంఖోహేణ పరిప్ఫురిఅణిఅదుక్ఖం విఅ ఆఅంపిఅం మే హిఅఅం. [ఆర్యపుత్రస్య ఏతేన దుర్వారదారుణారమ్భేణ దుఃఖసంక్షోభేణ పరిస్ఫురితనిజదుఃఖ మివ ఆకమ్పితం మే హృదయమ్.]

వాసన్తీ—(స్వగతం) కష్టమభ్యాపన్నో దేవః. తదాక్షిపామి తావత్. (ప్రకాశమ్) చిరపరిచితా నేతాన్ జనస్థానభాగా నవలోకయతు దేవః.

రామః—ఏవ మస్తు (ఉత్థాయ పరిక్రామతి.)

సీతా—సందీఇణా ఎవ్వ దూహస్స పిఅసహీ విణోదణోవా ఒత్తి మణ్ణేది. (సన్దీపనా న్యేవ దుఃఖస్య ప్రియసఖీ వినోదనోపాయ ఇతి మన్యతే.]

---

ధానము తొలఁగించుకొనవలయును. అవి రామవాక్యములపై వ్యాఖ్యాసూచకములగును. తమసాసీతలు రామవాసంతులకు అగపడరుగదా.

దుర్వారదారుణారమ్భేణ = అడంపరాని తీవ్రమైన పని - ఫలము - గలదైన, దుఃఖసంక్షోభేణ=శోకావేగము చేత, పరిస్ఫురిత నిజదుఃఖమ్ ఇవ=తన(=నా)దుఃఖమెల్ల చక్కగా స్ఫురణకు - అనుభవమునకు - వచ్చినదానివలె. తన (=నా) దుఃఖమెల్ల తన (=నా)కిపుడు క్రొత్తది ఉదికినట్లు. ఆకమ్పితం మే హృదయమ్ = నా హృదయము వడవడ వణఁకుచున్నది. ఇది ప్రియదుఃఖముచే నిజదుఃఖము పొంగి పొరలుట! కష్టం అభ్యాపన్నః = కష్టమును పొందినాఁడు, కష్టముపాలైనాఁడు. ఆక్షిపామి= వేఱువిషయమునకు మరల్చెదను. ఏతాన్ జనస్థానభాగాన్ అవలోకయతు= ఈ జనస్థానమందలి భాగములను-ప్రదేశములను - చూచునుగాక. ఇప్పుడే రాముఁడు అన్నాఁడు, 'సంస్తుత తత్త్విరియవస్తు దర్శనా దద్యాయ మావేగః' - అని తన నోటితో. వాసంతి వానినే మరల వివరముగా చూపెద ననుచున్నది! దీనివలన శోకోద్దీపనమేగదా కలుగును. అయినను, కాదా, కావుననే, రామునికి వానిని చూడఁగోరిక, ఆదుఃఖము ఒకవేళ వినోదము పొందునేమో అని వాసంతికి భ్రాంతి. వనదేవత కావున వనభాగములను చక్కఁగా చూపుచున్నది. సందీపనాని ఏవ=అవి దుఃఖసందీపనములే - దుఃఖమును ఎక్కువచేయునవే అని సీతయు తలంచుచున్నది. 'సంస్తుతప్రదేశ దర్శనాసహిష్ణోః, అ౩ మాలతిలోను. వినను

వాసన్తీ—(సకరుణం) దేవ, దేవ,

శ్లో॥ అస్మిన్నేవ లతాగృహే త్వమభవ స్తన్మార్గదత్తేక్షణ,
సా హంసైః కృతకౌతుకా చిర మభూ ద్గోదావరీసైకతే;
ఆయాన్త్యా పరిదుర్మనాయిత మివ త్వాం వీక్ష్య బద్ధ స్తయా
కాతర్యా దరవిన్దకుట్మలనిభో ముగ్ధః ప్రణామాఞ్జలిః. 39

ఆమువ్వురకును రామవాసంతీ సీతలకు దర్శనకుతూహలమును మనసున లేకపోదు. చూడను చూతురు, వారివారికి తగినట్లు ఏడుతను ఏడ్తురు. కావుననే వాసంతి వాక్యమునకు 'సకరుణమ్' అని అవతారిక. వారికన్నను ముందు వాసంతికే కన్నులలో అశ్రువులు పొరలును.

శ్లో. 39. అస్మిన్ ఇతి - అస్మిన్ లతాగృహే ఏవ=ఈ తీఁగయింటిలోనే, త్వమ్=నీవు, తన్మార్గ దత్తేక్షణః=ఆమె రావలయు మార్గముననే చూపు నిల్పిన వాఁడవై, అభవః=ఉంటివి. సా=ఆమె, (నా నెచ్చెలి సీత,) హంసైః=హంసలతో, కృతకౌతుకా = వేడుకగొన్నదై, వానివిహారసౌభాగ్యముం జూచుచు కౌతుకముచే అపహృతయై, గోదావరీ సైకతే=గోదావరియందలి యిసుకదిన్నెపై, చిరం అభూత్=చాలసేపు ఉండెను - తామసించెను. ఆయాన్త్యా=(మరలి) వచ్చుచున్నదై, పరిదుర్మనాయితం ఇవ = మనసులో ఖేదపడుచున్నవానివలె (ఉన్న) త్వాం = నిన్ను, వీక్ష్య = చూచి, కాతర్యాత్ =(నీవు ఏమందువో అను) భయము వలన, అరవిన్దకుట్మలనిభః = తామరమొగ్గనుబోలిన, ముగ్ధః = అందమైన, ప్రణామాంజలిః=నమస్కరించుటకైన చేమోడ్పు - దోసిలి, బద్ధః=కూర్పఁబడెను.

ఇదిగో ఆతీవెయిల్లు. మునుపు ఒకనాఁడు నీవు ఇందే సీతకై కనుపెట్టుకొనియుంటివి. ఆమెయు గోదావరికిపోయినట్టిది, అట దిన్నెపై విహరించుచున్న హంసలను తమితో చూచుమండి, ఇంచుక ఆలస్యముచేసినది. అంతట (వేగముగా) నీకడకు మరలజొచ్చినది. నిన్ను అంతట చూచి నీవు మనసున వెత చెందుచున్నావని కనిపట్టి, భయపడినది. అంతట తమ్మిమొగ్గవలె చేతులు అందముగా కలిపి నీకు నమస్కరించినది, క్షమాపణకోసము. ఇందు మిక్కిలి ఉద్దీపనము చెప్పఁబడినది. శృంగారసందర్భమున నాయకునికి నాయికపై కోపమును, నాయిక దానిం దీర్ప నాయకునికి నమస్కరించుట జెప్పుటయు మందము కాఁబోలు. మఱి ఇట దుర్మనాయితత కోపము గాదు, వెత, ఉత్కంఠయే, అగును. సీతయు ముద్దుగా అందముగా చేతులు జోడించినది. ఈయలంతి యాలస్యపు విరహమును సైతము ఆ దినాళ్లలో ఆయన ఓర్వఁజాలకుండెను. అట్టిది ఆ యనురాగము, స్నేహము. ప్రణామము

సీతా.—దారుణాసి హహీ వాసంతీ దారుణాసి, జా ఏదేహిం హిఅఅమమ్ముగ్ఘాడిఅ సళ్ళసంఘట్టణేహిం పుణో పుణో మాం మంద భాఇణిం అజ్జఉత్తం అ సన్దావేసి [దారుణాసి సఖి వాసన్తి దారుణాసి, యా ఏతై ర్హృదయమర్మోద్ఘాటిత శల్యసంఘట్టనైః పునః పున ర్మాం మన్దభాగినీ మార్యపుత్రం చ సన్తాపయసి.]

రామః.—చణ్డి జానకి! ఇత స్తతో దృశ్యసే; న చానుకమ్పసే!

శ్లో॥ హాహా! దేవి! స్ఫుటతి హృదయం, ధ్వంసతే దేహబన్ధః!
శూన్యం మన్యే జగ, దవిరతజ్వాల మన్త ర్జ్వలామి;

తుమాపణమునకై. 'పరిమర్శనాయితమ్ = అత్యన్తం ఉత్క్రణ్ఠాకలిత హృదయం' - అని రామచంద్రటీక. అఞ్జలిః=బొటనవ్రేలిని వంచి చూపుడువ్రేలి మొదట గూర్చి వ్రేళ్ళన్నియు చక్కఁగా చాచి పట్టిన రెండు అఱచేతులును తగులునట్లు పట్టినవి. అట్టిదే తమ్మి మొగ్గం బోలును. బొటనవ్రేలిని వంచుట ఆవశ్యకము - ముట్మలసామ్యమునకు.

హృదయ మర్మగూఢ శల్యోద్ ఘట్టనైః=హృదయమందలి యాయువుపట్టున లోఁతుగా చొచ్చియున్న ములికిని కదలఁబైకి (సుత్తెనోనుంబోలె) కొట్టుటలచేత చిత్తమున లోపలమఱఁగియున్న వీనిని స్మృతికి తెచ్చుట అట్లున్నది - అనుట. సీతకును రామునికిని సమానముగా దుఃఖము పొరలివచ్చుచున్నది. సంతాపము కలుగుచున్నది. (వాసంతికిని; కావున నే, సకరుణమ్ అన్నాఁడు.)

చణ్డి - కాఠిన్యము ఎక్కువ కోపముగలదానా - ఇతః తతః=ఇటను అటను, ఇంతట నంతట, దృశ్యసే - కనఁబడుచున్నావు. దృశ్యసే ఇవ - అన్నపాఠము సాధువుగాదు - అది 'న చానుకమ్పసే'తో పదురదు. జాలిగొననందున నే, ఊరడింప వందున నే - చండి అని భావించి బతిమాలుకొనుట.

శ్లో. ౩౨. హా హేతి - హాహా=హా! అయ్యో!, దేవి=నా దేవీ, హృదయం=గుండియ, స్ఫుటతి=పగులుచున్నది; దేహబన్ధః=శరీరపుకట్టు - అవయవములకూర్పు - చేతులు కాళ్ళు మొదలగువానియొక్క కట్టు, ధ్వంసతే=నాశనమై పోవుచున్నది, పడలిపోవుచున్నది. నాచేతులు కాళ్లు దేహము మొదలగునవి ఒండొంటిం గూడి ఒక్కటిగా కట్టుబడియుండక తనికి అవి వీడి ఎట్లో పోవునట్లు ఉన్నవి. జగత్=జగమును, శూన్యం=శూన్యముగా - ఎవ్వరును ఏదియు లేని యెడారిగా, మన్యే=తలఁచుచున్నాను. అవిరతజ్వాలమ్=ఎడతెగని జ్వాలలు గలయట్లుగా, అన్తః=

సీద న్నన్ధే తమసి విధురో మజ్జతీ వా_న్త రాత్మా,
విష్వఙ్మోహా స్థగయతి; కథం మన్దభాగ్యః కరోమి! 38
(ఇతి మూర్ఛతి.)

సీతా—హద్ధి హద్ధి! పుణోవి మూఢో అజ్జఉత్తో. [హాధిక్! హాధిక్! పున రపి మూఢ ఆర్యపుత్రః.]

వాస_న్తీ—దేవ సమాశ్వసిహి సమాశ్వసిహి.

సీతా—హా! అజ్జఉ_త్త, మం మందభాఇణిం ఉద్దిసిఅ సఅళ జీఅలోఅ మంగళాధారస్స దే వారంవారం సంసఇద జీవిద దారుణో దసాపరిణామో! హా హదమ్హి. [హా! ఆర్యపుత్ర, మాం మన్దభాగినీ ముద్దిశ్య సకలజీవలోక మఙ్గళాధారస్య తే వారం వారం సంశయిత జీవితో దారుణో దశాపరిణామ ఇతి హా హాతాస్మి!] (ఇతి మూర్ఛతి.)

లోపల, జ్వలామి=మండుచున్నాను-మంటలు కలిగియున్నాను. అ_న్తరాత్మా = అంతరాత్మ, విధురః = వికలమై, వసముతప్పినదై, సీదణ్ = క్రుంగిపోవుచు, అన్ధే తమసి=కాఱు కటిక చీఁకటిలో, మజ్జతి ఇవ=మునుంగుచున్నట్లున్నది, మోహః= మూర్ఛ. విష్వక్=అంతటను, స్థగయతి=కమ్ముకొనుచున్నది మన్దభాగ్యః=(ఇట్లు) అదృష్టహీనుఁడనైన నేను, కథం కరోమి?=ఎట్లు చేయుదును?

అయ్యయ్యో, ప్రాణేశ్వరీ, నాగుండియ పగిలిపోవుచున్నది! నాదేహమున అన్ని బంధములును సడలి నాశనమగుచున్నవి! చుట్టును లోకము నాకు పాడు పడినట్లు తోఁచుచున్నది! లోపల అంగక ఎగయుచున్న మంటలతో నేను కాలి పోవుచున్నాను! నా యంతరాత్మ నోటవసముతప్పి కాఱుకటిక చీఁకటిలో క్రుంగి మునిఁగిపోవుచున్నట్లు ఉన్నది! అంతటం గ్రమ్ముచు మూర్ఛ నన్ను పైకొను చున్నదే! మందభాగ్యుఁడను అయ్యో, ఇపుడు నేనెట్లు చేయుదును!

ఇది తెలివినుండి మూర్ఛకు మాఱు క్రమము! 'విమూఢః' - విష్వఙ్మోహః' అన్నట్లు పెనుమూర్ఛలో పడినాఁడు. మన్దభాగ్యాం మాం ఉద్దిశ్య=మందభాగ్య పైన నన్నుంగూర్చి - నాకోసము - నేను ఉన్న నది యొంత పోయిన నది యొంత! రాముఁడు సకలజీవలోక మంగళమునకు ఆధారభూతుఁడు. ఆమంగళము అయ నపై నిలిచియున్నది-అనుట. సంశయిత జీవిత దారుణః - ప్రాణ మున్నదా పోయి నదా అను సందియము కలిగించునంత తీవ్రమైన. హా హాతాస్మి=అయ్యో చెడితి నే!

తమసా—వత్సే, సమాశ్వసిహి, సమాశ్వసిహి. పునస్త్వ త్పాణిస్పర్శ ఏవ సఞ్జీవనోపాయో రామభద్రస్య.

వాసన్తీ—కథ మద్యాపి నోచ్ఛ్వసితి! హా ప్రియసఖి సీతే! క్వాసి? సమ్భావయాత్మనో జీవితేశ్వరమ్.

[సీతా ససంభ్రమ ముపసృత్య హృది లలాటే చ స్పృశతి.]

వాసన్తీ—దిష్ట్యా ప్రత్యాపన్న చేతనో రామభద్రః!

రామః—

శ్లో॥ ఆలిమ్ప న్నమృతమయై రివ ప్రలేపై
రన్తర్వా బహిరపి వా శరీరధాతూన్,
సంస్పర్శః పున రపి జీవయ న్నకస్మా
దానన్దా దపరవిధం తనోతి మోహమ్. 33

---

చచ్చితినే' అని కాదు అర్థము. ఐనను తెనుంగునను ఆయర్థమున 'చచ్చితినే' అనఁదగును. హా ప్రియసఖి సీతే - అని వాసంతి సంబోధించుటయు రామునికిం బోలెనే తనకును ఉన్మాదపర్యంతమైన యప్పటి దుఃఖమున సంభావనచే మనసు ననే కాక ఎదురను తోఁచునట్లు ఉండుటచేత. సీతా ససంభ్రమం ఉపసృత్య హృది అలాటే చ స్పృశతి=సీత వడివడిగా సమీపించి ఎదయందును నొసటను (రాముని) తాఁకును. ఈ స్పర్శమహిమంగూర్చి పూర్వము ౧౨-వ శ్లోకవ్యాఖ్యం జూడఁదగును.

శ్లో. 33. ఆలిమ్పన్ ఇతి - అన్తః వా బహిః అపి వా=లోపలను బయటనుం గూడ, శరీరధాతూన్ = దేహమందలి ధాతువులను - మాంసాస్థిమజ్జా శుక్ల మేదః శోణితరసం సేడింటిని, అనఁగా లోపలను బయటను శరీరమంతటిని, అమృతమయైః = అమృతముతో చేసినవైన, ప్రలేపైః = పూఁతలతో, ఆలిమ్పన్ ఇవ = చిక్కఁగా అలందుచుంబోలెనున్న, సంస్పర్శః=తాఁకుడు, పునః అపి = మరలనుం గూడ, అకస్మాత్ =ఉన్నటులుండి, తటాలున, జీవయన్=నాకు చేతనం గూర్చుచు, ఆనన్దాత్ =హర్షాతిరేకమువలన, అపరవిధం మోహమ్ = ఒండు తెఱంగు మైకమును, తనోతి=కలిగించుచున్నది.

మరల తటాలున నాకు ఎందుండియో ఒక యరిదితాఁకుడు కలిగినది. దాన ఒడలంతయు, లోపలను బయటను, తోలు నెంత్రుక నెత్తురు కండ మొదలగు అన్ని ధాతువులును, అమృతముతోడి మైపూఁత అలందినట్లు, జిల్లుమన్నవి. అపరిమితానందమువలన ఒండు తెఱఁగుమైకము పైకొనుచున్నది.

(ఆనన్దనిమీలితాక్ష ఏవ) సఖి వాసన్తి, దిష్ట్యా వర్ధసే!

వాసన్తీ—కథమివ?

రామః—సఖి, కిమన్యత్? ప్రాప్తా పున రపి జానకీ.

వాసన్తీ—అయి దేవ రామభద్ర! క్వసా?

రామః—(స్పర్శసుఖ మభినీయ) పశ్య నన్వియం పురత ఏవ.

వాసన్తీ—అయి రామభద్ర! కిమితి మర్మచ్ఛేదదారుణై రేభిః ప్రలాపైః ప్రియసఖీదుఃఖదగ్ధా మపి పున ర్మాం మన్దభాగ్యాం దహసి?

సీతా—ఓసరిదు మిచ్ఛమ్హి. ఏసో పుణ చిరసబ్భావ సొమ్మసీఅలేణ అజ్జఉత్తఫంసేణ దీహదారుణం వి సందావం ఝత్తి హావేణ వజ్జలేవోవణద్ధో విఅ సిజ్జన్త ణీసహా విహ్వలత్థో వేవది అవసో విఅ మే హత్థో. [అపసర్తు మిచ్ఛామి. ఏష పునః చిర సద్భావ సౌమ్యశీతలేన ఆర్యపుత్త్రస్పర్శేన దీర్ఘదారుణ మపి సన్తాపం ఝటితి

---

శోకమూర్ఛ x హర్షమూర్ఛ - అన్యోన్యవిపరీతముల కార్యైక్యము! స్పర్శమహిమం జెప్పిన ముందటిశ్లోకములను ౬, ౭ అను పరికింపఁదగును. మునుపు చెప్పినదానినే నేర్పుతో భంగ్యంతరముగా చెప్పినాఁడు. ఈకవికి ఇట్టియెడల, తుల్యసంవిధానములయందు చెప్పిన శ్లోకమునే మరల చెప్పుట శైలి. ఐనను ఈ విషయము ఆయనకు ఎంత ప్రియమాయెననఁగా, దానికి నేర్పుతో ఇట భంగ్యంతర మవలంబించి చెప్పి చూచుకొనునంత.

ఆనన్ద నిమీలితాక్ష ఏవ=ఆనందములో కన్నులు మూసికొన్నవాఁడుగానే, దిష్ట్యా=సంతోషము! సంతోషము! అనుట. వర్ధసే=వర్ధిల్లుచున్నావు, నీయదృష్టము దొడ్డది - అనుట. ప్రాప్తా పునః అపి జానకీ=జానకి మరల దొరకినది. రాముఁడు నిజముగానే చలువ యనుభవముచే కన్నులు తెఱవక చెప్పుచున్నాఁడు. కన్నులు తెఱచి చూచుచున్న వాసంతికి సీత, తాఁకుచున్నట్టిది, యగపడనందున ఇది రాముని శోకోన్మాదంపుఁ బ్రేలుట యని తోఁచి, ఆ రాముని దుఃఖాతిరేకమునకై తాను మఱింత దుఃఖముపాలగును. అట్లే చెప్పును - కిమితి మర్మచ్ఛేదదారుణైః - ఇత్యాది. ప్రియసఖీ దుఃఖ దగ్ధాం అపి=ప్రియసఖికైన దుఃఖములో మాడిపోయిన దానినైనను, పునః దహసి=మరల ఇంకను - మాడ్చెదవు. అపసర్తుం ఇచ్ఛామి = నేను అవలికి అరుగఁగోరెదను - అనఁగా సీత చేతిని రాముని హృదయమున ఉంచియే యున్నది - ఇంకను చక్కఁగా రాముఁడు కన్నులు తెఱవనందున - స్పర్శకార్యము పూర్తిగా అయినదని సీతకు తోఁపనందున. ఇపుడు ఈ రామ వాసంతీభాషితముల,

హారతా వజ్రలేపోపనిబద్ధ ఇవ స్విద్యన్ నిఃసహో విపర్యస్తో వేపతే అవశ ఇవ మే హస్తః.]

రామః—సఖి, కుతః ప్రలాపాః?

శ్లో॥ గృహీతో యః పూర్వం పరిణయవిధౌ కఙ్కణధర
శ్చిరం స్వేచ్ఛాస్పర్శై రమృతశిశిరై ర్యః పరిచితః

సీతా—అజ్జఉత్త, సో ఎవ్వ దాణిం సి తుమం. [ఆర్యపుత్ర, స ఏ వేదానీ మసి త్వం.]

రామః—

స ఏ వాయం తస్యా స్తుహినకరకోపమ్యసుభగో
మయా లబ్ధః పాణి ర్లలితలవలీకన్దళనిభః. 38

(గృహ్ణాతి)

---

చేత సందేహము తీఱినందున తాను చేయి తీసికొని అవతలికి పోఁగోరుచున్నది. ఐనను రాముని దేహస్పర్శ చాల చల్లనై 'జిల్లు' మని సీతకును ఆనందము కలిగించినది. దానఁ బొడమిన సాత్త్వికోదయమువలన జాడ్య స్వేదములచేత కీలెడలినట్లు రాము దేహమునకు గట్టిగా అంటుకొనిపోయినట్లు తివియరాక తడంబడుచు వసముదప్పి వణఁకఁజొచ్చినది. చిరసద్భావసౌమ్యశీతలేన=చిరకాల మలవడియున్న (సద్భావ=) నమ్మకమునంజేసి సౌమ్యమును శీతలమును ఐన, 'వజ్రలేప' – రాతిని రాతితో అదికింపంజాలిన జిగురుగల యొక బంక. దానితో అదికించినదానివలె – అంత గట్టిగా అదుకకొని పోయినదనుట. ఇట్లగునని తాను ముందుగా ఊహింపలేదు, అనుకొనలేదు. ఉల్లపతా = అపలాపించుచున్నదై – పోఁగొట్టుచున్నదై, నిఃసహః= బలమెడలి ఓపనిదై, – (కీలెడలినట్టులై,) విపర్యస్తః=తడబడుచున్నదై, 'వేపతే' – వణఁకుచున్నది. ఇట్టిభావముల మునుపు ఏ కవులుం వ్రాసినారు! అపూర్వరమణీయము. అంతారంభమునందలి తొలిస్పర్శలో సీతకు ఇట్లు కాలేదు. 'ససాధ్వసం...అపసృత్య' – తాఁకియు తాఁకకయే అపుడు భయాన అపసరిల్లినది. కుతః ప్రలాపాః=ప్రలాపములేల? అనఁగా అట్లనెదవేల? పలవరింతలా (=ప్రలాపములా) ఇవి?

శ్లో. 38. గృహీతఇతి. పూర్వం = మునుపు, పరిణయవిధౌ = వివాహకర్మయందు, కఙ్కణధరః=కంకణము ధరించినదై, యః=ఏది, గృహీతః = పట్టుకొనంబడినదో, (తరువాత) చిరం = చాలకాలము. అమృతశిశిరైః = అమృతమువలె చల్లనైన, స్వేచ్ఛాస్పర్శైః=ఇచ్చ వెయి – మాటిమాటికిని ఐన – అనురాగమువలని స్పర్శలచే, యః=ఏది, పరిచితః = అనుభవముచే ఎఱుకపడియున్నదో, స ఏవ అయం=

సీతా—హద్ధీ! హద్ధీ! అజ్జఉత్త ఫంస మోహిదాఏ పమాదో ఖు మే సంవుత్తో! [హాధిక్! హాధిక్! ఆర్యపుత్రస్పర్శమోహితాయాః ప్రమాదః ఖలు మే సంవృత్తః!]

రామః—సఖి వాసన్తి, ఆనన్దనిమీలితేన్ద్రియః సాధ్వసేన పరవా నస్మి, త త్త్వం తావ దేనాం ధారయ.

(సీతా ససంభ్రమం హస్త మాకృష్యాపసర్పతి.)

---

అదియే ఇదిగో ఇది, లలిత లవలీకన్దల నిభః = కోమలమైన వెన్నెలతీఁగ మొలకం బోలినది, తుహిన కర కాపమ్య సుభగః=మంచుతోడియు వడగల్లుతోడియు పోటువచే సొబగారుచున్నదై, తస్యాః పాణిః = ఆమె చేయి, మయా లబ్ధః=నాకు దొరకినదికదే!

మునుపు మాపెండ్లిలో కంకణము కట్టుకొనియుండఁగా నేను పట్టుకొనినది, తరువాత చిరకాలము, పెక్కేండ్లు, ఇష్టమైనపు డెల్ల తాఁకుచుండిన అమృత శిశిరంపు తాఁకుడులచే, నాకు లెస్సగా పరిచితమైనది, ఆమెచేయియే ఇదిగో వెన్నెలతీవ మొలకంబోలినదై మంచుగడ్డవలెను వడగల్లువలెను జిల్లుమని సుఖ గాప్యాయనముగా నుండునది, నాకు దొరకినది, చూడు.

ఆర్యపుత్ర, స ఏవ ఇదానీ మసి త్వం - అతఁడవే ఇపుడు నీవు - అని సీత రాముని శ్లోకపుమాటల నడుమనే అనును. ఈ సమయమున ప్రకృతవిషాదియెల్ల మఱచునట్లు ఆ సమాగమ సుఖానుభవము గలిగినది. దాన ఈ మాటలు పెట్టుకొని వచ్చినవి. స్పర్శసుఖముచేత ఆనవాలు పట్టినాఁడు. ఇతి గృహ్ణాతి - అని పట్టుకొనును. సీత చేయి రాముని చేతికి చిక్కినది. ప్రమాదః ఖలు - ఏమఱుపాటున పొరపాటు, ఆపదగదా - ఇట్లగునని సీత తలంపలేదు. ఆనన్దనిమీలితేన్ద్రియః=ఆనందముచే జడములై చేష్టలు దక్కిన యింద్రియములుగలవాఁడను - సాధ్వసేన=భయముచే - సీత పట్టు తప్పించుకొని పోవునేమో అని, పరవాన్ అస్మి - నేను నావశమున లేను. త్వం తావత్ ధారయ - ఇంకను రాముఁడు కన్నులు మూసికొనియే యున్నాఁడు. చేత సీతచేయి పట్టుబడి ఆమె తనప్రక్కన తనకు చిక్కియున్నట్లు నిశ్చయించుకొన్నాఁడు. పట్టు దూసిపోవునట్లు ఉన్నది అని, అట్లు పోకుండ సీతచేతిని వాసంతిచేత పెట్టఁబోయినాఁడు. ఆసందున సీత చేతిని లాగికొని అపసర్పిల్లినది. అంతట రాముఁడు అయ్యో ఏమఱుపాటున పొరపాటు కలిగెనదే అన్నాఁడు. కన్నులు తెఱచుకొని చూచుచున్న వాసంతికి సీత యగపడనందు

వాసన్తీ—కష్టః! మున్మాద ఏవ!

రామః—హా! ధిక్ప్రమాదః!

శ్లో॥ కరపల్లవ స్స తస్యా స్సహసా సైవ జడా జ్జడః పరిభ్రష్టః,
పరికమ్పినః ప్రకమ్పీ కరా న్మమ స్విద్యతః స్విద్యన్. 35

వల్ల ఆమె ఈ రామభాషిత మెల్ల ఉన్మత్తప్రలాపముగాఁ గాని, ఇట్లు పిచ్చివాఁడైనాఁడే ఎట్లబ్బా అని అతిదుఃఖమును, దిగులును పొందును. ఇందువలన వెండియు దుఃఖసంవేదనము! ప్రమాదః=ఏమఱుపాటున పొరపాటు.

శ్లో. 35. కరపల్లవ ఇతి. తస్యాః=ఆమెయొక్క, కరపల్లవః=చివురుంబోని చేయి, ప్రకమ్పీ=వడఁకుచున్నదియు, స్విద్యన్=చెమర్చుచున్నదియు, జడః=మ్రాన్పడినదియునై, (అట్లే,) పరికమ్పినః=వడఁకుగొన్నదియు, స్విద్యతః=చెమర్చుచున్నదియు, జడాత్=జడనుగొన్నదియు నగు. మమ కరాత్=నా చేతినుండి, సహసా ఇవ=తటాలునంబోలె, పరిభ్రష్టః=జాఱిపోయినది.

అన్యోన్యస్పర్శచేత సీతచేతికిని రామునిచేతికిని తుల్యావస్థ కలిగినది. వడఁకుచు చెమర్చుచు మ్రాన్పడిన నాచేతినుండి వడఁకుచు చెమర్చుచు మ్రాన్పడిన యామెచేయిచివురు జాఱిపోయినది.

కంపము స్వేదము జడత - ఇవి సాత్త్వికభావములు - సీతారాముల కుభయులకు సమానముగా ఒండొరులస్పర్శచే కలిగినవి. ఆసామ్యముం జెప్పుటకు 'జడాజ్జడః' 'పరికమ్పినః ప్రకమ్పీ' మొదలగు క్రమరచన మిగుల సదృశము, సుభగము. ఇది వాల్మీకి శిష్యుఁడైన కాళిదాసునకు తాను శిష్యుఁడై అనుకరించుట. చూ. మేఘ.—

II - 41. అఙ్గే నాఙ్గం ప్రతను తనునా గాఢతప్తేన తప్తం
సాస్రే ణాశ్రుద్రుత మవిరతోత్కణ్ఠ ముత్కణ్ఠితేన.
ఉష్ణోచ్ఛ్వాసం సమధికతరోచ్ఛ్వాసినా దూరవర్తీ
సఙ్కల్పై స్తై ర్విశతి విధినా వైరిణా రుద్ధమార్గః.

ఒక్కడ 'ప్రతను తనునా' అని ద్వితీయయైన 'తను'తో 'ప్ర' చేర్చియు ఒక్కడ 'గాఢతప్తేన తప్తం' అని తృతీయయైన 'తప్తేన'తో గాఢ చేర్చియు చెప్పుటచేత అవస్థలోని యొక్కువ తక్కువలు గావు, సామ్యమే వివక్షితము అని సూచింపఁబడినది. ప్రకృతశ్లోకమునన్ననో 'పరికమ్పినః' 'ప్రకమ్పీ' అని ఉపసర్గ యిడినచోట రెంట సమానముగా నిడి సాటువ రెప్పగా నిర్వహింపఁబడినది.

సీతా—హద్ధి! హద్ధి! అజ్జవి అణవత్థిత త్థిమిత మూఢ ఘుణ్ణన్త ణఅణో ణ పజ్జవత్థావేది అత్తాణఅం. [హాధిక్ హాధిక్! అద్యాపి అనవస్థిత స్తిమిత మూఢ ఘూర్ణమాన నయనః న పర్యవస్థాపయతి ఆత్మానమ్ ]

తమసా—(సస్నేహ హాస కౌతుకం నిర్వర్ణ్య)

శ్లో॥ సస్వేదరోమాఞ్చిత కమ్పితాఙ్గీ। జాతా ప్రియస్పర్శసుఖేన వత్సా
మరున్నవామ్భః ప్రవిధూత సిక్తా।కదమ్బ యష్టి స్స్ఫుటకోర కేవ!

---

ఇట్టి తుల్యావస్థలో సీతయొర్పు మెండు. అనవస్థిత స్తిమిత మూఢ ఘూర్ణమాన నయనః - అనవస్థితముగా - నిలుకడలేక - కదలక నిలిచినదియు, తెలియకొని యున్నను తన విషయమును గ్రహింపనిదియు, సుడియుచున్నదియుంగా పలు తెఱంగులుగా నున్న కన్నులుగలవాఁడు. న పర్యవస్థాపయతి, ఆత్మానమ్=ఇంకను తన్ను కుదురుపఱుచుకొనలేదు. ఇదెల్ల ఉన్మాదలక్షణము. సస్నేహహాసకౌతుకమ్ - తమస వాసంతివలెకాదు, సీతను రామునింగూడఁ జూచుచున్నది. రామస్పర్శచేత నైన సీత వికృతులను కంటితో చూచి, స్నేహముతలన(హాస)రతంత ఎగతాళి తోఁచు నవ్వుతోను... కౌతుకమ్=హర్షముగొని.

శ్లో. ౩౬. సస్వేదేతి. మరున్నవామ్భః ప్రవిధూతసిక్తా = (వాన)గాలిచేతను క్రొత్తనీటి (చినుకుల)చేతను ఊపఁబడి క్రక్కదలినదియు తడిసినదియు, (దానచే,) స్ఫుటకోరకా=చిక్కఁగా మొగ్గ తొడిగినదియు నగు, కదమ్బయష్టిః ఇవ = కడిమి కొమ్మవలె, వత్సా=అమ్మాయి జానకి, ప్రియస్పర్శ సుఖేన = ప్రియుని తాఁకుడులని సుఖహర్షమున, సస్వేద రోమాఞ్చిత కమ్పితాఙ్గీ=చెమర్చి, గగుర్పొడిచి, వణఁకుం గలిగిన యవయవములుగలదిగా, జాతా=అయెను!

(తాత్పర్యం) క్రొత్త గాలిచినుకులకు ఊపువడి తడిసిపోయి ననిచిన కడిమి కొమ్మవలె, అమ్మాయి సీత, ప్రియుని తాఁకుడులని హర్షములవ అంగము లందు చెమర్చినదియు గగుర్కొన్నదియు వణఁకుగలదియు నయినది!

కడిమికొమ్మకు అట్టి గాలియు చినుకులును సోఁకిన, అది ఒక్కుమ్మడి అంతటం గలయ మొగ్గతొడుగును. పులకిత దేహమునకును పుష్పితకదంబమునకును మహాకవి కాళిదాసు సామ్యముం జెప్పినాఁడు. పూర్వ - మే - 26.

"నీ చైరాఖ్యం గిరి మధివసే స్తత్ర విశ్రామ హేతోస్
త్వ త్సంపర్కా త్పులకిత మివ ప్రౌఢపుష్పైః కదమ్బైః"

అది కరము హృదయంగమమని మహాకవి భవభూతి ఇట్లు అనుకరించి

సీతా—(స్వగతం) అమ్మహే! అవశేణ ఏదేణ అత్తాణఏణ లజ్జావిదమ్హి భఅవదీఏ తమసాఏ. కింత్తి కిల ఏసా మణిస్సది ఏసో పరిచ్చాఓ ఏసో అ హిఅఆసఙ్గోత్తి. [అహో అవశేన ఏతేన ఆత్మనా లజ్జాపితాస్మి భగవత్యా తమసయా. కిమితి కిల ఏషా మంస్యతే. ఏష పరిత్యాగః ఏష హృదయాసఙ్గ ఇతి.]

రామః—(సర్వతోఽవలోక్య)హా! కథం! నాస్త్యేవ! న న్వకరుణే వైదేహి!

సీతా—సచ్చం అకరుణమ్హి. జా ఏవ్వంవిహం తుమం పేక్ఖంతీ ణం ధరామి ఏవ్వ జీవిదం! [సత్య మకరుణాస్మి, యా ఏవంవిధం త్వాం పశ్యన్తీ నను ధరా మ్యేవ జీవితమ్!]

రామః—క్వాసి దేవి? ప్రసీద, న మా మేవంవిధం పరిత్యాజ్య గన్తు మర్హసి.

సీతా—అజ్జఉత్త, వివరీదం విఅ ఏదమ్. [ఆర్యపుత్ర, విపరీత మివ ఏతత్.]

---

మెచ్చినాఁడు. అది తనచిత్తమున నాఁటుకొనిపోయినదని మునుపు మాలతిలోను సమసంవిధానమునఁ దానికే కూర్చినాఁడు. (III-7)

'ప్రథమ ప్రియావచన సంశ్రవ స్ఫుగత్
పులకేన సంప్రతి మయా విడమ్బ్యతే
ఘనరాజి నూతనపయః సముక్షణ
క్షణ బద్ధ కుట్మల కదమ్బ డమ్బరః.

మఱియు -(VII-1)-

'వయం తథా నామ యదాత్థ కిం వదా మ్యయం చ కస్మా ద్వికలః కథా న్తరే।
కదమ్బగోళాకృతి మాశ్రితః కథం విశుద్ధముగ్ధః కులకన్యకాజనః!'

అవశేన ఏతేన ఆత్మనా=అవశమైన - ఈనాచేత - ఇదిగో నేను నాకు వశము కానిదాన నైపోయి, లజ్జాపితా అస్మి=లజ్జించునట్లు చేయఁబడితిని - లజ్జిత నైతిని. ఏష పరిత్యాగ (ఇతి) ఏష హృదయాసంగ ఇతి - ఈ పరిత్యాగ మేమి, ఈమనసు తగులుకొను టేమి. (అనురాగాభినివేశ మేమి) అని - పరిత్యాగముచే కోపదుఃఖ నిర్వేదములు కదా కలుగవలయును. తఱిమినాయనమీఁద ఈకూరిమి ఏమి అని తమస పరిహాసము చేయు నని ఎచ్చరిక వహించినది కాదు అంతటిది సీత యాకూరిమి! ప్రసీద = అనుగ్రహింపుము - నామీఁద కోపము మానుము. విపరీతమ్ ఇవ ఏతత్=ఇది విపరీతముగా నున్నది. విడిచిపెట్టినవాఁడు నిజముగా ఆయనకు

వాసన్తీ—దేవ ప్రసీద, ప్రసీద; స్వేనైవ లోకోత్తరేణ ధైర్యేణ సంస్తమ్భయాతిభూమిగత విప్రలమ్భ మాత్మానం. కుతోఽత్ర మే ప్రియసఖీ?

రామః—వ్యక్తం నాస్త్యేవ. కథ మన్యథా వాసన్త్యపి తాం న పశ్యేత్? అపి ఖలు స్వప్న ఏషః! న చాస్మి సుప్తః. అథవా కుతో రామస్య నిద్రా! సర్వథాపి స ఏవైష భగవా ననేకవార పరికల్పనానిర్మితో విప్రలమ్భః పునః పున రనుబధ్నాతి మాం.

సీతా—మఏ ఎవ్వ దారుణాఏ విప్పలద్ధో అజ్జఉత్తో. [మయా ఏవ దారుణయా విప్రలబ్ధ ఆర్యపుత్రః.]

వాసంతీ—దేవ, పశ్య పశ్య.

శ్లో॥ పౌలస్త్యస్య జటాయుషా విఘటితః కార్ష్ణాయసోఽయం రథ,
స్తే చైతే పురతః పిశాచవదనాః కఙ్కాళశేషాః ఖరాః,

నన్ను విడిచిపెట్టకే అనుచున్నాఁడు! అతిభూమిగతవిప్రలంభం=మేరమీఱిపోయిన విప్రలంభము గలవానిని - విప్రలంభః = విరహము - ఆస్వాదము కలిగించునంతటిది, ధైర్యేణ=తెలివిచేత, అది మనోవికారములను నిలువరించుకొనుశక్తి. సంస్తమ్భయ = నిలువరించుకొనుము. ఈవిరహమునకే నిర్దేశము - 'ఏకో రసః కరుణ ఏవ' (III - ౪౦). వ్యక్తమ్=నిజముగానే. అపి ఖలు స్వప్న ఏషః=ఇదేమి కలయా? ఇది - అనఁగా సీత తాఁకుట, చలువలు గొలుపుట, చేతికి చిక్కుట, దూరికొనిపోవుట - మొదలగునదంతయు. భగవాన్ విప్రలమ్భః=అపరిమేయ మహిమగలది, చిత్తభ్రమ. అనేకవార=పలుమాఱు. అంకారంభమున పంచవటిం జూడఁగానే మూర్ఛిల్లినపుడు ఒకతూరియైనదికదా. కాదా - 'నిరంతర' - భావన సీతను సదా కల్పించి యెదుట ఇంతట అంతట నిలుపుచునే యున్నదికదా, అచిత్తభ్రమ అనుట. మయా ఏవ దారుణయా విప్రలబ్ధః=నేనే క్రూరురాలను వంచించితిని అనుట. వాసంతి వాక్యమందలి 'విప్రలంభ' మును గ్రహించి ఆమాటతోడనే ఇంచుక అర్థభేదముతో సీత జవాబు పలుకుచున్నది - 'వంచించితిని' అని.

శ్లో. ౩౭. పౌలస్త్యస్య - ఇతి - అయం - ఇదిగో ఇది, జటాయుషా = జటాయువుచేత, విఘటితః = విఱుగఁగొట్టఁబడిన. పౌలస్త్యస్య = రావణునియొక్క, కార్ష్ణాయసః=ఉక్కుతో చేయఁబడిన, రథః = రథము! ఏతే=ఇవిగో, పురతః =

ఖడ్గచ్ఛిన్నజటాయుపక్షతి రితః సీతాం జ్వలన్తీం వహ-
న్నన్తర్వ్యాకులవిద్యు దమ్బుద ఇవ ద్యా మభ్యుదస్థాదరిః. 38

ఎదుట; తస్య=వానియొక్క, తస్యైతే-పా. పిశాచవదనాః=పిశాచముల మొగములవంటి మొగములుగల, కఙ్కాలశేషాః=ఎముకలుమాత్రమే మిగిలిన. ఖరాః=గాడిదెలు! ఇతః=ఇదిగో ఇటనుండి, అరిః=శత్రువు-రావణుఁడు ఖడ్గచ్ఛిన్న జటాయుపక్షతిః=కత్తితో నఱుకఁబడినజటాయువు ఱెక్కల మొదళ్లు కలవాఁడై-ఱెక్కల మొదలంట నఱికివేసినవాఁడై అనుట, జ్వలన్తీం=(కోపముతో) మండుచు ప్రకాశించుచున్నట్టి, సీతాం=సీతను, వహన్=ఎత్తికొన్నవాఁడై, అంతర్వ్యాకుల విద్యుత్ = లోపల తెలుక్కుమని తళతళలాడు మెఱపుతీవగల, అమ్బుద ఇవ=మేఘమువలె, ద్యాం= (మింటింగూర్చి=) మింటికి, అభ్యుదస్థాత్ = ఎగిరినాఁడు, ఎగిరిపోయినాఁడు!

ఇదిగో రావణుని యొక్క తేరు; జటాయువు విఱుగఁగొట్టినది! ఇవిగో ఎదుట, దానికి కట్టిన గాడిదెలు; వాని మొగాలు పిశాచపు మొగములవలె నున్నవి; వట్టి ఎముకలుమాత్రమే మిగిలియున్నట్టివి! వీఁడుగో శత్రువు రావణుఁడు, జటాయువు ఱెక్కలు మొదలంట నఱికి, సీతను కోపముతో మండుచు ధగధగనున్న దానిని ఎత్తుకొని మింట ఎగిరిపోవుచున్నాఁడు, లోపల తళతళలాడుచున్న మెఱుముతోడి మేఘమో యన్నట్లు!

వాల్మీకి ఇట రావణునికి చెప్పిన తేరు ఇదిగో - రామా - అరణ్య. 35-౬.
'కాఞ్చనం రథ మాస్థాయ కామగం రత్నభూషితమ్
పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాఞ్చనభూషణైః!

వేఱుభావమును తెపుటకైనను-ఇదియు ఉన్మాదకమే. 'అయం...రథః' అనియు, 'ఏతే పురతః' అనియు. 'ఇతః అరిః' అనియు ఎదురుగాడగ్గఱ ఉన్నట్లు చూపుచుం జెప్పుట బలవదాకర్షణము. 'అంతర్వ్యాకుల విద్యుత్ అమ్బుద ఇవ'-అనుట 'నీలమేఘాశ్రితా విద్యుత్ స్ఫురన్తీ ప్రతిభాతి యా, స్ఫురన్తీ రావణస్యాఙ్కే సైవ దేహీవ తపస్వినీ.' - రామా. కిష్కిం. అ - 12. అను మొదలగు వాల్మీకివాక్యములను, 'నవజలధరః సన్నద్ధోఽయం, న దృప్త నిశాచరః...... కనకనికషస్నిగ్ధా విద్యుత్ ప్రియా మమ నోర్వశీ.'......'మయా జ్ఞాతం మృగలోచనాం నిశాచరః కోపి హరతి యా వన్ను నవతటి చ్ఛాయగాలో ధారాధరో వర్షతి' - విక్రమో - IV. అను కాళిదాసువాక్యములను పూజ. తేరు జటాయువు దెబ్బలకు భగ్నముకాఁగా, దానిని అటనే విడిచి, ఊరక ఆకాశయానమున

సీతా—(సభయమ్) అజ్జఉత్త, తాదో వావాదీఅది, అహం ఓహారిజ్జామి. పరిత్తాహి పరిత్తాహి. [ఆర్యపుత్ర తాతో వ్యాపాద్యతే, అహ మపహ్రియే, పరిత్రాయస్వ పరిత్రాయస్వ.

రామః—(సవేగ ముత్థాయ) ఆః! పాప! తాతప్రాణసీతాపహారిన్! క్వ యాసి?

వాసన్తీ—అయి దేవ, రాక్షసకులప్రళయధూమకేతో, కిమద్యాపి తే మన్యువిషయః?

సీతా—అహ్మో ఉమ్మత్తి అమ్హి సంవుత్తా. [అహో ఉన్మత్తాస్మి సంవృత్తా.]

రామః—అన్వర్థ ఏ వాయ మధునా ప్రలాపో వర్తతే. అన్య ఏ వాయ మధునా విపర్యయో వర్తతే.

---

లంకకు చేరెను అనుట. ంవిగ్న్యత్ - అని శేషపదము, అంబుదమునకు విశేషణము. అంత దుఃఖమున మునింగియున్న రామునికి చిత్తవిక్షేపము కలిగించి ప్రకృతిం బొందించుటకు కోపము కలిగించుట ఉపాయమని. కాళిదాసు శాకుంతలమున విరహానుశయ దుఃఖముపాలై వికృతి చెందియున్న దుష్యంతునికి మాతలిచే మాఢవ్యునికి గొంతు పిసికించి వానిని అలపించి ఏడ్పించి, దాన కోపముగొల్పి ప్రకృతిం గూర్చిన ఉపాయముచే, ఎఱింగినాఁడు కాఁబోలు. మాతలి - కిన్నిమిత్తా దపి మనః సన్తాపా దాయుష్మాన్ మయా విక్లబో దృష్టః. పశ్చా త్కోపయితుం తథా కృతవా నస్మి. కుతః -

'జ్వలతి చలితేన్ధనోఽగ్ని, ర్విప్రకృతః పన్నగః ఫణాం కురుతే
ప్రాయః స్వం మహిమానం క్షోభా త్ప్రతిపద్యతే హి జనః.'

శాకుం. VI - 30.

రాక్షసకులప్రలయ ధూమకేతో = రాక్షసులవంశములకు ప్రలయాగ్నియైన వాఁడా - ప్రలయాగ్ని సర్వమును కాల్చివేయునట్లు ఎల్ల రాక్షసులవంశములను నాశనము చేసినవాఁడా యనుట. అద్యాపి తే మన్యువిషయః = ఇప్పుడును నీ కోపమునకు విషయము కలదా? - కాకువుచే ప్రశ్న. ఇంకను ఉన్నారా రాక్షసులు అని. 'లేదు' అన్నమాట. 'ఉన్మత్తాస్మి సంవృత్తా' అనుటయు 'అన్వర్థ ఏ వాయ మధునా ప్రలాపో వర్తతే' అనుటయు తుల్యార్థకములు. సీత వెఱ్ఱిదానివలె మాటలాడినది 'తాతో వ్యాపాద్యతే' మొదలగునవి. రాముఁడు పలవరించినాఁడు. 'ఆః! పాప' ఇత్యాది. ఇరువురియవస్థయు ఇపుడు తుల్యముగా నున్నది అన్నమాట. తన మాట ఎట్లు పలవరింతయో చెప్పుచున్నాఁడు. విపర్యయః=విపర్యాసః - దశమార్పు.

శ్లో॥ ఉపాయానాం భావా దవిరతవినోదవ్యతికరై
ర్విమర్దై ర్వీరాణాం జగతి జనితాత్యద్భుతరసః,
వియోగో ముగ్ధాక్ష్యా స్స ఖలు రిపుఘాతావధి రభూ
త్కథ స్తూష్ణీం సహ్యో నిరవధి రయం త్వప్రతివిధః? ౩౬

---

శ్లో. ౩౬. ఉపాయానాం ఇతి - ముగ్ధాక్ష్యాః = అందమైన కన్నులుగలదైన సీతయొక్క, స ఖలు విరహః = ఆవిరహము అన్నదో, ఉపాయానాం భావాత్ = ఉపాయముల కలిమివలన, అవిరత వినోద వ్యతికరః = ఎడతెగని వినోదముల సంబంధము కలిగియుండినదియు, వీరాణాం విమర్దైః=వీరులయొక్క - అనఁగా వారితోడి - యుద్ధములచేత, జగతి=లోకమున, జనితాత్యద్భుతరసః = కలిగింపఁబడిన మిక్కిలి యాశ్చర్యమువలని రుచి (=ప్రీతి) కలదియైనది - కాదా - ఉత్కటమైన యద్భుతరసముగలదియు, రిపుఘాతావధిః = శత్రువులం జంపుట హద్దుగాఁగలది - అంతట తీఱునది - అభూత్ =అయెను. అయం తు (వియోగః)= ఈవియోగ మన్ననో అప్రతివిధః=ఎట్టి ప్రతీకారమును లేనిదియు, నిరవధిః=కడ - హద్దు - లేనిదియు, తూష్ణీం=మౌన మవలంబించి వావిచ్చి యేడువనుంగూడ ఏడువరానిది, కథం = ఎట్లు, సహ్యః=ఓర్వఁదగిన దగును?

సీతను వెదకించి కనిపట్టి శత్రువుం జంపుటకైన నానోపాయములు ఊహించి తెలుపవలయుటచేత, చిత్తము వానిమీఁద నిగుడుటచేత, అవిరహమునకు ఎప్పుడును వినోద ముండినది. వాలి, ఇంద్రజిత్కుంభకర్ణరావణాదులు, దేవతలకును అలవిని వారు. వారితో జగముల కెల్ల ఆశ్చర్యము కలిగించిన యుద్ధములు చేయవలసి వచ్చినది. అదియు విరహమునకు వినోదమే అయెను. అంతట శత్రువులం జంపఁగా, దాని హద్దు కడచినది. పునఃసంయోగమున వియోగము తీఱిపోయినది. ఈవియోగ మన్ననో ఏప్రతీకారమును లేనిది, ఏహద్దును లేనిది, ఏడువనుంగూడ లేక ఏమియు చెప్పక ఏమియు చేయక ఉండవలసినదే, ఎట్లు ఓర్చుకొందును?

'ఉపాయానాం' - సుగ్రీవసఖ్యము, వానరప్రేషణము, సేతుబంధనము మొదలగునవి. వీరాణాం - వాలి, రావణుని తనచంక నిఱికించుకొని ఏడుసముద్రములు త్రిప్పినవాఁడు. ఇంద్రజిత్తు ఇంద్రజిత్తు. రావణుఁడు త్రిలోకరావణుఁడు- ఒక్కబాణముననే కూల్చుట మొదలగు వారితోడి యుద్ధములు వాని ప్రకారములు లోకమున మిక్కిలి ఆశ్చర్యమును కలిగించినవి. 'తూష్ణీం' ఊరక, నోరు మూసికొని. చేయి కదల్పక, ఏడువనేని ఏడువక. తానే అన్నాఁడు కదా - 'స్వయం కృత్వా త్యాగం విపలనవినో దోఽప్యసులభః' అని. గొప్ప వీరవిజృంభణము అను విన్నను, కాంచినను అద్భుతము తోఁచును. 'హాస్యో భవతి శృఙ్గారాత్

సీతా—ణిరవహీ త్తి హా హదహ్మి మన్దభాఇణీ! (ఇతి రోదితి)
[నిరవధి రితి హా హతాస్మి మన్దభాగినీ!]

రామః—హా కష్టమ్!

శ్లో॥ వ్యర్థం యత్ర కపీన్ద్రసఖ్య మపి మే, వీర్యం హరీణాం వృథా,
ప్రజ్ఞా జామ్బవతోఽపి, యత్ర న గతిః పుత్రస్య వాయో రపి,
మార్గం యత్ర న విశ్వకర్మతనయః కర్తుం నళోఽపి క్షమః,
సౌమిత్రే రపి పత్రిణా మవిషయే తత్ర ప్రియే, క్వాసి మే! ౩౯

---

కరుణో రౌద్రకర్మణః, అద్భుతశ్చ తథా వీరా ద్బీభత్సాచ్చ భయానకః' - అని ఆచార్యులు. పూర్వరామచరితముం గూర్చి మహావీరచరితమని పేరిడి నాటకము రచించి భవభూతి అందలి తన పక్షపాతమునకు కారణము చెప్పినాఁడు.-

'తే వేద ముద్ధృత జగత్త్రియమున్యమూల
మస్తోకవీర మురుసాహస మద్భుతం చ,
వీరాద్భుతప్రియతయా రఘునన్దనస్య
ధర్మద్రుమహో దమయితు శ్చరితం నిబద్ధమ్.' అని.

'నిరవధిః ఇతి' - సీతకు ఈవియోగమందును రామునియందు వీడని యనురాగము. ఇపుడు ఈదర్శనశ్రవణముల చేత అది మఱియు ఉత్కటమైనది. పునః సంయోగము ఎన్నఁడెల్లు కలుగునా అను ఆసయు కలిగియున్నజాడ తోఁచును. ఈవివాసమునకు రామచిత్తమున అవధియుండునేమో, తన కెట్టుంగరాక, అను ప్రత్యాశయు కలిగియుండును. మఱి యిపుడు ఆయనయే 'నిరవధి' అని యనఁగా ఇఁక నెట్లు అన్న నిరాశచే దుఃఖము పొరలి వచ్చినది సీతకు. కావున 'రోదితి' - ఏడ్చును. 'నిరవధి' అని రామునికిని ఏడుపే. ఇది ఆరేడ్పు, 'నిరవధి' - అందువలననే ఆయతిలోకప్రభావు లెల్లరు పనివడి 'సావధి' చేసినారు. దాననే కరుణ విప్రలంభమైనది.

శ్లో. ౩౯. వ్యర్థమితి - యత్ర = ఎచట. కపీన్ద్రసఖ్యం అపి = వానరరాజగు సుగ్రీవుని చెల్మియు, వ్యర్థం = పనికిరాదో; (యత్ర = ఎచట,) హరీణాం=(సుగ్రీవ హనుమదంగదాదులగు) కోఁతులయొక్క, వీర్యం=(ఎదిరిని అడంచు) శక్తి, వృథా= పనికిరాదో; (యత్ర = ఎచట,) జామ్బవతః = జాంబవంతునియొక్క, ప్రజ్ఞా= మతియు, బుద్ధియు, (వృథా=పనికిరాదో;) యత్ర=ఎందు, వాయోః పుత్రస్య అపి=వాయువు పుత్రుఁడైన హనుమంతునికి సయితము, న గతిః=గమనము లేదో, యత్ర=ఎచట, విశ్వకర్మతనయః = విశ్వకర్మకు కొడుకైన, నళః అపి = నలుఁడు

సీతా—బహుమణ్ణా విదమ్హి పువ్వవిరహం. [బహుమానితాస్మి పూర్వవిరహమ్.]

---

సయితము. మార్గం కర్తుం=దారి - సముద్రసేతువుంబోనిది - చేయుటకు, న క్షమః= శక్తుఁడు కాఁడో, సౌమిత్రేః=లక్ష్మణుని యొక్క, పత్రిణాం అపి=బాణములకును, అవిషయే=గురికి అందనిదైన, తత్రకృ=అట్టి యేచోట, అసి=ఉన్నావో కదా, హే ప్రియే=నా ప్రేయసీ!

ప్రియా, నీవు నన్నుఁ బాసి ఎందున్నావో కదా! ఇప్పుడు అందు నిన్నుం గనను నన్నుం జేర్పను సుగ్రీవుసఖ్యముగాని, కోఁతులశక్తి కాని, జాంబవంతుని బుద్ధి కాని, హనుమంతుని గమనముగాని, సాక్షాద్విశ్వకర్మ కొమారుఁడగు నలుఁడును చేయఁగలదారిగాని, లక్ష్మణుని బాణములుఁగాని పనికిరావుగదా!

కపీన్ద్ర) - నేల యీనినట్లు కోట్లకొలఁదికోఁతులను రామకార్యమునకయి కూర్చి, వారిచేత అన్వేషణము, సేతువు, యుద్ధము మొదలైనవన్నియు చేయించినవాఁడు - అట్టిది ఆసఖ్యము. వీర్యమ్ - హనుమంతుఁడు సముద్రమును దాఁటి సీతం గాంచి రాక్షసవీరులం జంపి లంకం గాల్చి వచ్చినట్టిది; యుద్ధాన సుగ్రీవహనుమ దంగద నీలనలాదు లందఱు లెక్కకు మిక్కిలియైన రాక్షసయోధులం జంపినట్టిది. 'ప్రజ్ఞా జామ్బవతః' - సముద్రమును దాఁటుటెట్లు అని వానరులు సీతను వెదకుచున్నవారు, కింకర్తవ్యతామూఢులైనపుడు హనుమంతుఁడు అందులకు తగినవాఁడు అని బోధించి అతనిచే సముద్రలంఘనము చేయించినదియు. ఇంద్రజిత్ప్ర) యుక్త బ్రహ్మాస్త్రముచే సుగ్రీవాంగదాది వానరవీరులే కాక, వృద్ధఋక్షరాజు జాంబవంతుఁడును, రామలక్ష్మణులును మృతులో యన మూర్ఛంబడఁగా, 'మార్గతే జామ్బవన్తం స్మ హనుమాన్ సవిభీషణః' అని హనుమంతునిచే వెదకఁబడినపుడు రామలక్ష్మణసంజీవనమునకై సంజీవన్యాషధిని తెమ్మని యుపదేశించినదియు నగు 'ప్రజ్ఞ' 'త్రైకాలికమగుబుద్ధి.' 'వాయోః పుత్ర స్యాపి న గతిః' - వాయువునకు గతి లేని చోటు లేదుగదా - ఇఁక నిది 'వాయువుపిల్ల'కును లేనిది అనుట. అట్టి వాయుసుతునికిని చనరాని చోటు. విశ్వకర్మ తనయః నలః - విశ్వకర్మ దేవశిల్పి - అతనికొడుకు వానరుఁడు నలుఁడు - 'అయం సౌమ్య, నలో నామ తనుజో విశ్వకర్మణః...'ఏష సేతుం మహోత్సాహః కరోతు మయి వానరః, త మహం ధారయిష్యామి' అని దారిచేయ మొనగాఁడని సముద్రునిచే నిర్దిష్టుఁడు.

బహుమానితాస్మి పూర్వవిరహం = మునుపటి విరహమును గొప్పగా తలంచునట్లు చేయఁబడితిని. బహుమానించుచున్నాను - గొప్పగా తలంచుచున్నాను, అది మరల కూర్చినందునను, రాముఁడు ఇంత యుగ్గరముగావించి నామీఁది యనురాగ

రామః—సఖి వాసన్తి, దుఃఖాయైవేదానీం రామదర్శనమ్ సుహృదామ్, కియచ్చిరం త్వాం రోదయిష్యామి! తదనుజానీహి మాం గమనాయ.

సీతా—(సోద్వేగం తమసా మాశ్లిష్య,) భఅవది తమసే కహం! గచ్ఛది ఏవ్వ అజ్జఉత్తో! [భగవతి, తమసే, కథం! గచ్ఛత్యేవార్యపుత్రః!]

తమసా—వత్సే సమాశ్వసిహి సమాశ్వసిహి. నన్వావామప్యాయుష్మతోః కుశలవయోర్వర్ష గ్రన్థిమఙ్గళం సమ్పాదయితుం భాగీరథీపాదాన్తిక మేవ గచ్ఛావః.

సీతా—భఅవది, పసీద. ఖణమెత్తం వి దావ దుల్లహం జణం పేక్ఖామి. [భగవతి, ప్రసీద, క్షణమాత్ర మపి తావత్ దుర్లభం జనం పశ్యామి.]

రామః—అస్తి చేదానీ మశ్వమేధాయ సహధర్మచారిణీ మే.

---

మును ఆవిష్కరించినందునను 'త్వాం రోదయిష్యామి' - నిన్ను ఏడిపింతును. వాసంతియు నిరంతరముగా ఏడ్చుచున్న దనుట. అనుజానీహి = అనుజ్ఞయిమ్ము, ఉద్వేగ=దిగులు, కథం గచ్ఛత్యేవ = ఏమి! పోనేపోవునే! వర్షగ్రన్థిమఙ్గలమ్ = వర్షారంభదినమున - పుట్టినదినమున - ఆచారముగా జాతకునికై మంగళార్థము కట్టునది. కృత్యచింతామణిలో సంవత్సరము నిండునపుడు చేయవలసినది ఇట్లు చెప్పఁబడియున్నది 'గుడదుగ్ధతిలాన్ దద్యా ద్ధస్తే గ్రన్థిం చ బన్ధయేత్, గుగ్గులుం నిమ్బసిద్ధార్థ దూర్వాగోరోచనాదికమ్, సమ్పూజ్య భానువిఘ్నేశౌ మహర్షిం ప్రార్థయే ఊదమ్' అని. రాముఁడు వాసంతితో ఇంటికి పోవుదును అనఁగా తమసయు సీతతో 'మనమును మనయింటికి భాగీరథిపాదములకడకు పోవుదము' అనుచున్నది. అందులకు సీత 'ఉండవమ్మ. ఇంకొకనిముసమైనను ఈ దొరకని యాయనను చూతును' అని యనుచున్నది. రాముఁడును అట్టిమాటయే అనుచున్నాఁడు. 'తత్రాపి...చక్షు ర్వినోదయామి.' సీతారాములు తుల్యావస్థలో సర్వము తుల్యముగా పలుకుచున్నారు. 'అశ్వమేధాయ సహధర్మచారిణీ మే.' - సహధర్మచారిణీ సహకృతుఁడు గాక అగ్నికార్యము యజ్ఞము. విశేషముగా అశ్వమేధము చేయరాదు. అందుకోసము 'హిరణ్మయీ సీతాప్రతికృతిః.' అస్తి మే సహధర్మచారిణీ,

సీతా—(సోత్కమ్పమ్) అజ్జఉత్త, కా సా? [ఆర్యపుత్ర కా సా?]

రామః—హిరణ్మయీ సీతాప్రతికృతిః.

సీతా—(సోచ్ఛ్వాసాస్రమ్) అజ్జఉత్తో దాణిం సి తుమం. అహ్మహే! ఉక్ఖాదం దాణిం మే పరిచ్చాఅసల్లం అజ్జఉత్తేణ. [ఆర్యపుత్ర ఇదానీ మసి త్వం. అహో ఉత్ఖాత మిదానీం మే పరిత్యాగశల్య మార్యపుత్రేణ.]

---

అని వాక్యము తొడంగినమాత్రకే, రాముఁడు మరల ఎవతెనేని పెండ్లి చేసికొన్నాఁడేమో - అని అసూయతోను పునఃసంయోగముండదను భయముతోను 'సోత్కమ్పమ్' అతిమాత్రపు వణఁకు పొందినది. 'సీతాప్రతికృతిః' అని వాక్యము ముగియఁగానే 'సోచ్ఛ్వాసమ్' ఎంతో ఊఱట చెందినది. 'సాస్రమ్' - కంట నీళ్ళను పొరలినవి - ఆనందముచేత. ఆర్యపుత్ర ఇదానీమ్ అసి త్వమ్=ఆర్యపుత్రుఁడవే ఇపుడు నీవు - మదేకహృదయుఁడవు కదా - అనుట. అపత్నీకుఁడు కుశమయి మొదలగు ఉపాధులను పెట్టుకొనియేని యజింపవలసినది అను శాస్త్రమును నమ్మినవాఁ డగునా, భవభూతి? 'కాంచనీం మమ పత్నీంచ దీక్షాయాం...' ఉత్తరకాండ ౯౧ - 82. కాళిదాసును రఘువంశ - XIV - 87.

'సీతాం హిత్వా దశముఖరిపు ర్నోపయేమే యదన్యాం
తస్యా ఏవ ప్రతికృతిసఖో యత్క్రతూ నాజహార,
వృత్తాన్తేన శ్రవణవిషయప్రాపిణా తేన భర్తుః
సా దుర్వారం కథమపి పరిత్యాగదుఃఖం విషేహే'

ఇది భవభూతికి సర్వథా ప్రబోధకము. మీమాంసక కుమారిలవచనము 'రామభీష్మాలకన్నన్...వట్టి ధర్మముకోసముమాత్రమే భార్యలున్నవారికి...' అని రామునికి సీతకన్న వేఱుభార్యను ధర్మముకోసముమాత్రమే పరిణీతను చెప్పునది ఉపాదేయము కాదు. అట్లే వారిసమాధానమును - 'మఱి రాముఁడు బంగరుసీత బొమ్మను చేసికొనుట లోకాపవాదభయముచేతను, సీతను అట్లు అడవిపాలు చేసియు జాలితోనున్నాఁ డను ఆశంకను తీర్చుటకును' అనునదియు, స్వర్ణమయిం జేసికొనుట. ఇట శాస్త్రమునకే కాక రసముకోసము. ప్రతికృతి విరహవినోద సంపాదకము. హిరణ్మయియైన యా ప్రతికృతి శిల్పనైపుణిచే ప్రకృతిని యథాస్థితముగా తలంపించునదే అగును - దుష్యంతుని శకుంతలచిత్తరువువలె. కావుననే రాముఁ డనుచున్నాఁడు 'తత్రాపి...చక్షుర్వినోదయామి' అని. బాష్పదిగ్ధం కన్నీటితో పూయఁబడిన - బాష్పావరుద్ధమైన - నిష్కారణముగా ప్రకృతిని కానపాలుచేసి ఇట్లు ప్రతికృతిని చూడఁగంటినే - అందును ఈ యజ్ఞమందు - అని కన్నీరు.

రామః—తత్రాపి తావ ద్బాష్పదిగ్ధం చక్షు ర్వినోదయామి.

సీతా—ధణ్ణా సా, జా అజ్జఉత్తేణ బహుమణ్ణీఅది, జా అజ్జఉత్తం విణోదఅంతీ ఆసాబంధణం, జాదా జీవలోఅస్స. [ధన్యా సా, యా ఆర్యపుత్రేణ బహుమాన్యతే, యా ఆర్యపుత్రం వినోదయన్తీ ఆశాబన్ధనం జాతా జీవలోకస్య.]

తమసా—(సస్మితస్నేహాస్రం పరిష్వజ్య) అయి వత్సే, ఏవ మాత్మా స్తూయతే.

సీతా—(సలజ్జం అధోముఖీ స్వగతమ్) పరిహాసి దమ్హి భఅవదీఏ. [పరిహాసితాస్మి భగవత్యా.]

వాసన్తీ—మహా నయం వ్యతికరోఽస్మాకం ప్రసాదః; గమనం ప్రతి పునః యథా కార్యహాని ర్న భవతి తథాస్తామ్.

సీతా—పడిఊలా దాణిం మే వాసంతీ సంవుత్తా. [ప్రతికూలా ఇదానీం మే వాసన్తీ సంవృత్తా.]

తమసా—ఏహి వత్సే గచ్ఛావః.

సీతా—(సకష్టం) ఎవ్వం కరేమ్హ. [ఏవం కుర్వః.]

(రామం సతృష్ణం పశ్యతి.)

తమసా—కథం వా గమ్యతే, యస్యాస్తవ

---

'అహో! ఉత్ఖాత మిదానీం మే పరిత్యాగశల్యం ఆర్యపుత్రేణ' - 'నాకిప్పుడు ఆర్యపుత్రునిచేత పరిత్యాగశల్యము తివిచివైవఁబడినది!' - అట్లు తివిచివైచి సీతను పునఃసమాగమోత్సుకం జేయుటకే మూఁడవయంకమున ఈ సమాగమము. బహుమాన్యతే=బహుమానింపఁబడునో. ఆశానిబన్ధనం జాతా జీవలోకస్య=జీవలోకమునకు ఆస నిడనిలుపుటకు కారణమైనది. వినోదములేకున్న రాముఁడు ఏమేమి యగును. రాముఁడు ఏమైనయైన జీవలోకము ఆశ కోలుపోవును. రాముఁడు జగదాలంబనము అనుట. ఆత్మా స్తూయతే - ప్రతికృతిపొగడిక ప్రకృతికి చెందును కదా! పరిహాసితా అస్మి=పరిహాసింపఁబడితిని. ఇందు అతి కోమలపరిహాసము కలదు. అయం వ్యతికరః=ఈ (నీ) సమాగమము, ఈ (నీవిటకువచ్చు) సంవిధానము. మహాన్ అస్మాకం ప్రసాదః=మాకైన నీమహాప్రసాదము. ప్రతికూలా - రాముఁడు పోవ ననుమతించుటచేత. గమనం ప్రతి - పోవుటుంగూర్చి యున్ననో - యథా కార్యహానిః న భవతి - ఇది చాలగౌరవముగా వీడ్కొను తెఱంగు. కథం గమ్యతే=ఎట్లు పోయెదవు, యస్యాః తవ=(ఏనీయొక్క=) ఏలవ నీవు,

శ్లో॥ ప్రత్యుప్తస్యేవ దయితే తృష్ణాదీర్ఘస్య చక్షుషః,
మర్మచ్ఛేదపరైర్యత్నైరాకర్షో న సమాప్యతే? ౪౦

సీతా—ణమో అపువ్వపుణ్ణజణిదదంసణాణాం అజ్జఉత్తచలణకమళాణం. [నమోఽపూర్వపుణ్యజనిత దర్శనాభ్యాం ఆర్యపుత్రచరణకమలాభ్యాం.] (ఇతి మూర్ఛతి)

తమసా—వత్సే, సమాశ్వసిహి సమాశ్వసిహి.

సీతా—(సమాశ్వస్య) కెత్తిఅం చిరం వా మేహందరేణ పుణ్ణిమా చందదంసణం. [కియచ్చిరం వా మేఘాన్తరేణ పూర్ణిమా చన్ద్రదర్శనమ్?]

---

శ్లో. ౪౦. ప్రత్యుప్తస్య - ఇతి. - తృష్ణాదీర్ఘస్య = చూచుచునే యుండవలయును అన్న అతిమాత్రపుఁగోరిక - పేరాస - చేత పొడవువాఱి (=తీఁగ సాఁగినట్లై.) దయితే=వల్లభునియందు, ప్రత్యుప్తస్య ఇవ=నాటఁబడినట్లు ఐ యున్న, చక్షుషః=కంటికి, మర్మచ్ఛేదపరైః=(కంటి) ఆయువుపట్టును తెగఁగోయునంతటివైన - అంత బాధకలిగించునవైన, యత్నైః=ప్రయత్నములచేత. ఆకర్షః = తివిచికొనుట - కంటిని అందుండి లాఁగివైచికొనుట, న సమాప్యతే=ఇంకను ముగింపఁబడకయున్నదే?

అగపడక అగపడక అగపడిన వల్లభుని పేరాసతో (తిరస్కరిణిచే ఆయన చూపు ఎదుర్కొను నన్న కొంకు ఇంచుకయు లేక) (తదేకతానముగా ఱెప్పవ్రాల్పక) చూడఁజొరఁగా, కన్ను తీఁగసాఁగినట్లు పొడుగు ఐ, ఆయనమీఁద నాటుకొనిపోయినట్లయినది. ఇంకుండి పోవలయు నన్న, దానిని లాఁగికొనవలసియున్నది. అందులకైన ప్రయత్నములు కంటిమర్మమును కోయునట్లున్నవి. ఎంతసేపటికి ముగియకున్నవి. సీతకన్ను రామునిమీఁదనుండి ఇవతలికి ఎంతమాత్రము రాకయున్నది. ఆయనమీఁదినుండి చూపును మరల్చుకొనవలయునన్న సీతకు అంత వ్యథగా నున్నది.

తమసాసాన్నిధ్యమును గూడ మఱచి రామునే చూచుచున్నది.

అపూర్వ పుణ్య జనిత దర్శనాభ్యాం = ఉత్కటపుణ్యముచే (కలిగిన అగపాటుగల=) దర్శనమొసంగిన, చరణకమలాభ్యాం = అడుగుదామరలకు - ఇట్టి పుణ్యముకూడ చేసియుంటినని. నేను అనుకొననేలేదు (=అపూర్వ.) మూర్ఛతి-వీడిపోవు దుఃఖాతిరేకము మూర్ఛ కలిగించినది. కియచ్చిరం వా మేఘాన్తరే పూర్ణిమా

తమసా — అహో సంవిధానకం!

శ్లో॥ ఏకో రసః, కరుణ ఏవ, నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథ గి వాశ్రయతే వివర్తాన్;
ఆవర్తబుద్బుదతరఙ్గమయా న్వికారా
నమ్భో యథా, సలిల మేవ హి త త్సమస్తమ్. ౪౭

---

చన్ద్రదర్శనమ్ - ఎంతసేపు మేఘములవడుచు పూర్ణిమాచంద్రదర్శనము - వివాస మనునది ఒకటే పర్విన మేఘము - దాన తిరోహితుఁడైన (రామచంద్రుని) దర్శనము క్షణమే యగును. ఇంతలో మేఘము మరల వచ్చి కమ్ముకొనును. రాముఁడును తరలి పోవును. అన్తరేణ - అన్తరే - అనుట సాధువు. (ఇట్లును అగునా - గంగమహిమవలని తిరస్కరణి మఱుఁగున తన కిపుడు ఎట్లో ఇటువచ్చిన ఈయన దర్శనము, అది యెంతసేపు ఉండును? అని. పూర్వమ (శేయము.) సమాశ్వసిహి - త్వరలో నీ రాముని బడసెదవుగాక - 'అస్మద్విధాభిః' అని ౪౭ లో అనునుగదా. అహో సంవిధానకమ్ - తమస ఇంతవట్టు తాఁగన్న ఆ సన్నిధివిరహ సంవిధానమునకు - సందర్భమునకు - ఆశ్చర్యపడుచున్నది. తమసచాటున, అవ్యాజమున భవభూతియే తాను గూర్చిన యీ సంవిధానమునకు రసవత్తమమునకు, మఱెందును తన సాటిలేని దానికి, అలరుచున్నాఁడు. అట్లే మాలతీమాధవము కడపటను 'అత్తి వా కతిశ్చి దేవం భూతం మహాద్భుతం విచిత్రరమణీయోజ్జ్వలం ప్రకరణమ్!' అని కామందకీ వాక్యముగా, కవి తన రూపకముఁగూర్చియు తన యభిప్రాయము వెలయునట్లుగా, పలికినాఁడు. తమస తమ్మును వాసంతీరాములంగూడ ప్రత్యక్షీకరించుకొనుచున్నట్టిది సంవిధానకమునకు అబ్బుర పడవలంతి. ఉత్తరరామచరిత ప్రయోగమందు ఈ తృతీయాంకము అద్భుతసంవిధానముచే కరము రక్తియెక్కును అని మహాకవి తలంచెను. 'పరిభావయ న్త్వభినయే ద్వ్యక్తరూపాం బుధాః' అని తన నాటకము ప్రయోగమునకయి ఎంతయు ఉవ్విళులూరెను. ఒకవేళ ఈకాలమువారు దీనిని మెచ్చరా? ప్రయోగమునను తమ యనుభవమున మిక్కిలి రక్తి కట్టినదని వే. వేం. శాస్త్రుల సాక్ష్యము కలదు. చూ. ఉపో. పు. 13

శ్లో. ౪౭. ఏకో రస ఇతి. రసః=మనోభావము, ఏకః=ఒక్కటియే, కరుణ ఏవ=కరుణమే, వియోగమువలని యత్యంతమనఃఖేదభావమే. నిమిత్తభేదాత్ = నిమిత్తములు వేఱువేఱు అగుటవలన, భిన్నః=వేఱువడై, పృథక్ పృథక్ ఇవ = ఇదివేఱు, అంతకన్న ఇది వేఱు అన్నట్లు, వివర్తాన్ =మాఱురూపములను, అశ్రయతే=పొందును. యథా = ఎట్లనఁగా, అమ్భః = నీరు, ఆవర్త బుద్బుద తరఙ్గ

మయాన్=సుడి, బుడగ, అల - అను రూపములగల, వికారాన్=వికృతులను - మాఱు మాఱురూపములను, (ఆశ్రయతే=పొందును.) తత్ సమస్తమ్=అది యెల్ల, సలిలం ఏవ హి=నీరే కదా.

మనోభావము ఒకటే, కరుణమనునదే - అత్యంత విరహవ్యథయే - కారణములు వేఱగుటచే పలువెఱంగులై పలువికృతులం జెందును. నీటివలెనే నీరు సుడి బుడగ అల యను వికృతులం బొందును. ఐనను అదెల్ల నీరే కదా.
అల్లే మురారి VII - 13.

'స్యాదేవ తోయ మమృతప్రకృతి; ర్యది స్యా-
త్తన్న కాన్త మద్భుత; మిదం పున రద్భుతం నః
లక్ష్మీ తుషారకర కౌస్తుభ పారిజాత
ధన్వన్తరి ప్రభృతయో య దపాం వివర్తాః!'

శంకరాచార్యపాదుల వేదాంతసూత్రభాష్యమున ఇట్లు మాటిమాటికి కలదు.

'తథా హి సముద్రా దుదకాత్మనోఽనన్యత్వేఽపి
త ద్వికారాణాం ఫేనవీచి తరఙ్గ బుద్బుదాదీనాం
ఇత రేతరవిభాగ ఇత రేతర సంశ్లేషాది లక్షణశ్చ
వ్యవహార ఉపలభ్యతే.'

మహావీరచరితమున వీరమునుగూర్చియు ఇట్లు కలదు - ప్రస్తావన - 3.

అప్రాకృతేషు పాత్రేషు యత్ర వీరః స్థితో రసః
భేదైః సూక్ష్మై రభివ్యక్తైః ప్రత్యాధారం విభజ్యతే.

ఇక్కడను అంకాన సీతా తమసా వాసంతులందును రామునియందును కరుణ విభక్తమై యున్నది, సూక్ష్మభేదములతో—

వేదాంతమున వివర్తపరిణామముల స్వరూపము ప్రకృతిస్వరూప - అనుపమర్దేన - రూపాన్తరోత్పత్తిః వివర్తః; ప్రకృతిస్వరూప - ఉపమర్దేన - రూపాన్తరోత్పత్తిః పరిణామః - నీరు బుడగ వివర్తము - పాలు పెరుగు పరిణామము.

అంకారంభమున రామునికి అంతర్లీన దుఃఖాగ్ని భగ్గున మండఁబొచ్చి మూర్ఛ తెచ్చినది. సీత తాఁకుడుచే తెప్పిరిల్లి ఉచ్ఛ్వాసముం గన్నాఁడు. సీత యగపడమికి నిర్వేదము. అందుననే ఆనందభరము. సీత పెంచిన యేనుఁగుగున్నకు అపాయము కలిగెనని ఖేదము, దానిం గావ సంకల్పము ఉత్సాహమును. ఇంతలో తన సఖి, సీతాప్రియసఖి వాసంతి అగపడినది. మనస్సున ఏమి తోఁచి

యుండదు! జటాయుశిఖర సీతాస్థాది సన్నివేశముం గనఁగా గుండె ప్రేలిన ట్లైనది. సీత గారాబుకొమరుఁడైన యేనుఁగుగున్న విజయకల్యాణములం గాంచిన సంతోషము. అట్లే దాని కాంతానువర్తనచాతుర్యమునకును. అట్లే సీత పెంచిన నెమలిని కడిమిని గాంచియు సంతోషముగనుట - దుఃఖమునుం గనుట. అనంటివని ఱాతియరుగునుగని దానిం జేరఁబోక యేడ్చుట. అచటి సీతంగూడిన పూర్వ వృత్తములం దలంచి పట్టరానిదుఃఖము పొలగుట. వాసంతి చేరువంగూరుచుండఁ గా ఆమెకభికి తా నిడిన ఖేదమునకు విలక్షుఁడగుట. వాసంతి యడుగఁగా సీతను ఏపులియో తోడేలో తిని వేసియుండునని యనుట. వావిచ్చినయేడ్పు. అయ్యో! నాకు చావు రాకూడదా అని యనుకొనుట. తన యేడ్పునకు పౌరజానపదులకు అప్రియము కలుగునేమో అని శంకించి వారిమన్నన ప్రార్థించుట. సీత పోయి పన్నెండేండ్లయినదే, తనకు లోకమే పాడుపడినట్లయినదే - చావు రాకూడదా అని కోరుకొనుట. రామునికి పట్టరాని దుఃఖసంక్షోభము. ఉన్మాదము ఎత్తుట. జానకీ, కోపనా, కనఁబడుచునే యున్నావే, జాలిగొనవేమి అని వాపోయి మూర్ఛిల్లుట. మరల సీత తాఁకుడుచేతనే సంజీవనము ఆనందము పొందుట. సీత చేతిని పట్టు కొనుట. ఆనందనిమీలితేంద్రియుఁడును వివశుఁడు నగుట. సీత చేతిని లాగివేసి కొనఁగా మితిమీఱిన విప్రలంభముపాలయి ధైర్యమును మొదలంట కోలుపోవుట - పలవరించుట. ఇఁకను ఇంటికిపోయి అశ్వమేధమునకున్న సీత బంగరు ప్రతికృతి నైనఁ గాంచి కన్నీటికంటిని వినోదించుకొందును అనుట. తరలుట. ఇట్లు ఆయా కారణములచేత అవిగహ్యవ్యథ ఎన్ని వివర్తములం గన్నదో అరయఁదగును. అట్లే 'సీతయెడను వివర్తములను విచారింపఁదగును. మునుపు సీతమనోదశ యెట్లెట్లో యౌనో 'తటస్థం' ఇత్యాదిగా ౬ లో తమసయే విచారించినది గదా. ఇట్లు ఇరువురి యెడను ఇపుడు కరుణవివర్తములం గాంచఁగన్న తమస పరిశీలనము ఇట్లు వాగా రంభముం గన్నది. 'ఏకోరసః కరుణ ఏవ' - "కవి దానిని రసముని వ్యవహరించి నాఁడే, అది యెట్లు సంగత మగును? అందుకేని, ఇట్టి స్థలములలో రసశబ్దము భావపరము గాని శృంగారాది రసపరిగణ నాంతర్గత కరుణరసపరము గాదు. మాళవికయందలి యీక్రిందిప్రయోగముం గనుఁడు:-

'అఙ్గై రన్తర్నిహితవచనైః సూచితః సమ్యగర్థః,
పాదన్యాసో లయ మనుగత, స్తన్మయత్వం రసేషు.'

ఇందులకు - 'రసేషు సాత్త్వికవ్యభిచారిభావేషు' అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. 'అత్ర రసశబ్దేన ఉపచారాత్ పరిపోషాతిశయవన్తో భావాః కథ్యన్తే, ప్రకృత

రామః — విమానరాజ, ఇత ఇతః. (సర్వే ఉత్తిష్ఠన్తి)

తమసా వాసంత్యౌ-(సీతారామౌ ప్రతి.)

శ్లో॥ అవని రమరసిన్ధు స్సార్ధ మస్మద్విధాభి
స్స చ కులపతి రాద్య శ్ఛన్దసాం యః ప్రయోక్తా,
స చ ముని రనుయాతారున్ధతీకో వసిష్ఠః
తవ వితరతు భద్రం భూయసే మఙ్గళాయ. ౨౨

(ఇతి నిష్క్రాన్తాః సర్వే)

---

త్వాత్, రసేషు అతిప్రసఙ్గాత్’ అని కాటయవేమవ్యాఖ్య...... ‘ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్’ అనువాక్యమున దుర్భరవియోగవ్యథయే విప్రలంభశృంగారాది వివర్తములం జెందునని భావము” - అని వేదము వేంకటరాయశాస్త్రుల వారి యుత్తరచరితోపోద్ఘాతము. మఱియు ఇట రాముని యేడ్పు ఒక తెఱఁగుది, వాసంతిది ఒక తెఱఁగుది, సీత యేడ్పు ఒక తెఱఁగుది తమసదియు ఒక్క తెఱఁగుది - అన్ని తెఱంగుల యేడ్పును ఒక్కెడ రాశిగా పోసినాఁడు కవి. ఇదియు పరికింపఁదగును. ‘వివర్తాన్’ - అని ప్రయోగించుటచే ప్రపంచము బ్రహ్మముయొక్క వివర్తమా పరిణామమా అను వేదాంతవిచారమున భవభూతి వివర్తమను మతమువాఁడగునని ఊహించుటకలదు. పాలు పెరుఁగగుటంబోని మార్పు - పరిణామము, నీరు అలబుడగ యగుటంబోని మార్పు - వివర్తము.

శ్లో. ౨౨. అవనిరితి. - అస్మద్విధాభిః సార్ధం = మావంటి నదీదేవతలతోను వనదేవతలతోనుం గూడ, అవనిః = భూదేవియు, అమరసిన్ధుః - దేవనది భాగీరథియు, యః = ఎవఁడు, ఛందసాం = పద్యములకు, ఆద్యః = మొదటివాఁడైన, ప్రయోక్తా = రచయితయో, సః కులపతిః = గొప్ప శిష్యబృందమునకు అన్నవస్త్రము లిచ్చి చదువు చెప్పుచుండు వాఁడును, అనఁగా వాల్మీకియు, అనుయాతారున్ధతీకః = వెంబడించిన యరుంధతి కలవాఁడగు, సచ వసిష్ఠః మునిః = ఆ వసిష్ఠమునియు, త్వయి = నీయెడ, భూయసే మఙ్గళాయ = గొప్పమంగళము (కలుగుట) కై, భద్రం = మేలును, వితరతు = ఒసంగును గాక.

నేను నావంటివారును ఉండనే యున్నారుగదా, మాతోఁగూడ భూదేవి, భాగీరథి, ఆద్యకవి కులపతి వాల్మీకి, అరుంధతి, వసిష్ఠుఁడు - వీరందఱును నీకు మిక్కిలి మంగళము కలుగునట్లుగా మేలును అనుగ్రహింతురు గాక.

తమసకును వాసంతికిని సరిపడునది ఒక్కటే శ్లోకము, ఇరువురుం బలుకునది, నాటకమున అభినయమున ఇది చమత్కారకారణమగును. అట్లే ఏడవయంకమున లవచంద్రకేతువులకును ఒండొరులంగూర్చిన సమానశ్లోకములు చెప్పి

ఇతి

ఛాయానామా తృతీయాఙ్కః.

---

యున్నాఁడు. దీన రంగాన ఒక యసాధారణశక్తి చమత్కారము కలదు. భవభూతి అట్టు కనిపట్టినాఁడు. దానికి అసంవిధానములును అనుకూలించినవి.

అస్మద్విధాభిః _ తమస నదీదేవత; వాసంతి వనదేవత. తమబోంట్లునుంగూడ. 'సహయుక్తేఽప్రధానే' అను పాణిని సూత్రముచేత 'సహ' 'సార' ములం గూడినది అప్రధానమగును. అవని మొదలైనవారు ప్రధానులు, వారితో తాము అన్నమాట. తమస వాల్మీకియాశ్రమము చెంత నుండునది, భాగీరథికి అనుచర. అవని సీతం గన్న తల్లి యని తా నెఱుఁగును. అరుంధతీ వసిష్ఠులు సీతావివాస దుఃఖితులై అయోధ్యకు పోక వాల్మీకి తపోవనమునకు వచ్చినారు కావున ఆసంగతి తమస యెఱుంగును. కావున వారందఱు సీతారాములకు మంగళములం గూర్ప పనివడుదురని నమ్మి తమస ఈ మంగళాశాసనము చేయుచున్నది. ఇదెల్ల ఆత్రేయి వలన వాసంతియు ఎఱింగియున్నందున తానును అట్లే నమ్మి ఈ మంగళాశాసనముం బలికినది. తొలుతనే సూత్రధారశిష్యుఁడు నటుఁడు ఇట్టి మాటను పలికినాఁడు _ 'సర్వథా దేవాః ఋషయశ్చ స్వస్తి కరిష్యన్తి' _ అని. ఇట్లు సీతారామ పునఃసంయోగమును తొలుతనుండియు అల్లుకొనుచునే వచ్చుచున్నాఁడు కవి. 'కులపతిః' _ 'మునీనాం దశసాహస్రమ్ యోన్నదానాది పోషణాత్, అధ్యాపయతి విప్రర్షి రసౌ కులపతిః స్మృతః.' కులపతిత్వము ఈ నాటకమునందు ఆత్రేయీ వాసంతీ భాషితములవలనను ఆశ్రమశిష్యుల యనధ్యాయ ప్రస్తావముచేతను స్పష్టముగా సూచితమైనది.

ఇందు సీతను తిరస్కృతంజేసి కవి సీతకు రాముఁ డగపడునట్లు సంవిధానము కూర్చినాఁడు. కుందమాలయందును అట్లే. అట్లుగాక రాముని తిరస్కృతుం జేసి రామునికి సీతయగపడునట్లు సంవిధానము కూర్చియున్న అదెట్టు లుండియుండునో! మంచిభావముల కవనము లేచియుండఁదగినను సీత యగ్నిజ్వాలకు అగ్ని జ్వాలయైన తన్ పరిశుద్ధి ఎఱింగిన రామునికి సీత యాశ్రమవృత్తదర్శనమున ఆమె దైన్యముంగాక శీలముంగూర్చి క్రొత్తగా ఎఱుంగవలసినది ఏమియు నుండదు. పునఃసంయోగము గుఱియందున్నకథకు అది అంతగా పోషకము గాదు. సీతకన్ననో నిష్కారణముగా తన్ను తఱిమిన రాముని చిత్తవృత్తి యెట్టిదో ఎఱుంగవలసినదగును. మఱి అసంవిధానమును VII _ అంతర్నాటికలో కొంత కలదు.

సీతాతమసలు తిరస్కరిణిలో నున్నందున కొందఱు ఈ యంకమునకు 'ఛాయ' అని పేరిడినారు.

# మిశ్రవిష్కమ్భకః



(తతః ప్రవిశత స్తాపసౌ.)

ఏకః—సౌధాతకే, దృశ్యతాం, అద్య భూయిష్ఠసన్నిధాపితాతిథిజనస్య సమధికారమ్భరమణీయతా భగవతో వాల్మీకే రాశ్రమపదస్య. తథా హి-

శ్లో॥ నీవారౌదనమణ్డ ముష్ణమధురం సద్యః ప్రసూతప్రియా
పీతా దభ్యధికం తపోవనమృగః పర్యాప్త మాచామతి,
గన్ధేన స్ఫురతా మనా గనుసృతో భక్తస్య సర్పిష్మతః
కర్కన్ధూఫలమిశ్ర శాకపచనామోదః పరిస్తీర్యతే. ౧

---

ప్రవిశతః తాపసౌ = ఇరువురు తాపసులు ప్రవేశింతురు. భూయిష్ఠ సన్నిధాపి తాతిథిజనస్య = మెండుగా రప్పింపఁబడిన అతిథిజనులు గలది - ఆశ్రమపదమునకు విశేషణము. సమధికారమ్భ రమణీయతా = మిక్కిలి దండియైన యారంభములవలని - విడిదికివలయు పనులవలనియు వంట మొదలగు పనులవలనియు - రామణీయకము. భగవతః - వాల్మీకి అందఱికి మహనీయుఁడు గావున వసిష్ఠునంతటివాఁడును, జనకునంతటివాఁడును. ఆయన దర్శనముం గోరి వచ్చుట... 'సన్నిధాపిత' - జనకునంతటివాఁడు వచ్చినాఁడని పండువు - భోజనమునకు చాల మంది ఆహూతులైనా రనుట.

శ్లో. ౧. నీవారేతి - తపోవనమృగః = తపోవనమందలి (పెంపుడు) జింక, సద్యః ప్రసూతప్రియాపీతాత్ = ఇప్పుడే యీనిన బాలెంతయైన తనప్రియచే త్రాఁగఁబడినదానినుండి, అభ్యధికం = మిగిలిన, ఉష్ణమధురం = (అప్పుడే వార్చినందున) వేడిగాను, తియ్యగాను ఉన్నట్టి, నీవారౌదనమణ్డం = నివ్వరియన్నపు గంజిని, పర్యాప్తం=తృప్తిగా, ఆచామతి = త్రాఁగుచున్నది. సర్పిష్మతః=నేయి దండిగాఁగల, భక్తస్య=అన్నము యొక్క, స్ఫురతా=వెలికి నిగుడుచున్న, గన్ధేన=వాసనతో, మనాక్=ఇంచుక, అనుసృతః=కూడుకొన్నదై, కర్కన్ధూఫల మిశ్ర శాకపచ నామోదః=రేఁగుబండ్లతో కలిపిన కూర యుడుకుచున్న వాసన, పరిస్తీర్యతే=అంతటను వ్యాపించుచున్నది.

తియ్యని నివ్వరియన్నపు గంజిని వేడివేడిగా ఇపుడే వార్చినదానిని ఇప్పుడే యీనిన లేడిబాలెంతకాంత త్రాగఁగా కనుపెట్టుకొనియుండి ఆశ్రమమృగము తరువాత తృప్తిగా కడుపునిండ త్రాగుచున్నది. అన్నములో నేయి దండిగా పోసి కలుపఁగా దానివాసన నిగుడుచున్నది. అది సన్నసన్నముగా తోడుకూడుకొనఁగా రేఁగుఁబండ్లతో కలిపి యుడికించుచున్న కూర వాసన అంతటను చాలదూరము వ్యాపించుచున్నది.

సత్త్వగుణోత్కర్ష ఆశ్రమజంతువులందును గనఁబడుచున్నది. ఇందువలన వాల్మీకిమహిమ వ్యంగ్యము.

నివ్వరియన్నపుగంజి అనుటచే, గంజివార్చి చేసిన నాణెమైన యన్నము అని. ఇగురఁబెట్టిన యన్నమునకన్నను గంజివార్చినది నాణెముగా నుండును. అంతియగాక పెద్దవంటలో పెద్ద మొత్తమును ఇగురఁబెట్టుట సులువుగాదు. అందు దండిగా నేయి పోసి కలిపినారు. ఆ హయ్యంగవీనపు వాసన సన్నసన్నగా బయటికి వచ్చుచున్నది. ఇట్లు నేయి దండిగా పోసికలిపినారనఁగా, ఏదేని పొంగలి వంటిదో, కిచ్చడివంటిదో చేసినారని ఊహింపఁదగును. రేఁగుఁబండ్లవాసనయు కమ్మనిదే. అపులుసు చేర్చి యేదియో కూర వండఁబడుచున్నది. నేయి కాఱు కిచ్చడియు దానికి నంజుకొనుటకు రేఁగుఁ బులుపుతోడి శాకము కాఁబోలు. ఇది మంచి వన్యభోజనము వర్ణన. ఈ మురారి వాక్యము II - 21. కనఁదగును.

'ఆర్ద్రప్రసూతి రియ మజ్జనయజ్ఞవేది
నేదిష్ఠ మేవ హరిణీ తృణుతే తృణం చ,
వత్సీయ తాపసకుమార కరోపనీత
నీవారనిర్వృత ముపత్య మవేక్షతే చ.'

శాకుంతలమందలి 'శ్యామాకముష్టిపరివర్ధిత కురంగకుని' సయితము శ్లోకము తలంచుకొనఁదగును.

ఈ భాషితము భాండాయనునిది, వీఁడు ఇంచుక పెద్దవాఁడును పైతరగతివాఁడును. సంస్కృతము మాటాడనేర్చినవాఁడు, కావున విషయమెఱింగినవాఁడును, అడిగిన సందేహమునకు సమాధానము చెప్పఁగలవాఁడును. గురువునందును పెద్దలయందును గౌరవము కలవాఁడును, మధ్యమపాత్రము. సౌధాతకి చిన్నతరగతివాఁడు, చపలుఁడు, పెద్దవారిని గడ్డమనియు గూననియు తిండిపోతనియు ఎగతాళిచేయువాఁడు. ప్రాకృతము మాటాడును. నీచపాత్రము. వీరిరు

సౌధాతకిః—అలదం అణజ్ఝాఅకాలణం సవిసేస భూదం అజ్జ జిణ్ణకుచ్చాణం. [ఆగత మనధ్యాయకారణం సవిశేష భూతం అద్య జీర్ణకూర్చానాం.]

భాణ్డాయనః—(విహస్య,) అపూర్వః కోఽపి బహుమాన హేతు ర్గురుషు, సౌధాతకే!

సౌధాతకిః—భో భాణ్డాఅణ కింణామహ్యేఓ ఏసో మహంతిస్స థవిరసత్థస్స ధురంధరో అజ్జ చీరధారఓ అతిథీ ఆఅదో? [భో భాణ్డాయన కింనామధేయ ఏష మహతః స్థవిరసార్థస్య ధురంధరోఽద్య చీరధారకో అతిథి రాగతః]

భాణ్డాయనః—ధిక్ప్రహాసనం! న న్వయ మృశ్యశృఙ్గాశ్రమా దరున్ధతీం పురస్కృత్య మహారాజదశరథస్య దారా నధిష్ఠాయ భగవా న్వసిష్ఠః ప్రాప్తః? త త్కి మేవం ప్రలపసి?

---

పురుకలసిన యీ విష్కంభము మిశ్రవిష్కంభకము. జీర్ణకూర్చానాం = కూర్చ మనఁగా పెరిఁగిన మీసమును గడ్డమును - నరసిపోయిన (పెరిఁగిన) మీసము గడ్డము గలవారికి - ఆశ్రమమున అందఱు మీసము గడ్డము పెరుఁగువారుగానే ఉందురు. కొందఱు అవి నరిసిపోయినవారు. అనధ్యాయ = పాఠాలు చెప్పక ఆటవిడుపు. సెలవుదినము. దానికి సవిశేషమైన కారణము. విశేషము విందు మొదలైనది. నరపమీసగడ్డాలవారు అచట అధ్యాపకులు, తనకును ఒజ్జలు. వారింగూర్చి సౌధాతకి ఇట్లనుట అమర్యాదకు సూచకము. విద్యార్థులలో వాఁడు అట్టివాఁడు. విహస్య=పకపకనవ్వి, గురుషు=పెద్దలయందు - వారి నరపమీసాలను గడ్డాలను హేళనము చేయుచున్నావు! అనుట. మహతః స్థవిరసార్థస్య=ముసలివారి పెద్ద గుంపునకు - దశరథభార్యలు అరుంధతి మొదలగువారి గుంపు. ధురంధరః=నాయకుఁడు. చీరధారకః=నారమడి ధరించినవాఁడు. ధిక్ ప్రహాసనమ్ - ఛీ, చేయుకు పరిహాసము! ఇందాక తాను నవ్వినందున భాండాయనుని యొగతాళిచేయు నుత్సాహము మేరమీఱినది. అప్పుడే తాను నవ్వియుండఁగూడదు. నను=ఏరా ఎఱుఁగవటరా! అరున్ధతీం పురస్కృత్య = వారిముందు అరుంధతమ్మ నడచుచున్నది అనుట. దశరథస్య దారాః - వసిష్ఠః - అన్నియు పెద్దపేర్లు - ప్రసిద్ధములు-మిక్కిలి గౌరవముం గోరునవి. అయం ప్రాప్తః=వీఁడుగో ఇప్పుడే వచ్చియున్నాఁడు—వీరుగో వచ్చియున్నారు - సంస్కృతమున ఏకవచనమునను పూజకు కొంత

సౌధాతకిః—హుం! వసిట్ఠో? [హుం! వసిష్ఠః?]

భాణ్డాయనః—అథ కిమ్.

సౌధాతకిః—మఏ పుణ జాణిదం వగ్ఘో వా విఓ వా సో త్తి. [మయా పున ర్జ్ఞాతం వ్యాఘ్రో వా వృకో వా స ఇతి.]

భాణ్డాయనః—ఆః! కి ముక్తం భవతి?

సౌధాతకిః—తేణ హి పరావడిఏణ జెవ్వ సా వరాఈ కల్యాణీ కవిలా మడమడాయిదా. [తేన పరాపతితే నైవ సా వరాకీ కల్యాణీ కపిలా మడమడాయితా.]

లేదు. 'భగవాన్' అని సమర్థకము విశేషణమును ఉన్నది. హుం-ఇష్టములేక ఒప్పికొనుటం దెలుపును. హేళనమును, ఏడనిది, ఇంకను లోపల ఉన్నది మయా పునః జ్ఞాతమ్-నాచేతనో తలంపఁబడినది-నేను అనుకొన్నాను. వృకః = తోడేలు. ఆః కి ముక్తం భవతి=ఆ! ఆ! ఏమంటివి? ఆః-కోపము తెలుపును.

పరాపతితేన ఏవ=వచ్చినవాఁడు కాగానే-రాఁగానే-వచ్చియు రాక ముందే. వరాకికా=దీనురాలు, 'అయ్యో పాపము' అన్నట్లు. కపిలా=పసుపుమించిన తెలుపురంగుగల ఆవు-పల్లావు, మడమడాయితా=మడమడ నమిలివేయఁబడినది. కల్యాణీ=మంగళమూర్తి యైనది. చూ. మురారి-II-14.

'తత్త్రాదృక్తృణ పూల కోపనయన క్లేశా చ్చిరద్వేషిభిర్
మేధ్యా వత్సతరీ విహాస్య వటుభిః సోల్లుణ్ఠ మాలభ్యతే
అ ప్యేష ప్రతనూ భవ త్యతిథిభిః సోచ్ఛ్వాసనాసాపుటై
రాపీతో మధుపర్కపాకసురభిః ప్రాగ్వంశజన్మానిలః.

దీని తారతమ్య మరయఁదగును.

కొన్ని పాఠములలో 'కపిలా' లేక 'కల్యాణీ' మాత్రమే కలదు. 'కల్యాణి' అన్న నే గోవు అర్థము వ్రాయఁబడినది. ప్రమాణము రాజనిఘంటువును, ప్రయోగము-'ఉపస్థి తేయం కల్యాణీ నామ్ని కీర్తిత ఏవ యత్' అను రఘు. I-87 ను వ్రాయఁబడినవి. అక్కడ ప్రకరణమున 'ఇయం' అను సర్వనామనిర్దేశముచేత నే 'గోవు' అర్థము కాఁగా 'కల్యాణీ' అనుదానికి మల్లినాథులవారు 'మఙ్గలమూర్తిః' అని అర్థము వ్రాసినారు-'కల్యాణీ మఙ్గలమూర్తిః...ఇయం ధేనుః' అని. కావున

భాణ్డాయనః—సమాంసో మధుపర్క ఇత్యామ్నాయం బహుమన్యమానాః శ్రోత్రియాయాభ్యాగతాయ వత్సతరీం మహోక్షం మహాజం వా నిర్వపన్తి గృహమేధిన ఇతి ధర్మసూత్రకారాః సమామనన్తి.

సౌధాతకిః—భో ణిగ్గహిదోసి. [భో నిగృహీతోఽసి.]

భాణ్డాయనః—కథ మివ?

సౌధాతకిః—జేన ఆఅదేసు వసిట్ఠమిస్సేసు వచ్ఛలరీ విససిదా, అజ్జ ఎవ్వ పచ్చాఅదస్స రాఏసిణో జణఅస్స భఅవదా వమ్మీఇణా దహిమహూహిం ఎవ్వ ణివ్వట్టిదో మహుపక్కో; వచ్ఛదరీ పుణ విసజ్జిదా. [యేనాగతేషు వసిష్ఠమిశ్రేషు వత్సతరీ విశసితా, అద్యైవ ప్రత్యాగతస్య రాజర్షేర్జనకస్య భగవతా వాల్మీకినా దధిమధుభ్యామేవ నిర్వర్తితో మధుపర్కః; వత్సతరీ పునర్విసర్జితా.]

---

ఇట పాఠమున 'కపిలా'ను కలుపుకొనుట శ్రేయము. 'సమాంసో మధుపర్కః = 'మధుపర్కము మాంసముతోడిది' అని వేదమును (= ఇతి ఆమ్నాయం,) బహుమన్యమానాః = ప్రమాణీకరించినవారగుచు. శ్రోత్రియాభ్యాగతాయ = వేదములం జదివిన యతిథికి, (శ్రోత్రియుఁ డనఁగా బ్రాహ్మణజాతిలో పుట్టి సంస్కారములంపొంది వేదాది విద్యలు నేర్చినవాఁడు - 'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః సంస్కారై ర్ద్విజ ఉచ్యతే, విద్యయా యాతి విప్రత్వం త్రిభిః శ్రోత్రియ ఉచ్యతే) - వత్సతరీం = కోడెపెయ్యనుగాని, మహోక్షం వా=ఆఁబోతునుగాని, మహాజం వా = పెద్దమేఁకనుగాని, నిర్వపన్తి = పెట్టుదురు. ధర్మసూత్రకారాః=ధర్మసూత్రములం రచించినవారు - ఆపస్తంబుఁడు, బోధాయనుఁడు - మొదలగువారు. సమామనన్తి=పఠింతురు. 'ఏతావద్గో రాలమ్భనస్థాన - మతిథిః, పితరో, వివాహశ్చ' - అని ఆపస్తంబులవారు. 'ఏకరాత్ర మేవ పరగృహే నివసన్, అజ్ఞాతో బ్రాహ్మణః అతిథిః; జ్ఞాతస్తు అభ్యాగతః' అని అతిథ్యభ్యాగతులకు భేదము, అంతగా లెక్కింపతగనిది. భోః=ఓయి, నిగృహీతోఽసి = ఓడినావు. వాదమున ఓటమికి 'నిగ్రహ'మని పేరు. యేన=ఏలయన. వత్సతరీ = కోడెపెయ్య, విశసితా=చంపఁబడినది. అద్యైవ = నేఁడే. మధుపర్కః - 'దధి సర్పిర్జలం క్షౌద్రం సితా చైతైశ్చ పఞ్చభిః, ప్రోచ్యతే మధుపర్కః' - పెరుగు

భాణ్డాయనః—నివృత్తమాంసానా మేవం కల్పం ఋషయః మన్యన్తే. నివృత్తమాంసస్తు తత్రభవాన్ జనకః.

సౌధాతకిః—కిం ణిమిత్తం? [కిం నిమిత్తమ్?]

భాణ్డాయనః—స యద్దైవ దేవ్యాస్సీతాయా స్తాదృశం దైవ దుర్విపాక ముపశ్రుత్య వైఖానస స్సంవృత్తః, త దాస్య కతిపయే సంవత్సరా శ్చన్ద్రద్వీపతపోవనే తప స్తప్యమానస్య.

సౌధాతకిః—తదో కింతి ఆఅదో. [తతః కి మిత్యాగతః?]

భాణ్డాయనః—చిర న్తన ప్రియసుహృదం భగవ న్తం ప్రాచేత సం ద్రష్టుం.

సౌధాతకిః—అవి అజ్జ సంబంధిణీహిం సమం సావుత్తం దంస ణం ణవేత్తి? [అపి అద్య సమ్బన్ధినీభిః సమం సంవృత్తం అస్య దర్శనం న వా ఇతి?

---

నేయి నీరు తేనె చక్కెర-అను నీయైదింటిని కలిపినదానికి మధుపర్కమని పేరు. అతిథికి రాఁగానే మర్యాదగా పెట్టఁబడునది. ఈ కాలమున 'కాఫీ' వంటిది. కొదమ పెయ్యకూర దానితోకూడ 'ఇడ్డెన' 'ఉప్పుపిండి' వంటిది అగును. 'నివృత్త మాంసానాం ఏవం కల్పం' అని పాఠము. 'అనివృత్తమాంసానాం' అని కాదు. 'మాంసము వదలివైచినవారికి ఈ కల్పమును...' ఇత్యాది. మన్యన్తే = అనలం బింతురు. తద్దైవ ..ఉపశ్రుత్య = విన్నప్పుడే-ఆతిథ్యమునకు గోవును చంపుట కలియుగమున మానవలసిన ధర్మములలో పఠితము...'...మధుపర్కే చ గోర్వధః మాంసదానం తథా శ్రాద్ధే...నరమే ధాశ్వమేధకా,...గోమేధశ్చ తథా మఖః, ఇమా న్ధర్మా న్కలియుగే వర్జ్యా నాహు ర్మనీషిణః' ఇతి. దుర్విపాకమ్ = చెడ్డ పరిణామము-అడవులకు వివాసితయగుట. వైఖానసః-విఖనసునిసూత్రముల ననుష్ఠించువాఁడు, ఆరణ్యకుఁడు. తతః కిమితి ఆగతః=అక్కడినుండి ఎందుచేత వచ్చి నాఁడు? చిర న్తన ప్రియసుహృదమ్-చిరకాలప్రియమిత్రుని-తాను గృహస్థుఁడుగా ఉన్నప్పటినుండియు-జనకుఁడు మహాకర్మఠుఁడు, జ్ఞాని, వేదాంతి; ఋషులకు మిత్రము. ఆశ్రమమునకు జనకుఁడు ఈ దినము వచ్చినాఁడు. వసిష్ఠాదులు వచ్చి నదియు ఇటీవలనే-ఋశ్యశృంగుఁడు చేసిన పండ్రెండేండ్ల జన్నము ముగిసిన తర్వాత; కొన్ని గడియలే ఐనది. అపి అద్య సమ్బన్ధినీభిః సమం సంవృత్తం అస్య దర్శనమ్=నియ్యపురాండ్రను ఈయన ఈదినము దర్శించినాఁడా లేదా? సమ్బన్ధినీ-

భాణ్డాయనః—సమ్ప్రత్యేవ భగవతా వసిష్ఠేన దేవ్యాః కౌసల్యాయాః సకాశం భగవత్యరున్ధతీ ప్రహితా, యత్ స్వయముపేత్య వైదేహో ద్రష్టవ్య ఇతి.

సౌధాతకిః—జహ సవ్వే ఏదే థేరా పరోప్పరం మిళిదా తహ అమ్హే వి వటుఏహింసహ మిళిఅ అణజ్ఝాఅ మహూసవం ఖేళంతా సంభావేమ్హ. [యథా సర్వే ఏతే స్థవిరాః పరస్పరం మిళితాః తథా ఆవామపి వటుకై స్సహ మిళిత్వా అనధ్యాయ మహోత్సవం ఖేలన్తౌ సమ్భావయావః.]

భాణ్డాయనః—తదయం బ్రహ్మవాదీ పురాణరాజర్షి ర్జనకః ప్రాచేతస వసిష్ఠా వుపాస్య సమ్ప్రత్యాశ్రమస్య బహి ర్వృక్షమూల మధితిష్ఠతి, య ఏషః,

శ్లో॥ హృది నిత్యానుషక్తేన సీతాశోకేన తప్యతే,
అన్తః ప్రసృప్తదహనో జ్వలన్నివ వనస్పతిః. ౨

---

సంబంధము అనఁగా వియ్యము. దేవ్యాః కౌసల్యాయాః సకాశం = కౌసల్యాదేవి కడకు, ప్రహితా=(చెప్పి) పంపఁబడినది. స్వయం ఉపేత్య=స్వయముగాపోయి. అనఁగా తానే మునుగలుగ ఆయనకడకు పోయి - ఏలయన సంబంధి, మిత్రము, రాజర్షి అగుటయు గాక, ఇపుడు కౌసల్యయింటనున్న యీయనకూఁతురు అట్లు త్యజింపఁబడినది అని ఆయన వీరిచే అపకృతుఁడును అవమానితుఁడును ఐనాఁడు గావున ఆయనను తేర్పవలసియున్నది. ఖేలన్తః=ఆడుకొనుచు. వృక్షమూలం అధితిష్ఠతి=చెట్టుమొదట కూర్చున్నాఁడు. వైఖానసుఁడుగాన చెట్టుమొదట కూర్చున్నాఁడు. అట్లే చూ. I - 18 - 'ఏతాని తాని గిరినిర్ఝరిణీ తటేషు, వైఖాన సాశ్రిత తరూణి తపోవనాని.'

శ్లో. ౨. హృదీతి. (య ఏషః=ఈయన) అన్తః ప్రసృప్త దహనః=లోపల పర్వినయగ్ని - దావాగ్ని - గల, జరన్=జీర్ణమైన, చాలముదిరి పండఁబాఱి క్షీణించి పోవుచున్న, వనస్పతిః ఇవ = వృక్షమువలె, హృది = మానసములోన, నిత్యానుషక్తేన=ఎల్లప్పుడును వీడకయుయున్న, సీతాశోకేన=సీత దుఃఖముచేత, తప్యతే = పొగులుచున్నాఁడు.

మానసమున సీతకు అట్లైనదే అను దుఃఖము నిముసమేని మఱపురాక మందగింపక యున్నది. దానికి పొగులుచున్నాఁడు, (ముసలాయన) - లోపల పర్విన చిచ్చుచే (కాలుచుండు) జరద్వనస్పతివలె. ఎంతయు తగిన యుపమానము.

జనకుని సీతాశోకమునకును పండ్రెండేండ్లయినది. అది చిత్తమున నిత్యానుషక్తముగా నున్నది. పొగులుచునే యున్నాఁడు.

ఇతి (నిష్క్రాన్తా)

ఇతి మిశ్రవిష్కమ్భకః.

---

ఈ మిశ్రవిష్కంభమున వసిష్ఠారుంధతీ కౌసల్యాదులు వాల్మీకి యాశ్రమముం జేరినమాట క్రొత్తదిగాదు, వృత్తము; మునుపు ఆత్రేయి చెప్పి పోయినదే. జనకుఁడు అచటికి వచ్చుటయు వృత్తము: ఇందు తొలిమారు ఎఱింగింపఁబడుచున్నది. వసిష్ఠులవారు అరుంధతిని కౌసల్యకడకుం బంపుటయు అనధ్యయనోత్సవమును అట్టివే. వర్తిష్యమాణము.- అరుంధతీ పురస్కృతయై కౌసల్య జనకుం గలసికొనుట, అనధ్యయనమున వటువుల యాటలు, అందున్న లవుఁడు కౌసల్యాజనకాదుల కంటఁబడి కలిసికొని మాటలాడుటయు. ఉత్తరరామచరిత వ్రాసిన కవి తాను ఎన్నఁడేని నవ్వియుండునా, నవ్వన నెట్టిదో ఎఱిఁగియుండునా అని తోఁచును. చిత్తమును తేలికపడనీక బిరడా బిగించి తీగవలె ఉదాత్తముగానే ధీరముగానే యుంచుకొనువాఁడు, ఇట సహృదయులకును అట్లే యుంచినాఁడు. అట్టి భవభూతి ఈ వాల్మీకి శిష్యులమాటలలో రవంత హాస్యము తొంగిచూచునట్లు చేసినాఁడు - జీర్ణకూర్చానాం - మడమడాయితా - వ్యాఘ్రో వా వృకో వా - విహస్య - నిగృహీతోఽసి - ఇత్యాదిచే బిగఁబట్టికొనియున్న యూపిరిని రవంత సడలించి నట్లయినది. అంతట జనకప్రవేశముతో బిరడా మునుపటికన్నను మూఁడు చుట్లు బిగియును.



# ఉత్తరరామచరితనాటకమ్

## చతుర్థాఙ్కః

[తతః ప్రవిశతి జనకః]

జనకః —

శ్లో॥ అపత్యే యత్తాదృగ్దురిత మభవ త్తేన మహతా
విషక్త స్తీవ్రేణ వ్రణితహృదయేన వ్యథయతా,
పటు ర్ధారావాహీ నవ ఇవ చిరేణాపి హి న మే
నికృన్త న్మర్మాణి క్రకచ ఇవ మన్యు ర్విరమతి. ౧

శ్లో. ౧. అపత్యే ఇతి - అపత్యే = బిడ్డ - అమ్మాయి - సీతయెడ, యత్ = ఏ, తాదృక్ = అట్టి - నోటనయితము చెప్పరానంతటి ఘోరమైన. దురితం = కీడు, వైశసము, అభవత్ = వాటిల్లెనో, మహతా = ఇంతంతనరానంత పెద్దదియు, తీవ్రేణ = తీక్ష్ణమైనదియు, వ్రణితహృదయేన = గాయపఱుపఁబడిన మనసుగలదియు - గుండియను వ్రచ్చి (గాయపఱిచి)నదియు, వ్యథయతా = బాధకలిగించుచున్నదియు నగు, తేన = దానిచేత - ఆ దురితముచేత, విషక్తః = నాటఁబడినదై, మన్యుః = శోకము, ధారావాహీ = ఎల్లపుడు వీడక (ఏకధారగా) నుండునదియు. పటుః = మంచి బలముగలదియు, చిరేణ అపి = చాలకాలమైనను - పంౘెండేండ్లయినను, నవః ఇవ = క్రొత్తదియుంబోలె, నున్నదై, క్రకచ ఇవ = అంపమువలె, - అంపమును విషక్తము (= లోతుగా దగినదియు,) ధారావాహి (= వాదరగలదియు,) పటువు (= ఉక్కు - అగుటచే గట్టిదియు.) చిరేణ అపి నవః - (చాలకాలమైనను క్రొత్తది - అనఁగా కోఁతపనిలోనే యుండి తుప్పుపట్టక క్రొత్తదియుంబోలెనే, అంతకన్నను గూడ, తళతళల యుండునదియు) అగును - మే మర్మాణి = నాయాయువుపట్టులను, నికృన్తన్ = కఱకఱఁగోయుచు, న విరమతి = మానక యున్నది.

నా బిడ్డయందు అట్టికీడు వాటిల్లినదే! ఎంత పెద్దది, ఎంత తీక్ష్ణమైనది! అది నాగుండెను 'వ్రచ్చివ్రచ్చి' వ్యథయిడుచు లోతుగా ఏ శోకమును నాటినదో అది ఒక్కటే ధారగా తెంపులేక అతి బలముగలదై యెన్ని యేండ్లయినను క్రొత్తదానివలె నామర్మములను అంపమువలె కోయుచు మానకున్నది.

తాదృక్ - కని విని యెఱుఁగనిది; మిక్కిలియు అసంభావ్యము. మహతా - ప్రతిక్షణము తలఁచుకొనుకొలఁది పెద్దదిగానోఁచుచున్నదానిచేత - ధారావాహీ - ఒక్కధారగా ఉన్నట్టిది - తెంపులేక; మఱి యేతలంపునకు ఎడముసేయనిది.

కష్ట! మేవం నామ జరయా దుఃఖేన చ దురాసదేన భూయః పరాకసాన్తపనప్రభృతిభి స్తపోభి రాత్తరసధాతుః అనుపయుజ్యమానః నాద్యాపి మే దగ్ధదేహః పతతి. అన్ధతామిస్రా హ్యసుర్యా నామ తే లోకాః, తేభ్యః ప్రతివిధీయన్తే యే ఆత్మఘాతిన ఇత్యేవ మృషయో మన్యన్తే. అనేకసంవత్సరాతిక్రమేఽపి చ ప్రతిక్షణపరిభావనయా స్పష్టనిర్భాసః ప్రత్యగ్ర ఇవ దారుణో మే దుఃఖసంవేగో న ప్రశామ్యతి. అయి మాతః దేవయజనసమ్భవే సీతే! ఈదృశ స్తే నిర్మాణభాగః. యేన, లజ్జయా స్వచ్ఛన్ద మాక్రన్దితు మపి న శక్యతే. హాహా! పుత్రి!

---

కష్టం=కట్టా - అయ్యో! దురాసదేన=ఓర్వరానిదైన, భూయః=మఱియు, పైగా - పరాకసాన్తపన - ఇవి తపఃప్రకారములు - శరీరమును మిక్కిలి వాడ్చునవి. 'ద్వాదశాహోపవాసేన పరాకః పరికీర్తితః' - అని. పరాకమనఁగా పండ్రెండు దినాలు ఉపవాసముచేయుట. 'గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్ ఏకైకం ప్రత్యహం పీత్వా అహోరాత్ర మభోజనమ్ కృచ్ఛ్రః సాన్తపనో నామ సర్వపాపప్రణాశనః' - అని సాంతపనము. ఆత్తరసధాతుః = ధాతువులు శోషించినవాఁడు. ధాతువులు - రసరక్తమాంస మేదోఽస్థి మజ్జశుక్రములు - వీని యందలి రసము - తడి - యెల్ల ఇగిరిపోయినది. అన్నియు శోషించినవి. అనుపయుజ్యమానః=ఎందులకును కొఱగాకుండునది. దగ్ధదేహః = పాడుదేహము, 'దగ్ధ' 'హత' - ఇట్టివి తిట్టులు. న అద్యాపి పతతి - ఇప్పటికిని కూలిపోకయున్నది. అట్లేని ఆత్మహత్యచేసికొనరాదా యన్న ఆత్మఘాతులు నరకముపాలగుదురందురు. అసుర్యా నామ తే లోకాః - అసుర్యములు అను పేరి లోకములున్నవి. అవి 'అన్ధతామిస్రాః' పెనుచీఁకటితో నిండినవి. తేభ్యః ప్రతివిధీయన్తే=అందు పడవేయఁబడుదురు. మన్యన్తే=తలంతురు. అసుర్యాః = అసురులకు తగినవి. 'అసుర్యా నామ తే లోకాః అన్ధేన తమసా వృతాః తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః' అని శ్రుతి. ప్రతిక్షణపరిభావనయా = ప్రతి నిమిషమును తలఁపులోనే యుండుటచేత. స్పష్టనిర్భాసః=స్పష్టమగు ప్రకాశము గలదై - ఇంచుకయేని మాసిపోక - కాలమున దుఃఖము వేగము తగ్గును, మాసిపోవును - అందుకే అట్లు ఇంచుకయు తగ్గక, మాయక ఉన్నది. జనకుఁడు గొప్ప వేదాంతి

శ్లో॥ అనియత రుదితస్మితం విరాజ
త్కతిపయకోమల దన్తకుట్మలాగ్రమ్,
వదనకమలకం శిశో స్స్మరామి
స్ఖలదసమఞ్జసముగ్ధ జల్పితం తే. ౨

---

జ్ఞాని, ఇట్లు దుఃఖముపాలు కాఁదగునా యన్న, ఎంత వేదాంతికిని, జ్ఞానికిని ఇట్టి దుఃఖములు ఓర్చుకొనరావు. శాకుంతలమున కణ్వుఁడు శకుంతలకై ఎంత దుఃఖించినాఁడు! వసిష్ఠుని పుత్రశోకము ప్రసిద్ధము. అంతియకాక, సీత వ్యక్తివిశేషము, దుఃఖకారణమును అసాధారణము. నిర్భాగ్యభాగః-నిర్భాగ్యభాగ్యము-నీజన్మాదృష్టము. అట్టి పుట్టువుగలదానికి, మాయింటియమ్మాయికి ఇట్టి పరివాదమే, దానికి ఇట్టి దండనయే అని లజ్జ-సిగ్గు. స్వచ్ఛన్దమ్=ఇచ్ఛమెయి వావిచ్చి పనవుచు.

శ్లో. ౨. అనియతమితి-అనియతిరుదితస్మితమ్ = కారణము లేకయే అంతలో ఏడ్పు అంతలో నవ్వును కలదియు, విరాజత్కతిపయ...గ్రమ్ = ప్రకాశించుచున్న కొన్నియేయైన పలు మొగ్గలకొనలు వెలయునదియు, స్ఖలదసమఞ్జస ముగ్ధజల్పితమ్=జాఱుచున్న-ఒకటికి మఱియొకటి వచ్చుచున్న-తడబడుచున్న-సంగతిలేని ముద్దు పలుకులుగలదియు నగు, తే శిశోః వదనకమలకం = శిశువుగానున్న నీ బుచ్చిమోము దామరను, స్మరామి=తలంచుకొనుచున్నాను.

నీవు శిశువుగా ఉన్నప్పటి నీముద్దుమోముదామర నాకు తలంపునకు వచ్చుచున్నది. కారణములేకయే అంతలో ఏడ్పు, అంతలో నవ్వు! కొన్నియే లేతపండ్లు మొగ్గలవలె ప్రకాశించుట! ఆతడబడు-అర్థము సరిపడని-తొక్కు ముద్దుపలుకులు-అన్నియు! తరువాత ఎన్నియేండ్లో తనకడ పెరిఁగినను, ఆమె పెండ్లి కళకళలు అన్నియు తాను చూచియున్నను, సీత యీ శైశవము జనకుని చిత్తమున అట్లా హత్తుకొనియున్నది. దానిని ఏదియు మించలేదు.

'అథ మే కృషతః క్షేత్రం లాఙ్గలా దుత్థితా మయా
క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా
భూతలా దుత్థితా సా తు వ్యవర్ధత మమాత్మజా.'

అని జనకుఁడు తనకు సీత దొరకి, కూఁతురుగా పెరిఁగినవృత్తమును రామాయణమున సంగ్రహముగా చెప్పినాఁడు. ఆమె జనకునికి దొరకినపుడు మిక్కిలియు ముద్దులొలుకుచు అందమగు బంగరుబొమ్మంబోని దేదీప్యమాన దివ్యశిశువుగా నుండెననియు, అంతట క్రమముగా ఎదుగఁజొచ్చెననియు, ఆయనియతరుదితస్మితాది చేష్టలన్నియు చూచుచు జనకుఁడు ఆశిశువును మిక్కిలియు లాలించుచు

భగవతి వసున్ధరే! సత్య మతిదృఢాసి!

శ్లో॥ త్వం వహ్ని ర్మునయో వసిష్ఠగృహిణీ గఙ్గా చ యస్యా విదు
ర్మాహాత్మ్యం, యది వా రఘోః కులగురు ర్దేవ స్స్వయం భాస్కరః,
విద్యాం వాగివ యా మసూత భవతీ, తద్వత్తు యా దైవతం.
తస్యా స్త్వం దుహితు స్తథావిశసనం కిం దారుణే౽మృష్యథాః? 3

---

ఆ యానందము అనుభవించుచు పెంచెననియు ఊహించి, ఈ జనకునితోఁకూడ భవభూతియు ఆసాక్షాల్లక్ష్మి బాల్యసౌభాగ్యమును భావించి ఇట్లు అనుభవించుచున్నాఁడు. ఈ శ్లోకము మాలతియందును గలదు, ఆపన్న మాలతింగూర్చి ఆమెనాయన పరిదేవనము.

అతిశైశవమున కారణములేకయే అంతలో ఏడ్పు అంతలో నవ్వు వచ్చుచుండును ఏడ్పును అందమే, నవ్వును ముద్దే. దుష్యంతునివాక్యమును కనఁదగును. కాళిదాసు శాకుం. VII - 17.

ఆలక్ష్యదన్తముకులా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణ రమణీయ వచః ప్రవృత్తీన్
అఙ్కాశ్రయప్రణయిన స్తనయా న్వహన్తో
ధన్యా స్తదఙ్గరజసా మలినీభవన్తి.

అంత బాల్యమునుండి పెంచి పెద్దజేసి నీకు అన్నియు చేసితినే. కడకు నీకు ఇట్లు వచ్చినదే! అనుట.

అతిదృఢాసి=మిక్కిలియు కఠినవు - నీగుండె చీలిపోకయున్నదే - అనుట.

శ్లో. 3. త్వం ఇతి - త్వం=నీవు, వహ్నిః=అగ్ని. మునయః=ఋషులు, వసిష్ఠగృహిణీ=వసిష్ఠుని యిల్లాలు, అరుంధతి, గఙ్గా చ=గంగయు, యది వా=అంతియ ఏల? కావలయునన్నట్లైన, రఘోః కులగురుః=రఘువంశమునకు ఆద్యుఁడై పెద్దయగు, భాస్కరః స్వయమ్=సూర్యుఁడే సొంతముగా, యస్యాః=ఎవతెయొక్క, మాహాత్మ్యం=మహిమను, పేర్మిని, విదుః=ఎఱుంగుదురో, వాక్=త్రయి, విద్యాం ఇవ=విద్యను - తత్త్వజ్ఞానముంబోలె, భవతీ=నీవు, యాం=ఎవతెను, అసూత=కంటివో, పునః=అంతియకాక, యా=ఎవతె, శుద్ధింగతా = అట్లెల్ల శుద్ధిపొందినదో, తస్యాం దుహితుః=ఆకూఁతునకు, తథా విశసనం=అట్టి చంపుటను - విలయమును - హింసను, దారుణే=కఠినురాలా, కిం మృష్యథాః=ఓర్చుకొంటివా!

(నేపథ్యే)

ఇత ఇతో భగవతీ మహాదేవ్యౌ.

జనకః—[దృష్ట్వా] అయే! గృష్టి నోపదిశ్యమానమార్గా భగవత్యరుంధతీ. (ఉత్థాయ) కాం పునర్మహాదేవీ త్యాహ? (నిరూప్య) హా! కథ! మియం మహారాజ దశరథస్య ధర్మదారాః ప్రియసఖీ మే కౌసల్యా! క ఏనాం ప్రత్యేతి సైవేయ మితి!

---

నీవు, అగ్ని, మునులు, అరుంధతి, గంగ. ఇంకను కావలయునన్న, రఘు వంశమునకు కూటస్థుఁడగు ఆ సూర్యుఁడే పొంతముగా ఎవతె పేర్మిని ఎఱుంగు దురో, త్రయీదేవి విద్యనుంబోలె, నీవే ఎవతెను కంటివో, అంతయే కాక, ఎవతె (అగ్నిశుద్ధి) శుద్ధిపొందినదో అట్టి నీ కూఁతునకు అట్టి విలయముకలిగిన నీవు ఎట్లు ఓర్చుకొన్నావో! ఎంత దారుణురాలవో కదా!

'త్వం' - భూమి సకలభూతధాత్రి, సర్వత్ర వ్యాపించియుండునది, సర్వ మునకు ఆధారమైనది. ఆమెకు తెలియనిది ఎందుండును, ఈలోకమునకే సీతకు అపవాదకారణములేమి ఆమె లెస్సగా ఎఱుంగును. 'వహ్ని' - సీతకు శుద్ధికాలమున నీలోత్పలశీతలసహ్యుఁడై ఆమెను తెచ్చి రామునికి సమర్పించినవాఁడు. 'అరుంధతి' కన్న పూజ్యయగు పతివ్రత లేదు. అట్టి అరుంధతికిని, కులగురుపత్నికి, పూజ్య యైనట్టిది సీత. సీతను ఆమె చక్కఁగా ఎఱుంగును. 'మునయః' - భూతభవిష్య త్తులంగూడ నెఱిగినవారు. 'ఏతే సేన్ద్రా స్త్రయో లోకాః సిద్ధాశ్చ పరమర్షయః, అభిగమ్య మహాత్మానమ్' అని శుద్ధికాలమున పరమర్షులు సన్నిధి చేసినారు. 'గఙ్గా'- దివ్య - దేవత - అడవికి పోవునపుడును మరలునపుడును కాంచినది. 'భాస్కరః' 'ఆదిత్యచన్ద్రావనిలోఽనలశ్చ'అనియు, 'సూర్యః సోమో యమః కాలో'అనియు కర్మసాక్షులలెక్కలో మొదటివాఁడు, రఘుకులకూటస్థుఁడు - 'శుద్ధిం గతా' అ యగ్నిశుద్ధికాలమున సాక్షాత్తుగా బ్రహ్మరుద్రుఁడు ఇంద్రుఁడు మొదలగువారును సాక్ష్యము పలికినారు. అట్టిశుద్ధి పొందినట్టిదే. 'విశసనమ్' కఠోరగర్భను అడవిలో పొంటైచుట యనఁగా చంపుటయే కదా. ఈ దుఃఖమునకు భూమిసైతము బ్రద్దలు కావలసినదని భావము.

గృష్టినా - దశరథునియింటి కంచుకి, జనకునికి లెస్సగా పరిచితుఁడు, చూడఁగానే ఫలానా అని తెలిసినది. దారిచూపుచున్నాఁడు. హా కథం! హా ఏమి! ప్రియసఖీ మే - నా యనుంగు చెలి - వట్టివియ్యమమాత్రము కాదు. అందు

శ్లో॥ ఆసీ దియం దశరథస్య గృహే యథా శ్రీః
శ్రీరేవ వా; కి ముపమానపదేన? సైషా
కష్టం! బ తాన్య దివ దైవవశేన జాతా
దుఃఖాత్మకం కిమపి భూత! మహో విపాకః! ౪

శ్లో॥ య ఏవ మే జనః పూర్వ మాసీ న్మూర్తో మహోత్సవః,
క్షతే క్షార మి వాసహ్యం జాతం తస్యైవ దర్శనమ్. ౫

---

మిక్కిలియు ప్రియమగు సఖ్యము కలిగినది. సా ఏవ ఇయం ఇతి=ఆమెయే ఈమె అని _ అనఁగా గుర్తు తెలియనట్లు అంత మాఱిపోయియున్నది. ప్రత్యేతి = ఆనవాలు పట్టును? సీత దుఃఖముచేత నే ఆమెయు ఇట్టైనది.

శ్లో. ౪. ఆసీదితి _ ఇయం=ఈమె, దశరథస్య గృహే=దశరథుని యింట, యథా శ్రీః=సిరివలె, ఆసీత్=ఉండెను. ఉపమానపదేన కిం _ 'యథా' 'వలె' అని ఉపమానపదము ఎందులకు? శ్రీః ఏవ వా=సిరియే _ (ఆసీత్=అయెను) సా ఏషా= అట్టి యీమె, కష్టం బత=అయ్యయో! దైవవశేన = విధివశాన _ విధియే కారణముగా, అన్యత్ కిమపి=ఏదియో వేఱు, దుఃఖాత్మకం భూతం=శోకమయమైన ప్రాణిగా, జాతా=అయిపోయినది! అహో విపాకః=అహో, ఆశ్చర్యమైన పరిణతి, మార్పు!

(నే నెఱుఁగుదును!) ఈమె దశరథుని యింట లక్ష్మివలె ఉండినది. వలె అను టెందులకు? సాక్షాల్లక్ష్మిగానే ఉండినది. అట్టి యీమె ఎట్లు మాఱిపోయినది! శోకము రూపుదాల్చిన యేదియో జంతువువలె ఐపోయినదే, దైవవశమున! అయ్యయ్యో! హా!

అయం అపరః _ ఇది మఱియొకటి _ ఆమె తాను అట్లు మాఱిపోవుట యొక దశావిపాకము. ఇప్పుడు నేను చెప్పఁబోవునది మఱియొకటి. ౦విపర్యాసః _ వ్యత్యాసము _ మార్పు _ పాపః _ పాపమైనది _ పాపము హేతువుగా గలది _ వ్యథ కలిగించునది _ పాడు.

శ్లో. ౫. య ఇతి _ పూర్వం=మునుపు, యః జనః ఏవ=ఏజనమే, మూర్తః= రూపుదాల్చిన, మహోత్సవః=పెనుఁబండుగు, మే=నాకు, ఆసీత్=అయెనో, తస్య ఏవ=దానిదే, దర్శనమ్=అగపాటు, క్షతే=గాయమున, క్షారంఇవ=కారము _ కాదా ఉప్పు _ వలె, అసహ్యం=ఓర్వరానిది, జాతమ్=ఐనది.

ఏజనము మున్ను రూపుఁదాల్చిన మహోత్సవ మాయెనో నాకు, అదియే ఇపుడు అగపడి గాయమున పెట్టిన క్షారము _ కారము. ఉప్పు _ వలె, ఓర్వరానిది ఐనది.

[తతః ప్రవిశ త్యరున్ధతీ కౌసల్యా కఞ్చుకీ చ.]

అరున్ధతీ—నను బ్రవీమి, ద్రష్టవ్య స్స్వయ ముపేత్య వైదేహ ఇత్యేష వః కులగురో రాదేశః, అత ఏ వాహం ప్రేషితా. కుతోఽయం పదేపదే మహా ననధ్యవసాయః?

కఞ్చుకీ—దేవి, సంస్తభ్య యాత్మాన, మనురుధ్యస్వ భగవతో వసిష్ఠ స్యాదేశ మితి విజ్ఞాపయామి.

కౌసల్యా—ఏరిసే కాలే మిహిళాహివో దట్టవ్వో త్తి సమం ఎవ్వ సవ్వదుక్ఖాఇం సముబ్భవంతి. ణ సక్కుణోమి ఉవ్వట్టమాణ మూలబంధణం హిఅఅం అవట్ఠావేదుమ్. [ఈదృశే కాలే మిథిలాధిపో ద్రష్టవ్య ఇతి సమ మేవ సర్వదుఃఖాని సముద్భవన్తి. న శక్నో మ్యుద్వర్తమాన మూలబన్ధనం హృదయం అవస్థాపయితుమ్.]

అరున్ధతీ—అత్ర క స్సన్దేహః?

---

మునుపు మాయమ్మాయిని ఓముచున్న అత్తగారు, నామిత్రమునకు భార్య, నాకును సాక్షాత్తు సఖియై, అగపడినపుడు మూర్తిగొన్న మహోత్సవమువలె నుండినది. ఇపుడు మాయమ్మాయిని తఱిమిన అత్తగారు, తఱిమిన రామునికి అమ్మ, అని ఆసీతగతికి దుఃఖముపాలైయున్న నాకు, మఱియు దానిని వృద్ధిచేయు కారణమైనది. ఎంత మనసునకు తగులునట్లు చెప్పినాఁడు కవి!

నను బ్రవీమి = దేవీ చెప్పుచున్నాను - చెప్పుచున్నాను గదా - (విను.) స్వయమ్ = స్వయముగా - తానే; ఉపేత్య = పోయి, చేరఁబోయి, ద్రష్టవ్యః = (తప్పక) చూడవలసినవాఁడు. ఆదేశమ్=ఉత్తరువు. అనధ్యవసాయః=ప్రయత్నవిరోధము; పూనికను మానుట, వెనుదీయుట అన్నమాట, ఆయనమాటను వారు ఉల్లంఘింపఁజాలరు. నను విజ్ఞాపయామి=విన్నపము చేయుచున్నానుగదా, చిత్తగింపుము. ఆత్మానం=మనస్సును, సంస్తంభయ=నిలువరించుకొనుము - నిబ్బరము చేసికొనుము - సమం ఏవ=ఒక్కుమ్మడిగా, సముద్భవన్తి=కలుగుచున్నవి, తేచుచున్నవి. ఉద్వర్తమానమూలబన్ధనం = పెల్లగిల్లుచున్న వేరుకట్టులు, వేరుపట్టు - కలదై, అవస్థాపయితుం=నిలువరించుకొనను.

శ్లో॥ సన్తానవాహీ న్యపి మానుషాణాం దుఃఖాని సద్బన్ధువియోగజాని,
దృష్టే జనే ప్రేయసి దుస్సహాని స్రోతస్సహస్రై రివ సమ్ప్లవన్తే. ౬

కౌసల్యా—కహం వచ్ఛావ వహూఏ ఎన్వం గదే, తస్స రాఏసిణో ముహం దంసేమ్హ. [కథం వత్సాయా వధ్వా ఏవం గతే తస్య రాజర్షే ర్ముఖం దర్శయామః?]

అరున్ధతీ—

శ్లో॥ ఏష వ శ్లాఘ్యసమ్బన్ధీ జనకానాం కులోద్వహః,
యాజ్ఞవల్క్యో ముని ర్యస్మై బ్రహ్మపారాయణం జగౌ. ౭

శ్లో. ౬. సన్తానఇతి_మానుషాణాం = మనుష్యులకు, సద్బన్ధువియోగజాని = మంచి (=అనుంగు) బంధువుల వియోగమువలన కలిగినవైన, దుఃఖాని = దుఃఖములు, సన్తానవాహీని అపి=ఎడతెగక యుండునవైనను, ప్రేయసి జనే = మిక్కిలి ప్రియమైన జనము, దృష్టే=చూడఁబడఁగా, దుస్సహాని=ఓర్వ_ఇమడ్చుకొన_రాక, స్రోతః సహస్రైః ఇవ=వేల ప్రవాహములతోనుంబోలె, సంప్లవన్తే=వెల్లువ పాడుచును, పొంగును

అనుంగుబంధువుల వియోగమువలన కలుగు దుఃఖములు మనుష్యులకు ఒకప్పటికిని తీఱునవికావు_ఎడతెగక యుండునవే. ఐనను అవి ప్రియజనమును కన్నంతనే ఇముడలేక వేల ప్రవాహములచేతనుంబోలె వెల్లివొడుచును.

వాచ్యప్రధానుఁడై భవభూతి ఈయర్థమును ఇట్లు చెప్పఁగా, దీనినే వ్యంగ్యప్రధానుఁడై కాళిదాసు ఇట్లు చెప్పినాఁడు. 'స్వజనస్య హి దుఃఖ మగ్రతో వివృతద్వార మి వోపజాయతే' కుమార. IV_26._అని వేదము వేంకటరాయ శాస్త్రిులవారు అనతిచ్చినారు. జనకునికి ఏమేని ఇంచుక కోపము రామునివలన తజ్జననియని కౌసల్యయెడ ఉండునేమో కాని, కౌసల్యకు జనకునెడ అట్టిది యేదియు ఉండక కేవలము ఆయన స్వజనమనుటయు, వియ్యము మిత్రము అనుటయు భావన. అది అట్టి ఆయనకూఁతునకు ఇట్లు జరిగినదే మాయింట అను వైలక్ష్యముతో కూడుకొన్నది. కావున సహస్రములును, లక్షలును లెక్కలేనివి అగునేమో స్రోతస్సులు. కౌసల్యకేమో కోడలన్న సీతపై కూఁతుమీఁదికన్నను ఎక్కువ ప్రీతి. మఱి యిట్టులైనందున జనకునికి తటాలున మోముచూపఁజాలక యున్నది తాను.

శ్లో. ౭. ఏషః ఇతి._ఏషః=ఇతఁడే, వః=మీయొక్క, శ్లాఘ్యసమ్బన్ధీ = మేటివియ్యము; జనకానాం=జనకుల, కులోద్వహః=వంశోద్ధారకుఁడు; యస్మై = ఎవనికి_అనఁగా ఈయనకు, యాజ్ఞవల్క్యః మునిః=యాజ్ఞవల్క్యముని, బ్రహ్మ

కౌసల్యా—ఏసో మహారాఅస్స హిఅఆణందో వచ్ఛాఏ వహూఏ పిదా రాఏసీ, హద్ధీ! సంభావిఅమ్హి సముపట్ఠిఏసు మహూసవేసు దివసేసు. హా దైవ సవ్వం ఏవ తం ణత్థి. [ఏష మహారాజస్య హృదయానన్దః వత్సాయా వధ్వాః పితా రాజర్షిః. హాధిక్ సమ్భావితాస్మి సముపస్థిత మహోత్సవేషు తేషు దివసేషు. హాదైవ సర్వ మేవ తన్నాస్తి.]

జనకః—(ఉపసృత్య) భగవ త్యరున్ధతి, వైదేహః సీరధ్వజోఽభివాదయతే.

శ్లో॥ యయా పూతమ్మన్యో నిధిరపి పవిత్రస్య మహసః
పతిస్తే పూర్వేషా మపి ఖలు గురూణాం గురుతమః,

---

పారాయణమ్=వేదసాకల్యమును - సకలవేదమును అనుట, జగౌ=పాడెను, చేర్చి వ్యాఖ్యానించెను అనుట.

ఇతఁడే మా మేటి వియ్యంకుఁడు. జనక వంశోద్ధారకుఁడు. యాజ్ఞవల్క్యుల వారి శిష్యుఁడు, వారివలన సకలవేదమును విని నేర్చినవాఁడు. చాలగొప్పవాఁడు - అనుట - రాజుగాను, జ్ఞానిగాను.

జనకానాం - అది ఆవంశమున పుట్టినవారికెల్ల సాధారణమైనపేరు. బ్రహ్మ=వేదము. పారాయణం - సాకల్యము. జగౌ - సుస్వరముగా, పాటవలె, చెప్పుట.

మహారాజస్య = దశరథమహారాజునకు - తన భర్తకు కౌసల్యచేయు కోమల నిర్దేశము. హృదయానన్దః=మనస్సునకు ఆనందము - మిక్కుటపు సంతోషము - కలిగించువాఁడు. వత్సాయాః=పట్టికి - ఈ నిర్దేశమువలన సీతను కౌసల్య సాధారణముగా ఎట్టివాత్సల్యముతో చూచుకొనుచుండెనో తెలియును. రాజర్షిః - అని దశరథునికంటె విలక్షణమైననిర్దేశము: హాధిక్=హా కట్టా! సమ్భావితాస్మి సముపస్థిత మహోత్సవేషు తేషు దివసేషు! = మహోత్సవములతోడి ఆదినములందు సంభావింపఁబడుచుంటిని. సర్వమేవ తన్నాస్తి=అదియెల్లను లేదాయె. 'సర్వమేవ తన్నాస్తి' అని చెప్పుటంబట్టి 'అనుపస్థిత' అను పూర్వవాక్యావయవము 'సముపస్థిత' గా నుండుట శ్రేయము, సరి. దీని విస్తరమే 'సరాజాతిత్సౌఖ్యం' ఇత్యాది శ్లో. ౧౦.

శ్లో. ౧. యయాఇతి - పవిత్రస్య=పావనమైన, మహసః=తేజస్సునకు, నిధిః అపి=నిధానమైనను, పూర్వేషాం = తొంటివారైన గురూణాం గురువులకు సయితము, గురుతమః ఖలు=గురుశ్రేష్ఠుఁడు తానైనను, తే పతిః=నీభర్త, వసిష్ఠుఁడు, యయా = ఏనిచేత, పూతమ్మన్యః = తన్ను పవిత్రునిగా తలంచుకొనునో,

త్రిలోకీమఙ్గల్యా మవనితలలోలేన శిరసా
జగద్వన్ద్యాం దేవీ ముషస మివ వన్దే భగవతీమ్. ౮

అరున్ధతీ—అక్షరం జ్యోతి స్తే ప్రకాశతామ్, స త్వా పునాతు దేవః పరో రజసాం, య ఏష తపతి.

జనకః—ఆర్యగృష్టే, అ ప్యనామయ మస్యాః ప్రజాపాల మాతుః?

త్రిలోకీమఙ్గల్యాం=ముల్లోకములకు మంగళము కూర్చుదానవు, జగద్వన్ద్యాం=జగముల కెల్ల పూజ్యవు, అగు, భగవతీం=జ్ఞానశక్త్యాదిగుణములు విరాజిల్లు నిన్ను, ఉషసం దేవీం ఇవ=ఉషః (=ప్రాతః) సంధ్యంబలె, అవనితల లోలేన శిరసా=నేలపై దొరలాడుతలతో, వన్దే=నమస్కరించుచున్నాను.

(దేవీ,) నీభర్త తాను పవిత్రమహాతేజస్సునకు నిధియు పూర్వగురువుల కెల్లను గురుశ్రేష్ఠుఁడును ఐనను, తన్ను నీవలన పవిత్రునిగా తలంచుకొనును. అట్టి ఆయనను సయితము పవిత్రము చేయుదానవు, ముఁడులోకములకు మంగళము కూర్చుదానవు, జగములకు పూజ్యవు, ఉషోదేవికింబోలె, భగవతీ నీకు తలను నేలపై మోపి మ్రొక్కెడెదను.

అరుంధతి పరమసాధ్వి, సాక్షాత్తపఃసిద్ధి అన్నాడు కాళిదాసు. కుమార. VI. II.

తేషాం మధ్యగతా సాధ్వీ పత్యుః పాదార్పితేక్షణా,
సాక్షా దివ తపఃసిద్ధి ర్బభాసే బ హ్వరున్ధతీ.

పూర్వేషా మపి గురుతమః - మన్వంతరములయందు సైతము చావులేనివాఁడు. యయా పూతం మన్యః - అంతపవిత్రమైనవానికి సయితము నీవు పవిత్రతకు కారణమని ఆయన నమ్మకము. ఉషోదేవి అనగా ప్రాతఃసంధ్యయు జగద్వంద్యతాది గుణములు గలది. 'పితామహః పితౄణాం సృష్ట్వా మూర్తిం తా ముత్ససర్జ హ. సా ప్రాతః సాయ మాగత్య సన్ధ్యారూపేణ పూజ్యతే.' - అని సంధ్యలపూజ్యత. ఇట్లు అరుంధతియభివాదనార్హత ఉపన్యసింపఁబడినది. అంత దొడ్డది అనుట.

పరంజ్యోతిః=పరమమైన తేజస్సు - పరమాత్మ, బ్రహ్మము - అన్నమాట. పరో రజాః = రజస్సుకు పైబడినవాఁడు, సత్త్వసంపన్నులుగాని ఆయన నెఱుఁగఁజాలరు అనుట. య ఏష తపతి = ఈ వెలుఁగుచున్నాఁడే - సూర్యుఁడు, సూర్యునిలో నెలకొన్న నారాయణుఁడు. అరుంధతి పల్కిన యీ యాశీర్వాదము బ్రహ్మవాదియగు జనకునికి అనురూపముగా నున్నది. 'తపతి' - ఎండకాయుచున్నది - ఇది యేఋతువున ఏవేళ? చూ. ఉపో. పు. 74 అరుంధతికి నమస్కరించి, కౌసల్యను స్వయముగా ఎచ్చరింపక 'అస్యాః=ఈమెకు' అని గృష్టిని అడుగుట, ఆమెను ఒప్పరికింమిట; 'ప్రజాపాలమాత' అనుటయు - రామభద్రునియని తనకు మును పు

కఞ్చుకీ—(స్వగతం) నిరవశేష మతినిష్ఠుర ముపాలబ్ధాస్స్మః. (ప్రకాశం) రాజర్షే అనేనైవ మన్యునా చిరపరిత్యక్త రామభద్ర ముఖచన్ద్రదర్శనాం నార్హసి త్వం దుఃఖయితు మతిదుఃఖితాం దేవీమ్. రామభద్రస్యాపి దైవదుర్యోగః కోఽపి, యత్కిల సమన్తతః ప్రవృత్తబీభత్స కింవదన్తీకాః పౌరజానపదాః న చాగ్నిశుద్ధి మల్పకాః ప్రతియన్తీ త్యతో దారుణ మనుష్ఠితమ్.

జనకః—(సరోషమ్) ఆః కోఽయ మగ్నిర్నామ అస్మత్ప్రసూతి పరిశోధనే? కష్ట! మేవంవాదినా జనేన రామభద్రపరిభూతా అపి వయం పునః పరిభూయామహే.

---

అలవడిన తెఱంగున ప్రీతిపూర్వకముగా నిర్దేశింపక ఇట్లు నిర్దేశించుట అప్రీతి చేతను, అధిక్షేపమునకయ్యెను. ఈ యెత్తిపొడుపు కౌసల్యకును. ప్రజాపాలకుఁ డనుట రాముఁడు ప్రజలమాట విని ప్రజలను సంతోష పెట్టుటకై సీతను కానలకు తఱిమినాఁడనుటను తడవుట. అనామయమ్=ఆరోగ్యము. క్షత్రియులం గూర్చిన కుశలప్రశ్నకు ఇది పారిభాషికము. నిరవశేషమ్=పూర్తిగా - ఎంత అనవలయునో అంతయు అని. 'ప్రజాపాల' అన్న యెత్తిపొడుపుచే అందులకు అనర్హుఁడనియు సూచన. అతినిష్ఠురం = మర్మము గాఁడునట్లు. కంచుకి ముసలి బ్రాహ్మణుఁడు. గుణసంపన్నుఁడు. ఇట్టి మంచి అనుభవశాలి, కావున తగినట్లు బదులు చెప్ప నేర్చెను. అతనికి ఉండనే యుండినది మనసున, ఈయన ఏమనునో అని. అన వలసినంతయు అన్నాఁడు - అని యనుకొనుచున్నాఁడు. అనేనైవ మన్యునా - ఈ కోపము చేతనే - సీతను పరిత్యజించినాఁడను కోపము. 'చిరపరిత్యక్త రామభద్ర ముఖచన్ద్రదర్శనాం' - పన్నెండేండ్లయినది రామభద్రుని మొగముచందురుని ఈమె చూచి - ఆ ముఖచంద్రుని చూడక నిముసమేని తాను ఉండఁజాలనట్టి ఈమె - అనుట. కౌసల్యయెడను రామునియెడనుం గూడ జనకునికి కోపము లేకుండఁదగిన సమాధానము నొసఁగు మాటలం జెప్పుచున్నాఁడు. సమ...ప్రవృత్త...కింవద న్తీకాః = ఎల్లెడలఁ బర్వింపఁబడిన రోతయగు కింవదంతి (=అడిక) కలవారు. అల్పకాః = అల్పబుద్ధులు. అదియేమో ఈనాటకాన ఎవరును నోట చెప్పరు. కో ఽయం అగ్ని ర్నామ=వీఁడెవఁడు అగ్ని యనఁగా? అస్మత్ ప్రసూతి - మాయమ్మా యిని - అని - 'మా' అని కులము ధర్మిష్ఠత పొందలగు గొప్పతనపు గర్వము సూచితము. ఏవంవాదినా జనేన=ఇట్లు పలుకు జనులచే=ముక్కుడి మూఁకచే

అరుంధతీ—(నిశ్వస్య) ఏవ మేతత్, అగ్నిరితి వత్సాం ప్రతి పరి
లఘూ న్యక్షరాణి, సీతే త్యేవ పర్యాప్తం. హా! వత్సే.

శ్లో॥ శిశు ర్వా శిష్యా వా యదసి మమ, త త్తిష్ఠతు తథా.
విశుద్ధే రుత్కర్ష స్త్వయి తు మమ భక్తిం ద్రఢయతి.
శిశుత్వం స్త్రైణం వా భవతు; నను వన్ద్యాసి జగతాం.
గుణాః పూజాస్థానం గుణిషు, న చ లిఙ్గం న చ వయః. ౯

---

అనుట. పరిలఘూని = ఎంతయు లఘువులు = చులకనైనవి - లెక్కలేనివి. సీతా ఇత్యేవ పర్యాప్తమ్=సీత అనుటయే చాలును - అది అగ్నికిని పరిశుద్ధి యొసంగఁ గలది అన్నంతమాట. ఆమె పవిత్రతను సర్వమును ఎఱింగించునది - దేవయజన సంభూతత మొదలగునది.

శ్లో. ౯. శిశు రితి. - శిశుః వా - (నా) బిడ్డవో, శిష్యా వా = (నా) శిష్యవో, యత్ మమ అసి=ఏమి నాకు అగుదువో, తత్=అది, ఆమాట, తిష్ఠతు తథా = అటుండఁగనిమ్ము. తు (=కింతు) = మఱియేమన్న, విశుద్ధేః ఉత్కర్షః = (నీ) పావనతరమగు శుద్ధియొక్క పెంపు. త్వయి=నీయందు, మమ=నాకు భక్తిం జనయతి=భక్తికలిగించుచున్నది. శిశుత్వం = పసితనముగాని, స్త్రైణం వా = ఆడుతనము గాని, భవతు = ఉండనీ. జగతాం = జగములకు, వన్ద్యా అసి నను = పూజ్యవు, అగుదువుగదా! గుణిషు=గుణములుగలవారియందు, గుణాః=గుణములు - సత్యశౌచాదులు, పూజాస్థానమ్=పూజకు పదమగును=కారణ మగును. లిఙ్గం చ=కట్టుగుఱుతు - జడయో జందెమో, బొట్టో కట్టో, ఆడుతనమో మగతనమో, న=కాదు; వయః చ=బాల్యము మొదలైనదియు, న=కాదు. - అనఁగా పూజకు . గౌరవమునకు - కారణము గాదు.

నాకు నీవు బిడ్డవే అగుదువో శిష్యవే యగుదువో అది అటుండనిమ్ము. నీపవిత్రతాతిశయముచేత నీయందు నాకు భక్తిభావము కలిగినది. శిశువవైన నేమి, స్త్రీవి ఐననేమి; నీవు లోకముల కెల్ల పూజ్యవు. గుణములే గుణులయందు పూజకు కారణముగాని వారిబిడ్డతనము శిష్యత్వముగాని వారిమగతనము ఆడుతనముగాని కాదు.

ఇందు సీతమహిమ ఉపన్యస్తము. 'లిఙ్గమ్' - అనఁగా శబ్దగతలింగము గాదు. మనుష్యగతములగు లక్షణములు. జనకునిచేత అరుంధతిని అట్లు స్తోత్రము చేయించినాఁడు. ఆయరుంధతిచేత సీతను ఇట్లు స్తోత్రము చేయించుచున్నాఁడు ఇందెల్ల సీతాదేవి, కారణవిశేషములచే ఎత్తిన లక్ష్మ్యవతారమే అనియు, మనుష్యభావమున నుండియు అరుంధతికి సయితము పూజనీయగుణములు గలదనియు భవభూతి భక్తితో చేయు పూజయే.

కౌసల్యా—అమ్హో ఉమ్మిల్లంతి వేఅణాఓ. [అహో! ఉన్మీలన్తి వేదనాః.] (ఇతి మూర్ఛతి)

జనకః—కష్టం! కిమేతత్?

అరున్ధతీ—రాజర్షే కిమన్యత్?

శ్లో॥ స రాజా తత్సౌఖ్యం స చ శిశుజన స్తే చ దివసా-
స్స్మృతా వావిర్భూతం త్వయి సుహృది దృష్టే త దఖిలం,
విపాకే ఘోరేఽస్మి న్నథ ఖలు విమూఢా తవ సఖీ.
పురన్ధ్రీణాం చేతః కుసుమసుకుమారం హి భవతి. ౧౦

---

'న చ లిఙ్గం నచ వయః' - చూ.
'తా మగౌరవభేదేన మునీంశ్చాపశ్యదీశ్వరః
స్త్రీ పుమానిత్యనాస్థైషా, వృత్తం హి మహితం సతామ్.'
కుమార - VI - 12.

క థాపి శస్త్రవ్యవహార నిష్ఠురే
విపక్షభావే చిర మస్య తస్థుషః
తులోప వీర్యాతిశయేన వృత్రహా.
పదం హి సర్వత్ర గుణై ర్నిధీయతే.
రఘు=III -62.

ధృత హేతి రప్యధృత జిహ్మమతి-
శ్చరితై ర్మునీ న ధరయంశ్శుచిభిః
రజయాంచ్చకార విరజాః సమ్పృగాక
కమి వేశతే రమయితుం న గుణాః.
భారవి. VI - 24.

ఉన్మీలన్తి వేదనాః=వేదనలు రేఁగుచున్నవి. ఈ ప్రస్తావములచేతను ఈ సంఘటనచేతను ఎట్లెట్లో పూర్వము అడంగియున్న దుఃఖభరము ఇనుమడిక పొంగి మూర్ఛ కలిగించినది.

శ్లో. ౧౦. సరాజేతి - సుహృది త్వయి=(తమకు) మిత్రమవైన నీవు, దృష్టే (సతి)=అగపడఁగా - నిన్ను చూడఁగా, స రాజా=ఆ మహారాజు, తత్ సౌఖ్యం= ఆ సౌఖ్యము, స శిశుజనః చ=ఆ రామసీతాదులు, తే చ దివసాః=ఆ దినములు, తత్ అఖిలమ్ = అది యెల్లను, స్మృతౌ = జ్ఞప్తియందు, ఆవిర్భూతం = పొడ చూపినవి. అథ=అంతట - అందువలన, అస్మిన్ ఘోరే విపాకే = ఈ భయంకర

జనకః—హన్త, హన్త, సర్వథా నృశంసోఽస్మి సంవృత్తః యోఽహం చిరస్య దృష్ట్వా ప్రియసుహృదః ప్రియాన్ దారాన్న స్నిగ్ధం పశ్యామి.

శ్లో॥ స సమ్బన్ధీ శ్లాఘ్యః, ప్రియసుహృదసౌ, తచ్చ హృదయం,
స చానన్దస్సాక్షాదపి చ నిఖిలం జీవితఫలమ్,
శరీరం జీవో వా యదధిక మతో వా ప్రియతరం,
మహారాజశ్శ్రీమాన్ కిమివ మమ నాసీద్దశరథః! ౧౧

---

మగు పరిణామమందు, తవ సఖీ=నీమిత్రము, ఈకౌసల్య, విమూఢా ఖలు=మూర్ఛిల్లినదిగదా. పురన్ధ్రీణాం = స్త్రీలయొక్క, చేతః = మనసు, కుసుమసుకుమారం భవతి హి=పూవువలె కోమలమగును గదా.

తమమిత్రమగు నిన్ను కనఁగానే, ఈమెకు ఆరాజు, ఆ ప్రమోదములు, ఆ బిడ్డలు, ఆదినములు, అవి అన్నియు స్మారితములైనవి. వానికల్ల, ఈభయంకరమైన మార్పు కలిగినది. దానంజేసి నీ సఖి మూర్ఛిల్లినది. స్త్రీలమనసు పుష్పకోమలము గదా.

'స్వజనస్య హి దుఃఖ మగ్రతో వివృతద్వార మివోపజాయతే' కుమార-అని కాళిదాసు అనెనుగదా.

రాముఁడును మునుపు అన్నాఁడుగదా-'జీవత్సు తాత పాదేషు నూతనే దారసంగ్రహే। మాతృభి శ్చిన్త్యమానానాం తేహి నో దివసా గతాః' అని అదే ఇది, ప్రకరణమునకుం దగిన మార్పు చెందినది.

నృశంసః=క్రూరుఁడను, న స్నిగ్ధం పశ్యామి=స్నేహముతో చూడనైతిని, ఉదాత్తప్రకృతి, జనకుఁడు అప్పుడే పశ్చాత్తాప పడుచున్నాఁడు.

శ్లో. ౧౧. స సమ్బన్ధీ ఇతి-సః-ఆయన, శ్లాఘ్యః సమ్బన్ధీ=(గుణములచే ప్రశంసగన్న=) దొడ్డవియ్యము; అసౌ = అతఁడు, ప్రియసుహృత్ = అనుంగు మిత్రము; తత్ చ హృదయమ్=అతండు (నాకు) హృదయమును, సః-అతఁడు, సాక్షాత్ ఆనన్దశ్చ=రూపుదాల్చిన హర్షము, అపి చ=మఱియు, (అతఁడు,) నిఖిలం=సమస్తమగు, జీవితఫలమ్=పురుషార్థమును, శరీరమ్=దేహమును, జీవః వా=ప్రాణమును, అతః=ఇంతకన్నను, యత్ అధికం ప్రియం వా=ఏది ఎక్కువ ఇష్టమైనదో ప్రీతిపాత్రమో అదియును. శ్రీమాన్ = సర్వసంపదలు కలిగియున్న, మహారాజః= దొడ్డరాజు, దశరథః=దశరథుఁడు, మమ=నాకు, కిమివ న ఆసీత్=ఏది కాఁడాయె!

కష్ట! మియ మేవ సా కౌసల్యా!

శ్లో। యదస్యాః పత్యుర్వా రహసి పరమం దూషిత మభూ-
దభూవం దమ్పత్యోః పృథ గహ ముపాలమ్భవిషయః,
ప్రసాదే కోపే వా తదను మదధీనో విధి రభూ.
దలం వా తత్స్మృత్వా! దహతి య దవస్కన్ద్య హృదయమ్.

---

ఆయన నాకు దొడ్డవియ్యము, ప్రియమిత్రము, నాకు ఆయన హృదయమే, సాక్షాదానందమే. సకలపురుషార్థమును, దేహమును, ప్రాణమును, అంతకన్నను ప్రియతరముండునేని అదియు ఆయనయే. శ్రీమన్మహారాజదశరథుఁడు నాకు ఏమి కాఁడాయె! అహో!

ఎంత వర్ణించినను ఏమి చెప్పినను తీఱని అత్తతయు అనుంగుతనమును జనకునికి దశరథునియందు గలదు అని చెప్పఁబడినది. దీనిచేత మునుపు వారెంత అన్యోన్య మిత్రులును బంధువులును ఐ మెలంగుచుండిరో సూచితము.

కష్టమ్=కష్టా! ఇయ మేవ సా, కౌసల్యా=ఈమెయే ఆ కౌసల్య.

శ్లో. ౧౨.–అస్యాః (వా)=ఈమెకు గాని, పత్యుః వా=భర్తకు గాని, రహసి=రహస్యమందు–మఱెవ్వరికి తెలియకుండ, పరమం=మిక్కిలి, దూషితమ్=తప్పిదము, యత్ అభూత్ = అయెనేని, దమ్పత్యోః = భార్యాభర్తలకు, పృథక్ = వేఱు వేఱుగా, ఒకళ్ళొకళ్ళపయి అనుట. అహం=నేను, ఉపాలమ్భవిషయః=ఎగ్గులు చెప్పుటకు పాత్రమును, అభూవమ్=ఐతిని. ఇరువురకు తుల్యమగు విస్రంభస్థానము. తదను=తరువాత. ప్రసాదే=కోపముతీఱుటయెడగాని, కోపేవా=కోపము కలుగుట యెడగాని, విధిః=చేయవలసినది, మదధీనః=నావశమునందున్నట్టిది, అభూత్=అయెను. వా=అథవా=అట్లేల? అదెందులకు? అట్లుగాదు. తత్ స్మృత్వా అలం=దానినెల్ల తలంచుకొనఁగూడదు, యత్=ఏలన, హృదయం అవస్కన్ద్య=(అదెల్ల, అస్మరణము అనుట) చిత్తమును ముట్టడించి, దహతి=కాల్చుచున్నది.

ఎప్పుడైనను ఈమెకుఁగాని భర్తకుఁగాని రహస్యమున తప్పిదము కలిగినట్లైన, ఈమె ఆయనమీఁదగాని ఈమెమీఁద ఆయనగాని తప్పులు–నిందలు–చెప్పుకొనుటకు నేనె ఇరువురకు నమ్మకమైనవాఁడనుగా నుంటిని. వారికి కోపము తీఱుటకుగాని కలుగుటకుగాని ఏమేని చేయవలసినవాఁడను నేన ఐయుంటిని. అయ్యొ ఎందులకు వచ్చినది ఆతలంపు! నామనస్సును పైకొని కాల్పఁదొడంగినది!

జనకదశరథుల యతి గాఢస్నేహము ఇందు చెప్పఁబడినది.

అరున్ధతీ—హా కష్టమ్! చిరనిరుద్ధనిశ్వాసనిష్ఠురం హృదయమస్యాః.

జనకః—హా ప్రియసఖి! (ఇతి కమణ్డలూదకేన సిఞ్చతి.)

కఞ్చుకీ—

శ్లో॥ సుహృదివ ప్రకటయ్య సుఖప్రదః
ప్రథమ మేకరసా మనుకూలతామ్,
పున రకాణ్డవివర్తనదారుణో
విధి రహో విశినష్టి మనోరుజమ్! ౧౩

కౌసల్యా—(సంజ్ఞాం లబ్ధ్వా) హా వచ్ఛే జాణఇ! కహం సి? సుమరామి దే వివాహళచ్ఛీ పరిగ్గహేక్కమణ్డనం పప్ఫురన్త సుద్ధవిహాసితం ముద్ధ ముహపుణ్డరీఅం; అ ఫురంత చంద చందిఆ సుందరేహిం అంగేహిం పుణావి మే జాతే ఉజ్జోఏహి ఉచ్ఛంగమ్. సవ్వఆ మహారాఓ భణాది, ఏసా రహుఉలమహత్తరాణాం వహూ, అహ్మాణం ఉణ జణఅ సంబంధేణ దుహిదా ఎవ్వ. (హా వత్సే జానకి! క్వాసి? స్మరామి తే వివాహలక్ష్మీపరిగ్రహైకమణ్డనం ప్రస్ఫురచ్ఛుద్ధవిహ

చిరనిరుద్ధనిశ్వాసనిష్ఠురమ్=చాలసేపు శ్వాసము నిలిచిపోయినందున కఠినమై యున్నది. శ్వాస యాడిన గుండె మృదువు. అది ఆఁగిన బండ.

శ్లో. ౧౩. సుహృదిత్యాది.- ప్రథమమ్=తొలుత, విధిః=విధి, సుహృత్ ఇవ=మిత్రమువోలె, సుఖప్రదః=సుఖములొసంగునదై, ఏకరసాం=మార్పులేకుండ ఒక్కతెఱంగు ఇంపు కలదైన, అనుకూలతాం = హితముచేయుటను, ప్రకటయ్య = ప్రకటించి, చూపి, పునః = పిదప, అకాణ్డవివర్తనదారుణః =తటాలున హేతువు లేని యే మార్పుచెందుటచే (-చెంది అనుట) ఘోరమై, మనోరుజమ్ = మనసులో వ్యథను, విశినష్టి=మిక్కిలిగా కలిగించును! అహో=అయ్యో!

విధి మొదట మిత్రమువలె సుఖముల నొసంగుచు ఏకతానమగు అనుకూలతను ప్రకటించును, తరువాత తటాలున ఎదురుతిరిగి అతిఘోరమై మనఃఖేదమును కలిగించును. అంతలో సుఖము అంతలో దుఃఖము కలిగించును. అయ్యో! ఈ విధి చాపలము కవికి ప్రియమైనందున, తుల్యసందర్భమున, మాలతిలోను ఈ శ్లోకమే చెప్పినాఁడు. సంజ్ఞాం లబ్ధ్వా-చైతన్యమును పొంది. వివాహలక్ష్మీ పరిగ్రహైక

సితం ముగ్ధ ముఖపుణ్డరీకమ్; అస్ఫుర చ్చన్ద్ర చన్ద్రికా సున్దరై రఙ్గైః పున రపి మే జాతే ఉద్ద్యోత యోత్సఙ్గమ్. సర్వదా మహారాజో భణతి ఏషా రఘుకులమహత్తరాణాం వధూః, అస్మాకం పున ర్జనక సమ్బన్ధేన దుహితైవ.)

కఞ్చుకీ— యథాహ దేవీ.

శ్లో॥ పఞ్చప్రసూతే రపి రాజ్ఞ ఆసీత్
ప్రియో విశేషేణ సుబాహుశత్రుః,
వధూచతుష్కేఽపి యథైవ శాన్తా
ప్రియా తనూజాస్య తథైవ సీతా. ౧౮

---

ముగ్ధం=పెండ్లికళ తాల్చుటయే గొప్పతోడవైనట్టిది - వేఱువగలు అక్కఱలేనిది అనుట. ప్రస్ఫురత్ = మిలతెంచుచున్న. అస్ఫురచ్చన్ద్ర చన్ద్రికాసున్దరైః=వెన్నెల నిగ్గులు వెదచల్లుచు అందముగా నున్న, మునుపును (I-13.)లో 'జ్యోత్స్నా ప్రాయైః ..అకృత మధురై రమ్బానాం మే కుతూహల మఙ్గకైః' అని కలదు గదా. ఆయమ్మయే ఇచట దానినే స్మరించుటం జెప్పుచున్నాఁడు. వధూః - దుహితైవ - అనుటచే వధువును (కోడలును) దుహితయు (కూఁతురును) ప్రీతిపాత్రములైనను లోకములో ఆవిషయమున ఎంతయో వాసి కలదు అని దానిని ఈ రామచరిత మందును చెప్పుచున్నాఁడు. జనకునకును దశరథునికిని తోఁబుట్టుచెలిమి అనుట. ఉద్ద్యోతయ ఉత్సఙ్గమ్=ఒడిని అలంకరింపవే. ఎంతవయసుదానినో సీతను కౌసల్య ఒడిలో కూర్చుండఁబెట్టుకొనెడిది. అనఁగా అంతప్రీతి. ఒడిలో కూర్చుండబెట్టుకొనకున్న కౌసల్యకు తృప్తికలుగునది గాదు. అట్లే 'అఙ్కే భరత మారోప్య ముదితః పరిషస్వజే' అని రాముఁడు భరతుని ఒడికి ఎక్కించుకొన్నాఁడన్నాఁడు వాల్మీకి. అరుంధతి ఉమను పెండ్లిపేరమున ఒడిలో కూర్చుండఁబెట్టుకొన్నది అన్నాఁడు కాళిదాసు.

శ్లో. ౧౮. పఞ్చ ఇతి - పఞ్చప్రసూతేః అపి=ఏవురు బిడ్డలు గలవాఁడైనను రాజ్ఞః=దశరథునికి, సుబాహుశత్రుః = సుబాహునిచంపినవాఁడు రాముఁడు, విశేషేణ ప్రియః=మిక్కిలి వల్లభుఁడు, ఆసీత్=ఆయెను. వధూచతుష్కే అపి=నలుగురు కోడండ్రలోను, అస్య=ఆయనకు, యథా=ఎట్లు, శాన్తా=శాన్త, ప్రియా తనూజా= అనుంగుకూఁతురో, సీతా తథా ఏవ హి=సీతయు అట్లేకదా (ఆయెను.)

రాజునకు బిడ్డలు ఏవురైనను, అందఱిలో రాముఁడు ఎక్కువ ప్రియుఁడు.

జనకః—హా ప్రియసఖ మహారాజ దశరథ! ఏవ మపి సర్వ ప్రకార హృదయఙ్గమః; కథం విస్మర్యసే!

శ్లో॥ కన్యాయాః కిల పూజయన్తి పితరో జామాతురాప్తం జనం;
సమ్బన్ధే విపరీత మేవ తదభూ, దారాధనం తే మయి;
త్వం కాలేన తథావిధో ప్యపహృతః, సమ్బన్ధ బీజం చ తద్;
ఘోరేఽస్మి న్మమ జీవలోక నరకే పాపస్య ధిగ్జీవితమ్! ౧౫

అట్లే కోడండ్రు నలువురిలోను సీత అనుఁగుకూతురైన కారణమున మిక్కిలి ప్రియయయ్యెను.

ఇందు కోడలియెడ మామవృత్తము చెప్పఁబడినది. అట్టి ప్రీతి.

కంచుకి ముసలివాఁడు, చిరకాలముగా ఆయింటి యనుభవము గలవాఁడు, విశేషముగా అంతఃపురచరుఁడు, కావున, ఈ భేదమును అరసి చెప్పుచున్నాఁడు.

సర్వప్రకారహృదయఙ్గమః = ఎల్లతెఱంగుల మనస్సునకు ఆనందము కూర్చువాఁడవు. కథం విస్మర్యసే=ఎట్లు మఱపునకు వత్తువు!

శ్లో. ౧౫. కన్యాయాః – ఇతి–కన్యాయాః=కన్యయొక్క, పితరః=తండ్రులు. జామాతుః=అల్లునియొక్క, ఆప్తంజనం=ఆప్తులైన వారిని – కావలసినవారిని, పూజయన్తి కిల=గౌరవింతురుకదా. సమ్బన్ధే=(మన)వియ్యమున, తత్=అది, విపరీతమ్ ఏవ=విపరీతముగానే, అభూత్=ఆయెను. (ఎట్లనఁగా) తే=నీకు, మయి=నాయెడ, ఆరాధనమ్=పూజ, మిక్కిలి గౌరవము. తథావిధః త్వమ్=అట్టివాఁడవగు నీవు, కాలేన=మృత్యువుచేత, లేక విధిచేత, అపహృతః=కొంపోఁబడితివి; సమ్బన్ధబీజం=వియ్యమునకు విత్తనము – మూలము, ఐన, తత్ చ=అదియు – సీతయు అనుట, అపహృతమ్=పోనేపోయినది, విధి కొనిపోయినది, లేకుండఁజేసినది – సీత క్రవ్యాదవిలుప్తయయ్యె మటెట్లో చనిపోయినది, అని జనకునితలంపు, విశ్వాసము. అస్మిన్=ఈ, ఘోరే=భయంకరమైన, జీవలోకనరకే=నరకమువలె నైపోయిన జగమునందు, పాపస్య మమ=పాపాత్ముఁడనైన నాయొక్క, జీవితమ్ ధిక్=బ్రదుకు నింద్యమైపోయినది, ఇదీ.

లోకమున వధూపితలు అల్లుని యాప్తజనమును మిక్కిలియు గౌరవింతురు కదా. ఆ దొడ్డగూడనము ఈవియ్యమునందు విపరీత మాయెను. ఎట్లనఁగా నాయెడ నీకు అతిమాత్రమగు ఆరాధనము ఉండెను. అట్టి నిన్ను కాలము కొంపోయెను. ఆ వియ్యపుబీజమును అపహృతమయినది. నరకాభీలమగు నీలోకమున పాపాత్ముఁడనగు నా జీవితమిదేల, ఇదీ!

జనకుఁడు జ్ఞాని, వేదాంతి. దశరథుఁడు దొడ్డరాజు. కావున ఆ విపరీతత ఆ పూజనము, ఇందు వియ్యమందినవారు అన్యోన్య మెట్లుండవలయునో ఉపన్యస్తము.

కౌసల్యా—జాదే జాణఇ! కిం కరేమి? దిఢ వజ్జలేవ ఘడిఅ బంధ ణిచ్చళం హదజీవిదం మం మందభాఇణిం ణ పడిచ్చ అఇ. [జాతే జానకి! కిం కరోమి? దృఢవజ్రలేప ఘటిత బన్ధనిశ్చలం హతజీవితం మాం మన్దభాగినీం న పరిత్యజతి.]

అరున్ధతీ—ఆశ్వసిహి రాజపుత్రి! బాష్పవిశ్రామోఽప్యన్తరేషు కర్తవ్య ఏవ. అన్యచ్చ: కిం న స్మరసి యదవోచ దృశ్యశృఙ్గాశ్రమే యుష్మాకం కులగురుః? తదుపజాత మేవ. కింతు కల్యాణోదర్కం భవిష్యతి.

---

జాతే=బిడ్డా, హతజీవితమ్=పాడుజీవితము - ప్రాణము - వజ్రలేపం=వజ్రమని యొక బంధకద్రవ్యము - దానిపూఁత. బాష్పవిశ్రామః=బాష్పములను ఆఁపుకొనుట. అన్తరా=నడుమనడుమ. అన్యత్ చ=ఇంకొకటియు - అదిగాక. అదియేది అనఁగా 'ఋశ్యశృఙ్గాశ్రమే యుష్మాకం కులగురుః యత్ అవోచత్' - ఋశ్యశృంగాశ్రమమున మీకులగురువు ఏదియో చెప్పెనే, అది.

సీతావివాసము విని కౌసల్య శోకింపఁదొడంగఁగా, పర్వాలేదు లే, ఇట్లిట్లు జరుగఁగలదు, అని యూఱట పలికియుండెను, కులగురువు. ఎట్లెట్లో ఊహించుకొనవలసియున్నది. సీత బిడ్డలైనను దొరకుదురులే అని యుండునా? ఈయరుంధతి కౌసల్యభాషితములు కాఁగానే లవప్రవేశమునకు అవకాశము కల్పించు నటు కలకలము, ఒకవిధముగా పాత్రసూచనంబోలినది కలదు. 'తదుపజాతమేవ' అనఁగానే ఈకలకలము! వసిష్ఠభాషితము ఇదే. 'తదుపజాత మేవ, కింతు కల్యాణోదర్కం భవిష్యతి' అను పాఠముంగాని 'తత్' అనఁగా 'ఏదియో దుర్దైవమహిమవలని ఆసీతావివాసము' అని అర్థము చెప్పుటకు అవకాశము అగపడదు. 'వసిష్ఠులవారు చెప్పినది రానేవచ్చినది' అనుటయే నాటకశైలికి యుక్తము.

తత్ ఉపజాతమ్ ఏవ=అది రానేవచ్చినది, కింతు=మఱేమన, కల్యాణోదర్కం=మేలు భావిఫలముగాఁ గలది - మేలొసంగునది. కులగురువు ఏమి చెప్పెనాఁడు? ఎట్లో సీతాపునఃసమాగమము కలుగుననియా? వాల్మీకి తపోవనము చెంగట కదా సీతను రాముఁడు త్యజింపించినది? అచటికి పోవుదము అని వసిష్ఠుఁడు అందఱిని అక్కడికి తరలించినాఁడు. సీత అగపడినను అగపడవచ్చును, సీతబిడ్డలు అగపడినను అగపడవచ్చును - అని కులగురువు ప్రత్యాశ పలికియుండెఁగాబోలు. వారు ఇచటికివచ్చి చాల కొద్దికాలమే ఐనది. కొన్ని గడియలు. ఐనను వివా

కౌసల్యా—భఅవది అదిక్కంతో మణరహో. [భగవతి, అతిక్రాన్తో మనోరథః.]

అరున్ధతీ—తత్కిం మన్యసే రాజపుత్రి, మృషోద్యం త దితి? న హీదం సుక్షత్రియే౽న్యథా మన్తవ్యం, భవితవ్య మేవ తేన.

శ్లో॥ ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం
యే వ్యాహారా స్తేషు మా సంశయో౽భూత్,
భద్రా హ్యేషాం వాచి లక్ష్మీ ర్నిషక్తా
నైతే వాచం విప్లుతాం వ్యాహరన్తి. ౧౮

---

సము జరిగి పన్నెండేండ్లయినది. ఈ కొద్దికాలమున ఏమియు కౌసల్యాదులకు అగపడలేదు. చిత్తము నిరాశాదూనముగా నున్నది. కాళిదాసు దుష్యంతునిచేత 'అసన్నివృత్త్యై త దతీత మేవ' అనియు, 'మనోరథాయ నాశంసే' అనియు పలికించినట్లు ఇట భవభూతి కౌసల్యచే 'అతిక్రాన్తో మనోరథః' అని పలికించినాఁడు. తత్ = అట్లైన, తత్ మృషోద్యం మన్యసే కిమ్=అది అసత్యపుఁబలుకు అని తలంతువా? సుక్షత్రియే=గొప్పయింట పుట్టినదానవు, మెట్టినదానవు. గురువాక్యమందు అవిశ్వాసము తగదు. అందును, వసిష్ఠవాక్యమందు. భవితవ్య మేవ తత్ =అది తప్పక జరుగునదే. వెంటనే కలకలము వినఁబడుట, లవుఁడు అగపడుట - వసిష్ఠవాక్యంలోని ప్రత్యాశ ఫలించుటకు సూచకము కాఁబోలు. ఆవాక్య దీనిం గూర్చినదే అగునా?

శ్లో. ౧౮. ఆవిర్భూతేతి - ఆవిర్భూతజ్యోతిషాం = పొడమిన జ్యోతి కలవారైన (=జ్యోతి పొడమినవారైన,) అనఁగా బ్రహ్మసాక్షాత్కారముగలవారైన, బ్రాహ్మణానాం=బ్రాహ్మణులయొక్క, యే వ్యాహారాః=ఏ పలుకులుగలవో. తేషు= వానియందు, సంశయః మా భూత్ =సందియము కలుగకుండునుగాక, హి=ఏలన, ఏషాం వాచి=వీరి వాక్కున, భద్రా లక్ష్మీః=శుభలక్ష్మి, నిషక్తా= వెలయుచుండును. ఏతే=వీరు, విప్లుతాం వాచం = అర్థము తప్పిపోయినమాటను; అసత్యమును, న వ్యాహరన్తి=పలుకరు.

పరంజ్యోతి సాక్షాత్కరించుకొన్న బ్రాహ్మణుల వాక్కులందు అవిశ్వాసము తగదు. వారి వాక్కున శుభలక్ష్మి వెలయుచుండును. వారు ఎన్నఁడును అసత్యమాడరు. వారిమాట తప్పదు.

భవభూతి కూర్చిన యీ యరుంధతివాక్య చెవులకు వేదమువలె వినఁబడుచున్నదిగదా. అట్లే కుమారమున III - 63. 'న హీశ్వరవ్యాహృతయః కదాచిత్ పుష్ణన్తి లోకే విపరీత మర్థమ్.' చూ. I. 8. 'లౌకికానాం' ఇత్యాదియు.

(నేపథ్యే కలకలః,) (సర్వే ఆకర్ణయన్తి)

జనకః—అద్య ఖలు శిష్టానధ్యయన మిత్యస్ఖలితం ఖేలతాం వటూనా మయం కలకలః

కౌసల్యా—సులహసోక్ఖం దావ బాళత్తణం హోది. (నిరూప్య.) అహ్మహే! ఏదాణం మజ్ఝే కో ఏసో రామభద్దలచ్ఛీ పరిసోహిదేహిం సావట్ఠంభ ముద్ధ లళిదేహిం అఙ్గేహిం అహ్మాణం లోఅణాఇం సీఅళావేఇ. [సులభసౌఖ్యం తావత్ బాలత్వం భవతి. అహో ఏతేషాం మధ్యే క ఏషః రామభద్ర లక్ష్మీపరిశోభితైః సావష్టమ్భ ముగ్ధ లలితై రఙ్గైః అస్మాకం లోచనే శీతలయతి?]

అరున్ధతీ—(స్వగతం సహర్ష బాష్పం) ఇదం నామ త, ద్భాగీరథీ నివేదితం, కర్ణామృతం. న త్వేవం విద్మః కతరోఽయ మాయుష్మతోః కుశలవయో రితి.

---

శిష్టానధ్యాయః=శిష్టులు వచ్చినారని, వారిరాకను గౌరవించుటకుగా అనధ్యాయము-చదువుమానుట అటవిడుపు. ఇట్టిదిపాఠశాలలలో ఈ దినాలలోను కలిగినదే-గవర్నరు వచ్చినాఁడని, మంత్రి వచ్చినాఁడని సెలవొసంగుదురు గదా. ఆదినమున పిల్లకాయలు ఎక్కువగా ఆటలాడుచుందురు. ఉద్ధతం ఖేలతాం=అడ్డులేక ఆడుకొనుచున్న, కలకలః=కలకలధ్వని-కోలాహలము. రామభద్రలక్ష్మీ పరిశోభితైః=రామభద్రునిశోభతో-కలకలలాడు అందముతో-మిక్కిలియు అందగించుచున్న-ప్రకాశించుచున్న, సావష్టమ్భ=వీడని, ఉదారములైన, ముగ్ధలలితైః=అందముగాను, (శైశవమునకు తగినట్లు) కోమలముగాను ఉన్న, లోచనే శీతలయతి=కన్నులను చల్లఁజేయుచున్నాఁడు-ఆప్యాయనము కలిగించుచున్నాఁడు. బాలరాముని చూచినట్లున్నది. ఇదం నామ=ఇది గదా-భాగీరథీనివేదితమ్=భాగీరథిచే ఎఱింగింపఁబడిన-భాగీరథి అరుంధతికి ఎప్పుడు ఎక్కడ ఎట్లు నివేదించినది, ఈరహస్యమునుకి వివాసనసమయమునను, ప్రసవసమయమునను, వాల్మీకికి ఒప్పగించుసమయమునను అరుంధతి ఋష్యశృంగాశ్రమమున నుండెనే! దేవతయామె అదృశ్యగా తానే కాని, మఱియొక నదీదేవతచేతగాని, దేవతలకును

జనకః—

శ్లో॥ కువలయదళ స్నిగ్ధశ్యామ శ్శిఖణ్డక మణ్డనో
వటుపరిషదం పుణ్యశ్రీక శ్శ్రియైవ సభాజయన్.
పునరివ శిశు ర్భూతో వత్స స్స మే రఘునన్దనో
ఝటితి కురుతే దృష్టః కోఽయం దృశో రమృతాఞ్జనమ్? ౧౭

---

పూజ్యయగు అరుంధతికి తెలియఁజేసియుండునని దీనిచే ఊహింపఁదగును. కావున కుశలవజననమును వారు వాల్మీకియాశ్రమమున ఉండుటయు అరుంధతికి (వసిష్ఠునికిని) తెలియును. కావుననే వసిష్ఠులవారు వాల్మీకి తపోవనమునకుం బోయి అట వసింప నిశ్చయించుకొనుట - అని తలంపవలయును. వారు కౌసల్యాదులకుం జెప్పమి దేవరహస్యరక్షణమునకును - వాల్మీకులవారో ఎవరో పునః సంయోగమునకు ఎట్లో ఏర్పాటు గావించుచుండుటను అట్లు రక్షింపఁదగును - అనియు. ఆయుష్మతోః దీర్ఘాయువులలో - చిరంజీవులలో - అళీగర్భముగా పెద్దవారు చిన్నవారింగూర్చి సంబోధించి నిర్దేశించు నాచారపు మాట.

శ్లో. ౧౭. కువలయేతి - కువలయదలస్నిగ్ధశ్యామః = కలువరేకులవలె నిగనిగని చామనచాయవాఁడు, శిఖణ్డకమణ్డనః = (వటువునకు తగిన) జుట్టే ఆభరణముగా గలవాఁడు, జుట్టుచేత నందముగా నుండువాఁడు, పుణ్యశ్రీకః = పవిత్రమైన కాంతి గలవాఁడు, శ్రియా = (ఆ - తన -) అందపుఁగాంతిచేతనే, వటుపరిషదం = (తోడి) వటువులగుంపును, సభాజయన్ ఇవ = సంతోషపెట్టుచుంబోలె నున్నవాఁడు, పునః = మరల, మే స వత్సః = ఆ మా గారాబు అబ్బాయి, రఘునన్దనః = రాముఁడు, శిశుః భూత ఇవ = శిశువైనాఁడో యన నుండువాఁడు, దృష్టః = అగపడఁగానే, ఝటితి = చటన, దృశోః = కన్నులకు, అమృతాఞ్జనమ్ = అమృతంపుఁబూఁతను, కురుతే = చేయుచున్నాఁడు. అయం కః = వీఁ డెవఁడో!

వీఁ డెవఁడోగదా! కలువరేకులవలె అంగములు చామనగా నిగనిగలాడుచున్నవి; జుట్టే (ఆ మొగమునకు) ఒక యలంకారముగా నున్నది; (వటు వగుటచే) పవిత్రపుఁగాంతి వానిచుట్టును వ్యాపించుచున్నది; దాన తోడి వడుగులగుంపునకు సమ్మదము కూర్చుచున్నాఁడు. వారికి అందఱికి వానిమీఁద స్నేహగౌరవములు. మాయబ్బాయి శ్రీరామచంద్రుఁడే మరల శిశువైనాఁడా యనఁదోఁచుచు అగపడినమాత్రకే కన్నుల నమృతాంజనము పెరపుచున్నాఁడు!

కఞ్చుకీ—క్షత్త్రియ బ్రహ్మచారీ దారకోఽయ మితి మన్యే.
జనకః—ఏవ మేతత్. తథా హి.

శ్లో॥ చూడాచుమ్బితకఙ్కపత్ర, మభిత స్తూణీద్వయం పృష్ఠతో;
భస్మస్తోక పవిత్రలాఞ్ఛన మురో ధత్తే త్వచం రౌరవీమ్;
మౌర్వ్యా మేఖలయా నియన్త్రిత మధోవాసశ్చ మాఞ్జిష్ఠకం;
పాణౌ కార్ముక, మక్షసూత్రవలయం, దణ్డం తథా పైప్పలమ్.

---

వటువుగా శ్రీరాముఁడు విశ్వామిత్రుని వెంట జనకుని యింటికి పోయినాఁడు. 'శిఖణ్డక ముగ్ధ ముఖమణ్డలః - దళన్నీలోత్పల శ్యామల మసృణః... విస్మయ స్తిమిత తాతదృశ్యమాన సౌమ్యసుందరశ్రీః' అని చిత్రదర్శనమున ప్రస్తావింపఁబడినాఁడు. మాటిమాటికి ఈవర్ణనచే రాముని భవభూతి అనుభవించుచున్నాఁడు. వటుపరిషదం సభాజయత - తోడివడుగు లందఱికి అతనిమీఁదనే కన్ను - అతఁడు ఎట్లు చెప్పిన అట్లు చేయుచు ప్రీతితో పరివేష్టించియున్నారు. వారికి వాఁడే మొనగాఁడు. దారకః=బాలుఁడు.

శ్లో. ౧౫. చూడేతి. - పృష్ఠతః = వీపున, అభితః = ఇరువైపుల, చూడాచుమ్బిత... త్రమ్=జుట్టుచే ముద్దుగొనఁబడుచున్న - అనఁగా జుట్టుకు తగులుచున్న - బాణాల యీకెలు గల, తూణీద్వయమ్ = పొదులజంట, (కలదు అని శేషము) ఉరః=వక్షము, భస్మ స్తోక పవిత్ర లాఞ్ఛనమ్ = రవంత విభూతియు - అనఁగా విభూతిగుఱుతును, యజ్ఞోపవీత పుగుఱుతును - వడుగు లక్షణము - కలిగినదై, రౌరవీం త్వచమ్ = రురువను మృగముయొక్క, అజినమును = తోలును, ధత్తే = తాల్చియున్నది; మాఞ్జిష్ఠకం=ఎఱ్ఱనిదైన, అధోవాసః చ=మొలకు కట్టుకొన్న వస్త్రము, మౌర్వ్యా=మూర్వయనుతీగతో చేయఁబడిన, మేఖలయా=మొలకట్టుచేత - వస్త్రపుఁ గట్టును బిగించుకొను సాధనముచేత, నియన్త్రితమ్ = బిగింపఁబడియున్నది. పాణౌ=చేతియందు, కార్ముకం=విల్లును, అక్షసూత్రవలయం = వలయముగా చేసికొన్న అక్షసూత్రమును - జపమాలయు, అపరః=మఱియొకటి - అనఁగా - మఱియు, పైప్పలః దణ్డః=రావికఱ్ఱయు - (ఉన్నది - అని శేషము.)

వీపున ఇరువైపుల నిడుపాటి యమ్ములపొదులున్నవి. ఆ యమ్ముల యీకలు వానిజుట్టునకు తగులుచున్నవి. ఱొమ్మున రుర్వ్యజినము - జందెము - విభూతిపూత ఉన్నది. మొలకు (ఎఱ్ఱని) కావివస్త్రపు దట్టి; అది మూర్వి మొలత్రాటితో బిగింపఁబడియున్నది. చేత విల్లు, రావికోల. వలయాభరణమువలె నున్న జపమాలయు నున్నవి.

భగవ త్యరున్ధతి, కి ముత్ప్రేక్షసే కుతస్త్యోఽయ మితి!
అరున్ధతీ—వయ మద్యైవ వాగతాః.

---

మహావీరచరితమున బాలరామునింగూర్చియు ఇదేశ్లోకము గలదు - I - 13. శ్లోకమున - ంద్వయం, ఊరః, త్వచం, వాసః, కార్ముకమ్ - దణ్డమ్ - అని అన్నిటిని ద్వితీయలుగా 'ధత్తే'కు కర్మలుగా, ఒక్కవాక్యముగా అన్వయించుట మందమగును - వర్ణనక్రమమున. వీపున అట్లున్నది, రొమ్మున ఇట్లున్నది; మొలలో అట్లు, చేత ఇట్లు - ఉన్నది - అని చెప్పుట మెఱుఁగు. అభితః - ఇరుపైపుల - రెండు అనుటచే సవ్యసాచిత - విలుకానితనమున విశేషము, తోఁచును. భస్మస్తోక - 'స్తోమ' (= మొత్తము) అనుటకన్న 'స్తోక' అన్న పాఠమే శ్రేయము - విభూతిపూతం జెప్పుట తన మతమందలి యభిమానముచే లవుని ఆమతమువానింగా గొనుట. వాల్మీకి వసిష్ఠ జనకరామాదుల కందఱికి భవభూతి - భూతి తన పేరనే కలవాఁడు - భూతిని భావించును. అది వర్ణాశ్రమస్ఫోరకము గాదు. దానికి బదులు 'నామము'ను కావచ్చును - విష్ణువైన రాముని కొమారుఁడు లవుఁడు వైష్ణవుఁడు, తిరుమణి పెట్టుకొన్నవాఁడుగాను, భావింపఁదగును. ఇంకను వేఱు తెఱంగుగాను భావింపఁదగును. మన దేశమున బొట్టు పెక్కురకములు. ఇట చెప్పఁబడినది ఉర మందలి బూది కాని, నొసటియందలిది కాదు. 'పవిత్ర' = జందెము - బ్రాహ్మణులకు ప్రత్తినూలుతో, క్షత్త్రియులకు జనపనూలుతో, వైశ్యులకు గొఱ్ఱె - మేక - వెండ్రుకల పోగులతో జందెము నిర్మింపవలయును. 'పవిత్రం' అన్నమాటకు ఒకనిఘంటువున 'జనప'పోగుల జందెమునకే పేరని కలదు. ఇవన్నియు క్షత్త్రియవటు లింగములు. 'త్రేతాయాం గౌతమాః స్మృతాః' అని యున్నది. రామచరితము త్రేతది. 'కృష్ణరురుబస్తాజినాని'- ఏతాని క్రమేణ ఉత్తరీయాణి. 'మౌఞ్జీజ్యామౌర్వీసౌత్ర్యో మేఖలాః క్రమేణ.' 'కాషాయమప్యేకే వార్క్షం బ్రాహ్మణస్య మాఞ్జిష్ఠహారిద్రే ఇతరయోః' 'ఆశ్వత్థపైలవౌ శేషే!' (శేషే క్షత్త్రియవైశ్యవిషయే.) ఐనను అక్షసూత్రవలయ మెందుకో? అకారాదిక్షకారాన్తః అక్షః, తత్క్లృప్తం తత్ప్రతినిధిభూతం వా సూత్రం మాలా అక్షసూత్రమ్. జపమునకైన మాల - 'గురోః కర్మశేషేణ జపేత్.' గురుశుశ్రూషాతిరిక్తకాలే జపం కుర్యాత్. ఏవం చ జప ఏవ అస్య విశిష్టం ధర్మసాధనమ్ అని గౌతమసూత్రమున నైష్ఠికబ్రహ్మచారికి జపము ప్రధానముగా చెప్పఁబడియున్నది. ఐనను సామాన్య బ్రహ్మచారికిని అది కొంత తగును కాఁబోలు.

కుతస్త్యః అయం=ఎక్కడివాఁడు వీఁడు, ఎవరికుఱుఁడు (ఎవరికి జన్మించినవాఁడు) - కిం ఉత్ప్రేక్షసే = ఏమని తలంతువు? ఊహింతువు? అద్యైవ ఆగతావయమ్ = మేము ఇప్పుడే వచ్చినారము. అది నిజమే. ఐనను ఆమె ఎఱుఁగునుగదా.

జనకః—ఆర్యగృష్టే ఉతీవ కౌతుకం మే వర్తతే; తద్భగవన్తం వాల్మీకి మేవ గత్వా పృచ్ఛ, ఇమం చ దారకం బ్రూహి వత్స కే ప్యేతే ప్రవయస స్త్వాం దిదృక్షవ ఇతి.

కఞ్చుకీ—యథాజ్ఞాపయతి. (ఇతి నిష్క్రాన్తః)

కౌసల్యా—కిం భణాహ, ఏవ్వం భణిదో ఆఅమిస్సది త్తి? [కిం భణథ ఏవం భణిత ఆగమిష్యతీతి.]

జనకః—భిద్యేత వా సద్వృత్త మీదృశస్య నిర్మాణస్య.

---

మతి ఇట్లు పులిమిపుచ్చుచున్నది, అంతటియామె, దేవరహస్య మని. నిర్వృత్త మాంసాతిథ్యమునకు ఇంచుకముందు ఆదినమే, వసిష్ఠులవారికి కపిలను 'మడమడాయించు' నాతిథ్యము పెట్టినారు. కావున జనకుఁడు వచ్చినదినమే వసిష్ఠాదులు వచ్చినారు. కావున సులువుగా తోఁచుకొనకుండ అరుంధతి ఇట్లు సమాధానము పలికినది. ఎఱిఁగియు అరుంధతి ఇట్లనుట బొంకుట కాదా యనిన భాగీరథీ వాల్మీక్యాదులు మంగళపర్యవసానమునకై చేయు ప్రయత్నములకు రహస్యరక్షణము కొంత కాలము వలయును. ప్రయత్నపరులలో రహస్యముగా వసిష్ఠారుంధతులు కూడ చేరియుండఁబోలును. అందులకే వారు వాల్మీకియాశ్రమమునకు వచ్చినారు. 'స చ మునిరనుయాతారుంధతీకో వసిష్ఠః' అని తమసావాసంతులు తమ మంగళాకాపనమున నిర్దేశించినారు. అతీవకౌతుకం = కడుం గుతూహలము. ప్రవయసః = వృద్ధులు, దిదృక్షవః=చూడఁగోరుచున్నారు. కిం భణథ ఏవం భణితః ఆగమిష్యతీతి? అట్లు చెప్పిన వచ్చుననియెదరా? ఈ వాక్యముచే కౌసల్యకుతూహలము అంతకన్నను ఎక్కువయని సూచితము. వాక్యము తీరున కరము స్త్రీ సులభముగ నున్నది. భిద్యేత వా సద్వృత్తమ్=మంచినడవడి తప్పునా? ఈదృశస్య నిర్మాణస్య=ఇట్టి నిర్మాణమునకు, అనఁగా ఇట్టి (సౌమ్యమగు) ఆకారమునకు. 'యత్రాకృతి స్తత్ర గుణా వసన్తి' అని సాముద్రికులు అనుట కలిగినదే. చూ.

న హ్యాకృతిః సుసదృశం విజహాతి వృత్తం. — మృచ్ఛకటి — IX.
న తాదృశా ఆకృతివిశేషా గుణవిరోధినో భవన్తి. — శాకుం — IV.
పేయ మాకృతి ర్న వ్యభిచరతి శీలమ్. — దశకుమార — VI.
భిద్యతే న సద్వృత్తం ఇక్ష్వాకుగృహేషు. — మహావీర — VI.

కౌసల్యా — కహం! సవిణఅ ణిసమిద గిట్ఠివఅణో విసజ్జిద ఇసి దారఓ ఇదో౽హిముహం పసరిదో ఏవ్వ సో వచ్ఛో. [కథం సవినయ నిశమిత గృష్టివచనో విసృష్ట ఋషిదారక ఇతో౽భిముఖం ప్రసృత ఏవ స వత్సః.]

జనకః — (చిరం నిర్వర్ణ్య.) భోః కిమ ప్యేతత్!

శ్లో॥ మహిమ్నా మేతస్మి న్వినయశిశుతా మౌగ్ధ్యమసృణో
విదగ్ధై ర్నిర్గ్రాహ్యో, న పున రవిదగ్ధై, రతిశయః.
మనో మే౽సమ్మోహస్థిర మపి హర త్యేష బలవా,
నయోధాతుం యద్వ త్పరిలఘు రయస్కాన్తశకలః. ౧౯

---

కథం=ఏమి! _ ఆశ్చర్యార్థకము. ౦నిశమిత = వినఁబడిన, ఇతో౽భిముఖం = ఇటు మొగమై, ప్రసృత ఏవ=రానే వచ్చుచున్నాఁడు. చిరం నిర్వర్ణ్య - 'చిరం' అనుటను పరికింపఁదగును. చాల ఆశతో అక్కఱతో ఆశ్చర్యముతో ఈనిర్వర్ణించుట _ పరికించి చూచుట. భోః కిమపి ఏతత్ =అహో ఇదేమోగాని!

శ్లో. ౧౯. మహిమ్నాం ఇతి _ ఏతస్మిన్ =ఇతనియందు, వినయశిశుతామౌగ్ధ్యమసృణః = అడఁకువ, పసితనము, కపటము లేఁకమి అనువానితో పరిశోభలమైన, మహిమ్నాం అతిశయః=మహిమల (=ప్రభావముల) హెచ్చు, విదగ్ధైః= నేర్పరుల చేత, నిర్గ్రాహ్యః = చక్కఁగా తెలియఁగఁబడదగును. అవిదగ్ధైః = నేర్పుచాలని వారిచేత, పునః=అన్ననో, న (నిర్గ్రాహ్యః)=తెలియఁగఁబడనేరదు. మే మనః = నామనస్సును, అసమ్మోహస్థిరం అపి = అసమ్మోహమును _ మోహము (=రాగము) లేనిదియు, చలింపనిదియు నైనదానిని సయితము, మోహములేమిచే చలింపకయున్నదానినే, ఏషః=ఈతఁడు, బలవాన్ =బలముగలవాఁడై _ బలాత్కారముగా, అయోధాతుం= ఇనుపలోహమును, పరిలఘుః=మిగులచిన్నదియగు, అయస్కాన్తశకలః=సూదంటు రాతితునుక, యద్వత్ = ఎట్లో అట్లు, హరతి = హరించుచున్నాఁడు.

ఈ బాలునియందు వినయము బాల్యము అన్నెము పున్నెము ఏమియు నెఱుఁగనితనము ఇవన్నియు నాజూకుగా మంజులముగా మెండుకొని ఒక యసాధారణత కలిగియున్నవి. దానిని నేర్పరులు సరిగా కనిపట్టఁగలరు కాని ఇతరులకు అది అలవి పడదు. నామనసు వీతరాగమైనట్టిది, మోహము తీఱినట్టిది, ఒకపాటికి చలించునది కాదు. అట్టిదానిని బలత్కారముగా _ ఊరక అగపడినమాత్రకే _ సూదంటురాతితునుక యినుప ముద్దనుం బోలె, ఆకర్షించుచున్నాఁడు.

లవః—(ప్రవిశ్య స్వగతమ్) అజ్ఞాతనామ క్రమాభిజనాన్ పూజ్యానపి సతః కథ మభివాదయిష్యే? (విచిన్త్య) అయం పున రవిరుద్ధః ప్రకార ఇతి వృద్ధేభ్య శ్శ్రూయతే, (సవినయ ముపసృత్య) ఏష వో లవస్య శిరసా ప్రణామపర్యాయః.

---

అట్లే వీరచరితలో రామునిగూర్చి పరశురాముఁడు - 'అహో పర గుణోత్కర్ష తత్త్వేఽపి పరిమాణగ్రాహి సౌజన్యపూతం అన్తఃకరణ మస్య రాజన్యపోతస్య. పారమార్థిక వినయ దుర్విభావ్యో నిపుణబుద్ధిగ్రాహ్యో మహా నహంకారగ్రన్థిః. ఇందు అహంకారాతిశయము; మఱి అందు మహిమాతిశయము.

'యత్రాకృతి స్తత్ర గుణా భవన్తి'-అన్నట్లు. మసృణః=స్నిగ్ధమైనది - నాజూకైనది - అడవిలో పుట్టి పెరుఁగు మునిబాలురయెడ నుండనిది. 'మనో మేఽ సమ్మోహస్థిర మపి హరత్యేష బలవాన్' అనుపాఠము రసవంతము, శ్రేయము. ఏషః - అని అబ్బాయిని ఎదుట చూచుచు, చూపుచుంబోలె చెప్పుట. సూదంటు తునుకయు పెద్దయినుప ముద్దను నెట్టన లాగును.

తొలిదర్శనమున మాలతి మాధవుని అటు లాగినదట. సా మమ దర్శనాత్ ప్రభృతి అమృతవర్తి రివ చక్షుషోః నిరతిశయ మానన్ద ముత్పాదయన్తీ అయస్కాన్తమణి శలాకేవ లోహధాతు మన్తఃకరణ ముపసంహృతవతీ! మాలతి. I. అసమ్మోహస్థిరం - మనస్సునకు విశేషణము. కావుననే ఇనుపముద్దవలె నున్నది. తొలుతనే అధ్యాత్మికజ్ఞానము అతిమాత్రము గలవాఁడు. ఇపుడు మఱియు సుఘోర తపములు చిరకాలముగా చేయుచున్నవాఁడు కావున మనసు - అమోహస్థిరము, బలవాన్ = బలవంతముగా - అనఁగా అగపడినమాత్రకే. నిర్గ్రాహ్యః విదగ్ధైః = ఒరులకు వినయము తెలియరాదు, పైకి తద్విపరీతము - ఔద్ధత్యమును తోఁచును. అట్లే వయసుకుమించిన కాయాదిపుష్టి కలిగియున్నందున శైశవమును తటాలున పైకి తెలియరాదు. పలుకరింపకున్న ఏదో క్రోధియున్నట్లు తోఁచును. పలుకరించి రెట్టించిన మౌగ్ధ్యము స్పష్టపడును.

అజ్ఞాతనామక్రమాభిజనాన్ = ఎఱుంగఁబడని నామము, క్రమము - ఎక్కువ తక్కువలవరుస - అభిజనము - కులము - గలవారిని, పూజ్యాన్ అపి = పూజ్యులనే ఐనను. వృద్ధేభ్యః శ్రూయతే= పెద్దలవలన వినఁబడుచున్నది - వినియెఱింగియున్నాను. ప్రణామపర్యాయః=నమస్కారక్రమము - 'నమస్కారమునకు సాటియైనది - అంతే,

అరున్ధతీ జనకౌ—కల్యాణిన్, ఆయుష్మాన్ భూయాః.

కౌసల్యా—జాద చిరం జీవ. [జాత చిరంజీవ]

అరున్ధతీ—ఏహి వత్స, (లవ ముత్సఙ్గే కృత్వా. స్వగతం) దిష్ట్యా న కేవల ముత్సఙ్గ, శ్చిరా న్మమ మనోరథోఽపి పూరితః!

కౌసల్యా—జాద ఇదో వి దావ ఏహి. (క్రోడే కృత్వా) అమ్మహే! ణ కేవలం దరవిఅసన్తణీళుప్పళ సామలుజ్జలేణ దేహబన్ధేణ కవళిదారవిన్దకేసరకసాయకణ్ఠ కలహంసణిణాద దీహర దీహరేణ సరేణ అ రామభద్దం అణుహరది. ణం కఠోర కమలగబ్భపమ్హలో సరీర ఫంసో వి తారిసో ఎవ్వ వచ్ఛస్స. జాద పేక్ఖామి దే ముహచన్దమ్. (చుబుక మున్నమయ్య. నిరూప్య చ. సబాష్పాకూతం.) రాఏసి కిం ణ పేక్ఖసి ణివుణం ణిరూవిజ్జమాణం సే ముహం వచ్ఛాఏ వహూఏ ముహచన్దేణ సంవదది ఎవ్వ. [జాత, ఇతోఽపి తావదేహి. అహో న కేవలం దరవికస న్నీలోత్పల శ్యామ లోజ్జ్వలేన

---

నమస్కారమే కాదు. ఒకవేళ నమస్కారమునకు అర్హులు ఎవరేని అందులేకున్న, నేను అసలు నమస్కారము చేయలేదులే, దానిపర్యాయమును చేసితిని అని సమాధానపడవచ్చును, పలుకవచ్చును.' అని యిట్లెల్ల వ్యాఖ్యానింతురు, కాని, నమస్కారప్రకారము అనిమాత్రమే అర్థము. వీరచరితలో రామలక్ష్మణులు కుశధ్వజానికి ఒక్కనికి 'అభివాదయావహే' అన్నారు. రాముఁడు దశరథజనకుల కిరువురకు కలిపి ఒక్కటిగా 'ఏష వో రామశిరసా ప్రణామపర్యాయః' అన్నాఁడు. ఈయుత్తర చరితలోను కుశుఁడు రామునికి ఒక్కనికి 'తాత, కుశోఽభివాదయతే' అన్నాఁడు. లవుఁడు ఇట పలువురికి ఉమ్మడిగా ఒక్కటిగా పలుకుచు 'ఏష వో లవస్య మూర్ధ్నా ప్రణామపర్యాయః' అన్నాఁడు. కావున ఇది పలువురికి ఒక్కుమ్మడి చేయు క్రమము. వారిలో ఎక్కువ తక్కువలు అంతగా లెక్కసేయుమి. దీన అబ్బాయికి గల వృద్ధసేవ వివేకము శీలాభిమానము తెలియుచున్నది. కరము ఒప్పిదమైన నడుపడి. దిష్ట్యా=ఆహా-సంతోషమును తెలుపు అవ్యయము. మనోరథః అపి = కోరికయును; సీతకు కడుపుపుట్టిన ఆబిడ్డను తనయొడిలో పెట్టుకొనవలయునని ఎంతకాలమునుండియో అరుంధతికి కోరిక. అది ఇపుడు తీరినది. ఇతోఽపి తావత్=ఇటకును కొంచెము, క్రోడే కృత్వా=తొమ్మున నిడుకొని, రామభద్రస్య-

దేహబన్ధేన, కవళితారవిన్దకేసర కషాయ కణ్ఠ కలహంసనినాద దీర్ఘ దీర్ఘేణ స్వరేణ చ రామభద్ర మనుహరతి. నను కఠోరకమలగర్భ పక్ష్మలః శరీరస్పర్శోఽపి తాదృశ ఏవ వత్సస్య. జాత పేక్ఖి తే ముఖచన్దమ్. రాజర్షే కిం న ప్రేక్షసే, నిపుణం నిరూప్యమాణ మస్య ముఖం వత్సాయా వధ్వా ముఖచన్ద్రేణ సంవద త్యేవ.]

జనకః—పశ్యామి సఖి పశ్యామి.

కౌసల్యా—అమ్హహే! ఉమ్మత్తీభూదం వి అ మే హిఅఅం కిం వి చిన్తయన్తో బహు విప్పలవది. [అహో! ఉన్మత్తీభూత మివ మే హృదయం కిమపి చిన్తయత్ బహు విప్లవతే.]

జనకః—

శ్లో। వత్సాయాశ్చ రఘూద్వహస్య చ శిశావస్మిన్నభివ్యజ్యతే
సంపూర్ణ ప్రతిబిమ్బితేవ; నిఖిలా సైవాకృతి, స్సాద్యుతిః.

---

అనుహరతి=రామభద్రుని - పోలియున్నది. పక్ష్మల - మృదువుగా ఒత్తుగా నుండునది. జాత పశ్యామి తావత్ తే ముఖచన్ద్రమ్=(చిబుకమున్నమయ్య...) - బిడ్డా, నీముఖ చంద్రుని చూచెదను. (గడ్డము త్తి...) - ఇది అవ్వ ప్రీతితో శిశువును లాలించు భాషితముగా నున్నది. సాకూతముగా = అభిప్రాయగర్భముగా - రాజర్షే, కిం న పశ్యసి, నిపుణం నిరూప్యమాణం అస్య ముఖం వత్సాయా వధ్వా ముఖచన్ద్రేణ సంవద త్యేవ - ఇంతవఱకు తాను సొంతమనవఁడు రామచంద్రునిపోలికలను తలఁచు కొన్నది. జనకుని ఉద్దేశించి సీతపోలికను చెప్పుచున్నది. ఇరువురిపోలికలను తలఁచు కొనుచున్నది అనుట. ఉన్మత్తీభూత మివ=వెఱ్ఱియెత్తినదానివలె, కిమపి చిన్తయత్ బహు విప్లవతే - ఏమేమొ - సీత బ్రదికియున్నది, కన్నది, అగపడును - ఇట్లెల్ల తలంచుచు తేలి యెగిరి ఆకసమున పోవునట్లున్నది. పశ్యామి సఖి - జనకుఁడు కౌసల్యను సఖి అని సంబోధన చేయుచున్నాఁడు - అది సముదాచారము.

శ్లో. ౨౦. వత్సాయాఇతి - వత్సాయాః చ=అమ్మాయి (సీత) యొక్కయు, రఘూద్వహస్య చ=(రఘుకులసంతానమగు) రామచంద్రునియొక్కయు, సమ్పూర్ణ ప్రతిబిమ్బితా ఇవ = సకలభావములయొక్క ప్రతిబింబమగుటయో యన, అస్మిన్ శిశౌ=ఈ బాలునియందు, అభివ్యజ్యతే=తోఁచుచున్నది. నిఖిలా ఆకృతిః సా ఏవ=

సా వాణీ, వినయ స్స ఏవ సహజః పుణ్యానుభావోఽప్యసౌ.
హాహా దేవి! కి ముత్పథై ర్మమ మనః పారిప్లవం ధావతి! ౨౦

కౌసల్యా—జాద అత్థి దే మాదా! సుమరసి వా తాదం!
[జాత, అస్తి తే మాతా! స్మరసి వా తాతం?]

లవః—న హి.

కౌసల్యా—తదో కస్స తుమం! [తతః కస్య త్వమ్?]

లవః—భగవతో వాల్మీకేః

---

ఆకారమంతయు అదే. సా ద్యుతిః = కాంతియు అదే. సా వాణీ=అదే పలుకును. సహజః=స్వభావసిద్ధమైన, వినయః స ఏవ=వినయమును అదియే. పుణ్య అనుభావః అపి=పవిత్రమైన - చూచిన మాత్రమున తోఁచు - ప్రభావము సయితమును, అసౌ = అదియే - వారిదే అనుట. హాహా - దైవ=దైవమా, మమ మనః=నామనసు, పారిప్లవం= చంచలమై, ఉత్పథైః = మీఁదిమీఁదిమార్గముల. మింటంబోలె, ధావతి కిం=పరు వెత్తుచున్నది, ఏమి!

అమ్మాయి అల్లుఁడు ఇరువురును కన్ను, కాలు, ముక్కు, మొగము మొదలైన అన్నిటను సంపూర్ణముగా ఈబాలునియందు ప్రతిబింబితులైనటు లున్నారు. ఆకారము సర్వమును ఆకాంతియు, ఆవినయమును, తెచ్చుకోలుకాక తోఁచు ఆ పున్నెపుప్రభావము - అన్నియు అవే, వారివే. హాదైవమా - నాబుద్ధి చపలమై ఏమేమో తలపోసికొనుచు పైపై పరువులెత్తుచున్నది - అదేమి! ఎందులకో!

కౌసల్య తలపోసికొన్న క్రమముననే జనకుఁడును తలపోసికొన్నాఁడు - పర్యాయమే అనవచ్చును - అదుమాట, మగమాట అను భేదము మాత్రము తెలియునట్లు కూర్పు. 'సహజ' - 'వినయ' విశేషణము - తెచ్చుకోలు కాదు - అనుభావము ఎన్నఁడును తెచ్చుకోలుది ఉండదు. అది మనసులోని భావమును తెలుపు చేష్టావిశేషములరూపమువది.

అస్తి తే మాతా=నీకు తల్లి యున్నదా? ఇది తొలిప్రశ్న, మిక్కిలియు మనసును తాఁకినది; తాఁకునది. స్మరసి వా తాతం = నాయనను స్మరింతువా? అనఁగా వారెవరో చెప్పు అనుట. ఇతరులకన్న ఈయవ్వకు తొందర, అది యెఱుంగుటకు! భగవతః వాల్మీకేః - నేను వాల్మీకి భగవంతునివాఁడను. వాల్మీకి అమ్మగాని నాయనగాని కాఁజాలఁడు. వారెవరో తెలిసికొనుటకై నీవు ఎవ్వరివాఁడవు అని యడుగుట. మహర్షి వాల్మీకి, భార్య పాప కలుగఁదగినవాఁడు కాఁడు గాన ఈసమాధానము కౌసల్యకు సరిగా లేదు. కావున అనుచున్నది

కౌసల్యా—అయి జాద, కహిదవ్వం కహేహి. [అయి జాత కథయితవ్యం కథయ.]

లవః—ఏతావ దేవ జానామి.

(నేపథ్యే)

భోఃభోః సైనికాః, ఏష ఖలు కుమారశ్చన్ద్రకేతు రాజ్ఞాపయతి, 'న కేన చి దాశ్రమాభ్యర్ణభూమయ ఆక్రమితవ్యాః' ఇతి.

అరున్ధతీ జనకౌ—అయే మేధ్యాశ్వరక్షాప్రసఙ్గా దుపాగతశ్చన్ద్రకేతు రద్య ద్రష్టవ్యః! అహో సుదివసః!

కౌసల్యా—వచ్ఛలక్ఖణస్స పుత్తఓ అణవేదిత్తి అమిఅబిందుసుందరాఇ అక్ఖరాఇ సుణీఅంది. [వత్స లక్ష్మణస్య పుత్రక ఆజ్ఞాపయతీ త్యమృతబిన్దుసున్దరా ణ్యక్షరాణి శ్రూయన్తే.]

---

అయి-బుజ్జగము తెలుపును. కథయితవ్యం కథయ=చెప్పవలసినదానిని చక్కఁగా చెప్పుము. 'ఏత దేవ జానామి-' అంతకుపైన అటు విచారణ సాగనీక త్రెంచుట నేపథ్యమున అశ్వరక్షకుని కూఁతచేత. ఆశ్రమాభ్యర్ణభూమయః=తపోవన సమీప ప్రదేశములు. ఏలన తాపసుల తపస్సుకు ఉపరోధము కలుగును. ఇది చంద్రకేతు వినయమును ధర్మాభిమానమును తదనుష్ఠానమును తెలుపును-ఉపరోధము తోఁచునేని తాపసులకు కోపము, దాన చెట్ట కలుగును. చూ. శాకుం.-I.

శమప్రధానేషు తపోధనేషు, గూఢం హి దాహాత్మక మస్తి తేజః,
స్పర్శానుకూలా ఇవ సూర్యకాన్తాః త దన్యతేజోభిభవా ద్వమన్తి.

"ప్రసఙ్గాత్=ప్రసక్తిచేత, వత్సః చన్ద్రకేతుః-అబ్బాయి చంద్రకేతువు. జనకుని యూర్మిళకొడుకు వీఁడు సాక్షాత్తు మనుమఁడు. ఇపుడు పన్నెండేండ్లుగా, వాఁడు పుట్టిననాఁటినుండి, వీరు అయోధ్యలోను మిథిలలోను లేరు. కావున వానిని వీరెప్పుడును ఇప్పటికి చూడలేదు. కావున ఉపాగతః అద్య ద్రష్టవ్యః=ఇపుడు వచ్చి చూడనైనాఁడు. మేధ్యాశ్వః=యజ్ఞమునకు తగినగుఱ్ఱము. రక్షాప్రసఙ్గాత్-మేధ్యాశ్వమును విడిచినపుడు దానివెంట సైనిక రక్ష-రక్షార్థము సేన ఉండవలయును. వత్సలక్ష్మణస్య పుత్రకః-కౌసల్యయును ఆబాలుని ఇంతవఱకు చూడలేదు. అతఁడు పుట్టినపుడు ఋష్యశృంగాశ్రమమునను, తరువాత ఇపుడు ఇటను ఉన్నది. పుత్రక-శిశువుంగూర్చి అనుకంపతో నిర్దేశము. ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించుచున్నాఁడు

లవః—ఆర్య, క ఏష చన్ద్రకేతు ర్నామ?

జనకః—జానాసి రామలక్ష్మణౌ దాశరథీ?

లవః—కథం న జానామి? తావేవ రామాయణకథాపురుషౌ.

జనకః—తత్ కథం న జానాసి? తస్య లక్ష్మణ స్యాయ మాత్మజ శ్చన్ద్రకేతుః.

లవః—ఊర్మిలాపుత్ర స్తర్హి మైథిలస్య రాజర్షే ర్దౌహిత్రః.

అరున్ధతీ—(విహస్య) ఆవిష్కృతం కథాప్రావీణ్యం వత్సేన.

జనకః—యది త్వ మీదృశః కథాయా మభిజ్ఞ, స్తద్ బ్రూహి తావత్; పృచ్ఛామః. తేషాం దశరథ స్యాత్మజానాం కిం నామధేయా న్యపత్యాని కేషు దారేషు ప్రసూతాని?

లవః—నాయం కథాప్రవిభాగః అస్మాభి రన్యేన వా శ్రుతపూర్వః.

జనకః—కిం? న ప్రణీతః కవినా?

లవః—ప్రణీతో, న తు ప్రకాశితః. తస్యైవ కోఽప్యేక దేశః సన్దర్భాన్తరేణ రసవా నభినేయార్థః కృతః. తం చ స్వహస్త లిఖితం భగవా న్ముని ర్వ్యసృజ ద్భరతస్య మునేః తౌర్యత్రిక సూత్రధారస్య.

---

అంతటివాఁడై - వీరుఁడుగా వచ్చియున్నాఁడని ఆయాక్షరములు చెవులలో అమృత బిందువులవలె ఆనందమిడుచున్నవి. జానాసి రామలక్ష్మణౌ - ఎఱుఁగుదువా - అనఁగా వినియున్నావా? - అనుట. అందులకు లవుని జవాబు. "కథం న జానామి? తావేవ రామాయణ కథాపురుషౌ-" ఎఱుఁగకేమి? వారే రామాయణ...'ఎఱుఁగకేమి' అనుట చిత్తము ఇంకను గంభీరము గాక ఉత్తానముగా నుండు శైశవసౌలభ్యమును సూచించును. ఈపాఠము అన్నిటను లేదు. తత్ కథం న జానాసి? = అటయిన ఇది యెఱుఁగమి యెట్లు? తర్హి ఊర్మిలాపుత్రః=అట్లయిన ఊర్మిళకు కొడుకు. ఆవిష్కృతం కథాప్రావీణ్యం = కథాప్రావీణ్యము తెలిపుచ్చఁబడినది - తెలిపుచ్చినాఁడు అనుట. జనకునియెదుటనే జనకుంగూర్చి అబ్బాయి ముద్దుమాటలు - 'తమాష'యగు సంవిధానము! అయం కథా ప్రవిభాగః - ఈ కథాంశము. తస్య ఏవ కోఽపి ఏకదేశః సన్దర్భాన్తరేణ...అందులోనే వేఱుసందర్భమున (=రచనగా - దృశ్యముగా) ఏదో యొకభాగమును రసవంతమును అభినయార్హముగా

జనకః—కిమర్థం?

లవః—స కిల భగవాం స్త మప్సరోభిః ప్రయోజయిష్యతీతి.

జనకః—సర్వ మిద మాకూతకర మస్మాకం.

లవః—మహతీ పున రస్మిన్ సుగృహీతనామధేయస్య భగవతో వాల్మీకే రాస్థా. కేషాఞ్చి దన్తేవాసినాం హస్తేన తత్పుస్తకం భరతాశ్రమం ప్రేషితమ్. తేషా మానుయాత్రిక శ్చాపపాణిః ప్రమాదాపనోదనార్థ మస్మద్భ్రాతా ప్రేషితః.

కౌసల్యా—భాదా వి దే అత్థి? [భ్రాతాఽపి తే అస్తి?]

లవః—అస్త్యార్యః కుశో నామ.

కౌసల్యా—జేట్ఠో త్తి భణిదం హోది. [జ్యేష్ఠ ఇతి భణితం భవతి.]

లవః—ఏవ మేతత్. ప్రసవక్రమేణ స కిల జ్యాయాన్.

జనకః—కిం యమా వాయుష్మన్తౌ?

లవః—అథ కిమ్.

జనకః—వత్స, కథయ, కథాప్రబన్ధస్య కీదృశః పర్యన్తః.

---

రచించినాఁడు. తౌర్యత్రికసూత్రధారస్య—నృత్తగీతవాద్యప్రయోగ సూత్రధారునికి భరతమునికి పంపినాఁడు. 'సూత్రకార' సూత్రధార—అని పాఠభేదములు. 'ధార' శ్రేయము. భరతముని సూత్రకారుఁడు—సూత్రములు రచించినవాఁడే. మఱి ఇట అభినయార్థముగ ఆడించుప్రస్తావమున ఆయన నాటకసూత్రధారుఁడుగా వాల్మీకిచే ఉద్దేశింపఁబడినాడు. అప్సరోభిః ప్రయోజయిష్యతి ఇతి—అచ్చరలచే ఆడించును అని. ఇదియే VII వ అంకములోని యంతర్నాటిక. దానిని అట అచ్చరలు వేసాలు వేసి ఆడుదురు. ఆకూతకరమ్=ఆశ్చర్యముగా నున్నది, ఏమి అభిప్రాయమో ఇదంతయు ఏమో ఎందులకో అన్నట్లు! అనుయాత్రికః—తోడైనవాఁడు—అస్తి ఆర్యః కుశోనామ—ఉన్నాఁడు ఆర్యుఁడు (=అన్న) కుశుఁడని పేరు. ఆర్యుఁడు అనఁగా అన్న. కావున వీనికన్నను పెద్దవాఁడు అన్నమాట. ప్రసవక్రమేణ=పుట్టుకక్రమములో. అట్లనుటంబట్టి యీప్రశ్న పుట్టినది. యమౌ ఆయుష్మన్తౌ—ఆయుష్మంతులు కవలా?—కావుచే ప్రశ్న, అమడలలో ముందుపుట్టినవాఁడు పిన్న, తరువాత పుట్టినవాఁడు పెద్ద. కీదృశః పర్యన్తః=ఎంతదనుక వచ్చి

లవః—అళీకపౌరాపవాదోద్విగ్నేన రాజ్ఞా నిర్వాసితాం దేవయజన సమ్భవాం సీతాదేవీ మాసన్నప్రసవవేదనా మేకాకినీ మరణ్యే పరిత్యజ్య లక్ష్మణః ప్రతినివృత్త ఇతి.

కౌసల్యా—హా! వచ్ఛే ముద్ధే చందముహి! కోదాణిం దే సరీరకుసుమస్స దెవ్వదువ్విలాసపరిణామో ఎక్కాఇణీఏ ణివడిదో?
[హా వత్సే ముగ్ధే చన్ద్రముఖి క ఇదానీం తే శరీరకుసుమస్య దైవదుర్విలాస పరిణామ ఏకాకిన్యా నిపతితః?]

జనకః—హా వత్సే,

శ్లో॥ నూనం త్వయా పరిభవం చ నవంచ ఘోరం
తాం చ వ్యథాం ప్రసవకాలకృతా మవాప్య.
క్రవ్యాద్గణేషు పరితః పరివారయత్సు
సన్త్రస్తయా శరణ మి త్యసకృత్స్మృతో౽స్మి. ౨౧

---

నది? ఆసన్న ప్రసవ వేదనాం=ప్రసవ వేదన దగ్గఱినదానినే - ఏకాకినీం=ఒంటి దానినిగా, ముగ్ధే చన్ద్రముఖి = ముగ్ధా చంద్రముఖి. ముగ్ధవు - పేలవు - ఇదే నీకు తొలికాన్పు. శరీరకుసుమస్య = మైపూవునకు - అంత కోమలమైనదానవు అంతలో వాడిపోవుదానవు!

శ్లో. ౨౧. నూనం ఇతి. - నూనం=నిజము! నవం=క్రొత్తదియు - మఱి యిట్టిది యెవరికిని ఇంతకుముందు కలుగలేదు. ఘోరం చ=భయంకరమైనదియూ నగు, పరిభవం చ=(వెడలనడచుటవలని) అవమానమును, ప్రసవకాలకృతాంచ = పేంట నొప్పులుద్దు కలిగించినదైన, తాం వ్యథాం = ఆనొప్పిని, అవాప్య = పొంది, క్రవ్యాద్గణేషు = పచ్చిమాంసముతిను (తోడేళ్ళు, పులులు, నక్కలు మొదలైన) మృగములగుంపులు, పరితః పరివారయత్సు = తలలాగుదుమా, కాలులాగుదుమా చేయిలాగుదుమా అని అన్నివైపుల (గమ్ముకొనుచుండఁగా, సన్త్రస్తయా=మిక్కిలియు భయపడినదానవైన, త్వయా = నీచేత, శరణం ఇతి = కాపాడరావయ్యా (నాయనా) అని, అసకృత్ స్మృతః అస్మి = నేను పలుమారు తలఁచుకొనఁబడియుందును.

(మఱి లోకాన కనివిని యెఱుఁగని) క్రొత్తగా అప్పుడే కలిగిన - నాపవాదముకుటచే - భయంకరమునైన ఆపరిభవమును పొందితివి. (అది చావు కలిగించునంత

లవః—(అరున్ధతీం ప్రతి) ఆర్యే కా వేతౌ?

(లవః సబహుమాన ఖేద కౌతుకం పశ్యతి.)

అరున్ధతీ—ఇయం కౌసల్యా, అయంచ జనకః.

జనకః—అహాహా! నిర్దయతా దురాత్మనాం పౌరాణాం! అహో! రామస్య రాజ్ఞః క్షిప్రకారితా!

---

టిది. అవమానమునకే చత్తురుకదా.) అంతలోనే వెంటనే కానుపుఁబ్రొద్దు రాఁగా ప్రసవవేదనలు తల్లడిలఁజేయఁగా, క్రవ్యాదములును గుంపులు గుంపులుగా నలువైపుల చుట్టుకొనఁగా మిక్కిలియు భయము చెందినదానవై, నిజముగా, నాపట్టి నీవు 'నాయనా, నన్ను కాపాడరావయ్యా, రావయ్యా నాయనా, నన్ను కాపాడుటకు' అని నన్ను తలఁచుచు పలుమాఱు వాపోయితివా అమ్మా!

ఇది కరము జాలిగొల్పు ఏడ్పు. జ్ఞానియైన నాయనయొక్క యేడ్పు! పరిభీతంచ-వ్యథాంచ-అని రెండు చకారములు అవ్యవహితతను తోఁపించును. అంతలో కానుపుకాఁగల కఠోరగర్భకదా వివాసముచేయబడినది. 'పరితః' పరివారించుట ప్రసవమైనట్టైన సీతతోకూడ శిశువునుంగూడ ఒక కవళముగా మ్రింగివేయుటకు 'శరణ మితి అసకృత్...స్మి' నాయనను కాపాడ నఱచుట భర్తరక్షకుఁడు కామి చేతను, తొలిప్రసవమును పుట్టింటివారు నిర్వహించు ఆచారము చేతనుంగాఁబోలు. ఇట్లు వీరు ఉభయులు 'హా వత్సే' 'హా వత్సే' అని వాపోవుటను చూచి బాలుఁడు లవుఁడు ఇంచుక నిబ్బరముగా ప్రక్కనకూర్చుండియున్న అరుంధతిని కుతూహలముచే అడుగుచున్నాఁడు. 'కా వేతౌ'-వీరెవరు అని. పాపము, దుఃఖితులను వారిం గాంచి కలవరపడి అట్లు అడుగుచున్నాఁడు. ఫలానా అని తెలియఁగానే ఆరామాయణ కథాప్రవీణునికి వారియెడ బహుమానము (=గౌరవము,) ఖేదము (పాపము! వీరి వధువునకు కదా అట్టి ఆపద కలిగినది అని), కౌతుకము (కథా మహాపురుష) లలో ఈ యిరువురిని ప్రత్యక్షముగా కాంచినందుకు అబ్బురముతోడి కుతూహలము) లవుని చిత్తమున పెనఁగొన్నవి. 'అలీక పౌరాపవా దోద్విగ్నేన రాజ్ఞా' ఇత్యాది లవుఁడు చెప్పినందున పౌరులమీఁదను రామునిమీఁదను తటాలున జనకునికి మిక్కిలి కోపము వచ్చినది. అహో నిర్దయతా దురాత్మనాం పౌరాణాం-అను పాఠము శ్రేయము. అహో దురాత్ములైన పౌరుల కరుణలేమి! అహో రాజు రాముఁడు తొందరపడుట! కేవలము తన రాచతికమునుబట్టి, భర్తయు దయితుఁడును అగుటను మఱచి-ముందువెనుకలు ఔగాములు ఆలోచింపక-తటాలున వివాసము చేసినాఁడు-అది తొందరపడుట.

శ్లో॥ ఏత ద్వైశసవజ్రఘోరపతనం శశ్వన్మమోత్పశ్యతః
క్రోధస్య జ్వలితుం ధగి త్యవసర శ్చాపేన శాపేన వా ౨౨

కౌసల్యా—(సభయం) భ అవది, పరిత్తాఅహి పరిత్తాఅహి; పసా దేహి రుసిదం రాఏసిం. [భగవతి పరిత్రాయస్వ పరిత్రాయస్వ; ప్రసాదయ రుషితం రాజర్షిం.]

అరున్ధతీ—

శ్లో॥ ఏత ద్ధి పరిభూతానాం ప్రాయశ్చిత్తం మనస్వినాం,
రాజ న్నపత్యం రామ స్తే పాల్యాశ్చ కృపణాః ప్రజాః. ౨౩

---

శ్లో. ౨౨. ఏతద్వైశసమితి—ఏతద్వైశస...నమ్ = ఈ కీడు (=ఆపద) అనెడు భయంకరమైన పిడుగుపాటును – దెబ్బను–, శశ్వత్ = ఎల్లప్పుడు, శేక – మిక్కిలి, ఉత్పశ్యతః=తలఁచుకొనుచున్న, మమ=నాకు, క్రోధస్య=కోపమునకు, చాపేన శాపేనవా వింటితోడనో – అనఁగా దానింబూనియో, శాపముతోడనో – అనఁగా దానింబలికియో, ధగితి జ్వలితుం=భగ్గని మండుటకు, అవసరః=సమయము!

పౌరులు కారణముగా రాముఁడు ఈ ఘోరవైశసవజ్రమును సీతపై వైచినందులకు వింట బాణములం గొట్టుదునా శాపమున తిట్టుదునా అని నాకోపము భగ్గని మండుచున్నది ఇప్పుడు! కొట్టుటయు తిట్టుటయు ఆయుభయములను.

కావలయునన్న నిజముగా ఆయన రాముని నాశనముచేయఁగలఁడు. కావున ఇట్లనఁగానే రాముని ఏమేని శపించునో అని కౌసల్య వడవడవణఁకిపోయినది. పరిత్రాయస్వ – రక్షింపు – అని మొఱపెట్టినది. ప్రసాదయ = సముదాయింపుము – కోపము అణఁచుకొనునట్లు చేయుము. చాపేన శాపేన – రాజర్షియైనందున రెండును ఆయనచేత నున్నవి. అటు క్షత్రియుఁడు, ఇటు గొప్ప తపస్వి. చాపేన – ధనుస్సు చేత నున్నదా? జనకుఁడు క్షత్రియుఁ డగుటంబట్టి తపస్సుచేయుచున్నప్పుడును ధనుస్సును సిద్ధముగా ప్రక్కనే ఉంచుకొనియుండును. ముసలివాఁడు కాఁడా యున్న. ముదిమి దానికి అభ్యంతరము గాదు. ఈవయసునను ఆయనవింటిని ఇతరులు ఎత్తి వంపఁజాలియుండరు. అర్జునుఁడు ఇంద్రకీలమున తపస్సుచేయుచున్నప్పుడు విల్లు ప్రక్కనే ఉండెనుకదా.

శ్లో. ౨౩. ఏతదితి—పరిభూతానాం = అవమానితులగు, మనస్వినాం=మానధనులకు – పరువుగలవారికి, అవమానింపఁబడినపుడు అనుట – ఏతత్ హి ప్రాయశ్చిత్తమ్=ఇదియే కదా ప్రాయశ్చిత్తము – అయవమానమును తీర్చుకొను నుపాయము.

జనకః—

శ్లో। శాన్తం వా రఘునన్దనే తదుభయం, తత్పుత్రభాణ్డం హి మే,
భూయిష్ఠద్విజబాలవృద్ధవికలస్త్రైణశ్చ పౌరో జనః. ౨౮

---

రాజన్ = రాజా, రామః తే అపత్యం=రాముఁడు నీబిడ్డ. ప్రజాఃచ = ప్రజలును, కృపణాః=దీనులు, పాల్యాః=పరిపాలింపఁదగినవారు.

మానధనులకు అవమానితులైనపుడు, దానిని తీర్చుకొనుటకు ఇదియే కదా ఉపాయము. ధనుర్ముఖముననో శాపముఖముననో కోపజ్వాలల ధగధగ వెలి గ్రక్కుట! వినను రాజా, ఆ ప్రాయశ్చిత్తమునకు వారు తగుదురా? రాముఁడు నీ బిడ్డ; ప్రజలు దీనులు, (నీకు, కాదా రామునకు) పాల్యులు.

మానధనులకు ఇత్యాది చెప్పుట కొంత జనకునిచిత్తమును అనుసరించినట్లుండు టకు. 'రాజా నీవు చెప్పినది సరియే, అట్లు ప్రాయశ్చిత్తము చేయవలసినదే.' అని తొత్తి చెప్పి పిమ్మట ఆయనచిత్తమును త్రిప్పఁగలయట్లు పలుకుట ఇది - వినను చాపమో శాపమో పూనుటకు రాముఁడు నీ బిడ్డఁడు; ప్రజలు పాల్యులు. కోపమును చక్కఁగా తీర్చినది, నిపుణముగా సముదాయించినది. జనకునికోపము ఒక్కమ్మడి శాంతించి ప్రేమగా పరిణమించినది. తానును రాజుగదా, కావున రాముని రాజ ధర్మముల పాలనమును మనసునకు తెచ్చుకొనఁగలిగినాఁడు.

శ్లో. ౨౮. శాన్తం ఇతి - వా అథవా=అట్లుగాదు. రఘునన్దనే=రామునియెడ' తదుభయం=ఆరెండును - చాపశాపములు, శాన్తం=అడఁగునుగాక. శాకపోవును గాక. తత్ = అతఁడు (విధేయప్రాధాన్యముచే నపుంసకలింగము,) మే=నాకు పుత్త్రిభాండం హి=పుత్రరూపముననున్న మూలధనముగదా. జనఃచ=జనమును - ప్రజలును, భూయిష్ఠ ద్విజ బాల వృద్ధ వికలస్త్రైణః = మెండుగా బ్రాహ్మణులు బాలురు వృద్ధులు వికలులు (అంగవైకల్యముగలవారు - కుంటి గుడ్డి) (స్త్రైణః=) స్త్రీలును గలదై, పాల్యః=రక్షింపఁదగినది.

ఆరెంటిని ఉపసంహరించుచున్నాను. రఘునందనుఁడు పుత్త్రిరూపమున మామూలధనము. జనులు అన్నచో బ్రాహ్మణులు బాలురు వృద్ధులు వికలులు స్త్రీలు మెండుగా కలిగి రక్షింపఁదగినవారు.

వటవః—(సమ్భ్రాన్తాః ప్రవిశ్య) కుమార, కుమార, అశ్వోఽశ్వ ఇతి కోఽపి భూతవిశేషో జనపదేషు శ్రూయతే, సోఽయ మధు నాస్మాభిః ప్రత్యక్షీకృతః.

లవః—అశ్వ ఇతి పశుసమామ్నాయే సాఙ్గ్రామికే చ పఠ్యతే, తద్బ్రూత కీదృశః.

---

రాముఁడు పుత్రుఁడైనందునను జనులు కొట్టఁగూడని తిట్టఁగూడనివారైన బ్రాహ్మణులతోను బాలురతోను వృద్ధులతోను, వికలులతోను స్త్రీలతోను నిండి యున్నందునను 'శాన్తం' అనుట.

ఏతద్వైశసాది అర్ధశ్లోకము కోపముతో చెప్పినది. దానికి తగిన యక్షరములతోను శబ్దములతోను ఘటితమై చెవింబడఁగానే కోపమును తెలుపుచున్నది. ఆపాత్రము దానిని అట్లు, దానికి తగినరాగముతో, ఉద్ధతముగా పఠింపవలయును. శాన్తం వాది ఉత్తరార్ధము-కోపము తీఱి, ప్రీతితోను జాలితోను పలుకునది-దానికి తగిన యక్షరములతోను పదములతోను ఘటితమై ఉన్నది. దానిని తత్సదృశముగా పఠింపవలయును. భవభూతి నాటకప్రయోగరహస్యములను ఎఱుఁగును. కావున రసానుగుణ శబ్దగుంభనము కావుననే కడపట 'అభినయైర్విన్యస్త రూపాం' అన్నాఁడు. ఇట్టిది పూర్వార్ధము కోపమునకు తగినట్లును ఉత్తరము జాలికి తగినట్లును ఉన్నదికదా. ఈ క్రింది నాగానందశ్లోకమున పూర్వార్ధము భయంకరుని వర్ణింపను ఉత్తరార్ధము సౌమ్యుని వర్ణింపను తగినట్లు ఒక్కనినోటనే గుంఫితమైయున్నది. దానికి అనుగుణముగా ఆపాత్రము దానిని గంగాన పఠింపవలయును. పూర్వార్ధమున గరుడుఁడు, ఉత్తరమున జీమూతవాహనుఁడు వర్ణితులు. (నాగా-IV. 13)

శఙ్ఖ-అమ్బ అలమలం త్రాసేన-న ఖల్వయం నాగశత్రుః-పశ్య
మహాహి మస్తిష్క విభేదముక్త-
రక్తచ్ఛటాచర్చిత చణ్డచఞ్చుః
క్వాసౌ గరుత్మాన్? క్వచ నామ సౌమ్యః,
సత్త్వస్వభావాకృతి రేష సాధుః?
నాటకరచనలో ఈ మెలఁకువలు పరికింపఁదగును.

అశ్వోఽశ్వఇతి=గుఱ్ఱము గుఱ్ఱము అని-ద్విరుక్తి ఎన్నఁడును చూడమివలని యాశ్చర్యము తెలుపును. భూతవిశేషః=ఒకానొక జంతువు-జనపదములలో-దేశములలో,-తాము అడవులలో నుండువారు గదా. శ్రూయతే=ఉన్నదని వినఁబడుచున్నదే-ప్రత్యక్షీకృతః=కన్నులతో చూడఁదగినట్లు ఎదుటికి వచ్చియున్నది. పశుసమామ్నాయే=పశుశాస్త్రమందు-సాఙ్గ్రామికే=సమామ్నాయ ఇతి శేషః-యుద్ధ

వటవః—శ్రూయతామ్!

శ్లో॥ పశ్చాత్పుచ్ఛం వహతి విపులం, తచ్చ ధూనో త్యజస్రమ్.
దీర్ఘగ్రీవ స్స భవతి, ఖురా స్తస్య చత్వార ఏవ,
శష్పా ణ్యత్తి, ప్రకిరతి శకృత్పిణ్డకా నామ్రమాత్రాన్;
కిం వ్యాఖ్యాతైః? వ్రజతి స పునర్దూరః మే హ్యేహి యామః.
(ఇ త్యుపసృత్య అజినే హస్తయో శ్చాకర్షన్తి)

---

శాస్త్రమందును - కీదృశః=ఎట్టిదో - దానిస్వరూపము ఎట్టిదో అన్నమాట. ఈసమామ్నాయములును కులపతియాశ్రమమున పాఠము చెప్పఁబడును. అతనికి ఈ రెండు శాస్త్రములును పాఠమే. ఈవయసుకే - 12 యేండ్లకే అవన్నియు పఠించినారు లవకుశులు - 'అతిప్రదీప్తప్రజ్ఞా మేధాభ్యాం' అని ముందే వారింగూర్చి చెప్పఁబడియున్నదికదా - ఆవటువులలో ఈ కుమారుఁడు మొనగాఁడు - వారికి వాఁడు మిక్కిలి ప్రీతిస్నేహగౌరవపాత్రమును - కావున వానికి చెప్పుటకు వారు సంభ్రమించినారు.

శ్లో. అ౫. పశ్చాదితి—పశ్చాత్ = వెనుకవైపు, విపులం పుచ్ఛం=విప్పుగు తోఁకను, వహతి=తాల్చియున్నది; ఇదియొక విశేషము. తత్=దానిని, అజస్రం ధూనోతి చ=సదా ఆడించుచుండును. సః=అది, దీర్ఘగ్రీవః=నిడుపాటి మెడగలది. తస్య=దానికి, ఖురాః = గొరిజలు, చత్వార ఏవ = నాలుగే. శష్పాణి అత్తి=లేఁబచ్చికతినును; అనగా పచ్చిది, ఎండుది గాదు. శకృత్పిండకాన్=లద్దిఉండలను, ఆమ్రమాత్రాన్ = మామిడికాయలంతలుగా, ప్రకిరతి - క్రిందవేయును, క్రిందపడి ఆఉండలు చల్లినట్లగును. ఇదియొక విశేషము. ఒకటొకటియు విశేషమే. వ్యాఖ్యాతైః కిం=వ్యాఖ్యానములు, నోటిమాటల వర్ణనలు, ఎందులకు? స పునః దూరం వ్రజతి=అది మరల దూరమునకు పోవును - చూడ ఘటిల్లక పోవును. ఏహి ఏహి= రమ్ము రమ్ము. యామః=పోవుదము.

వెనుక విప్పగు తోఁక. దానిని నిలుపక ఆడించుచునేయుండును. మెడ చాలపొడుగు - గిట్టలు నాలుగె. లేఁబచ్చికను తినును. లద్దియుండలు మామిడి కాయలంత లవి క్రింద చల్లినట్లుగా దించును. ఇక్కడ వర్ణించుచున్న, అది దూర మేఁగును. కంటితో చూచుట కుదురక పోవునేమో చూతము రా - త్వరగా రా.

ఈ శ్లోకము బాల వటుభాషితమునకు అత్యంతము సదృశముగా నున్నది. చిన్న పిల్లకాయలు క్రొత్తదానిని చూచి తోడివారికి చెప్పు ఫక్కిలో మిక్కిలి అమరియున్నది. ఎన్నఁడును ఆజంతువును చూడనివారు బాలురు తెలివిగలవారు

లవః—(సకౌతుకోపరోధవినయం) ఆర్యాః పశ్యత పశ్యత, ఏభిర్నీతోఽస్మి. (ఇతి త్వరితం పరిక్రామతి.)

అరున్ధతీ జనకౌ—పూరయతు కౌతుకం వత్సః.

కౌసల్యా—భఅవది, జాణామి, ఏవం అణాలోఅంతీ నజీఆమి విఅ. అదో అణ్ణదో భవిఅ పెక్ఖమ్హ దావ గచ్ఛమాణం దీహాఉం. [భగవతి, జానామి ఏవ మనాలోకయన్తీ న జీవామీవ. అతోఽన్యతో భూత్వా పశ్యామ స్తావ ద్గచ్ఛన్తం దీర్ఘాయుషమ్.]

---

శ్రోత్రగా చూచినపుడు విశేషముగా తోఁచు లక్షణములనే చెప్పుట. ఇదియు భగవద్భూతి రంగరహస్యజ్ఞానమును పాత్రోచితభావణముం గూర్చుటను తెలుపును. గుజ్జురూపము స్వభావమును వారికి అగపడిన తెఱంగున వర్ణితము.

అజినే-హ స్తయోః-అనుసత్తములచే వానిని గట్టిగా పట్టుకొని యనుట అర్థము. అజినము వదులైనవాఁ డనుటను సూచించును. సకౌతుకోపరోధవినయమ్=కౌతుకమును అడ్డు వినయముతో కూడుకొన్నట్లుగా, కౌతుకమును వినయముతో అడ్డగించుచు-దీన అభిజాతి యుదాత్తతలు తోఁచును. ఏభిర్నీతోఽస్మి=వీరిచేత లాఁగఁబడుచున్నాను-వీరు నన్ను లాఁగికొనిపోవుచున్నారు-నేను మీయొద్ద నున్నను-మిమ్ము వీడి తటాలున పోవకున్నను వీరు లాఁగికొనిపోవుచున్నారు. అని వినయముం జెప్పుట. తనకును పోవలయు నని యున్నది-పోయిన, పెద్దలు నా రేమనుకొందురో అని వటువులమీఁద పెట్టుట. త్వరత్వరగా పరిక్రమించును. పూరయతు కౌతుకం వత్సః=ముద్దులాఁడు కుతూహలమును తీర్చుకొనునుగాక. అరుంధతియు జనకుఁడును అట్లు అనుమతింతురు, వానిమీఁది ప్రీతిచేత నే. వాఁడు కోరునది వాఁడు హాయిగా నుండవలయు నని సంతోషపడవలయు నని. కౌసల్య యేమో వాని యీ వియోగమును ఓర్చుకొనలే నని అనుచున్నది-అరుంధతికి సొంత దేహసంబంధము లేకపోవుట; సొంత దేహసంబంధమున్నను జనకుఁడు మగవాఁ డగుట-వానిని పోవ ననుమతింపగల్గుదురు. కౌసల్య స్త్రీసులభమగు పామరతచేత వానిని ఎడఁబాసిపోవ నిచ్చగింపదు. వాఁడు కన్నులకు కనఁబడకున్న తాను బ్రతుకలే ననుచున్నది. అన్యతో భూత్వా=ఒంరెడ-కనఁబడతగినచోటి కేఁగి.

అరున్ధతీ—దూర మతిక్రాన్త స్స చపలః. కథం దృశ్యతే?

కఞ్చుకీ—(ప్రవిశ్య) భగవా న్వాల్మీకి రాహ, జ్ఞాతవ్య మేత దవసరే భవద్భి రితి.

జనకః—అతిగమ్భీర మేత త్కిమపి భవిష్యతి. భగవత్యరున్ధతి, సఖి కౌసల్యే, ఆర్యగృష్టే, స్వయమేవ గత్వా భగవన్తం ప్రాచేతసం పశ్యామః.

[ఇతినిష్క్రాన్తో వృద్ధవర్గః]

వటవః—పశ్యతు కుమార స్త దాశ్చర్యం.

లవః—దృష్ట మవగతం చ. నూన మాశ్వమేధి కోఽయ మశ్వః.

వటవః—కథం జ్ఞాయతే?

లవః—నను మూర్ఖాః, పఠిత మేవ యుష్మాభి స్తత్కాణ్డే, కిం న పశ్యథ? ప్రత్యేకం శతసంఖ్యాః కవచినో దణ్డినో నిషఙ్గిణశ్చ రక్షితారః, తత్ప్రాయ మేవ బల మిదం దృశ్యతే, య దీహ న ప్రత్యయః, త ద్గత్వా పృచ్ఛత.

---

చపలః = కుతూహలముగలవాఁడు _ గుఱ్ఱమును చూడ _ కావున నిమిషములో చాలదూర మేఁగినాఁడు _ నీ కెట్లు కనఁబడును? కదలలేనిముసలివి, వడిగానడువఁ బోయి చదికిల పడుదువేమో _ పోకుము, నిలువుము అనుట. అరుంధతి రూపుదాల్చిన జ్ఞానము. జ్ఞాతవ్యం ఏతత్ అవసరే భవిష్యతి=దీనిని మీరు సమయములో ఎఱుంగుదురు. అవసరే _ అనఁగా అంతర్నాటికలో అని గూఢము. ఈ వాల్మీకి సందేశము ఏదియో లోతులో నున్నట్లు సూచన చేయుచున్నది. కావుననే _ జనకుఁడు 'అతిగమ్భీర మేత త్కిమపి భవిష్యతి' అన్నాడు. వటువులును లవుఁడును దూరము పోవుట అగపడకపోవుట _ అదెల్ల 'పరిక్రమణమే' కాని 'నిష్క్రమణము' గాదు. నిష్క్రమణము వృద్ధవర్గమునకు చెప్పఁబడినది. వటువులు అట్లు పరిక్రమించుట అభినయించినవారు ఇఁక అంకశేష మంతయు మాటలాడుదురు. నను మూర్ఖాః = ఓరీ మూర్ఖులారా, పఠిత మేవ యుష్మాభి స్తత్కాణ్డే=మీరును చదివితిరే ఆకాండములో _ వారికి ఉపనీతము కామి, వానికి అగుట _ 'అతిప్రదీప్త మేధవలన.' ప్రత్యేకం=వేఱుగా _ గుఱ్ఱమునకు మాత్రము రక్షకులు నూర్గురు. ఇదికాక సేన వేఱు ఉండును. కవచినః = కవచవన్తః _ కవచము తొడుగుకొన్నవారు. తత్ప్రాయం ఏవ=అట్టివారితో మెండుకొన్నదిగానే. 'యదమిత్రా అశ్వం విన్దేరన్

వటవః—భో భోః కిం ప్రయోజనోఽయమశ్వః పరివృతః పర్యటతి?

లవః—(సస్పృహమ్ స్వగతం) అశ్వమేధ ఇతి విశ్వవిజయినాం క్షత్రియాణా మూర్జస్వల స్సర్వక్షత్రియపరిభావీ మహా నుత్కర్ష నికషః.

(నేపథ్యే)

శ్లో॥ అయ మశ్వః, పతాకేయ, మథవా, వీరఘోషణా,
సప్తలోకైకవీరస్య దశకణ్ఠకులచ్ఛిదః. ౨౮

లవః—(సవ్యథ మివ) అహో! సన్దీపనా న్యక్షరాణి!

వటవః—కి ముచ్యతే? ప్రాజ్ఞః ఖలు కుమారః.

---

హార్యేతాస్య యజ్ఞః - చతుఃశతా రక్షన్తి యజ్ఞ స్యాఘాతాయ' - అని అశ్వమేధ మంగూర్చి శాస్త్రము. యది ఇహ న ప్రత్యయః=నామాటయందు నమ్మకము లేదేని. పరివృతః=పరివారముకలదై, ఊర్జస్వలః=స్వమహిమప్రఖ్యాపకము. సర్వక్షత్రియ పరిభావీ=క్షత్రియుల నెల్ల అవమానించునది. ఉత్కర్ష నికషః=ఉత్కర్షను పరీక్షించు ఒరగల్లు. గుఱ్ఱమును తదంగములను చూడఁగానే అది మేధ్యాశ్వమని లవుఁడు గ్రహించినాఁడు - వాఁడు చదువును చక్కఁగా పట్టించుకొన్నాఁడు. వారు దానిని గమనింపలేదు. 'సస్పృహమ్' - తనకు అంత యోగము కలుగవలయు నని.

శ్లో. ౨౮. అయమశ్వఇతి - అశ్వః అయం=అశ్వము ఇదిగో. పతాకా ఇయం=కేతనము - జెండా - ఇదిగో. అథవా=అంతియకాదు; మఱియు, వీరఘోషణా = వీరుని - తనకన్న వీరుఁడు లేఁడని వీరుఁడు చేయు - చాటింపును. సప్తలోకైక - వీరస్య=ఏడు లోకములకు ఒక్కఁడే వీరుఁడైన - తన్ను మించినవాఁడు లేని, దశకణ్ఠ కులచ్ఛిదః=పదితలల రావణుని కులమును నిర్మూలము చేసినవాని(ది).

ఇవన్నియు - గుఱ్ఱము, జెండా, చాటింపు - అతనివి అనుట. క్షేమేంద్రుఁడు తన ఔచిత్యవిచారచర్చలో ఈ శ్లోకము ఉదాహరించినాఁడు.

ప్రసిద్ధిచే ఇట రామనామము శేషముగా వదలఁబడినది.

సవ్యథమ్ ఇవ - వ్యథతో నుంబోలె - ఇది పాత్రకు అభినయసూచకము. సన్దీపనాని అక్షరాణి - రగిలించుచున్నవి అక్షరములు - తక్కినవారికి సందీపనములు కాక లవునికే అగుట - ఇతఁడు క్షత్రియుఁ డగుటంబట్టి. రోషోద్దీపకములుగా నున్నవి. అక్షరాణి - ప్రతి యక్షరమును - 'సప్తలోకైకవీరస్య' అనునవి అనుట. 'అయ మశ్వః'

లవః—భో భోః కిమక్షత్రియా పృథివీ యదేవముద్ఘుష్యతే?

(నేపథ్యే)

అరే రే మహారాజం ప్రతి కుతః క్షత్రియాః?

లవః—ధిగ్జాల్మాన్!

శ్లో॥ యది తే సన్తి సన్త్వేవ కేయ మన్యా బిభీషికా?

కిముక్తైః స్సన్నిపత్యైష పతాకాం వో హరా మ్యహమ్. ౨౭

భో భో వటవః, లోష్టైః ఘ్నన్తః పరావర్తయ తైన మశ్వం, ఏష రోహితానాం మధ్యే వరాక శ్చరతు.

పురుషః—(సక్రోధదర్పః ప్రవిశ్య) ధిక్చాపలం! కిముక్తవానసి? తీక్ష్ణనీరసా హ్యాయుధీయశ్రేణయః శిశోరపి దృప్తాం వాచం

---

ఇత్యాది యభిప్రాయము వటువులకు బోధపడలేదు. కిం అక్షత్రియా పృథివీ = పృథివిలో క్షత్రియులు లేరా యేమి? మహారాజంప్రతి - మహారాజునెదుర. ధిగ్జాల్మాన్=ఛీ తెలివిలేనివారలార - ఆలోచింపకయే చెప్పువారలారా!

శ్లో. ౨౭. యదీతి. - తే=వారు - అట్టివారు, యది సన్తి = ఉందురేని, సన్తు ఏవ=ఉందురుగాక. అన్యా ఇయం బిభీషికా కా = ఒండు ఇదేటికి ఈ బెదరింపు? ఉక్తైః కిం=మాట లేల? సన్నిపత్య=అటకాయించి, వః పతాకాం = మీ జెండాను, ఏషః అహం హరామ్యేవ=ఇదిగో చూడుఁడు నేను పెఱుకుకొనెదను.

అట్టివారు - సప్తలోకైకవీరులు ఉండిన ఉండనీ. ఇదేల లోకమునకు ఈ బిభీషిక? ఏల పలుమాటలు! ఇదె చూడుఁడు అటకాయించి బల్మిని మీ జెండాను హరించెదను!

జెండా పరువునకు సూచకము - దానిని హరించిన సర్వమును హరించినట్లే. కనుక అట్లు చెప్పుట. ఆ జెండామీఁదనే 'అయ మశ్వః' ఇత్యాది చాటింపుమాట వ్రాసియున్నది.

లోష్టైః=మట్టిబెడ్డలతో, రోహితానాంమధ్యే=జింకలనడుమ - జింకలనడుమ నుండుట గుఱ్ఱమునకు అవమానకరము. వరాకః = దీనమైనదిగా - దేబిరించునదిగా, అనీచమృగములతో ఇదియు నొకటిగా - అవియు మిక్కిలి వడిగలవే లెండు. ధిక్ చాపలం - ఛీ - తుంటరితనము! తీక్ష్ణనీరసాః=తీక్ష్ణులు, (నీరసులు=) ఉగ్రులు, కరుణ లేనివారు, ఆయుధీయశ్రేణయః = ఆయుధాజీవుల (=భటుల) బంతులు - లెక్కకు

న సహన్తే. రాజపుత్ర శ్చన్ద్రకేతు రరివిమర్దనః, సౌమ్యపూర్వా రణ్యాదర్శనకుతూహ లాక్షి ప్తహృదయో, న యావ దాయాతి, తావ త్త్వరిత మనేన తరుగహనే నాపసర్పత.

వటవః—కుమార కృతమనే నాశ్వేన, తర్జయన్తి విస్ఫురిత శస్త్రాః కుమార మాయుధీయశ్రేణయః. దూరే చాశ్రమపద మితః. త దేహి హరిణప్లుతైః పలాయామహే.

లవః—(విహస్య,) కిం నామ విస్ఫురన్తి శస్త్రాణి! (ఇతి ధను రారోపయన్)

శ్లో॥ జ్యాజిహ్వయా వలయితోత్కటకోటిదంష్ట్ర
ముద్గారి ఘోరఘనఘర్ఘరఘోష మేతత్,
గ్రాసప్రసక్త హసద న్తకవక్త్రయన్త్ర
జృమ్భావిడమ్బి వికటోదర మస్తు చాపమ్ ౭౮

(యథోచితం పరిక్రమ్య నిష్క్రాన్తాస్సర్వే.)

ఇతి

కౌసల్యా జనక యోగో నామ
చతుర్థాఙ్కః.

---

మించినవారు - అనుట. దృప్తాం వాచం=గర్వముతోడి మాటను. సౌమ్య పూర్వా రణ్యాదర్శన కుతూహలాక్షి ప్తహృదయః = ప్రశాంత మైన (యా) తూర్పు అడవిని చూడవలయునన్న ఆసచే ఆకృష్టమైన హృదయముగలవాఁడు, అయి, పోయియుం డ్వాఁడు. న యావ దాయాతి=మరలిరాకముందే. తరుగహనేన=చెట్లగుబురుగుండ - అతని కంటఁబడకుండ, అపసర్పత=పాటిపొండు, కృతం అనేన అశ్వేన=వలదు ఈగుఱ్ఱము - దానిజోలి మన కక్కఱలేదు. విస్ఫురిత శస్త్రాః=జళిపించుచున్న శస్త్రములుగలవారై, హరిణప్లుతైః = లేడిగంతులతో - పాపము, వటువులు పిఱికివారు - భయపడి పలుకుచున్నారు. విహస్య=పకపక నవ్వి - కిం నామ విస్ఫురన్తి శస్త్రాణి= ఏమీ, శస్త్రములు జళిపింతురా? ఆరోపయన్=ఎక్కుపెట్టుచు.

శ్లో. ౭౮. జ్యాజిహ్వయా. ఇత్యాది - జ్యాజిహ్వయా=జిహ్వాంబోని అల్లెత్రా టిచే, వలయి తోత్కటకోటి దంష్ట్రం = చుట్టఁబడిన భయంకర మైన కోఁటలంబోని (వింటి)కొనలుగలదియు, ఉద్గారిఘోరఘనఘర్ఘరఘోషం=వెలువడుచున్న భయం

కరమగు పెద్దదైన (వర్షించుచున్న భయంకరమైన మేఘఘోషంబోని) (గఱ్ఱను త్రేన్పులంబోని అనియు) ఘర్ఘరయను మ్రోతకలదియు, ఏతత్ చాపమ్ = ఈవిల్లు, గ్రాసప్రసక్త...వికటోదరమ్ = (ప్రలయకాలమున అనుట) తినుటయందు వ్యాప్తుఁడై, (మంచి తిండి దొరకినది గదా అను సంతసమున) నవ్వుచున్న, యముని యంత్రముంబోని నోటితెఱచుటను (విడంబించు=)పోలు భయంకరమైన కడుపు (=లోపలియవకాశము) కలదిగా, అస్తు=అగును గాక.

ఎక్కు పెట్టిన వింటిని అప్పటి తనకోపమునకు తగినట్లుగా వర్ణించి చెప్పుచున్నాఁడు - నాలుకవలె అల్లాడు భయంకరమైన కోఱలంబోలె వింటికొనలను చుట్టుకొనఁగా (నాకుచుండగా) ఇదిగో నావిల్లు భయంకరమైన ప్రళయకాలపు టుఱుముంబోని ఘర్ఘరశబ్దము చేయుచున్నదై, తిండి కూరుకొని గఱ్ఱున త్రేన్చుచు నవ్వుచున్న యంతకుని యంత్రమువంటి నోటితెఱపును పోలిన భయంకరమైన కడుపు కలదిగా అగును గాక.

రసమునకు తగిన వృత్తము - శబ్దగుంభన - ఓజస్సు. శ్లోకమున ఈఘట్టమందలి పటిమకు చాలినట్లుగాను, తక్కినచరణములు ఒక్కొక్క దీర్ఘసమాసముగానుండుటకు అనుగుణముగాను, 'జ్యాజిహ్వయా' అని వ్యస్తముగానుండక 'జ్యాజిహ్వా' అని సమాసావయముగా నుండుట మెఱుఁగు - దాన కోఱలం జుట్టుకొనునది నాలుక కాక - చిన్ననాలుక - నాలుకకొన యన్న యర్థము వచ్చుచు రసానుగుణ శబ్దవత్తరముగా నుండును. భోజనారంభమునను అవ్యాపారమునను మాటిమాటికి ఆసాసగా నాలుకకొనతో కోఱలను చుట్టిచుట్టి తడవుట సహజచేష్టయే - ఈఘర్ఘరము - బాణములు పరియునప్పటి టంకారముతోడి గుఱగుఱధ్వని. నోటను ఎముకలతో ప్రాణులను ఘురఘుర నమలి మ్రింగి గఱ్ఱనత్రేన్పుధ్వని - గ్రాసప్రసక్త - భోజనమందు వ్యగ్రమైన - హాసత్ - దండిగా ఆహారము దొరకినందులకైన సంతోషచేష్ట - ఈ శ్లోకము వీరచరితమందును రామునిమీఁదికి వచ్చిన జామదగ్న్యునిమీఁద కోపములో జనకుఁడు పలికినదిగా నున్నది. 'యథోచితం పరిక్రమ్య' — కానిందు, మీపని పట్టించెద నన్నట్లు ఉద్ధతముగా వారిమీఁదికి నడిచి, నిర్భయముగా సేన నడిమికి చొచ్చినాఁడు - చూ. V. (3) - 'సైన్యకాయే' లవునికి నిష్క్రమణ వ్యాజము ఆ సేనను దగ్గఱి దూఱఁబోవుట.

కౌసల్యా జనక సంయోగము

ఇది

చతుర్థాంకము

# ఉత్తరరామచరితనాటకమ్

## పఞ్చమాఙ్కః.

నేపథ్యే.

భోభోస్సైనికాః, జాతం జాత మవలమ్బన మస్మాకమ్!

శ్లో॥ న స్వేష త్వరితసుమన్త్రనుద్యమాన
వ్యావల్గ త్ప్రజవన వాజినా రథేన,
ఉద్ఘాతప్రచలిత కోవిదార కేతు
శ్శ్రుత్వా నః ప్రథన ముపైతి చన్ద్రకేతుః! ౧

(తతః ప్రవిశతి సుమన్త్రసారథినా రథేన ధనుష్పాణిః
సాద్భుత హర్షసమ్భ్రమః చన్ద్రకేతుః.)

---

నేపథ్యే — అంకారంభమున బిగ్గరయైన నేపథ్యభాషితము — పిలుపు — ద్రష్టలకు విస్మయమును ఆకర్షణను కలిగించును. ఇదియు కవికిగల నాటకప్రయోగ రంగ రహస్యజ్ఞానమును సూచించునదే. ఈవాక్యము పలుకువారు సేనానాయకులు. అస్మాకమ్ అవలమ్బం=మనకు ప్రాపు. దీనిచేత లవునికిని సైనికులకును బిట్టు యుద్ధము జరిగినదనియు, అందు లవుని దెబ్బకు తాళలేక చాల చీకాకుపడి సైనికులు అవలంబము కోరవలసి వచ్చినదనియు ఎఱుంగఁదగును. నేపథ్యమున నున్నవారు చేయునిట్టి యర్థసూచన 'చూళిక' యనఁబడును.

శ్లో. ౧. నను ఇతి — నను ఏషః — ఓహో! వీఁడుగో వీఁడుగో, నః ప్రథనమ్=మన యుద్ధమును, శ్రుత్వా=విని, చన్ద్రకేతుః=చంద్రకేతువు, త్వరిత సుమన్త్రనుద్యమానవ్యావల్గ త్ప్రజవన వాజినా=వడిగా సుమంత్రునిచే తోలఁబడినదగుచు వల్గితము(నాలుగుకాళ్లును పైకెత్తిదవుడు —) సేయుచున్న మిక్కిలియు వడిగల గుఱ్ఱములుగల, రథేన=రథమున, ఉద్ఘాతప్రచలిత కోవిదారకేతుః=దారిదూకుడు దెబ్బలకు మిక్కిలియు కదలియూఁగుచున్న కోవిదారధ్వజము — ఆ చెట్టుబొమ్మ గుఱుతుగానున్న జెండా — గలవాఁడై, ఉపైతి=(బాసటగ) చేరవచ్చుచున్నాఁడు.

మన యుద్ధమును విని బాసటగ వీఁడుగో, సుమంత్రసారథికముగు తేర, చంద్రకేతువు వడివడిగా వచ్చుచున్నాఁడు. గుఱ్ఱాలు వల్గితధారలో పరువెత్తుచున్నవి. దూఁకుడుదెబ్బలకు కోవిదారధ్వజము మిక్కిలియు కదలి ఆడుచున్నది.

చన్ద్రకేతుః—ఆర్య సుమన్త్ర పశ్య పశ్య!

శ్లో॥ కిరతి కలిత కిఞ్చిత్కోప రజ్యన్ముఖశ్రీ
రవిరతగుణ గుఞ్జత్కోటినా కార్ముకేణ,
సమరశిరసి చఞ్చత్పఞ్చ చూడ శ్చమూనా
ముపరి శరతుషారం కోఽప్యయం వీరపోతః. ౨

---

సుమంత్రుఁడు దశరథునికి సారథిగానుండినవాఁడు – ఇపుడు ఈ పిల్లవానికిని సారథిగా నున్నాఁడు – ముసలియైనను తోలుటకు శక్తుఁడే. అనుభవశాలి పెద్దవాఁడు పిల్లవానికి కష్టమైన యీ మేధ్యాశ్వరక్షయను పెద్దపనిలో మంచితోడు అగును అని అతని సారథిగా ఉంచినారు. కోవిదార – కాంచనమను చెట్టు అందమును మంగళమును అగుటంబట్టి జెండాకు పెట్టుకొనబడినది. ఇది వానకారుది. మా – ఋతు సం. III – చిత్తం విదారయతి కస్య న కోవిదారః? ఇది సాకేతరాజుల ధ్వజము. చిత్రకూటమున రాముం దఱియు భరతుని రథమునకును ఇది యున్నది. మా. రామా – అయో. 76 – 18.

ఏష వై సుమహాన్ శ్రీమాన్ విటపీ సంప్రకాశతే
విరాజ త్యుద్గతస్కన్ధః కోవిదారధ్వజో రథే.

సాద్భుతహర్ష సమ్భ్రమః = ఆశ్చర్యమును సంతోషమును తొందరయుకల వాఁడు – బాలుఁడగు లవుని యసాధారణ పరాక్రమమును విలుకానితనమును చూచి ఆశ్చర్యమును సంతోషమును – అతనిం గాంచుటకును తన జనముం గాచుటకు నైన సంభ్రమము.

శ్లో. కిరతి ఇతి – కలిత కిఞ్చిత్కోప రజ్యత్ ముఖశ్రీః = పొడమిన యించుక కోపమునకు ఎఱ్ఱవాఱిన ఆస్య లక్ష్మి(=అందము) కలవాఁడై, చఞ్చత్ పఞ్చ చూడః=కదలాడుచున్న ఐదు సిగలుగలవాఁడు, అయం వీరపోతః కోఽపి = ఈ వీరబాలుఁ డెవఁడో, అవిరత గుణ గుఞ్జత్ కోటినా కార్ముకేణ = తెంపులేక, అల్లెలాఁగివిడుచుటలచేత గుంజ్ అని మొరయుచున్న కొనలుగల వింటిచేత, సమరశిరసి=అని మొనలో, చమూనాం ఉపరి=సేనలమీఁద, శరతుషారం=బాణముల మంచును, కిరతి=కురియుచున్నాఁడు!

ఆర్యా, ఎవఁడో కదా ఈ వీరబాలుఁడు – పంచశిఖుఁడుగా క్షత్రియబ్రహ్మచారిగా నున్నాఁడు, అలఁతికోపమునకు కెంపెక్కి మొగము మిక్కిలి సొబగారుచున్నది. చేతి వింటి కొన వీడక మొరయుచున్నది, అని మొనలో సేనలమీఁద, మంచు ఎంతదట్టముగా కురియునో అంతదట్టముగా, బాణములు కురియుచున్నాఁడు!

శ్లో॥ మునిజనశిశు రేక స్సర్వత స్సైన్యకాయే
నవ ఇవ రఘువంశ స్యాప్రసిద్ధః ప్రరోహః,
దళిత కరికపోలగ్రన్థి టఙ్కారఘోర
జ్వలిత శరసహస్రః కౌతుకం మే కరోతి. 3

---

కిఞ్చిత్ కోప - అలఁతి రోషమున ఎదిరిని లక్ష్యపెట్టనందున. పఞ్చశిఖః - అయిదుసిగలు త్రిప్పియాతను, అందు అతిబాల్యమును సూచించును. శరతుషారమ్ - ఎల్లవారిని ఒక్కుమ్మడి సందులేక బాణములు కప్పుచుండుటచేత తుషారము - మంచు - వానకన్నను దట్టమైనది, సందులేనిది. కిరతి - సేన మొత్తముమీఁద ఒక్కుమ్మడిగా కురియుచున్నాఁ డనుట.

శ్లో. 3. మునిజనేతి - మునిజన శిశుః=మునిజనుల బాలుఁడు, పిఱికియు యుద్ధభీరువు కావలసినవాఁడు అనుట. ఏకః=ఒంటిగాఁడు, రఘువంశస్య=రఘువులవంశమను వెదురున, అప్రసిద్ధః=ఫలానా అని యెఱుఁగఁబడని, నవః=క్రొత్త (మిక్కిలియు లేత) ప్రరోహః ఇవ=పుట్టిన బాలుఁడను మొలకయో యన. తోఁచుచు, సైన్యకాయే సర్వతః=రథగజతురగపదాతి చతురంగముల నమరిన దేహము గల సైన్యము చుట్టు నుండునట్లు దానినడుమ దూఱినవాఁడై, కలిత (పా.) దళిత - కరికపోల గ్రన్థి టఙ్కారఘోర జ్వలిత శరసహస్రః = తగిలిన లేక చీల్చిన ఏనుఁగుల చెక్కిటి ముడులవంటి గట్టి పిండములయందు టంగ్ టంగ్ అను శబ్దముచే భయంకరమై, మండుచున్న - దానవే నిప్పురవలు లేచుచున్న - బాణముల సహస్రములుకలవాఁడై, మే=నాకు, కౌతుకం = వేడుక, కరోతి = కలిగించుచున్నాఁడు!

చూడఁగా మునిజనులశిశువుగా నున్నాఁడు; కవచము పూను వయసైనను అగపడలేదు. తాను ఒంటరిగానే రథ గజ తురగ పదాతియుత సకలసైన్య శరీరములో దూఱియున్నాఁడు. చుట్టు ఎటు చూచినను సైన్యమే - నడుమ వీఁడు. ఎవఁడో ఫలానా అని తెలియని రఘువంశపు వెదురు క్రొత్తమొలకయో యన తోఁచుచున్నాఁడు. ఏనుఁగుల గుండ్లవంటి చెక్కిళ్ళను టంగ్ టంగ్ అని చీల్చుచు భయంకరముగా నిప్పుకలులేచుచున్న వేలకొలఁది బాణములతో ఒప్పుచున్నాఁడు! వీనింజూడ నాకు ఎంతో వేడ్కయగుచున్నది!

ఈ వయసున ఇంతటివీరుఁడుగా నుండవలయు నన్న, వీఁడెవఁడో తెలియలేదు గాని, మారఘువంశమువాఁడే కానోపును. సైన్యకాయే - సైన్యదేహమున దూఱియున్నాఁడు, బాణాలు గ్రంథులలోపలి యెముకలకు తగిలి అవి విరిగి

సుమన్త్రః—ఆయుష్మన్,

శ్లో॥ అతిశయిత సురాసుర ప్రభావం
శిశు మవలోక్య తవైవ తుల్యరూపమ్.
కుశికసుత మఖద్విషాం ప్రమాథే
ధృతధనుషం రఘునన్దనం స్మరామి. ౪

---

చీలు మ్రోఁత టంగ్ టంగ్ అని యున్నది. దెబ్బలకు నిప్పుకలు లేచుచున్నవి- ఇనుప బాణపు ములుకులు ఎముకల నొరయఁగా. మునిజన-వ్రతోపవాసాదులుచేసి కొనువారి బాలుఁడు. శిశుః - ఇంకను వర్మహరుఁడు గాఁడు. రఘువంశస్య-అపూర్వదే ఒకపాటి యూహా సేయుచున్నాఁడు-మావంశమువాఁడే యగునా అని. కాకున్న ఇంతటి పరాక్రమము మఱెక్కడిది! ఆయుష్మన్-దీర్ఘాయూ-అని యర్థము. ఐనను సూతుఁడు రథిని ఎప్పుడు ఆయుష్మన్ అని సంబోధింపవలయును అని నాటక భాషానియమము. కావున మామూలు ఆచారోక్తియు కాఁదగును. సూతుఁడు ప్రాయికముగా వయసుపెద్దగా నుండును. రథి యుద్ధాల ఆపదల నెదుర్కొనువాఁడు ప్రతిక్షణము ప్రాణాపాయమున నుండును గాన ప్రక్కన నిరంతరము ఇట్టిది ఆశీర్వాదమువలె నగును.

శ్లో. ౪. అతిశయితేతి - అతిశయిత సురాసుర ప్రభావం=మించఁబడిన సురలయూ, అసురులయూ మహిమగలవానిని, తవ ఏవ=నీకే, తుల్యరూపమ్ = సమానమగురూపము (=అందము) గలవానిని, శిశుమ్=(ఈ)బాలుని, అవలోక్య=చూచి, కుశికసుత మఖద్విషాం = కౌశికుఁడగు విశ్వామిత్రమహర్షి యొక్క యజ్ఞమునకు శత్రువుల (తాటకాసుబాహ్వాదుల) (వారిది పెద్దమూఁక) ప్రమాథే=పరిమార్చుట యందు, ధృతధనుషం=విల్లుపట్టియున్న, రఘునన్దనమ్=రామచంద్రుని, స్మరామి= తలఁచుచున్నాను.

ఈ బాలుఁడు దేవతలను రాక్షసులను మించిన మహిమ గలవాఁడుగా నున్నాఁడు. ఆకారసౌందర్యమున నీకే సాటిగానున్నాఁడు. ఇప్పుడు ఇతనిని చూచి మునుపు కౌశిక మఖసంరక్షణమున దానికి విఘ్నములు చేయుచున్న తాటకాసుబాహ్వాదుల చంపను విల్లు చేపట్టిన రామచంద్రుని స్మరించుచున్నాను. అంతయు రామచంద్రునిపోలికగా నున్నాఁడు అనుట.

చన్ద్రకేతుః—ఇమ మేక ముద్దిశ్య భూయసా మారమ్భ ఇతి హృదయ మపత్రపతే.

శ్లో॥ అయం హి శిశు రేకకః సమరభార భూరిస్ఫుర
త్కరాళ కరకన్దళీ కలితశస్త్రజాలై ర్బలైః,
క్వణత్కనక కిఙ్కిణీ ఝణఝణాయితస్యన్దనై,
రమన్ద మదదుర్దిన ద్విరదవారిదై రావృతః. ౫

---

సుమంత్రుఁడు అన్నియు చూచి వినియున్న అనుభవశాలి కావున అతని యభిప్రాయము చాల శ్లాఘ్యమైనది. అతఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

ఇమ మేకం ఉద్దిశ్య = ఒంటిగాని నితనిం గూర్చి, భూయసా మారమ్భః ఇతి=పలువురు పనిపడుట అని, హృదయం అపత్రపతే=నామనసు లజ్జించుచున్నది.

శ్లో. ౫. అయమితి_అయం హి=వీఁడు కదా, శిశుః=పసిబాలుఁడు, ఏకకః=పాపము, ఒంటిగాఁడు. సమరభార భూరి స్ఫురత్ కరాల కరకన్దలీ కలిత శస్త్ర జాలైః బలైః=అని మొనలో మిక్కిలి మెఱయుచు అతి భయంకరములై యున్న కిరణాగ్రములతో కూఁడుకొన్న ఆయుధముల మొత్తములు గలవారి గుంపుల చేతను, క్వణత్కనక కిఙ్కిణీ ఝణఝణాయిత స్యన్దనైః= మొరయుచున్న బంగరు చిఱుగంటలయొక్క ఝణఝణ శబ్దముగల రథములచేతను, అమన్ద మద దుర్దిన ద్విరదవారిదైః=పెల్లుగా మదము తెంపులేక కురియుచున్న మేఘములంబోని యేనుఁగుల చేతను, ఆవృతః=పొదువఁబడినాఁడు.

వీనిని పసిబాలుని, పాపము, ఒంటిగానిని అని మొనలో ఆయుధీయులు మిక్కిలి మెఱయుచు భయంకరముగా (తళతళని) కిరణాగ్రములతో కూడుకొన్న ఆయుధములతో చుట్టుపాఱినారు. అట్లే బంగరు చిఱుగంటలు ఝణఝణ మొరయుచుండు రథములును చుట్టుకొన్నవి. పెల్లుగా మదము వీడక కాఱుచు, తెఱపిలేక కురియు మేఘములవలె నున్న, యేనుఁగులును చుట్టుకొన్నవి.

ఏకకః_'క' జాలి తెలుపును. కరకన్దళులు=కిరణాగ్రములు_ఆయుధముల తళతళలు_కర అనఁగా ఇట చేయికాదు. చేతిలో_కందళియోగము అంత శ్లాఘ్యము గాదు. అన్నిటిని బహువ్రీహులుగా 'బలైః'కి విశేషణములుగాఁ గొనుట మందము. అప్పుడు 'ంజాలైః' అనుదానిలో స్యందనములు వారిదములు అన్నట్లుగా ఆ విశేషణముచేత విశేష్యమగునది కుదురదు. బలములు కాల్బంట్లు

సుమన్త్రః — వత్స, ఏభిస్సమస్తైరపి నాల (కి) మస్య. కింపున ర్వ్యస్తైః?

చన్ద్రకేతుః — ఆర్య త్వర్యతాం త్వర్యతాం. అనేన మహా నాశ్రిత జన ప్రమాథో౽య మారబ్ధః! తథాహి.

శ్లో॥ ఆగుఞ్జ ద్గిరికుఞ్జకుఞ్జరఘటా నిస్తీర్ణ కర్ణజ్వరం
జ్యానిర్ఘోష మమన్దదున్దుభిరవై రాధ్మాత ముజ్జృమ్భయన్
వేల్లద్భైరవ రుణ్డముణ్డనికరై ర్వీరో విధత్తే భువ
స్తృప్యత్కాలకరాళవక్త్ర విఘస వ్యాకీర్యమాణా ఇవ. ౬

---

కాఁదగును. కాదా అందు అశ్వికులనుంగూడ ఊహింపఁదగును. సమరభార=రణ ధుర=అని మొన. దుర్దిన - మబ్బు కమ్మిన దినము - లక్షణచే వీడక కురియుట.

ఏభిః సమస్తైః అపి కిం అస్య=వీరందఱు మొత్తముగా పైకొన్నను ఇతని కేమి సేయఁగలరు? కింపునః వ్యస్తైః=విడివిడిగా ఒకరొకరుగా నైనచోఁ జెప్పవలయునా? హి=ఏలయన, అనేన=వీనిచేత...మహాన్ ప్రమాథః = మెండుగా పరిమార్చుట - ఆశ్రితజన - వారందఱు మన ఆశ్రితులు గదా - నన్ను పిలుచుకొనివచ్చుటకు కూడ వారివారు వచ్చినారే - కాసట కావలయునని.

శ్లో. ౬. ఆగుఞ్జ దితి. - ఆగుఞ్జద్గిరికుఞ్జ...రం = మిక్కిలి గీపెట్టుచున్న కొండపొదలయందలి యేనుఁగుల గుంపులకు చెవిపోటు కలిగించుచున్నదై, ఆమన్దదున్దుభిరవైః ఆధ్మాతం=పెద్దవైన రణభేరిశబ్దములతో బూరటిల్లినదైన, జ్యానిర్ఘోషం=అల్లెత్రాటి పెనుమ్రోఁతను, ఉజ్జృంభయన్=పర్వించుచు, వేల్లద్భైరవ రుణ్డముణ్డనికరైః=ఎగురుచు భయంకరముగానున్న (రుణ్డముణ్డనికరైః=) మొండెములయు తలలయు రాసులచేత, భువః=(యుద్ధ) ప్రదేశములను, తృప్యత్ కాలకరాళవక్త్ర విఘసవ్యాకీర్యమాణాః ఇవ = పరితృప్తిచెందుచున్న (ప్రళయ)కాలుని భయంకరమగు నోటియెంగిలి భుక్తశేషములచే వెదఁజల్లఁబడినవియుంబోలె, వీరః= (ఈ) వీరుఁడు, విధత్తే=చేయుచున్నాఁడు.

ఈ వీరుని చేతి వింటి యల్లె పెనుమ్రోఁత కొండపొదలయందలి యేనుగులను గీపెట్టునట్లు చేయుచున్నది. దానిని రణదుందుభుల మ్రోఁతలు బూరటిల్లఁజేయుచున్నవి. అట్టిది అంతటను వ్యాపించుచున్నది. అబాణముల వ్రేటులకు తెగిపడి మొండెములు ఎగురుచున్నవి. తలలును దుల్లి పడినవి. యుద్ధప్రదేశములన్నియు వానితో వ్యాప్తములైపోయినవి. దాన, అవి యెట్లున్నవనఁగా, ప్రళయకాలుఁడు

సుమన్త్రః—(స్వగతమ్) కథ మీదృశేన సహ వత్సస్య చన్ద్రకేతో ర్ద్వన్ద్వ సంప్రహార మనుజానీమః. (విచిన్త్య) అథవా ఇక్ష్వాకు గృహవృద్ధాః ఖలు వయం. ప్రత్యుపస్థితే చ కా గతిః?

చన్ద్రకేతుః—(సవిస్మయలజ్జాసమ్భ్రమం) ధిక్ ప్రతినివృత్తాని సర్వత సైన్యాని మమ.

సుమన్త్రః—(రథ వేగం నిరూప్య) ఆయుష్మ, న్నేష వా గ్విషయీ భూతః స వీరః.

---

తినితిని తృప్తిచెందఁగా మిగిలి అతని భయంకరమగు నోటినుండి రాలిన ఎంగిలి భుక్తశేషములతోడి పుల్లెయాకులవలె నున్నవి.

అగుఞ్జత్ - 'గుంజించుచున్నవి' ఏనుగుల గుంపులు - ఏలయన నిదురించు చున్నవానికి నిదుర చెడి ఎక్కువ కర్ణపీడకలిగినది - అల్లెత్రాఁటలకు - కేల్లత్ - తలలు తెగినపుడు, ఆ మొండెములు కొంతసేపు భయంకరముగా త్రుళ్ళుచు ఎగిరి పడుచుండును. కాలుఁడును ప్రళయమున నిండుప్రాణముతోడి ప్రాణులను ఒక్క దాని తల కొత్తికొని మొండెము క్రిందవైచును, ఒక్కదాని మొండెమును నమలి తలను క్రిందవేయును. అపుడు వాని కేల్లనము వానికి తిండిలో ఉత్సాహము పెంచును. తృప్తియై వెగటుపర్యంతము రాఁగా మిగిలినవానిని ఉమ్మి వేయును. అట్లు నమలి పాఱవేసిన తునుకలు - రుండ ముండములు - కళ్లాన త్రుళ్ళు చుండును. చూడ నతిభయంకరమగును. అవుని యీ మహిమంజూడ - 'తేజసాం హి న వయః సమీక్ష్యతే' అనునూక్తి తార్కాణపడుచున్నది.

కథం అనుజానీయామ్ = ఎట్లు అనుజ్ఞ యిత్తును? అథవా = అట్లన్న నెట్లు? ప్రత్యుపస్థితే - (అది=ద్వంద్వసంప్రహారము) సంభవించినపుడు కేలు గతియేమి? 'అహూతో న నివర్తేత ద్యూతాదపి రణాదపి.' అని శాస్త్రము. సవిస్మయ లజ్జాసమ్భ్రమమ్ - (వీరుని పరాక్రమకార్యమునకు) విస్మయము, (వాఁడు ఒకఁడైనను వానియెదుట పలువురైన తనవారు నిలువలేక పఱచుచున్నందుకు) లజ్జ, (వారిం గావను, పట్టియోటమి కానిక వానిని ఎదుర్కొనను) సంభ్రమము - వీని పెనఁకువతో ప్రతినివృత్తాని - వితిగిపఱచినవి. సుమంత్రుఁడు రథమును మఱింత వేగముగా తోలినాఁడు - తోలుటను అభినయింపుమని ఇది సుమంత్రి పాత్రమునకు ఉపదేశము. ఏష వాగ్విషయీభూతః స వీరః - వీఁడుగో, ఆవీరుఁడు మాటవినికి

చన్ద్రకేతుః—(విస్మృతి మభినీయ) ఆర్య, కిమస్య నామధేయ మాఖ్యాత మాఖ్యాయకైః?

సుమన్త్రః— లవ ఇతి.

చన్ద్రకేతుః—

శ్లో॥ భో భో లవ, మహాబాహో కి మేభి స్తవ సైనికైః?
ఏషోఽహం. మేహి మా మేవ. తేజ స్తేజసి శామ్యతు. ౭

సుమన్త్రః—కుమార పశ్య.

శ్లో॥ వ్యపవర్తత ఏష బాలవీరః పృతనానిర్మథనా త్త్వయోపహూతః,
స్తనయిత్నో రవాదిభావళీనా మవమర్దా దివ దృప్తసింహశాబః.

---

పోటి చేరువకు వచ్చినాఁడు. విస్మృతిం అభినీయ - ఇదియు పాత్రమునకు అభినయమునకైన ఎచ్చరిక. చంద్రకేతువు ఒక్కతూరియే ఇప్పటికి లవనామము విన్నది. ఇంతవఱకు ఈ వీరుఁడు ఈ వీరుఁడు అని యనుచుండెను. ఇపుడు పలుకరింపఁగోరి నపుడు పేరు జ్ఞప్తికిరాలేదు. ఈ ఘోరయుద్ధసంరంభమువలనను మఱపు ఆ యభినయముం జెప్పుట రంగరహస్యము - ప్రేక్షకాకర్షకము. భవభూతి యెఱుఁగును. ముసలిసుమంత్రునికి జ్ఞాపకమున్నది. బాలునికున్న వ్యగ్రత ఇట ముసలికి లేదు. ఆఖ్యాయకైః - (యుద్ధమువచ్చినది అని చంద్రకేతువునకు) చెప్పినవారిచేత.

శ్లో. ౭. భోభోలవేతి - భోభోలవ - ఓహో లవ, మహాబాహో=బాహుశాలీ, ఏభిః సైనికైః=ఈ సైనికులతో, తవ కిం = నీకేల? ఏషః అహమ్ - ఇదిగో నేను (వచ్చితిని.) మామ్ ఏవ ఏహి=నన్నె దఱియుము. తేజః=తేజము. తేజసి=తేజమునందు, శామ్యతు=అడంగును గాక.

నేను నీయందో నీవు నాయందో లయపొందవలసినది. నీవు నాయందు అడఁగుదువులే, ఇటురావయ్యా, వారితో చాలించి - అని యెని. లయపొందించువాఁడెవఁడో ఒందువాఁడెవఁడో స్పష్టముగాక యున్నది. మనము ఉద్దులము. ఇటురా, వారితో నేమి నీకు?

శ్లో. ౮. వ్యపవర్తతేతి. - ఏషః=వీఁడుగో, బాలవీరః=బాలుఁడయినవీరుఁడు, త్వయా ఉపహూతః=నీచే పిలువఁబడినవాఁడై, పృతనానిర్మథనాత్=సైన్యమును త్రచ్చుటను మాని, స్తనయిత్నురవాత్=మేఘగర్జ - ఉఱుము - (వినుట)వలన, ఇభావళీనాం అవమర్దాత్=ఏనుఁగుగుంపుల మర్దనమునుండి - అనఁగా దానిని మాని, దృప్తసింహశాబ ఇవ=పొగరుకొన్న సింహకిశోరమువలె, వ్యపవర్తత=ఇటుమరలినాఁడు.

(తతః ప్రవిశతి త్వరితోద్ధతక్రమో లవః)

లవః—సాధు రాజపుత్త్రి సాధు, సత్య మైక్ష్వాకః ఖ ల్వసి, తదయం పరాగత ఏ వాస్మి.

(నేపథ్యే మహాన్ కలకలః.)

లవః—(సావేగం పరావృత్య) ఆః! కథ మిదానీం భగ్నా అపి ప్రతినివృత్య యుద్ధాభిసారిణః పర్యవష్టభ్య నిఘ్నన్తి మాం చమూపతయః! ధిగ్జాల్మాన్!

---

నీవు పిలువఁగానే సైన్యమును మథించుటను మాని, ఉఱుము విని యేనుఁగులం జంపుట మాని దానివంకకు తిరుగు పొగరుఁగొన్న సింహశిశువువలె, ఇటు నీవంకకు మరలినాఁడు.

చూ. 'కి మపేక్ష్య ఫలం పయోధరాన్
ధ్వనతః ప్రార్థయతే మృగాధిపః
ప్రకృతిః ఖలు సా మహీయసః
సహతే నాన్య సమున్నతిం యయా.' భారవి - II - 21.

'అనుహుంకురుతే ఘనధ్వనిం
నహి గోమాయు రుతాని కేసరీ.' మాఘ - XVI - 35.

'మహాన్ మహత్యేవ కరోతి విక్రమమ్'

ఏనుఁగులనుండి మరలిన సింహశిశువనుటచే అటు ఇవలికి మరలినను ఆసేనలు వానివెనుక ఏమియు చేయఁజాల వనుట. ఉఱుమున ప్రతిసింహగర్జాభ్రాంతి అనుట. అట్టిదివచ్చినపుడు సింగము ముందు దానిపని చూచును, ఇతరము లెల్ల మాని. మఱి మేఘమును చెనక నేరదు కదా. అట్లే ఇతఁడు నిన్నును చెనక లేఁడులే - అని చంద్రకేతునియందు సుమంత్రుని పరాక్రమాశంస. దివ్యమైన ఉపమ!

త్వరితోద్ధతక్రమః = వడిగలదియు ఎదిరిని లక్ష్యపెట్టని తీవితో కూడినదియు నగు నడక (=క్రమ)కలవాఁడై, సాధు=బళి. సత్యం ఐక్ష్వాకః=నిజముగా ఐక్ష్వాకుఁడవే. మహాధీరుఁడవే - ఇక్ష్వాకువు రఘువంశమున తొంటిరాజు - మహాపరాక్రమశాలి - అతని సంతతి యెల్ల అట్టిదే - లవుఁడు రామాయణ పండితుఁడు, ఐక్ష్వాకుల మహిమ ఎఱుఁగును. చంద్రకేతువు మైథిలేయ దౌహిత్రుఁడని వృద్ధులవలన విన్నాఁడు. తత్ అయం పరాగత ఏవ అస్మి = ఇదిగో నేనును వచ్చినవాఁడనే. సావేగం = (కోపమువలని) కలఁతతో. కథం = ఎట్లూ! ఇసీ అనుట. భగ్నాః అపి=విచ్చిపాఱిన వారయ్యును, యుద్ధాభిసారిణః = మరల యుద్ధమునకు కడంగినవారై, పర్యవష్టభ్య = చుట్టును ముట్టడించి, నిఘ్నన్తి=కొట్టుచున్నారు-

శ్లో॥ అయం శైలాఘాత క్షుభిత బడబావక్త్రహుతభు
క్ప్రచణ్డ క్రోధార్చిర్నిచయ కబళత్వం వ్రజతు మే,
సమన్తా దుత్సర్పన్ ఘనతుములసేనాకలకలః
పయోరాశే రోఘః ప్రళయపవనాస్ఫాలిత ఇవ. ౯

(పరిక్రామతి.)

---

ధిక్ జాల్మాన్=ఛీ జాల్ములారా - ఇది కూడును ఇది కూడదు అను వివేకములేనివారలారా - మీ రెపాటి, నే నెంత, అని యెఱుంగలేక, నేను వేఱుమొగమైనపుడు వెనుకనుండి కొట్టఁగూడదు అనియు ఆలోచింపక - అనుట.

శ్లో. ౯. అయమితి - సమంతాత్ ఉత్సర్పన్=చుట్టును అంతటను వ్యాపించుచున్న, ఘన తుముల సేనాకలకలః=(యుద్ధోత్సాహముచే) బిట్టు లేచిన సంకులమైన సేనల (కలకలము=) కోలాహలము - ప్రోఁత, ప్రళయపవనాస్ఫాలితః = ప్రళయకాలపు ఝంఝుచే కొట్టి లేపఁబడిన, పయోరాశేః ఓఘః=సముద్రపు నీటి మొత్తము - పెనుకరడముల పెనుప్రోఁత కలది అన్నమాట, మే = నాయొక్క, శైలాఘాతక్షుభిత...కబలత్వం=(ఆ ప్రళయవాతమునకు కదలబాఱి విసరి రువ్వినట్టైన) కొండల దెబ్బలకు కలఁతఁజెంది - పెనుజ్వాలలతో మండజొచ్చిన - (బడబా=) ఆఁడుగుఱ్ఱపు మొగముగలదై (సముద్రమునందు నెలకొని సదా మండుచుండు) అగ్నివంటిదై భయంకరమైన (నా) క్రోధాగ్నిజ్వాలల మొత్తమునకు, కబలము = ఒక్కతూఁటి మ్రింగఁదగిన అన్నపుముద్ద - అగుటను, వ్రజతు=పొందును గాక.

ఊరకే సముద్రమది పెద్దహోరు. ఆ నీటిరాశిని ప్రళయపవనము ఎగురఁగొట్టఁజొచ్చిన అది యెంత పెద్దది అగును! అంత పెద్దదిగా నున్నది యీ సేనాకలకలము. ఆ ప్రళయ పవనుని ఆస్ఫాలనమునకే కొండలు పొదు అగలి - ఒక కొండ ఒక బండవలె రువ్వినట్లయి సముద్రమందున్న బడబాగ్నిని కెరలించును. అది అఖిలజ్వాలాకరాళముగా మండఁజొచ్చును. అట్లు భయంకరముగా అనేకజ్వాలాకరాళముగా మండజొచ్చినది నా క్రోధాగ్ని. అంతటి సముద్రజలరాశియు - ప్రోఁతతోడిది - అట్టి బడబాగ్నికి ఒక కబళమై అడఁగిపోవును. అట్లే ఈ సేనాకలకలమును నా క్రోధమునకు ఒక్క కబళమగును గాక. ఇది సైనికులకు పెద్ద బెదరింపు. అట్లడఁగిపోవుదురు మీరు కబడ్దార్ - అన్నట్లు. చక్కఁగా మనసున హత్తుకొను ఉపమానము, వర్ణన!

పరిక్రామతి - అట్లనుచు దానిని సరకుసేయకే చంద్రకేతువువంకకు నడచును. అతనిం గాంచి చంద్రకేతువు అనును.

చన్ద్రకేతుః — భో భో కుమార,

శ్లో॥ అత్యద్భుతా దసి గుణాతిశయా త్ప్రియో మే;
తస్మా త్సఖా త్వ మసి; య న్మమ, త త్తవైవ;
తత్కిం నిజే పరిజనే కదనం కరోషి?
నన్వేష దర్పనికష స్తవ చన్ద్రకేతుః. ౧౦

లవః — (సహర్షసమ్భ్రమం పరావృత్య) అహో మహానుభావస్య ప్రసన్నకర్కశా వీరవచనప్రయుక్తి ర్వికర్తనకుల కుమారస్య! తత్కి మేభి? రేన మేవ తావ త్సమ్భావయామి.

(నేపథ్యే పునః కలకలః.)

---

భో భోః=ఓహోయి.

శ్లో ౧౦. అత్యద్భుతా దితి. — అత్యద్భుతాత్ = మిక్కిలి ఆశ్చర్యము కలిగించుచున్నదైన, గుణాతిశయాత్ = శౌర్యము సౌజన్యము మొదలగు గుణముల పెక్కువవలన. మే ప్రియః = నాకు ప్రియుఁడవు — అసి = అగుదువు. తస్మాత్ = అందువలన, త్వం=నీవు, సఖా అసి=(నాకు) చెలి వగుదువు. మమ యత్ = నాది యేదో, తత్ తవ ఏవ=అది నీయదియే. తత్ = కావున, నిజే పరిజనే=నీదైన పరిజనము మీఁదనే కదనం కరోషి కిం=అని యొనర్తు వేల? ఏషః చంద్రకేతుః=వీఁడుగో చంద్రకేతువు, తవ దర్పనికషః=నీకు, దర్పమును — (బలగర్వమును) ఒరసి చూచుకొనుటకు ఒరగల్లు, నను=కదా — రా రమ్ము — అనుట.

నీవు అత్యద్భుతగుణములవలన నాకు ప్రియుఁడవు. దాననే చెలి వౌదువు. మిత్రుని దెల్ల మిత్రునిదే. అది మైత్రిమర్యాద. కావున నా పరిజనము నీ పరిజనమే. అట్టి నీ పరిజనమును ఏల కొట్టెదవు? నీకు ఉద్దిని, బలమును ఒరసిచూచుకొనసైన యొరగంటిని ఇదిగో నేను ఉన్నాను. కావున ఇటు రమ్ము.

సఖుఁడవగుదువు అనియు నిట్లు చీర నేల, అన ఊరక ఒండొరుల బలమును ఒరసి తారతమ్యము చూచుకొనుటకే — చంపుకొనుటకు కాదు — అనుట.

సహర్ష సంభ్రమమ్ — హర్ష సంభ్రమములతో — హర్షము చంద్రకేతుని నాజూకైన వీరాలాపములకును తనకు ఉద్దియైన వీరుఁడు దొరకినందునకును, సంభ్రమము — నికషమను, రా అని జగడానకు పిలుచుటవలన దానికి త్వర. మహానుభావస్య — ఈ మాటలవలనను మానసితీరువలనను గొప్ప అనుభావము (=మహిమ) తెలియుచున్నందున. ప్రసన్నకర్కశా — ప్రసాదముతోడి (సంతోషముతోడి) కఱకుదనముతో కూడుకొన్నది. సమ్భావయామి—గౌరవింతును—అనికషణమునకు అవకాశమిచ్చుటచేత

లవః—(సక్రోధనిర్వేదం) అః! కదర్థితోఽహ మేభి ర్వీరసంవాదవిఘ్నకారిభిః పాపైః! (తదభిముఖం పరిక్రామతి.)

చన్ద్రకేతుః—ఆర్య దృశ్యతాం ద్రష్టవ్య మేతత్.

శ్లో॥ దర్పేణ కౌతుకవతా మయి బద్ధలక్ష్యః
పశ్చా ద్బలై రనుసృతోఽయ ముదీర్ణధన్వా
ద్వేధా సముద్ధత మరుత్తరళస్య ధత్తే
మేఘస్య మాఘవత చాపధరస్య లక్ష్మీమ్. ౧౧

సుమన్త్రః—కుమార ఏ వైనం ద్రష్టు మపి జానాతి, వయం తు కేవలం పరవన్తో విస్మయేన.

---

అనుట. 'ద్వంద్వయుద్ధ' మొసంగి గౌరవించెదను. నిర్వేద-విసుగు-కదర్థితః అహం ఏభిః పాపైః - ఈపాపులు - పృతనాపతులు - నన్ను ఆటంకపఱుచుచున్నారు - సంవాద - పోరాటము - తదభిముఖం = సేనతట్టు - ఇప్పుడే ఇటు మరలినాఁడు, ఇంతలో అటు మరలినాఁడు - అది చాల చూడఁదగియున్న దని చంద్రకేతువు చూపి చెప్పి సంతోషించుచున్నాఁడు.

శ్లో. ౧౧. దర్పేణేతి—కౌతుకవతా = నాపరాక్రమమును పరీక్షింపఁగోరిన కుతూహలముతోడిదైన, దర్పేణ=ఔద్ధత్యముతో, మయి=నాయందు, బద్ధలక్ష్యః = గుఱి నిలిపినవాఁడై, (ఇంతలో) పశ్చాత్ = వెనుకతట్టు, బలైః=సేనలచేత, అనుసృతః = తఱుము (అఱుము)ఁబడినవాఁడై, అయం=ఇదిగో వీఁడు, ఉదీర్ణధన్వా = ఎత్తిన ధనుస్సుకలవాఁడై, ద్వేధా సముద్ధత మరుత్తరళస్య = రెండువైపుల బెడిదముగా లేచినగాలికి ఇటు నటు నిలుకడలేక పఱచు, మాఘవతచాపధరస్య మేఘస్య=ఇంద్రధనుస్సుతాల్చిన మేఘముయొక్క, లక్ష్మీం=అందమును, ధత్తే=తాల్చియున్నాఁడు.

ఎదుటనున్న నన్ను వాళౌర్యము నొరసిచూచు కుతూహలముతోను దర్పముతోను గుఱిపెట్టి, ఇంతలో వెనుక సేనలు అఱుమఁగా (అటును కనుపెట్టుచు) చేత విలుదాల్చి, ఇటు నటు నడచు వీఁడు ఇటు నటు ఇరువైపుల వీచు గాలిచే ఇటునటు కదలుచున్న ఇంద్రధనువుతోడి మేఘమునందము దాల్చియున్నాఁడు.

అవుఁడు - రామునివలె - మేఘవర్ణుఁ డగుటంబట్టి యీయుపమ కరము ఒప్పి అందముగా ఉన్నది.

ద్రష్టుం అపి జానాతి=చూడనైనను నేర్చును. వయం తు=నేను అన్నచో - బహువచనోత్తమపురుషమునకు ఏకవచనము అర్థము. రాజానః - సామంతులైన రాజులు. చమూపతులుగా వారే వచ్చియున్నారు.

చన్ద్రకేతుః—భో భో రాజానః.

శ్లో॥ సఞ్ఛ్యాతీతై ర్ద్విరద తురగ స్యన్దనస్థైః పదాతా,
వ త్రైకస్మిౕ, కవచనిచితై ర్మేధ్యచర్మోత్తరీయే,
కాలజ్యేష్ఠై రభినవవయః కామ్యకాయే భవద్భి
ర్యోఽసౌ బద్ధో యుధి పరికర స్తేన ధిగ్వో! ధిగస్మాౕ! ౧౨

లవః—(సోన్మాథం) కథ మనుకమ్పతే నామ! (విచిన్త్య) భవతు, కాలహరణప్రతిషేధాయ జృమ్భకాస్త్రేణ తావ త్సంస్తమ్భయామి సైన్యాని. (ఇతి ధ్యానం నాటయతి.)

---

శ్లో. ౧౨. సఞ్ఛ్యాతీతైః ఇత్యాదిః - సఞ్ఛ్యాతీతైః=లెక్కకు మించినవారిచేత, ఏకస్మిౕ=ఒక్కనియెడ, ద్విరదతురగస్యన్దనస్థైః=ఏనుఁగులమీఁదను, గుఱ్ఱాలమీఁదను, తేరులమీఁదను ఉన్నవారిచేత, పదాతౌ = పదాతియైనవానియెడ, కవచనిచితైః=కవచములచే కప్పఁబడినవారిచేత, మేధ్యచర్మోత్తరీయే=మడియైన జింకతోలును పైన అంగవస్త్రముగా వేసికొనియున్నవానియెడ, కాలజ్యేష్ఠైః = వయసుముదిరిన పెద్దవారిచేత, అభినవవయః కామ్యకాయే=లేఁబ్రాయపు - అందమైన దేహముగలవానియందు, భవద్భిః=మీచేత, అత్ర=వీనియెడ, యః అయం పరికరః బద్ధః=ఏయీకాసె - నడికట్టు - కట్టఁబడినదో, తేన=దానిచేత, ధిక్ వః=అవమానము మీకు! ధిక్ అస్మాౕ=అవమానము నాకు! ఛీఛీ!

లెక్కలేనిమీరు వయఃప్రౌఢులు, దేహము కవచముతో రక్షించుకొని రథాలను గజాలను గుఱ్ఱాలను ఎక్కియున్నారు! ఈయొంటిగానిని, మీఁద రవంత మడిగా జింకతోలు అంగవస్త్రముగా వేసికొన్న పసిబాలుని, నేలమీఁద నిలుచున్నవానిని, ముద్దుకాఱుచున్న మేనివానిని, పైకొనుచున్నారే! ఛీఛీ! మీ కెంత యవమానము! నా కెంత యవమానము!

ఇట్లు ఉభయవిశేషణములు ప్రక్కప్రక్కన కూర్చుటచే తారతమ్యము తగవుగామి స్పష్టతరము. ఇది భవభూతికవననైపుణి. రంగాన అభినయరహస్య మెఱుఁగుటయు. సోన్మాథమ్=మనోవ్యథతో - కథం! అనుకమ్పతే నామ!=ఏమి! ఇసీ! నన్ను కనికరించుచున్నాఁడు! వీరుఁడు తాను కనికరమునకు పాత్రీభవింపఁ

సుమన్త్రః—తత్కిమకస్మాదస్మాత్ సైన్యఘోషః ప్రశామ్యతి!

లవః—పశ్యా మ్యేన మధునా ప్రగల్భమ్.

సుమన్త్రః—వత్స, మన్యే కుమారేణ జృమ్భకాస్త్రమామన్త్రితమితి.

చన్ద్రకేతుః—కః సన్దేహః?

శ్లో॥ వ్యతికర ఇవ భీమ స్తామసో వైద్యుత శ్చ
ప్రణిహిత మపి చక్షు ర్గ్రస్తముక్తం హినస్తి.

---

బడితినే అని మనోవ్యథ. విచిన్త్య = ఉపాయమును - కర్తవ్యమును - ఆలోచించి. ప్రతిషేధాయ = తప్పించుటకై, మాన్పుటకై, సంస్తమ్భయామి=మాన్పుఁజేదను. ఏప్రయోజనమును ఉద్దేశించి ప్రయోగించిన ఆయస్త్రము ఆప్రయోజనముం గూర్చును. జృమ్భకాస్త్రములను చిత్రదర్శనకాలమున రాముఁడు సీతాగర్భమునకు అనుగ్రహించి యుండెను. కావున కుశలవజన్మానంతరము జృంభకాస్త్రములు దేవతాత్మకములు గావున తమ్ము అన్నివిధాల తెలుపుకొని కుశలవుల సేవింపవచ్చినవి. సమయాన మాపిలుపును అందుకొనుచుండుఁడు అని చెప్పి వానిని వారు విసర్జించిరి. లవుఁడు ఇపుడు ప్రయోగించుచున్నాడు. ధ్యానం నాటయతి - ధ్యానమును నటించును - ఇది వేసగానికి ఉపదేశము - ధ్యానక్రమము:- 'నాసాగ్రన్యస్తనయనః సంవృతాస్యః సునిశ్చలః ధ్యాయీత మనసా దేవ మూర్తిం విష్టభ్య చాగ్రతః.' తత్ కిం= ఏమి యిది? అకస్మాత్ = ఉన్నట్లే ఉండి. సప్రగల్భమ్ - 'స' లేక ఊరక ప్రగల్భమ్ - అని యుండుట సరి - అది విశేషణము - ఇఁక నిపుడీప్రగల్భుని - దర్పముగా మాటలాడుచున్నవానిని 'బడాయికోరును' అమన్త్రితమ్=అభిమన్త్రితమ్ - (మంత్రము పలికి) ప్రయోగింపఁబడినది. అత్ర కః సన్దేహః=అందులకు సందేహమేమి? చంద్రకేతువునకును తెలియును. జృంభకాస్త్రమన ఎట్టిదో. ఇపుడు కార్యమున దానిం గాంచి వర్ణించుచున్నాఁడు.

శ్లో. ౧౩. వ్యతికర ఇవ:—తామసః=చీఁకటులయు, వైద్యుతశ్చ=మెఱపులయు, భీమః=భయంకరమగు, వ్యతికరఇవ=కలయికవలె, ప్రణిహితం అపి=ఉంపఁబడినదానినైనను - కనుచున్నదానినైనను, చక్షుః=కంటిని, గ్రస్తముక్తం=అంతలో కప్పినట్లును అంతలో విడిచినట్లును - అనఁగా అంతలో ఏమియు అగపడని కాఱుచీఁకట్లును అంతలో మిఱుమిట్లు గొలుపు మెఱపులును వ్యాపించుచున్నట్లు ఉండుటంబట్టి, హినస్తి=నొంచుచున్నది - బాధపెట్టుచున్నది. అథ = అంతట,

అథ లిఖిత మివైత త్సైన్య మస్పన్ద మాస్తే.
నియత మమితవీర్యం జృమ్భతే జృమ్భకాస్త్రమ్! ౧౩

ఆశ్చర్య మాశ్చర్యమ్!

శ్లో॥ పాతాళోదర కుఞ్జపుఞ్జిత తమశ్శ్యామై ర్నభో జృమ్భకై
రుత్తప్త స్ఫురదారకూటకపిశ జ్యోతిర్జ్వలద్దీప్తిభిః,
కల్పాక్షేప కఠోరభైరవ మరుద్వ్యస్తై రవస్తీర్యతే
మీలన్మేఘ తటిత్కడార కుహరై ర్విన్ధ్యాద్రికూటై రివ. ౧౪

లిఖితం ఇవ=చిత్తరువువలె, ఏతత్ సైన్యమ్=ఈదండు, అస్పన్దం=కదలక - చేష్ట దక్కినదిగా, ఆస్తే=ఉన్నది. నియతం=తప్పకుండ, నిజముగా, అమితవీర్యమ్ = ఎదురులేని బలముగలదై, జృమ్భకాస్త్రమ్ = జృంభకాస్త్రము, జృమ్భతే=విజృంభించుచున్నది - ఏచుచున్నది - రేగుచున్నది.

నిజముగా ఇది ఎదురులేని వీర్యముగల జృంభకాస్త్రపువిజృంభణమే! చీకటులయు మెఱుపులయు భయంకరపుఁ జెనపుగా నున్నది! ప్రయత్నముతో మాపు నిలిపిన, కంటిని మూసినట్లును మూఁతవిడిచినట్లును బాధించుచున్నది. మఱి దండేమి చిత్రార్పితమువలె చేష్టదక్కినది! చాల శ్లాఘ్యమైన ఉపమ.

ఇట్లు జృంభకకార్యమును చంద్రకేతువు చెప్పినాఁడు. దానినే సుమంత్రుఁడు తనకు తోఁచినట్లు తాను చూచినట్లు చెప్పుచున్నాఁడు. దాని కార్యము కడు ఆశ్చర్యకరము.

శ్లో. ౧౪. పాతాళేతి - పాతాళోదర...శ్యామైః = పాతాళములోపలి పొదలలో మొత్తములై పేరియున్న చీకటులవలె నల్లనైనవియు, ఉత్తప్తస్ఫురదార కూట...భిః = క్రాగి కరఁగి తళతళలాడు ఇత్తడి ద్రవపు పచ్చనిజ్వాలల మెఱయు కాంతులుగలవియు నగు, జృమ్భకైః = జృంభకాస్త్రములచేత, కల్పాక్షేప...వ్యస్తైః = కల్పముయొక్క కడపట - ప్రలయకాలమున - దుస్సహములును భయంకరములునగు గాలులచే (పెకలింపఁబడి) రువ్వఁబడినవియు, మీలన్మేఘ తటిత్కడారకుహరైః = గుంపులువడుచున్న మేఘములుగలవియు, (వాని) మెఱుపులపచ్చనగలవియు నగు గుహలు గల, విన్ధ్యాద్రికూటైః ఇవ = వింధ్యపర్వతపు శిఖరముల చేతనుంబోలె, నభః=మిన్ను, అవస్తీర్యతే=కప్పఁబడుచున్నది.

పాతాళము చీకటి. దానికడుపులో మఱియు నల్లని చీకటి. అక్కడి పొదలలో ఇఁక చెప్పవలయునా! పేరిన పెను చీకటి! దానివలె నల్లగా నున్నవి యీజృంభకములు. అట్లే - క్రాగికరఁగిన ఇత్తడిద్రవము మైల యెల్ల పోయి

పసుపుగా తళతళలాడుచుండును - అకరఁగినవానినుండి పచ్చనిజ్వాలలు లేచు చుండును - వానివలె మెఱయు కాంతులును కలిగియున్నవి. అంతలో అంత నల్ల కాంతి మొత్తము, అంతలో అంత పసుపుకాంతి మొత్తము విసరినట్లు వ్యాపించు చున్నది ఆకసమున - అవే జృంభకములు. అట్లు విసరుగా అవి మింట వ్యాపించుట ఎట్లున్నదనఁగా కల్పావసానమున అపాయకరముగాను భయంకరముగాను వీచు గాలులు పెకలించి రువ్విన వింధ్యాద్రికూటములవలె నున్నది. అవి యెట్టి వనఁగా వాని గుహాలలో మేఘముల గుంపులును వాని మెఱపుల పచ్చని తళతళలును మెండు కొనుచున్నవి. మిక్కిలి అద్భుతమగు వర్ణన.

రువ్వఁబడిన వింధ్యశిఖరము తగిలిన ఎట్టి యపాయముకలుగును! చిదిగి చావ వలసినదే కదా - మఱి యీచీఁకటిమోపులును మెఱపులపఱపులును ఐన జృంభ కములు అట్లు చిదుగగొట్టక పర్వి దండును నిశ్చేష్టము చేసినవి. భయంకరమగు పెద్దవి యనుటకును అట్లు విసరుగా పర్వుచున్నవి యనుటకును అట్టి వింధ్యశిఖర ముల సామ్యము. అంతియకాని చిదుగఁగొట్టి చంపుటకు కాదు.

తాటకవధయనంతరము దేవతలప్రేరణచే విశ్వామిత్రుఁడు రామునికి లెక్క లేని యస్త్రములు ఉపదేశించెను. రామా. బాల. 26 స.

> మునే కౌశిక భద్రంతే సేన్ద్రాః సర్వే మరుద్గణాః
> తోషితాః కర్మణానేన స్నేహం దర్శయ రాఘవే
> ప్రజాపతేర్ భృశాశ్వస్య పుత్రాన్ సత్యపరాక్రమాన్
> తపోబలభృతా న్బ్రహ్మన్ రాఘవాయ నివేదయ.
> పాత్రభూతశ్చ తే బ్రహ్మం స్తవానుగమనే ధృతః
> కర్తవ్యం చ మహ త్కర్మ సురాణాం రాజసూనునా.

27 - స...

> జృమ్భకం సర్వనాభంచ సన్తానవరణౌ తథా
> భృశాశ్వతనయాన్రామ భాస్వరాన్ కామరూపిణః,
> ప్రతీచ్ఛ మమ భద్రం తే పాత్రభూ తోసి రాఘవ.
> బాఢ మి త్యేవ కాకుత్స్థః ప్రహృష్టే నాన్తరాత్మనా
> దివ్యభాస్వరదేహాశ్చ మూర్తిమన్తః సుఖప్రదాః
> కేచి దఙ్గారసదృశాః కేచి ద్ధూమోపమా స్తథా-

ఇత్యాది. ఇందుండి జృంభకములు ప్రయోగమున ఇట్టివగును అనునది ఇవెల్ల

సుమన్త్రః—కుతః పునరస్య జృమ్భకాణామాగమస్స్యాత్?

చన్ద్రకేతుః—భగవతః ప్రాచేతసాదితి మన్యే.

సుమన్త్రః—నాస్య వ్యవహారోఽస్త్రేషు, విశేషతో జృమ్భకేషు.

శ్లో॥ భృశాశ్వతనయా హ్యేతే భృశాశ్వాత్కౌశికం గతాః,
అథ తత్సమ్ప్రదాయేన రామభద్రే వ్యవస్థితాః. ౧౫

భవభూతి యద్భుతభావన, ఏతదంగారధూమప్రభవము కాఁబోలు. ఏతత్తుల్యకల్పన భంగ్యంతరమున వీరచరిత్రమునను I-43, 44.

ఝటిత్యేవోత్తప్తద్రుత కనకసిక్తా ఇవ దిశః
పిశఙ్గత్వాత్ సన్ధ్యాన్తరిత ఇవ నిర్భాతి దివసః.
జ్వలత్కేతువ్రాతస్థగిత మివ దివ్యాస్త్రనిచితమ్
నభో నైరన్తర్య ప్రచలిత తడిత్పిఞ్జర మివ.
తేజోభి ర్దిశిదిశి విశ్వతః ప్రసృప్తై
రాదిత్యద్యుతి మపవిధ్య విస్ఫురద్భిః
పర్యాయ త్వరిత గృహీత విప్రముక్తః
సామర్థ్యం రహాయతి నాయనో మయూఖః.

సుమంతునికి జిజ్ఞాస, వీనికి జృంభకములు ఎక్కడివి అని. ఏలయన వాని సంప్రదాయమును ఆముసలి ఎఱుఁగును. ఎఱుఁగక బాల్యసులభముగా చంద్రకేతువు వాల్మీకివలన, అనును. నాస్య వ్యవహారోఽస్త్రేషు - ఈయనకు అస్త్రములలో వ్యవహారము - ఎఱుఁగుననుట నేర్పుననుట - లేదు. విశేషతః - అందును విశేషముగా అనఁగా బొత్తిగా లేదు.

శ్లో. ౧౫. భృశాశ్వేతి.—ఏతే=ఇవి, భృశాశ్వతనయాః హి=భృశాశ్వుని అపత్యములు సుమా. భృశాశ్వాత్=భృశాశ్వునుండి, కౌశికం గతాః = కౌశికుని (కి) చెందినవి. అథ = అనంతరము, తత్ సంప్రదాయేన = అతని గురుక్రమమున చేసిన ఉపదేశముచేత, రామభద్రే=రామభద్రునియందు, వ్యవస్థితాః=నెలకొన్నవి.

జృంభకముల సంప్రదాయము ఎట్లనఁగా - అవి తొలుత భృశాశ్వుని బిడ్డలు, ఆయన తపస్సుచేసి సాక్షాత్కరించుకొన్నవి. ఆయనవలన (ఉపదేశముచే) కౌశికుని చెందినవి. తరువాత కౌశికుని యుపదేశమువలన రామభద్రునియందు నెలకొన్నవి.

చన్ద్రకేతుః—అపరేఽపి ప్రచీయమాన సత్త్వప్రకాశా స్స్వయమేవ హి మన్త్రిదృశః పశ్యన్తి.

సుమన్త్రః—వత్స సావధానో భవ; పరాగతః ప్రవీరః.

కుమారౌ—(అన్యోన్యం ప్రతి.) అహో ప్రియదర్శనః, (సస్నేహానురాగం నిర్వర్ణ్య.)

శ్లో॥ యదృచ్ఛాసంవాదః కిము, కిము గుణానా మతిశయః,
పురాణో వా జన్మాన్తర నిబిడబద్ధః పరిచయః.

---

మరల 'భృశాశ్వాత్' అనుట – మఱెవ్వరివలననుం గాదనుటకు.

అవి సంప్రదాయమును తప్పవు – అనుట. సంప్రదాయ – చక్కఁగా లెస్సగా' ఇచ్చుట. గురుశిష్యక్రమమున చేర్చుట.

పరమోపచీయమానసత్త్వప్రకాశాః = మిక్కిలి పెద్దమొత్తములుగా పెరుఁగుచున్న సత్త్వముయొక్క ప్రకాశముగలవారు. వాల్మీకి అట్టివాఁడు గానోపు. ఆయన సొంతముగానే ఎఱుఁగునో ఏమో! సావధానః = ఎచ్చరిక – జాగ్రత్త – కలవాఁడవు. పరాగతః=సమీపమునకు వచ్చినాఁడు. ప్రవీరః=గొప్పవీరుఁడు.

కుమారౌ—లవచంద్రకేతు లిరువురును. ఒక్క శ్లోకముచే ఇతఁడు అతని గూర్చియు అతఁడు ఈతని గూర్చియు పలుకుచున్నారు – ఇరువురికిని సమభావములే అనుట. రంగమునను ఇట్టిది ఎక్కువ రక్తికట్టును అని భవభూతియాశయము. ప్రియదర్శనః – ప్రీతిగొల్పు అగపాటు గలవాఁడు, – మిక్కిలి అందగాఁడు అనుట. ఇతనిం జూచుట నాకు ఎంతో ప్రియముగానున్నది! అనుట. సస్నేహానురాగమ్ – స్నేహములోను అనురాగములోను – చూడఁగానే అవి కలుగుచున్నవి.

శ్లో. ౧౬. యదృచ్ఛేతి—యదృచ్ఛాసంవాదః కిము=అలవోకగా – కాకతాళీయముగా – కలిగిన యొండొరుల సంభాషణమో! గుణానాం అతిశయః కిము=శౌర్య సౌందర్య సౌజన్యాది గుణముల యొక్కవయో! పురాణః=మిగులప్రాఁతది – చాల కాలమునాటిది. జన్మాన్తర నిబిడబద్ధః పరిచయః వా = (లేక, అదిగాకున్న, పూర్వజన్మమున గట్టిగా ఒండొరులకు ఏర్పడి (మనసున) మూటకట్టిపెట్టి ఉన్న స్నేహమో! విధివశాత్=విధిబలమువలన, – విధి – గ్రహచారము – అడ్డపడిఁపినందున, అవిదితః = ఎఱుఁగఁబడని, కోఽపి=ఏదేని, నిజః = నా సొంతమైన,

నిజో వా సమ్బన్ధః కిము విధివశాత్కోఽప్యవిదితో,

మమైతస్మిన్ దృష్టే హృదయ మవధానం రచయతి. ౧౬

సుమన్త్రః—భూయసా జీవిధర్మ ఏషః, యత్ర రసమయా కస్య

---

సమ్బన్ధః వా కిము=బంధుత్వమో! (నిర్ణయింపరాకయున్నది.) ఏతస్మిన్ దృష్టే = ఇతనిని చూడఁగానే, మమ=నాకు, హృదయమ్=మనసును, అవధానం=ఆదేధ్యానముగా నుండుటను, రచయతి=పొందించుచున్నది - హృదయమునకు తన్మయత్వమును కలిగించుచున్నది, - ఈతనిం గాంచఁగా, ప్రీత్యనురాగముల చేత!

(స్నేహానురాగముల చేత) ఈతనిం గాంచఁగానే నామనసు తన్మయమై పోవుచున్నది. అందులకు కారణము ఏమగునో కదా - అలవోకగా ఇపుడు మాకు జరిగిన మాటలా? ఇతనియందలి శౌర్యసౌభాగ్యసౌజన్యాదుల యతిశయమా? చాలకాలముదై, పూర్వజన్మమున గట్టిగా వీడిపోక మూటకట్టి మనసున పెట్టి నదియునైన స్నేహమా? విధిబలమున ఫలానా అని తెలియని నా సొంత బంధు వెవఁడైనను అగునా ఇతఁడు?

'కిము' 'కిము' అని ఒకటొకటియు ఆశ్చర్యహేతువుగా వితర్కముతో పలుకుట. తరువాత 'హృదయమ్' - ప్రథమగా కర్తగా గ్రహించుట. హృదయము అవధానము - స్నేహానురాగపరవశత చే - తదేకాగ్రమగుటను చేయుచున్నది - అని ఒక అన్వయక్రమము. ఇందు సంవాదాదు అన్నియు అన్ని యాశ్చర్యవాక్యములుగా గ్రహింపఁబడును. అట్లు గాక - సంవాదాదులన్నియు ప్రత్యేకముగా కర్తలు. హృదయమ్ కర్మ - అవధానమ్=రెండవ కర్మ - రచయతి - గత్యర్థకము, దాన బుద్ధ్యర్థకము, ణిజంతము - హృదయమును అవధానమును చేయించుచున్నది-అని. ఈ రెండవ పక్షము శ్రేయము. 'హృదయమ్ అవదాతం రచయతి - సంవాదాదిః.' సంవాదాదులు మనస్సును 'ప్రసన్నముగా' ఒనరించుచున్నవి - అని 'అవదాతమ్' అని పాఠమగునా? ఉపలబ్ధము కాలేదు.

'సతీవ యోషిత్ ప్రకృతిః సునిశ్చలా
పుమాంస మభ్యేతి భవాన్తరే ష్వపి.'
'త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.'

మొదలగు కాళిదాసాదుల సూక్తులను తలఁపించుచున్నది.

భూయసా=ప్రాయికముగా, జీవిధర్మః=ప్రాణుల స్వభావము, యత్=ఏదనఁ

చిత్క్వచి త్ప్రీతిః, యత్ర లౌకికానాం వ్యవహార స్తారామైత్రం చక్షూరాగ ఇతి త మప్రతిసఙ్ఖ్యేయం ప్రమాణ మామనన్తి.

శ్లో॥ అహేతుః పక్షపాతో య స్తస్య నాస్తి ప్రతిక్రియా.
స హి స్నేహాత్మక స్తన్తు ర న్తర్మర్మాణి సీవ్యతి. ౧౭

గా - తనమయిూ ప్రీతిః = ప్రణయ - స్నేహ - పూర్ణమయినప్రీతి. యత్ర = ఎందు - అనఁగా - అందు - ఆవిషయమున, లౌకికానాం వ్యవహారః = లౌకికులవ్యవహారము - లౌకికులావ్యవహరింతురు - ఏమనియనఁగా - తారామైత్రం చక్షూరాగః ఇతి - 'తారామైత్రము' అనియు, 'చక్షూరాగము' అనియు.

తారామైత్రము - అనఁగా తారల = కంటిపాపల - మైత్రి. కంటిపాప కంటిపాప కలియఁగానే - చూపులు కలిసినమాత్రకే పుట్టుస్నేహము. చక్షూరాగము - కన్నుల యనురాగము, ఇతనికంటికి అతనికంటియందు - అనఁగా అదియు చూపుల కలయిక యనుటే. లోకులు ఒక్కదానికే ఈ రెండు పేరులు చెప్పుదురు - అన్న మాట. అహేతుపక్షపాతమునకు ఈ పేరులు చెప్పుదు రనుట. ఏకార్థముగా రెండు పేరులు చెప్పనేల? లోకులనోట అట్లును వెడలును, ఇట్లును వెడలును. అందుల కేమి? కాదా. తారామైత్రకమ్ - గ్రహమైత్రకమ్ - ఒండొరుల గ్రహమైత్రిచే కలుగునది - అనుట - ఈయర్థమున అహేతుతకు ప్రకారాంతరము చెప్పినట్లగును. ఇదియ సాధీయ మనఁజెల్లును - కనీనిక, కన్ను అనుట పునరుక్తప్రాయ మగును. ఇందన్నిటో భేదమును అర్థపుష్టియు కలుగును. ఈయర్థము ఆప్తేనిఘంటువున నున్నది. తత్ అప్రతిసఙ్ఖ్యేయం ప్రమాణం ఆమనన్తి = దానిని గ్రోవివైవరాని ప్రమాణ మని పలుకుదురు. - 'అప్రతిసఙ్ఖ్యేయం అనిబన్ధనం ప్రేమాణం' అను పాఠము సాధువుగాదు - ఏలన 'ప్రీతి' అని మున్నె తొడంగియున్నందున మరల 'ప్రేమాణం' పునరుక్తి అగును - 'ప్రమాణం' అనుట సాధీయమగు పాఠము, అర్థపుష్టము. 'చక్షూరాగాది' మహిమను చెప్పను - అదియొక గొప్పప్రమాణము - అని. అప్రతిసఙ్ఖ్యేయం అనిబన్ధనం ప్రమాణం - పా=ఇట్టిదని యెఱుంగరానిదియు ఇది మూల మనరానిదియు నగు ప్రమాణ మని.

శ్లో. ౧౭. అహేత్వితి - అహేతుః = హేతువులేని, పక్షపాతః = మైత్రి - ప్రీతి, యః=ఏదో, తస్య=దానికి, ప్రతిక్రియా = భంగపాటు, న అస్తి=కలుగదు. హి=ఏలన, సః=అది, స్నేహాత్మకః తన్తుః=స్నేహరూపమున నున్న దారము; అంతర్మర్మాణి=హృదయములోని మర్మములను - తెలియరాని ఆయువుపట్టులను, సీవ్యతి = కుట్టును. ఒక్కటిగా చేర్చును అనుట.

కుమారౌ—(అన్యోన్యం ప్రతి.)

శ్లో॥ ఏతస్మి న్మసృణిత రాజపట్టకాన్తే
మోక్ష్యామః కథ మివ సాయకా ఞ్ఛరీరే!
యత్ప్రాప్తౌ మమ పరిరమ్భణాభిలాషా
దున్మీల త్పులకకదమ్బ మఙ్గ మాస్తే ౧౮

నిర్హేతుకస్నేహమునకు ఏవిధముచేతను భంగము కలుగదు. అది యొక దారమువంటిది, - లోని మర్మములను - హృదయములనే - ఒకటిగా చేర్చి కట్టును.

ఈ భావము భవభూతికి కరముప్రియము. లవచంద్రకేతువులకు ఒండొరులకు కలిగినట్లే, అంతకన్నను ఎక్కువగాను లవకుశులం గాంచిన రామునికిని అది కలిగెనని చెప్పెను. మాలతీమాధవమందును మాలతిం గాంచిన మాధవునికి కలిగినదని చెప్పెను. అందును ఈ మాటలే కలవు - 'సా మమ దర్శనాత్ ప్రభృతి అమృతవర్తిరివ చక్షుషోః నిరతిశయమానన్ద ముత్పాదయన్తీ అయస్కాన్తమణిశలాకేవ లోహధాతు మన్తఃకరణ ముపసంహృతవతీ - కిం బహునా?

సన్తాపసన్తతి మహావ్యసనాయ తస్యా
మాసక్త మేత దనపేక్షితహేతు చేతః।
ప్రాయః శుభం చ విదధా త్యశుభం చ జన్తోః
సర్వఙ్కషా భగవతీ భవితవ్యతైవ.
స్నేహశ్చ నిమిత్త సవ్యపేక్ష ఇతి విప్రతిషిద్ధ మేతత్.
వ్యతిషజతి పదార్థా నాన్తరః కోఽపి హేతుః ఇత్యాది.

ఇట లవునికే కాక, సుమంత్రునికిని సొంతముగా కలుగుచున్నది.

నారలంగూడ కుమారులు అన్యోన్యము ఒక్కటే శ్లోకమును పలికెదరు. అది న్యాయ్యమే గదా. ఈ కుమారునికి ఆ కుమారునియెడ నెట్టిభావములు కలుగునో ఆ కుమారునికి ఈ కుమారుని యెడను అట్టివే కలుగును.

శ్లో. వ్యా. ఏతస్మిన్ - ఇతి - మసృణిత రాజపట్ట కాన్తే = మెఱుంగిడిన రాజపట్టమనెడు (నీల)మణియొక్క కాంతివంటి కాంతికలదైన, ఏతస్మిన్ = ఈ, శరీరే = మేనియందు, సాయకాః = బాణములు, కథమివ = ఎటువలె, మోక్ష్యామః = విడువదగును - ప్రయోగింపఁదగును? యత్ప్రాప్తౌ = ఏది దొరకఁగా - (ఇది దొరకినంతనే,) పరిరమ్భణాభిలాషాత్ = కౌగిలించుకొనవలయునను కోరికవలన, మమ = నాకు, అంగం = దేహము, ఉన్మీలత్ పులకకదమ్బకం = పొడముచున్న గగురుల మొత్తము కలదిగా, ఆస్తే = ఉన్నది - ఐనది.

శ్లో॥ కిన్త్వాక్రాన్తకఠోరతేజసి గతిః కా నామ శస్త్రం వినా!
శస్త్రేణాపి హి తేన కిం న విషయో జాయేత యస్యేదృశః?
కిం వక్ష్యత్యయమేవ యుద్ధవిముఖం మాముద్యతేఽప్యాయుధే?
వీరాణాం సమయో హి దారుణరసః స్నేహక్రమం బాధతే. ౧౯

---

ఈ తనిదేహము మెఱుఁగుపెట్టిన రాజపట్టమువలె మెఱయుచున్నది. దీనిపై బాణములు ఎట్లు వేయనగును? నొప్పి కలిగింపవా? ఇది దొరకఁగానే దీనిని ఎప్పుడెప్పుడు కౌఁగిలించుకొందమా అను ఆసచేత నాదేహమంతయు దట్టముగా పులకరించినదే!

'రాజపట్ట'మని ఒక నీలమణివిశేషము - 'రాజపట్టకాన్తా' అని పఠించుట శ్రేయము - అర్థము స్పష్టతర మగును. లవచంద్రకేతువు లిరువురును ఆ నీలమణి ఛాయవారే.

శ్లో. ౧౯. కింత్వితి — కింతు=అయినను. ఆక్రాన్తకఠోరతేజసి=అధిష్ఠించిన - కాదా మనసులో పెల్లివోడిచిన - కాదా మేరమీఱిన - క్రూరమగు పరాక్రమముగల వానియెడ, శస్త్రంవినా = ఆయుధము తప్ప, కా నామ గతిః = ఉపాయము ఏమగును? తేన శస్త్రేణ అపి=ఆయుధముచేతనైనను, కింహి=ఏమి ప్రయోజనము కలుగును? యస్య = దేనికి - అనఁగా దానికి, ఈదృశః = ఇట్టివాఁడు, విషయః న జాయేత=అందుపాటు కాఁడే అయం ఏవ=ఈతఁడే, ఆయుధే ఉద్యతే అపి = (తాను) ఆయుధము పూనినను, యుద్ధవిముఖం = యుద్ధమునకు వెడమొగమిడిన, మాం=నన్ను, కిం వక్ష్యతి = ఏమనును? వీరాణాం = వీరులయొక్క, సమయః హి = ఆచారము - ఏర్పాటు - అన్నవో, దారుణరసః = భీషణమైన చవిగలదై, స్నేహక్రమం = స్నేహమార్గమును, బాధతే = అడ్డునదగునే!

పరాక్రమము పెల్లివోడుచుచున్న యీతనిని కైదువును ఎత్తకుండనే ఎట్లు ముట్టనగును? ఆకైదువైనను తనకు అందని ఇట్టివానియెడ ఎందులకు పనికి వచ్చును? ఇట్లు చేత నాయుధముపూని పైకొనుచున్న వీనితో, ఎదిరి నిలిచి పోరక, తొలఁగి పోయిన వీఁడ ఏమనును? వీరాచారము, హో, దారుణమగు ఆస్వాదము గలది; స్నేహమార్గమును కడకొత్తును గదా.

అట్లే వీరచరితమున రాముం గాంచిన పరశురాముని చిత్తమందు ఈ భావఘూర్ణనను చెప్పినాఁడు - II - 32.

స్వగతమ్ - రమణీయః క్షత్రియకుమార ఆసీత్ -
చఞ్చత్పఞ్చ శిఖణ్డమణ్డన ముసౌ ముగ్ధప్రగల్భం శిశుర్ -
గమ్భీరశ్చ మనోహరశ్చ సహజశ్రీలక్ష్మరూపం దధత్

సుమన్త్రః—(లవం నిర్వర్ణ్య, సాస్రమ్, స్వగతమ్) హృదయ, కి మన్యథా పరికల్పయసే!

శ్లో॥ మనోరథస్య య ద్బీజం తద్దైవే నాదితో హృతమ్,
లతాయాం పూర్వలూనాయాం, ప్రసవ స్యోద్భవః కుతః? ౨౦

చన్ద్రకేతుః—ఆర్య సుమన్త్ర, స్యన్దనా దవతరామి.

---

ద్రాగ్దృష్టో౽పి హరత్యయం మమ మనః సౌన్దర్యసారశ్రియా
హన్తవ్యస్తు తథాపి నామ! ధిగహో వీరవ్రతక్రూరతామ్!

ఈ మఱియొక తెలుఁగు భావఘర్షణయు చూడఁదగును. ఇది బాలరామ చిత్తమున. _ వీర _ II _ 22.

ఉత్సిక్తస్య తపః పరాక్రమనిధే రభ్యాగమా దేకతః
సత్సఙ్గప్రియతా చ వీరరభసోన్మాదశ్చ మాం కర్షతః;
వైదగ్భీ పరిరమ్భ ఏష చ ముహుశ్చైతన్య మామీలయన్
ఆనన్దీ హరిచన్దనేన్దుశిశిరస్నిగ్ధో రుణద్ధ్యన్యతః.

కింతు _ అని గద్యముగా నుండఁదగిన భాషితముగూడ, పద్యావయవముగా గ్రువ్వఁబడినది. శస్త్రిణాపి హి తేన _ ఇత్యాదికి _ “ఇట్టి మహావీరుని గుఱిపెట్టని ఆయాయుధము మాత్ర మెందులకు? అది కట్టి పందల మీఁదికేనా?” అనియేనియు. ‘కిం వక్ష్యతి’ _ నవ్వఁడా? పరిహసింపఁడా?

సాస్రమ్ _ సుమంత్రుఁడు కట్టి సారథియు మంత్రియు మాత్రమే కాఁడు _ మనసుకలసిన ఆప్తుఁడు _ రామభక్తుఁడును. అతనికిని సీతగతికై అంతదుఃఖమే, కావుననే లవునిం జూడఁగా, పోలికచే మనసున సీత (సంగతి) స్మరణకు రాఁగా, కన్నీళ్ళు పొడిచినవి. కిం అన్యథా పరికల్పయసే=ఏమి వేఱుతెఱఁగున లేనిపోని తలంపులు తలంతువు! సీతకొడుకు ఒకవేళ అగునా అని తలంతువే _ సీతపోయినదే ఇదెట్లగును అని ‘అన్యథా’ అనుట.

శ్లో. ౨౦. మనోరథస్యేతి:_మనోరథస్య = కోరికకు, యత్ బీజమ్=ఏది విత్తనమో _ మూలకారణమో, తత్ =అది, సీత అనుట. ఆదితః = తొలుతనే, దైవేన = విధిచేత, హృతమ్=ధ్వంసముచేయఁబడినది. లతాయాం = తీవ, పూర్వలూనాయాం = తొలుతనే త్రెంపఁబడఁగా, కుతః=ఇఁక ఎట్లు, ప్రసూనస్య _ అగమః = పూవు _ మొగ్గ _ యొక్క _ రాక _ పొటమరించుట అనుట.

ఏది కోరికల కెల్ల బీజమో, దానిని _ ఆసీతను _ తొలుతనే విధి ధ్వంసము చేసెనే! తీవను ముందే గిల్లివేసిన తరువాత, ఇఁక మొగ్గ ఎట్లు పొటమరించును?

సుమన్త్రః—కస్య హేతోః?

చన్ద్రకేతుః—యత స్తావ దయం వీరపురుషః పూజితో భవతి; అపి ఖ ల్వార్య, క్షాత్రధర్మశ్చ పరిపాలితో భవతి, న రథినః పాద చార మభియోధయన్తి ఇతి శాస్త్రవిదః పరిభాషన్తే.

సుమన్త్రః—(ఆత్మగతమ్) కష్టం బలానుప్రపన్నో౽స్మి.

శ్లో॥ కథం న్యాయ్య మనుష్ఠానం మాదృశః ప్రతిషేధతు?
కథం వాభ్యనుజానాతు సాహసైకరసాం క్రియాం? ౨౧

---

తత్ కస్య హేతోః=అది యేహేతువువలన? ఎందులకు అట్లు చేసెదవు? చంద్రకేతువు అందులకు రెండు హేతువులు చెప్పుచున్నాఁడు. (1) దాన నీవీర పురుషుడు గౌరవింపఁబడినవాఁ డగును. నేలనున్నవానికి ఎదురుగా నేనును నేలనే నిలిచి మాటలాడుట గౌరవము అగును. (2) క్షాత్రధర్మ శ్చ అనుగృహీతః భవతి=క్షత్త్రియుల ధర్మమును - నడవడిపద్ధతియు - పరిపాలితమగును. నరథినః పాదచారం అయోధయన్తి = రథస్థులు పాదచారునితో పోరరు. "భూమౌస్థితస్య రామస్య రథస్థస్య చ రక్షసః న సమం యుద్ధ మిత్యాహు ర్దేవగన్ధర్వదానవాః" అని యీమర్యాద రామాయణమునుండి కలదు - శుక్రనీతియు—'గజో గజేన యాతవ్య స్తురగేణ తురఙ్గమః రథేన తు రథో యోజ్యః పత్తినా పత్తి రేవచ.' అని. అనుప్రపన్నః=పొందినవాఁడను.

శ్లో. ౨౧. కథమితి—న్యాయ్యం = న్యాయముతప్పని, అనుష్ఠానమ్ = నడవడిని, కథం=ఎట్లు, మాదృశః = నావంటివాఁడు, ప్రతిషేధతు = అడ్డుపెట్టును? వా=(అథవా=) అట్లుగాదేని, కథం=ఎట్లు, సాహసైకరసాం=సాహసమే ప్రధానరసము (=ప్రీతికారణము ప్రవృత్తిహేతువు) గాఁగల, క్రియాం=పనిని, అభ్యనుజానాతు=అనుమతించును?

నాకు పెద్ద ధర్మసంకటము కలిగినదే. అబ్బాయి చేయుదు ననుచున్నదేమో న్యాయము తప్పనిపని. దానిని నే నెట్లు అడ్డుదును? అడ్డకుండుటయునెట్లు? ఆపనికి సాహసమే ప్రధానమైన ప్రవృత్తిహేతువే!

ఇట్లు వితర్కడోలలో పడి సుమంత్రుఁడు ఏమో విమర్శించుచున్నట్లు జవాబుచెప్పక ఆలస్యముచేసినాఁడు. అందులకు చంద్రకేతువు అనుచున్నాఁడు. తాతమిత్రా అభినారాయణగారు సుయితము - మిత్రశబ్దమే పూజావాచకము. పైన బహువచనమును పూజకే. రామునికి మాత్రమే ఇందు నిర్దేశము - మిత్రాః - అదు

చన్ద్రకేతుః—యత్తాతమిశ్రా అపి పితుః ప్రియసఖా ధర్మసంశయేషు ఆర్యమేవ పృచ్ఛన్తి, తత్కిమార్యో విమృశతి?

సుమన్త్రః—ఆయుష్మ న్యథాధర్మ మభిమన్యసే.

శ్లో॥ ఏష సాఙ్గ్రామికో న్యాయ, ఏష ధర్మ స్సనాతనః
ఇయం హి రఘుసింహానాం వీరచారిత్రపద్ధతిః. ౨౨

చన్ద్రకేతుః—అప్రతిరూపం వచన మార్యస్య.

---

లనియు ఒక్కయర్థము కలదు. నాయనయు తక్కినవారును - అన్నట్లు - అది మందము. షష్ఠాంకమున రామునిగూర్చి లవుఁడు చంద్రకేతువును 'క ఏతే?' అను బహువచనమున పూజగా అడుగుటయు అందులకు చంద్రకేతువు 'నను తాతపాదాః' 'జ్యేష్ఠతాతపాదా' అని చెప్పుటయును స్మరింపఁదగును. లక్ష్మణ భరతాదులును పూజ్యులే అగుదురుగాక. వారు ధర్మసందేహములు అడిగి తీర్చుకొన్న ప్రస్తావము మందము. రాముఁడు రాజు, కావున పలుమారు సందేహనిర్ణయమునకై అడుగవలసి యుండును. ఆయన నాయనకును - అనఁగా దశరథునికిని ప్రియసఖుఁడు సుమంత్రుఁడు, మంత్రింబోనివాఁడు, కిం విమృశతి=ఏమి - ఏల - ఆలోచించుచున్నాఁడు. ఆర్యుఁడు- నీవు అనక ఇట్లనుట గౌరవము. ఆర్యా, ఏల యాలోచించెదవు? - అనుట. యథా ధర్మం = ధర్మముబడియే - ధర్మసమ్మతముగా నే, అభిమన్యసే - నిర్ణయించితివి - సమకట్టితివి.

శ్లో. ౨౨. ఏషఇతి, - ఏషః=ఇది, సాఙ్గ్రామికః న్యాయః=యుద్ధమునకుతగిన న్యాయము - ఏషః=ఇది, సనాతనః = అనాదిగా ఉండునట్టి, ధర్మః = ధర్మము - ఇయం హి=ఇదియె కుమా, రఘుసింహానాం = రఘువంశమువారైన శ్రేష్ఠులయొక్క, వీరచారిత్రపద్ధతిః=వీరోచితమైన నడవడి మార్గమును.

ఇది యుద్ధన్యాయము - ఇది అనాదిధర్మము - ఇది రఘువంశశ్రేష్ఠుల వీరోచితంపు నడువడి తెలుంగు.

అప్రతిరూపం=సాటిలేనిది - అని పాఠము. కొన్నిట 'ప్రతిరూపం' అనియు- 'అనురూపం' అని యర్థమగునట్లుగా పాఠము. ఇంతకన్నను తొలిదే 'అప్రతిరూపం' అనుటయే శ్రేయము - తగిన గొప్ప మెచ్చుకోలుమాట యగును.

శ్లో॥ ఇతిహాసం పురాణం చ ధర్మప్రవచనాని చ
భవన్త ఏవ జానన్తి రఘూణాం చ కులస్థితిమ్. ౨౩

సుమన్త్రః—(సస్నేహాస్రం పరిష్వజ్య.)

శ్లో॥ జాతస్య తే పితుర పీన్ద్రజితో నిహన్తు
ర్వత్సస్య వత్స కతినామ దినా న్యమూని?
త స్యా ప్యపత్య మనుగచ్ఛతి వీరవృత్తం.
దిష్ట్యా గతం దశరథస్య కులం ప్రతిష్ఠామ్! ౨౪

---

శ్లో. ౨౩. ఇతిహాసేతి _ ఇతిహాసం = రామాయణమువంటి _ ఇట్లు జరిగెనఁట మునుపు అని చెప్పఁబడెడు కథను _ కథలను అనుట, పురాణంచ = (విష్ణుపురాణము వంటి) పురాణమును _ పురాణములను అనుట _ సృష్టిస్థితిప్రళయాదులం జెప్పు వానిని, ధర్మప్రవచనాని చ=ధర్మబోధలను _ అనఁగా శ్రుతులును స్మృతులును మొదలైన వియు, (అట్లే) రఘూణాం = రఘువులయొక్క _ ఆవంశమునఁ బుట్టినవారియొక్క, కులస్థితిం చ = ఇంటిమర్యాదను, భవన్త ఏవ = మీరే, జానన్తి = ఎఱుఁగుదురు.

తొల్లింటికథలను, పురాణములను, ధర్మమాత్మ్యముల బోధించు శ్రుతిస్మృత్యాదులను మీర ఎఱుంగుదురు. అట్లే రఘువుల యాచారమర్యాదలను ఎఱుంగుదురు. కావున ఇట్లు సాటిలేనంత చక్కఁగా చెప్పినారు. అవెల్ల మీమతిలో స్థితిగొన్నందు వనే, మీ మంత్రిత్వమున వర్ధిల్లు రఘుప్రవరులును స్థితిగొన్నారు _ అనుట.

శ్లో. ౨౪. జాతస్యేతి _ వత్స = అబ్బాయి, జాతస్య = పుట్టినవాఁడైన, ఇన్ద్రజితః = ఇంద్రజిత్తుయొక్క _ ఇంద్రజిత్తును అనుట _ నిహన్తుః = చంపినవాఁడైన, తే పితుః=నీనాయనయైన, వత్సస్య అపి=లక్ష్మణుఁడను బాలునికి సయితము, అమూని దినాని కతినామ = ఈదినాలు ఎన్ని బాబూ. తస్య అపి = వానికిని, అపత్యం=బిడ్డ, వీరవృత్తమ్=వీరుల నడవడిని, అనుగచ్ఛతి = అనుసరించుచున్నాఁడు, పాటించు చున్నాఁడు! దిష్ట్యా = బళి, బాపురే, దశరథస్య కులం = దశరథునివంశము, ప్రతిష్ఠాం=శాశ్వతమగు కీర్తిని గతం=పొందినది పో!

అబ్బాయీ, ఇంద్రజిత్తును చంపినాఁడే మీనాయన, ఆయబ్బాయి పుట్టి ఇప్పటికి ఎన్నాళ్ళైనవిరా! నిన్న మొన్న నాకనుల యెదుటనే! వాని కొడుకవు నీవు వీరవృత్తమును పట్టుచున్నావు (వేఁడు.) బళి బళి! దశరథునివంశము స్థిరకీర్తిని పొందినది.పో!

చన్ద్రకేతుః—

శ్లో॥ అప్రతిష్ఠే కులజ్యేష్ఠే కా ప్రతిష్ఠా కులస్య నః,
ఇతి దుఃఖేన తప్యన్తే త్రయో నః పితరోఽపరే. ౨౫

సుమన్త్రః—హృదయమర్మ దారణాని ఏతాని చన్ద్రకేతో ర్వచనాని.

లవః—హన్త! మిశ్రీభూతో రసో వర్తతే!

శ్లో॥ యథేన్దా వానన్దం వ్రజతి సముపోఢే కుముదినీ
తథై వాస్మిౕ దృష్టి ర్మమ; కలహకామః పున రయం,

సుమంత్రుఁడు నిజముగా దశరథుఁడు కానక కానక సంతానము పొందుట యాదిగా ఆయింటిచరిత మెఱింగినవాఁడు గాన, అతని మనుమని వీరవ్రతుని చూచి ఇట్లు సంతసిల్లుచున్నాఁడు.

సకష్టమ్=ఖేదముతో.

శ్లో. ౨౫. అప్రతిష్ఠే - ఇతి—కులజ్యేష్ఠే = మాయినకులమునకు పెద్దవాఁడైన రాముఁడు, అప్రతిష్ఠే (సతి)=సంతానముచే నిలుకడయైన స్థితి లేనివాఁడే కాఁగా, నః కులస్య=మావంశమునకు, కా ప్రతిష్ఠా=ఇఁక నేటి నిలుకడ, కీర్తి, గౌరవము? - ఇతి = అని, అపరే = తక్కిన, నః = మా, త్రయః పితరః = ముగ్వురు నాయనలును, దుఃఖేన తప్యన్తే=దుఃఖముతో అలందురుచుందురే!

తాతా, దశరథునికులము ప్రతిష్ఠగన్నదిపో అనుచున్నావే - మాకులమునకు పెద్ద, రామనాయన అప్రతిష్ఠుఁడుగా నుండఁగా, మన కులమునకు ఇఁక నెక్కడి ప్రతిష్ఠ అని దుఃఖముతో మా తక్కిననాయనలు ముగ్వురును ఎప్పుడును మనసున అలందురుచుందురే!

హృదయమర్మదారణాని=హృదయములోపలి మర్మములను - ఆయువుపట్టులను చీల్చునవి - చిత్తమున అట్టి ఖేదమును కలిగించునవి. రసః = చిత్తమునభావము, మిశ్రీభూతః = రెండు మూఁడువిధములైనది చేరినట్లుగా నున్నది. సంతోషమును, పరాక్రమమును అనుట.

శ్లో. ౨౬. యథేతి - ఇన్దౌ = చంద్రుఁడు, సముపోఢే = ఉదయించి లేచి వెన్నెలకాయుచుండఁగా, కుముదినీ = కలువతీవ, యథా ఆనన్దం వ్రజతి = ఎట్లు సంతోషమునుపొందునో - వికాసము చెందునో, తథా ఏవ = అవిధముగానే,

ఝణత్కార క్రూరక్వణిత గుణగుఞ్జ ద్గురుధను
ర్ధృతప్రేమా బాహు ర్వికచ వికరాళోల్బణరసః. ౨౮

చన్ద్రకేతుః—(అవతరణం నిరూపయన్) ఆర్య, సావిత్ర శ్చన్ద్రకేతు రభివాదయతే.

---

అస్మిన్=ఇతనియెడ, మమ దృష్టిః = నాచూపు, (ఆనన్దం వ్రజతి.) అయం బాహుః పునః=(నా)యీభుజమన్ననో, ఝణత్కార క్రూర క్వణిత గుణ గుఞ్జత్ గురుధను ర్ధృత ప్రేమా = ఝణఝణయను ప్రోఁతతో - వింటికి చివుఁగంటలున్నవి ఝణఝణ యనుటకు - భయంకరముగా మొరయుచున్న అల్లెత్రాడు 'గుయ్' అనుచున్న పెద్ద వింటియందు ప్రీతిగలదై, వికచవికరాళోల్బణరసః = పొంగుచున్న భయంకరమగు పరాక్రమముతో, కలహకామః=యుద్ధమునకైన కోరిక కలదిగా ఉన్నది.

పొడిచి వెన్నెలకాయు చంద్రునిం గని కలువతీవ సంతోషముతో - అనఁగా - పూవులు పూచి వికాసముతో నవకము మీఱుచుండును. అట్లే ఇతనిం గాంచి, నాచూపు మిక్కిలి సంతసము గనుచున్నది. నాయీ బాహువు ఈ పెను వింటియందు, దానిగంటలు ఝణఝణమని క్రూరముగా మొగయుచు, దానియల్లె గుయ్‌గుయ్ అనుచుండ, దానియందు ప్రీతికలిగి, భయంకరముగా మండు పరాక్రమముతో నిండి, యుద్ధమునకై ఆసగొనుచున్నది.

'ఇన్దౌ సముపోఢే' - చంద్రుఁడు మింటికి ఎక్కఁగోలఁది కాంతి యెక్కను - అట్టిదానిని చూచుకోలఁది కలువతీవకు వికాసము నెక్కొనుచుండును - అట్లే వీనిం జూచుకోలఁది నా చూపు ఆనందతన్మయ మగుచున్నది. 'ఝణఝణత్'- ఇది వింటికి అలంకారార్థము అమర్చియున్న గంటల ప్రోత. 'కలహకామః' - అని విధేయము చేయుట మెఱుఁగు, 'ంధృత ప్రేమా' అనుటను కాని 'ంఉల్బణ రసః' అనుటను గాని విధేయము చేయుట కన్నను. 'ఆనందము చెందుచున్నది, కన్ను: యుద్ధమునకు ఉవ్విళ్ళూరుచున్నది బాహువు......" అనుట.

చూ. వీరచరిత II 38. పరశురాముఁడు రామునితో.

వత్స...............
రోమాఞ్చ కఞ్చుకిత మద్భుత వీరలాభాత్
సత్యం బ్రవీమి పరిరబ్ధు మివేచ్ఛతి త్వామ్.

సావిత్రః చన్ద్రకేతుః అభివాదయతే - అభివాదనమున గోత్రమును పేరును నోట చెప్పవలయును. అది వినయమును తెలుపును. మన సుమంత్రుఁడే, మన

సుమన్త్రః—

శ్లో॥ అజితం పుణ్య మూర్జస్వి కకుత్స్థ స్యేవ తే మహః
శ్రేయసే శాశ్వతో దేవో వరాహః పరికల్పతామ్. ౨౭

అపిచ—

శ్లో॥ దేవస్త్వాం సవితా ధినోతు సమరే గోత్రస్య యస్తే పితా,
త్వాం మైత్రావరుణోఽభినన్దతు గురుర్యస్తే గురూణా మపి

---

ముసలివాఁడే అని పోక సమయమున అతనికి అభివాదము. దానికి సుమంత్రునిది ప్రత్యభివాదనము—'అజితం' ఇత్యాది శ్లోకము. ప్రత్యభివాదము ఆశీర్వాదముగా నుండును.

శ్లో. ౨౭. అజితమితి—కకుత్స్థస్య ఇవ=(నీ కులకూటస్థుఁడగు) కకుత్స్థునికింబోలె, తే=నీకు, అజితం=ఓటమి యెఱుంగనట్టియు, పుణ్యం=పవిత్రమైనట్టియు, ఊర్జస్వి=బలముగలట్టియు, మహః=తేజము—పరాక్రమమును, శ్రేయసే=(నీ) శ్రేయమునకై, శాశ్వతః=అనాది నిధనుఁడు అగు—నిత్యుఁడగు, దేవః వరాహః=ఆదివరాహస్వామి, పరికల్పతామ్=కూర్చును గాక.

మీ కులకూటస్థునికి నుండునట్టిదియు ఓటమి యెఱుంగనిదియు, పవిత్రమైనదియు—పాపపుపనులు చేయనిదియు—మిక్కిలి యూర్జితమైనదియు అగునట్టి తేజము, నీకు ఆది వరాహస్వామి అనుగ్రహించి, శ్రేయములు కూర్చుగాక.

ఇక్ష్వాకు వంశమువాఁడు, పురంజయుఁడను తొంటిరాజు పరాక్రమశాలి, దేవతలకు ఓర్వరాని యసురులను, ఇంద్రప్రార్థితుఁడై, ఇంద్రుఁడే వృషభ రూపమున తనకు వాహనముకాఁగా దాని మూపునం గూరుచుండి సంహరించె నని యైతిహ్యము. దాననే అతనికి కకుత్స్థుఁడు—ఎద్దు మూపునం గూర్చున్నవాఁడు అని పేరు వచ్చినది. అట్టి యసురులను ఓర్చు పరాక్రమము అనుట. పుణ్యం—పాపములవంక పోనిది. కలదు బలమని పాపములు చేయని. ఆదివరాహముం జెప్పనేల అనిన—మునిఁగిపోయిన భూమిని, రాజులకు పాల్యమైన దానిని తనకును ప్రేయసియైన దానిని ఎత్తి ప్రోచినవాఁడు గదా. అంతయు మునిఁగిపోయినపుడు ఉద్ధరించినవాఁడు.

శ్లో. ౨౮. దేవః ఇతి—తే గోత్రస్య యః పితా=నీ గోత్రమునకు ఎవఁడు—జనకుఁడో, (సః=అ,) సవితా దేవః=సూర్యదేవుఁడు, త్వాం=నిన్ను, సమరే=యుద్ధమునందు, ధినోతు=సంతోషపెట్టును గాక,—జయమొసంగియు, రక్షించియు; తే గురుః=నీకు గురువును, గురూణాం అపి=నీ గురువులకును—నాయనలకును,

ఐన్ద్రం వైష్ణవ మాగ్నే మారుత మథో సౌపర్ణ మోజోఽస్తు తే;
దేయాదేవ చ రామలక్ష్మణ ధనుర్జ్యాఘోషమన్త్రో జయమ్. ౩౮

లవః—కుమార అతి హి నామ శోభసే రథస్థ ఏవ, కృతం కృత మత్యాదరేణ.

చన్ద్రకేతుః—తర్హి మహాభాగోఽప్యన్యం రథ మలఙ్కరోతు.

లవః—ఆర్య, ప్రత్యానోపయ రథం రాజపుత్రమ్.

సుమన్త్రః—కుమార, త్వమ ప్యనురుధ్యస్వ చన్ద్రకేతో ర్వచనమ్.

---

(గురుః=గురువును) ఐన, మైత్రావరుణః=వసిష్ఠ మహర్షి, త్వాం=నిన్ను, అభినన్దతు=(ఆశీర్వాదములచే) సంభావించును గాక; ఐన్ద్రం=ఇంద్రుని దైవదియు, వారుణం=వరుణుని దైవదియు, అగ్నే=అగ్ని దైవదియు, మారుతం=గాలిదైవదియు, అథో=అంతియగాక, సౌపర్ణం=గరుత్మంతుని దైవదియు అగు, ఓజః=బలమును, పరాక్రమమును, తే=నీకు, అస్తు=కలుగును గాక. రామలక్ష్మణ ధనుర్జ్యాఘోష మన్త్రః చ=రామునియు లక్ష్మణునియు వింటినారి టంకారమే అను మంత్రము సయితము, జయమ్=(నీకు) జయమును, దేయాత్ ఏవ=తప్పక ఇచ్చును గాక.

నీ కులమునకు మూలము, సూర్యదేవుఁడు యుద్ధాన నిన్ను రక్షించును గాక. నీకు గురువు, మీ నాయనలకును (తాతలకును - మీ పెద్దలందఱికిని) గురువు, వసిష్ఠ మహర్షి నిన్ను ఆశీర్వదించును గాక. ఇంద్రాగ్ని వరుణ మరుత్సుపర్ణుల బలపరాక్రమములు నీకు సిద్ధించును గాక. రామలక్ష్మణ ధనుర్జ్యాఘోషమే మంత్రమై నీకు తప్పక జయమునొసంగును గాక.

సుమంత్రుఁడు ఇంత ప్రత్యభివాదనము చేయుట, ఆదిరాజుని సూర్యుని వసిష్ఠుని రామలక్ష్మణులను స్మరించుట చూడ చంద్రకేతువునకు గొప్ప దెప్పరమే, జృంభకములు సయితము తెలిసిన మహావీరునితో పోరు కలిగినదే. తోడుగా సారథిగా వచ్చిన తాను అక్షతునిగా వీనిని ఇల్లు చేర్పఁగలనా, రామలక్ష్మణులకు అప్పగింపఁగలనా అని యనుకొనుటను సూచించును. ఆ దేవతలు మంత్రములు అన్నియు చంద్రకేతువును రక్షించును గాక అని ఆశంస పలుకుచున్నాఁడు. మఱియు సుమంత్రునికి రఘుకులమునందును దాని మూలపురుషుని యందును గురువు నందును ఎట్టి నిజమైన భక్తియున్నదో తెలియుచున్నది. రామలక్ష్మణుల వింటిఘోషను మంత్రముగా సంభావన చేసినాఁడు. దీన భవభూతి రామభక్తియు తెలియును.

కృతం కృతం అత్యాదరేణ=వలదు వలదు అత్యాదరము. కృతం - నిషేధార్థకము, దానికి తృతీయావిభక్తితో యోగము - 'అలం' వలెనే. అనురుధ్యస్వ=

లవః—కో విచారస్స్వేషూపకరణేషు? కిం త్వరణ్యసదో వయ మనభ్యస్తరథచర్యాః.

సుమన్త్రః—జానాసి వత్స దర్పసౌజన్యయో ర్యథోచిత మాచరితుం. యది పున స్త్వా మీదృశం ఐక్ష్వాకో రాజా రామభద్రః పశ్యే త్తదాస్య స్నేహేన హృదయ మభిష్యన్దేత.

లవః—సుజన స్స రాజర్షి శ్శ్రూయతే, (సలజ్జ మివ)

శ్లో॥ వయ మపి న ఖల్వేవం ప్రాయాః క్రతుప్రతిఘాతినః.
కఇహచ గుణై స్తం రాజానం న వా బహుమన్యతే?
తదపి ఖలు మే స వ్యాహార స్తురఙ్గమరక్షిణాం
వికృతి మఖిల క్షత్రాక్షేప ప్రచణ్డతయాఽకరోత్. ౨౯

---

అంగీకరింపుము. కో విచారః స్వేషు ఉపకరణేషు = ఎవరి యుపకరణములను వారు ఉపయోగించుటకు విచార మేల? కింతు = ఐనను. వయమ్ అరణ్యసదః = మేము అడవిలో నుండువారము, మాకు రథచర్య = తేరిగతి, తేరి వ్యవహారము - వాడుక లేదు - శిక్షితము కాలేదు. దర్ప సౌజన్యయోః యథోచితం ఆచరితుం=దర్ప సౌజన్యములకు తగినట్లు జరుపుటకు, నడుచుకొనుటకు. అట్లే మునుపు లవుఁడును చంద్రకేతుం గూర్చి - చూ. V. ౧౦. 'అహో మహానుభావస్య ప్రసన్నకర్కశా వీరవచన ప్రయుక్తిః...' అన్నాఁడు. అభిష్యన్దేత = కరఁగి ప్రవహించును. సుజనః స రాజర్షిః=ఆయన రాజర్షి మిక్కిలి మంచివాఁడు - చాల దొడ్డవాఁడు - శ్రూయతే=అని వినికి (=వినఁబడుచున్నాఁడు.) సలజ్జం ఇవ=సిగ్గుతోనుం బోలె - ఇది నటునికి అభినయోపదేశము. అజ్ఞయేల యన గొప్పవారిని మెచ్చుకొని పూజించు సజ్జనుఁడయ్యును తాను సాధారణముగా అసురులం బోనివారు చేయు యజ్ఞ విఘాతమునకు ఇటు పూనినందులకు.

శ్లో. ౨౯. వయమితి - వయం అపి=మేమును, ఏవంప్రాయాః=ఇట్టి వారము, ఈ పాటివారము, క్రతు ప్రతిఘాతినః = యజ్ఞములకు విఘ్నము చేయువారము, న ఖలు=కాము కదా. ఇహ = ఇట, కః = ఎవఁడు, తం రాజానం = ఆ రాజును, గుణైః = సద్గుణములంబట్టి, న చ బహుమన్యతే వా = మెచ్చుకయుండును? తదపి=ఐనను, మే=నాకు, తురఙ్గమ రక్షిణాం = గుఱ్ఱపు కాపులయొక్క, సః వ్యాహారః ఖలు=ఆ మాట గదా, ఆ యతివాదము గదా, అఖిలక్షత్త్ర ఆక్షేప ప్రచణ్డతయా = ఎల్లక్షత్రియులను తిరస్కరించునది [illegible] గదా [illegible], వికృతిం=మనోవికారమును - కోపమును, అకరోత్ = [illegible]చేను.



చన్ద్రకేతుః—(సస్మితమ్) కిం ను భవత స్తాతప్రతాపోత్కర్షేఽప్యమర్షః?

లవః—అస్త్వేవ హామర్షో, మాభూద్వా. ఏతత్తు పృచ్ఛామి దాన్తం హి రాఘవం రాజానం శ్రుణుమః, స కిల నాత్మనా దృప్యతి, నాప్యస్య ప్రజాసు దృప్తత్వం జాయతే. తత్కిం మనుష్యా స్తస్య రాక్షసీం వాచం ఉదీరయన్తి?

శ్లో॥ ఋషయో రాక్షసీ మాహు ర్వాచ మున్మత్తదృప్తయోః,
సా యోని స్సర్వవైరాణాం సా హి లోకస్య నిరృతిః 30

ఇతి హాస్మ తాం నిన్దన్తి, అథ ఇతరా మభిష్టువన్తి.

---

మేమును ఇట్లు తలంచు యజ్ఞమువంటి ధర్మమునకు విఘాతము చేయువారము కాము. మఱియు ఆ రాజర్షిని గుణోజ్జ్వలుని ఎవఁ డిట మెచ్చని వాఁ డుండును? వినను ఆ గుఱ్ఱపు కాపరుల ఆ (మేరమీఱిన)మాటలు క్షత్త్రియజాతి నెల్ల ధిక్కృతి సేయునంత దుడుకుగా నుండినవి. దానిచేత మనసు ఇట్లు కలఁగిపోయినది - కోపము కలిగినది.

లవుఁడు రామాయణ పండితుఁడు. రామాయణారంభమే రాముని గుణ వర్ణన - 'కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్' అను వాల్మీకి ప్రశ్నకు నారదుఁడు రామగుణములం గీర్తించుట - 'ఇక్ష్వాకువంశ ప్రభవో రామో నామ జనైః శ్రుతః। నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ...' అని. 'అయ మశ్వః పతాకేయ మథవా వీరఘోషణా। స ప్తలోకైక వీరస్య దశకణ్ఠకులచ్ఛిదః!' అను మాటలు 'అహో సన్దీపనా న్యక్షరాణి!' అని లవుని క్షత్త్రియ మనసున కోపమును రగిలించినవి.

అమర్షః కిలు = అసహనమా? దాన్తం = ఇంద్రియ జేతనుగా, స కిల న ఆత్మనా...... = ఆయన తాను గర్వితుఁడు కాఁడు, తత్ప్రజలయందును గర్వము కలుగదు. రాక్షసీం వాచం = రాక్షస వాక్కును - అదెట్టిదో ఎఱుంగఁ జెప్పు చున్నాఁడు. 'ఋషయః' అని.

శ్లో. 30. ఋషయః ఇతి - ఋషయః = మునులు, ఉన్మత్త దృప్తయోః వాచం = వెఱ్ఱివానియు పొగరుగొన్న వానియు మాటను. రాక్షసీం ఆహుః = రాక్షసము అన్నారు. సా = అది, సర్వవైరాణాం = అన్ని జగడములకు, యోనిః = కారణము. సా హి = అదియే కదా, లోకస్య = లోకమునకు, నిరృతిః = అలక్ష్మి, దారిద్ర్య కారణము - పాపకారణము - అనిష్టము.

శ్లో॥ "కామాన్ దుగ్ధే విప్రకర్షత్యలక్ష్మీం
కీర్తిం సూతే దుష్కృతిం యా హినస్తి
తాం చాప్యేతాం మాతరం మంగళానాం
ధేనుం ధీరా స్సూనృతాం వాచ మాహుః." ఇతి 31

సుమన్త్రః—పరిపూతస్వభావోఽయం కుమారః ప్రాచేతసాన్తేవాసీ వద త్యభిసంపన్న మార్షేణ సంస్కారేణ.

---

ఋషులు వెఱ్ఱినుడులను దృప్తనినుడులను రాక్షసము అన్నారు. లోకములో అన్ని వైరములకు అదియే కారణము. అదియే కదా ఎల్లదారిద్ర్యములకును పాపములకును మూలము.

ఇతరం=అట్టిది కానిదానిని.

శ్లో. 31. కామాన్ ఇతి - యా=ఏది, కామాన్ = కోర్కెలను, దుగ్ధే = పిండునో. పిదుకునో. అలక్ష్మీం = దుఃఖమును, దారిద్ర్యమును, విప్రకర్షతి=దవ్వులకు నెట్టునో. కీర్తిం సూతే=కీర్తిని ఈనునో. దుష్కృతం=పాపమును, హినస్తి - పోనద్రొబ్బునో. అపి చ మఙ్గలానాం మాతరమ్ = మఱియు సర్వమంగళములకు తల్లియైన, తాం ఏతాం = అట్టి దీనిని, సూనృతాం వాచం = ప్రియహితమగుమాటను, ధేనుం=కామధేనువని, ధీరాః ఆహుః=విద్వాంసులు పలుకుదురు.

కోర్కెలనుపిండి, దుఃఖమును రానీక, కీర్తిని ఈని, పాపమును అడంచి ఇంకను ఎల్ల మంగళములకు తల్లియగు ప్రియహితవాక్కును విద్వాంసులు కామధేను వందురు.

ఈ శ్లోకములు 'వేదమా' అనువట్లున్నవి.

ఈ కామందక నీతిని గనఁదగును-

పరంవినీతః సముపైతి సేవ్యతామ్
మహీపతీనాం వినయో విభూషణమ్.

.........

ప్రియమే వాభిధాతవ్యం
నిత్యం సత్సు ద్విషత్సుచ
శిఖీవ కేకామధురః
ప్రియవాక్కస్య న ప్రియః?

వదత్యయం ఆర్షేణ సంస్కారేణ = ఋషి యొసంగిన యుపనయనవిద్యాదానాది సంస్కారము - శిక్షణ - చక్కఁజేయుట - చేత, అభిసంపన్నం=మిక్కిలి సమ్మతమైనదానిని, అసంస్కారమునకు అనుగుణమైన దానిని ఇతఁడు పలుకు

లవః—యత్పునశ్చన్ద్రకేతో వదసి "కిన్ను భవత స్తాత ప్రతాపోత్కర్షేఽప్యమర్షః." తత్ పృచ్ఛామి, కిం వ్యవస్థితవిషయాః క్షత్రధర్మాః ఇతి?

సుమన్త్రః—నైవ ఖలు జానాసి దేవ మైక్ష్వాకం, తద్విరమాతిప్రసఙ్గాత్.

శ్లో॥ సైనికానాం ప్రమాథేన సత్య మోజాయితం త్వయా,
జామదగ్న్యస్య దమనే నాతినిర్వక్తు మర్హసి. 32

లవః—(సహాసం) ఆర్య, జామదగ్న్యస్య దమన ఇతి కోఽయ ముచ్చైర్వాదః?

---

చున్నాఁడు, అని లవశీలమును తడవుచున్నాఁడు. యత్పునః చన్ద్రకేతో వదసి= 'కిన్ను తాతప్రతాపోత్కర్షే ప్యమర్షః' ఇతి-చంద్రకేతూ, నీ వంటివే 'నాయన ప్రతాపోత్కర్షయందును నీకు అసహనమా అని'-తత్ పృచ్ఛామి=(అందువలన=) అందులకు అడిగెదను-కిం వ్యవస్థిత విషయాః క్షత్రధర్మాః ఇతి=నియతవిషయములా ఏమి, క్షత్రధర్మములు? క్షత్రధర్మములు, పరాక్రమాదులు వీనియందే యుండును, ఇతరునియం దుండవు అను నియమముగలవియా ఏమి? ఈ మాటకు సుమంత్రునికిని కోపము వచ్చినది. రామచంద్రుని ఇతరక్షత్రియుని బోలెను, ఇతర క్షత్రియుని రామచంద్రునిబోలెను తలఁచుచున్నాఁడు వీఁడు-అని అతిప్రసఙ్గాత్ విరమ=అధిక ప్రసంగము మానుము. నోరుమూయుము-అనుట. ఇది ఆక్షేపణములో మనము సాధారణముగా చెప్పు ఉక్తి. మాటలు ముదురుచున్నవి-కోపము పుట్టుచున్నది. అది లేక యుద్ధము మొనయదుగదా.

శ్లో. 32. సైనికానాం ఇతి-సైనికానాం = సైనికులయొక్క ప్రమాథేన= చక్కాడుటచేత, సత్యం = నిజముగా, త్వయా ఓజాయితమ్ = నీచే పరాక్రమము తెలుపఁబడినది-నీవు పరాక్రమము తెలిపితివి. సరే; కాని, జామదగ్న్యస్య=పరశురాముని (యొక్క) దమనే = మట్టుపెట్టినవానియెడ, అతినిర్వక్తుం = ఎక్కువ నిందించుటకు, న అర్హసి=తగవు.

సైనికులను చక్కాడి ఓజః కాలి వైనసైతివి, కాని, పరశురాముని అడంచిన రామభద్రుని నిందింపకుము. అది తగదు నీకు.

జామదగ్న్యస్య......=జామదగ్న్యుని దమించినాఁడని ఏమి పెద్దవాదముగా నున్నదే!

శ్లో॥ సిద్ధం హ్యేత, ద్వాచి వీర్యం ద్విజానాం,
బాహ్వో ర్వీర్యం యత్తు తత్ క్షత్త్రియాణామ్;
శస్త్రగ్రాహీ బ్రాహ్మణో జామదగ్న్య,
స్తస్మిన్ దాన్తే, కా స్తుతి స్తస్య రాజ్ఞః? 33

---

శ్లో. 33. సిద్ధం హి ఏతత్ =నిజము కదా ఇది! ద్విజానాం = బ్రాహ్మణులకు వాచి=వాక్కునందు, వీర్యం=బలము - మహిమ. బాహ్వోః వీర్యంయత్ = బాహువుల బలము అనునది యేదో, తత్ - తు=అది యన్ననో, క్షత్త్రియాణాం=క్షత్త్రియులకు, శస్త్రగ్రాహీ = ఆయుధము పట్టిన, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, జామదగ్న్యః = పరశురాముఁడు - జమదగ్ని మహర్షి కొడుకు. తస్మిన్ దాన్తే=అతఁడు అణఁగఁగా, వానిని అడంపఁగా, తస్య రాజ్ఞః=ఆ రాజునకు, కా స్తుతిః=ఏమి పొగడిక?

ఇది నిజము. బ్రాహ్మణులకు వాక్కున - శాపానుగ్రహ మహిమ రూపాన - వీర్య ముండును. బాహువుల బలమో అన్న అది క్షత్త్రియులకు. శస్త్రము పట్టిన బ్రాహ్మణుఁడు - కులము చెడినవాఁడు - ఋషికొడుకు పరశురాముఁడు. అతనిని అడంచుట ఆ రాజునకు మెప్పా?

లవుఁడు రామాయణమును చక్కఁగా ఎఱింగినవాఁడు. అందలి పరశురామ భంగకథ పేలవ మనితలఁచుటచే అది అతని మనసునకు అంతగా నచ్చలేదు. 'యోజయస్వ ధనుఃశ్రేష్ఠే శరం పరపురంజయం। యది శక్నోషి కాకుత్స్థ ద్వంద్వం దాస్యామి తే తతః' అని రామునితో పరశురాముఁ డనెను. అందులకు రాముఁడు అప్పుడే ఆ వింటిం గొని, ఎక్కుపెట్టి బాణమును తొడిగి, కుపితుఁడై 'బ్రాహ్మణోఽసీతి పూజ్యో మే। విశ్వామిత్రకృతేన చ తస్మా చ్ఛక్తో న తే రామ మోక్తుం ప్రాణహరం శరమ్...........' ఇత్యాది బదులు చెప్పెను. ఇది యుద్ధము లేకే పడసిన జయము - 'తేజోభిహత వీర్యత్వా జ్జామదగ్న్యో జడీకృతః' అని, రాముఁడును వాఁడు 'బ్రాహ్మణో, సి' అన్నాఁడు. ఆ పాఠమునే భంగ్యంతరముగా లవుఁడు ఇట 'శస్త్రగ్రాహీ బ్రాహ్మణః...' ఇత్యాదిగా అన్నాఁడు. మఱి తాను రామాయణమున ఎంతో పేలవముగా తలంచినదానిని, సుమంత్రుఁడు దశరథుని వయసు వాఁడు పరశురామ మహిమ నెఱింగి యున్నవాఁడు గొప్పగా చెప్పఁగా లవుఁడు ఇట్లు అగహేళనము పలికినాఁడు. అది లవుని బాల్యమునకు సదృశముగా నున్నది.

చన్ద్రకేతుః—(సోన్మాధ మివ) అర్య అర్య! కృత ముత్త రోత్తరేణ.

శ్లో॥ కోఽ ప్యేష సమ్ప్రతి నవః పురుషావతారో!
వీరో న యస్య భగవాన్ భృగునన్దనోఽపి!
పర్యాప్తసప్తభువ నాభయదక్షిణాని
పుణ్యాని తాతచరితాని చ యో న వేద! 38

లవః—కోహి రఘుపతే శ్చరితం మహిమానం చ న జానాతి? యది నామ కిఞ్చిద్ వక్తవ్య మస్తి, అథవా శాన్తమ్.

---

సోన్మాథమ్ ఇవ=వ్యథతోనుం బోలె - ఉత్తరోత్తరేణ=మాటపై మాట.

శ్లో. 38. కోఽపీతి—కః అపి ఏషః=ఈతఁ డెవఁడో! సమ్ప్రతి=ఇప్పుడు, నవః=కొత్త, పురుషావతారః = పురుషుఁడుగా అవతరించినాఁడు! యస్య = ఎవనికి - అనఁగా - ఇతనికి, భగవాన్=భగవానుఁడు, భృగునందనః అపి = పరశురాముఁడు సయితము, న శ్లాఘ్యః = మెచ్చఁదగినవాఁడు కాఁడ టే! యః = ఎవఁడు - ఇతఁడు అనుట, పర్యాప్త సప్తభువనాభయ దక్షిణాని = పూర్ణముగా - చాలినట్లుగా - ఏడులోకములకు అభయ మొసంగుటకు సమర్థము లైనవియు, పుణ్యాని=(దుష్టదండన శిష్టపరిపాలనచేసినవైనందున) పవిత్రములును అగు, తాతచరితాని=వాయన కథలను- తాటకసుబాహులవధ మొదలు రావణసంహారమువఱకు ఉన్నవానిని, న వేద చ = ఎఱుంగకయు ఉన్నాఁడు!

ఇతఁ డెవఁడో ఇప్పుడే భూమిమీఁద క్రొత్తగా వెలసినాఁడు, పురుషావతారము! ఇతఁడు భగవజ్జామదగ్న్యుని సైతము వీరుగాఁ గొనఁడట! ఏడులోకాలకు అభయదానధురంధరములు, లోకాతీతములు ఐన నాయన యద్భుత పరాక్రమ చరిత్రములను అతిపవిత్రములను ఎఱుఁగఁడు!

పురుషావతారము! - అనుటలో నిండినహేళన మున్నది. (మా) నాయనను కూడ పరకుగొనని దుడుకుపిల్లవాఁ డైనందున. తాటకవధాదులన్నియు సప్తలోకములకు అభయమిచ్చిన మహావీరచరితములు. తలపోసికొన్నను చాల పుణ్యమగునవి.

కోహి - నజానాతి=ఎవఁ డెఱుంగఁడు - నాకు రామాయణము కరతలామలకము అనుట, యదినామ కిఞ్చిత్ వక్తవ్యం అస్తి=ఒకవేళ చెప్పినం, గొంచెము చెప్పవలసినదియుఁ గలదు. అథవా శాన్తమ్=అదియేని ఎందులకులే - వలదులే, పోనీ!

శ్లో॥ వృద్ధాస్తే, న విచారణీయచరితా, స్తిష్ఠన్తు, కిం వర్ణ్యతే?
సున్దస్త్రీదమనేఽప్యఖణ్డయశసో లోకే మహాన్తో హి తే;
యాని త్రీణ్యపరాఙ్ముఖాన్యపి పదాన్యాసన్ ఖరాయోధనే
యద్వా కౌశలమిన్ద్రసూనునిధనే తత్రాప్యభిజ్ఞో జనః. 3౫

---

శ్లో. 3౫. వృద్ధాఇతి—వృద్ధాః తే=వయసుమిఁపోయినవారు వారు; న విచారణీయచరితాః = తడవఁదగిన చరిత్రకలవారు కారు-తప్పొప్పులు చెప్పఁగూడదు. వారిచరిత్రముం గూర్చి. తిష్ఠన్తు=ఉందురుగాక. కిం వర్ణ్యతే=(దానివి) ఏల వర్ణించి చెప్పట! దానిని ఇట వర్ణించు టెందులకు? సున్దస్త్రీదమనే అపి = సుందాసురుని నాతిని (=తాటకను) కూల్చుటయందును, అఖణ్డయశసః=ఇంతంత యనరాని యశము గలవారు! లోకే తే మహాన్తః హి = లోకమందు వారు చాల గొప్పవారుగదా, యాని=ఏవి - అనఁగా అల్లయవి అనుట, ఖర ఆయోధనే=ఖరాసురునితోడి యుద్ధాన! త్రీణి = మూఁడు, అపరాఙ్ముఖాని = వెనుమరలినవి కావులే, ఎదురుగా చూచుచున్నవే లే, పదాని ఆసన్ = అడుగులు ఉండినవే! (తత్ర = ఆవిషయమందును,) యద్వా = అది కాకున్న, ఇన్ద్రసూను నిధనే = ఇంద్రునికొడుకగు వాలిని చంపుట యందు, కౌశలం (తత్) = అల్లయా నేర్పు, తత్ర అపి = ఆవిషయమందును, జనః = జనము - లోకములో జన మంతయు, అభిజ్ఞః = చక్కఁగా ఎఱింగియున్నదిలే! అందఱికి చక్కఁగా తెలియునులే!

ఉందురు పెద్దవారు. వారిచరిత్రములో తప్పొ ఒప్పొ విచారింపఁగూడదు. ఉండనీలే, దానిని ఎందులకు వర్ణించుట? ఆసుదానిని సుందునిభార్యను కూల్చిన విశుద్ధయశోనిధులు ఆమహామహులు! ఖరునితోడి యుద్ధములో, వెనుమరలలేదులే, భయపడలేదులే, ముందుకు చూచుచునే ఆ 'గాడిదను' - ఖరుని కొట్టుటకు మూఁడడుగులు వెనుకను పెట్టినారు! వాలి ఇతరునితో యుద్ధముచేయుచుండఁగా దాను చెట్టుచాటున ఉండి, వానిని గొట్టిన నేర్పును - లోక మంతయు మెచ్చుకొన్నదేలే! ఇదెల్ల సోత్ప్రాస ఫణితి - ఎత్తిపొడుపు ప్రకారము!

రామా - అరణ్య. - XXX.

22. విహ్వలః స కృతో బాణైః ఖరో రామేణ సంయుగే,
మత్తో రుధిరగన్ధేన తమేవాభ్యద్రవద్ద్రుతమ్।

23. తమాపతన్తం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతమ్
అపాసర్పద్ద్విత్రిపదం కించిత్త్వరితవిక్రమః.

రామా - కిష్కింధా—XIV

1. సర్వే తే త్వరితం గత్వా కిష్కింధాం వాలిపాలితాం
వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠన్ గహనే వనే.

XVII 15. పరాఙ్ముఖవధం కృత్వా కోను ప్రాప్త స్త్వయా గుణః?... ...

19. న మా మన్యేనసంరబ్ధం ప్రమత్తం యోద్ధు మర్హతి
ఇతి మే బుద్ధి రుత్పన్నా బభూ వాదర్శ నే తవ.

బాల XXV 15. గోబ్రాహ్మణ హితార్థాయ జహి దుష్టపరాక్రమామ్

16. న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ

17. చాతుర్వర్ణ్య హితార్థాయ కర్తవ్యం రాజసూనునా
నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్.

ఇట్లు తాటకవధం గూర్చియు వాలివధం గూర్చియు ఆక్షేపసమాధానము లవునిపాతమగు రామాయణమున నున్నవి. అట్లే ఖరయుద్ధమున అడుగులంగూర్చిన మాటయు ఉన్నది. ఆక్షేపములు ఆక్షేపములుగానే, ఈ సమాధానములచే అడంగక యుండును కాబోలు. అవుడు క్షత్రియబాలుడు కావున వాని చిత్తమున ఆక్షేపములే, బాల్యసులభములు, లేచుచుండును. అట్లే చంద్రకేతువునకును తోడంగూడినను, తనయింటికథలైనందున సమాధానములు లెస్సగా విని యెఱుంగుటచే, ఆక్షేపములకు తాను ముఖ్యముగా సమాధానములు చెప్పంగలుగుట సిద్ధము. ఐనను వాలివధకు సమాధానము ఎంత చెప్పినను అది లోకాన ఒకనాంటికి అడంగంబోదు.

'వృద్ధాః' 'స్త్రీ' 'అపరాఙ్ముఖాని' 'కౌశలమ్' - ఇవన్నియు పరిహాసగర్భములు - అపరాఙ్ముఖాని - పరాఙ్ముఖాని అనియే కావు. యుద్ధమున పరాఙ్ముఖత - వెనుకకుగు - ఓటమిం దెలుపును. 'ఖర' - అనంగా 'గాడిద' అనియు ధ్వని 'ఆగాడిదను గొట్టునపుడు.' 'వృద్ధో బాలో న హన్తవ్యో నైవ స్త్రీ కేవలో నృపః' 'న చ హన్యాత్ స్థలారూఢం............ నయుధ్యమానం పశ్యన్తం యుధ్యమానం పరేణ చ' '......కూటే నైవ సన్తి నియమా అమీ। న యుద్ధం కూటసదృశం నాశనం బలవద్రిపోః। రామకృష్ణేన్ద్రాదిదేవైః కూట మే వావృతం పురా! కూటేన నిహతో వాలీ యవనో నముచి స్తథా.' మొదలగు వచనములు ధర్మయుద్ధమును గూర్చినవియు కూటయుద్ధముం గూర్చినవియు స్మరింపందగును.

ఈ శ్లోకమును 11-వ శతాబ్దివాండు, కాశ్మీర క్షేమేంద్రుండు ఔచిత్యవిచారమున వీరరసౌచిత్యముక్రింద ఉదాహరించినాండు. 'అత్ర అప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపోత్కర్షాసహిష్ణోః వీరరసోద్దీపనాయ సకలప్రబన్ధ జీవితసర్వస్వ భూతస్య ప్రధాననాయకగతస్య వీరరసస్య తాటకా-దమన ఖరరణాపసర ణాన్యరణ సంసక్త వాలివ్యాపాదనాది జనవిహితాపవాద ప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశః కృత ఇత్యనుచిత మేతత్.' అం.

చన్ద్రకేతుః—ఆః తాతాపవాదభిన్నమర్యాద! అతి హి నామ వికత్థసే.

లవః—ఆః మయ్యేవ భ్రుకుటీధర స్సంవృత్తః!

సుమన్త్రః—స్ఫురిత మనయోః క్రోధేన.

శ్లో॥ చూడామణ్డలబన్ధనం తరళయ త్యాకూతజో వేపథుః,
కిఞ్చి త్కోకనదచ్ఛదస్య సదృశే నేత్రే స్వయం రజ్యతః,

---

అట్లే అయోధ్యరాముఁడు దుష్టుల సంహరించి శిష్టులఁ గావ పనిబూని తమ దక్షిణ భారతమునకు తమ్ము వెదకికొనియో యన వచ్చిన దేవుఁడు, వ్యాజాన దండక కిష్కింధ లంకలం జొచ్చిన మహావీరుఁడు కరుణాపూర్ణుఁడు అని పట్టరాని మమకారము రామునియందును రామాయణమందును, దాక్షిణాత్యులకు. కావుననే 13-వ శతాబ్దియుత్తరార్ధమున వెలిగిన కవితార్కికసింహ వేదాంతదేశికులవారును ఆ యనౌచిత్యం దడవుచు అది నోరెఱుంగని లవుని బాల్యపు - అనిపుణోక్తియని తమ సుభాషితనీవిలో అనిపుణపద్ధతిలో ఇట్లు సమాధి సమకూర్చినారు.

"నిరవధి గుణగ్రామే రామే నిరాగసి వాగసి
స్ఫురణ ముషితా లోకా లోకా వద న్తి సద న్తికే
వరతనుహతిం వాలిద్రోహం మనాగపసర్పణం;
పరిమితగుణే స్పష్టావద్యే ముధా కి ముదాసతే."

అంతులేని గుణములుగలవాఁడును ఒకింతలేని దోసములేనివాఁడును ఐన రాముని యెడనే, కత్తులంబోని పరుషవాక్కుల సోఁకునకు తెలివి కోల్పోయి లోకులు 'ఆడుదానిం జంపినాఁడు.' 'వాలికి ద్రోహము చేసినాఁడు' (యుగానఎదిరికి) రవంత తొలఁగినాఁడు అని యిట్టు ఏమేమో (నిందలు) పెద్దలయెదురనే పల్కుదురే, ఇఁక మంచి గుణములు అంతంతే అయి, దోషములు స్పష్టముగా తోఁచుచున్నవారియెడ నోరుమూసికొని యుందురా? అని.

ఆః - అని కోపమునఁ గాని, పీడయందుఁ గాని. ఇట రెండును కలవు. అపవాద=దూషణ. భిన్నమర్యాద = అతిక్రమించిన సాధ్వాచారము గలవాఁడా, ప్రగల్భసే=ప్రేలుచున్నావు! బడాయి కొట్టుచున్నావు! అయే - అహో ఆశ్చర్యార్థకము. మయ్యేవ = నా మీఁదనే, భ్రుకుటీధరః = బొమలుముడిచినవాఁడు, కోపము చేత - నన్నే తానేమో చేయఁగల యట్లు నామీఁదనే కోపము పూనుచున్నాఁడే. ఒండొరులకు వీరు సమానులే - ఒకరి కోపమును ఒకరు సరకుగొనరు, ఓర్వరు. ఇక యుద్ధము ఆరంభమగును.

స్ఫురితం అనయోః క్రోధేన=వీరికి కోపము రేఁగినది! తథాహి=కావుననే.

శ్లో. 36. చూడేతి—ఆకూతజః=మనసునంబుట్టిన కోపమునం గలిగినదైన - (కోప) భావమునం బుట్టినదైన, వేపథుః = వణఁకు, చూడామణ్డల బన్ధనమ్=సిగ

ధత్తే కాన్తి మఖణ్డ తాణ్డవితయో ర్భఙ్గేన వక్త్రం భ్రువో
శ్చన్ద్ర స్యోద్భటలాఞ్ఛనస్య కమల స్యోద్భ్రాన్తభృఙ్గస్య చ.
కుమారౌ — తదితో విమర్దక్షమాం భూమి మవతరావః.

(ఇతి నిష్క్రాన్తాః సర్వే)

ఇతి కుమారవిక్రమో నామ

పఞ్చమాఙ్కః

---

యొక్క గుండ్రని - కాదా, గుండ్రని నిగయొక్క - కట్టును ముడిని, తరళయతి = ఆడించుచున్నది. నేత్రే=కన్నులు, స్వయం=స్వయముగానే - ఊరకయున్నప్పుడే, కిఞ్చిత్ =ఇంచుక, కోకనద చ్ఛదస్య=ఎఱ్ఱకలువరేకునకు, సదృశే=సమానమైనట్టివి, రజ్యతః= కెంపెక్కుచున్నవి. వక్త్రం= మొగము, అఖణ్డతాణ్డవితయోః =తటాలున ఆడింపఁబడినవైన, భ్రువోః=కనుబొమలయొక్క, భఙ్గేన=ముడివడుటచేత. ఉత్కట లాఞ్ఛనస్య = మిక్కిలి ప్రకాశించుచున్న నల్లమచ్చగల. చన్ద్రస్య = చంద్రుని యొక్కయు, ఉద్భ్రాన్తభృఙ్గస్య = పైనసుడియుచున్న తుమ్మెదలుగల, కమల స్యచ=తామరయొక్కయు, కాన్తిమ్=సొబగును, ధత్తే=తాల్చుచున్నది.

కోపమునఁగలిగిన (మేని)యదరు తలకట్టును ఆడించుచున్నది. నేత్రములు స్వయముగానే కొనల ఎఱ్ఱగానుండునవి, ఎఱ్ఱగలువరేకుం బోలినవి, ఎఱ్ఱవాఱు చున్నవి. మొగాన నల్లగా బొమలు ముడివడినవి. ఇపుడు ఆమొగము చూడ స్పష్టముగాతోఁచు మచ్చతోడి చంద్రుఁడా, తుమ్మెదలుపైన సుడియుచుండు తామర పువ్వా అనునట్లున్నది. కంపము, కంటియెఱుపు, బొమముడి ఇవి కోపకార్యములు. సుమంత్రుఁడు ఇరువురిం జూచుచున్నాఁడు. ఇద్దటికిని సమానముగా కోపము రేఁగి సమవికారములే కలిగినవి. సుమంత్రునికి అదెల్ల చూడఁదగియే యున్నది. చంద్ర కేతువు లక్ష్మణకుమారుఁడు - అవుఁడును ఎవఁడో తనచిత్తమును చూఱఁగొని ఇంతప కన్నులు నీరు తేఱునట్లు చేసినవాఁడు.

అతిప్రౌఢమగు కవనము!

విమర్దక్షమాం — పోరాటమునకుఁదగిన. అంకమున ప్రత్యక్షముగా యుద్ధము, చూపఁగూడదు - అని శాస్త్రము. అదియెట్లన —

యుద్ధం రాజ్యభ్రంశో మరణం నగరోపరోధనం చ

ప్రత్యక్షాణి తు నాఙ్కే, ప్రవేశకైః సంవిధేయాని. భరతనాట్య-XVIII-19

తగినచోటికి పోవుదము అని అది నిర్వహింపఁబడినది. అంకము ముగియుటచే, ఇట్టిది నిష్క్రమణమునకును వ్యాజము.

ఇది

'కుమారవిక్రమము'

పంచమాంకము.



# విష్కమ్భకః



(తతః ప్రవిశతి విమానే నోజ్జ్వలేన విద్యాధర మిథునమ్.)

విద్యాధరః—అహో నుఖల్వనయో ర్వైకర్తనకుల కుమారయో రకాణ్డకలహ ప్రచణ్డయో రుద్ద్యోతిత క్షాత్రలక్ష్మీకయో రద్భుతోద్భ్రాన్త దేవాసురాణి విక్రాన్తచరితాని. తథాహి, - ప్రియే పశ్య పశ్య.

శ్లో॥ ఝణజ్ఝణిత కఙ్కణక్వణిత కిఙ్కిణీకం ధను
ర్ధ్వనద్గురు గుణాటనీకృత కరాళకోలాహలమ్,
వితత్య కిరతోశ్శరా నవిరతం స్ఫురచ్చూడయో
ర్విచిత్ర మభివర్ధతే భువనభీమ మాయోధనమ్. ౧

---

ఉజ్జ్వలేన=మిక్కిలి ప్రకాశించుచున్న - విద్యాధరులు అను దేవజాతివారిది గాన అట్లు ప్రకాశించుచున్నది. విద్యాధరులజత - ఆలును మగఁడును. అహో నుఖలు! = ఏమి ఈ యాశ్చర్యము! వికర్తనకుల కుమారయోః = సూర్యవంశపు బాలురు - వారు దేవత లగుటచే లవుఁడు సీతారాముల కొడుకు అని ఎఱుంగుదురు. అకాణ్డ=ఆకస్మికమగు - క్షాత్త్రలక్ష్మీకయోః = క్షత్త్రియులకు తగిన (రూప) పరాక్రమము(లు) గలవారికి, అద్భుతోద్భ్రాన్త = ఆశ్చర్యముతో తబ్బిబ్బుపడుచున్న, విక్రాన్తచరితాని=పరాక్రమచర్యలు!

శ్లో. ౧. ఝణదితి. - ఝణఝణయని మ్రోఁగుచున్న వలయములయందలి గణగణ మ్రోఁగుచున్న చిఱుగజ్జలుగలదియు, ధ్వనద్గురు...హలమ్ = మొరయుచున్న పెద్ద (వింటికి తగిన పటిమగల) అల్లెత్రాళ్ళచేతను వింటి కొప్పులచేతను కావింపఁబడుచున్న భయంకరమగు కలకలముగలదియు నగు, ధనుః=వింటిని, వితత్య=వంచి, శరాన్=బాణములను, కిరతోః=కురియుచున్నవారగు, అవిరతస్ఫురత్ చూడయోః= తెంపులేక పైకి క్రిందికి ఆడుచున్న జుట్టుగలవారియొక్క. విచిత్రం = ఆశ్చర్యము కలిగించునదియు, భువనభీమం = లోకములకెల్ల భయంకరముగా నున్నదియు, అగు, ఆయోధనం = యుద్ధము, అభివర్ధతే = హెచ్చుచున్నది - ఏచుచున్నది. 'అవిరతం పురః కుమారయోః' అని పాఠాంతరము. అవిరతం = ఎడతెగక, కిరతోః = కురియుచున్న, కుమారయోః=కుమారులయొక్క, ఆయోధనం పురః అభివర్ధతే. చూడాబంధ

శ్లో॥ విజృమ్భితం చ దివ్యస్య మఙ్గళాయ ద్వయోరపి.
స్తనయిత్నోరివామన్ద్రం దున్దుభే ర్దున్దుమాయితమ్. ౨

తత్ప్రవర్త్యతా మనయోః ప్రవీరయో రనవరత మవిరళ లలిత వికచ కనక కమల కమనీయ సన్తతి రమరతరు తరుణ మణి ముకుళ నికర మకరన్దసున్దరః పుష్పనిపాతః.

---

స్ఫురణము ఇప్పుడె పూర్వశ్లోకమున చెప్పినాఁడు. కావున దానిని మాని ఈ పాఠాంతరమును గొనఁదగును. కాదా, అవర్ణన సుమంత్రుఁడు చేసినది, ఇది విద్యాధరుఁడు చేసినది, వానికిని తోఁచినందున, అని యనుకొన్నను అనుకొనఁదగును.

విండ్లకు గజ్జెలయుంగరము లున్నవి. ఉంగరముల ఝణఝణ, గజ్జెల గణగణ మ్రోఁతలు. మోహరమునకు చాలిన యల్లెలు, వాని టంకారములు. వింటికొప్పుల గుయ్ గుయ్. ఈ మ్రోఁతలు భయంకరముగ నున్నవి. ఈ వీరులు అట్లు అంపవానలచే ఒండొరుల ముంచుచున్నారు. మోహరము లోకముల కెల్ల అద్భుతభీషణముగా నున్నది.

శ్లో. ౨. విజృమ్భితేతి — ద్వయోః అపి=ఇరువురియొక్కయు, మఙ్గళాయ= కల్యాణమునకై, స్తనయిత్నోః ఇవ=మేఘముయొక్కంబోని, దివ్యస్య దున్దుభేః= దేవలోకపు భేరియొక్క, ఆమన్ద్రం దున్దుమాయితమ్=గంభీరమైన దుందుం అను శబ్దము, విజృమ్భితంచ=పర్వుచున్నది.

ఇరువుర కల్యాణమునకై మింట సురదుందుభులు దుందుం అని మ్రోఁగఁ జొచ్చినవి — ఆ మ్రోఁతలు మేఘగంభీర గర్జనవలె నున్నవి.

దేవతలకు వాలు రిరువురును ఆప్తులే — కావున ఎవ్వరికిని అమంగళము కలుగకుండుటకై వారు మంగళార్థము దుందుభులు మ్రోఁగించుచున్నారు.

తత్ ప్రవర్త్యతాం అనయోః అనవరతం పుష్పనిపాతః — కావున వీరిమీఁద ఎడతెంపులేక పూలవాన కురియింపఁబడును గాక. ఇదియు వారికి మంగళము కొరకే. దేవత లెల్ల ఇట్లు వీరికి ఈయుద్ధమున సేగి కలుగకుండుటకై మంగళాపాదక కార్యములం బనివడుచున్నారు. కావున యుద్ధము నిరపాయముగా ముగియునని సూచింపఁబడినది. ఆ పూలవాన ఎట్టిదనఁగా — అవిరల లలిత వికచ కనక కమల కమనీయ సన్తతిః = దట్టమైన సొబగారు విరిసిన బంగరు తామరల యందంపు మొత్తములుగలది, అమరతరు తరుణ మణిముకుళ నికర మకరన్దబిన్దు సున్దరః=కల్ప వృక్షముల క్రొమ్మొగ్గలు ఐన మణుల మొత్తముల తేనెబొట్టులు గల్గి ఇంపారు

విద్యాధరీ—తా కింత్తి ఉణ అఖండ విప్ఫురిద తడిచ్ఛటా కడారం విఅ అమ్బరం ఝత్తి సంవుత్తం? [తత్కిమితి పునరకాణ్డ విస్ఫురిత తటిచ్ఛటాకడారమి వామ్బరం ఝటితి సంవృత్తమ్.]

విద్యాధరః—తత్కిం ను ఖల్వద్య!

శ్లో॥ త్వాష్ట్రయన్త్రభ్రమిభ్రాన్త మార్తణ్డజ్యోతి రుజ్జ్వలమ్!
పుటభేదో లలాటస్థ నీలలోహిత చక్షుషః! 3

---

చున్నట్టిది. పసిడితామరల స్వర్గసులభములు. కల్పవృక్షమున మొగ్గలు మణులుగా నుండును. అట్లే కల్పతరువు చివుళ్ళు అంశుకములు - తెల్ల పట్టుగుడ్డలుగా నుండును. ఇవి కనందగును 'వర్ణ రమీ కల్పలతాంశుకేషు - లిఖన్తి' - శాకుం-VII-5.

ముక్తాయజ్ఞోపవీతాని బిభ్రతో హైమవల్కలాః
రత్నాక్షసూత్రాః ప్రవ్రజ్యాం కల్పవృక్షా ఇవాశ్రితాః - కుమార VI-6
యత్ర కల్పద్రుమైరేవ విలోలవిటపాంశుకైః
గృహయన్త్రపతాకాశ్రీ రపౌరాదరనిర్మితా - కుమార VI-41
ధున్వన్ కల్పద్రుమకిసలయా న్యంశుకానీవ వాతైః - మేఘ I-66

కావున ఇట క్రొమ్మొగ్గలు మణులు అనుట. అకాణ్డ విస్ఫురిత తటిచ్ఛటా కడారమ్=అకస్మికముగా మెఱసిన మెఱుపుఁదీఁగల మొత్తమువలన పసుపువాఱినది.

తత్ కిన్ను ఖలు అద్య=మఱి ఇదేమి ఇప్పుడు!

శ్లో. 3. త్వాష్ట్రేతి—ఉజ్జ్వలం = మిక్కిలి మెఱయు, త్వాష్ట్రయన్త్ర... జ్యోతిః - త్వష్టది (=విశ్వకర్మది = సురశిల్పిది)యైన తతిమెనయంత్రమున గిరగిర త్రిప్పిన సూర్యుని కాంతియో! లలాటస్థ నీలలోహిత చక్షుషః=నుదుటనున్న రుద్రుని కంటియొక్క, పుటభేదః=తెఱచుటయో! (మూఁతవిడుట - విచ్చుట.)

త్వష్ట తతిమెనలో పెట్టి సూర్యుని గిరగిర త్రిప్పినపుడు ఆయన బింబమునుండి పళపళన లేచిన వెలుఁగా! రుద్రుని నుదుటి సెగకంటి రెప్పలవిప్పటయా!

త్వష్ట దేవశిల్పి. అతఁడు సంజ్ఞ అను తన కూఁతును సూర్యుని కిచ్చి పెండ్లిచేసెను. ఆమె 'నాయనా, ఈయనకాంతిని నేను ఓర్చుకొనలేకయున్నానే' అనఁగా ఆయన సూర్యుని ఒప్పించి, సెగతగ్గుటకై, తతిమెనలో పెట్టి - బింబము పైపొరలుకొంత చెక్కివేసెనఁట; అట్లు తతిమెనలో గిరగిర తిరుగుచుండు

ఆం జ్ఞాతమ్. వత్సేన చన్ద్రకేతునా ప్రయుక్త మస్త్ర మాగ్నేయమ్, తస్యాయ మగ్నిచ్ఛటాసమ్పాతః. సమ్ప్రతి హి,

శ్లో॥ అవదగ్ధ కర్బురిత కేతుచామరై
రపయాత మేవ హి విమానమణ్డలైః,
దధతి ధ్వజాంశుక పటాఞ్చలే ష్విమాః
కుసుమ్భకుట్మల మచ్ఛురణ విభ్రమం శిఖాః. ౪

ఆశ్చర్యం! ప్రవృత్త ఏ వాయ ముచ్చణ్డ వజ్రఖణ్డావస్ఫోట పటుతర స్ఫులిఙ్గ విక్రృతి రుత్తాల తుముల లేలిహాన జ్వాలా సమ్భార భైరవో

---

సూర్యుని కాంతి ఎంత పళపళన ఉండును! ఇది ఆ కాంతి కాఁబోలు అనుట. కాదా ప్రళయమున రుద్రుఁడు తన నుదుటి కంటిని తెఱచును. అంగుండి సృష్టిని ఒక్కట లయ మొందించు పెనుమంట ఇంతంతనరాని వెలుతురుతో తటాలున లేఁగును. అదియా ఇది అనుట. కన్ను తెఱచు టే మంట లేఁగుట.

ఆం=అవును - ఇదియే అటువమున ద్వియు క్తముగా 'ఆమాం' అను అంగీకారార్థకము కాఁబోలును.

'వత్సేవ' - అనుచున్నాఁడు - అంత వాత్సల్యము! పూలవాన కురిపింపుమన్నాఁడుగదా. వీరియుద్ధము తీవ్రముగానే జరుగుచున్నను, అది అతనికి చూచుటకు తమాషాగానే ఉన్నది. అగ్నిచ్ఛటాసంపాతః = నిప్పుకుప్పలు వ్యాపించుపెల్లిదము.

శ్లో. ౪. అవదగ్ధేతి—అవదగ్ధ కర్బురిత కేతు చామరైః=కాలి కఱిసైన జెండాలు చామరములు గలవై, విమానమణ్డలైః=విమానముల సమూహములు, అపయాతం ఏవ హి=దూరమునకు తొలఁగిపోయినవి. (సంస్కృతమున తృతీయతో 'భావేప్రయోగము.') ఇమాః=ఇవిగో, ధ్వజాంశుక పటాఞ్చలేషు=జెండాకొంగుల కొనలయందలి గుడ్డల యంచులందు, శిఖాః = జ్వాలలు, కుసుమ్భకుట్మలమచ్ఛురణ విభ్రమం=చిటికసేపు కుంకుమపూఁత సొబగును, దధతి=తాల్చుచున్నవి.

ఆ మంటలను తప్పించుకొనుటకు మింట గుంపులుగానున్న విమానములు వడివడిగా తొలఁగిపోయినవి. ఐనను, వాని జెండాలు చామరాలు మాడి రంగు మాఱినవి. జెండాగుడ్డలకు అంటుకొన్న మంట చిటికసేపు వాని యంచులందు ఎఱ్ఱనై కననగుచున్నది.

ఇదెల్ల ఆగ్నేయాస్త్రము తొలుత తటాలున 'భగ్' అన్న వర్ణన. ప్రవృత్త ఏవ - లేవనే లేచినదే - ఆయగ్ని అనుట. ఉచ్చణ్డవజ్ర...విక్రృతిః = భయంకరము

భగవా నుషర్బుధః! ప్రచణ్డ శ్చాస్య సర్వత స్సన్తాపః. త త్ప్రియా మఙ్గే నాచ్ఛాద్య సుదూర మపసరామి. (తథా కరోతి.)

విద్యాధరీ—దిట్ఠిఆ! ఏదేణ విమల మోత్తి అసర సీఅళ మసిణ మంసళేణ ణాహ దేహప్పంసేణ ఆణందముఉళిద ఘుమ్మంత లోఅణాఏ అందరిదో ఎవ్వ సందావో. [దిష్ట్యా ఏతేన విమలమౌక్తికసర శీతల మసృణ మాంసలేన నాథ దేహస్పర్శేన ఆనన్దముకులిత ఘూర్ణ మానలోచనాయాః అన్తరిత ఏవ సన్తాపః!]

విద్యాధరః—అయి కి మత్ర మయా కృతం? అథవా,

శ్లో॥ న కిఞ్చిదపి కుర్వాణ స్సౌఖ్యై ర్దుఃఖా న్యపోహతి.
త త్తస్య కిమపి ద్రవ్యం యో హి యస్య ప్రియో జనః. ౫

---

త్తైన పిడుగుతునియల తప్‌తప్ అని చెదరుటవలె బెట్టిదంబులగు మిడుంగురుల భయంకరాకారముగలది. ఉత్తాలతుముల... భైరవః = నిడుదలుగా మొత్తములుగా లేచి వాయుచున్న మంటల మొత్తములతో భయంకరమైనది. ఉషర్బుధః - అగ్ని, తాను దేవత గావున అస్త్రమున మంత్రమున లేచిన అగ్నియు దేవత గావున 'భగవాన్' అని సంభావన. ప్రచణ్డః=భయంకరముగా సెగలు ప్రాకుచున్నట్టిది, సన్తాపః= వేడి. అఙ్గేన అచ్ఛాద్య = నా యొడలితో కప్పి - కౌఁగిలించుకొని. దిష్ట్యా=అహా, ఎంత హాయిగా నున్నది! ౦మసృణమాంసలేన=నున్నని నిండుగా మొత్తగా తగులుచున్న - అయి - ఇది కోమలమగు ఆమంత్రణము - కనుక - 'ప్రాణేశ్వరీ' - అన్నట్లు - అథవా = అయినను.

శ్లో. ౫. నకిఞ్చిదితి—నకిఞ్చిదపికుర్వాణః = ఏమియుం జేయనివాఁడు అగుచుకే, సౌఖ్యైః = సుఖములచేత, దుఃఖాని = చిత్తఖేదములను, అపోహతి=తొలఁగించును. హి=ఏలన, యః=ఎవఁడు, యస్య=ఎవనికి, ప్రియః=ప్రీతి పాత్రుడగు, జనః=జనుఁడో, తత్ =అతఁడు, తస్య=అతనికి, కిమపి=వర్ణింపనలవికాని, ద్రవ్యమ్= ధనము.

ఎవరు ఎవరికి ప్రియజనమో, వారు వారికి ఇట్టిదని చెప్పనలవికాని అర్థి. వారు తా మేమియుం జేయకయే - సాన్నిధ్యమాత్రముచేత - ఆనందములచేత దుఃఖములను పోఁదోలుదురు. ఈ శ్లోకము రెండవయంకమునను కలదు - ౧౦.

విద్యాధరీ—కహం! అవిరళ విలోల ఘుమ్మంత విజ్జూలదా విలాసమండిదేహిం మత్తమోరకంఠసామలేహిం ఒత్థరీయది ణహత్థలం జలహరేహిం! [కథ! మవిరళ విలోలఘూర్ణమాన విద్యుల్లతా విలాస మణ్డితైః మత్తమయూర కణ్ఠశ్యామలై రవస్తీర్యతే నభస్థలం జలధరైః!]

విద్యాధరః—అయి, కుమారలవ ప్రయుక్త వారుణాస్త్ర ప్రభావః ఖల్వేషః! కథ! మవిరళప్రవృత్తవారిధారాసహస్రసమ్పాతైః ప్రశాన్తమేవ పావకాస్త్రమ్!

విద్యాధరీ—పిఅం మే. [ప్రియం మే.]

విద్యాధరః—హంత భోః స్సర్వ మతిమాత్రం దోషాయ. యత్ప్రబల వాతావళి క్షోభ గమ్భీర గుణగుణాయమాన మేఘ మేదురితాన్ధకార నీరన్ధ్రనిబద్ధం ఏకవారవిశ్వగ్రసన వికచ వికరాళ కాలకణ్ఠ కణ్ఠ కన్దరవివర్తమాన మివ, యుగాన్త యోగనిద్రా నిరుద్ధ సర్వద్వార నారాయణోదర నివిష్ట మివ భూతజాతం ప్రవేపతే. సాధు! చన్ద్రకేతో! సాధు! స్థానే వాయవ్య మస్త్ర మీరితం! యతః.

---

కథం!=ఏమి ఇది! అవిరళ విలోల ఘూర్ణమాన విద్యుల్లతా విలాస మణ్డితైః= కొలఁదిలేక దువాళించుచు సుడియుచున్న మెఱుపుఁదీఁగెలె అందమైన అలంకారములుగాఁ గలిగి, మత్త మయూర కణ్ఠ శ్యామలైః=మదించిన నెమ్ముల మెడలవలె నల్లనైన. అవిరళ ప్రవృత్త వారిధారా సహస్ర సమ్పాతైః=ఎడములేక ప్రవర్తిల్లిన జలధారా సహస్రముల కురియుటలచేత, ప్రశాన్తం=అణఁగిపోయినది. సర్వం అతిమాత్రం దోషాయ = ఏదియైనను మిక్కుటమగుట చెఱుపునకే. ఇది మంచి జ్ఞానసూక్తి. యత్=ఎట్లనఁగా, ప్రబలవాతావళిక్షోభ...నిబద్ధం=పెనుగాలివలని క్షోభ (=కలఁత)చేత లోఁతుగా నుఱుముచున్న మేఘములచేత దట్టమైన అంధకారములో సందులేక కట్టివైవఁబడినదై, ఏకవారవిశ్వగ్రసన...వివర్తమానం ఇవ=ఒక్కతూఁటిగా-ఒక్కమొద్దుగా-విశ్వమును మ్రింగుటకై వెడలుపుగా తెఱచిన భయంకరమగు రుద్రుని గొంతుకుహరములో ఊరలుచున్నదియుం బోలెను, యుగాన్త... యుగాంతమున యోగనిద్రచే అడ్డగింపఁబడిన యెల్లదారులుగల నారాయణుని

శ్లో॥ విద్యాకల్పేన మరుతా మేఘానాం భూయసా మపి,
బ్రహ్మణీవ వివర్తానాం క్వాపి ప్రవిలయః కృతః. ౬

విద్యాధరీ—ణాహ కోదాణిం ఏసో ససంభమ ముక్ఖిత్త కర బ్భమిఅ పడంచలో దూరదో ఎవ్వ మహుర వఅణ పడిసిద్ధ జుజ్ఝ వ్వావారో ఏదాణం కుమారాణం అన్దరే విమాణం ఓదారావేది. [నాథ, క ఇదానీ మేష ససంభ్రమోత్క్షిప్తకరభ్రమిత పటాఞ్చలో దూరత ఏవ మధురవచన ప్రతిషిద్ధ యుద్ధవ్యాపార ఏతయోః కుమారయో రన్తరే విమాన మవతారయతి? (పా.విమానా దవతరతి.)

బొజ్జలో చొచ్చినదియుంబోలెను, భూతజాతం = ప్రాణులమొత్తమంతయు; స్థానే=సమయమున, ఈరితమ్=ప్రయోగింపఁబడినది. యోగనిద్రా - చూ.

యదా స దేవో జాగర్తి త దేదం చేష్టతే జగత్
యదా స్వపితి శాన్తాత్మా తదా సర్వం నిమీలతి. మను I - 52.

శ్లో. ౬. విద్యేతి—విద్యాకల్పేన = విద్యం బోలిన = విజ్ఞానముం బోలిన, మరుతా = గాలిచేత, వివర్తానాం=వివర్తములకు=భేదములకు, బ్రహ్మణి ఇవ=పరబ్రహ్మమందుంబోలె, భూయసాం అపి మేఘానాం=పెక్కు మేఘములకైనను, క్వాపి = ఎక్కడనో, ప్రవిలయః = తుదముట్ట లయించిపోవుట, కృతః=కలిగినది, కావింపఁ బడినది.

(అనాదిభేదవాసనను తొలఁగింపఁజాలిన ఆత్మైక్య-) విజ్ఞానముచేత వివర్తములు పరబ్రహ్మమందు లయమొందును. ఆపగిది మేఘములు లెక్క కెక్కువైనను, గాలిచేత ఎక్కడికో ఎగురఁగొట్టఁబడినవి.

'బ్రహ్మణి ఇవ వివర్తానాం' అనుటచే భవభూతి వివర్తవాదమువాఁ డగునని, పరిణామవాదమువాఁడు కాఁడని ఊహింతురు. అటనట 'ఏకోరసః...భిన్నః... ఆశ్రయతే వివర్తాన్. III. ౪౦.' అన్నట్లు వివర్తములను ప్రస్తావించియున్నాఁడు.

ససంభ్రమోత్క్షిప్తకరభ్రమిత పటాఞ్చలః=వడిగా ఎత్తిన చేత ఆడింపఁ బడుచున్న వస్త్రపుఁగొన గలవాఁడై మధురవచనప్రతిషిద్ధ...ఆయనయు విమానములో పుష్పకములో వచ్చుచున్నాఁడు కావున వీరికి ముందు అగపడుటయు, ఆయనమాటలు వినఁబడుటయు - కావున 'మధుర' అనుట. కుమారాణాం మధ్యే - ఇదియు యుద్ధము ఆపుజేత్తే. అవతారయతి=దింపుచున్నాఁడు-(తన విమానమును.)

విద్యాధరః—(దృష్ట్వా) ఏష శమ్బూకవధా త్ప్రతినివృత్తో రఘుపతిః.

శ్లో॥ శబ్దం మహాపురుషసంవిహితం నిశమ్య
తద్గౌరవా త్సముపసంహృత సంప్రహారః,
శాన్తో లవః, ప్రణత ఏవ చ చన్ద్రకేతుః.
కల్యాణ మస్తు సుతసఙ్గమనేన రాజ్ఞః. 8

త దిత స్తావ న్నిర్గచ్ఛావః. (నిష్క్రాన్తౌ.)

ఇతి మిశ్రవిష్కంభకః

---

శ్లో. 8. శబ్దమితి—మహాపురుష సంవిహితం = ఆ మహాపురుషుఁడు, పలికిన, శబ్దం=శబ్దమును, నిశమ్య=ఆలకించి, తద్గౌరవాత్ = దానియందలి గౌరవమువలన, సముపసంహృత సమ్ప్రహారః - మానఁబడిన యుద్ధముగలవాఁడై - యుద్ధము మానుకొన్నవాఁడై, లవః=లవుఁడు, శాన్తః=(కోపము అణఁ) ప్రసన్నుఁడైనాఁడు. చన్ద్రకేతుః చ=చన్ద్రకేతుఁడును, ప్రణత ఏవ=ప్రణమిల్లనే ప్రణమిల్లినాఁడు - అనఁగా - అట్లు సంభ్రమముతో. రాజ్ఞః=రాజునకు - రామునికి, సుతసఙ్గమనేన = కొమాళ్ళం గూడుటచేత, కల్యాణం=శుభము, అస్తు=అగునుగాక.

ఘలానా అని తెలియకున్నను మహాపురుషుఁడుగా తోఁచిన ఆయనయొక్క మాటను విని దానిని మన్నించి లవుఁడు యుద్ధము మాని శాంతుఁడైనాఁడు; చంద్రకేతుఁడు పెదనాయన అని యెఱింగినవాఁడు సంభ్రమమున ప్రణమిల్లినాఁడు. రాజునకు రామునికి సుతులను లవుని చంద్రకేతుని—కుశునింగూడ - గూడుటచేత కల్యాణమగునుగాక.

మన్నించుటచే లవుని శీలము తోఁచును - విక్రాంత చర్యలు నిలిచిపోయినవి, కావున అవలోకేఁగుట - నిష్క్రమణవ్యాజము.

నిర్గచ్ఛావః=వెడలిపోవుదము.

ఇతి విష్కంభకః - విష్కంభకము ముగిసినది.

ఇది శుద్ధవిష్కంభకమే, సంస్కృతమును ప్రాకృతమును రెండును ఉన్నను ఏలన ఉభయులును మధ్యమ పాత్రలు - విద్యాధరి స్త్రీ యగుటచే ప్రాకృతము పలికినదిగాని, నీచపాత్ర యగుటచేత కాదు.

# ఉత్తరరామచరితనాటకమ్

## షష్ఠాఙ్కః

(తతః ప్రవిశతి రామో లవః ప్రణత శ్చన్ద్రకేతు శ్చ)

రామః—(పుష్పకా దవతరన్)

శ్లో॥ దినకరకులచన్ద్ర చన్ద్రకేతో

సరభస మేహి దృఢం పరిష్వజస్వ,

తుహినశకల శీతలై స్తవాఙ్గై

శ్శమ ముపయాతు మమాపి చిత్తదాహః. ౧

(ఉత్థాప్య సస్నేహం పరిష్వజ్య) అపి నామ కుశలం తవ దివ్యాస్త్ర ధర దేహస్య ?

---

పై శ్లోకమున చెప్పిన తెఱంగున రామ లవ చంద్రకేతులు ప్రవేశించుచున్నారు. చంద్రకేతువు ప్రణతుఁడుగా.

శ్లో. ౧. దినకరకులేతి – దినకరకులచన్ద్ర=సూర్యవంశమునకు (అహ్లాదకారి) చంద్రుఁడా, చంద్రకేతూ, సరభసం ఏహి=కడువడిగ రా నాయనా, దృఢం పరిష్వజస్వ=(నను) ఒగ్గ కవుంగిలించుకొమ్ము, తుహిన శకల శీతలైః=(పేరిన) మంచు తునకలవలె చల్లనివైన, తవ అఙ్గైః=నీయవయవములచేత, మమ చిత్తదాహః అపి=నా మనఃసంతాపము గూడ – ఇందాకటినుంచి జనస్థానమున వాసంతింగూడుటచే సీతను తలంచుకొని దుఃఖము పొంగి చిత్తమున నిలిచిపోయిన ఆ సంతాపమును అనుట, శమం ఉపయాతు=చల్లాఱును గాక.

నాయనా, మా వంశమునకు చంద్రుఁడా, చంద్రకేతూ, వడిగా వచ్చి నను కవుఁగిలించుకొమ్ము. మంచుతునుకలవలె చల్లనైన నీయంగముల (తాఁకుడు)చే నా దేహముననే కాక చిత్తమునను గల సంతాపము అఱును గాక.

తనకు సొంతాన బిడ్డలు లేనందున చంద్రకేతునందు మిక్కిలి ప్రీతి.

దివ్యాస్త్రధరదేహస్య=దివ్యాస్త్రములందాల్చిన దేహముగలవానికి – అస్త్రముల ప్రయోగపు మెఱపులు పరువులు కూడ రామునికంటఁబడినదేమో. అపి

చన్ద్రకేతుః—కుశల, మత్యద్భుత క్రియస్య ప్రియదర్శనస్య లాభాభ్యుదయేన. త ద్విజ్ఞాపయామి, మ దవిశేషేణ మత్తః శివేన వా చక్షుషా పశ్య త్వమమం మహావీర ప్రకాణ్డం తాతః.

రామః—(లవం నిర్వర్ణ్య) ది ష్ట్యాతిగమ్భీరాకృతి రయం వయస్యో వత్సస్య!

శ్లో॥ త్రాతుం లోకా నివ పరిణతః కాయవా నస్త్రవేదః!
క్షాత్రో ధర్మ శ్శ్రిత ఇవ తనుం బ్రహ్మకోశస్య గుప్త్యై!
సామర్థ్యానా మివ సముదయ! స్సఞ్చయో వా గుణానా!
మావిర్భూయ స్థిత ఇవ జగత్పుణ్యనిర్మాణరాశిః! ౨

నామ-ప్రశ్నలో అట్లుండవలయుననను కోరికయు గర్భితము-అస్త్రయుద్ధమే కంటఁ బడినది కదా. అందుచేత ఇట్టి కుశలప్రశ్న. అక్షతశరీరుఁడవుగా ఉన్నావు గదా. ౦క్రియస్య-జృంభకములు సైతము ప్రయోగించినవాఁడు-తన యస్త్రములకు తుల్య కౌశలముతో ప్రత్యస్త్రములం బ్రయోగించినాఁడు. ఆ క్రియలు-పనులు-తనకు ఆశ్చర్యము గొలిపినవి. లాభాభ్యుదయేన=(స్నేహ) లాభము (=దొరకుట) అను అభ్యుదయము (=భాగ్యము) చేత. ఇరువురును యుద్ధమునం బ్రవృత్తులైనను చంద్రకేతు చిత్తమున ప్రియదర్శన లవ లాభము-అతనికైన ప్రేమయు నే నాటుకొని వీడకున్నది. మత్+అవిశేషేణ=నా యందుకంటెను వేఱుకానట్లుగా, మత్తః శివేన=నామీఁది కంటెను ప్రేమతోడిదైన, మహావీరప్రకాణ్డం-లవుఁడు చంద్రకేతు చిత్తమున అట్లు నాటుకొన్నాఁడు. నిరూప్య-లెస్సగా పరికించి-దిష్ట్యా=సంతోషము! వయస్యః=చెలికాఁడు-(సమానమగు వయసువాఁడు) అతిగమ్భీర = మిక్కిలి గొప్పవాఁడని తోఁచునదైన.

శ్లో. ౨. త్రాతుం ఇతి—లోకాన్=లోకములను, త్రాతుం=కాపాడుటకు, కాయవాన్ = మేనుదాల్చినదిగా, పరిణతః=ఐన, అస్త్రవేద ఇవ=అస్త్రవేదమో! బ్రహ్మకోశస్య = వేదమనెడు భాండాగారము యొక్క, గుప్త్యై = రక్షణకొఱకు, తనుం శ్రితః = మేనుపొందిన - దాల్చిన, క్షాత్త్రః ధర్మః ఇవ = క్షత్త్రియులదైన ధర్మమో! సామర్థ్యానాం సముదయః ఇవ=(సమస్త) శక్తుల ప్రోవో! గుణానాం = సద్గుణముల, సఞ్చయః వా= మొత్తమో! ఆవిర్భూయ = ఆవిర్భవించి, మేనుగైకొని యునుటయే; స్థితః=కన్నులయెదుటనున్న. జగత్ పుణ్యనిర్మాణరాశిః ఇవ=జగముల-జనుల - పవిత్రకార్యముల రాశియో!

లవః—అహో! పుణ్యానుభావదర్శనోఽయం మహాపురుషః-

శ్లో॥ ఆశ్వాస స్నేహభక్తీనా మేక మాయతనం మహత్.
ప్రకృష్ట స్యేవ ధర్మస్య ప్రసాదో మూర్తిసఞ్చరః! 3

ఆశ్చర్యం!

---

లోకముల నెల్ల ప్రోవఁగ అస్త్రవేదము ఈరూపుఁ దాల్చినదా! కాక వేద భాండాగారముం గావ, శాస్త్రధర్మము ఇట్లు మూర్తిగన్నదా! ఇది సకల శక్తుల ప్రోవా! గుణముల మొత్తమా! జగాల పుణ్యకర్మల రాశి ఇట్లు మేనితో ఆవిర్భవించి కన్నులయెదుట నిలిచినదా! అట్లున్నాఁడు ఈ అబ్బాంబు!

ఇది రామకృత లవ రూపప్రశంస. ఈ శ్లోకము వీరచరితమునం గలదు, జామదగ్న్యకృత బాలరామ ప్రశంస - అర్థగతము.

పుణ్యానుభావదర్శనః = పుణ్యముకలిగించునదైన ప్రభావమును దర్శనమును కలవాఁడు - రామాయణము నెఱుంగును గాని, లవుఁడు రాముని చూచి యెఱుఁగఁడు. ఈతఁడు రాముఁడని అతనికి ఇంకను తెలియదు. ఎవఁడో మహాపురుషుఁడు. అతనిం గన్న తనకు ఏమేమో మనోభావాలు కలుగుచున్నవి.

శ్లో. 3. ఆశ్వాసేతి—ఆశ్వాస స్నేహ భక్తీనాం=ఊఱట స్నేహము, భక్తి- అనువానికి, మహత్ = పెద్దదైన, ఏకం = ఒకటియేయైన, ఆయతనమ్ = ఆశ్రయమా! ప్రకృష్టస్య=సర్వోత్తమమైన, ధర్మస్య=ధర్మముయొక్క, మూర్తిసఞ్చరః=మూర్తి గొని సంచరించునదైన, ప్రసాద ఇవ=ఫలమా!

నిష్కారణమైన ఒక ఆనందము, స్నేహము, భక్తి నాకు మనసున కలుగుచున్నవే, వానికి ఈయన ఒక్కటేయైన పెద్ద యిక్కవలె నున్నాఁడు! శ్రేష్ఠమైన ధర్మము ఫలమొసంగువేళ ఆఫలము ఇట్లు తిరుగాడఁగల మూర్తి తాల్చినదేమో! ఇదియు తరువాతి శ్లోకమును లవుఁడు రాముని యతిమానుష ప్రభావమున మనసున తెచ్చుకొని పలుకుట. ఆ ప్రభావమే పండ్రెండేండ్లబాలునిచేత ఇట్టి సూక్తి పలికించుచున్నది. 'ఆశ్వాస' చూ. శాకుం. II - "అహో దీప్తిమతోఽపి విశ్వసనీయతా అస్య రాజ్ఞో వపుషః!." ఆశ్చర్యము! నాకే ఆశ్చర్యము గలుగుచున్నది!

శ్లో॥ విరోధో విశ్రాన్తః, ప్రసరతి రసో నిర్వృతిఘన,
స్తదౌద్ధత్యం క్వాపి వ్రజతి, వినయః ప్రహ్వాయతి మామ్.
ఝటిత్యస్మిన్ దృష్టే కిమివ పరవా నస్మి! యది వా
మహార్ఘ స్తీర్థానా మివ హి మహతాం కోఽప్యతిశయః. ౪

రామః—తత్కి! మేకపద ఏవ దుఃఖవిశ్రామం దదా! త్యుప స్నేహయతి చ కుతోఽపి నిమిత్తా దన్తరాత్మానం! అథ వా. స్నేహాశ్చ నిమిత్తసవ్యపేక్షాశ్చ ఇతి విప్రతిషిద్ధమేతత్. తథాహి—

శ్లో. ౪. విరోధ - ఇతి—విరోధః=వైరము, విశ్రాన్తః=శాంతమైనది, నిర్వృతిఘనః=మనఃసుఖముతో మిక్కిలియు నిండిన, రసః=ఆనందము, ప్రసరతి=(చిత్తమున) వ్యాపించుచున్నది; తత్ ఔద్ధత్యం = ఆగర్వము, క్వాపి=ఎటకో, వ్రజతి = పోవుచున్నది; వినయః = అడఁకువ, మాం = నన్ను, ప్రహ్వాయతి = వంచుచున్నది. ఝటితి=తటాలున, అస్మిన్ దృష్టే = ఈయన యగపడఁగా - ఈయనం గాంచఁగా, కిమివ=ఆదట్లో నాకు తెలియలేదు, పరవాన్ అస్మి=వావసము తప్పి అయనవాఁడనుగా ఐ పోవుచున్నాను. యదివా=అట్లన నేల? తీర్థానాం ఇవ=(గంగాది)పుణ్యతీర్థములవంటి వారికి, మహతాం=గొప్ప వారికి, కః అపి=ఇట్టిదని చెప్పనలవిపడని, మహార్ఘః=మిక్కిలి పూజ్యతగల, అతిశయః హి=ప్రభావము గదా.

మనకున వైరము శాంతమైపోయినది, దట్టమైన ఆప్యాయముతోడి ఆనందము ఉబుకుచున్నది. ఆ గర్వము ఎక్కడికో పోయినది. అడఁకువ నన్ను నమ్రునిం జేయుచున్నది. తటాలున ఈయనం గాంచఁగా, ఆదెందులకో చెప్పలేను, ఆయన వసమైపోవుచున్నాను. ఇందులకు ఆశ్చర్య మేల? తీర్థములవలె మహాపురుషులు చెప్పనలవికాని మిక్కిలి పూజ్యమైన మహిమగలవారు కదా.

రామదర్శనమున లవుని కిట్లు. లవదర్శనమున రామునికిని అట్లే. తలపోసికొనును - ఏక పదే ఏవ = ఒక్కుమ్మడి - ఝటితి అన్నమాటయే. దుఃఖవిశ్రామం దదాతి = దుఃఖశాంతి కలిగించుచున్నాఁడు. అన్తరాత్మానం ఉపస్నేహయతి = నా యంతరాత్మను స్నేహ మొందించుచున్నాఁడు. అథ వా=అట్లన నేల? స్నేహాశ్చ= స్నేహ మఁట. నిమిత్తసవ్యపేక్షః చ - ఇతి = నిమిత్తముం గోరునదఁట అని, విప్రతిషిద్ధం ఏతత్=ఇది (ఒకటికి ఒకటి) విరుద్ధము. తథాహి - అట్లేగదా.

శ్లో॥ వ్యతిషజతి పదార్థా నాన్తరః కోఽపి హేతు,
ర్న ఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయన్తే.
వికసతి హి పతఙ్గ స్యోదయే పుణ్డరీకమ్,
ద్రవతి చ హిమరశ్మా వుద్గతే చన్ద్రకాన్తః. ౫

లవః—చన్ద్రకేతో క ఏతే?

చన్ద్రకేతుః—ప్రియవయస్య, నను తాతపాదాః.

---

శ్లో. ౫. వ్యతిషజతీతి - పదార్థాన్ = వస్తువులను, అన్తరః = గూఢమైన, కోఽపిహేతుః=ఏదో కారణము, వ్యతిషజతి=కూర్చును. ప్రీతయః=స్నేహములు, బహిరుపాధీన్ = బయటికారణములపై, న సంశ్రయన్తే ఖలు = ఆధారపడవుగదా. పతఙ్గస్య ఉదయే=సూర్యుఁడు ఉదయింపఁగానే, పుణ్డరీకం వికసతి హి=తామర వికసించునుగదా. హిమరశ్మౌ=చంద్రుఁడు, ఉద్గతే=పొడువఁగానే, చన్ద్రకాన్తః= చంద్రకాంతశిల, ద్రవతి చ=కరఁగి జాఱును.

వస్తువులను గూఢమగు హేతువు ఏదో ఒండొంటిం గూర్చును. ప్రీతి బయటి కారణములం బట్టియుండదు. ప్రొద్దు పొడువఁగానే పుండరీకము పూచును. చంద్రుఁడు తోఁపగానే చంద్రకాంతము కరఁగును. (నాచిత్తము నిష్కారణము గానే స్నేహములో వికసించి అనురాగముతో కరఁగుచున్నది, ఈయబ్బాయిని చూడఁగానే!)

సంవాదమునకు ఇందు V - 17 కడ నున్న మాలతీయుద్ధారమును చూడఁదగును. మఱియు

కయాచిత్ సఙ్ఘటతే కస్యాపి ప్రేమగ్రన్థి
రేవ మేవ. తత్ర న ఖలు కారణ మస్తి రూపమ్.
చఙ్గత్వం పున ర్శృఙ్గ్యతే యత్, తత్రాపి
తద్దీయతే పిశునలోకముఖేషు ముద్రా.

కర్పూరమంజరి III - 9.

ప్రియవయస్య - అని ప్రీతితోడి సంబోధన తనంతట నెట్టుకొని వచ్చుచున్నది. అశ్లో 'క ఏతే' 'ఎవరు వీరలు' అని పూజాబహువచనము. నను తాతపాదాః=

లవః—మమాపి తర్హి ధర్మత స్తథైవ; యతః ప్రియవయస్యో త్వాత్థ. కిన్తు చత్వారః ఖలు భవత ఏవం వ్యపదేశభాగిన స్తత్రభవన్తో రామాయణకథాపురుషాః. త ద్విశేషం బ్రూహి.

చన్ద్రకేతుః—నను జ్యేష్ఠ తాతపాదా ఇత్యవేహి.

లవః— (సోల్లాసం) కథం! రఘునాథః! దిష్ట్యా! సుప్రభాత మద్య! య, దయం దేవో దృష్టః. (సవినయకౌతుకం నిర్వర్ణ్య) తాత, ప్రాచేతసాన్తేవాసీ లవోఽభివాదయతే.

రామః—అయుష్మ న్నేహ్యేహి. (ఇతి సస్నేహమాలిఙ్గ్య) అయి వత్స కృతమ్ కృత మతి వినయేన. అనేకవార మపరిశ్లథం పరిష్వజస్వ.

శ్లో॥ పరిణత కఠోర పుష్కర గర్భచ్ఛద పీన మసృణ సుకుమారః,
నన్దయతి చన్ద్రచన్దన నిష్యన్ద జడ స్తవ స్పర్శః. ౬

---

(మా)నాయనగారు గదా. మమ అపి తర్హి ధర్మతః తథైవ = అట్లైన నాకును ధర్మమునుబట్టి అట్లే - నాయనగారే అనుట. ఏవం వ్యపదేశభాగినః = ఈ పేరఁ బరగువారు. తద్విశేషం బ్రూహి - అందు భేదమును మొదటివారో రెండవవారో అను విశేషమును - చెప్పుము. నను=ఓయి, జ్యేష్ఠ - అందఱిలో పెద్ద - రఘునాథుల వారు. కథం=ఏమీ! రఘునాథః=రఘునాథుఁడా! దిష్ట్యా=సంతోషము! సవినయకౌతుకమ్-వినయముతోను, రామాయణమున కథానాయకుఁడైనవానిని, 'కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్' అన్నట్లు అప్పుడు లోకమునకెల్ల ఒక్కఁడుగా గుణవంతుఁడు మొదలగు విశేషణములఁ బరగువానిని చూడఁగల్గితిని అను కుతూహలము తోను. నిర్వర్ణ్య=చక్కఁగాచూచి - మాచుకొంఁడియు ఆనందము కలుగుచున్నందున. 'ప్రాచేతసాన్తేవాసీ లవః అభివాదయతే' - ఇది పెద్దలకు నమస్కరింపవలయు విధము. 'ఇదిగో నేను ఫలానా' అని నిలుచుండి పలికి వంగి నమస్కరింపవలయును - కేలు మోడ్పవలయును. కృతం అతివినయేన=వలదు అతివినయము. అనేకవారం = పలుమాఱు. అపరిశ్లథం=సడలక గాఢముగా. అట్లు కౌఁగిలి కోరుచున్నది దేహము.

శ్లో. ౬. పరిణతేతి - పరిణత...సుకుమారః = చక్కఁగా ముదిరి పెద్దదై పూచు వెలివచ్చి లోపలనె బలిసి మెత్తగా తళతళవ నున్నగా కోమలముగా

లవః—(స్వగతం) ఈదృశో మాం ప్రత్యమీషా మకారణ స్నేహః. మయా పున రేభ్య ఏ వాభిద్రుగ్ధ మజ్ఞేన, య దాయుధపరిగ్రహం యావ దధ్యారూఢో దుర్యోగః. (ప్రకాశం) మృష్యన్త్విదానీం లవస్య బాలిశతాం తాతపాదాః.

రామః—కి మపరాద్ధం వత్సేన?

చన్ద్రకేతుః—అశ్వానుయాత్రికేభ్య స్తాతప్రతాపావిష్కరణ ముపశ్రుత్య వీరాయిత మనేన.

---

మన్నట్టియు, చన్ద్ర చన్దన నిష్యన్ద జడః = చంద్రునివలెను గంధపుద్రవమువలెను చల్లగా నున్నట్టియు, తవ స్పర్శః = నీ(మేని)తాఁకు, నన్దయతి = (అల్లల్లం దలంచుకొనునంత - మితిమేర లేనట్లుగా) ఆనందము కలిగించుచున్నది.

కాఁగిలి అనుభవించుచు అనుచున్నాఁడు. - అది చక్కఁగా ఎదిగి విరియు పెద్ద తెల్లదామర లోపలి రేకులవలె చిక్కగా మృదువుగా నున్నగా అతి కోమలముగాను చంద్రుఁడే వెన్నెలయే గంధమే పోఁకినట్లు చల్లగాను తన మేనికి స్పర్శ కలిగించుచున్నది - అని.

అతి ఆహ్లాదముగా నున్నది. ఉపమానమును కవిప్రౌఢిచే కల్పించినాఁడు మహాకవి!

అజ్ఞేన మయా పునః ఏభ్య ఏవ అభిద్రుగ్ధం = తెలియనివాఁడనైన నాచేత వన్నెలో వీరికే ద్రోహము చేయఁబడినది. యత్ = ఏమన, ఆయుధపరిగ్రహం యావత్ = ఆయుధమును ఎత్తుటవఱకు, దుర్యోగః అధ్యారూఢః = చెడుపూనిక పూనఁబడినది. అట్లే వీరచరితమునను రామునివి ఇవే మాటలు పరశురామునిగూర్చి 'కథం పాపరాద్ధం మయా, య దాయుధ పరిగ్రహం యావదారూఢో దుర్యోగః' అని IV - 22 తర్వాత అవుఁను అపరాధమును తనతోట చెప్పికొను క్లేశసంకోచములు అతనికి తారించుచు చంద్రకేతువు వివరించుచున్నాఁడు. మృష్యన్తు = మన్నింతురుగాక. బాలిశతాం = మూర్ఖత్వమును, ఆవిష్కరణం = వెల్లడించుటను. నను అయం క్షత్రస్య అలఙ్కారః = ఇది క్షత్రియునికి, క్షత్రియజాతికి, అలంకారము కదా.

రామః—న స్త్వయ మలఙ్కారః క్షత్రస్య,

శ్లో॥ న తేజ స్తేజస్వీ ప్రసృత మపరేషాం విషహతే;
స తస్య స్వో భావః, ప్రకృతి నియతత్వా దకృతకః.
మయూఖై రశ్రాన్తం తపతి యది దేవో దినకరః
కి మాగ్నేయో గ్రావా నికృత ఇవ తేజాంసి వమతి? ౭

---

శ్లో. ౭. న తేజః ఇతి - తేజస్వీ=తేజా - పరాక్రమము - గలవాఁడు, ప్రసృతం=పర్విన, అపరేషాం=ఇతరుల, తేజః=తేజమును - పరాక్రమమును, న విషహతే=ఓర్వఁడు. తస్య = అతనికి, సః = అది, ప్రకృతి నియతత్వాత్ = స్వభావముచేత ఏర్పఱుపఁబడిన దగుటవలన, అకృతకః=తెచ్చుకోలుకానిది, స్వః=సొంత మయినది, భావః=మనసున పుట్టు వికృతి. దేవః=దేవుఁడైన, దినకరః=సూర్యుఁడు, మయూఖైః=కిరణములతో, అశ్రాన్తం = విడుగడలేక - ఎల్లప్పుడును, తపతి యది=ఎండకాయు చుండు నేని, ఆగ్నేయః గ్రావా=సూర్యకాంతశిల, నికృత ఇవ=తాను ధిక్కరింపఁబడినదియుంబోలె, తేజాంసి=మంటలను, వమతి కిమ్=క్రక్కునే అదేల?

పరాక్రమవంతుఁడు ఇతరుల పరాక్రమము సోఁకిన ఓర్వఁడు. అది స్వభావసిద్ధమైనందున తెచ్చికోలుకాని అతని సొంతభావమే అగును. భగవానుఁడు సూర్యుఁడు ఎడతెగక (లోకముపై) ఎండకాయుచునే యుండ, అది సోఁకిన మాత్రన, తన కేమో అవమానము కలిగినట్లు, ఆ సూర్యకాంతశిల వెలుఁగులు క్రక్కుచుండలేదా? ఇది చాల జ్ఞాన సంపన్నమైన మాట. ఉపమయు దివ్యమైనది - సాటిలేనిది.

అట్లే కాళిదాసు వేఱు ప్రకరణమున (- శాకుం. II - 7.) చెప్పినాఁడు—

'శమప్రధానేషు తపోధనేషు
గూఢం హి దాహాత్మక మస్తి తేజః
స్పర్శానుకూలా ఇవ సూర్యకాన్తాః
త దన్యతేజోఽభిభవా ద్వమన్తి.'

అట్లే భర్తృహరియు-

చన్ద్రకేతుః—అమర్షోఽప్యస్యైవ శోభతే వీరస్య, పశ్యన్తు తాతపాదాః. ప్రియవయస్య వినియుక్త జృమ్భకాస్త్ర నిష్కమ్ప స్తమ్భితాని సర్వతః సైన్యాని.

రామః—వత్స లవ, సంహ్రియతా మస్త్రం. త్వ మపి చన్ద్రకేతో నిర్వ్యాపారవిలక్షితాని సాన్త్వయ బలాని.

లవః—యథాజ్ఞాపయతి తాతః (ప్రణిధానం నాటయతి)

చన్ద్రకేతుః—యథాదిష్టమ్. (ఇతి నిష్క్రాన్తః.)

లవః—ప్రశాన్త మస్త్రం.

రామః—వత్స, సరహస్యప్రయోగసంహారాణ్యస్త్రాణి ఆమ్నాయవన్తి.

---

యదచేతనోఽపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితు రినకాన్తః.
తత్తేజస్వీ పురుషః పరకృత నికృతిం కథం సహతే?

శాకుంతలమునను భరతుని యభిజ్ఞానము మెట్టుమెట్టుగా క్రమముగా జరిగినది. ఒక్కుమ్మడిగా ప్రకాశము కాలేదు. అట్లే అంతకన్నను మెట్టుమెట్టుగా ఇట అభిజ్ఞానకార్యము.

అమర్షః అపి=అసహనము గూడ, శోభతే ఏవ=శోభించుచునే యున్నది. జృమ్భకాస్త్ర నిష్కమ్ప స్తమ్భితాని=జృంభకాస్త్రములచే కదలక మ్రాన్పడి-యున్నవి. నిర్వ్యాపార విలక్షితాని = చేతవదక్కి దిగులుగొని యున్నవానిని. ప్రణిధానం=ధ్యానము. చంద్రకేతువు వెడలిపోఁగా రామలవులు మాత్రము ఏకాంతముగా నుండుటకలిగినది. అది యిట రాముఁడు కోరినాఁడు. కలిగించినాఁడు మహాకవి, ఒండొరుల నెఱుంగని యీనాయనకొమాళ్ళ విస్రంభాలాపములకు. సరహస్య ప్రయోగ సంహరణాని=రహస్యము, ప్రయోగము. ఉపసంహారము - ఈ మూఁడును కలవి అస్త్రములు - అగుటచే - ఆమ్నాయవన్తి = సంప్రదాయము - గురుపరంపర - కలవి. అభిజ్ఞానమునకు అచ్చాయి జృంభకజ్ఞానము ఉపయోగింపఁబడుచున్నది.

శ్లో॥ బ్రహ్మాదయో బ్రహ్మహితాయ తప్త్వా
పరస్సహస్రాః శరద స్తపాంసి,
ఏతా న్యపశ్యన్ గురవః పురాణాః
స్వా న్యేవ తేజాంసి తపోమయాని. ౮

అథైత న్మన్త్రపారాయణోపనిషదం భగవాన్ భృశాశ్వః పరస్సహస్రపరివత్సరాన్తేవాసినే కౌశికాయ విశ్వామిత్రాయ ప్రోవాచ; స చ భగవా న్మహ్య; మి త్యేష క్రమః. కుమారస్య తు క స్సమ్ప్రదాయ ఇతి పృచ్ఛామి.

లవః—స్వతః ప్రకాశా న్యావయో రస్త్రాణి.

రామః—(విచిన్త్య) కిం న సమ్భావ్యతే? కోఽపి ప్రకృష్టపుణ్య పరిపాకోపాదానో మహిమా స్యాత్. ద్వివచనం తు కథమ్?

---

శ్లో. ౮. బ్రహ్మాదయః - ఇతి - పురాణాః గురవః = తొంటి గురువులైన, బ్రహ్మాదయః=బ్రహ్మ మొదలైనవారు, బ్రహ్మహితాయ=వేదముల మేలుకై - రక్షకై, పరఃసహస్రాః= పెక్కువేల, శరదః = సంవత్సరములు, తపాంసి తప్త్వా=తపస్సులు తపించి, తపోమయాని=తపోమయములైన, స్వాని తేజాంసి ఏవ=తమ తమ తేజములే ఐన. ఏతాని=వీనిని - ఈయస్త్రములను, అపశ్యన్=కాంచినారు.

బ్రహ్మ మొదలైన పురాతన గురువులు, పెక్కువేల సంవత్సరములు తపస్సు చేసి తమ తేజాలను సాక్షాత్కరించుకొన్నారు. అవే ఈ యస్త్రములు. ఈ శ్లోకము ఇందు I (8) లోను వీరచరితమున I (42) లోను కూడఁ గలదు.

అట్లు ఈ జృంభకముల సాకల్యజ్ఞానమను ఉపనిషత్తును - రహస్యమును - తొలుత భృశాశ్వభగవంతుఁడు ఎఱింగినాఁడు - ఆయనను పెక్కువేలయేండ్లు అంతేవాసిగా - శిష్యుఁడుగా - కౌశికుఁడు సేవించినాఁడు. అంతట ఆయన దానిని ఆయనకు ఉపదేశించినాఁడు. ఆయన నాకు నేర్పినాఁడు. ఇది వరుస. కః సమ్ప్రదాయః = ఏది యుపదేశక్రమము - అని అడిగెదను. కిం న సమ్భావ్యతే=ఏల సంభవింపరాదు? పుణ్యపరిపాకోపాదానః = పుణ్యముల పంట కారణముగాఁగలది - పుణ్యముల

లవః—భ్రాతరౌ వావాం యమలౌ.

రామః—తర్హి ద్వితీయః కః?

(నేపథ్యే)

భో భాణ్డాయన భాణ్డాయన.

శ్లో॥ ఆయుష్మతః కిల లవస్య నరేన్ద్రసైన్యై
రాయోధనం! నను కిమాత్థ? సఖే తథేతి?
అద్యాస్తమేతు భువనే ష్వధిరాజశబ్దః;
క్షత్రస్య శస్త్రశిఖిన శ్శమ మద్య యాన్తు. ౯

---

ఫలముగాఁ కలిగినది - ఐన - కో౽పి మహిమా=ఏదేని మహిమ. భాణ్డాయన - వాల్మీకి శిష్యులలో సౌధాతకికన్నను ఇంచుక పెద్దవాఁడు, వానికి విషయముల నెఱింగించుచు సందేహములం దీర్చుచు వాలకయంకముముందున్న విష్కంభకమున అగపడినవాఁడు - లవునికడకు మునసలుల యొకటికి నచ్చిన వటువులలో నున్నవాఁడు, కుశునికిని స్నేహితుఁడు. అతఁ డిప్పుడే భరతాశ్రమమునుండి మరలఁగా అతనితో లవునికి ఎవరితోడనో క్షత్త్రియ వీర సేనతో పెద్దయుద్ధము వచ్చినదని చెప్పినాఁడు. అంతట అతఁడు తమ్మునికి బాసటగా ఇటు వచ్చుచున్నాఁడు - భాండాయనునితోడి కుశ భాషితము - చూలికగా - శ్లోకమునచే నిపుణముగా చెప్పినాఁడు మహాకవి. మంచి సమయమున 'నీకు అన్న ఉన్నాఁడా' అని రాముఁ డడుగునప్పటికి ఆయనకు సంతసము కలుగునట్లుగా, కుశునిగొంతే వినంబడునట్లు కూర్చినాఁడు - ఒక తెలుంగు పాత్రప్రవేశసూచనయు ఇది.

శ్లో. ౯. ఆయుష్మత ఇతి—ఆయుష్మతః లవస్య=అబ్బాయికి తమ్మునికి లవునికి, నరేన్ద్రసైన్యైః=రాజు సేనలతో, ఆయోధనం కిల=యుద్ధమఁటగా; నను=ఓయి, కిం ఆత్థ?=ఏ మంటివి? సఖే తథా ఇతి?=సఖుఁడ, ఔను అనియా? అద్య=ఇపుడు, భువనేషు=లోకములలో, అధిరాజశబ్దః=సార్వభౌముఁడన్నమాట, అస్తం ఏతు=అస్తమించునుగాక - అడఁగునుగాక. క్షత్రస్య=క్షత్త్రియులయొక్క (ఆజాతియొక్క అనుట). శస్త్రశిఖినః=శస్త్రాగ్నులు, అద్య=ఇపుడు, శమం యాన్తు=ఆఱిపోవునుగాక.

రామః— శ్లో। అథ కోఽయ మిన్ద్రమణి మేచకచ్ఛవి
ర్ధ్వనినైవ బద్ధపులకం కరోతి మాం,
నవ నీల నీరధర ధీరగర్జిత
క్షణ బద్ధకుడ్మల కదమ్బ డమ్బరమ్. ౧౦

---

ఓయి, అబ్బాయికి లవునికి రాజసేనలతో యుద్ధమంటగా - నిజమే అను చున్నావా? సరి, అట్లగునేని ఇపుడు లోకములో సార్వభౌముఁడు అన్నమాట అడఁగిపోవుఁగాక, క్షత్త్రియుల యాయుర్భాగ్యములు అతిపోవునుగాక.

'ఆయుష్మతః' - అన్న తమ్ముని, నాయన కొమారుని, సామాన్యముగా పెద్ద తా నాశీర్వదింపఁదగిన వయసులోనున్న చిన్నవానిని సంబోధించు నిర్దేశించు తెలుఁగు. 'నరేన్ద్ర' - రాజు అనఁగా ప్రసిద్ధిచే ఆరామాయణదినములలో రాముఁడే. అధిరాజ - సార్వభౌమ - 'సప్తలోకైకవీరం' అని అశ్వరక్షకులు అన్నారుగదా. దానిని వటువులు విని చెప్పిన తంటాలో, చెప్పినారు, కుశునితో. 'అధిరాజ' 'క్షాత్ర శస్త్రశిఖి' - అనుట తానును క్షత్త్రియుఁడైనను, పరాక్రమము స్వభావముగానే చిత్తమున రాజుమన్నను, ఋష్యాశ్రమమున తపోవనమున వాల్మీకి యవేక్షణమున ఎదుగుచున్నందున తనకు (క్షత్త్ర) 'అధిరాజు'ల మీఁద ఒకపాటి లక్ష్యములేమి.

శ్లో. ౧౦, అథకోఽయమితి—అథ కః అయం=మఱి యితఁ డెవరు? ఇన్ద్రమణి మేచకచ్ఛవిః = హరినీలములవంటి నల్లకాంతిగలవాఁడు, ధ్వనినైవ = శబ్ద మాత్రము చేతనే - గొంతువినఁబడినమాత్రకే, మాం=నన్ను, దత్తపులకం=పులకలు లేచినవానింగా, (కావుననే) నవ నీల నీరధర ధీర...డమ్బరమ్=క్రొత్త నల్లని మేఘముయొక్క గంభీరమైన యుఱుముచేత ఒక్కనిమిషములోనే మొగ్గలు తొడిగిన కడిమిపోడిమి కలవానింగా, కరోతి=చేయుచున్నాఁడు!

మఱి యెవఁ డితఁడు, అదిగో అగపడుచున్నాఁడే! ఇంద్రనీల నీలకాంతి దేహముగలవాఁడు. వానిగొంతుశబ్దము విన్నమాత్రకే క్రొత్తమేఘంపు మంద్ర గర్జకు ఒక్క నిమిషములోనే చెట్టునిండ నవిచిన కడిమిపోడిమి గలయట్లు, నా దేహమును ఒక్కుమ్మడి పులకితము చేయుచున్నాఁడు!

'ఇన్ద్రమణి' - కట్టి సాధారణమైన నలుపు గాదు - ఇంద్ర నీలంపు నలుపు - మహాపురుషలక్షణము.

లవః—అయ మసౌ మమ జ్యాయా నార్యః, కుశో నామ : భరతాశ్రమా త్ప్రతినివృత్తః.

రామః—వత్స, ఇత ఆహ్వా యైన మాయుష్మన్తమ్.

లవః—ఏవమ్. (ఇతి పరిక్రామతి)

(తతః ప్రవిశతి కుశః.)

కుశః—(సాద్భుతహర్ష ధైర్యం ధను రాస్ఫాలయన్)

శ్లో॥ దత్తేన్ద్రాభయదక్షిణై ర్భగవతో వైవస్వతా దామనో
ర్దృప్తానాం దహనాయ దీపితనిజక్షాత్ర ప్రతాపాగ్నిభిః.
ఆదిత్యై ర్యది విగ్రహో నృపతిభి, ర్ధన్యం మ మైత త్తతో
దీప్రాస్త్ర స్ఫురదుగ్ర దీధితి శిఖానీరాజితజ్యం ధనుః. ౧౧

(వికటం పరిక్రామతి)

---

'మను జ్యాయాన్ = నాకన్న పెద్దవాఁడు, ఆర్యః=అన్నయ్య. సాద్భుతహర్ష ధైర్యం=అద్భుతము హర్షము ధైర్యమును తోఁచుచుండ, ధనుః ఆస్ఫాలయన్ = వింటిని చఱచుచు - అద్భుతము - ఆకస్మిక సంఘటనకు, హర్షము-అంతగొప్పవారితో యుద్ధావకాశము కలిగినందులకు, ధైర్యము - స్వభావసిద్ధమైన దిట్టతనము - సమయమున వెలిగ్రాయుచున్నది.

శ్లో. ౧౧. దత్తేతి.—వైవస్వతాత్ = సూర్యునికొమారుఁడైన భగవతః = భగవానుఁడైన, మనోః ఆ=లోకమునకు మొట్టమొదటిరాజైన మనువు, తమ కూటస్థుఁడు మొదలుకొని, దత్తేన్ద్రాభయ దక్షిణైః=ఈఁబడిన ఇంద్రుని దిగులు తీర్పు అనెడి దక్షిణకలవారును, దృప్తానాం=గర్వితులయొక్క - గర్వితులను, దహనాయ= కాల్చుటకు - నాశనము చేయుటకు, దీపిత నిజక్షాత్రప్రతాపాగ్నిభిః=జ్వలింపించిన తమ క్షాత్ర ప్రతాపమనెడి అగ్నిగలవారును, ఐన, ఆదిత్యైః=సూర్యవంశము వారైన, నృపతిభిః=రాజులతో, విగ్రహః యది=యుద్ధమేని, తతః=దానివలన, మమ ఏతత్ = నాయీ, దీప్రాస్త్రస్ఫురదుగ్ర దీధితిశిఖానీరాజితజ్యం = ప్రకాశించుచున్న అస్త్రములపై కెగయు భయంకరకాంతుల జ్వాలలచే హారతియొత్తఁబడిన యల్లెగల, ధనుః=విల్లు, ధన్యమ్=కృతార్థమును.

రామః—కోఽప్యస్మిన్ క్షత్రియపోతే పౌరుషాతిరేకః!

శ్లో॥ దృష్టి స్తృణీకృత జగత్త్రయ సత్త్వసారా
ధీరోద్ధతా నమయ తీవ గతి ర్ధరిత్రీమ్;
కౌమారకేఽపి గిరివ ద్గురుతాం దధానో
వీరో రసః కి మయ మే, త్యుత దర్ప ఏవ! ౧౨

---

సూర్యవంశపురాణాలలో యుద్ధమేని ఇఁక నేమి నావింటికి? వారు వైవస్వత మనువుమొదలుకొని తాము ఇంద్రునికే అభయదక్షిణలిచ్చినవారు, లోకాన దుష్ట వినాశనమునకు అనఁగా పొగరుకొన్న దుర్మార్గులనడంపనే తమపరాక్రమాగ్నిని రగిల్చినవారు. ఇట్టివారితో ఇన్నాళ్ళకు పోరు పొసఁగినందున ఇదె నా ధనుస్సు మెఱయు అస్త్రముల రొంగయు బలుకాంతిజ్వాలల యారతి పొంది - అట్టి యస్త్రముల నట్టిమంటలలో పఱపి - ధన్యమగును గాక,

మంచివింటికి సమయాన మంచియస్త్రమును పేర్గన్నశత్రువుమీఁదికి ప్రయోగింపఁగనుటయే కదా ధన్యత!

దత్తేన్ద్రాభయదక్షిణైః - ఇంద్రునికిని అభయమిచ్చుట యనఁగా ముల్లోకము లకు హితము గూర్చుట. శిశువైనను తాను వారిని మించు ననుట. ఇందు బాలునికి మిక్కిలియు మించిన జ్ఞానము నిమిజనకునికి తగినది పలుకఁబడుచున్నది!

వికటం=ఉద్ధతముగా, కోఽపి=ఇట్టిదని చెప్పనలవిగాని. పౌరుషాతిరేకః - శౌర్యముయొక్క ఉత్కర్ష. అతనిం గాంచి రాముఁడు ఆ పౌరుషాతిశయమునకు ఆశ్చర్యపడుచున్నాఁడు?

శ్లో. ౧౨. దృష్టిరితి—దృష్టిః=చూపు, తృణీకృత...సారా=గడ్డిపరకగాఁ గొన్న ముల్లోకముల బలముయొక్క సారము గలది, గతిః=గమనము, ధీరోద్ధతా= ధీరము (ధైర్యముగలది, కలఁత చెందనిది, ఠీవిగలది) ఉద్ధతమును (వికటమైనది) ఐ, ధరిత్రీం=భూమిని, నమయతి ఇవ=క్రుంగఁజేయుచున్నట్లున్నది. కౌమారకే అపి= బాల్యమందును, గిరివత్=కొండవలె, గురుతాం=గౌరవమును, గొప్పతనమును. దధానః=తాల్చినవాఁడై, వీరః రసఃకిం=వీరరసమా ఏమి? ఉత=కాకున్న, దర్ప ఏవ కిం=దర్పమేనా ఏమి! అయం=ఇదిగో వీఁడు ఇటు, ఏతి=వచ్చుచున్నాఁడే!

లవః—(ఉపసృత్య), జయ త్యార్యః.

కుశః—నను అయుష్మన్ కి మియం వార్తా, యుద్ధ మితి?

లవః—యత్కిఞ్చి దేతత్. ఆర్యస్తు దృప్తం భావ ముత్సృజ్య వినయేన వర్తతామ్.

కుశః—కిమర్థం?.

లవః—ఏష దేవో రఘుపతి స్తిష్ఠతి. స చ స్నిహ్యత్యావయోః, ఉత్కణ్ఠతే చ యుష్మత్సన్నికర్షస్య.

కుశః—(సవితర్కమ్) స రామాయణ కథానాయకో బ్రహ్మ కోశస్య గోపాయితా!

లవః—అథకిమ్.

కుశః—ఆశంసనీయ పుణ్యాదర్శన స్స మహాత్మా! కిన్తు స కథ మస్మాభి రుపగన్తవ్యః ఇతి న సంప్రధారయామి.

లవః—యథా గురు స్తథోపచారేణ.

కుశః—కథం నామైతత్?

---

చూపు ముల్లోకముల బలసారము నెల్లనుంగూడ లక్ష్యము సేయక గడ్డిపరకగా చూచును. నడక గొప్పవీరునికి తగిన ఠీవికలిగి భూమిని కుంచునట్లున్నది. బాలుఁడై యైనను కొండవలె గొప్పతనము దాల్చియున్నాఁడు-(రూపుగొన్న) వీరభావమా లేక దర్పమా ఏమి! వీఁడు ఇటు వచ్చుచున్నాఁడు!

అతిప్రౌఢోక్తి. భవభూత్యేక సదృశము!

ఉపసృత్య = సమీపించి, అన్నకు మంచిమాట చెప్పవలయునని రెండు అడుగులు చేరఁబోయి, జయతి ఆర్యః = జయము అన్నకు-ఇది అన్నను ఎచ్చరించు కొను సముదాచారము. యత్కిఞ్చిత్ ఏతత్ = అ దేదియో ఏపాటిదే. దృప్త భావం = ఔద్ధత్యమును, ఉత్కణ్ఠతే చ = ఉవ్విళులూరుచున్నాఁడు, యుష్మత్సన్ని కర్షస్య = నీసామీప్యమునకు, నిన్నుఁ జెంత చూడవలయునని. బ్రహ్మకోశస్య గోపాయితా = బ్రహ్మాండమునకు రక్షకుఁడు ఆశంసనీయ...నః = కోరఁదగిన పుణ్య దర్శనముకలవాఁడు - ఆతని పుణ్యదర్శనము కోరఁదగినది. కింతు = అయినను. కథం అస్మాభిః ఉపగన్తవ్యః = మనము ఎట్లు ఆయనను చేరబోవలయునో, యథా గురుః తథా ఉపచారేణ = గురువును ఎట్లో అట్లు ఆయుపచారముతో - మర్యాదతో - గౌరవముతో, కథం హి నామ ఏతత్ = అహో అది యెట్లు? అత్యుదారః

లవః—అత్యుదాత్త స్సుజన శ్చన్ద్రకేతు రౌర్మిళేయః ప్రియ వయస్య ఇతి సఖ్యేన మా ముపతిష్ఠతే, తేన తత్ సమ్బన్ధేన ధర్మ తాత ఏ వాయం రాజర్షి రితి.

కుశః—సమ్ప్రత్యవచనీయో రాజన్యేఽపి ప్రశ్రయః.

లవః—పశ్య త్వేనమ్ ఆకారానుభావగాంభీర్యసమ్భావ్య మాన వివిధ లోకోత్తరసుచరితాతిశయమ్.

కుశః—(నిర్వర్ణ్య)

శ్లో॥ అహో! ప్రాసాదికం రూప! మనుభావశ్చ పావనః;!
స్థానే రామాయణకవి ర్దేవీం వాచ మవీవృతత్. ౧౩

---

సుజనః చన్ద్రకేతుః ఔర్మిళేయః ప్రియవయస్య ఇతి సఖ్యేన మాం ఉపతిష్ఠతే = మిక్కిలి ఔదార్యముగలవాఁడు - చాల మంచివాఁడు ఊర్మిళమ్మకొడుకు చంద్రకేతుఁడు ప్రియవయస్యుఁడనని నన్ను సఖ్యముచేత చేరుచున్నాఁడు. ధర్మతాతః = ధర్మముబడి నాయన - (ధర్మము - ఆచారము, న్యాయము.) సమ్ప్రతి=అప్పటికి అటులైన. రాజన్యే అపి=రాజన్యుని యెడలనైనను. వాల్మీకియాశ్రమమునకు వచ్చు రాజన్యులందఱు మహర్షికి ఆయనకు మ్రొక్కుటకువారే. అట్టివారు వచ్చుటయు అరుదే. ఋషులనడుమ పెరుగుచున్న యీబాలురకు, తాము క్షత్త్రియులైనను, రాజులకు మ్రొక్క వాడుక లేదు. కావున ఇట్లు విచారణయు, నిర్ణయమును. ప్రశ్రయః=అడఁకువ. ఆకారానుభావ గాంభీర్య...శయమ్=ఆకారము, ప్రభావము, గాంభీర్యము - అనువానిచేత నిజములే యగును (అ) వివిధములైన లోకాతీతములగు సుచరితాతిశయములు, తాటకామారీచాదివధ జటాయుమోక్షదాన సేతుబంధ రావణవధాదులు అని యెంచదగినవానిని.

ఇదెల్ల లవునికి రామునియందు గల యత్యంతగౌరవము ప్రకటించి కుశునికిని అట్టి గౌరవమే రామునియందు కలిగించును. అట్లే కుశుఁడు పలుకుచున్నాఁడు - అహో ఇత్యాది.

శ్లో. ౧౩. అహో ఇతి - అహో = ఆశ్చర్యము కలుగుచున్నది! రూపం = ఆకారము - అందము, ప్రాసాదికమ్ = ప్రసాదాత్మకముగా - ప్రసన్నతతో నిండి - ఉన్నది. అనుభావః చ=(కంటికి తోఁచు) ప్రభావమును, పావనః = పవిత్రముగా నున్నది. స్థానే = పాత్రమందె, రామాయణకవిః = రామాయణమును రచించిన

(ఉపసృత్య) తాత, ప్రాచేతసాన్తేవాసీ కుశోఽభివాదయతే.

రామః—ఏహ్యేహి, ఆయుష్మన్.

శ్లో॥ అమృతాధ్మాత జీమూత స్నిగ్ధసంహననస్య తే,
పరిష్వఙ్గాయ వాత్సల్యా దయ ముత్కణ్ఠతే జనః ౧౮

---

యాదికవి, (తమ యాచార్యుడు వాల్మీకి,) వాచం దేవీం = భారతీదేవిని, వ్యవి వృతత్=వివరించినాఁడు, ప్రకటించినాఁడు.

ఆరరే! రూపము ప్రసాదాత్మకముగా నున్నది (అనుగ్రహము ఉట్టిపడు చున్నది,) ప్రభావము మన పాపముల నెల్ల పోనడఁచి పవిత్రులం జేయునట్లు లున్నది. బళీ - రామాయణకవి పాత్రమందు తన సరస్వతిని ప్రకటించినాఁడు.

ఇట్లు (1) దృప్తభావము వీడిఅనుటయు (2) రఘుపతియనుటయు(3)రామాయణ కథానాయకుఁడనుటయు, (4) బ్రహ్మాండ గోప్త యనుటయు (5) పుణ్యదర్శనము అనుటయు (6) గురువుంబోలె అనుటయు (7) వివిధలోకాతీత సుచరితాతిశయములు అనుటయు (8) ప్రాసాదికం రూపం అనుటయు (9) పావనానుభావమనుటయు - అన్నియు కుశలవులకు రామునియందు ఉన్న గౌరవమును సూచించును.

మనము వర్ణించిన రామాయణము నిజముగా చాల గొప్పాయనను గురించినదే.

శ్లో. ౧౮. అమృతేతి— అమృతాధ్మాత...నస్య = అమృతము (నీరు కాదు) నిండిన మేఘమువలె నిగనిగలాడు శ్యామలదేహముగల, తే=నీయొక్క, పరిష్వఙ్గాయ=కౌఁగిలికై - నిన్ను కౌఁగిలించుకొనుటకై, అయం జనః=ఈజనుఁడు, నేను అనుట, వాత్సల్యాత్=అత్యంత ప్రీతివలన, ఉత్కణ్ఠతే=ఆసగొనుచున్నాఁడు.

నీదేహము నీటికి బదులు అమృతము నిండిన మేఘమువలె నిద్దమును శ్యామలమును. దానిని బిగ్గ కౌఁగిలింప, నాకు వాత్సల్యమువలన, ఆపరానికోరిక కలుగుచున్నది. (ఇటురా, రమ్ము.)

రామునికి తనంతన మనసులో పట్టరాని వాత్సల్యము ఉబుకుచున్నది. అందులకు ఆలింగనమునకన్న తా నీఁగల ప్రియవస్తువు మఱేమున్నది! దీనికంతయు కారణము మును పే చెప్పినాఁడు - 'ఏదో గూఢహేతువు ప్రాణులంగూర్చును' అని.

(పరిష్వజ్య స్వగతమ్) త త్కిమపత్య మయం దారకః?

శ్లో॥ అఙ్గా దఙ్గా త్స్రుత ఇవ నిజో దేహజః స్నేహసారః!
ప్రాదుర్భూయ స్థిత ఇవ బహి శ్చేతనాధాతు రేవ!
సాన్ద్రానన్దః క్షుభితహృదయప్రస్నవే నేవ సృష్టో!
గాత్రం శ్లేషే య దమృతరసస్రోతసా సిఞ్చతీవ. ౧౫

---

కిమపత్యం _ ఎవరి కుమారుఁడు?

శ్లో. ౧౫. అఙ్గాత్ _ ఇతి. అఙ్గాత్ అఙ్గాత్=ఒక్కొక్కయంగముగా అన్నియంగముల (=అవయవముల) నుండియు, స్రుతః=కాఱిన, దేహజః = దేహమునం బుట్టిన, నిజః=నాదే ఐన, స్నేహసారః ఇవ=ప్రేమ సారమో! ప్రాదుర్భూయ = ఆకారముదాల్చి, బహిః=బయట, స్థిత ఇవ=నిలంబడినదో యననున్న, చేతనాధాతుః ఏవ=(నా)ప్రాణధాతువే యగునో, క్షుభిత...న = కలగుండువడిన హృదయము కరఁగి పాఱఁగా _ ఆద్రవముచేత, సృష్టః=ఇట్లు దేహముతో సృజింపఁబడిన, సాన్ద్ర ఆనన్ద ఇవ=మిక్కుటంపు ఆనందమో! కాదా _ సాన్ద్రానన్దక్షుభిత...న=మిక్కుటమైన యానందముచేత కలగుండువడిన హృదయము కరంగిన ద్రవముతో, సృష్ట ఇవ=సృజింపఁబడినాఁడో! కరుడుగట్టినాఁడో! యత్ _ (ఇట్లెల్ల)ఏల యనుచున్నాను అనఁగా, గాత్రం = నాదేహమును, శ్లేషే=(ఈ) యాలింగనమందు. అమృతరసస్రోతసా=అమృతద్రవ ప్రవాహముచేత, సిఞ్చతి ఇవ=తడుపుచుంబోలెనున్నాఁడు.

ఇతనిం గౌఁగిలించుకొనఁగా, నాదేహము ఆనందపు మడువున మునింగినట్లున్నదే! వీఁడేమి నా సర్వాంగములనుండి కాఱిన నాదేహపుస్నేహపుసారమా! ఇట్లు కనులపండువుగా ఆకారము దాల్చి బయట నడయాడుచున్న నాప్రాణమేనా వీఁడు! మిక్కుటమైన ఆనందముచే కరఁగి పాఱిన నాహృదయమే ఇట్లు రూపొందింపఁబడి ఐనవాఁడా వీఁడు!

సాన్ద్రానన్దః _ అని వ్యస్తముగా విధేయముగా సవిసర్గము పాఠముగాఁ గొనఁదగును. అన్నాఁడు గదా భవభూతి ఒండెడ 'బిడ్డ దంపతుల యన్యోన్యస్నేహము వలనవైన అంతఃకరణ పదార్థముయొక్క ఆనందపుముడి అని _ III _ 10.

అన్తఃకరణతత్త్వస్య దమ్పత్యోః స్నేహసంశ్రయాత్
ఆనన్దగ్రన్థి రేకోఽయ మపత్య మితి బధ్యతే,

లవః — తాత, లలాటన్తప స్తపతి ఘర్మాంశుః; త్త దత్ర సాల చ్ఛాయే ముహూర్తం ఆసన పరిగ్రహం కరోతు తాతః.

రామః — యదభిరుచితం వత్సాయ.

(సర్వే పరిక్రమ్య యథోచిత ముపవిశన్తి)

రామః — (స్వగతం)

శ్లో॥ అహో! ప్రశ్రయయోగేఽపి గతి స్థి త్యాసనాదయః,
సామ్రాజ్యశంసినో భావాః కుశస్య చ లవస్య చ. ౧౬

---

స్నేహసారమా, చేతనాధాతువా, హృదయానందమా అని ఉత్ప్రేక్షల ప్రక్రమము. మఱిశ్రుతి - 'అఙ్గా దఙ్గాత్ సమ్భవసి, హృదయా దధిజాయసే, ఆత్మా వై పుత్రనామాసి, సజీవ శరదః శతమ్' అని కలదు. అందలి 'అఙ్గాదఙ్గాత్.' 'హృదయాత్' 'ఆత్మా' అనునవి ఇటను 'అఙ్గాదఙ్గాత్.' 'హృదయప్రసన్నకేన' 'చేతనాధాతుః' అని ఇట్లు కూర్పఁబడినవి అని తలంపఁదగును. ఇందు 'హృదయాత్' అని కలదుగదా. 'పుత్త్రోహి హృదయమ్' అనియు శ్రుతి. కావున 'హృదయప్రసన్నక' మునే విధేయముగాఁ గొని 'సాన్ద్రానన్ద'మును సమాసమున అవయవముచేయను వచ్చును. ఇట 'స్నేహసార' మన - సర్వదేహాంగవ్యాపి తేజోధాతు వగును. - చెప్పెను వైద్యాచార్యుఁడు సుశ్రుతుఁడు - 'సర్వదేహాశ్రితం శుక్రం ప్రసన్నమనస స్తథా స్త్రీషువ్యాయచ్ఛత శ్చాపి ప్రహర్షాత్ సంప్రవర్తతే' అని.

లలాటన్తపః - నడిమింటికి వచ్చి ఫాలదేశమును కాల్చుచున్నాఁడు. మట్ట మధ్యాహ్నమైనది. ఇది యేఋతువు? వసంత మగునా? సాలచ్ఛాయే = మద్దినీడలో, మద్దికి నీడ ఎక్కువ. పరిక్రమ్య=కొన్నియడుగులు నడచి, బాలురు నిలుచుండుటను, నడచుటను, కూర్చుండుటను అదే వింతగా రాముఁడు పరికించుచు మనమున తల పోసికొనుచునే యున్నాఁడు.

శ్లో. ౧౬. అహో ఇతి - అహో = బళి, ఆశ్చర్యము! కుశస్యచ = కుశునికిని, లవస్యచ=లవునికిని, ప్రశ్రయయోగే అపి=అడఁకువ కలిగియుండుటతో కూడనే, గతి స్థితి ఆసనాదయః = నడచుట, నిలంబడుట, కూర్చుండుట మొదలగునవైన, భావాః = చేష్టలు, సామ్రాజ్యశంసినః = సార్వభౌమత్వమును చెప్పుచున్నవి - ప్రకటముగ సూచించుచున్నవి అనుట.

శ్లో॥ వపు రవిహితసిద్ధా ఏవ లక్ష్మీవిలాసాః
ప్రతికలకమనీయం కాన్తిమ త్కేతయన్తి,
అమలిన మివ రత్నం రశ్మయ స్తే మనోజ్ఞాః,
వికసిత మివ పద్మం బిన్దవో మాకరన్దాః. ౧౭

భూయిష్ఠాం చ రఘుకులకుమారచ్ఛాయా మనయోః పశ్యామి.

---

బళీ, (వాయెడ) అడఁకువ చూపు అవహేళనె నడక, నిలక, కూర్చుండుట మొదలగు అన్ని చేష్టలును కుశలవుల సార్వభౌమత్వమును - సమ్రాట్కులం బుట్టినవా రగుటను సమ్రాట్టులు కాఁదగినవారనుటను - చెప్పక చెప్పుచున్నవి.

ప్రశ్రయము సామ్రాజ్యమును సామ్రాజ్యము ప్రశ్రయమును మ్రింగుచున్నవి. అట్టివాఁడె సమ్రాట్టు కాఁదగును. ఎవఁడనఁగా వాఁడు కానేరఁడు.

శ్లో. ౧౭. వపురితి - అమలినం = మసక(మైల)లేని, రత్నం=రత్నమును, తే= ఆ (దానివైన,) మనోజ్ఞాః = మనోహరములైన, రశ్మయః ఇవ = కిరణములవలెను, వికసితం=విరిసిన, పద్మం = తామరను, మాకరన్దాః = (దాని) పూఁదేనె యొక్క, బిన్దవః ఇవ=చుక్కలవలెను, అవిహితసిద్ధాః ఏవ=తెచ్చుకోలు కాక స్వభావసిద్ధము లైనవే ఐ, (చేసికొననివే ఐ,) లక్ష్మీవిలాసాః = అందంపుచకురులు, ప్రతికలకమనీయమ్ = ప్రతిభాగమందును అందముగానున్నట్టియు, కాన్తిమత్ = లావణ్యము గలయట్టియు, వపుః =కోమలదేహమును, కేతయన్తి=ఎత్తిచూపుచున్నవి.

మసకలేని రత్నమును దాని మనోహరమైనకాంతి వికసన మెట్లో, నిండార వికసించిన తామరను దాని మకరందబిందువు లెట్లో, అట్లు ప్రత్యంగమనోహరమయి లావణ్యము మిసమిసలాడెడి వీరి దేహమును సహజసిద్ధములగు నందంపు విలాసములు ఎత్తి చూపుచున్నవి. వీరు నిజముగా సామ్రాజ్యార్హులే, సమ్రాట్టుబిడ్డలే.

భూయిష్ఠాం రఘుకులకుమారచ్ఛాయాం = మెండగు రఘుకుల కుమారుల శోభను - లేక పోలికను.

శ్లో॥ కఠోర పారావత కణ్ఠమేచకం,
వపు ర్వృషస్కన్ధసుబన్ధురాంసకమ్,
ప్రసన్న సింహస్తిమితఞ్చ వీక్షితం,
ధ్వనిశ్చ మాఙ్గల్య మృదఙ్గ మాంసలః. ౧౮

(నిపుణం నిరూపయన్) అయే న కేవల మస్మత్సంవాది న్యాకృతిః!

శ్లో. ౧౮. కఠోరేతి - వపుః = అందమైన యీమేను, కఠోర పారావతకణ్ఠ మేచకం = తారుణ్యము నిండుకొన్న పావురము మెడవలె నీలముగా నున్నది. వృషస్కన్ధ సుబన్ధురాంసకమ్=ఆఁబోతుమూపులవలె, సమోన్నతములగు బుజములు కలిగియున్నది. వీక్షితమ్ = చూపు, ప్రసన్నసింహస్తిమితమ్ = ఏచింతయు లేక సంతోషపు తేటదనము కలిగి అనుగ్రహముకురియునదిగను, (లోలముగాక) సింహమునకుం బోలె నిలుకడకలదిగను ఉన్నది. ధ్వనిః చ=స్వరమును, మాంగల్య మృదఙ్గమాంసలః = మంగళమునకై వాయించిన మృదంగముయొక్క మ్రోఁతవలె మంద్రముగా గంభీరముగా - (బొంగుగా,) ఉన్నది.

మేనికప్పు కపోతయువకంఠమువలె నున్నది; బుజములు ఆఁబోతుమూపురముల వలె వంపు ఎత్తు కలిగి యున్నవి. చూపు ప్రసాదము కురియుచు, సింహపుఁజూపు వలె నిలుకడ కలిగి యున్నది. కంఠస్వరము మంగళార్థమగు మృదంగ ధ్వనివలె మంద్రముగా నున్నది.

ఉపమల యౌచిత్యమును నెలకొల్పువారిలో అగ్రేసరుఁడుగదా భవభూతి!

ఇవన్నియుం గూడ సార్వభౌమునిబిడ్డల లక్షణములు - విశేషముగా రఘు వంశమునం బుట్టినవారి లక్షణములు. మేనికప్పు తన మేనికప్పును బోలినదే. ఎగు బుజములు మగసిరి (సౌభాగ్యము) - వాలు బుజములు స్త్రీ సౌభాగ్యము - 'బాహూ నతౌ వంసయోః -' మాళవికలో మాళవిక యంసములు బాహువులును. చూపు లౌల్యము తారళ్యము స్త్రీ సౌభాగ్యము - చూపులోనిలుకడ పుంసౌభాగ్యము. బొంగుగొంతు మగయందము, కోయిలస్వరము స్త్రీ సౌభాగ్యము. నీరునిండిన మేఘ గర్జంబోనిది కదా రామునిగొంతు. రఘుకులకుమారచ్ఛాయ - అనఁగా తన పోలికయే అనుట. ఇదెల్ల మహానుభావుల లక్షణము.

సూక్ష్మం నిరూప్య=నిపుణముగా పరికించి. అస్మత్ సంవాదినీ = నన్ను పోలి యుండునది.

శ్లో॥ అపి జనకసుతాయా స్తచ్చ తచ్చానురూపం
స్ఫుట మిహ శిశుయుగ్మే నైపుణోన్నేయ మస్తి,
నను పున రివ తన్మే గోచరీభూత మక్ష్ణో
రభినవ శతపత్ర శ్రీ మ దాస్యం ప్రియాయాః. ౧౯

శ్లో॥ ముక్తాచ్ఛ దన్తచ్ఛవి సున్దరీయం
సై వౌష్ఠముద్రా, స చ కర్ణపాశః,
నేత్రే పున ర్యద్యపి రక్తనీలే
తథాపి సౌభాగ్య గుణ స్స ఏవ. ౨౦

శ్లో. ౧౯. అపీతి—జనకసుతాయాః అపి=జానకికిని, అనురూపమ్=పోలిక చె సరిపోవునది, తత్ చ తత్ చ = అదియు, అల్లదియు - అనఁగా ఏమేమియో, స్ఫుటం=స్పష్టముగా, ఇహ శిశుయుగ్మే=ఈశిశువుల జతయందు, నైపుణోన్నేయం=నేర్పుతో కనిపట్టఁదగినది, ఊహింపఁదగినది. అస్తి=ఉన్నది. నను = ఇంత యెందుకు? పునః=మరల, తత్=అల్ల యా, ప్రియాయాః=ప్రేయసియొక్క, అభినవ శతపత్ర శ్రీమత్ = క్రొత్త - అప్పుడే విరిసిన - నూఱు రేకుల తామర సౌభాగ్యము గలిగిన, ఆస్యం=మొగము, మే అక్ష్ణోః=నాకనులకు, గోచరీభూతం ఇవ=అగపడినట్టు లున్నది.

ఈ యమడపిల్లలయందు - అది, అయది, అల్లది అని స్పష్టముగా కనిపట్టఁ దగినది· సీతపోలికయు ఎంతేని యున్నది. వేయేల! వీరిమొగమున నిండార విరిసిన తమ్మి సొబగుగల నాప్రేయసి మొగమే నాకనులకు మరల అగపడుచున్నట్టులున్నది.

క్రమక్రమముగా గుర్తుపట్టుచున్నాఁడు.

శ్లో. ౨౦. ముక్తేతి - ముక్తా అచ్ఛ దన్త చ్ఛవి సున్దరీ=ముత్తెములవలె తెల్ల పండ్లకాంతిచే సొబగారుచున్నట్టిది, ఇయం ఓష్ఠముద్రా=ఈ పెదవులు మూసికొని యున్నప్పటి తీఱు. సా ఏవ=అదియే - సీతదే అనుట. కర్ణపాశః = చెవిసొబగును, స చ=అదియే; పునః=మఱేమనఁగా, నేత్రే=కన్నులు, రక్తనీలే యది అపి=ఎఱ్ఱ చారలుగలిగి నల్లగానున్నను, తథాపి=అప్పటికిని, సౌభాగ్యగుణః = సౌందర్యాతిశయము. స ఏవ - అదియే - (సీతదే అనుట.)

ముత్తెములవలె తెల్లని దంతకాంతితో అందముగానుండునదైన ఆ పెదవుల ముద్ర, ఆ త్రాడు చుట్టి పట్టుకొన్నట్టులున్న యందమైన చెవియు, సీతదే. ఇఁకను కన్నులు ఎఱ్ఱగాను నల్లగాను గూడ నున్నవే, అదెట్లు, అన్న, ఉన్న నేమి, వాని యందంపుఁబెంపును సీతదే.

(విచిన్త్య) త దేత త్ప్రాచేతసాధ్యుషిత మరణ్యం; యత్ర కిల దేవీ పరిత్యక్తా. ఇయం చానయో రాకృతి ర్వత్సయోః. యదపి స్వతః ప్రకాశా న్యస్త్రాణీతి, తత్ర విమృశామి; అపి ఖలు త చ్చిత్ర దర్శన ప్రస్తావే అస్త్రాభ్యనుజ్ఞానం ఉద్ఘాతం స్యాత్? న హ్యాసామ్ప్రదాయికా న్యస్త్రాణి పూర్వేషా మప్యనుశుశ్రుమః. అయఞ్చ. సంప్లవమాన మాత్మానం సుఖాతిశయో హృదయస్య విస్రమ్భయతి. భూయిష్ఠఞ్చ మయా, ద్విధా ప్రతిపన్నో దేవ్యాః గర్భభార ఆసీత్. (సబాష్పం.)

శ్లో॥ పురా రూఢే స్నేహే పరిచయవికాసా దుపచితే,
రహో విస్రబ్ధాయా అపి సహజ లజ్జాజడదృశః,
మయై వాదౌ జ్ఞాతః కరతల పరామర్శకలయా
ద్విధా గర్భగ్రన్థి, స్తదను దివసైః కైరపి తయా. ౨౧

తత్ ఏతత్ _ ఇదే అది. తత్ర విమృశామి = ఆవిషయమున విమర్శింౘెదను. అపి ఖలు ఉద్ఘాతం స్యాత్?=నెఱవేఱినదా? న...అనుశుశ్రుమః = విన మైతిమి. సమ్ప్లవమానం = తేలిపోవుచున్న _ భూయిష్ఠంచ...పలుమాఱు, ద్విధా=రెండుగా నుండుట, ప్రతిపన్నః ఆసీత్ = కనిపట్టఁబడినది _ ఎఱుంగఁబడినది అయెను _ కనియుంటిని, గ్రహించియుంటిని. దుఃఖభారము ఉన్నను. ఆకస్మిక చిత్తవికాసము, మనసున సుఖముతోఁచుట, గొప్పశుభశకునము. దీనిని వాల్మీకియు కాళిదాసును పలుమాఱు చెప్పుదురు.

శ్లో. ౨౧. పురేతి__పురా = మునుపు. స్నేహే = స్నేహము, పరిచయవికాసాత్ = పరిచయము _ ఒండొరులు కూడిమాడియుండుట _ పెంపొందుటవలన, రూఢే=నెలకొని, ఉపచితే=మిక్కిలియు వృద్ధిపొందఁగా, రహః=ఒంటిపాటున, ఏకాంతమున, విస్రబ్ధాయాః అపి=(నాయందు) నమ్మకముకలదైనను, సహజలజ్జాజడదృశః=తోఁబుట్టువగుసిగ్గుచే కదలక ప్రమానుపాటు చెందిన చూపులుగల (ప్రేయసియొక్క,) గర్భగ్రన్థిః = కడుపుముడి, కరతల పరామర్శకలయా = అఱచేతితో నిమురు నేర్పుచేత, ద్విధా = రెండుగానుండుట, మయా ఏవ=నాచేతనే, ఆదౌ=

(రుదిత్వా) తత్కిమేతౌ పృచ్ఛామి కేనాప్యుపాయేన?

లవః—తాత, కి మేతత్ ?

శ్లో॥ బాష్పవర్షేణ నీతం వో జగన్మఙ్గళ మాననం,
అవశ్యాయావసిక్తస్య పుణ్డరీకస్య చారుతామ్. ౨౨

కుశః—అయి వత్స.

శ్లో। వినా సీతాదేవ్యా కిమివ హి న దుఃఖం రఘుపతేః ?
ప్రియానాశే కృత్స్నం జగ దిద మరణ్యం హి భవతి,

---

తోలుత, జ్ఞాతః = ఎఱుంగఁబడినది. తదను=తరువాత, కైః అపి దివసైః = కొన్ని దినాలకు, తయా=ఆమెచేతను, (జ్ఞాతః=ఎఱుంగఁబడినది.)

మును పు పరిచయము పెరుఁగుకొలఁది ప్రేముడి వేయలంపాఱి దళమూకొనఁగా (ఆమెవలని నిరోధము లేకుండ) నేనే చేతితో ఏకాంతమున ప్రేయసి కడుపును నేర్పుగా నిమురుచుంటిని. అది ఏకాంతమైనను, ఆమె నన్ను పూర్తిగా నమ్మి జంకు పడనిదైనను, అంతసేపును స్వభావసిద్ధమైన తన సిగ్గుచే, ప్రమాన్పడ్డ చూపులం దాచుచుండినది. అప్పుడు కడుపుముడి రెండుగా నుండుట తొలుత నేనే కనుగొంటిని. తరువాత కొన్ని నాళ్ళకు ఆమె కనుగొన్నది.

ఇదెల్ల స్మరణకు రాఁగా రామునికి ఏడుపు నెట్టుకొని వచ్చినది. పిల్లకాయలు చూచుచున్నను ఆపుకొనలేక ఏడ్చినాఁడు. దానిని లవకుశులు చూచినారు. లవుఁడు రాముని అడుగుచున్నాఁడు, కుశుఁడు దానికి సమాధానము చెప్పుచున్నాఁడు.

శ్లో. ౨౨. బాష్పేతి - జగన్మఙ్గలమ్ = జగములకెల్ల మంగళము గూర్చునదగు, వః ఆననమ్=మీ మొగము, బాష్పవర్షేణ=కన్నీటి జడిచేత, అవశ్యాయావసిక్తస్య = మంచుచే తడుపఁబడిన, పుణ్డరీకస్య= తెల్లతామరయొక్క, చారుతామ్=అందమును, నీతం=పొందింపఁబడినది.

జగాలకంతయు మంగళము గూర్చు మీమోము కన్నీటిని ఇట్లు వానగా కురిసెనే - దాన మంచులో తోఁగిన పుండరీకముకరణి అయెనే - ఇదేమి సాయనా!

నీమోము ఎల్లజగములకు మంగళాస్పదమే. మఱి అందు ఈకన్నీళ్ళ జడి ఏమి?

శ్లో. ౨౩. వినేతి - సీతాదేవ్యా వినా=సీతాదేవిలేమిని, రఘుపతేః=రాఘవదేవునికి, కి మివ = ఏది, న దుఃఖం హి = దుఃఖము కాదో. ప్రియానాశే = ప్రేయసి నష్టమున. ఇదం కృత్స్నం జగత్ = ఈ సకలలోకమును, అరణ్యం

స చ స్నేహ స్తావాః నయ మపి వియోగో నిరవధిః.
కిమి త్యేవం పృచ్ఛ స్యనధిగత రామాయణ ఇవ? —3

రామః—(స్వగతమ్) అయే తటస్థిత ఆలాపః. కృతం ప్రశ్నేన. దగ్ధహృదయ! కోఽయమాకస్మిక స్తే పారిప్లవో వికారః? ఏవం నిర్భిన్నహృదయావేగ శ్శిశుజనేనా ప్యనుకమ్పితోఽస్మి, భవతు. తావ దన్తరయామి. (ప్రకాశం) వత్సౌ, రామాయణ మితి శ్రూయతే; వాల్మీకే స్సరస్వతీనిష్యన్దః. ప్రశస్తి రాదిత్యవంశస్య. తత్ర కిఞ్చిత్ కుతూహలేన శ్రోతు మిచ్ఛామి.

---

భవతి హి=అడవి యానుగదా. స చ స్నేహః=ఆనెయ్యము, తావాన్=అంతటిది. అయం వియోగః అపి=ఈ యెడబాటును, నిరవధిః=కడలేనిది. కిమితి=ఏమని - ఎందులకు. అనధిగత రామాయణ ఇవ=రామాయణము ఎఱుఁగనివానివలె, ఏవం= ఇట్లు, పృచ్ఛసి=అడిగెదవు!

సీతాదేవి లేనందున రఘుస్వామికి ఏది దుఃఖము గాదు? ప్రేయసి నాశమైనందున, ఈ సకలలోకమును ఆయనకు అడవిగదా యగును. ఆ నెయ్యమో అంతటిది. ఈ విరహమో కడలేనిది. నీవు రామాయణమును ఎఱింగినవాఁడవుకదా, ఎఱుఁగని వానివలె ఇట్లడిగెద వేమి?

తటస్థితః ఆలాపః - మాటలు తటస్థములుగా - ఉదాసీనములుగా - సీత ఎవరో అన్నట్లుగా ఉన్నవి. అడుగుదునా వీరిని అని తాను తలఁచుకొన్నందులకు, తాను అడుగకయే తనకు వారిమాటవలన తెలిసినది - వారు సీతవారు కారు అని. సీత వారైన, 'సీతాదేవ్యా' అని పరాయివారివలె సీతంగూర్చి పలుకరు. దగ్ధహృదయ= పాడుమనసా, కః అయం ఆకస్మికః తే పారిప్లవః వికారః?=ఆకస్మికముగా చాపలమెత్తి పరువులు వాఱు ఈనీ వికారము ఏటిది? నిర్భిన్న హృదయావేగః=వెలికి ప్రిదిలిన మనోదుఃఖము గలవాఁడను-నా మనసులోని దుఃఖము వీరికి తెలిసిపోయినదే- తెలిసిపోవునట్లు చేసికొంటిని. అన్తరయామి=దాగురించెదను - కప్పుకొందును. సరస్వతీనిష్యన్దః = వాక్కుల వెలయుట - వెడలుట, వెలికి ప్రవహించుట - అనఁగా కావ్యము. కుతూహలేన శ్రోతుం ఇచ్ఛామి=వినం గుతూహలపడుచున్నాను.

కుశః—కృత్స్న ఏవ సన్దర్భోఽస్మాభి రావృత్తః. స్మృత్యుపస్థితౌ తావ దిమౌ బాలచరితస్యాన్త్యేఽధ్యాయే ద్వౌ శ్లోకౌ.-

రామః—ఉదీరయతు వత్సః,

కుశః—

శ్లో॥ "ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి.
గుణై ర్రూపగుణై శ్చాపి ప్రీతి ర్భూయోఽప్యవర్ధత. ౨౪

శ్లో॥ తథైవ రామ స్సీతాయాః ప్రాణేభ్యోఽపి ప్రియోఽభవత్,
హృదయ న్త్వేవ జానాతి ప్రీతియోగం పరస్పరమ్." ౨౫

అవృత్తః=వల్లెవేయఁబడెను. సన్దర్భః=గ్రంథము. స్మృత్యుపస్థితౌ తావత్=ఇపుడు తలఁపునకు వచ్చినవి. ఉదీరయతు=పఠించును-పలుకును-గాక. ఈ శ్లోకములు మిక్కిలియు నుద్దీపకములు.

శ్లో. ౨౪-౨౫. ప్రియేతి-సీతా=సీత. రామస్య=రామునికి, పితృకృతాః దారాః ఇతి=నాయన కూర్చిన భార్యయని. ప్రియా తు-ప్రేయసి కానే అయెను, ప్రీతిః=అప్రీతి, గుణాత్=(మంచి) గుణము(ల) వలనను, రూపగుణాత్ చాపి= సౌందర్యాతిశయమువలనను, భూయః అపి=మఱింత, అవర్ధత=పెంపొందెను. తథైవ= అట్లే, సీతాయాః=సీతకు, రామః=రాముఁడు, ప్రాణేభ్యః అపి=ప్రాణముల కన్నను గూడ, ప్రియః అభవత్=ప్రియుఁడు అయెను. పరస్పరమ్=ఒండొరుల (మీఁది), ప్రీతియోగం=ప్రేమకూడిక, ప్రేమ తగులము, హృదయం ఏవ తు=మనస్సే, జానాతి= ఎఱుంగును.

మొదలనే సీత తనకు తండ్రి కూర్చిన భార్యయగుటచే రామునికి ప్రియయయ్యెను. అట్టి యా ప్రేమను ఆమె తన సౌశీల్యాదిగుణములచేతను. సౌందర్యోత్కర్ష చేతను వర్ధిల్లఁజేసినది. రాముఁడును సీతకు ఆ ప్రకారముగానే-అనఁగా తండ్రివరించిన వరుఁడగుటను. రాముఁడును పెక్కుభంగుల పెంపొందించుటను-ప్రాణములకన్నను ప్రియుఁ డాయెను. వారి మానసములుమాత్రమే ఎఱుంగును వారికి ఒండొరులమీఁద గల యా ప్రీతియోగమును. 'తథైవ రామః సీతాయాః' ఇత్యాది యీ రెండవ శ్లోకము ఇప్పుడు దొరకు రామాయణపాఠమున లేదు. దానికి బదులు, 'తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే! అన్తర్గత మపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా॥' అని యున్నది. మఱి భవభూతికి అట్టి పాఠము దొరకిన

రామః—(స్వగతం) కష్ట! మతిదారుణోఽయం హృదయ మర్మోద్ఘాతః. హా! దేవి, ఏవం కిల తదాసీత్ ; అహో నిరన్వయ విపర్యాస విరసవృత్తయః విప్రలమ్భ పర్యవసాయిన స్తాపయన్తి సంసారవృత్తాన్తాః.

శ్లో॥ క్వ తావానానన్దో నిరతిశయ విస్రమ్భబహుళః?
క్వ తేఽన్యోన్యం యత్నాః? క్వచన గహనాః కౌతుకరసాః?

---

దేమో! అది ప్రక్రమవిరాజితముగా నున్నది-తథైవ ఇత్యాదిగా. చూ.. రామా-బాల-౭౭-30, 31.

'దారాః పితృకృతా ఇతి 'తథైవ రామః సీతాయాః!' వరుఁడు వధువును తాను గాను ఏఱికొనుట, వధువును వరుని తాను గాదు ఏఱికొనుట-తండ్రులు ఏఱి తాము మెచ్చి కూర్తురు దాంపత్యమును. అది యుత్తమమగు ఆర్య మర్యాద.

అతిదారుణః అయం హృదయమర్మోద్ఘాతః=ఇది హృదయములోని ఆయమునకు కడు తీవ్రమైన పెద్ద పెట్టుగానున్నది. తదా=అప్పుడు. నిరన్వయ విపర్యాస విరస వృత్తయః...సంసారవృత్తాన్తాః=ఈ సంసార (=ఐహిక జీవన) వృత్తాంతములు ఇట్లు వచ్చినది ఇట్లు పోయినది, అని సంబంధము తెలియరాని,-ఇది యిట్టిది అను ప్రకారము తెలియరాని-దాని వెంబడి యిది అని యొక అంతులేని (తలక్రిందగుటంబోని) మార్పులచేత ఎట్టి రసము (ఆనందము) లేని మార్గములు-వృత్తాంతములు-కలవై, మోసమున-మోసముగా-ముగియునవై కరము చిత్తఖేదము కలిగించునవి. విప్రలంభ పర్యవసాయినః=వియోగముతో ముగియునవియు అనియేని. అట్లగునేని కరుణరసము అని తేలునుగదా?

శ్లో. ౨౬. క్వతావానితి-నిరతిశయ విస్రమ్భ బహుళః=మిక్కిలి నమ్మకముతో నిండినదైన, తావాన్ ఆనన్దః=అంతటి (యా) ఆనందము, క్వ=ఎక్కడ? అన్యోన్యయత్నాః తే క్వ=ఒండొరులంగూర్చిన (ప్రీతికార్యములకైన) ఆ యత్నము లవి యెక్కడ? గహనాః=ఊహింపలేని అలవికాని-మఱిదేనికిని చొరరాకుండ ప్రేమతోనిండిన, ఒక్కమ్మడి అనుభూయమానములగుటచే విడదీసి చెప్పుటకు అందని, కౌతుకరసాః=పండుగులయు ఉత్సవములయు ఆనందములు. క్వచను=ఎక్కడనో?

సుఖే వా దుఃఖే వా క్వను ఖలు తదైక్యం హృదయయోః?
స్తథా ప్యేష ప్రాణ స్స్ఫురతి, న తు పాపో విరమతి! ౨౮

కష్టం భోః కష్టం.

శ్లో॥ ప్రియాగుణసహస్రాణా మేకోన్మీలనపేశలః
య ఏవ దుస్స్మరః కాల స్తమేవ స్మారితా వయం! ౨౯

---

సుఖే వా దుఃఖే వా=హర్షమునందుఁ గాని ఖేదమునం గాని, హృదయయోః=మనస్సుల యొక్క, తత్ ఐక్యం=ఆయద్వైతము, క్వ ను ఖలు=ఎట్లు పోయినదో? తథా అపి=అట్లైనను, వాని నన్నింటిని కోలుపోయినను, అవన్నియు లేకపోయినను అనుట. ఏషః పాపః ప్రాణః=ఈపాడు ప్రాణము, స్ఫురతి=కొట్టుకొనుచున్నది, (ఆడుచునే ఉన్నది.) న తు విరమతి=కాని ఉడుగదు.

ఒండొరులమీఁది నమ్మకముతో నిండిన అంతటి పట్టరాని ఆ హర్షము ఎటు పోయినదో? ఒకరికై ఒకరు పనిపడు (అప్రేమకార్య) యత్నము లేమైనవో? ఒక్కొక్కడి అనుభవమునకు వచ్చుచున్నందున విడదీసిచెప్ప నలవికాని ఆపండుగుల యానందము లవెక్కడనో? సంతోషమునఁగాని దుఃఖమునఁగాని ఆ హృదయైక్యము అది ఎక్కడికి పోయినదోకదా? అట్లైనను ఈ పాడుప్రాణము ఆడుచునే యున్నది కాని ఉడిగిపోలేదుకదా! అట్టిదాని నెల్ల కోలుపోయినను ఈ పాడు ప్రాణము పోలేదే అనుట.

'అభిజనవతో భర్తుః శ్లాఘ్యే స్థితా గృహిణీ పదే
విభవగురుభిః కృత్యై స్తస్య ప్రతిక్షణ మాకులా.'

—అను శాకుంతలోక్తి ఈ గహన కౌతుకరసములచేతను అన్యోన్య యత్నములచేతను ఇంచుక స్మారితమగుచున్నది 'సుఖే వా దుఃఖే వా' ఇత్యాదిచే 'అద్వైతం సుఖదుఃఖయోః' అను మునుపటిమాట 1. 3౨. స్మారితమగును.

భోః కష్టం=అయ్యో! కట్టా!

శ్లో. ౨౯. ప్రియేతి – ప్రియాగుణ సహస్రాణాం=ప్రేయసియొక్క లెక్కలేని గుణములయొక్క, ఏకోన్మీలన పేశలః=ఒక్కొక్కడి చిత్తమున పొలయుటచేత మనోహరమై, య ఏవ కాలః=ఏకాలమే, దుస్స్మరః=తలంచుకొన (నైనను) శక్యము గానిదో, తం ఏవ=దానినే, వయమ్=నేను, స్మారితాః=స్మరింపఁ జేయఁబడితిని.

శ్లో॥ తదా కిఞ్చిత్కిఞ్చిత్కృతపద, మహోభిః కతిపయై
స్తదీషద్విస్తారి స్తనయుగళ మాసీన్మృగదృశః,
వయస్స్నేహాకూత వ్యతికరఘనో యత్ర మదనః
ప్రగల్భవ్యాపార స్స్ఫురతి హృది, ముగ్ధశ్చ వపుషి. ౨౦

కుశః—అయం చ చిత్రకూటవనవిహారే సీతాదేవీ ముద్దిశ్య రఘుపతేః శ్లోకః—

---

ఏకాలము స్మరణకు రాఁగూడదో, వచ్చిన ఓర్వరాదో, ఆ కాలమే, ఈ బాలకాండ శ్లోకములవలన జ్ఞప్తికి వచ్చినది! ప్రేయసి లెక్కలేని సద్గుణములను ఒక్కమ్మడి చిత్తమునం బొలయుటచే అతిమనోహరమైనదికదా ఆ కాలము! అది తలఁపునకు వచ్చినదే, అయ్యయ్యో ఏమి సేయుదును? అనుట.

శ్లో. ౨౦. తదేతి.—తదా అప్పుడు, కిఞ్చిత్ కిఞ్చిత్=ఇంచించుకే, కృతపదం=పదముగొన్నదై, అంకురించినదై, కతిపయైః అహోభిః=కొన్ని దినములకు, ఈష ద్విస్తారి=రవంత విరివిచెందుచున్నదిగా, మృగదృశః తత్ స్తనయుగళం=లేడికంటి - సీతయొక్క - ఆ చనుంగవ, ఆసీత్=ఆయెను. యత్ర=ఎప్పుడు - అనఁగా ఆదినాలలో, మదనః=మన్మథుఁడు, వయఃస్నేహాకూతవ్యతికర ఘనః=ప్రాయమును, అనురాగమును, మనోభావమును అను వీని మేళనముచేత బలిసినవాఁడై, హృది=మనసున, ప్రగల్భవ్యాపారః=దిట్టపు చెయిదములు గలవాఁడుగాను, వపుషి చ=దేహమందో, ముగ్ధః=గోలగాను, స్ఫురతి=ప్రకాశించును, తోఁచును.

ఆ దినములలో లేడిచూపులవంటి తారళ్యపుఁజూపులు గల (యాప్రేయసికి) చనుంగవ ఇంచించుక అంకురించి ఇంచుక విస్తృతిచెందుచుండెను. (అల్లె) చిత్తజుఁడు ఆప్రాయము, ఆస్నేహము, వానివలని మనోభావములు మేళనము పొందఁగా వానివలన బలిసి మనసున దిట్టపుఁజెయిదములు గలవాఁడయ్యెను మేన గోలతనముం బూనియుండెను. ఏకాలము విరహిదుఃస్మరమో అదే యది. ఆ దినాలలో ప్రేయసికి మనసిజవిజృంభణము మేన ఇంకను అంతగా లేదు; గాని చిత్తమున మనోరథముల రూపముగా ఎక్కువగా ఉండినది. భవభూతి మాలతిలోను పెండ్లినాఁటి మాలతి వయసు ఈ మాటలలతోనే చెప్పినాఁడు. - ix. 29.

"భవద్భిః సర్వాఙ్గ ప్రకృతి రమణీయా కులవధూ
రిహాస్తై దృష్టా వా, విదిత మథ వాస్యాః కి మభవత్ ?

శ్లో॥ "త్వదర్థ మివ విన్యస్త శ్శిలాపట్టోఽయ మగ్రతః,
యస్యాయ మభితః పుష్పైః ప్రవృష్ట ఇవ కేసరః." ॥

---

వయోవస్థాం తస్యాః శృణుత - సుహృదో, యత్ర మదనః
ప్రగల్భవ్యాపార శ్చరతి హృది ముగ్ధశ్చ వపుషి." అని.

ఈ వపువున మదనుని మౌగ్ధ్యమును—

"స్తన పరిణాహ విలాస వైజయన్తీ" (iii-12) అనియు,

"నిర్భుగ్న పీన కుచకుడ్మల యానయా మే" (vi-12) అనియు,

"ప్రేమ్ణా మద్గ్రథి తేతి యా ప్రియసఖీ హస్తోపనీ తేతి వా
విస్తారి స్తన కుమ్భకుడ్మలభర రోత్సఙ్గేన సంభావితా-" (viii-6) అనియు,

వర్ణనలచే అందందు సూచించినాఁడు. వీరచరితమున పెండ్లియప్పటి సీతను రాముఁడు సరిగా ఈ మాటలతోనే,

ఉన్నద్ధ స్తన కుమ్భకుడ్మలభర వ్యాసావభుగ్నస్య తే
మధ్యస్య త్రివళీ తరఙ్గకజుషో భఙ్గః ప్రియే మా చ భూత్, (ii-21.)

—అని వర్ణించినాఁడు. ఇక్కడనో ఇట్లు - వపు ర్మదన ముగ్ధతలో "కిఞ్చిత్ కిఞ్చిత్ కృతపద మహోభిః కతిపయైః, త దీమద్విస్తారి స్తనయుగళ మాసీ న్మృగదృశః" అని. కావున ఈ యన్నింటికిని సమార్థమును సామరస్యమును గ్రహింపఁదగును.

శ్లో. అ. త్వదర్థమితి - అగ్రతః = ఎదుర, అయం శిలాపట్టః = ఈ ఱాతి పట్టము - పీట, త్వదర్థం = నీకోసము, విన్యస్త ఇవ = అమర్పఁబడినదివోలె నున్నది. యస్య= దేనికి - అనఁగా దానికి, అభితః=పైసంతటను, అయం కేసరః = ఈ పొన్న చెట్టు, పుష్పైః=పూలతో, ప్రవృష్ట ఇవ=దట్టముగా వానకురిసినట్లున్నది. పూవులే వానగా కురిసినట్లు దానిపై రాలియున్నవి.

నీకోసము అమర్పఁబడినటు లున్నది యీఱాతిపీట, ఎదురుగా, చూడు. ఈ పొన్న దానిమీఁద దట్టముగా పూలం కురిసియున్నది.

ఈ శ్లోకము రామాయణాయోధ్యాకాండమున 94 సర్గలో ౨౧ వది. లజ్జ-తన మునుపటి సరసోక్తులను ఈబాలురు పలుకుచున్నందులకు. స్మితస్నేహములు అట్లు తనకై పలుకుచున్న బాలురయెడ వారి మాటమీఁకి - కరుణ - అట్టినాఁటి సీత నేఁటి వియోగస్మరణకు...

రామః—(సలజ్జాస్మితస్నేహకరుణం) అతిహి నామ ముగ్ధశ్శిశుజనః, విశేషత స్త్వరణ్యాచరః. హా దేవి! స్మరసి వా తస్య ప్రదేశస్య తత్సమయ విస్రమ్భాతిప్రసఙ్గస్య సాక్షిణః. కష్టం! భోః కష్టం!

శ్లో॥ శ్రమామ్బు శిశిరీభవ త్ప్రసృత మన్దమన్దాకినీ
మరు త్తరళి తాలకాకుల లలాట చన్ద్రద్యుతి,
అకుఙ్కుమ కళఙ్క తోజ్జ్వలకపోల ము త్ప్రేక్ష్యతే,
నిరాభరణ సున్దర శ్రవణపాశముగ్ధం ముఖమ్. 30

---

ముగ్ధః శిశుజనః - శిశుజనులు బేలలు - కావున తాము వరుసగా పాడుకొనుచుం బోవుదురు, రాముని మనోభావములం బరికింపరు.

శ్లో. 30. శ్రమామ్బ్వితి - శ్రమామ్బు శిశిరీ భవత్ = చెమటచే చల్లనగుచున్నదియు, ప్రసృత మన్ద మన్దాకినీ మరు త్తరళి తాలకాకుల లలాటచన్ద్రద్యుతి = మెల్లగా వీచుచున్న మందాకినిమీఁది గాలులచే అల్లలాడుచున్న ముంగురులచే కలఁగిపోయిన చందురుంబోలిన నుదుటికాంతిగలదియు, అకుఙ్కుమకలఙ్కతోజ్జ్వలకపోలమ్ = కుంకుమగుఱుతు లేమిచే - రాలిపోవుటచే - (నైజముగానే) మెఱయు గండములు కలదియు, నిరాభరణ సున్దర శ్రవణ పాశముగ్ధమ్ = సొమ్ములు - కమ్మలు - లేకయే అందముగానున్న పాశముంబోని - త్రాటిచుట్టంబోని - చెవులతో పొబగారుచున్న, ముఖమ్ = మొగము, ఉత్ప్రేక్ష్యతే = మనమందు ఎంచఁబడుచున్నది - నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది అనుట.

(ఆ యతిప్రసంగముల నొక్కటనైన) ఆ నీ మొగము నాకిపుడు స్మరణకు వచ్చుచున్నది. అది చెమటతో చల్లగా నైనది. (ఆప్యాయముగా) మందాకినిమీఁది మందపవనము వీచుచుండఁగా, దానికి కదలాడి, ముంగురులు పళపళని నుదుటి చందురుమీఁదికి చెదరి చిక్కుపడినవి. కుంకుమ (మకరికాది) గుఱుతులు చెరిగిపోయి చెక్కిళ్ళు స్వాభావిక (మకాళ కేళిచే ఎక్కిన) కాంతితో ఉజ్జ్వలములు ఐనవి. చెవినుండి కమ్మలు జాఱి పడిపోయి అదియు ఒక యందముగా నుండినది. ఐదువకు కమ్మలు మానరాని మంగళాభరణములు.

ఈ స్మరణము మఱియుమఱియు కాల్చివేయుచున్నది. అప్పటి కింకను సీతారాములు అనసూయాత్రుల యాశ్రమమునకు పోలేదు, అనసూయవలని యా మాయని యంగరాగాదివైభవమును సీత యింకను పొందలేదు. మఱి అడవికి తరలినపుడు, తేరు ఎక్కబోవుచుండఁగా, దశరథాజ్ఞచే సీతకు సర్వాభరణములు ఒసంగఁబడినవిగదా - అయో. 39 వ సర్గ.

౧౭. సా సుజాతా సుజాతాని వైదేహీ ప్రస్థితా వనమ్
భూషయామాస గాత్రాణి తైర్విచిత్రైర్విభూషణైః

౧౮. వ్యరాజయత వైదేహీ వేశ్మ తత్సువిభూషితా
ఉద్యతోంఽశుమతః కాలే ఖం ప్రభేవ వివస్వతః.

కావున ఇట చెవికి నిరాభరణత, కేళిలో కమ్మలు గళితమగుటయే. కుంకుమ పత్రభంగములుం లేమియు అవి చెరిగిపోవుటయే. అట్టి కేళియే ఆవిస్రంభాతి ప్రసంగము. బ్రహ్మవరమున రామచరితమును సర్వమును ఉన్నదియున్నట్లు వాల్మీకి మనోవీథిం బ్రత్యక్షమగుచుండఁగా అట్లే నిజమును వ్రాసెనని ప్రమాణముగదా - "పద్మయోని రవోచత్ ...అవ్యాహతజ్యోతి రార్షం తే ప్రాతిభం చక్షుః" అని భవభూతియు దానిం బ్రస్తావించెను. కావున బాలురు 'త్వదర్థ మిహ విన్యస్తః' ఇత్యాది పఠింపఁగానే రామునికి నాఁటివృత్తము సర్వమును స్మారితమైనది. ఈ స్మారితము రతమగుసా - (పురుషాయిత పర్యంతము సంయతము ఐనట్టిద?) చూ. అమరు-

ఆలోలా మలకావళిం, విలుళితాం బిభ్ర చ్చలత్కుణ్డలాం
కిం చోన్మృష్టవిశేషకం తనుతరైః స్వేదామ్భసాం జాలకైః
తన్వ్యా యత్ సురతాన్త తాన్త నయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ. కిం హరిహరబ్రహ్మాదిభి ర్దైవతైః?

అట్లే కుమారసంభవమునను-

చుమ్బనా దలక చూర్ణదూషితం శఙ్కరోఽపినయనం లలాటజమ్
ఉచ్ఛ్వసత్కమలగన్ధయే దదౌ పార్వతీవదనగన్ధవాహినే.

సంజీవని, అత్రహారచతుష్ఠి అలకచూర్ణపాతకథనాత్, దేవ్యా ఉపరిభోగః సూచితః.

చూ. రామాయణము - అయోధ్య 94, 95 సర్గలు.

అతిరమణీయ చిత్రకూట మందాకినీ పరిసర తద్విస్రంభవిహారమున 'త్వదర్థ మిహ' అన్న మాటలచే భవభూతి ఈ యతిప్రసంగమును భావించినాఁడు. ఇంచుక ఆప్రకరణము —

94 - ౧౧ శైలప్రస్థేషు రమ్యేషు పశ్యేమాః రోమహర్షణాః
కిన్నరాః ద్వంద్వశో భద్రే రమమాణాః మనస్వినః.

౧౨. శాఖావసక్తాన్ ఖడ్గాంశ్చ ప్రవరా ణ్యంబరాణి చ
పశ్య విద్యాధర స్త్రీణాం క్రీడోద్దేశాన్ మనోరమాన్.
..................

౧౪. య దిహ శరదోఽనేకా స్త్వయా సార్ధ మనిన్దితే
లక్ష్మణేన చ వత్స్యామి న మాం శోకం ప్రధక్ష్యతి.
..................

౧౫. వైదేహి రమసే కచ్చిత్ చిత్రకూటే మయా సహ
పశ్యన్తీ వివిధాన్ భావాన్ మనోవాక్కాయ సంయతాన్.
..................

౨౧. త్వదర్థమివ విన్యస్తమ్.
ఇది అశ్లోక ప్రకరణము.

మరల 95 లోను __

౧. అథ శైలా ద్వినిష్క్రమ్య మైథిలీం కోసలేశ్వరః
అదర్శయ చ్ఛుభజలాం రమ్యాం మన్దాకినీం నదీం.

౨. అబ్రవీ చ్చ వరారోహాం చారుచన్ద్రనిభాననాం
విదేహ రాజస్య సుతాం రామో రాజీవలోచనః.
... ..... ........

౧౨. దర్శనం చిత్రకూటస్య మన్దాకిన్యాశ్చ శోభనే
అధికం పురవాసాచ్చ మన్యే చ తవ దర్శనాత్,

౧౩. నిత్య విక్షోభితజలాం విగాహస్వ మయాసహ

౧౪. సఖీవచ్చ విగాహస్వ సీతే మన్దాకినీం నదీమ్.

ఇత్యాది
చిత్రదర్శనమునను అయాఘట్టములలో
అఙ్గాని త్వ మురసి మమ కృత్వా యత్ర నిద్రా మవాప్తా
అనియు
కిమపి కిమపి,మన్దంమన్ద మాస త్తియోగాత్.
ఇత్యాదియు I-౧౭, ౨౦.

తాను స్మరింపఁడా? అట్లే ఇప్పు డిదియు. ఈకందమాలభాషితములం
గనుఁడు IV_21.

రామః:__అవిదిత మనుసృత్య చిత్రకూటే
సులతను సుమాపచయాయ నిర్గతాం త్వాం।
కుసుమ మపచితం వికీర్య భూమౌ।

(స్తమ్భిత ఇవ స్థిత్వా సకరుణం) అహో ను ఖలు భోః!

శ్లో॥ చిరం ధ్యాత్వా ధ్యాత్వా నిహిత ఇవ నిర్మాయ పురతః
ప్రవాసే ప్యాశ్వాసం న ఖలు న కరోతి ప్రియజనః.
జగజ్జీర్ణారణ్యం భవతిహి వికల్పవ్యుపరమే.
కుకూలానాం రాశౌ తదను హృదయం పచ్యత ఇవ. 31

---

స్మరసి రసేన మయా ధృతం పటాన్తమ్?
(విహస్య) సాహసిక, అతఏవ దూరే పరిహ్రియసే!

తిరస్కరణిలో సీతమాటలు, 'రసేన' 'విహస్య' 'సాహసిక' 'పరిహ్రియసే' - అను నివి యేవిప్రలంభాతి ప్రసంగమును సూచించును? స్తమ్భిత ఇవ - రాముఁడు మ్రాన్పడినాఁడు. దుఃఖము అఁపుకొనిన అగలేదు. అహో ను ఖలు భోః=అహో ఏమి ఇది!

శ్లో. 31. చిరమితి - చిరం = చాలకాలము, ధ్యాత్వా ధ్యాత్వా=ధ్యానించి ధ్యానించి, నిర్మాయ=నిర్మించి, పురతః=ఎదుట, నిహిత ఇవ=నిలుపఁబడినదో యన, ప్రియజనః=అనుంగు జనము - ఆప్తజనము, ప్రవాసే అపి=తాను దూరముగా పోయి యున్నప్పుడును, ఆశ్వాసం=ఊఱడింపును, న న కరోతి ఖలు=చేయక మానదు కదా. వికల్పవ్యుపరమే=(ధ్యానము కలిగించిన) విపరీతకల్పన, భ్రాంతి, తీఱి పోఁగానే, ప్రియజనము అట్లు ఎదుటినుండి మాయము కాఁగానే, జగత్=లోకము, జీర్ణారణ్యం=శ్మశానము, భవతి హి=ఔనుగదా. తదను=ఆవెనుక, హృదయం= మనసు, కుకూలానాం రాశౌ=ఊకనిప్పు మొత్తమునందు, పచ్యత ఇవ=పాకము పొందుచున్నట్లు అగును.

ధ్యానింపఁగా ధ్యానింపఁగా, అభావనాతిశయము ఆకృతి సృజించి ఎదుట నిలువబెట్టెనో యన ఆయెడబాసిపోయిన ప్రియజనము ఎదుట తోఁచి ఎడబాటు నందును ఊఱట కలిగింపక పోదుకదా. అట్లే శ్రమాంబ్విత్వాది రూపముతో ప్రియ నాభావవీథిలో క్షణము పొలసి ఊఱడించినది, ఇంతలో అభావన అడంగినది. ఆ ప్రియజనము మాయమైనది. చుట్టును చూచుకొనఁగా లోకము పెను శ్మశానముగా నైనది. మనసు ఊకనిప్పు పెనురాశిలో ఉడుకుచున్నట్లు ఉన్నది.

మనఃశాస్త్ర పరామర్శకము ఇది అద్భుతమైన కల్పన! జీర్ణారణ్యం - కర్మధారయముగా జీర్ణించిన, ఎండిపోయిన యడవి యనక, తత్పురుషముగా 'జీర్ణుల యడవి' 'పితృవన' పర్యాయముగాఁ గొనఁదగును. ప్రథమాంకమునను తన

(నేపథ్యే)

శ్లో॥ వసిష్ఠో వాల్మీకి ర్దశరథ మహిష్యోఽథ జనక
స్సహైవారున్ధత్యా శిశుకలహ మాకర్ణ్య సభయాః,
జరాగ్రస్తై ర్గాత్రై రథ ఖలు సుదూరాశ్రమతయా
చిరేణాగచ్ఛన్తి త్వరితమనసోఽపి శ్రమజడాః. 37

---

యొడిలో నిదురఁగూరిన సీతను అడవికి పంపివేయ నిశ్చయించుకొన్నప్పటి శోకము పొంగులోనే 'శూన్య మధునా జీర్ణారణ్యం జగత్' (పు. 81) అన్నాఁడు. మాలతి లోను మాధవుఁడు మాలతీనాశనమున తనకు 'జగత్తు జీర్ణారణ్య మగును' అన్నాడు. (V - 30) 'జగ జ్జీర్ణారణ్యం కథ మపి విధాతుం వ్యవసితః' 'జరదరణ్యం' అనియు ప్రయోగించుట కలదు. ప్రేతభూమివాచకమగు 'పితృవనమునకు' 'పితౄణాంవనం' అనియే రామాశ్రమి. దుఃఖాతిరేకమున ఇష్టతమ జన వియోగమున నాకు లోకము 'వల్లకాడై' పోయినది అని వాపోవుట కలిగినదే. ఈ యర్థము సాధువని తోఁచు నట్లు కథాసరిత్సాగరాదులయందుండేని ఇతరలక్షణములం బట్టి శ్మశానమని నిర్ణయము పొందుచున్నయెడల తద్వాచకముగా 'జీర్ణారణ్య'మన్న ప్రయోగము కలదని తమకు జ్ఞప్తి అని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు సెలవిచ్చియుండిరి. 'కుకూలానాం రాశౌ' – ఊకనిప్పు పెనుసెగ ప్రసిద్ధము.

శ్లో. 37. వసిష్ఠ ఇతి – శిశుకలహం = నిసుగుల – లవచంద్రకేతువుల – యుద్ధమును, ఆకర్ణ్య=విని, సభయాః=భయముతో – ఎవరి కేమగునో అను దిగులుతో – కూడుకొన్నవారై, వసిష్ఠః=వసిష్ఠుఁడును, వాల్మీకిః=వాల్మీకియు, దశరథమహిష్యః= దశరథుని భార్యలు – కౌసల్యాదులును, అథ = మఱియు, జనకః = జనకుఁడును, అరున్ధత్యా సహ ఏవ=అరుంధతితో కూడనే, విదూరాశ్రమతయా=కయ్యపుఁ జోటు ఆశ్రమమునకు చాల దూరమగుటచే, జరాగ్రస్తైః గాత్రైః=ముదిమి – దాని శైథిల్యము – పైకొన్న దేహములతో, అథ=మఱి, త్వరితమనసః అపి=త్వరపాడిన మనసుగలవారయ్యు, శ్రమజడాః=అలతచే మెల్లగానే. చిరేణ చాలసేపటికి, ఆగచ్ఛన్తి ఖలు=వచ్చుచున్నారు అదే!

రామః—కథం! భగవన్తా వరున్ధతీవసిష్ఠా వమ్బా జనక
శ్చాత్రైవ! కష్టం! కథం ఖలు ఏతే ద్రష్టవ్యాః! (సకరుణం విలోక్య)
అహహ తాత జనకోఽప్యత్రైవాయాత ఇతి వజ్రేణ తాడితోఽస్మి
మన్దభాగ్యః!

శ్లో॥ సమ్బన్ధస్పృహణీయతా ప్రముదితైర్జుష్టే వసిష్ఠాదిభి
ర్దృష్ట్వా పత్యవివాహమఙ్గళమహే తత్తాతయోః సఙ్గతమ్.

---

వసిష్ఠుఁడు వాల్మీకి దశరథభార్యలు, జనకుఁడు, అరుంధతియుంగూడ, శిశువు
లకు కలహ మని విన్నారు. మనసుల భయము తోఁచినది. అంతట తమ ముసలి
శిథిల దేహములను మోసికొనుచు, మనసున ఎంత త్వరగొన్నను అలసటచే
మెల్లగానే నడుచుచు, ఆశ్రమము చాల దూరమగుటచే చాలసేపు నడచి నడచి,
అదిగో చేరవచ్చుచున్నారు.

కథం - ఏమీ! ఎవరెవరిని తాను చూడలేఁడో వారే అందఱును ఇట నొక్క-
చోటనే అగపడుచున్నదని! అందు ముఖ్యముగా - 'అహహ - తాతజనకః అపి'
'అహహ నాయన జనకుఁడుకూడ' అని అనుకొనుచున్నాఁడు - వజ్రేణ తాడి
తోఽస్మి=పిడుగుదెబ్బ తింటిని. వివాహము చేసిన నిమిషముననే వీరందఱిని తలఁచు
కొని వారికి తన మొగము ఎట్లు చూపుదును అని భయపడినాఁడు - పన్నెండేం
డ్లయినవి. ఆకస్మికముగా ఈయడవిలో అందఱు ఒక్కటచే అగపడఁబోవుచున్నారు.
ఏమి సేయుదును! 'హా అమ్బ అరున్ధతి! హా భగవన్తౌ వసిష్ఠవిశ్వామిత్రౌ...ముషితాః
స్థ, పరిభూతాః స్థ రామహతకేన' - ఇత్యాది - పు. 82

శ్లో. 33. సమ్బన్ధేతి—సమ్బన్ధ స్పృహణీయతా ప్రముదితైః=వియ్యము
శ్లాఘ్యమైనది - ఎల్ల తెఱంగుల కోరఁదగినది - అగుటంబట్టి సంతసము గన్నవారైన,
వసిష్ఠాదిభిః=వసిష్ఠుఁడు మొదలగువారితో, జుష్టే=కూడుకొన్నదైన, అపత్య వివాహ
మఙ్గళమహే=బిడ్డలమైన - సీతారాములమైన - మా పెండిలి కల్యాణోత్సవమందు,
తాతయోః=నాయనలయొక్క - జనక దశరథులయొక్క, తత్ సఙ్గతమ్=(నాఁటి)
ఆ కూడికను, దృష్ట్వా=చూచి, వృత్తే=జరిగిన, ఈదృశే=ఇట్టిదైన, మహావైశసే=
మహాఘోర దుఃఖమున, ఈదృశం=ఇట్టివాఁడైన, పితృసఖం=నాయనమిత్రమును,
పశ్యన్=చూచుచున్నవాఁడనై, అహం=నేను, సహస్రధా=వేయిగా, కిం న

పశ్యన్నీదృశ మీదృశే పితృసఖం వృత్తే మహావైశసే
దీర్యే కిం న సహస్రధాహ! మథవా రామేణ కిం దుష్కరం

(నేపథ్యే)

కష్టం భోః కష్టం.

శ్లో॥ అనుభావమాత్ర సముపస్థితశ్రియం
సహసైవ వీక్ష్య రఘునాథ మీదృశం.
ప్రథమప్రబుద్ధజనక ప్రబోధితా
విధురాః ప్రమోహ ముపయాన్తి మాతరః. 38

---

దీర్యే=చీలిపోకయ ఉన్నానే ఏమి! అథవా=అట్లన నేల? సరియే! రామేణ కిం దుష్కరమ్=రాముఁడు చేయఁజాలనిది ఏమున్నది!

ఎంతో కోరఁదగినది, శ్లాఘ్యమైనది రఘు జనకుల యొవియ్యము అని పొంగిన సంతోషములో వసిష్ఠుఁడు మొదలైనవారు చూచుచు కూడ నున్నారు. తమ యనుంగు బిడ్డలమైన మేము - సీతయు నేనును - పెండిలిపీటలమీఁద నున్నాము. గొప్ప కల్యాణోత్సవము జరుగుచుండినది. అందు అట్లు కలసికొనియుండినారు నాయనలు - జనకదశరథులు. దానిని నాఁడు చూచినవాఁడను నేను. ఇపుడు సీతావివాసము - ఈ పాడు చచ్చిన నేను కావించినదే - సీత యేమైనదో - ఎట్టి నాశముం బొందినదో - అనునట్టి ఈ మహాదుఃఖముకలిగియుండఁగా ఆ మానాయన సఖుని చూచుచు వేయి వగల చీలిపోక యున్నానే! ఔను! రాముఁడు - వట్టి కఠినాత్ముఁడు - చేయలేని పనియున్నదా! చూ. రామస్య...దుర్భర...పటోః II.

శ్లో. 38. అనుభావేతి—అనుభావమాత్ర సముపస్థిత శ్రియం=(ఎంత చిక్కినను ఎంత స్రుక్కినను వీడిపోనిదై స్వభావసిద్ధముగా మిగాన దేహాన నుండు) ప్రభావము మాత్రముగా నెలకొన్న కాంతిగలవాఁడై, ఈదృశం=ఇట్టిస్థితిలో నున్న, రఘునాథం=రఘుస్వామిని రామచంద్రుని, సహసైవ=తటాలున, మాతరః=రాముతల్లులు, వీక్ష్య=చూచి, ప్రథమ ప్రబుద్ధ జనక ప్రబోధితాః='వాఁడుగో రాముఁడు. అతఁడుకూడ ఇక్కడ నున్నాఁడు' అని తొలుత తా మెఱిఁగిన జనకునిచే ఎఱింగింపఁబడినవారై, విధురాః=కడువిహ్వలలై - వికలలై, ప్రమోహం ఉపయాన్తి=పెనుమూర్ఛను పొందుచున్నారు.

రామః—హా తాత జనక! హా మాతరః!

శ్లో॥ జనకానాం రఘూణాం చ యత్కృత్స్నం గోత్రమఙ్గళం,
తస్మిన్నకరుణే పాపే వృథా వః కరుణా మయి. 38

యావత్సమ్భావయామి. (ఇతి ఉత్తిష్ఠతి)

కుశలవౌ—ఇత ఇత స్తాతః.

(ఇతి సకరుణం పరిక్రమ్య నిష్క్రాన్తాః సర్వే)

ఇతి కుమార ప్రత్యభిజ్ఞానం నామ
షష్ఠాఙ్కః.

రాముని దేహముఖకాంతి తత్ ప్రభావమాత్రముగా కదా మిగిలియున్నది. అట్టిరాముని, తల్లులును జనకుఁడును తటాలున చూచినారు. 'వీఁడుగో రాముఁడు కూడ ఇట నున్నాఁడు' అని మొదట జనకుఁడు తాను కనుగొన్నాఁడు. కౌసల్యాదులకుం జెప్పినాఁడు - వారు అందఱు దుఃఖవిహ్వలలై పెనుమూర్ఛగొని కూలినారు.

అట్లు పన్నెండేండ్లయి దుఃఖవశమున గుఱుతు తెలియకపోయిన రాముం గాంచి వారు మూర్ఛితు లగుట వానిమీఁది కరుణచేత నే కదా - అట్లనితలంచి క్రూరాత్ముఁడనగు నామీఁద మీకెందులకు కరుణ యనుచు వారిం దఱియుచున్నాఁడు రాముఁడు.

ఎదుట పడినపుడు - తనచే అట్లు మిక్కిలియుఁ అపకృతుఁడు గాన తొలుత జనకునే తలంచుకొనుట, తరువాత తల్లులను - హా నాయనా జనకుఁడా! హా తల్లులారా!

శ్లో. 38. జనకానాం ఇతి—జనకానాం=జనకులకు - ఆగోత్రమువారి కెల్లను, రఘూణాం చ=రఘువులకును - ఆగోత్రమువారి కెల్లను, యత్=ఏది, కృత్స్నమ్=సమస్తమైన - ఎల్లతెఱంగులదైన, గోత్రమఙ్గలమ్=కులమునకే మంగళమో - మంగళావహమో - అనుట, తస్మిన్=దానివిషయమున - అనఁగా ఆ సీతవిషయమున, అకరుణే=దయమాలినవాఁడను, పాపే=పాపాత్ముఁడను ఐన మయి=నాయందు. వః=మీకు, కరుణా=దయ, వృథా=నిష్ప్రయోజనము. 'మఙ్గలమ్' అని విధేయము ప్రధానమగుటచే 'యత్' అనియు, 'తస్మిన్' అనియు సీతంగూర్చి నపుంసకలింగము.

జనకవంశమున కెల్లను రఘువంశమున కెల్లను సర్వాకారమగు మంగళముం గూర్చినది సీత. ఆ సీతయెడ దయమాలిన పాపుఁడను నేను. నామీఁద మీకు ఇదేటి దయ? వృథ గదా?

సంభావయామి - (మూర్ఛాపనోదనమునకైన) ఉపచారములు కావింతును. ఇది నిష్క్రమణవ్యాజము.

ఇది కుమార ప్రత్యభిజ్ఞానము (ఆనవాలుపట్టుట) అను
షష్ఠాంకము.



# ఉత్తరరామచరితనాటకమ్

## సప్తమాఙ్కః

(తతః ప్రవిశతి లక్ష్మణః)

లక్ష్మణః—భో భోః అద్య ఖలు భగవతా వాల్మీకినా సబ్రహ్మక్షత్ర పౌరజానపదాః ప్రజా స్సహాస్మాభి రాహూయ కృత్స్న ఏవ సదేవాసురతిర్యగురగనరనికాయః చరాచరో భూతగ్రామశ్చ స్వప్రభావేన సన్నిధాపితః. ఆదిష్ట శ్చాహ మార్యేణ, "వత్స లక్ష్మణ, భగవతా వాల్మీకినా స్వకృతి మప్సరోభిః ప్రయుజ్యమానాం ద్రష్టుముపనిమన్త్రితా స్స్మః. త ద్భాగీరథీతీరమనోజ్ఞస్థాన ముపగమ్య క్రియతాం సమాజసన్నివేశః" ఇతి. కృతశ్చ మర్త్యామర్త్యస్య భూతగ్రామస్య సముచితస్థానేషు సముపవేశసజ్జో మయా. అయం చ.

---

భోభో = ఓహోయి, అద్య = నేఁడు - ప్రజాః = ప్రజలు - అయోధ్యారాజ్యమండలివారు - వారుకదా సీత చారిత్రమును శంకించినవారు. కావున తొట్టతొలుత ప్రధానముగా వారిం జెప్పుట, సబ్రహ్మక్షత్రపౌరజానపదాః=బ్రాహ్మణులు, క్షత్త్రియులు, పురవాసులు పల్లెవాసులు అను ఎల్లవారితో కూడుకొన్న ప్రజలను, అస్మాభిః సహ = మాతో కూడ - అనఁగా మమ్ముంగూడ - ఆహూయ = పిలిచి - అనఁగా వారిని మమ్ము పిలిచినాఁడు. జఙ్గమః స్థావరశ్చ కృత్స్న ఏవ భూతగ్రామః= తిరుగాడునదియు కదలనిదియు నగు సకలప్రాణి సమూహము - అందులో - సదేవాసుర...నికాయః=దేవతలు, అసురులు, (తిర్యఙ్కులు=) నాలుగుకాళ్ళ అడ్డముగ నడచు ప్రాణులు, పాములు మనుష్యులు - వీరియందఱి మొత్తము. స్వప్రభావేణ=తన మహిమచేత, తపఃశక్తిచేత. సన్నిధాపితః = ఒక్కెడ సమకూర్పఁబడినది. ఉపనిమన్త్రితాః స్మః-ఆహ్వానముచేయఁబడితిమి. భాగీరథీతీరమనోజ్ఞస్థానం ఉపగమ్య = భాగీరథీతీరమున మనోహరముగానుండు (ఒక)చోటికి చేరి-అట్టిస్థానమును నిర్ణయించి-అక్కడికిచేరి, సమాజసన్నివేశః=ప్రయోగముం జూచు సమాజము - సామాజికులు

శ్లో॥ రాజ్యాశ్రమనివాసేఽపి ప్రాప్తకష్టమునివ్రతః,
వాల్మీకిగౌరవా దార్య ఇత ఏ వాభివర్తతే. ౧

(తతః ప్రవిశతి రామః)

రామః—వత్స, లక్ష్మణ, అపి స్థితా రఙ్గప్రాశ్నికాః?

లక్ష్మణః—అథ కిం.

రామః—ఇమౌ పున ర్వత్సౌ కుమారచన్ద్రకేతుసమాం ప్రతిపత్తిం లమ్భయితవ్యౌ.

లక్ష్మణః—ఆర్య, ప్రభుస్నేహప్రత్యయా త్తథైవ కృతం. ఇదం చాస్తీర్ణం రాజాసనం. ఉపవిశ త్వార్యః,

(రామ ఉపవిశతి.)

---

కూర్చుండఁదగిన చోటియేర్పాటు. సముపవేశనమ్ కృతమ్ = కూర్చుండఁబెట్టుట చేయఁబడినది-కూర్చుండఁబెట్టితిని. అయంచ-మఱివీఁడుగో-అని చూపుచుం జెప్పుట.

శ్లో. ౧. రాజ్యేతి-రాజ్యాశ్రమనివాసే అపి = రాజ్యమనెడు ఆశ్రమమున ఉన్నను,-రాచఱికమున, బంగాళాలలో ఉండి, సకల సుఖభోగముల ననుభవింపఁ గలిగియున్నను, ప్రాప్త కష్ట మునివ్రతః = పొందఁబడిన-పూనఁబడిన-కష్టమైన మునులవ్రతము-మఱియొక భార్యం బొందకుండ ఉపవాసాదులు పట్టుట మొదలగునది-కలవాఁడై-ఆవ్రతమున ఆటలు పాటలు చూడఁగోరుటకాని చూచుటకాని లేదు-ఐనను, వాల్మీకిగౌరవాత్ = వాల్మీకిమీఁదిగౌరవమువలన, ఇతః అభివర్తతే = ఇచటికి (ఆటను చూచుటకు) వచ్చుచున్నాఁడు.

భోగాస్పదమైన రాజ్యాశ్రమమున ఉండియు-(సీతావియోగమువలన కలిగిన విరక్తిచే) కష్టమైన తాపసుల వ్రతమును పూనినవాఁడు-అన్న, వాల్మీకిమీఁది గౌరవముచేత ఇచటికి అరుదెంచుచున్నాఁడు.

మఱెవరైన నాటకముం జూడ రమ్మన్న పోవువాఁడుకాఁడు రాముఁడు ఈ దినాలలో.

అపి స్థితాః=వచ్చియున్నారా? ప్రాశ్నికాః=చూచి తప్పు ఒప్పు నిర్ణయించువారు-ప్రేక్షకులు అన్నమాటయే. స్థానప్రతిపత్తిం=స్థానమర్యాదను-గౌరవమును. ప్రభుస్నేహప్రత్యయాత్ = ప్రభువునకు-నీకు-గల స్నేహంపుఁదార్ఢ్యముచేత-ఎఱుకచేత-అస్నేహమును నేను ఎఱింగియుండుటఁబట్టి, రాజాసనమ్=రాజ

లక్ష్మణః—ప్రస్తూయతాం భోః.

సూత్రధారః—(ప్రవిశ్య) భగవాన్ భూతార్థవాదీ ప్రాచేతసః సస్థావర జఙ్గమం జగ దాజ్ఞాపయతి "య దిద మార్షేణ చక్షుషా సముద్వీక్ష్య పావనఞ్చ కరుణాద్భుతరసఞ్చ కిఞ్చి దుపనిబద్ధం, తత్ర కార్యగౌరవా దవధాతవ్య" మితి.

రామః—ఏత దుక్తం భవతి—"సాక్షాత్కృతధర్మాణో మహర్షయః. తేషా మమృతసారాణి పరోరజాంసి ప్రజ్ఞానాని క్వచి దపి వ్యాహన్యన్త ఇ త్యనభిశఙ్కనీయానీ"తి

(నేపథ్యే)

హా! అజ్జఉత్త! హా! కుమార లక్ఖణ! ఏఆఇణిం మందభాఇణిం, అసరణం, అరణ్ణే ఆసణ్ణప్పసవవేఅణం హదాసా సావదా మం అహిల సంతి, సాహం దాణిం మందభాఇణీ భాఈరహీఏ అత్తాణఅం ణిక్ఖి వామి [హా ఆర్యపుత్ర! హా కుమార లక్ష్మణ! ఏకాకినీ మ్మన్దభాగినీ

---

కూర్చుండుటకుందగిన, యాసనము, భోః ప్రస్తూయతాం=ఓహోయి, ఆరంభింపుఁడు- అంతర్నాటకము - నాటకములో ఒక చిన్న నాటకము - భూతార్థవాదీ=నిజము చెప్పువాఁడు, యదిదం కిఞ్చిత్ ఉపనిబద్ధమ్=ఏయిదియొకటి - ప్రబంధము అనుట-రచింత నిబంధింపఁబడినదో - మేము నిబంధించినారమో - అనుట. అదియే అచ్చరలు ఆడఁబోవు అంతర్నాటకము. కార్యగౌరవాత్=(అ) పనియందలిగౌరవమువలన, అవధాతవ్యమ్=ఎచ్చరికతో పరికింపవలసినది. సాక్షాత్కృతధర్మాణః=సాక్షాత్కరించుకొనఁబడిన ధర్మములుగలవారు. తపోమహిమచేత కన్నులతో సొంతముగా చూచి ధర్మముయొక్క కలరూపెఱిఁగినవారు - కావున, న క్వచిత్ వ్యాహన్యన్తే = ఎటను భంగ మొందవు, అనభిశఙ్కనీయాని=వానియందు శంక వహింపఁగూడదు- దీనినే అరుంధతీవాక్యముగా భంగ్యంతరముగా మునుపును చెప్పినాఁడు మహాకవి. IV - ౧౯.

ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం
యే వ్యాహారా స్తేషు మా సంశయో భూత్

మశరణా మాసన్నప్రసవవేదనాం హతాశాః శ్వాపదా మాం అభిల
షన్తి. సాహం ఇదానీం మన్దభాగినీ భాగీరథ్యా మాత్మానం
నిక్షిపామి.]

లక్ష్మణః—(స్వగతం) కష్టం! బత! అన్యదేవ కిమపి!

సూత్రః—

శ్లో॥ విశ్వమ్భరాత్మజా దేవీ రాజ్ఞా త్యక్తా మహావనే,
ప్రాప్తప్రసవ మాత్మానం గఙ్గాదేవ్యాం విముఞ్చతి. ౭

(ఇతి నిష్క్రాన్తః.)

---

భద్రా హ్యేషాం వాచి లక్ష్మీ ర్నిషక్తా
నైతే వాచం విప్లుతార్థాం వదన్తి

అట్టిది తన నమ్మకము - దానిని అరుంధతియంతటియామెచేతను, రాము వంతటివానిచేతను పలికించి - లోకమునం బ్రతిష్ఠింపఁగోరుచున్నాఁడు. 'అమృత పారాణి పరోరజాంసి ప్రజ్ఞానాని' - ఉత్తరరామచరితయు అట్టిది అని గూఢము. అన్య దేవ కిమపి - ఇదేదో మఱియొకటియైనది! నాటక మనఁగా ఏనాటకమో అను కొంటిని. మాయొక్కయు సీతయొక్కయు కథగానే ఉన్నదే, ఇదేదో! భూతార్థము అన్నారు. సీత తన్ను గంగలో వైచికొనుట! అహో ఎంతటి ఘోరమైన విధి!

శ్లో. ౭. విశ్వమ్భరేతి—విశ్వమ్భరాత్మజా = భూదేవికూఁతురు, సీత, దేవీ = రామునిరాణి, రాజ్ఞా=రాజుచేత, మహావనే=మహారణ్యమందు, త్యక్తా=విడువఁబడినది, ప్రాప్తప్రసవం=కాన్పు (వేళ, వేదనలు) వచ్చిన, ఆత్మానం=తన్ను, గఙ్గాదేవ్యాం= పవిత్రమైనగంగానదియందు, విముఞ్చతి=వైచుకొనుచున్నది.

రాజాజ్ఞచే పేరడవిలో విడిచిపెట్టఁబడినదే భూదేవికూఁతురు రామునిరాణి - ఆమె తనకు ప్రసవమురాఁగా, (ఆవేదనలకు తాళలేక) గంగలో దూఁకినది. ఇతి నిష్క్రాన్తః=అని నిష్క్రమించును. ఈయంతర్నాటికకు ఇది సూత్రధారుఁడు కావించిన ప్రస్తావన - సర్వము భూతార్థమని తొలుతనే చెప్పఁబడెను. గంగలో సీత దూఁకుచున్నది అని వినఁగానే రామునికి శోకవేగమున ఉన్మాదము కలిగినది. ఎదుట జరుగుచున్నది నాటకమనుట మఱచి వాపోవుచున్నాఁడు - క్షణం అపేక్షస్వ =

రామః—(సావేగం) హా దేవి! హా దేవి! క్షణ మవేక్షస్వ.

లక్ష్మణః—ఆర్య, నాటక మిదం.

రామః—హా దేవి! దణ్డకారణ్యావాసప్రియసఖి, ఏష తే రామాత్ దైవదుర్విపాకః.

లక్ష్మణః—ఆర్య, ఆశ్వస్య, దృశ్యతాం ప్రబన్ధార్థః.

రామః—ఏష సజ్జోఽస్మి వజ్రమయః

(తతః ప్రవిశ త్యుత్సఙ్గనిహిత్త్రైకైకదారకాభ్యాం భాగీరథీ పృథివీభ్యా మవలమ్బితా సీతా.)

రామః—వత్స, లక్ష్మణ! అసంవిజ్ఞాతపదనిబన్ధనే అన్ధతమసీవ ప్రవిశామి; ధారయ మామ్.

దేవ్యౌ—

శ్లో॥ సమాశ్వసిహి కల్యాణి, దిష్ట్యా! వైదేహి వర్ధసే,!
అన్తర్జలం ప్రసూతాసి రఘువంశధరౌ సుతౌ. 3

---

క్షణము చేపుము-ఎందులకు? ఆమెను అపుటకా? కాదు తానుకూడ పడుటకు. రామాత్=రామునివలన-నీనమ్మినపుట్టినవానివలన-కేవలము ఆతనికొసమే అనుట. అడవులకైనను, తన్నెడబాసియుండలేక, కూడవచ్చిన ప్రియసఖి. సజ్జః అస్మి=సిద్ధముగా ఉన్నాను, 'వజ్రమయః'-తాను దానిని నిలుప లేడు-అది వాల్మీకి సమకూర్చునది. అసంవిజ్ఞాత పదనిబన్ధనే=అడుగిడ దొరకనిదైన-ఎట్లడుగిడుటకును ఏమియు తెలియరాని-అగపడని, అన్ధతమసి=చిమ్మచీకటిలో, ధారయ=పట్టుకొమ్ము-ఇట్టిదట్టిదని చెప్పరాని మానసికావస్థ! వీరు తనబిడ్డలే! దుఃఖము, ఆనందము సయితమును.

శ్లో. 3. సమాశ్వసిహీతి-కల్యాణి-మంగళాస్పదురాలా, (ఆశీర్గర్భము సంబోధన-గంగలోపడినను శుభమే పొందినట్టిది.) సమాశ్వసిహి=ఊఱడిల్లుము. దిష్ట్యా=సంతోషము! నీపుణ్యముచేత, వైదేహి=జానకి, వర్ధసే=శుభమందుచున్నావు! అన్తర్జలం=నీటిలోపల. రఘువంశధరౌ సుతౌ=రఘువంశమును నిలుపువారైన యిరువురు-అమడ-కొడుకులను, ప్రసూతా అసి=కన్నదానవైతివి-కంటివి.

సీతా—(సమాశ్వస్య) దిట్ఠిఆ దారఏ పసూదమ్హి. హా! అజ్జ ఉత్త! [దిష్ట్యా దారకౌ ప్రసూతాస్మి, హా ఆర్యపుత్ర!]

(ఇతి మూర్ఛతి)

లక్ష్మణః—(పాదయో ర్నిపత్య) ఆర్య, దిష్ట్యా! వర్ధామహే! కల్యాణ ప్రరోహో రఘువంశః! (విలోక్య) హాహా! కథమ్! క్షుభిత బాష్పోత్పీడనిర్భరః ప్రముగ్ధ ఏవార్యః. (వీజయతి)

దేవ్యౌ—వత్సే, సమాశ్వసిహి సమాశ్వసిహి.

సీతా—(సమాశ్వస్య) భఅవదీఓ, కా తుమ్హే? [భగవత్యౌ, కే యువామ్?]

---

కల్యాణీ, వైదేహీ, ఊఁఱడిల్లుము. ఊఁఱడిల్లుము. నీదే పుణ్యము! నీదే అభ్యుదయము! నీటిలోపల రఘువంశకరులగు అమడకొడుకులను కంటివి.

దేహాంతమునకై, బాధలు తీరుటకై సీత గంగలో పడినది. మఱి యామె మహిమ అట్టిదో-(పాతివ్రత్యమహిమగదా!)గంగాదేవియు భూదేవియు ఆమెను మునిఁగిపోనీయక హాయిగా కాన్పు కావించినారు; ఊఁఱడించుచున్నారు. వీరుగో నీ బిడ్డలు అనుచున్నారు. దీనినే మునుపు మహాకవి చెప్పినది III - 3.

ఈదృశానాం విపాకోఽపి జాయతే పరమాద్భుతః
యత్రోపకరణీభావ మాయా త్యేవంవిధో జనః.

ఈయెదుట నగపడుచుండువారు - పృథ్వీ భాగీరథి సీత వేసములు దాల్చిన యచ్చరలు - అసలువారు కారు. దారకౌ ప్రసూతాస్మి - ఇరువురు దారకులం గంటిని - అన్నతలంపుతో, దీనిం గాంచ ఆర్యపుత్త్రుడు చెంత లేడుగదా, ఆయన చూడని వీరేల అను తలంపు రాఁగా, దుఃఖము దుర్భరమై సీతకు మూర్ఛవచ్చినది. - ఇదెల్ల వాల్మీకి నాటకరచనలోనిది. దిష్ట్యా! వర్ధామహే!=సంతోషము! వర్ధిల్లుచున్నాము! తాను అట్లు సీతను డించివచ్చినతర్వాత ఇట్లెల్ల జరిగినది అని ఆటలో చూచి, వాల్మీకిభగవంతుఁడు భూతార్థవాక్కు గావున లక్ష్మణుఁడును రాముఁడును ఎఱింగి, నమ్మి, వారివారికి కలిగిన భావముల పొందుచున్నారు. లక్ష్మణుఁడు సంతోషించి రామపాదములం ద్రెళ్లినాఁడు, రాముఁడు దుఃఖముపొంగి మూర్ఛిల్లినాఁడు. క్షుభిత బాష్పోత్పీడనిర్భరః=చిత్తము కలఁగి పొరలిన కన్నీటి ముత్తముచే ఓపనివాఁడై,

పృథివీ—ఇయం తే శ్వశురకులదేవతా భాగీరథీ,

సీతా—భఅవది, ణమో దే. [భగవతి, నమస్తే.]

భాగీ—చారిత్రోచితాం కల్యాణసంపద మధిగచ్ఛ.

లక్ష్మణః—అనుగృహీతా స్స్మః.

భాగీ—ఇయం తే జననీ విశ్వమ్భరా.

సీతా—హా అమ్బ, ఏరిసీ అహం తుఏ దిట్టా. [అమ్బ, ఈదృశ్యహం త్వయా దృష్టా.]

పృథివీ—ఏహి పుత్త్రి. (ఉభే అన్యోన్యం ఆలిఙ్గ్య మూర్ఛతః)

లక్ష్మణః—(సహర్షం,) దిష్ట్యా! గఙ్గాపృథివీభ్యా మభ్యుపపన్నా ఆర్యా.

రామః—(దృష్ట్వా) కరుణతరం ఖ ల్వేత ద్వర్త తే.

భాగీ—విశ్వమ్భరాపి నామ వ్యథత ఇతి, జిత మపత్యస్నేహేన. యద్వా. సర్వసాధారణో హ్యేష మోహగ్రన్థి రన్తశ్చర శ్చేతనావతా మనుపప్లవ స్సంసారతన్తుశ్చ. వత్సే! వైదేహి! భూతధాత్రి! సమాశ్వసితమ్. సమాశ్వసితమ్.

---

శ్వశుర కులదేవతా=మామ గారి కులదేవత, చారిత్రోపచితాం=నడువడిచే పెంపొందిన-ఉచితాం-అనియు పాఠము-నడువడికి తగిన అనుట. హా అమ్బ. ఈదృశీ అహం త్వయా దృష్టా=హా అమ్మా, ఇట్టిదానను గా నేను నీచే చూడఁబడితిని! చారిత్రదోష కారణముచే వివాసితనై, దిక్కుమాలిన యీ స్థితిలో నున్న నన్ను నీవు చూచితివే-నీ కంటఁబడితినే అని కూఁతునకు మూర్ఛపర్యంతమయిన దుఃఖము. అట్లే తల్లికిని. ఒండొరుల కౌఁగలించుకొని మూర్ఛిల్లుదురు. విశ్వమ్భరా అపి=విశ్వమునంతయు మోచునది-సర్వంసహ-అట్టి యోర్పుగలది, జితం అపత్యస్నేహేన=బిడ్డలకైన వాత్సల్యము జయించినది-అది యెట్టి యోర్పునుంగూడ లోఁగొనునది-అనుట. సర్వసాధారణః ఏషః చేతనావతాం సంసారతన్తుః=చేతనగలవారి కెల్ల నుండునది ఇదియొక సంసార తంతువు, మోహగ్రన్థిః=మోహపు ముడిలోడిది, అనుపప్లవః అన్తశ్చరః=

పృథివీ— (ఆశ్వస్య) సీతాం ప్రసూయ కథ మాశ్వసిమి?

శ్లో॥ ఏకశ్చిరం రాక్షసమధ్యవాస
స్త్యాగో ద్వితీయశ్చ సుదుస్సహోఽస్యాః.

భాగీ— కో నామ పాకాభిముఖస్య జన్తు
ర్ద్వారాణి దైవస్య పిధాతు మీష్టే? ర

పృథివీ—భాగీరథి, సదృశ ముక్తమ్. యుక్త మేత ద్వా రామ
భద్రస్య?

శ్లో॥ న ప్రమాణీకృతః పాణి ర్బాల్యే బాలేన పీడితః,
నాహం న జనకో నాగ్ని ర్నానువృత్తి ర్న సన్తతిః. ౫

---

నాశములేక చిత్తమున నుండునది. సీతాంప్రసూయ = సీతనుకని - అట్టి యదృష్ట హీనను - లోకాతీతమైన కష్టముల వెంబడి కష్టములు పైకొన్నట్టిదానిని. పృథ్వియు భాగీరథియు ఒకరు సీతతట్టును ఒకరు రామునితట్టునుంగా వాదులాడుకొందురు.

శ్లో. ర. ఏకేతి-అస్యాః=ఈమెకు, చిరం=దీర్ఘకాలము - ఒక్క సంవత్సరము రాక్షసమధ్యవాసః=రక్కసుల నడుమ ఉనికి, ఏకః=ఒకటి, సుదుస్సహః=మిక్కిలియు ఓర్వరానిదైన, త్యాగః=విడిచిపెట్టుట, ద్వితీయః చ=రెండవదియు. కో నామ జన్తుః=ఏప్రాణి, పాకాభిముఖస్య=పండఁదొడంగిన, దైవస్య=విధికి, ద్వారాణి పిధాతుం=వాకిళ్లను మూయుటకు, ఈష్టే=సమర్థుఁడగును?

ఈమెకు చాలదినాలు ఆ రక్కసు నింట నుండుట అది యొకటి. (భర్త) విడిచిపెట్టుట, కడు ఓర్వరానిది ఇది యొకటి. (అయినను ఇవి ఎవరు చేసినారు?) ఆమెకు దైవము పండఁబారినది. అంతే. దానిని రానీక ఎవఁడు ద్వారములు మూయఁగలఁడు? ఇది మాలతియందును గలదు. (X - 13)

ఏషా ప్రవాసం కథమ ప్యతీత్య। యాతా పునః సంశయ మన్యదేవ.
కో నామ పాకాభిముఖస్య జన్తు। ర్ద్వారాణి దైవస్య పిధాతు మీష్టే.

సదృశం ఉక్తమ్ - సరిగా చెప్పితివి. - దైవముమీఁద పెట్టితివి, సరే కాని - రామభద్రుఁడుమాత్రము ఇట్లిట్లు చేయుట యుక్తమా - అని మరల అడుగుచున్నది - అల్లుని తప్పిదములంగూర్చి - ఎట్లన.

శ్లో. ౫. నప్రమాణీకృత ఇతి - బాల్యే=పసితనమున-(పెద్దలు అన్నియు విచారించి చేసిన పెండ్లియందు), బాలేన=బాలుఁడుగా నున్న తనచేత, పీడితః=(మంత్ర

సీతా—హా అజ్జఉత్తం సుమరావిదమ్హి. [హా! ఆర్యపుత్రం స్మారితాస్మి.]

పృథివీ—ఆః! క స్తవార్యపుత్రః!

సీతా—(సలజ్జాస్రం) జహా వా అంబా భణాది. [యథా వా అమ్బా భణతి.]

రామః—అమ్బ పృథివి ఈదృశోఽస్మి.

భాగీ—ప్రసీద, భగవతి, వసున్ధరే. శరీర మసి సంసారస్య. తత్కి మజానా నేవ జామాత్రే కుప్యసి?

---

పూర్వకముగా) గ్రహింపఁబడిన-('పాణిం గృహ్ణీష్వ పాణినా' అని మామగారు తన చేత నుంచిన), పాణిః=(సీత) చేయి, నప్రమాణీకృతః=ప్రమాణముగాఁ గొనఁబడలేదు-ఇట్లు ఇచ్చి కైకొనఁబడిన సీత, ఆ వివాహమంగళము అశిలము-నమ్మఁబడలేదు. అహం న=నేనును ప్రమాణముగాఁ గొనఁబడనైతిని-'తల్లిని చూచి బిడ్డ' అన్నారు-నాకూఁతురు అనియుచూడలేదు. 'దేవ యజన సంభూత' అనియేని అనుట. న జనకః=జనకుఁడును (వేదాలకెక్కినవాఁడు)..., అగ్నిః న=అగ్ని (శుద్ధికి ఏకాంతమగుదేవత,) అనువృత్తిః = అనుస్మృతి = అన్నియేండ్లు గృహిణిగా సహధర్మచారిణిగా, అడవికిని వీడక కూడవచ్చిన యీ యమ్మాయి తన్ను అనుసరించియున్నతీఱును, న సన్తతిః=తనకై తాల్చిన సీత గర్భమును-సంతానమును ఐనను ప్రమాణముగాఁ గొనఁడయ్యె.

ఇం దొకటియు మిక్కిలియు తాను నమ్మి గౌరవింపవలసినది. అట్లు చేయక దుడుకుగా తఱిమివేసినాఁడు—

ఆర్యపుత్త్రం స్మారితాస్మి=ఆర్యపుత్త్రుని స్మరింపఁజేసితివి-అని సీత యనఁగా పృథ్వి కోపము చేయుచున్నది-'నీకు ఆర్యపుత్త్రుఁ డెవరే!' అని-ఇంకను అతని స్మరణమా-అట్లు తఱిమినవానిని స్మరించుటయా! పృథివికి రామునిమీఁద, అల్లుని మీఁద అంతకోపముగా నున్నది-అతని పేరైనను ఎత్తఁగూడదు అని. యథా వా అమ్బా భణతి-అహో ఎంత వినయము! ఈదృశః అస్మి!=ఇట్టివాఁడనైతిని, నీచేత ఇట్టిమాట పడవలసినవాఁడను ఐతిని. ఉండియు లేనివాఁడనే ఐతిని! శరీరం అసి సంసారస్య = సంసారమునకు-సకలమగు ఐహిక వృత్తమునకు-దేహమగుదువు.

శ్లో॥ ఘోరం లోకే వితత మయశో; యా చ వహ్నౌ విశుద్ధి
ర్లఙ్కాద్వీపే, కథమివ జన స్తా మిహ శ్రద్దధాతు?
ఇక్ష్వాకూణాం కులధన మిదం య త్సమారాధనీయః
కృత్స్నో లోక; స్తదిహ విషమే కిం స వత్సః కరోతు? ౬

లక్ష్మణః—అవ్యాహతా న్తః ప్రకాశా హి దేవతాః భూతేషు. విశేషేణ గఙ్గా. తదేష తే ప్రణామాఞ్జలిః.

రామః—అమ్బ, అనువృత్త స్త్వయా భగీరథగృహే ప్రసాదః.

---

నీ వెఱుఁగనివారును నీ వెఱుఁగని సంగతియు ఇం దేదియు ఉండు నవకాశము లేదు. తత్ కిం (పా) అసంవిదానా ఇవ=మతి యేల ఎఱుఁగనిదానివలె.

శ్లో. ౬. ఘోరమితి—లోకే=జగమున, ఘోరం=భయంకరమగు, అయశః=అపకీర్తి. వితతమ్=వ్యాపించినది. లఙ్కాద్వీపే=లంకద్వీపములో_అంతదూరాన. వహ్నౌ=నిప్పునందు, యా చ విశుద్ధిః=జరిగిన ఏ పరీక్ష కలదో, తాం=దానిని, ఇహ=ఇచట, ఇంత దూరాన_జనః=మనుష్యుఁడు, కథం ఇవ శ్రద్దధాతు=ఎటువలె నమ్మును? కృత్స్నో లోకః=ఈలోకమందలి యెల్లజనులు, సమారాధనీయః=కొల్వఁబడవలసినవారు, సంతోషపెట్టఁబడవలసినవారు, (ఇతి) యత్=అనుట, ఇదం=ఇది, ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకు వంశమువారి కెల్లను, కులధనం=వంశముయొక్క ధనము_కావున చాల అక్కఱతో కాపాడుకొనవలసినది_అనుట, తత్=కావున, ఇహ విషమే=ఈ యిక్కట్టున, స వత్సః=ఆ యబ్బాయి, కిం కరోతు=ఏమి సేయును?

లోక మంతటను వ్యాపించినది ఘోరదుర్యశము. లంకలో వహ్నిశుద్ధి జరిగియుండలేదా అన్న, అంత దూరాన జరిగినదానిని ఇట మనుష్యుఁడు ఎవఁడు ఎట్లు నమ్మును? నమ్మకున్న నేమి అని యనుకొనుటకు, ప్రజానురంజనమే ఇక్ష్వాకులకు కులధనము, అక్కఱతో కాపాడుకొనవలసినది. ఇది గొప్ప యిక్కట్టుకదా. నీ వెఱిఁగినదే కదా_అందు అబ్బాయి రామభద్రుడు తాను ఏమి సేయఁగలఁడు?

భూతేషు (సకల) భూతములయెడను, అవ్యాహత అన్తః ప్రకాశాః=అడ్డములేని హృదయజ్ఞానముగలవారు_ఎల్లవారి తలంపును వారు చెప్పకయే, తామెఱుంగఁ జాలుదురు_అనుట_కావున సీతాత్యాగవిషయమున రామునిచిత్తవృత్తి

పృథివీ—దేవి, నిత్యం ప్రసన్నాస్మి వః, కిం త్వసా వాపాతదుస్సహః శోకావేగోఽపత్యస్య. న పునర్న జానామి సీతాస్నేహం రామభద్రస్య.

శ్లో॥ దహ్యామానేన మనసా దైవా ద్వత్సాం విహాయ సః
లోకోత్తరేణ సత్త్వేన ప్రజాపుణ్యైశ్చ జీవతి. 2

రామః—సకరుణా హి గురవో గర్భరూపేషు.

సీతా—(రుదతీ కృతాఞ్జలిః) ణేదు మం అత్తణో అంగేసు విలఅం అంబా. [నయతు మామాత్మనోఽఙ్గేషు విలయమమ్బా.]

---

తలంపు ఎట్టిదో భాగీరథి ఎఱుఁగును. ఆపాతదుస్సహః=వచ్చినరాకలోనే ఓర్వరానిది. న పునః నజానామి=ఎఱుంగని దాన కాను - ఇదియు పృథివియు దేవతలై మానుసుల మనసులోని తలంపును ఎఱుంగుటయే.

శ్లో. 2. దహ్యమానేనేతి - దైవాత్=భవితవ్యతవలన, యః=ఎవఁడు-అనఁగా అతఁడు - రామభద్రుఁడు - అనుట - వత్సాం=అమ్మాయిని - సీతను, విహాయ=వదలి, దహ్యమానేన=(అందువలననే) ఎరియుచున్నట్టి, మనసా=చిత్తముతో, లోకోత్తరేణ=లోకులనెల్ల మించిన - మఱెవరికిని లోకాన లేనట్టి, సత్త్వేన=తన లేఁకుల - ధైర్యముచేతను, ప్రజాపుణ్యైః చ = ప్రజలు చేసికొన్న పుణ్యములచేతను, జీవతి = బ్రతికియున్నాఁడు,

తలవ్రాలు అట్లు ఉన్నందున అమ్మాయిని విడిచిపెట్టినాఁడు కాని, అందులకై అనిమిసము మొదలుకొని చిత్తమున దుఃఖముతో కుములుచునే యున్నాఁడు. అతఁడు కాఁబట్టి బ్రతికియున్నాఁడు - ఏలన అతఁడట్టి సత్త్వసంపదకలవాఁడు. అంతియ కాక, 'రామరాజ్యము' అని ప్రసిద్ధిగన్న యాపాలనను అనుభవింపవలసిన గొప్ప పుణ్యములను అతని ప్రజలు చేసికొనియున్నారు. పృథ్వీదేవికిని రాముని దుఃఖమున జాలి కలిగినది, క్షమించినది.

గర్భరూపేషు=బిడ్డలందు, బిడ్డలవంటి వారియందు-కాదా 'అతిశయేన గర్భాః గర్భరూపాః' - మిక్కిలియు అనుఁగు బిడ్డలైన వారియందు - ఇట తనయందు అని తాత్పర్యము - అల్లుఁడుగా తాను ఆమెబిడ్డయే; అట్లే కొడుకుగానో మనుమఁడుగానో ఎట్లో భాగీరథికిని తాను బిడ్డయే: అట్లే సీతయును. కాదా బిడ్డలను మించిన వారు, విలయమ్ నయతు=అడఁగిపోవుటను పొందించునుగాక - ఇంత అవమానితనై

రామః—కి మన్య ద్బ్రవీతు?

భాగీ—శాన్తమ్! అవిలీనా వత్సరసహస్రం భూయాః.

పృథివీ—వత్సే, అవేక్షణీయౌ తే వత్సౌ.

సీతా—అణాహమ్హి, కింఏదేహిం? [అనాథాస్మి కింఏతాభ్యామ్]

రామః—హృదయ! వజ్ర మసి.

భాగీ—కథం! త్వం సనాథా, ప్యనాథా?

సీతా—కేరిసం మహ మందభాఇణీఏ సణాహత్తణం? [కీదృశం మమ మన్దభాగ్యాయాః సనాథత్వమ్?]

దేవ్యౌ—

శ్లో॥ జగన్మఙ్గళ మాత్మానం కథం త్వ మవమన్యసే?
అవయో రపి యత్సఙ్గా త్పవిత్రత్వం ప్రకృష్యతే. ౮

---

ఇఁక నేను బ్రతికియుండలేను - అనుట. శ్రీరామాయణమున అట్లే విలయమే పొందినది. భూమిలో. కింఅన్యత్ బ్రవీతు=(అంతకన్న) మఱియేమి చెప్పవగును; చెప్పవచ్చును? శాంతం - పాపము - అమంగళము శాంతించునుగాక! వత్సరసహస్రం=వేయేండ్లు - ఆకాలమున వేలయేండ్లు బ్రతుకుదురు; ఇందు అతిశయోక్తి లేదు. అది అత్తగారు చెప్పఁదగిన ఆశీస్సు. అమ్మయును చెప్పుచున్నది - అవేక్షణీయౌ తావత్ తే పుత్రౌ=నీపుత్రులను చూచుకొనవలయును (=నీపుత్రులు చూచుకొనఁబడవలయును.) అనాథాస్మి, కిమేతాభ్యాం - కాన్పుకాఁగానే కూడ 'ఆర్యపుత్ర' అని తలంచుకొన్నది, ఆయన లేకపోయెనే అని. హృదయ, వజ్రం అసి=హృదయమా, వజ్రమవు సుమా. నాథుఁడు, తా నుండియు సీత అట్లు అనవలసి, తలంచుకొనవలసి, వచ్చినదే - సీతకు అట్టి నిర్వేదము కలిగినదే - ఆమాట తన చెవింబడినను గుండె వ్రీలకున్నదే! కథం !=ఏమి! త్వం సనాథా=నీవు సనాథవే!, అప్యనాథా? - అనాథవా? (ఎట్లు?)

శ్లో. ౮. జగదితి - జగన్మఙ్గళం = జగములకెల్ల మంగళము (కూర్చుదానవు) ఐన, ఆత్మానం=నిన్ను, త్వం=నీవు, కథం అవమన్యసే=ఎట్లు అవమానించుకొందువు? యత్ సఙ్గాత్=ఎవతెయొక్క - నీయొక్క అనుట - కూటమివలన, అవయోః అపి=మాకు సైతము, పవిత్రత్వం=పరిశుద్ధి, ప్రకృష్యతే=హెచ్చుచున్నది.

లక్ష్మణః—ఆర్య, శ్రూయతామ్.

రామః—శృణోతు, లోకః.

(నేపథ్యే కలకలః.)

రామః—అద్భుతతరం కిమపి!

సీతా—కింతి ఆబద్ధకలకలం పజ్జలిదం సఅలం అంతరిక్ఖమ్!

[కిమి త్యాబద్ధ కలకలం ప్రజ్వలితం సకల మన్తరిక్షమ్!]

దేవ్యౌ—జ్ఞాతమ్.

శ్లో॥ భృశాశ్వః కౌశికో రామ ఇతి యేషాం గురుక్రమః.

ఆవిర్భవన్తి తాన్యేవ శస్త్రాణి సహ జృమ్భకైః. ౯

---

జగముల కెల్ల మంగళ మొసంగు దానవే, నీవు, నిన్ను నీవే ఎగ్గించు(=అవమానించు) కొనెదవేమి? జగములకనుట యేమి! మాకు - దేవతలకు - సయితము నీకూటమివలన పవిత్రత హెచ్చునే.

భాగీరథియు భూదేవియు ఇట్లనుచున్నారు. మును పే అరుంధతి 'విశుద్ధేరుత్కర్ష స్త్వయి తు మమ భక్తిం జనయతి' - IV - ౯ అని చెప్పెను. 'ఉత్పత్తి పరిపూతాయాః' I - ౬ అని రాముఁడు స్వయముగా పలికెను. ఇట్లు సీతను భవభూతి సాక్షాల్లక్ష్మిగానే ఆరాధించుచున్నాఁడు. ఈ కూడియున్న చూపఱయొకుట ఈ దేవత లిట్లు సీతపరిశుద్ధింగూర్చి పలుకుచున్నారు. వాల్మీకి నాటకకర్త భూతార్థవాక్యం. ఈ దేవతలు మనుష్యుల మనసులోని తలంపులను సైత మెఱుంగువారు. కావున సీతాపరిశుద్ధి లోకమునకు ప్రత్యక్షముగా రుజువుచేయఁబడుచున్నది. కావుననే రాముఁ డనుట - 'శృణోతు లోకః' అని - సందేహపడినది నేను కాదు, నాకు ఆరాధనీయులైన లోకులు. వారు విని తృప్తిపడుదురుగాక - సందేహము వీడుదురుగాక - కిం ఇతి ఆబద్ధకలకలం ప్రజ్వలితం సకలం అన్తరిక్షం - ఏమిది గొల్లిడుచు అంతరిక్ష మెల్ల ప్రజ్వలించుచున్నది! జ్ఞాతమ్ - దేవతలు గావున వారెఱుంగుదురు.

శ్లో. ౯. భృశాశ్వ ఇతి - భృశాశ్వః = భృశాశ్వమునియు, కౌశికః = విశ్వామిత్రమహామునియు, రామః=రాముఁడును, ఇతి=అని, యేషాం=వేనికి, గురుక్రమః= గురువులవరుసయో, సంప్రదాయమో, తాన్యేవ శస్త్రాణి=ఆశస్త్రములే, జృమ్భకైః సహ - కలకల మొరయుటలు పళపళ మెఱయుటలు మొదలగు జృంభకముల (=వికాసముల)తో (డను అడంగుటలతోడను,) ఆవిర్భవన్తి=(తమంతట) వెలువడుచున్నవి.

(నేపథ్యే)

శ్లో॥ దేవి సీతే నమస్తేఽస్తు, గతిర్నః పుత్రకా హి తే,
ఆలేఖ్యదర్శనే దేవో యథాహ రఘునన్దనః. ౧౦

సీతా—దిట్ఠిఆ అత్థ దేవదాఓ ఫ్ఫురంది. [దిష్ట్యా అస్త్ర దేవతాః స్ఫురన్తి!]

---

జృంభకాస్త్రములు కలవే, భృశాశ్వుఁడు, కౌశికుఁడు రాముఁడును అని గురుపరంపరగలవి, అవి కళకళములతోను పెళపెళలతోను - వికసనములు (అడంగుటలు) కలిగి ఆవిర్భవించుచున్నవి.

ప్రయోగించినపుడు జృంభకములు అంతలో వెలుగులు చల్లును, అంతలో చీకట్లు కూర్చును పటుచునని కవి వర్ణించినాఁడు - జృంభకముల కార్యక్రమము అట్టిది అని కవిభావము - కావున 'జృమ్భకైః సహ' - వికసించుటలతోకూడ - అనుట. వానిచే వరుసగా మూసలించి చీకట్లు పర్వించుటయు ఊహింపఁదగును - అధ్యాహరించుకొనఁదగును. 'భృశాశ్వతనయాన్ రామ భాస్వరాన్ కామరూపిణః ప్రతీచ్ఛ మమ భద్రం తే పాత్రభూతోఽసి రాఘవ' రామా. బాల. xxviii - ౧౦. అన్నయెడ పెక్కు అస్త్రములు చెప్పఁబడినవి - అందు సంహారోపదేశక్రమమున 'జృమ్భకం సర్వనాభం చ సంతానవరణౌ తథా' - ౯ - అని వానిలో 'జృంభకము' ఒకటి. ఇట ఉ. రా. చ. న అస్త్రము లన్నింటికి జృంభకాస్త్రములు అన్న పేరు వ్యవహరింపఁబడినది. మఱియు జృంభకములు అని రామాయణమున చెప్పఁబడినవి, అంతియకాని, వాని కార్యక్రమమును 'వ్యతికర ఇవ భీమః' 'పాతాళోదరకుఞ్జ' ఇత్యాది శ్లోకోక్త క్రమములచేత - (v - 13, 14) భవభూతి అట్లు భావించినాఁడు. అది 'జృంభక' అనుదానిమీఁద భవభూతి వ్యాఖ్య.

శ్లో. ౧౦. దేవీతి - దేవి సీతే=సీతాదేవీ, తే నమః అస్తు=నీకు నమస్కారమగుగాక. తే పుత్రకాః=నీ యిరువురు కొమాళ్ళును, నః=మాకు, గతిః హి=దిక్కుసుమీ! యథా=ఎట్లనఁగా, అట్టుగదా - అనుట, ఆలేఖ్యదర్శనే = చిత్రదర్శన సమయమందు, దేవః రఘునన్దనః - రామచంద్ర మహారాజు, ఆహ=పలికెను.

సీతాదేవీ, నీకు నమస్కారమమ్మ. నీ కొమాళ్ళు గదా మాకు గతి. అట్లు మహారాజు రఘురాముఁడు చిత్రదర్శన వేళలో ఆనతిచ్చెను గదా.

విమువులకుం కెందవలసినవి. ఇపుడు వారు అప్పుడె పుట్టిన కసుఁగందులు గావున వారి తల్లికి సీతాదేవికి తమ్ము ఎఱుకపఱుచుకొనుచున్నారు, అస్త్రదేవతలు.

లక్ష్మణ—ఉక్తమాసీ దార్యేణ, సర్వథేదానీం త్వాంప్ర
సూతి ముపస్థాస్యన్తీతి,

దేవ్యౌ.—

శ్లో॥ నమో వః పరమాస్త్రేభ్యో, ధన్యాస్స్మో వః పరిగ్రహాత్.
అనుధ్యాతై రుపేతవ్యం వత్సయో, ర్భద్ర మస్తు వః. ౧౧

రామః—

శ్లో॥ క్షుభితాః కామపి దశాం కుర్వన్తి మమ సాంప్రతమ్
విస్మయానందసందర్భజర్జరాః కరుణోర్మయః. ౧౨

తమ గురువగు రాముని మాట తమకు అట్లు దాఁటరానిదైనది. వాఁడు రాముఁడు ఆ మాటను అలవోకగా చెప్పినాఁడు - ఐనను 'వాచ మర్థోనుధావతి' న్యాయమున దేవుఁడైన రాముని మాటవెంట అర్థమట్లు పఱచివచ్చినది. ప్రసన్నమైనవో లేదో, సీతకు, అస్త్రములప్పుడే తోఁచినవి.

శ్లో. ౧౧. నమ ఇతి—పరమాస్త్రేభ్యః వః = పరమాస్త్రములైన మీకు, నమః=నమస్కారము. వః పరిగ్రహాత్ = మీ చేపట్టుటవలన - మీరు చేపట్టుటవలన, ధన్యాః స్మః = కృతార్థుల మైతిమి. అనుధ్యాతైః = తలంపబడినవారు కాగానే = వత్సయోః=బిడ్డలకడకు, ఉపేతవ్యం=రావలసినది - వః భద్రం అస్తు = మీకు మేలగుగాక.

పరమాస్త్రములారా, మీకు నమస్కారము. మీరు చేపట్టుటచే కృతార్థుల మైతిమి. (ఏలన, దాన నిసుగులు రామతుల్యులైనారు.) ఎప్పుడు మనసులో తలంచుకొనఁబడుదురో, అప్పుడే మీరు ఈ బిడ్డలకడకు రావలసినది.

శ్లో. ౧౨. క్షుభితా ఇతి - కరుణోర్మయః = దుఃఖంపుటలలు, విస్మయ ఆనన్ద సందర్భజర్జరాః=ఆశ్చర్యముయొక్కయు ఆనందముయొక్కయు కూడికచేత సడలిపోయినవై, క్షుభితాః = మిక్కిలి అకులపాటుపొంది, సాంప్రతం = ఇపుడు, మమ కాం అపి దశాం=నాకు ఏమో చెప్పనలవికాని దశను, కుర్వన్తి=కలిగించుచున్నవి.

లేచుచున్న నా దుఃఖపుటలలు ఈ యాశ్చర్యములను చూచిన యానందమున సడలిపోయినవి - అకులపాటు చెందినవి. దానిచే నాకు ఇపుడు ఇట్టిదని చెప్పనలవికాని దశ కలిగినది.

దేవ్యౌ—మోదస్వ వత్సే, రామభద్రతుల్యౌ పుత్రా విదానీం సంవృత్తౌ.

సీతా—భఅవఈఓ కో ఏదాణం ఖత్తిఓచిదం కమ్మం కరిస్సది? [భగవత్యాః క ఏతయోః క్షత్రియోచితం కర్మ కరిష్యతి?]

రామః—

శ్లో॥ ఏషాం వసిష్ఠగుప్తానాం రఘూణాం వంశవర్ధినీ.
కష్టం! సీతాపి సుతయోస్సంస్కర్తారం న విన్దతి! ౧౩

భాగీ—పుత్త్రి, కిం త వానయా చిన్తయా? ఏతౌ హి వత్సౌ స్తన్యత్యాగాత్పరేణ భగవతో వాల్మీకే రర్పయిష్యామి.

---

ఇది ఆ దుఃఖాతిశయము ఇట్టిదని తన మనసునకు తెచ్చుకొను ప్రయత్నము. భావశబలతకు ఇది మంచి యుదాహరణము.

క్షత్త్రియోచితంకర్మ - క్షత్త్రియులకు సరియైన జాతకర్మ, నామకరణము - మొదలగు సంస్కారములు. సీతపలికిన యీ మాటను వినఁగా తాను ఉండియు సీతకు కల్గిన ఆ దిక్కుమాలినతనమునకు రాముఁడు దుఃఖించుచున్నాఁడు —

శ్లో. ౧౩. ఏషాంఇతి—వసిష్ఠగుప్తానాం = వసిష్ఠునిచేత పాలింపఁబడినట్టి, ఏషాంరఘూణాం=ఈ రఘువులయొక్క, వంశవర్ధినీ - వంశమునకు సకలాభ్యుదయములు కూర్చునదే (ఐన,) సీతా అపి=సీతయును, సుతయోః=బిడ్డలకు, సంస్కర్తారం=సంస్కారములు సేయువానిని, న విన్దతి = పొందకున్నది - కష్టం=కటా! - ఈ దశను నేను కంటితో ఎట్లు కాంతు నబ్బా! అనుట.

వసిష్ఠుఁడు అన్ని సంస్కారములు సేయను కులగురువు. రఘువుల వంశకరు లను తా నిపుడు కన్నది. వారిచే వంశవర్ధన మెట్లన సీత జ్యేష్ఠునిభార్య యగుటం బట్టి. ఐనను సీత వీరికి సంస్కర్తకు దిక్కు లేదే అనుచున్నదే! సంస్కర్తను పడయఁజాలకున్నదే. ఆ మాటను నే నెట్లు విందును! ఆ దశను నే నెట్లు కందును!

కిం త వానయా చిన్తయా - ఈ చింత నీకేల? భయపడకు, అదెల్ల మేము విచారించుకొందుము అనుట, రాముఁడు మాకు చెప్పినమాటను మేము జరిపెదము.

ఇదెల్ల నాటకవస్తువని రాముఁడు ఎఱుఁగును. వాల్మీకి భూతార్థవాక్కు ఆడించుచున్నాఁడు. దానిం గాంచ తన్ను రమ్మని ఇక్కడ కూర్చుండఁ బెట్టినాఁడు స్తన్యత్యాగాత్ పరేణ=పాలువిడిచిన తర్వాత—

శ్లో॥ యథా వసిష్ఠాఙ్గిరసా వృషీ ప్రాచేతసస్తథా,
జనకానాం రఘూణాం చ వంశయో రుభయో ర్గురుః. ౧౪

రామః—సువిచిన్తితం భగవత్యా.

లక్ష్మణః—ఆర్య సత్యం విజ్ఞాపయామి. తైస్తై రుపాయై ర్వత్సౌ కుశలవా వుత్ప్రేక్షే.

శ్లో॥ ఏతౌ హి జన్మసిద్ధాస్త్రౌ ప్రాప్తప్రాచేతసా వుభౌ
ఆర్యతుల్యాకృతీ వీరౌ, వయసా ద్వాదశాబ్దకౌ. ౧౫

---

శ్లో. ౧౪. యథేతి—వసిష్ఠాఙ్గిరసౌ=వసిష్ఠుఁడును, శతానందుఁడును - రఘుపురోహితుఁడును జనకపురోహితుఁడును. అగు, ఋషీయథా=ఇరువురు ఋషులును ఎట్లో, తథా=అట్లే, జనకానాం రఘూణాం చ ఉభయోః వంశయోః=జనకులదియు రఘువులదియు నగు ఇరువంశములకును, ప్రాచేతసః=వాల్మీకి, గురుః=గురువు.

జనకరఘువంశములు రెంటికిని వసిష్ఠ గౌతమమహర్షులు ఎట్లు (గురువులో) అట్లే వాల్మీకియు గురువుగదా!

అమ్మ చెప్పినదానిని అత్తగారును సరి యని రూఢిసేయుచున్నది.

సువిచిన్తితం=చక్కఁగా ఆలోచింపఁబడినది. ఉపాయైః - (ఎటువంటఁదగిన) గుర్తులచేత - వత్సౌ కుశలవౌ ఉత్ప్రేక్షే - ఈ శిశువులు కుశలవులని ఊహించెదను. ఉపాయములనే పేర్కొనుచున్నాఁడు.

శ్లో. ౧౫. ఏతావితి—ఏతౌ ఉభౌ హి - వీరిరువురును - అరయఁగా, జన్మసిద్ధాస్త్రౌ=పుట్టుకతోఁగూడనే వచ్చిన యస్త్రములు గలవారు; ప్రాప్తప్రాచేతసౌ=వాల్మీకిని చేరినవారు, ఆర్యతుల్యాకృతీ=అన్నవైన నీరూపముగలవారు, వీరౌ=వీరులు వయసా=వయసుంబట్టి చూడఁగా, ద్వాదశాబ్దకౌ=పండ్రెండేండ్లవారు.

వీరును జన్మచేతనే జృంభకాస్త్రములు సిద్ధించిన వారుగా నున్నారు; ఇరువురును వాల్మీకియంతేవాసులు. రూపమున నీకు సమానులుగా నున్నారు. గొప్ప వీరులుగా నున్నారు. పండ్రెండేండ్ల వయసుకలిగియు నున్నారు.

ఆర్యతుల్యాకృతీ - వారిని చూచినప్పటినుండి వారి రామునిపోలిక, లక్ష్మణునికి చిత్తమున నాటుకొనియున్నది,

రామః — ఇమౌ వత్సౌ వీక్ష్య వాహం పరిప్లవమాన హృదయః సంప్రతి ముగ్ధోఽస్మి.

పృథివీ — ఏహి పుత్రి, పవిత్రీకురు రసాతలమ్

రామః — హా ప్రియే లోకాన్తరం గతాసి!

సీతా — ణేదు మం అత్తణో అంగేసు విలఅం అంబా, ణ సహిస్సం అణుహావిదుం జీవలోఅస్స పరివత్తమ్. [నయతు మాం మాత్మనోఽఙ్గేషు విలయ మమ్బా, న సహిష్యేఽనుభవితుం జీవలోకస్య పరివర్తనమ్]

రామః — కి ముత్తరం స్యాత్ ?

పృథివీ — వత్సే మన్నియోగతః స్తన్యత్యాగం యావ త్పుత్రయో రవేక్షస్వ, పరేణ తు తే యథా రోచతే తథా కరిష్యసి.

భాగీ — ఏవం. నామ (నిష్క్రాన్తే దేవ్యౌ, సీతా చ.)

---

వత్సావితి - ఈ బాలురే వారని; పరిప్లవమాన హృదయః=(ఆనందములో) తేలిపోవుచున్న హృదయముగలవాఁడనై, ముగ్ధోఽస్మి=మోహ మొందుచున్నాను, ఏహి వత్సే=రావే పట్టీ, రసాతలం=పాతాళమును. లోకాన్తరం గతా అసి= లోకాంతరమున కేఁగితివి! నయతు...విలయం అమ్బా=అమ్మ విలయ మొందించును గాక. జీవలోకపరివర్తనం=జీవలోకపు మార్పును. రాముఁడు లేక రాణివాసము లేక ఏలుఁబడు పాలయిపోయి - దిక్కుమాలిన శిశువులు కలిగి - ఇట్లెల్ల నుండుట. ఇదెల్ల నే నోర్వజాలను. రాముని కొడుకులకు తేరకు ధర్మానకు ఎవరో సంస్కార ములుసేయుట నేనుచూచి ఓర్వజాలను. 'కి ముత్తరం స్యాత్' - రతి, అభిలాష కలిగిన ఆ జవా బేమగునో అని తల్లడిలుట. తే యథా రోచతే తథా కరిష్యసి - నీ కెట్లు ఇష్టమగునో అట్లు చేయుదువు. అని ఒకపాటి 'విలయ మునకు' అంగీకారమే భూదేవి పలికినది. భాగీరథియు 'ఏవం నామ = అది సరి' - అని అంగీకారమే పలికినది. అందఱు నిష్క్రమించినారు - ఆట ముగిసినది. ఇటు తర్వాత సీతకు విలయము పర్యవసాన మని నిష్కృష్టార్థము తేలినది.

రామః—కథమ్! విలయ ఏవ వై దేహ్యాః సమ్పన్నః! హా దేవి! దణ్డకారణ్యవాస ప్రియసఖి! హా చారిత్ర దేవతే! లోకాన్తరం పర్య వసితాసి!

(ఇతి మూర్ఛతి)

లక్ష్మణః—భగవన్ వాల్మీకే, పరిత్రాయస్వ. పరిత్రాయస్వ, ఏష కిల తే కావ్యార్థః?

(నేపథ్యే)

అపనీయతా మాతోద్యం, భో భో సజఙ్గమస్థావరాః ప్రాణ భృతో మర్త్యామర్త్యాః, పశ్య న్త్విదానీం భగవతా వాల్మీకినా అను జ్ఞాతం పవిత్ర మాశ్చర్యమ్!

లక్ష్మణ—(విలోక్య)

శ్లో॥ మన్థాదివ క్షుభ్యతి గాఙ్గ మమ్భో
వ్యాప్తం చ దేవర్షిభి రన్తరిక్షమ్,
ఆశ్చర్య మార్యా సహ దేవతాభ్యాం
గఙ్గామహీభ్యాం సలిలా దుదేతి. ౧౬

---

రాముఁడు పలు తెఱంగుల వాపోయి, దుఃఖాతిరేకమున మూర్ఛిల్లినాఁడు. ఇదెల్ల వాల్మీకి పన్నకముగదా, కావున లక్ష్మణుఁడు వాల్మీకిం దలఁచుకొని రక్షణ వేడుకొనుచున్నాఁడు. చారిత్రదేవతే-మంచిశీలమే దేవతగా రూపెత్తినదానా, శీలమునకు అధిష్ఠానదేవతా, ఆతోద్యమ్-పాట, వాద్యము-మొదలైనవి. ఆట విరామమున అవి మఱియుం బెల్లుగా మ్రోఁగుచున్నవి. ఎవరేని మాటలాడు మాటలు వినఁబడవు. అందులకయ్యును ఆటముగిసినందులకయ్యును వానిని మాను మనుట. పవిత్రం ఆశ్చర్యం=పవిత్రమగు ఆశ్చర్యమును.

శ్లో. ౧౬. మన్థాత్ ఇతి—మన్థాత్ ఇవ=చిలుకుట వలనంబోలె, గాఙ్గం అమ్భః=గంగనీళ్ళు, క్షుభ్యతి=కలఁగుచున్నది. అన్తరిక్షం=ఆకసము, దేవర్షిభిః= దేవర్షులచేత, వ్యాప్తం = వ్యాపింపఁబడినది; ఆశ్చర్యమ్ = ఆశ్చర్యము! ఆర్యా = వదినె-సీత, గఙ్గామహీభ్యాం దేవతాభ్యాం సహ=గంగయు భూదేవియు అను దేవతలతోఁగూడ, సలిలాత్=నీటినుండి, ఉదేతి=పైకిలేచుచున్నది.

(పునర్నేపథ్యే)

శ్లో॥ అరుంధతి జగద్వంద్యే గంగాపృథ్వ్యౌ జుషస్వ నౌ,
అర్పితేయం తవాభ్యాశే సీతా పుణ్యవ్రతా వధూః. ౧౭

లక్ష్మణః—అహో ఆశ్చర్య మాశ్చర్యమ్! ఆర్య పశ్య పశ్య
ఆః! కష్ట! మద్యాపి నోచ్ఛ్వసిత్యార్యః.

(తతః ప్రవిశ త్యరుంధతీ సీతా చ)

---

ఎవరేని చిలుకుమన్నారో అనునట్లు గంగనీళ్ళు కలఁగుచున్నది. ఆకసమున (ఈ యాశ్చర్యమును - మంగళమును, చూడ) దేవర్షులు అంతట వచ్చి నిలిచి యున్నారు. గంగభూదేవులతోఁగూడ వదినె సీత నీటినుండి పైకిలేచినది.

సీత గంగాపృథ్వులతో తిరోహిత ఐనది మొదలు మరల వారింగూడి యిపు డావిర్భవించువంతవు కాలము పంద్రెండేండ్లు. నాఁడు గంగలో దూకినది మొదలు నేఁడు ఈ గాంగమథనమున లేచునంతవఱకు ఐన కాలము అది గదా. ఇందాఁక గోదావరితీరమున గంగా మహిమ తిరస్కృతయై రాముని వాసంతిని కాంచిన తరువాత మరల గంగ తనతో ఆమెను తన చోటికి కొనిపోయియుండెనని గ్రహింపఁదగును. ఈ యవాంతర నాటకమునకు రంగము వాల్మీకి తపోవనము చెంగటి భాగీరథీతీరము గదా.

శ్లో. ౧౭. అరుంధతీతి - అరుంధతి = ఓ అరుంధతీదేవీ, జగద్వంద్యే = జగాలకు పూజ్యవైనదానా, నౌ గంగాపృథ్వ్యౌ = మమ్ములను గంగను భూదేవిని, భజస్వ = చేరరావమ్మా. ఇయం=ఇదిగో, వధూః=అమ్మాయి - కోడలు, సీతా=సీత, పుణ్యవ్రతా - ఇంతకాలము పుణ్యవ్రతము లాచరించినట్టిది, తవ అభ్యాశే = నీకడ - అర్పితా=అప్పగింపఁబడినది.

ఓ అరుంధతీదేవీ, పూజ్యురాలా, మేము పృథ్వీ భాగీరథులమమ్మా. ఇదిగో అమ్మాయి, కోడలు, సీత, పుణ్యవ్రత. నీచేత అప్పనచేయుచున్నాము.

అంతట అరుంధతియు సీతయు ప్రవేశింతురు. భాగీరథియు పృథ్వియు రంగాన ప్రవేశింపరు. ఇంతసేపు ఇరువురు అప్సరసలు ఆవేషమున అంతర్నాటికలో రంగాన ఉండిరి. సీతాదిపాత్రములను అచ్చరలే పూనిరి. మరల రెండు వేసములను తయారుచేసి అసలు పృథ్వీ భాగీరథులుగా ప్రవేశపెట్టుట క్లేశావహము- అనావశ్యకమును గావున మానఁబడినది. అంతియకాక, ఇంతవఱకు రెండువేసాలలో

అరున్ధతీ—

శ్లో॥ త్వరస్వ వత్సే వైదేహి, ముఞ్చ శాలీనశీలతామ్,
ఏహి జీవయ మే వత్సం ప్రియ స్పర్శేన పాణినా. ౧౮

సీతా—(ససమ్భ్రమం స్పృశన్తీ) సమాససిదు అజ్జఉత్తో. (సమాశ్వసి త్వార్యపుత్రః.)

రామః—(సమాశ్వస్య సానన్దం) భోః కిమేతత్! (దృష్ట్వా సహర్షాద్భుతం) కథం! సలజ్జా దేవీ! అమ్బా అరున్ధతీ! సర్వే ఋశ్యశృఙ్గ శాన్తాసమేతాః అస్మద్గురవః!

---

గంగాపృథ్వులు రంగాన నుండిరి. అంతకన్న వీరి వేఱుపాటుంజూపుట అసాధ్యము నగును. కావున వారిప్రవేశము వారించి అరుంధతి ప్రవేశము చెప్పఁబడినది. వేసాన మున్న అచ్చర సీతకాక - అసలు సీతయు - అనఁగా ప్రథమతృతీయాంకములలో కనఁబడిన సీతపాత్రము ప్రవేశమును.

శ్లో. ౧౮. త్వరస్వేతి — వత్సే=అమ్మాయీ, పట్టీ, వైదేహి=జానకీ, త్వరస్వ=తొందరవహింపుము; శాలీనశీలతాం = సిగ్గు - బెఱుకు - పడుస్వభావమును, ముఞ్చ=మానుము; ఏహి=రమ్మా, మేవత్సం=నాపట్టిని, రామభద్రుని, ప్రియస్పర్శేన పాణినా=ప్రియమైనతాఁకుడుగల (నీ) చేతిలో, ప్రియమైన నీ చేతి స్పర్శతో అనుట, జీవయ=బ్రతికింపుము.

నాపట్టీ, జానకీ, త్వరగారావే, సిగ్గుపడకే; రా, రావే, నా పట్టిని రామచంద్రుని ఇంపైన నీ చేతి తాఁకుడుచేత బ్రతికింపవమ్మా.

సీత యీ ప్రవేశము చాల నిపుణముగా సమకూర్పఁబడినది, మూర్ఛిత రాముని సంజీవనము చేయుచు. మూఁడవయంకమున, అనఁగా కొన్ని గడియలకు ముందే ఇట్లే తిరస్కరిణీతిరస్కృత సీత పలుమాఱు మూర్ఛిల్లిన రాముని మూర్ఛ తేర్చినది—తాను సాంతముగాను, తనుసమాటచేతను, అప్పుడు తిరస్కరిణిచేత అంతగా శాలీనత - బిడియము - వహింపలేదు. ఇప్పుడు ఎట్టయెదుట అగపడును - అందును విశేషముగా వివాసనమువలన కలిగిన ఈ పన్నెండేండ్ల యెడబాటు, తీఱిన తర్వాత - ఎక్కువ శాలీనత కలిగియున్నది సీత. సమయము అట్టిదిగా నున్నందున, అరుంధతి దానిని మాని రాముని బ్రతికింపు మనుచున్నది. సీతయు సంభ్రమము గొని తాఁకుటయ కాక, మాటయు పలుకు చున్నది- సమాశ్వసితు ఆర్యపుత్రః - అని. సర్వే చ ప్రహృష్యత్ ఋశ్యశృఙ్గ శాన్తా సమేతాః గురవః - సంతసించుచున్న ఋశ్యశృంగబావ, శాంతక్క, వారితో

అరున్ధతీ—వత్స ఏషా భగవతీ భగీరథ గృహదేవతా సుప్రసన్నా గఙ్గా.

(నేపథ్యే)

జగత్పతే రామభద్ర స్మర్యతా మాలేఖ్యదర్శనే మాం ప్రత్యాత్మనో వచనం, సా త్వ మమ్బ. స్నుషాయా మరున్ధతీవ సీతాయాం శివానుధ్యానపరా భవేతి. తదనృణాస్మి.

అరున్ధతీ—ఇయం తే శ్వశ్రూ ర్భగవతీ వసున్ధరా.

(పున ర్నేపథ్యే)

ఉక్తం చ పూర్వ మాయుష్మతా వత్సాయాః పరిత్యాగే, యథా-భగవతి వసున్ధరే శ్లాఘ్యాం దుహితర మవేక్షస్వ జానకీమితి, తదధునా కృతవచనాస్మి ప్రభో ర్వత్సస్య.

రామః—కథమ్! కృతమహాపరాధోఽపి భగవతీభ్యాం అనుకమ్పితః!

(ఇతి ప్రణమతి)

---

పెద్దలందఱును - అమ్మలు, నాయన జనకుఁడు, వసిష్ఠమహర్షి మొదలగువారు - ఐనను వీరి కెవరికిని రంగముమీఁదికి ప్రవేశము లేదు. అరుంధతీ సీతారాములుమాత్రమే యున్నారు రంగమున, ప్రేక్షకులకు అగపడుచు, తక్కినవారు నేపథ్యమున మఱుఁగి వారికిమాత్రము అగపడుచున్నట్లు. అన్ని వేషములం దాల్చు క్లేశమును ప్రయోక్తలకు మాన్పుట. ప్రేక్షకులకు వారి యగపాటు నిజముగా అంత యావశ్యకముగాదు. ఏషా భగీరథ గృహదేవతా......ఇయం శ్వశ్రూః - వారికోరికను రాముఁడు కాదనఁజాలఁడు. తత్ర అనృణా అస్మి = అందులకు నేను ఋణమును తీర్చుకొంటిని. శ్వశ్రూః=అత్తగారు. తదధునా కృతవచనా అస్మి ప్రభోః వత్సస్య=కావున ఇపుడు ప్రభువైన బాలుని యీ మాటను జరిపినదాననైతిని. నీవు నాకు ప్రభువవైనందున నీ యాజ్ఞను పాటించితిని అనుట. కథం=ఎట్లు! అనుకమ్పితః = కనికరింపఁబడితిని. మమ అరున్ధత్యాః = నాకు అరుంధతికి - అని తాను తనపేరు చెప్పుకొనుట - తాను వారికి మిక్కిలి పరిచిత, పూజ్య, చక్కఁగా చెప్పఁగలయట్టిది వారు వినవలసిన మాటలది యగుటం బట్టి, సబ్రహ్మకైః= బ్రహ్మతో కూడుకొన్నవారు - బ్రహ్మ మొదలు

అరున్ధతీ—భోభోః పౌరజానపదాః, ఇయ మధునా వసున్ధరా జాహ్నవీభ్యా మేవం ప్రశస్యమానా మ మారుంధత్యాః సమర్పితా. పూర్వంచ భగవతా వైశ్వానరేణ నిర్ణీతపుణ్య చారిత్రా, సబ్రహ్మకైశ్చ దేవైస్సంస్తుతా, సవితృకుల వధూ ర్దేవయజన సమ్భవా జానకీ, పరిగృహ్యతా, ఇతి. కథం భవన్తో మన్యన్తే?

లక్ష్మణః—ఏవ మమ్బయాఽరున్ధత్యా నిర్భర్త్సితాః ప్రజాః కృత్స్నశ్చ భూతగ్రామ ఆర్యాం సమస్కుర్వన్తి, లోకపాలా స్సప్తర్షయ శ్చ పుష్పవృష్టిభి రుపతిష్ఠన్తే.

అరున్ధతి—జగత్పతే రామభద్ర!

శ్లో॥ నియోజయ యథాధర్మం ప్రియాం త్వం ధర్మచారిణీం,
హిరణ్మయ్యాః ప్రతికృతేః పుణ్యాం ప్రకృతి మధ్వరే. ౧౯

---

అందఱు దేవతలును - అనుట. ఆ పౌరజానపదులు బదులు పలుకలేనియట్లు నమ్మితీఱవలసినట్లు సీతాపరిశుద్ధితారాకాణలు మహిమలు అన్నియు ఒక్కట్రుక్కన చెప్పుచున్నది. ఆర్యాం సమస్కుర్వన్తి - నమస్కారముచేత తమ యంగీకారమును సీతకైన తమ పూజను తెలుపుకొనుచున్నారు. సీతకై అరుంధతి మాట్లాడుట. ఆమెమాటకు ఎవరును ఎదురాడలేరు. అందును విశేషముగా పాతివ్రత్య విషయమున. ఈ సంవిధానము అత్యంత శ్లాఘ్యము.

శ్లో. ౧౯. నియోజయేతి—త్వం = నీవు, యథాధర్మం = ధర్మముబడి, ప్రియాం = ప్రేయసిని, ధర్మచారిణీం = సహధర్మచారిణిని - నీకు దేవపితృపూజ అందును, యజ్ఞాదిసర్వధర్మములందును తోడుగానుండుదానిని, హిరణ్మయ్యాః = బంగరుతో చేయఁబడిన, ప్రతికృతేః = బొమ్మకు, పుణ్యప్రకృతిం = పవిత్రమగు ప్రకృతిని - మూలమైనదానిని - ఇదిగో ఈ సీతను - అనుట, అధ్వరే=(అశ్వమేధ) యాగమునందు, నియోజయ=నియోగింపుము - పనిగొనుము.

నీ ప్రేయసిని సహధర్మచారిణిని, బంగరుబొమ్మకు మూలమయిన పుణ్యురాలిని ఈ సీతను యాగమునందు నీకుతోడుగా ఏర్పఱుచుకొనవయ్య.

సీతా—(స్వగతమ్) జాణాది అయ్యవుత్తో సీదా దుఃఖం పమ జ్జిదుమ్. [జానా త్యార్యపుత్ర స్సీతాదుఃఖం ప్రమార్ష్టుమ్.]

రామః—యథా భగవ త్యాదిశతి.

లక్ష్మణః—కృతార్థోఽస్మి.

సీతా—పచ్చుజ్జీవి దమ్హి [ప్రత్యుజ్జీవి తాస్మి.]

లక్ష్మణః—ఆర్యే ఏష నిర్లజ్జో లక్ష్మణ శ్శిరసా ప్రణమతి.

సీతా—వచ్ఛ, ఏరిసో చిరం జీవ. [వత్స. ఈదృశః చిరం జీవ.]

అరున్ధతీ—భగవ న్వాల్మీకే, ఉపనీయేతాం ఇమౌ సీతాగర్భ సమ్భవౌ రామభద్రస్య పుత్రకౌ కుశలవౌ. (ఇతి నిష్క్రాన్తా.)

---

జానాతి ఆర్యపుత్రః సీతా దుఃఖం ప్రమార్ష్టుం - ఎఱుంగును ఆర్యపుత్రుఁడు సీత దుఃఖమును తుడిచివేయుటకు - దీనిచేత సీత ఈ పునఃసంయోగమునకు ఎదురు చూచుచున్నదని తెలియుచున్నది. సీతా ప్రతికృతినే యజ్ఞమునకు చేయించుకొన్న వాఁడు తప్పక సీతను గ్రహించును, సందియములేదు. మూఁడవ యంకమున నిజ మెఱిఁగి, తనకైన రామునిదుఃఖముం గన్నది మొదలు తాను పునఃసంయోగమునకు ఏమి యుపాయ మగునా అని ఉవ్విళు లూరుచునే యున్నది. 'అవని రమరసిన్ధుః సార్ధ మస్మద్విధాభిః' - అను తమసయాశీర్వాదమును గ్రహించి యున్నది. వత్స - కొడుకా, అబ్బాయీ - ఇది లక్ష్మణుని సీత సంబోధించు తెఱంగు - అట్టిది వదినె మఱఁదుల సముదాచారము. ఉపనీయేతాం - (తల్లిదండ్రులతో) కూర్పఁబడుదురు గాక. అంకారంభమున కుశలవులకు చంద్రకేతువుతో సమానమగు స్థానమర్యాదను పొందింపు మని రాముఁడు చెప్పెనే కాని, వారు అట్లప్పుడు వచ్చి కూర్చుండినమాట చెప్పలేదు. వారు అంతట వాల్మీకి కడకు పోయి ఆయన తోడనే యున్నారు, సమయాన ఇట్లు తల్లిదండ్రులతో ఆయనచే యథావిధిగ కలుపఁబడుటకు. స్తన్య త్యాగమున తనకు ఎడముచేయఁబడినవారు, ఇన్నియేండ్లకు ఇంచుమించుగా 9 యేండ్లకు ఇట్లయి సీతతో కూర్పఁబడుచున్నారు. దిష్ట్యా తథా ఏవ ఏతత్ - సంతోషము! అట్లే ఇది - అనఁగా 'ఏతౌ హి జన్మసిద్ధాస్త్రౌ' ఇత్యాదిగా అన్న దమ్ములు రామలక్ష్మణులు ఊహించియుండిరిగదా. దానినే చెప్పుచున్నారు - ఇపుడు.

రామలక్ష్మణౌ—దిష్ట్యా తథైవై తత్.

సీతా—(సబాష్పాకూతమ్) కహిం మే పుత్తఆ. [క్వ తే మే పుత్రకాః?]

(తతః ప్రవిశతి వాల్మీకిః కుశలవౌ చ.)

వాల్మీకిః—వత్సౌ కుశలవౌ, ఏష వాం రఘుపతిః పితా, ఏష లక్ష్మణః కనిష్ఠపితా, ఏషా సీతా జననీ, ఏష రాజర్షి ర్జనకో మాతామహః.

సీతా—(సహర్షకరుణాద్భుతం విలోక్య) కహం తాదో! [కథం! తాతః!]

కుశలవౌ—హా తాత! హా అమ్బ! హా మాతామహ!

రామః—(సహర్ష మాలిఙ్గ్య) నను వత్సౌ పుణ్యైః ప్రాప్తౌ స్థః.

సీతా—ఏహి జాద కుస, ఏహి జాద లవ, చిరస్స పరిస్సజహ జమ్మంతరగఅం జణణిం. [ఏహి జాత కుశ, ఏహి జాత లవ. చిరస్య పరిష్వజేథామ్ జన్మాన్తరగతాం జననీమ్.]

కుశలవౌ—(తథా కృత్వా,) ధన్యౌ స్వః.

సీతా—భఅవం పణమామి. [భగవన్, ప్రణమామి]

వాల్మీకిః—వత్సే, ఏవ మేవ చిరం భూయాః.

---

ఏష రాజర్షిః జనకః మాతామహః—ఈయన రాజర్షి జనకుఁడు తాత (=అమ్మకు నాయన.) జనకుఁడు రంగాన ప్రవిష్టుఁడుకాఁడు. నేపథ్యస్థితుఁడే తక్కినవారివలె. 'తాత' అను ప్రాధాన్యముంబట్టి ఇట ఇట్లు నిర్దిష్టుఁడు. ఆయనను పిలిచి పలికినభాషితమును ఆయన జవాబును ఇట లేవు. కథం తాతః—ఏమి నాయనయా! నాయన సాన్నిధ్యము ఆమెకు చిత్తాన సంతోషము దుఃఖము ఆశ్చర్యము ఒక్కుమ్మడి కలిగించి కరఁగించినవి. పుణ్యైన ప్రాప్తౌ స్థః—పుణ్యాన దొరకితిరి. సందేహము తీఱినది రామునకు. వారు తన బిడ్డలే. ఏహి జాత కుశ ఇత్యాది—రా పట్టీ కుశా—తొలుత తన నాయనం జూచినది. తరువాత తన కొడుకులం గాంచుచున్నది.

సీతా—అమ్మహే, తాదో కులగురూ అజ్జాఅణో సభత్తిఅ అజ్జా సంతాదేఈ సలక్ఖణా సుప్పసణ్ణా అజ్జవుత్తచలణా కుసలవా వి సమం దీసంది. తాణిబ్భరమ్హి అణందేణ. [హన్త! తాతః కులగురురార్యాజన స్సభర్తృకా ఆర్యా శాన్తాదేవీ సలక్ష్మణా స్సుప్రసన్నా ఆర్యపుత్ర చరణాః, కుశలవావపి సమం దృశ్యన్తే. తన్నిర్భరాస్స్యానన్దేన.] (నేపథ్యే కలకలః)

వాల్మీకిః—(ఉత్థాయావలోక్య చ) ఉత్ఖాతలవణో మధురేశ్వరః ప్రాప్తః!

లక్ష్మణః—సానుషఙ్గాణి కల్యాణాని.

రామః—సర్వ మిద మనుభవ న్నపి న ప్రత్యేమి,-యద్వా ప్రకృతి రియ మభ్యుదయానాం.

---

ఆర్యపుత్త్రచరణాః- ఆర్యపుత్త్రులవారు - అనుట. లోకరంజనధర్మమునకై తన నిందను అడుగంటతుడిచివేయువాఁడై తనకు చెప్పి నొప్పింపక, తనకోసము అన్నియేండ్లు అంత ఏడ్చి తనకు మహోపకారము చేసి కన్న వానికి పూజ.

ఉత్ఖాతలవణః మధురేశ్వరః ప్రాప్తః - లవణాసురుని ఉన్మూలించినవాఁడు మధురలో రామరాజ్యమును, అనఁగా తనరాజ్యమును నెలకొల్పి ఏలుచున్నవాఁడు, శత్రుఘ్నుఁడును వచ్చినాఁడు - 'మధురానాథుఁడు' - అనుటలో అతఁడు 12 యేండ్లు మధురను దిద్ది తీర్చి పాలన నెలకొల్పుట సూచితము. ఇతఁడును నేపథ్యస్థితుఁడే. అయినను లవణోన్మూలనమునకు మునుల కుయి విని తొలియంకమున పంపఁబడినవాఁడు, అట్లు ఈ వస్తువునం బ్రస్తావితుఁడు. సరియైన నిగమనమును - కథముగింపును - పొందవలదా - అందులకు. అట్లే రామాయణమునను - ఉత్తరకాండ— 72 సర్గ -

'యథాజ్ఞప్తం మహారాజ, సర్వం తత్ కృతవా నహం।
హతః స లవణః పాపః పురీ చాస్య నివేశితా । 10

'ద్వాదశైతే గతా వర్షా స్త్వాంవినా రఘునన్దన।
నోత్సహేయ మహం వస్తుం త్వయా విరహితో నృప॥' 11

సానుషఙ్గాణి కల్యాణాని - కల్యాణములు సానుబంధములు, ఒకదానివెంట నొకటి కలుగుచుండునవి. మాలతిలోను కలదు ఈ సూక్తి.

ప్రకృతిః ఇయం అభ్యుదయానాం - ఇది అభ్యుదయముల స్వభావము. నమ్మరానంత గొప్పభాగ్యము! అతఃపరం అపి ప్రియం అస్తికి = ఇంతకన్నను ప్రియంబొకటి యుండునా?

వాల్మీకిః——రామభద్ర, కిం తే భూయః ప్రియ ముపహరామి?

రామః——కి మితః పర మపి ప్రియ మస్తి? తథా పీద మస్తు.

శ్లో॥ పాప్మభ్యశ్చ పునాతు, వర్ధయతు చ శ్రేయాంసి సేయం కథా,
మఙ్గల్యా చ మనోహరా చ జగతా మ్మాతేవ గఙ్గేవ చ,
తా మేతాం పరిభావయ న్త్వభినయై ర్విన్య స్తరూపాం బుధా
శ్శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీ మిమామ్. ౨౦
(నిష్క్రాన్తా స్సర్వే)

ఇతి సమ్మేళనంనామ.

సప్తమాఙ్కః

---

శ్లో. ౨౦. పాప్మభ్య ఇతి——సా ఇయంకథా - ఆయీకథ - ఉత్తరరామచరిత, (వాల్మీకి రచించి ఆడించినది; భవభూతి రచించినదియు అనుట) జగతాం మాతా ఇవ=జగములకు తల్లియయిన లక్ష్మివలెను. గఙ్గా ఇవ చ=గంగాదేవివలెను, మాఙ్గల్యాచ = శుభము లొసంగునదియు, మనోహరాచ = మిక్కిలి అందమైనదియునై, పాప్మభ్యః చ=పాపములవలన, పునాతు=పవిత్రము చేయును గాక, శ్రేయాంసి వర్ధయతు చ=శ్రేయములను పెంపొందించునుగాక. తాం ఏతాం = అట్టి దీనిని ఈ ఉత్తరరామచరితను, శబ్దబ్రహ్మవిదః = శబ్దరూపమైన బ్రహ్మను సాక్షాత్కరించుకొన్న వాఁడును - అనఁగా 'ప్రబుద్ధోఽసి వాగాత్మని బ్రహ్మణి' అని బ్రహ్మచే అభినందింపఁబడినందున అని వాల్మీకి పరముగా. 'యంబ్రహ్మాణ మియందేవీ వాగ్వశ్యే వానువర్తతే' అని పలికినందున భవభూతి పరముగాను. వాక్కునకు సాక్షాత్ బ్రహ్మంబోనివాఁడును. పరిణత ప్రజ్ఞస్య=పండిన జ్ఞానము గలవాఁడును అగు (ఇది వాల్మీకికి భవభూతికి సమానము) కవేః - (ఆద్యః కవిరసి అని బ్రహ్మవలన బిరుదు పొందినవాఁడు వాల్మీకి. నాటకమును, రచించి చేయితిరిగినవాఁడు భవభూతి - కావున మహా) కవియొక్క, ఇమాంవాణీం = ఈ సరస్వతిని - రచితనాటకమును, అంతర్నాటకమును, అసలు నాటకమును, బుధాః = పండితులు, అభినయైః విన్యస్తరూపాం=(తగిన) అభినయములచే రూపొందింపఁబడిన దానినిగా - రంగావప్రయోగింపఁబడిన దానిని గా, పరిభావయన్తు=చింతింతురుగాక.

అట్టి యీకథ సాక్షాన్మహాలక్ష్మివలెను గంగాదేవివలెను - జగత్కల్యాణమును మనస్సునకు శాంతమును ఐసఁడి, పాపములను తొలఁగించి శ్రేయములం గూర్చునుగాక. ఇది శబ్దబ్రహ్మమును సాక్షాత్కరించుకొని సాక్షాత్తుగా బ్రహ్మ

కంటివాఁడును, పండితజ్ఞానము - నేర్పు - గలవాఁడును, అగు కవియొక్క భారతి. ఈ ఉత్తరరామచరితమును, బుధులు అభినయింపించి చూచి చిత్తగింతురుగాక.

పరిణతప్రజ్ఞస్య వాణీం - అనుటచే ఇది తాను కట్టకడపట, అన్నివిధముల చేయి తీరిన తర్వాత, మిక్కిలి నేర్పుతో రచించినది - అని తన యాత్మవిశ్వాసమును బ్రకటించుకొనుచున్నాఁడు. 'పాప్మభ్యః' మొదలైన దానిచేతను, 'జగతాం మాతేవ గఙ్గేవ చ' అనుట చేతను దీనిని కడుభక్తితో లక్ష్మీనారాయణులే యైన సీతారాముల పవిత్రచరిత్రగా - వారిని మిన్నందినంతటి గొప్పవారింగా కడవెళ్ళ తాను నిర్వహించుచు రచించితినని భక్తితో వినయమును వినయముతో భక్తిని సూచించుచున్నాఁడు. 'అభినయైః విన్యస్తరూపాం' అనుటచే దీనిప్రయోగము జూడ తాను ఉవ్విళులూరినాఁడనియు, అట్లు పలుమాఱు చూచినాఁడనియు, నోచుకొన్న పండితులు అట్లు మాటిమాటికి ఆడించి చూతురుగాక అనియు - కవి యాశంస. 'బుధా'- బుధులే ఈ సత్కృతిని ఆడించిచూడ నధికారులనియు, ఇతరులు కారనియు. అట్లే మురారి 'న శబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ చ జనః కవీనాం గమ్భీరే వచసి గుణదోషా రచయతు'-' అన్నాడు. నిజనాటక ప్రయోగమందును, ఆ భరతులందును తనకుగల ప్రీతిని కవి, మాలతిలో చెప్పికొన్నాఁడు - 'నిసర్గ సౌహృదేన భరతేషు వర్తమానః స్వకృతిం అస్మాకం హస్తే అర్పితవాన్' అని.

అట్లే వాల్మీకియందును ఆయన రచించిన రఘుపతిపావన చరితమందును తనకు అత్యంత భక్తియు ఆనందమును గలవని వీరచరిత ప్రస్తావనలో మహాకవి చెప్పుకొన్నాఁడు - ప్రస్తా - 7.

ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం
యత్పావనం రఘుపతేః ప్రణినాయ వృత్తం,
భక్తస్య తత్ర సమరంస్త మమాపి వాణీ
తాం సుప్రసన్నమనసః కృతినో భజన్తామ్.

'శబ్దబ్రహ్మవిదః' - 'యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యేవానువర్తతే' అని యిందును, 'వశ్యవాచః కవేర్వాక్యం' అని వీరచరితయందును చెప్పుకొన్న దానిని జ్ఞాపకముసేయుచున్నాఁడు.

వీరచరితమందును.........భవభూతిర్నామకవిః మిత్రధేయ మస్మాకం అన్నాఁడు సూత్రి.

ఇది భరతవాక్యము, రాముఁడు గాదు, రామవేషము దాల్చిన భరతుఁడు అనఁగా నటుఁడు పలుకునది, మంగళాశంసావాక్యము - నాటకావసానమున ఉండఁదగునని ఆచార్యులు అనుశాసించినది. 'వాల్మీకేః' అనుపాఠము మందము, ఎదురుగా వాల్మీకి ఉన్నందున నామగ్రహణము న్యాయము గాదు - 'తామేతాం' అనుటయే సాధువు.



# అకారాది శ్లోకసూచి




VEDAM PRINTERS, MADRAS-1.

కాకులరిస్తేనే ఓయబ్బో చికాకు
పడితె అది మరియాదా? కాకులు
మన లోపాలను చాటే బాకాలని
అనుకోరాదా.